శ్రీ

# సారంగధర చరిత్రము

## చేమకూర వేంకటరాజ ప్రణీతము

'జితకాశి' టీకా సహితము

29740



టీకాకర్త:

విద్వాన్ దీపాల పిచ్చయ్యశాస్త్రి

వి. ఆర్. సి. హైస్కూలు ప్రధానాంధ్రపండితుడు,

నెల్లూరు.

తెనాలి భారతీముద్రణాలయమున ముద్రితము

1942

సర్వస్వామ్యసంకలితము]

[వెల రు 2-8-0

కీ॥ శే॥ G. C. V. రమణరావు,
జ్ఞాపకార్థము...
G. సరోజినీ...
అంకితము (...)

# పండితాభిప్రాయములు

కళాప్రపూర్ణ మహాకవి శతావధాని

శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు

బెజవాడ, 20—11—42.

శ్రీమత్పరదేవతాయై నమః

## సారంగధర చరిత్రము

(సవ్యాఖ్యానము)

ఈ ప్రబంధమునకుఁ గొన్ని వ్యాఖ్యానములు కలవు గాని వానిలో నింతకుమున్న ప్రకటితమైనది కీ. శే. వేదము వెంకటరాయలవారి వ్యాఖ్యానమే. ఆవ్యాఖ్యానము పూర్వవ్యాఖ్యానములయందుండెడి చాల వ్యత్యాసములను కనిపెట్టి శ్రీశాస్త్రులవారు విరచించిరి. దానిని దిలకించి అందులోనున్న ప్రమాదములను (ప్రమాదో ధీమతామపి, అపి రేవకారార్థకః) దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు తొలఁగించుచు నొక విపులమైన వ్యాఖ్యానమును 'జితకాశి' యనుపేరితో రచించి విద్వల్లోకమునకు మహోపకారమొనర్చి రనుటకు సందియములేదు. నేను ప్రత్యక్షరమును నా యీ వ్యాఖ్యానములోఁ జాలభాగము చదివిచూచితిని. వ్యాఖ్యాత కనుపఱచిన గుణదోషములన్నియు సమంజసములేయని తోఁచినది. వ్యాఖ్యాతను నేనక్కడక్కడ ప్రశ్నించి చూచితిని; చక్కని యుపపత్తులు చూపి నాకు సంతృప్తిని గలిగించెను. ఈయన మాకు (తి. వెం. కవులకు) ఏకలవ్య శిష్యుఁడు. ఈయన కింతపాండితి కలదని నే నిప్పుడు గుఱుతింపఁగల్గితిని. "పూర్వ వ్యాఖ్యాత లెంతటి పాండిత్యము కలవారు ? నేఁటి యీ వ్యాఖ్యాత పాండిత్య మెంతటిది ? యని విచారించునెడల స్థూలదృష్టిని వారెక్కడ ? వీరెక్కడ ? యని తోఁచునుగాని వ్యాఖ్యాన రచనల యందలి విశేషములను విమర్శకతాదృష్టితోఁ బరిశీలించినచోఁ బ్రకృతవ్యాఖ్యాత కగ్రస్థాన మిచ్చుట తప్పదని నాకుఁదోఁచినది." ఈయన మా (తి. వెం. కవుల) యొద్ద నే లేశమును జదువకున్నను మాశిష్యుఁడనని చెప్పెడి కొందఱిలో వాఁడగుటంజేసి నే నీయనంగూర్చి యేమి (యథార్థమే అయినను) వ్రాసినను అయ్యది శిష్యవాత్సల్య ప్రయుక్తమైన వ్రాఁతగా స్థూలదృష్టులు త్రోసివేయుదురని యెఱిఁగియు రచనబట్టి పైమాటలు వ్రాయక తప్పినదికాదు. ఆ యీ సారంగధర చరిత్రమును పలువురు విద్వాంసులును కవులును చదివియే యుందురు. విశేషములను గ్రహించియే యుం

దుర గాని యింత శ్రద్ధతోఁ బట్టుదలతో, జదివినవారు లేరనియే నేననుకొంటిని. ఈయన కింతటి శ్రద్ధాభక్తులు గలుగుటకుఁ గారణ మీయనయే పీఠికలో వక్కాణించి యుంటచే నే నిందు మరల నావిషయమును చర్విత చర్వణ మొనర్పనైతిని.

"ఆపాతాళ నిమగ్న పీవర తను ర్జానాతి మంథాచలః"

అన్న శ్లోకపాద మీయనయందు సమన్వితమగుచున్నది. లోఁగడ రచించిన వ్యాఖ్యాత లీయన చూపినశ్రద్ధలో నెన్నవవంతు శ్రద్ధనుగైకొని వ్యాఖ్యానించినను ప్రకృత వ్యాఖ్యాతకు పని కల్పించువారు కారనియే నేను విశ్వసింతును.

శ్లో. ఆస్థా స్వాస్థ్యే యది స్యాతాం - మేధయా కిం ప్రయోజనమ్,
తే ఉభే యది న స్యాతాం - మేధయా కిం ప్రయోజనమ్.

ఈయన వ్యాఖ్యానించుఁగాక; యీ మహోత్సాహదినములలో నియ్యది ప్రకటిత మగుటెట్లు? ఆ లోపము నెవరు పూరించిరో వారింగూర్చి వ్యాఖ్యాతయే కొన్ని పద్యములలో వ్యాఖ్యానించెను. ఆ సంజీవిసెట్టిగారు ప్రకృతప్రవృత్తికి సంజీవియే యయ్యె ననుటకు సందియములేదు. ఈ యుభయులను భగవంతుఁడు సర్వవిధములఁ గృతార్థుల నొనర్చుఁగాక యని యాశీర్వదింతును.

---

అభినవ వాగనుశాసన

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు,
ధవళేశ్వరము, 5—12—1942.

సారంగధర చరిత్ర సాదరముగాఁ జదివితిని. విద్వల్లోకమున గణుతికెక్కిన యర్వాచీనసరసప్రబంధములలోనిదైన " యీ కృతి, లేఖన ముద్రణదోషమునఁ గ్రమముగా నపాఠములు తోఁచెడి యపపాఠములకు లోనగుట కనిపెట్టి, పెక్కు వ్రాఁతప్రతులు పరిశోధించియు, బహుగ్రంథములు పరిశీలించియుఁ గవివాక్కునఁ బుట్టినట్లు చక్కఁగాఁ బరిష్కరించి కవిహృదయము తెల్లమగునట్టి టీక రచియించిన శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి సారస్వతసేవ యెంతయు శ్లాఘ్యము."

'చేమకూర పాకానఁ బడ్డ' దన్న ప్రశంసావచనము విజయవిలాసమునకుఁ జెందినదైయైనను, అది సారంగధర చరిత్రకుఁగూడ సమన్వయించునట్లుగా శ్రద్ధాభక్తులతో విశేషపరిశ్రమచేసి కావించిన యీ పరిష్కృత ముద్రణమునుబట్టి శ్రీ శాస్త్రిగా రాంధ్రుల ప్రశంసకుఁ బాత్రులగుచున్నారు.

---

శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారు,
సభాపతి, సాహితీసమితి, తెనాలి.

శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు,
మంత్రి : సాహితీసమితి.
(Ex-Principal, Sanskrit College, Tenali.)
డిసెంబరు 21, 1942.

శాస్త్రిగారూ! అభిప్రాయార్థము మీరు పంపిన సారంగధరచరిత్ర ప్రతులు అందినవి. సంస్కరించి 'జితకాశి' టీకాసమేతముగా మీరు వెలువరించిన ఈ గ్రంథము సావధానముగా పరిశీలించాము. గ్రంథాదిని 82 పుటల పీఠికలో మీ బహుగ్రంథావలోకనము, సమీక్షా సామర్థ్యము ప్రస్ఫుటముగా కనబడుతున్నవి. దుర్వ్యాఖ్యా విషమూర్ఛితమైన కావ్యాన్ని మీరు సంజీవిని పోసి ఉజ్జీవింపచేసినందుకు కృతికర్త చేమకూర వేంకటకవి సజీవుడైతే మీ చరణాభివందనము చేసేవాడే!

అచ్చుపడిన ప్రాచీనాంధ్రగ్రంథాలమీద తమకు నమ్మకములేదనేవారు మా మిత్రులు శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రీగారు: 'లేఖకప్రమాద జనితదోషములు లేకుండా పండితుల సాహాయ్యముచేత పరిష్కరించి ముద్రించినదని ఒక్కొక్క గ్రంథముఖపత్రముమీద ఉంటుంది. ఆ పండితులెవరో, వారి సాయమేమిటో తెలియదు. కొన్నిటిమీద పరిష్కర్తలపేర్లు ఉంటవి. కాని సంస్కరణము సమీచీనము కాదు. కొందరు టీకాకారులూ, వ్యాఖ్యాతలూ గుర్తెరుగలేక అపపాఠాలనే ఆధారము చేసుకుని చెప్పిన అర్థాలవల్ల కవిహృదయము గ్రాహ్యము కావడములేదు. ఇంకో అన్యాయము : చిన్నయసూరి వ్యాకరణమే మానదండముగా గ్రహించి పండితులనేకులు పాఠములు దిద్ది పాడుచేసినారు'. ఈఅభిప్రాయములు యథార్థములే.

నికరమైన ఆంధ్రులుకాని విద్వాంసులు కొందరు తేటతెలుగునూ, జాతీయమునూ సరిగా గ్రహించలేక అపార్థాలు చెప్పినారు. యత్కించిత్సంస్కారులూ, విద్యార్థులూ, సామాన్యజనులూ, ఆ విద్వాంసుల మార్గమే విశ్వాసముచేత అనుసరిస్తున్నారు. అందువల్ల భాషకూ, సాహిత్యానికీ చాలా అనర్థము కలుగుతున్నది.

భ్రమప్రమాదాలకు లోనైన టీకతో శ్రీ వేదము వెంకటరాయశాస్త్రిగారు ప్రకటించిన సారంగధర చరిత్ర మూలమును మీరు చక్కగా సంస్కరించి టీకవ్రాసి సాహిత్యలోకానికి ఉపకారము చేసినారు. మీ విమర్శవిధానము మిక్కిలి సమంజసమూ, సప్రమాణమూ. కవిహృదయమును చక్కగా విశదముచేసిన మీ సారంగధర పాఠము ఇకముందు, ప్రమాణమై పండితులకు ప్రమోదదాయక మవుతుందని మా ఆశయము. ఇతి శివమ్.

---

## కావ్యస్మృతి తీర్థ కళాప్రపూర్ణ శ్రీజనమంచి శేషాద్రిశర్మగారు (కడప)

### సారంగధర చరిత్రము - చేమకూర వేంకటకవి వర విరచితము
### జితకాశి నామక వ్యాఖ్యాసహితము

మున్ను బ్ర. శ్రీ మహోపాధ్యాయ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రిగారు లఘుటీక వ్రాసిరని వినియుంటిని. కాని దానిం జూడలేదు. అంతటి యవసరము నాకుఁ గలుగలేదు. 'ఇంటిపేరు నస కవిత్వము పస' అని మహాకవులచే వినుతిఁ గాంచిన వేంకటకవి రచించిన యీ గ్రంథమునకు బ్ర. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు విపులవ్యాఖ్య వ్రాసిరి. ఇంతటి వ్యాఖ్య యవసరమా యని యోజించి స్థాలీపులాకన్యాయము ననుసరించి యందందుఁ జదివితిని. పాఠభేదములం దిలకించితిని. వ్యాఖ్యాత ఆశయ మిదమిత్థమని యూహింపఁ గల్గితిని. వీరుచూపిన కొన్ని పూర్వపాఠములు కేవల ప్రమాదములే యనక తప్పినదికాదు. పాఠముల నెమక వీరొనరించిన పరిశ్రమము సంస్తుత్య మనక మాననయితిగాదు. వీరు చూపిన స్ఖాలిత్యము లసూయాకల్పితము లన వలనుపడునవికావు. దీనింబట్టి చూడఁగా నింతకుఁ బూర్వ మీ గ్రంథము బహుళదోష భూయిష్ఠముగాఁ బెక్కండ్రచే ముద్రింపఁ బడినదని స్పష్టము. ఇపుడిది తఱుచుగా నిరుపమమనియే నొక్కి చెప్పవచ్చును. అనేక గ్రంథములం బరిశోధించి పెక్కు తావుల కరిగి పాఠముల సేకరించి చక్కని యర్థమును సప్రమాణముగా సమకూర్చి చరితార్థు లైరని మూఁటికి ముమ్మాటికి నిరాఘాటముగాఁ జెప్పవచ్చును. వీరి యీ కృషి ఆంధ్ర త్రిలింగదేశములయందు వ్యాపించి శాశ్వత యశఃప్రమోదముల నొసంగుఁ గాక యని కోరుచున్నాను. ఇంకను ఇట్టి యుత్కృష్ట కార్యముల నొనరింప భగవంతుఁ డాయురారోగ్యములఁ బ్రసాదించుఁ గాక.

---

## కల్లికోట కాలేజి పండితులు, బహుగ్రంథనిర్మాతలు :

శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు,

బరంపురము - చిత్రభాను మార్గశీర్ష కృష్ణ ద్వితీయ.

ఆర్యా,

తాము ఎంతో దయతో పంపిన జితకాశిని - సారంగధర వ్యాఖ్యను పూర్ణముగా చదివితిని. వెంటనే తమకు వ్రాసికొనలేనందుకు మన్నింప నర్థింతును. ఈ వ్యాఖ్యానరచనమున తాము లోకోత్తరమగు సాహిత్యసేవ నొనర్చినవారైతిరి. ఇందు తాము చేసిన పరిశ్రమము అసాధారణము ననితరసాధ్యము నని మనవి.

బ్రదికి యున్నంతవరకును తమమాట మాటగా చెల్లించుకొనిన పండితప్రకాండులుగాని వేదంవారు సాధారణులు కారు గదా! అట్టివారి వ్యాఖ్యను విమర్శించి సత్యమును లోకమునకు చాటచూనుకొని అందు పూర్ణముగా కృతకృత్యతను గాంచితిరి మీరు. ఇట్టి మిమ్మును మీ గ్రంథమును గురించి నా యట్టివా డేమి వ్రాయగలడు?

పూర్వటీకయును ఆ టీకా కర్తలయును భ్రమ ప్రమాదములను మీ పేర్కొన్నవానిని చూచితిని. వస్తుస్థితి యిట్టిదా! అని ఆశ్చర్య చకితుడనైతిని. బహుగ్రంథ పరిశోధన పాటవమును, పాండిత్య ప్రతిభలనే గాక సత్యముయొక్క కలరూపును మోమోటమిలేక మీ వ్యాఖ్య చాటుచున్నది. మీ యట్టి మనీషులు ఉండుటవలననే ఇంకను మానవమున 'సత్య మేవ జయతే' అను నుడికి తావు నిలిచి యున్నది. తమ రచించిన జితకాశి, మూలగ్రంథమును తద్వ్యాఖ్యానములను ఒరసి తఱచి వన్నె వెట్ట గలుగుటయే గాక సాహితీ ప్రపంచమున శాశ్వతముగా నెలకొన గలదని మనవిచేసికొనుచున్నాను.

---

## శ్రీ చింతా దీక్షితులుగారు - బి. ఏ., ఎల్. టి., (నెల్లూరు).

**1—1—43.**

తాము దయతో దయచేసిన టీకాసహిత సారంగధర చరిత్రము కృతజ్ఞతతో అందుకొన్నాను. ఉత్సాహముతో చదివినాను.

ఇంతవరకూ పండితులు బహుపట్టుదలతో కావ్యము విమర్శించేటప్పుడు కవి గోత్రాదులను గురించిన్ని, వర్ణోపవర్ణనములగురించిన్ని, కాలమును గురించిన్ని, వాసస్థానాదులగురించిన్ని, చర్చిస్తూఉండేవారు. తమకు అర్థముకానటువంటిన్ని, తప్పులని తోచినటువంటిన్ని పాఠములను దిద్దివేసేవారు.

మీరు సంపాదించిన సారంగధరచరిత్రలో అతిప్రధానమైన పాఠనిర్ణయము, అర్థనిర్ణయము, సమర్థతతో చేయబడ్డవి. అందుకై ప్రాచీన కవి ప్రయోగములు ఎన్నో సమకూర్చబడ్డవి.

పండితప్రకాండులని పేరుపడ్డ శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారి పాఠములు, అర్థములు ప్రమాదజనితములని నిరూపించడము బలవత్తరమైన ప్రమాణసంపత్తి ఉంటేనేగాని, సాధ్యముకాదు. మీరు అట్లా నిరూపించగలిగారంటే మీరు చేసిన కృషి ఎంతగొప్పదో వేరుగా చెప్పనక్కరలేదు. ఇందుకై మీ రెంతశ్రమపడి ఎన్నిగ్రంథాలు పరిశీలించారో! ఎందరు పండితులతో చర్చించారో!

ఇట్లా పాఠనిర్ణయమైన కృతులు తెలుగులో అప్పకవీయము వంటివి కొద్దిగా ఉన్నవి. పాఠనిర్ణయమైనపిమ్మట అర్థనిర్ణయము చేయబడ్డ గ్రంథములు తెలుగులో ఉన్నవేమో నాకు తెలియదు. తెలుగు గ్రంథము లీవిధముగా పరిష్కరింపబడ్డ పిమ్మట నేగదా వ్యాకరణ కోశములు నిర్దుష్టముగా రచించడానికి వీలుకలుగుతుంది. ఈవిషయమున మీరు మార్గదర్శకులైనందుకు మిమ్మెంతేనా కొనియాడవలసి ఉన్నది.

---

పీఠికాపురాస్థానపండితులు, శ్రీ సూర్యారాయాంధ్రనిఘంటు
కార్యాలయ సంపాదకులు, ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షులు,
సాహిత్యవిశారద—శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు,
కాకినాడ, 5–1–1943.

విద్వద్వరేణ్యా: మీరలు గౌరవాదరములతో నందఁ జేసిన సారంగధర చరిత్రము నానందముతోఁ జేకొని దాని పీఠికయందు మీరు బొందుపఱచిన విషయ సందేహాది దోష సందోహముల నన్నిటిని జూచితిని. కృషీవలుఁడు కేదారమున వరితోఁ గలిసియున్న గులివిమొలకలఁ గలుపు తీసి మడిని బాగుచేయు విధాన సారంగధర కావ్యంపు నడుమ నిమిడియున్న దోసఁగు కసవులఁ దొలఁగించి శుభ్రముగాఁ జేసిన మీ యోర్పు నేర్పులు ప్రశంసార్హములు.

“యుక్తి యుక్తం వచో గ్రాహ్యం బాలాదపి సుభాషితం” అను సామెతను బట్టి పిన్నవారి నుడులు యుక్తి యుక్తములుగా నున్నచోఁ బెద్దలకు గ్రాహ్యములే యగును. నిజముగా కీ. శే. వేంకటరాయశాస్త్రిగారే జీవించియున్నచో మీరెత్తి చూపిన యుక్తి యుక్తములగు తప్పులఁ గాంచి సంతసించి మిమ్మాశీర్వదించియుందు రనియే నాయూహ.

మీ వ్యాఖ్యానము నంతను సాకల్యముగఁ జదువుటకుఁ గొంతకాలము కావలసి యుండుటచే వెంటనే యాపని ముగింపఁ జాలనైతిని. విమర్శనములు వివేక సాధనములు కావలయునుగాని విరోధహేతుకములు కారాదని నామతము. మీయట్టి నిష్కళంకశేముషీభూషితులగు విమర్శకు లాంధ్రవసుంధరను విరివిగా నుందురు గావుత. ఓం తత్సత్.

---

నెల్లూరు వర్ధమాన
పుర మందిర

శ్రీయుతులు చావలి వెంకటహనుమయ్య పంతులుగారు.

Narasarowpet. 19—1—43

My dear Mr. Pichayya Sastri,

ఇప్పటికి గ్రంథము అక్కడక్కడ యథాశక్తి చూచితిని. ఇట్టి అద్వితీయ విమర్శనా గ్రంథముయొక్క విలువ పూర్తిగా గ్రహించుట పండితేతరులకు సాధ్యమైన పనికాదు. పాఠదోషములు, అర్థదోషములు, వ్యాకరణదోషములు, శబ్దదోషములు, అన్వయదోషములు, మొదలుగాగల విషయములు చర్చించుట పండితులకార్యమైనను వాటిని ప్రత్యేకముగా విభజించి ఆయాతరగతులక్రింద కనిపెట్టబడిన దోషములు ఉదహరింపబడుట సామాన్యపాఠకులకు సైతము దోషసముదాయము గుర్తించుటకు సులభమార్గము కలుగజేసినది. భాషాజ్ఞానసాహాయ్యముచే విమర్శింపదగిన విషయము లటుండనిచ్చి విమర్శన గ్రంథకర్త గ్రంథరచనకు ఎంతశ్రమతీసికొన్నది ఉదహరింపబడిన గ్రంథముల జాబితావలన సామాన్య పాఠకులుసైతము గ్రహింపగలుగుదురు.

ఈ గ్రంథరచన కేవలము నిరర్థకమనియో లేక ఈర్ష్యాభావ ప్రేరేపితమనియో వాదింప ప్రయత్నించు ప్రతివాదుల కేమాత్రము తావీయక గ్రంథోద్దేశ్యము ఎల్లరకు తెల్లమగునట్లు వ్రాయబడినదని నిష్పక్షబుద్ధితో చదువువారెల్లరు అంగీకరింపక తప్పదు. గ్రంథావశ్యకతకు సమాధానము 689 పద్యముల గ్రంథమునకు వ్రాయబడిన టీకా గ్రంథములో 895 దోషములుండుట ఒక్కటేచాలు. ఇట్టి దోషములు వెల్లడించుటలో భాషాసేవజేయ గోరువారెవరును వెనుదీయరు.

ఈ గ్రంథము పండిత శ్లాఘనీయమైన ప్రశస్త గ్రంథములలో నొక్కటయి ఆచంద్రార్కము వెలయుగాత యని ప్రార్థించుట కంటె మాబోంట్లు వ్రాయదగిన దేదియులేదు. ఈ గ్రంథమును ఉన్నత కళాశాలలందు పఠనీయ గ్రంథముగా నిర్ణయించు విద్యాధికారు లేనాటికైనను ఉండకపోరని నా దృఢనమ్మకము.

---

విద్వాన్ శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు,

(బోర్డు హైస్కూలు పండితులు, రామచంద్రపురము తూ. గో. జిల్లా.)

చిత్రభాను పౌష కృష్ణ తృతీయా భానువారము.

తాము ప్రేమపూర్వకముగా నంపిన 'జితకాశి' వ్యాఖ్య వందనములతో నందుకొంటిని. పీఠిక సమగ్రముగను, గ్రంథమును స్థాలీపులాకముగను జదివితిని.

పాఠ నిర్ణయమునందును బూర్వ వ్యాఖ్యానముల ప్రమాదములను సవరించి సోప పత్తికముగా వివరించుటయందును మీరు చేసిన పరిశ్రమ మమూల్యము; అనన్య సాధ్యము.

ఉద్దవిడి, పేర్వేరు, తామర తంపర మొదలగు ననేక శబ్దముల గుఱించి చేసిన చర్చ మీ ప్రామాణికతను, బహు గ్రంథ ద్రష్టృత్వమును వే నోళ్లఁ జాటుచున్నది.

లబ్ధప్రతిష్ఠులును, మహాపండితకవులును, విమర్శకవతంసులు నగు శ్రీ వేంకటరాయశాస్త్రిగారియెడ నాకు గురుభావము; సదావందనీయులు. ద్వేషముచేనైన నేమి ? మైత్రిచేనైననేమి ? సత్యము వెల్లడించుటలో వారెట్టి కృషిచేసిరో మీరు నట్టికృషిచేసి భాషాసేవచేసిరనియే నావిశ్వాసము. విమర్శనము అనిన నిందయని నేఁటి కాలమున దురర్థము పొలయినది. కాని తత్త్వనిర్ణయమున కిట్టివిమర్శనములు లేకున్న నెట్లు ? కావునఁ దాముపూనిన యీ కార్యమింతటితోఁ గాక యింకను నడపి యాంధ్ర భాష కమూల్యమగు నుపకారసహస్రము నొనర్పఁ గలరని నాయాశ.

---

## శ్రీ వెంకటగిరి సంస్థాన విద్వాంసులు, శతావధాని
## శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రి గారు.

వెంకటగిరి, 7—2—43.

సారంగధరచరిత్రము నవలోకించినాఁడను. సారంగధరచరిత్ర యథార్థరూప నిరూపణ విషయమున మీరు కావించిన పని భాషాతత్త్వవిదులు వేనోళ్ల శ్లాఘింపఁదగి యున్నది. మీ పరిశ్రమము విఫలము కానేరదు.

'పురాణ మిత్యేవ న సాధు సర్వం, న చాపి కావ్యం నవ మిత్యవద్యం
సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే, మూఢః పరప్రత్యయనేయబుద్ధిః'

అనికదా యభియుక్తోక్తి. మీ కృతికి సంజీవిసెట్టిగారి సాయము పూవునకుఁ దావి వంటిదని చెప్పకతప్పదు.

---

## విద్వాౕ శ్రీ కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులుగారు.
## (మునిసిపల్ హైస్కూలు పండితులు, బెజవాడ.)

మీరు శ్రమించి రచించిన టీక తిలకించినాను. పూ. టీ. పై పోటీగా వ్రాయుటఁగాఁబోలు మీ రచన సానఁదీటిన వజ్రముగా మెఱుఁగుదేరె నని చెప్పక తప్పదు.

సారంగధర రుచి పక్షములంబట్టి వృద్ధి క్షయము లొందుట వింతగాదు. వియుక్తుల కాఁక గూర్చి విబుధుల కాఁకలి దీర్చుట నిది యిప్పుడు చీఁకటిపోక, వెన్నెలరాకగా నున్నదని యెంచుచున్నాను. వెంకటరాయశాస్త్రి ముద్రితము మీఁద నింత రాద్ధాంతము చేసిన మీకు వారి కీర్తిశేషమునఁ గొండొక కీర్తి విశేషము లభించినను 'ఒక యసమర్థ రచనను లెక్కచేసి, యింతశ్రమపడిరేల' యని రాఁబోవు లోకము మిమ్మను కొనక మానదు.

ఆంధ్ర సరస్వతికి ముంగర ముత్తెముగా మీ కృషిని వెలయించిన మన సంజీవి సెట్టిగారిని చిరంజీవిగా పండిత మండలి నిండు మనమున దీవించుఁగాక.

---

## శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు,

Profficient in Oriental Learning, Telugu Pandit,
Mahaboob College, Secunderabad. 13-2-1943.

సారంగధర చేరినది. నేను కొంతకాలమునుండి యనారోగ్యముగా నున్నాను. ఇట్టి స్థితిలో మీ గ్రంథమును సమగ్రముగాఁ జూచి యభిప్రాయము నిచ్చుటకు నవకాశములేమికిఁ జింతిల్లుచున్నాను. వెనుక మనము బెడగంటిలో వివాహములోఁ గలిసినపుడు మీరు కొంత కొంత వినిపించితిరి. అపుడు నేను సర్వథా సంతుష్టుఁడ నైతిని. మీరు చేసిన కృషికి నా హృదయపూర్వకాభినందనములు.

---

## విద్యాప్రవీణ శ్రీ జమ్ములమడక మాధవ రామ శర్మ గారు,

Vice Principal, Pandit in Sahitya & Alankara; Lecturer
in History of Sanskrit Language & Literature,
Sanskrit College, Tenali.

అభినవసమితి- తెనాలి, 9—1—1943.

### సారంగధర చరిత్రము - జితకాశి.

అసలు టీక గురువులకును గురువు. గ్రంథప్రయోజనములో టీకకు మహత్వపూర్ణమయిన స్థానము కలదు. గ్రంథసారమును పొందదలచిన సారస్వతేయులకు టీక నొకగా నుండవలయును. ఎక్కడనయిన మూలగ్రంథము కొంత కొంత ప్రభ్రష్టమయినపుడు గవేషకులు టీకాసాహాయ్యముతో సమీకరింతురు.

మూలకారుని మార్గానికి టీకాకారుడు విపరీతముగా నున్నప్పుడు గ్రంథార్థమును తెలియదలచిన వారిదశ ఏమవునో ఊహించవలసినదే. టీకాకర్త మూలకారుని పరిచర్య

చేయవలయును. ఆతనిమార్గములో కంటక శోధనము చేయవలయును. కాని తాను అధికాధికముగా చీకుముళ్లను చేర్చరాదు. మూలటీకాకారులు సమరసముగా సాహిత్యసేవ చేయవలయును. వారిది వీరు కాదనినపుడు జిజ్ఞాసువులు ఖేదమును పొందక తప్పదు.

శారంగధర చరిత్రకు ఇదివరలోనున్న టీకలవలన టీకాకృత్యము నెరవేరలేదని దీపాలవారు దీపముపెట్టి చూపినారు. కాలక్రమమున విజ్ఞానము తగ్గిపోవుచున్న ఈ దినములలో మూలార్థము తెలియనివారు అధోదృష్టి ననుసరింతురు. అప్పుడు టీక కన్పడును. అది సుయోజితము కానపుడు కలుగు ఖేదమునకు అవధి కలదా? టీకాకారుడు లబ్ధప్రతిష్ఠుడయినపుడు ఆతడేమి వ్రాసినను జిజ్ఞాసువులు ప్రమాణబుద్ధితో గ్రహింతురు. అప్పటి ప్రమాదమునకు ఎవరు బాధ్యులు? ఈవిషయమును శ్రీ పిచ్చయ్య శాస్త్రిగారు అనుభవపథములో బాగుగా కనిపెట్టినారు. ఆకృషిఫలము జితకాశి.

జాతీయములగు నుడులు వ్యవహారమునుండి తొలగినపుడు భావబోధ కలుగదు. తెలుగు నుడికారము తెలియని అనాంధ్రులు వానిని విశదీకరింపలేరు. ఈవిషయము 'జితకాశి'లో స్పష్టమయినది. ఆంధ్రగ్రంథములను వ్యాఖ్యానించుటలో త్వరపడరాదని దీపాలవారు స్పష్టపరచినారు. గ్రంథము పీఠికలో ననేకవిషయములు కలవు. వేదము దీపాలవారి వివాదవిషయములను దూరముంచి పరిశీలించినను అనేకులు విశదవివేకము పొందుటకు అవకాశమున్నది.

మూలార్థయోజనములో, భావ ప్రకటనములో, అర్థసంగతిప్రదర్శనములో, చర్చనీయాంశచర్చలో, నిరూపణీయాంశ నిరూపణములో, ఖండ్యాంశ ఖండనములో, వ్యంగ్య దర్శనములో, అలంకృతి ప్రతిపాదనములో, ఆశయ సమున్మేషములో, శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు సిద్ధహస్తులయినారు. 'జి త కా శి' జితకాశి. లోకము ధన్యము.

---

## ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రధానాంధ్రోపన్యాసకులు:

## శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారు, యమ్. యే. గుంటూరు. 4—1—43

మీ వ్యాఖ్యానము కూలంకషముగను మీ పరిశ్రమకు ఆదర్శముగను ఉన్నది. చాలవరకు సావధానముగా చదివి మిక్కిలి సంతోషించితిని.

---

మైసూరు మహారాజా కాలేజి పండితులు, సుప్రసిద్ధ విమర్శకులు,
శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు, 1135 కృష్ణమూర్తిపురం
మైసూరు, 1—12—42.

తాము సాభిమానగౌరవముగా పంపిన గ్రంథము వందనములతో నందుకొన్నాను. పీఠికను పూర్తిగా, క్రీగీతల క్రింద తాముచూపిన విశేషాంశములను భూయిష్ఠముగా చదివితిని. ఇంతకంటె తలస్పర్శిగా చదువుటకు ప్రకృత మవకాశము చాలమికి చాల చింతిల్లుచున్నాను. తరువాత యథానుకూలముగా తప్పక సాంతము చదువుదును.

తాము చేసినపని అగాధము, విస్తృతము; విసుఁగు నెఱుఁగని పరిశోధన. ఇట్టి విపులమైన, విశదమైన వ్యాఖ్యను ముఖ్యముగా నపేక్షించు నాంధ్రగ్రంథములలో చేమకూర వానివి ముఖ్యములు. ప్రకృతగ్రంథమునకు తాముచేసిన వ్యాఖ్య ఆంధ్ర భాషకుఁ జేసిన గొప్ప కైంకర్యము. తదాజీవులగు మావంటివారి ధన్యవాదములకు కృతజ్ఞతకు తాము పాత్రులరైతిరి.

శ్రీ వేదమువారిది ప్రాచీనపద్ధతికి చేరిన పాండిత్యము. స్వాభిమానముతోఁ గూడఁ బెరిగినది. చాలనందుకు వ్యాపారుల దృష్టియొకటి. 'కోఽస్తి ధన్యో మదన్యః' 'మ్పగ్యతాం మాదృశోఽన్యః' అను భావము ప్రాచ్య విద్యావీరులు సింహనాదముగా నేర్చినారు. కనుక వారికి 'ఆత్మ న్యప్రత్యయం చేతః' అను కాళిదాసుని యుపదేశము మనసులో నున్నను బయటికి వచ్చుట యరుదు. శాస్త్రిగారి మేధాప్రతిభలు సర్వంకషత్వమున కాపించి పనిచేసిన పెద్ద తత్త్వములు; కాని మానవసహజమగు మేర వానికిని ఉండవలసినదేకదా ?

కనుక 'మరణాన్తాని వైరాణి' అన్నట్లు తామును కొంత యుదాసీనత వహించి యుండినచో తమవ్యాఖ్య ప్రమాణమున కొంత చిన్నదై గుణమునందింకను పెద్దదిగా నుండి యుండునని తలంచుచున్నాను. మన్నింపఁ బ్రార్థన. తాము చూపిన శాస్త్రిగారి లోపములు చూపవలసినవే; కాని యింకను కొంతసంగ్రహముగా, విషయమాత్రదృష్టితో చూపవచ్చునని నామనవి.

ఇట్లే 'దుర్వ్యాఖ్యా విషమూర్ఛిత' మగు పాండురంగ మాహాత్మ్యమునకు తాము వ్యాఖ్య వ్రాయరాదా ? నాకు చాలనాళ్లుగా నాయాశకలదు. కాని నాకు ఇక్కడ తగినయనుకూలములు లేవు. మఱియు దినే దినే ఆపని చేయఁగలనన్న ఆత్మ ప్రత్యయమును క్షీణించుచున్నది. నాదృష్టిలో ఇప్పుడు తమవలె ఆపని నిర్వహింపఁగల మఱొక్కరు కానరారు.

## శ్రీ వంగోలు వేంకటరంగయ్య పంతులుగారు, బి. యే., బి. యల్.,

నెల్లూరు, 30—3—43.

విద్వాన్ దీపాల పిచ్చయ్యశాస్త్రులవారు చేమకూర వెంకటరాజు సారంగధర చరిత్రమును మంచి పాఠములతోను శ్లేషములగు అర్థ తాత్పర్యములతోను ప్రకటించి ఆంధ్రలోకమునకును భాషకును గొప్ప కొరత దీర్చినారు. ఈ పెద్ద గ్రంథము యొక్క ముఖ్యప్రయోజనముల దెలుపగల గొప్ప పీఠికనుగూడ జేర్చియున్నారు. ఈ ప్రౌఢకావ్యము చక్కగ సవరింపబడి లోకమున నిలిచి ప్రకాశించుట ముఖ్యోద్దేశముగ నున్నది. అయితే వ్యాఖ్యాతలయొక్కయు విమర్శకులయొక్కయు సరణిని సంప్రదాయమును అనుసరించి పూర్వవ్యాఖ్యాతలను, వారి పాఠములను, వారి వ్యాఖ్యానములను వీరు విరివిగ నుల్లేఖించి అందలి గుణదోషములను గూర్చి కొన్నిచోట్ల చాల లోతునకు దిగి పరామర్శించి యున్నారు. కీర్తిమూర్తులు కళాప్రపూర్ణ సర్వతంత్ర స్వతంత్రేత్యాది బిరుదాంకితులు మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ వేదము వెంకటరాయ శాస్త్రులవారును పూర్వ వ్యాఖ్యాతలలో నొకరగుటచేత ప్రాసంగికముగ వారి పాఠములను వ్యాఖ్యానములను వీరందందు కదలించి కుదిలించియున్నారు. విమర్శక ప్రచారక సన్నివేశములబట్టి వీరట్లు చేసియుందురేగాని ఆ మహాకవి పండితులయెడ వీరి కన్యూనములగు పూజ్యభావము లుండినటుల పీఠికలో వీరుదాహరించిన వీరి సొంత పద్యములవలననే స్పష్టమగుచున్నది. కీర్తిధనులగు శ్రీ వెంకటరాయశాస్త్రుల వారి ప్రకటనయందు ప్రమాదములు స్ఖాలిత్యములు ఉండవని ప్రతిఘటింప నక్కరలేదు గాని అట్టివాని కెల్లను ప్రతివాదులు వారె యగుదురా యను విషయము నాలోచింప దగును. శ్రీ పిచ్చయ్యశాస్త్రులవారు తాము చూపిన లోపములన్ను సప్రమాణముగ సహేతుకముగ బహుశః సమర్థించియున్నారు. శ్రీ వెంకటరాయశాస్త్రులవారి శిష్యులనుగూడ వీరు రణరంగమునకు పిలుచుట అవసరమా ?

జాను తెనుగుమీద శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి వివరణము లెస్సగ నున్నది.

ఈ గ్రంథమున వీరుజూపిన అనేక విశేషాంశములు గ్రంథమును జదివియే అనుభవింప నలవికాగలవు. ఈ గ్రంథరూపమున వీరత్యంత శ్లాఘ్యమగు భాషాసేవ జేసి చేమకూరకవి ప్రతిభను భాసింపజేసిరి.

---

## పండిత ఆకిలి శ్రీరామ శర్మ గారు, (ముత్తుకూరు)

ఆ. వె. చేమకూర నస నశించి తద్రుచి రసజ్ఞానుభూతి భవ్యమగు విధానం
బాకమైన మంచిటీక దీపాల పిచ్చయ్యశాస్త్రి వ్రాసె నద్భుతముగ.

క. అతులిత మనితర సాధ్యము, మతిమన్నతిభాజనము సమగ్ర గుణ గణా
న్వితి మతివిశదము నగు శ్రీ 'జితకాశి' వ్యాఖ్య, బళిర ! జితకాశియ యౌ !

---

 29740

## కవికోకిల ఉభయభాషా ప్రవీణ శ్రీ జి. జాషువాగారు, (నెల్లూరు)

మ. తలమోటించితి వయ్య దక్షిణదిశా దంతావళశ్రేష్ఠ మె
త్తిల, నీ గుండె ప్రశంసనీయము సుమా, దీపాన్వయోత్తంస! నీ
పలుకుం బొంకములో విమర్శనములో వాసించు సత్యంబు, మా
తెలుగుందేవత తాల్చి తీరు ననురక్తిన్ బుష్పహారంబుగన్.

---

## ఆయుర్వేదాచార్య శ్రీ పులుగుండ్ల నరసింహశాస్త్రిగారు, నెల్లూరు.

**మిత్రమా, పిచ్చయ్యశాస్త్రి,**

చ. అభినవమల్లినాథ బిరుదాంకము దాల్చి కళాప్రపూర్ణుడై
యుభయవచో నిరూఢి గని యొప్పిన వేదమువారి సంస్కృతిన్
సుభగత గన్న కావ్యమునఁ జూపితి తప్పులు నీదు శేముషీ
విభవ మదెట్టిదయ్య, సుకవీ! సుకవిప్రభుతోమకృద్గవీ!

మ. సకలంకం బకలంకమై తనర సంస్కారంబు గావించి పా
యక తద్ధేతువిమర్శ సల్పితివి హృద్యంబౌనటుల్ గ్రంథ పీ
ఠికయం, దద్దియ ప్రాణ మీకృతి; కకుంఠీభూత నిర్వక్ర తా
వక విజ్ఞానము గోచరించు నట సర్వంబున్ యథార్థంబుగాన్.

శా. 'సామాన్యుండవు నీవు, విశ్వ జగతిన్ సామ్యంబు లే దస్మదు
ద్దామ ప్రౌఢ గురుప్రకర్ష' కనుచున్ ఘట్టించి, నిన్నుం, గవి
స్తోమాభ్యర్చితపాదు నీదుగురుపాదున్ దూఱెరెవ్వారు, వా
రే మాన్యుల్ గద మాకు! గారణము వారే యౌట నీసృష్టికిన్.

శా. దీపంబయ్యెఁ గదయ్య తావక తటిద్దీప్తాయిత ప్రాతిభ
వ్యాపారం బవిచారితార్థ విధుర వ్యాఖ్యా తమస్తోమ దు
ర్వ్యాపార్థంబగు చేమకూర కవిరాడ్వ్యాహార సౌధాని కో
దీపాలాన్వయ శుక్తి మౌక్తికమణీ! ధీమత్కవి గ్రామణీ!

క. ఈ కఱవు కాలమందును నీకృతి వెలయింపఁ జేసె నేధీరుం డా
పాకాటి వంశజలధి సు, ధాకరు సంజీవిసెట్టిఁ దగునుతియింపన్.

క. నీకును నీగురునకు మిముఁ, దాఁకినవారలకు మఱియుఁ దద్గురునకు శ్రీ
పాకాటి వంశ తిలకున, కీకృతి యసమప్రశస్తి నెనయించె, బళీ!

---

## వందన సమర్పణము

చేమకూర వెంకటకవి కృతికిని, తన్మూలమున ఆంధ్రభారతికిని నేను చేసిన యించుక సేవకు సంతసించి ప్రశంసించియు, సముచితములగు సవరణలు సూచించియు నన్ను మన్నించిన పండిత వరేణ్యులకు ప్రణామ శతములు.

పండితుల కందరికిని నా గ్రంథము నందింపజాలమికిని, కొందరు పెద్దల అభిప్రాయము లిప్పటికిని నందమికి చింతిల్లుచున్నాను. ఆ పండితుల అభిప్రాయములను ప్రత్యేకముగా ప్రకటింతును.

## కొన్ని విశేషములు

మత్స్యేంద్రనాథుడు చౌరంగి ననుగ్రహించినది సప్తశృంగపర్వతముమీదనట. (అది యెక్కడిదో తెలియదు.) ఈవృత్తాంతము జ్ఞానేశ్వరదేవుడు మహారాష్ట్రభాషలో గీతకు వ్రాసిన 'జ్ఞానేశ్వరీ' వ్యాఖ్యానములో 18 వ అధ్యాయములో ఉన్నది. ఆవ్యాఖ్యానము క్రీ. శ. 1290 ప్రాంతమున రచింపబడినది. ఈ విశేషమును నేను శ్రీ చింతా దీక్షితులవారివలన తెలిసికొన్నాను.

హైదరాబాదు వాస్తవ్యులు శ్రీయుతులు సురవరం ప్రతాపరెడ్డిగారియొద్ద సారంగధరచరిత్ర తాళపత్రప్రతి యొకటి యుండగా దానిని వారు ఆంధ్ర యూనివర్సిటీ కిచ్చివేసిరట. 'అందు పాఠాంతరము లేమేని లభించునేమో చూడండి' అని శ్రీ రెడ్డిగారు నాకు (4—2—48) వ్రాసినారు. ఆప్రతిని పరిశీలించు నవకాశము నాకు లేకపోయినది.

మరియు, సికిందరాబాదు నివాసులు పెదగాడ గంగయ్యగారు 'కవుల సంగ్రహ చరిత్ర'లో 'చేమకూర వెంకటకవి సందేహములేకుండా భోగమువాడే' అనియు, 'ఈదాడన్నను మదనుడు – కోదాడనువాడు'– (విజ. 2-192) అనుచోట: (ఈదాడును కోదాడును తాళవృక్షవిశేషములని వేదంవారి టీక) 'ఈదాడు, కోదాడు' ననునవి గ్రామములు. కృష్ణాజిల్లాలోని నందిగామకు ౪, ౫ యోజనముల దూరాననున్నవి. నందిగామలోని జనులు పై సామెతను ఇప్పటికినీ వాడుదురు. కావున కవి అక్కడి వాడై యుండును' అనియును ఆ గ్రంథమున కలదట. ఈ విశేషములను అవ్యాజ ప్రీతితో నాకు తెలియవ్రాసిన శ్రీ ప్రతాపరెడ్డిగారికి కృతజ్ఞుడను.

## ఒక కొన్ని శంకలకు సమాధానములు

1. పీఠిక (పు. 26) లో 'వామ = ఉత్తమస్త్రీ' (కుటిలస్త్రీ కాదు) అనుటకు—

'వక్త్రైం విలాసమణిదర్పణధార్యమాణం వామా హిమాంశు రయ మిత్యవధార్య యస్యాం' (భా. చం.) 'యస్యాం నగర్యాం వామాః సుందర్యః' అని వ్యాఖ్య.

'శాకుం'లో 'వామాః కులస్యాధయః' అన్నచోట వామలు కుటిల స్త్రీలు కారు. వామాః – ఉక్తవిపరీతాః; అన్యా వామాః స్త్రియః అని వ్యాఖ్యలు. ఇతర స్త్రీలు అని యర్థము.

2. పు. ౧౦౧ లో. 'ఉలుచు (= ఊడదీయు) అను నర్థముననే 'ఉడుచు' అను రూపము (ఇది 'ఉడుగు' నకు ప్రేరణరూపము కాదు. సకర్మకక్రియ.) భారతములో లభించినది.

మధ్యాక్కర : 'తన దివ్యశక్తి నప్పాశము లుడిచి తన్మునినాథుఁ

బనుగొనఁ దీరంబు సేరఁబెట్టి విపాశనాఁ బరఁగె.' (ఆది. 7–123.)

లడాభేదముచేత, వెడలు = వెలలు; ఉలుచు = ఉడుచు. వావిళ్ళవారి ప్రతిలో 'పాశముల విడిచి' అని పాఠము; 'పాశము లుడిచి' అని పాఠాంతరము. 'ల విడిచి' అను పాఠమున మాత్రాధిక్యము; లక్షణభంగము. కావున అది సాధుపాఠము కాదు.

3. పు. ౨౭౮ లో – 'ఇట' కళగాని ద్రుతప్రకృతికము కాదు – అన్నందుకు.—

"అట, ఇట, ఎట, ... కళలుగాని ద్రుతప్రకృతికములు కావు. వేమూరివారి మొదటి కూర్పులో, అట మొదలయినవి ద్రు, లు, గా గ్రంథమునందు ముద్రితము లైనందున తప్పొప్పుల పట్టికలో — 'అట, ఇట, ఎట, యీ మూఁడును గళలగు నవ్యయములు గాన, అటన్ – అటుకు, ఇటన్ – ఇటుకు, ఎటన్ – ఎటుకు, ఎట కేనియు, ఇత్యాదులను – అట, ఇట, ఎట యేనియు నని దిద్దుకొనునది' అని శ్రీ తం. వేపెరుమాళ్ళయ్యగారు శుద్ధ పత్రికలో ప్రకటించినారు." (చూ. ప్రతిభ. సం ౮. 'శ్రీ సూర్యారాయాంధ్ర నిఘంటువు' అను వ్యాసము. పు. ౫౭ – ౫౮.)

4. పు. ౩౦౮. 'వింఖరవృత్తి.' విను + ఖరవృత్తి = వింఖరవృత్తి అనుటకు శాస్త్రమున మార్గములేదు. లేకున్న నేమి ? కవులు నిరంకుశులు గదా ?

5. పు. ౩౯౯ లో 'నిరాపనింద' (మిశ్రగ్రామ్యము – అని శ. ర.) అను పలుకుబడి దుష్టమని కాబోలు వేంకట్రాయశాస్త్రిగారు 'నిరపనింద' అని సంస్కరించి 'ఆముక్త' (పు. 520) లో "భాద్రపద శుక్ల చతుర్థి...చంద్రదర్శనము చేయువారికి 'నిరపనింద' వచ్చు"నన్నారు. 'నిరాపనింద; నీలాపనింద. అనియును లోకమున వాడుక.

పరవస్తువారి లైబ్రరీలోని 'ఆముక్త' (తా. ప్ర.) వ్యాఖ్యానములో "చతుర్థి

చంద్రదర్శనం వల్లను నీలాపనిందలు రావడం ప్రసిద్ధం గనక" అని యున్నది. (చూ. గద్యచింతామణి. పు. 212.)

'నీలాపనింద' యీ నాడును వాడుకలో నున్నది. "కాంగ్రెసు సంస్థపైన నా పైన ఇండియా మంత్రి అంతవాడు నీలాపనిందలు వేశాడు." (చూ. ఆంధ్ర ప్రభ. 12-2-43)

పు. ४२౧ లో 'కొంచుపోవు' అను క్రియలోని 'కొంచు' క్త్వార్థక మన్నందుకు.- క్త్వార్థకము ఉదంతముగా ఉండునా? అని పెద్దలకు కొందరికి పెద్ద సందేహము. "పట్టుకొని, వండుకొని, తెచ్చుకొని, మొదలయిన రూపములలో పట్టు, వండు, తెచ్చు, మొదలయిన క్రియారూపములు క్త్వార్థక రూపములంటే నేటి తెలుగువారికి వింతగా తోచకమానదు. కాని సజాతీయమైన కన్నడభాషలోను, అరవభాషలోను ఉకారాంతముగా ఉన్న క్త్వార్థకరూపములు చూచిన యెడల ప్రాచీనాంధ్రములో కూడా క్త్వార్థకములు ఉకారాంతముగా ఉండి యుండవచ్చునని తోచకమానదు.- అరవ భాషలో క్త్వార్థకరూపము 'కొండు'. కొండుపోనార్ = కొనిపోయినారు. కొండు వందు = కొనివచ్చి. ప్రాచీనాంధ్రములో సైతము కొండుధాతు వుండేది అనుటకు - కొండాడు = కొనియాడు, కొండాటము = కొనియాడడము నిదర్శనములు. 'కొండు పోయినారు' అనే ప్రయోగం శిష్టజనవ్యవహారములో లేకపోయినా అనాగరీకుల నోటను నేటికిన్ని నిలచియున్నది." (చూ. బాల. శర. పు. 180-182.)

'కొండుపోవు' వంటి క్రియయే 'కొంచుపోవు' (= కొనిపోవు,) "కొంచు పోవుట = కొనిపోవుట; To carry away. కొంచువచ్చుట = తెచ్చుట, To bring away" (బ్రౌను.)

కొంచుపోవు (= కొంపోవు) అను క్రియకు 'తీసికొనుచూ పోవు' అని యర్థము చెప్పకూడదు. 'కొనిపోవు' అనియే చెప్పవలెను. కావున అందలి 'కొంచు' క్త్వార్థకమే.

పు. ౫౦. 'దోబూచి' అనుటకు — "లక్షణము నిరూపించేవారూ, నిఘంటువు నిర్మించేవారూ తమకు దొరకిన గ్రంథాలయినా సావధానముగా చూడక, 'మాకు ప్రయోగము కనఁబడలేదు' అని కాళ్లు చాచేసి, కళ్లు తేలవేస్తే, ఆ శబ్దము తన స్థలములో నుండే దోబూచులాడుతూ నవ్వుతుంది." (ప్రతిభ. సం. ౭. 'శ్రీ సూ. నిఘంటువు' పు. ౬౦.)

పు. ౭౫ లో 'పంచకము'—గుజ్జమునకు పిరుదును ఉరమును విరివిగానుండుట శుభలక్షణము అనుటకు—

క. ఒఱపగు నురమును బిఱుఁదును నెఱిఁ దోఁకయు, ముఖముసిరియు నిర్మల ఖురముల్

కఱుచ చెవులుఁ దెలిగన్నులుఁ, దఱచగు కందంబుఁ జూడఁ దగు నా హారికిక్.
భాగ. ౮-౨౫౬.

## కొన్ని సవరణలు

1. పు. 37 లో– 'తొట్టిన = నిండారిన' అనుట కిచ్చిన ప్రయోగము ప్రమాదమూలము. తొట్టు = ఎగదట్టు; నిండుకొను. శ. ర.

2. పు. ౧౭౦ లో 'సపులక స్తనియై' అనుపాఠమును టీకలో మార్పు సేయ మరచినాను.

3. పు. ౧౭3 పంక్తి ౧౬ లో 'తనయొక్క కోరిక' అనుటకు 'నా కోరిక' అని సవరణ.

4. పు. ౨౪3 లో 'గాడ్పు = ఈగాలి' అని మార్పు.

5. పు. ౫–పం ౧౨ శ్రీ ప్రభాకర శాస్త్రిగారు 'గవడ'ను 'గవుడ'గా దిద్దుకొని యున్నారు. దానిని గమనింపక నేను పునస్సమీక్షలో విమర్శించినాను. పొరపాటు.

## కొన్ని అచ్చు పొరపాటులు

| | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| పీఠిక | 45 | 24 | విరచించితి | వివరించితి |
| ,, | 57 | 30 | మంత్స్యేంద్ర | మత్స్యేంద్ర |
| ,, | 71 | 14 | టీలు | టీకలు |
| ,, | 79 | 17 | పాలాక్షు | ఫాలాక్షు |
| | 3౧౬ | ౧౨ | 'అంధకార' | 'అజ్ఞాన' |

ఇట్టి ప్రమాదము లీ గ్రంథమున నింకెన్ని కలవో. భ్రాంతి పురుష ధర్మముకదా! సహృదయులగు పాఠకులు తమ కగపడిన దోషములను దయతో నాకు తెలుపుదురేని యీసారి ముద్రణమున సవరించుకొందును. గ్రంథము పూర్వపరిష్కరణమున పూర్తిగా చెడియున్నది. కావున దీనిని చక్కపరచుట ఒక్కమాటుతో తేలునట్టి పని కాదు. కావున పాఠకలోకము నిట్లభ్యర్థించితిని.

## మనవి

శ్రీ శాస్త్రులవారిని విమర్శించు సందర్భములో నేను వారిని దూషించినట్లు పెద్దలు కొందరు భావించిరట. వారికి నా యీ మనవి.

వెంకటార్య శాస్త్రిగారితో నాకు వైరము లేదు. మైత్రియును అంతే. వారి గ్రంథములతోనేగాని వారితో నాకు పరిచయములేదు. నాజన్మమునకు నేను వారితో మాట్లాడినది ఒక్కమాటే. అదియును సారస్వత విషయము కాదు. తొలుదొలుత వారియెడ నాకొక విధముగా గురుభావముండెడిది.

శాస్త్రిగారి శిష్యులు సొంత నామములతోను 'సరస్వతి రాష్ట్రనాగరకాచార్యుడు' మొదలగు మారుపేరులతోను నన్నుగూర్చి వ్రాసిన ఉచ్చావచములకు మనసు నొచ్చియున్నందునను, పూ. టీ. దోషములు అత్యంత వేదనాకరములుగానున్న కారణమునను నా విమర్శలో దోషస్వరూప నిరూపణఘట్టములలో ఎక్కడనేని భాష యించుక పారుష్యమును వహించియుండవచ్చును.

భాషా విమర్శనములలో ('ఆంధ్ర ప్రసన్నరాఘవ విమర్శనము'లో వలె అంత దారుణముగా కాకున్నను) దోషస్వభావమును బట్టియు, దోషకర్త అహంతను బట్టియును ఒకపాటి పరుషభాషణములు, ఒక్కొకయెడ వ్యక్తిదూషణములు కూడా బయలువెడలుట స్వభావము. ఇది పండితు లెరుగనిసంగతి కాదు.

మల్లినాథుని వ్యాఖ్యలలోని 'అహో మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః', 'నాథవచన మనాథవచన మేవ' అను నుడులు దూషణములు కావా? చంపూభారత వ్యాఖ్యాత కురవి రామకవి, తత్పూర్వ వ్యాఖ్యాతయైన నృసింహపండితుని 'తస్యా నాఘ్రాతవ్యాకరణగంధస్య న చోద్యాయ' అనియు, 'తస్య మూలనిర్మూలకస్య న చోద్యమ్' అనియు, 'ఇతి నృసింహప్రలపితమ్' అనియు -

'అపమూల మనన్విత మతిదురహంయుభి రత్ర కల్పితాన్ పాఠాన్,
అపి విదుషో మోహయితుం వ్యాచఖ్యౌ బత స పండితమ్మన్యః'

అనియు నిరసించుటయే కాక,

'అదూషయత్కావ్య మిదం నృసింహః కశ్చి న్నిజాఖ్యానుగుణైః శ్వవాదైః
సింహో నృషు శ్వా హి సునిర్మలానాం స్వర్ణా ద్యతో దూషణ మాతనోతి'

అని తుదకా నృసింహమును గ్రామసింహమని కూడ దూషించినాడు;

రామకవి ఆ వ్యాఖ్యాత నంత తీవ్రముగా తిట్టుటకు హేతువేమి? వ్యక్తిద్వేషమా? కాదు; పనికిమాలిన వ్యాఖ్య వ్రాసి మూలమునకు చేసిన అపకృతియే హేతువు.

ఒడలి కుడు కెక్కినప్పుడు ఎంతటి శాంతుడైనను కోపపడక మానడు. పరుషముగా మందలింపక విడువడు. 'ఒటగొడ్డెము' ను 'వటగొడ్డెము' అని దిద్దవలెనని

శ. ర. కర్త వ్రాసినందుకు పరమ శాంతస్వభావులయిన శ్రీ గిడుగుపండితు లేమన్నారో వినండి—

"భీముఁడు వఱగొడ్డెము లాడఁగ అని పద్యము దిద్దుకొని యీ పదము నెత్తి వేయవలెను - అని సీతారామాచార్యులుగారు తీర్పు వ్రాసినారు. ఛీ అనేవారు లేరు. పోతన్నగారు శాంతమూర్తులు; శపించరు. 'ఒఱగొడ్డెము' మొఱ్ఱో అంటే ఆ సీతారామాచారికి వివేకములేదు. ఆతని నిఘంటువు తప్పుల తడక" అన్నారు.

ఈ తత్త్వము నెరిగియే కదా ప్రాజ్ఞులయిన శ్రీ శాస్త్రిగారు 'ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము' అనులక్షణ గ్రంథములో (ఇందలి హెచ్చరికలో) 'విమర్శకుఁడు విమర్శలోఁ జూపు కటుత్వమును తొలఁగఁబెట్టి, పఠితలు విమర్శయొక్క పటుత్వాపటుత్వములనే పరికించుకొనుట మేలు' అని సెలవిచ్చిరి. పఠిత లా పలుకును పాటింపరా ! ఏమీ, అది మనీషులు మన్నింపదగిన మాటకాదా !

ఇంతకును నా విమర్శలోని భాషాపారుష్యము ప్రసంగాను ప్రసక్తమే గాని ద్వేషప్రయుక్తము కాదనియు, దోష నిరూపణము పట్ల ప్రమాణాంతరముల విశేషముగా ప్రదర్శించి తత్తద్విషయక విమర్శనము విస్తరించుట శాస్త్రసంప్రదాయమే అనియు మరల మనవిచేసికొనుచున్నాను.

## శుభవార్త

కీ. శే. వేంకట్రాయశాస్త్రిగారి మనుమలు చిరంజీవి వెంకట్రాయన్‌గారు ఈ సారంగధర చరిత్రమును సంస్కరించి పునర్ముద్రణ కావింప సంకల్పించిరని వినికి. మిక్కిలి శుభవార్త. వారి సంకల్పమునకు నా విమర్శనమే నిదానము కావున నా పరిశ్రమము ఫలవంతమైనదని నా సంతోషము. శ్రీ వెంకట్రాయన్‌గారు గ్రంథమును సంస్కరించుటలో తాతగారిదారి త్రొక్కక సమంజస మార్గము నవలంబింతురనియు, ఆ సంస్కరణమున వారి తాతగారి తప్పులేకాక నా పరిష్కరణమున దొరలిన దోషములు కూడా తొలగి చేమకూరవాని కృతి అనవద్యమగు నా కృతి నెనపి ఆంధ్రవాగ్దేవికి అమూల్యాలంకృతి కాగలదనియును ఆశించుచున్నాను. చిరంజీవి సత్సంకల్పము నిర్విఘ్నముగా కొనసాగి అచిరకాలముననే క్రియారూపముం గాంచుగాక యని హృదయపూర్వకముగా ఆశంసించుచున్నాను.

దీపాల పిచ్చయ్యశాస్త్రి

29740

# సారంగధర చరిత్ర

## పీఠికయందును టీకయందును ఉదాహరింపబడిన గ్రంథములు

అచ్చతెనుగు రామాయణము
అథర్వణ కారికావళి
అథర్వణ విరాటపర్వము
అనర్ఘ రాఘవము
అన్నపూర్ణా సహస్రము
అప్పకవీయము
అమరకోశము
అమరుకము
అలంకార సారసంగ్రహము (వే. వేం. శాస్త్రి)
అష్టమహిషీ కల్యాణము
అహోబల పండితీయము
ఆంధ్రనామసంగ్రహము
ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము (గి. వెం. రామమూర్తి.)
ఆంధ్రపత్రిక - సారస్వతానుబంధము
ఆంధ్రపద పారిజాతము
ఆంధ్రప్రబంధ కథలు (సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి)
ఆంధ్రప్రసన్న రాఘవవిమర్శ (వే. వేం. శాస్త్రి.)
ఆంధ్రభాషార్ణవము
ఆంధ్రభాషానుశాసనము (మల్లాది సూర్యనారాయణశాస్త్రి)
ఆప్టి నిఘంటువు
ఆముక్తమాల్యద
ఉగాదిసంచిక
ఉత్తరరామాయణము
ఉత్తరహరివంశము
ఉత్తరహరిశ్చంద్ర
ఉద్భటారాధ్యచరిత్ర
ఉష (వే. వేం. శాస్త్రి.)
ఓదార్పు (దీ. పి. శాస్త్రి.)
కడుపుతీపు (వే. ప్రభాకరశాస్త్రి.)
కలగూరగంప (తిరుపతి వేంకటకవులు.)
కవికర్ణరసాయనము
కవిరాజమనోరంజనము
కళాపూర్ణోదయము
కళాశాస్త్రము
కాటమరాజుకథ
కాదంబరి
కామందకము
కావ్యకల్పలత
కావ్యాలంకార సంగ్రహము (=నరస భూపాలీయము)
కాశీఖండము
కాళహస్తి మాహాత్మ్యము
కాళిందీకన్యా పరిణయము
కాళీసహస్రము (తి. వెం. కవులు)
కుమారసంభవము (సం.)
,, (నన్నెచోడ)
కులశేఖరమాహాత్మ్యము
కువలయాశ్వచరిత్ర
క్రీడాభిరామము
క్రేవన్స్ రాయల్ డిక్షనరి
గంగాలహరి (సం.)
గబ్బిలము (జాషువ)
గిడుగు వెంకటరామమూర్తి సప్తతితమ జన్మదినోత్సవ వ్యాససంగ్రహము
గీరతము (తి. వెం. కవులు)
గుప్తార్థప్రకాశిక
గురుబాలప్రబోధిక

చంద్రభానుచరిత్ర
చంద్రరేఖావిలాపము
చంద్రాంగదచరిత్ర
చంపూరామాయణము
చాటుపద్యమణిమంజరి
చాటుపద్యరత్నాకరము
చిత్రభారతము
జీవానందననాటకము (సం.)
జైమినిభారతము
తంజాపురాంధ్రనాయకచరిత్ర
తిక్కనవిజయము (వే. వేం. శా.)
తిలకమంజరి (సం. ధనపాలుడు)
తోలకరి (పిం. లక్ష్మీకాంతము,
శా. వేంకటేశ్వరరావు)
దశకుమారచరితమ్ (సం.)
దశకుమారచరిత్ర (కేతన.)
,, (వే. వేం. శా.)
,, (సంజీవరాయ కవి.)
దేవీపురాణము
దేవీభాగవతము
(ములుగు పాపయారాధ్యులు.)
నరసభూపాలీయము ( = కా. సం.)
నవనాథచరిత్ర (గౌరన)
నవనాథభక్తులచరిత్ర (బచ్చు రామన్నగుప్త)
నాగానందము (వే. వేం. శా.)
నాగ్నజిత్తీయము
నానారాజసందర్శనము (తి. వెం.)
నానార్థరత్నమాల
నిరంకుశోపాఖ్యానము
నిర్వచనోత్తర రామాయణము
నీతిగీతలు
నీతిచంద్రిక
నీలాసుందరీ పరిణయము
నృసింహపురాణము
నైషధము (సం.)

పంచతంత్రము (సం.)
పంచతంత్రము (వేంకటకవి.)
పండితారాధ్యచరిత్ర
పరమయోగి విలాసము
,, (ద్విపద.)
పల్నాటివీరచరిత్ర
పాంచాలీపరిణయము
పాండవోద్యోగము (తి. వెం. కవులు.)
పాండురంగ మాహాత్మ్యము
పారిజాతాపహరణము
,, పరిమళోల్లాసవ్యాఖ్య
(శా. కుప్పుస్వామయ్య.)
పాశుపతము (తి. వెం.)
ప్రతాపరుద్రీయము (వే. వేం. శాస్త్రి.)
ప్రబంధరాజవిజయ వేంకటేశ్వరవిలాసము
ప్రబోధచంద్రోదయము
ప్రభావతీప్రద్యుమ్నము
ప్రియయదర్శిక (వే. వేం. శా.)
ప్రౌఢవ్యాకరణము
బసవపురాణము
బాణాసురయుద్ధము
బాలకవి శరణ్యము (గి. వెం. రా.)
బాలవ్యాకరణము
బా. వ్యా. సారస్యసర్వస్వ పేటిక
(దూ. రామమూర్తి శాస్త్రి.)
బిల్హణీయము (సం)
బ్రౌణ్యనిఘంటువు
భర్తృహరి (సం)
,, (తెనుగు – ఏనుగు లక్ష్మణకవి)
భాగవతము (సం)
(తెనుగు)
భామినీ విలాసము (సం)
భారతము
భారత విశేషములు (తి. వెం.)
భారతీ పత్రిక

భారవి (సం)
భాస్కర రామాయణము
భీమఖండము
మనుచరిత్ర (బౌను ప్రతి)
మనుస్మృతి
మల్లాది సూర్యనారాయణశాస్త్రి షష్టిపూర్తి సంచిక
మహాభాష్యము
మాఘ కావ్యము
మార్కండేయ పురాణము
మాలతీమాధవము (సం)
మాళవిక (వే. వేం. శా.)
మేఘసందేశము
మేదినీ నిఘంటువు
మేరుతంత్రము
యయాతి చరిత్ర
యస్. యస్. యల్. సి. టెక్స్టు
యుగంధర విజయము (దొడ్డ వెంకట్రామిరెడ్డి)
యోగరత్నాకరము (ఏటూరి శ్రీనివాసాచార్యులు.)
రంగనాథ రామాయణము
రఘువంశము
రత్నశాస్త్రము
రసికజనమనోభిరామము
రాఘవపాండవీయము
రాజనరేంద్రసంచిక
రాజవాహన విజయము
రాధికాసాంత్వనము
రామసహస్రము
రామాభ్యుదయము
రామాయణము (సం)
రాయలనాటి రసికత (రా. అనంతకృష్ణ శర్మ.)
లలితా సహస్రము
లక్ష్మీనారాయణీయము (= శుద్ధాంధ్ర నిఘంటువు)
వరాహపురాణము
వరాహసంహిత
వాత్స్యాయన కామసూత్రములు
వావిళ్లవారి సన్మానసంపుటము
విక్రమార్కచరిత్ర
విక్రమోర్వశీయము (వే. వేం. శా.)
విజయవిలాసము
విజ్ఞానేశ్వరీయము
విప్రనారాయణచరిత్ర (మల్లన)
విశ్వగుణాదర్శము
విశ్వనిఘంటువు
విష్ణుపురాణము
వీరభద్రవిజయము
,, యక్షగానము (త్వరకవి రామకృష్ణయ్య)
వృషాధిపశతకము
వేమనశతకము
వే. వేం. శాస్త్రి సంస్కృతి
వైకృతదీపిక
వైజయంతీవిలాసము
వైయాకరణపారిజాతము (వజ్ఝల. చి. సీ. శాస్త్రి.)
వ్యాకరణబోధిని (త్రి. వీరరాఘవస్వామి)
శకుంతలాపరిణయము
శబ్దకల్పద్రుమము
శశాంకవిజయము
శాకుంతలము (సం)
శాలివాహనగాథాసప్తశతి (రా. అ. శర్మ)
శివరాత్రిమాహాత్మ్యము
శివలీలావిలాసము
శుకసప్తతి
శుద్ధాంధ్రనిఘంటువు (= ల. నా.)

శృంగారనైషధము
శృంగార శ్రీనాథము
శైవధర్మము
శ్రవణానందము (తి. వేం.)
సంధ్యాభాష్యము
సర్వలక్షణసారసంగ్రహము
సారంగధరచరిత్ర - (భాణాల శంభుదాసుఁడు.)
,, (కూ. తిమ్మకవి.)
,, (సిద్ధనగౌఁడు.)
,, (స్త్రీలపాటలు)
సాహిత్యదర్పణము
సాంబనిఘంటువు
సీతారామాంజనేయసంవాదము
సుమతిశతకము
సులభవ్యాకరణము
సూర్యారాయాంధ్రనిఘంటువు
సౌగంధికప్రసవాపహరణము
సౌందరనందము - (పిం. లక్ష్మీకాంతము, కా. వేంకటేశ్వరరావు.)
హంసవింశతి
హఠయోగప్రదీపిక
హరవిలాసము
హరివంశము
హరిశ్చంద్రోపాఖ్యానము (గౌరన.)
,, (శంకరకవి.)
,, (కంచి శరభకవి.)
హితోపదేశ చంపువు - (వే. వేం. శా.)
హితోపదేశము (సం.)

## ఇతరసంకేతములు

| | |
|---|---|
| తంజ. తా. పా. | తంజావూరి తాళపత్రప్రతి పాఠము. |
| మద. తా. పా. | మదరాసు ,, |
| పూ. ము. పా. | పూర్వముద్రణపాఠము - (ఇదే గుజిలీపాఠమున్ను.) |
| శా. పా. | శాస్త్రిపాఠము |
| పూ. టీ. | పూర్వటీక. |
| అవ - అన్వ. | అవతలికి అన్వయము. |

# విషయానుక్రమణిక

## ( పీఠిక )

# హెచ్చరిక

(వే. వేం. శాస్త్రిగారి జీవితచరిత్రమునుండి)

'కవి-(వ్యాఖ్యాత) కావించిన భాషాచిత్రవధ కాయాసపడి విమర్శకుఁడు విమర్శలోఁ జూపు కటుత్వమును తొలఁగఁబెట్టి పఠితలు విమర్శయొక్క పటుత్వాపటుత్వములనే పరికించుకొనుట మేలు. దొంగలకును నరహంతకులకును అధికరణకుండు వోలె కాకవికి (కువ్యాఖ్యాతకు) సాధువిమర్శకుఁడు దోషోద్ఘాటకుఁడును శాసితయు నగు. దొంగను 'శ్రీయుతులైన మో దొంగయ్యగారూ, తమరు ఇట్టి చౌర్యమును కావింపవలసినవారు కారు. మహానుభావులరు. మఱి తమరు 8 సంవత్సరములు కారామందిరమున వఱకంబుగావించి రాజకీయమైన విందారగించుచు మమ్ముఁ గృతార్థులఁగావింపుఁడు' అని యధికరణకుండు వేఁడుకొనుటలేదు.—

అట్లే సాధువిమర్శకుఁడు కాకవిని - (కువ్యాఖ్యాతను) వేఁడుకొనవలసిన పనిలేదు.'—

ఆంధ్ర మల్లినాథ మహామహోపాధ్యాయ
సర్వతంత్రస్వతంత్ర కళాప్రపూర్ణ
వేదము వేంకటరాయశాస్త్రి

సారంగధరచరిత్రము - జితకాశి టీకా సహితము.—

# పీఠిక

## ౧ కవికాలము - కులము

ఈ సారంగధరచరిత్రమును రచించిన కవి చేమకూర వేంకటరాజు. వేంకట కవియని వ్యవహారము. ఇతనికి * అప్పన్న - (i. e. వెంకటప్ప) అను నామాంతరము కూడా ఉన్నట్లు కనబడుచున్నది. వెంకటకవి క్రీ. శ. 1614-33 నడుమ తంజావూరిని పాలించిన రఘునాథరాయల కొలువున నున్నవాడు. అతని మరియొకరచన విజయవిలాసము. వెంకటకవి, అశ్వాసాంత గద్యములలో 'లక్ష్మణామాత్యకుమారుడ' నని వ్రాసికొన్నాడు. (అమాత్యశబ్దము నియోగి బ్రాహ్మణునియందు రూఢము.) అంతేగాని తన కులగోత్రాదులనుగూర్చి మరి యెక్కడా ఒక్కముక్కయైనను అనలేదు. వేదం వెంకట్రాయశాస్త్రిగారు 'సారంగ' - 'విజ్ఞప్తి'లో - (1910 లో) 'ఈ వేంకటకవి శూద్రుఁడని...చరిత్రశోధనలవలన తెలియుచున్నది' అన్నారు. ఆచరిత్ర శోధన లెట్టివో - ఆ 'యమాత్యు'ని కొమారుడు శూద్రుడగుటయెట్లో వారు చెప్పలేదు.

మళ్లీవారే, 'విజయ' — 'విన్నపము'లో (1911 లో) 'ఈ చేమకూర వేంకట రాజకవీంద్రుని కులమేదో చరిత్ర శోధకులు ఇప్పటికిని నిర్ణయింపనేరకున్నారు' అన్నారు.

వెంకటకవి కులమునుగూర్చి ఆ శాస్త్రిగారు వ్రాసిన వ్రాతలిట్లు అవ్యవస్థితముగా నున్నవి. ఏమయినను, వెంకటకవి కులమున కొంత కళంకము కలవాడనియే జనశ్రుతి. జనశ్రుతిమాత్రమే కాదు; గ్రంథప్రమాణముకూడా కనబడుచున్నది.

పూర్వమొకప్పుడు 'బుచ్చివెంకు' అను నొకకవి వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు గారి ఆస్థానికి వెళ్లెనట. అతడు జారోత్పన్నుడట. ఆ యంశమును తాకనాడుచూ, ఆస్థానకవులలో నొకరు, ప్రభువుగారి అభిప్రాయముగా,

---

* శా. శం. సారంగధర.— "భువిలోన సారంగ భూవరుచరిత, కవితామహత్వంబుగల చేమకూర, అప్పనచెప్పిన యాప్రకారమునఁ జెప్పితి బాణాలశంభుదాసుఁడను(?)". కూ. తి. సారంగ. పీఠిక.

"అప్పనచెప్పిన యాప్రకారమున, నొప్పుగా నీకృతి యొనరించినాఁడ, శంభుని వరమున జగతి, బాణాల, శంభుదాసుండ." అని వే. వేం. శాస్త్రిగారి ప్రతిపాఠము.

'కులమునఁ గళంకు కలదను కొంచుఁగొండు
...    ...    ...
బుధజనాటవ్యటన్న్యంకు బుచ్చివెంకు'.

అనిరట. అంతట ఇంకొక కవిలేచి,

'కొంకక తమరాడిన యది
బొంకేలగు వేంకటాద్రి భూపాలక, యీ
న్యంకేల ? వానికింగల
*రంకే యిచ్చోట నిలుప రసవంతమగున్'.

అని చమత్కరించెనట. అందుకా బుచ్చివెంకు ఇట్లు బదులుపలికెనట.

'పన్నిన సత్ప్రబంధమున బాగును నోగును జూడ కీసుచే
మన్ననమాలి మా కులము మాట తలంతురె ? చేమకూర వెం
కన్నకు లోపమేమి ? కులమా కవనానకు ? వేంకటాద్రి రా
జన్న గణించి మీరలు దయామతిఁ బ్రోచిన నాకుఁ జాలదే ?'

—చాటు. రత్నా. పు. 162.

‡ వెంకటాద్రినాయుడు రఘునాథునకు సమకాలికుడు. కావున బుచ్చివెంకు - వెంకటకవి, ఒకకాలమువారే యగుచున్నారు. వెంకన కులకళంకమును గూర్చిన ప్రస్తావము ఆతని జీవితకాలముననే ప్రవృత్తమైయున్నది. కాబట్టి అవశ్యము విశ్వాస్యమగుచున్నది. అదియట్లుండగా, ఆతని కులతత్త్వమును తెలుపు పలుకులు కొన్ని యాతని రచనలోనే పొడకట్టుచున్నవి. విజయవిలాసకృతి సమర్పణ సందర్భమున తనకును రాజునకును గల సంబంధమును ఇట్లు వాకొన్నాడు.—

'కృతిరత్నంబున్, గేవలభక్తిని, గానుకగావించెద.' (పద్య. 34)

'నాపాలిటి రామభద్రుఁడని బంగరుపూవులఁ బూజచేసి...
సత్కృతికానుకచేసి' (పద్య. 38.)

'ప్రబంధము లెన్నియేని మీ, పేరిట నంకితంబిడిన, బిడ్డల
నెందఱిఁ బేరుపెట్టినన్, తీరునె మీ ఋణంబు.' (ప. 39)

---

*న్యంకు రంకు శబ్దములకు జింక యని యర్థము. రంకు = జారత్వము - అని ధ్వని.

‡ 'ఈ కమ్మప్రభువు పదునాఱవశతాబ్ది తర్వాతఁ గృష్ణాతీరమందలి యమరావతి రాజధానిగాఁ గొంత తెల్గుదేశమేలినవాఁడు' (చాటు.మంజరి. పు. 46.)

ఇట్లు రాజును దేవునిగా చెప్పుటయు, తన్ను తద్భక్తునిగా చెప్పుకొనుటయు, 'బంగారుపూలతో పూజచేసి కృతిని భక్తితో సమర్పింతు' ననుటయు, 'నా బిడ్డలకు మీ పేరు పెట్టుకొన్నను మీ ఋణము తీర' - దనుటయు ఆత్మగౌరవముగల నియోగి బ్రాహ్మణవిద్వత్కవియెడ - ఆకాలమున పొసఁగదు. ‡ బ్రాహ్మణులయం దత్యంత భక్తితాత్పర్యములు గల రఘునాథనృపాలు డట్టి వ్రాతలు వ్రాయించుకొనుటయును పొసగదు. మరియు వెంకటకవి,

'అవని నింతటిరా జెవ్వఁడని నుతించి
కృతులొసఁగఁ గీర్తి కలదని మతిఁదలంచి (ప. 30)

తనకుతానై యర్థించి, తనకృతిని రఘునాథునకు సమర్పించి, తన్మూలమున తాను కృతకృత్యతను గాంచినట్లు సంతసించుకొన్నాడుగాని, 'నీ కృతిని నాకంకితముచేసి నన్ను కృతార్థునిచేయవలసిన'దని రాజు - వెంకటరాజు నర్థించలేదు. ఈయంశము కూడా వెంకటకవి కులతత్త్వమును చెప్పకచెప్పు తార్కాణమే యగుచున్నది. అంత దూరమెందుకు? వెంకటరాజు తనసేవకులలో నొకడని రఘునాథుడు స్వయముగానే చెప్పుచున్నాడు; చూడండి.

'కలనయిన మిమ్ముఁగా కన్యుఁ గొలువనంటి
కృతులొకరికీను, మీకె యంకితములంటి' (వి)—ప. 48.
'క్షత్త్రధర్మమెకద నీకుఁ గలదిమొదలఁ
దమ్ములు సుతుల్ హితులుగూడ మమ్ముఁగొలిచి,
తిపుడు కృతియును జెప్పి మాకింపొనర్చితి'(వి)—ప. 51.

కొలువుకాడయ్యును వెంకటకవి తన కవితామహత్త్వముచేత ప్రభువుగారి మన్ననకు మరింత పాత్రమైనాడు. అతడు లక్ష్మణామాత్యునికుమారుడేగాని బ్రాహ్మణుడుకాడు. ఆయంశమును వెల్లడింపనొల్లకనే కాబోలు వంశవర్ణనమునే వదలివేసినాడు. మొత్తముమీద అతనికులముగూర్చిన జనశ్రుతిలో అసత్యములేదు.

ఈ తత్త్వమునెల్ల నాకళించియే శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులు,

చ. 'విజయ విలాసకర్త సువివేకి మహాకవి యన్యజాతికిన్
ద్విజునకు నుద్భవించిన సుధీతిలకుండు'— (కలగూరగంప)

అని స్పష్టముగా వక్కాణించినారు.

---

‡ చూ. తంజాపురాంధ్రనాయక చరిత్ర. పు. ౨౩౭.

## ౨ సారంగధర చరిత్ర చరిత్ర

ఈ సారంగధరచరిత్ర (పద్యకావ్య)ము యొక్క స్వరూపస్వభావాదులను గురించి చర్చించి తెల్పుకొనవలసిన యంశము లనేకమున్నవి. ఈ నాడు ప్రచారములోనున్న సారంగధర - ముద్రిత ప్రతులు మూడు. 1. వేదంవారిప్రతి, 2. వావిళ్ల వారి ప్రతి, 3. కొండపల్లివారిప్రతి. 2, 3 ప్రతులు వేదంవారి ప్రతికి పుత్రికలు. వెంకట్రాయశాస్త్రిగారీ గ్రంథమును 1910 లో ముద్రణము కావించినారు. ముద్రణము ముచ్చటగానే యున్నదిగాని అసలు గ్రంథము మాత్ర మరగొరగా నున్నది. - ఎట్లనగా ? కావ్యారంభమున నుండవలసిన భగవత్ప్రార్థనము; కృతిపతికాశీస్సు; ‡పూర్వకవి పురస్కృతి; కుకవితిరస్కృతి, మొదలగునవిగాని, కవివంశ - కృతిపతి వంశాది వర్ణనలుగాని, షష్ఠ్యంతములుగాని లేక - 'అచ్యుతేంద్ర రఘునాథనృపా' అను సంబోధనపద్యముతోనే ప్రథమాశ్వాసము ప్రారంభింపబడియున్నది. కథాభాగమునను, తొలువొల్త, ప్రబంధకవులు - (విజయవిలాసమున వెంకటకవియును) పాటించిన పురవర్ణనము, చాతుర్వర్ణ్యవర్ణనము మొదలగు గ్రంథభాగ మేమియు లేక కేవల రాజనిర్దేశముతోనే కథ బయలుదేరినది.

ఆశ్వాసారంభాంతములయందు రఘునాథుని సంబోధించు పద్యములున్నవి. వానినిబట్టి గ్రంథ మా రాజున కంకితము చేయబడినట్లు భావింపదగియున్నది; కాని ఆ పద్యములు విజయవిలాసమునుండి యెరవు తేబడినవిగాని, సారంగధర - సొంతములు కావు. గ్రంథ మి ట్లన్నివిధములను అందదుకులుగా నున్నది.

'ఇదిగో గ్రంథ మి ట్లసమగ్రముగా నున్నది. అందుకు కారణ మిది' యని ముద్రాపకులు - శ్రీ శాస్త్రిగారు మాటమాత్రము సూచనగా నైనను అన్నారుకారు. కాని 'యీ దివ్యప్రబంధము సాహసిక ముద్రణముల పాలై ఈవితీవియ పూదండ చెత్త తొట్టిం బడినదోయను కరణిం బురణించుచుండంగని, చింతించి, పాటుపడి బాగుపఱిచి ఈ ముద్రణమును...నెలకొల్పినాడ'నని ఒకవాక్యము వ్రాసినారు. ఆ సాహసిక ముద్రణ మెట్టిదో - అం దీ గ్రంథ మేరూపమున నున్నదో చూతమన్న యుత్సాహముతో, ప్రాతప్రతికై ప్రయత్నింపగా 1885 నాటి శిథిలప్రతియొకటి లభించినది. చదివిచూడగా, అందును గ్రంథ మాద్యంత మీరూపముతోనే యున్నది. శాస్త్రిగారి ముద్రణమున కదియే మాతృక. కావున అందును నా సందేహము తీరలేదు. వ్రాతప్రతులను పరికించినగాని - తత్త్వమెరుకపడదని యేర్పడినది.

---

‡ 'విజయ' లోను పూర్వకవిప్రశంస - కుకవి తిరస్కారణము చేయబడలేదు.

అంతట నేను తంజావూరు సరస్వతీమహల్ పుస్తకాలయములోని వ్రాతప్రతుల పాఠములను సంపాదించితిని. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని వ్రాతప్రతులను పరిశీలించితిని. చూడను చూడను 'సారంగధర' కావ్యము వింతవింత రూపములతో పొడకట్టసాగినది.—

శే. ర. కర్త చదివినప్రతి మూడాశ్వాసములుకలది. బ్రౌను పఠించిన ప్రతియును ఆశ్వాసవిభాగము కలదే. అప్పకవికి దొరికినప్రతిలో ఆశ్వాసవిభాగమున్నదో లేదో ఆతడు చెప్పలేదు.

తంజ. ప్రతులలో, ఒకరెంటిలో కావ్యము సర్వము నేకాశ్వాసముగానే యున్నది. అందు ఆశ్వాసాద్యంతపద్యములు లేనేలేవు. ఒకప్రతిలో విజయవిలాసపు పీఠిక పద్యములతోను, ఆశ్వాసాద్యంత పద్యములతోను - గ్రంథము మూడాశ్వాసములుగా నున్నది. మరియొకప్రతిలో - పీఠికపద్యములులేవు. ఆశ్వాసాద్యంతపద్యములు మాత్ర మున్నవి.— (ఇదే 1885 ముద్రణమునకు మాతృక.)

మద్ర. తాళ. ప్రతులలో నొకదానిలో, ఈగ్రంథము నాలుగాశ్వాసములుగా విభక్తమై యున్నది. ఆ విభాగమిట్లు.—

(1) ప్రథమాశ్వాసములోని, ౧ మొదలు ౧౧౭ పద్యమువరకును, మొదటి ఆశ్వాసము.

(2) ౧౧౭ తరువాత, 'అవధరింపు మనంతరంబ' అను నొకవచనముతో, ౧౧౮ మొదలు, ద్వితీయాశ్వాసములోని - ౧౪౯ వరకును రెండవ ఆశ్వాసము.

(3) ఆ ౧౫౦ మొదలు, తృ. లోని ౧౦౭ వ వచనములో 'అద్దేవి పరిదేవనంబు కావించుచుండె' అన్నంతవరకును మూడవ ఆశ్వాసము.

(4) అది మొదలుకొని తృ. లోని ౨౭౦. (గ్రంథాంతము) వరకును నాలుగవ ఆశ్వాసము.

ఇంకను విశేషమేమనగా - ఈ నాలుగాశ్వాసముల ఆద్యంతములయందు,

శా. 'శ్రీకంఠుఁ మునివంద్యునిఁ నిగమ సంసేవ్యుఁ హరుఁ శంకరుఁ
లోకాధీశుని భక్తవత్సలు దయాళుఁ రాజచూడామణిఁ
భూకాంతామణి స్యందనుఁ విషధరుఁ భోగీంద్ర సద్భూషణుఁ
నాకేశప్రముఖామరార్చితు నుమానాథుఁ ప్రశంసించెదఁ.'

క. 'శ్రీకర ముని మానస కమ, లాకర హంస స్వరూప హైమవతీ కాం
తాకర పీడన భక్త వ, శీకర సుగుణాభిలాష శేషవిభూషా.

క. 'శ్రీశైల బిల స్తుత సు, శ్రీశైల బిలాధివాస శిష్టాఖిల లో
కేశ సుధాభోజనపథ, కేశ సుధాభోరుదేహ కీర్తిసమూహా.'

క. 'శ్రీకంఠ భక్తవత్సల, లోకైకత్రాణ గుణవిలోల విమల సు
శ్లోకా సమగ్ర నిరత, శ్రీకా పురదైత్యహరణ శేషాభరణా.

క. 'శంకర సమస్త సుజన వ, శంకర హరిణాంకజూటు సకలాహిత నా
శంకర నిరంతరాశ్రిత, కింకర రక్షాధురీణ కేశవబాణా.'

ఇత్యాదిగా ఈశ్వరాంకితములయిన పద్యములున్నవి. ఇట్లే నాలుగాశ్వాసములుగా విభజింపబడి - ఈశ్వరాంకిత పద్యములు గల్గిన శిథిలప్రతి యొకటి తమకు భారతీతీర్థలో దొరకినట్లు శ్రీ తాపీ ధర్మారావునాయుడుగారు †భారతిలో ప్రకటించియున్నారు.

ఈకావ్య మిట్లు వివిధ ప్రతులలో వివిధాకృతులతో నుండుటకు కారణము నాకిట్లు తోచుచున్నది.

సారంగధర-పుట్టుకలో సర్వమును - ఏకాశ్వాసమే. గ్రంథ మెవ్వరికిని అంకితము చేయబడకయు, అందువల్లనే ముందు వెనుకల కొరవలు పూరింపబడకయు నిలిచిపోయినది. కాలము గడవను గడవను వ్రాయసకాండ్లు - దాదాపు 700 పద్యముల గ్రంథము ఏకటాకీన చదువుట విసుగుపుట్టించునని కాబోలు, ఎవరి యిష్టము వచ్చినట్లు వారు ఆశ్వాసవిభాగముచేసి వ్రాసికొన్నారు. ఆశ్వాసాద్యంతములు ఏ పద్యములును లేక బోసిగా నుండుట కిచ్చగింపక ఒకరు విజయవిలాసపు పద్యముల నందు చేర్చినారు. వేరొకరు స్వవిరచితములయిన ఈశ్వరాంకిత పద్యములతో ఆ తావులను పూరించినారు. ఇంకొకరు, వెంకటుకవియే ఆగ్రంథమును రఘునాథుని కంకితము చేసినట్లుగా, విజయవిలాసపు పీఠిక పద్యములతో-'అచ్యుతేంద్ర రఘునాథుఁడె శ్రీరఘునాథుఁడెన్నఁగ ' అను పద్యము వెంట;

♦గీ. 'అనుచు హరువులు భావముల్ ననుచురీతి
ధరఁజెలంగెడు సారంగధరచరిత్ర
మతులమతిఁగూర్చి ఘనుల సమ్మతులనేను
కాన్క-గావింప మది వేడుకను దలంప.'

అను పద్యమును చేర్చి గ్రంథమును సాగించినారు. ఈ యుత్తమకృతికి ప్రారంభపద్యము లేలలేకపోవలె నని ఆ కొదవతీర్చిన పెద్దలును లేకపోలేదు. తంజ.

---

† చూ. విభవ చైత్ర సంచిక.

♦ ఈ పద్యమును బ్రి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దయతో నొసగినారు.

ప్రతులలో నొకదానిలోను, మదరాసు ప్రతులలో నొకదానిలోను ఈ క్రింది పద్యములున్నవి.

ఉ. "శ్రీసతిదక్షుఁడైన సరసీరుహనేత్రుఁడు విశ్వగాత్రుఁ డ
బ్జాసన పాకశాసన హుతాశన ముఖ్య సురేంద్రరక్షితో
ద్భాస దయాసముద్రుఁడు సదానతరుద్రుఁడు భద్రుఁడర్మిలిన్
భాసురలీల లోకములఁ బ్రస్తుతికెక్కఁగఁ బ్రోచుఁగావుతన్.

చ. ఘనతరచంచరీక పరికల్పితవేణి శుకానురాగ సం
జనిత విపంచికాకలిత సారసపాణి సుధాసమగ్ర సు
స్వనయుతమంజువాణి వరచారు విలోకన 1 హంసయేణి య (?)
వ్వనజజురాణి వాణి మృదువాక్యసమృద్ధియొసంగుఁగావుతన్.

క. త్రిజగన్మంగళదాయకు, నిజభక్తత్రాణ నిరతు నిర్మలచరితున్
అజముని పూజిత చరణుని, గజముఖుఁడగు నేకదంతు గణపతిఁగొలుతున్.

సీ. వరవేదశాస్త్రార్థ వల్మీకి వాల్మీకి, వాసుదేవస్తుతోల్లాసు వ్యాసు,
రమణీయగాత్ర ప్రభారవి భారవిఁ, 2 గరకంఠహృద్భాసుఁ గాళిదాసు,
పద్మాకటాక్షసంభవభూతి భవభూతిఁ, దార్కికచర్చితో ద్దండి దండిఁ,
గలితశబ్దార్థ సంఘట్టు నన్నయభట్టు, 3 భీమలబ్ధ కవిత్వధాము భీము,

గీ. సుజననుతరాజి (?) తిక్కనసోమయాజి, భూరి కవిరాజు బమ్మెరపోతరాజు
మొదలుగాఁగల సుకవుల సదమలముగఁ, దలఁచి యంజలిగావించి తగ నుతించి.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును సుకవిజన వందనంబునుం గావించి యే నొనర్పం బూనిన సారంగధరోపాఖ్యానమునకు కథాక్రమం † బెట్టిదనిన.

సీ. ద్విజరాజ విలసనోత్తేజమై యుండియు, నక్షత్రశూన్య $వన్యాచయంబు,
చకోరేశ్వరానంద సంయోగమయ్యును, పంకజ విధ్వస్త భాసురంబు,
ఆర్య సంశ్రయధామమై యొప్పుచుండియు, విగత విరూపాక్ష విమలతలము,
శూద్ర సత్తమ వర శోభితంబయ్యును, శూద్రకరహిత విశోకయుతము,

---

తంజ. ప్రతిపాఠములు.— 1 'హంసఎణియా.' 2 'కరవిర కరకంఠహృదయ వ్యాసుఁ గాళిదాసు.' 3 'భీమలజ్ఞకవిధ్వాము భీము.'

† తంజ. పా.— 'బెటువలెనుండెను.'

$ 'పుణ్యాచయంబు.'

‡ భండ దిళదండ చండ దోర్దండ పాలి
మలయ మాళవదేశ సన్మధ్యమంబు

... ... ... ...

సాంద్రవైభవ [శుభ] కరము రాజమహేంద్రపురము.

వ అందు.— క. రాజనరేంద్రుఁడు." అని కథాప్రారంభము.

అస్వరసములును, తప్పులతప్పలును నైన పై పద్యములు చేమకూరసుకవి కృతము లనుకొనదగదుగదా. (ఈ తరగతికి చెందిన మరికొన్ని పద్యములు వేటవర్ణనకు సంబంధించినవి దొరకినవి. ప్రక్షిప్తములని స్పష్టముగా తెలియుచున్నందున వదలివేసితిని.) - ఇట్లు పలువురచేతులలోబడి గ్రంథము పలురూపములు పొందినది. దీనికంతకును మూలము ఆగ్రంథము అసమగ్రముగా నుండుటయే. అట్లసమగ్రముగా పడియుండుటకు కారణమేమో తెలియరాదు.

'విజ'— పీఠికలో వే. వేం. శాస్త్రిగారు 'సారంగధరచరిత్ర దీనికన్న మున్నుగా రచించినట్లెన్నఁదగియున్న'దన్నారు. అట్లున్నమాట నిజమేగాని, ఇదే మొదటిరచనయైనయెడల ఇట్టి చక్కని కావ్యమొకటి సర్వసిద్ధముగా చేతిలోనున్నప్పుడు కవి దానిని తనప్రభువున కంకితముచేయక దొంగలకుత్తోల నేల? పిమ్మటి కృతియైన విజయవిలాసములో సారంగధర ప్రస్తావమైనను లేకపోవుటకు హేతువేమి? అను ప్రశ్నలకు సమాధానము వెదకవలసివచ్చునుగదా ?

మొత్తముమీద మొదటిరచన యగుటచేతనో, స్వతంత్రరచన కాక మరియొకరి కృతికి అనుకృతి యగుటచేతనో (చూ. కవితావిశేషములు) మరి యే కారణముననో గాని సారంగధరచరిత్ర రచన విజయవిలాసరచనమంత సరసముగను - పరిణతముగను లేదు. చాల అశ్రద్ధగా రచింపబడినట్లగపడుచున్నది. కవి గ్రంథమును పూర్తిచేసినపిమ్మట మరల నొకతూరి పరిశీలించి సంస్కరించుకొన్నట్లును లేదు. అందువలననే యతిప్రమాదాది దోషములుకూడా అట్లే నిలిచియున్నవి.

## ౩ పాఠ పరిశీలనము

కీ. శే. వేదం వెంకట్రాయశాస్త్రిగారు పెక్కు ప్రాచీనగ్రంథములను దిద్ది ముద్రించియు, అనేక కావ్యములకు టీకలు వ్రాసి ప్రకటించియు, ఆంధ్రభారతికి అఖండసేవ చేసినవారు. సాధుపాఠమును నిర్ణయించుటయందును- సముచితార్థభావ

‡ తంజ.పా.—'భండనోద్దండ మండలాఖండ తండ, చండ దోర్దండ పాలిత మండలంబు
మలయము మాళవదేశ సన్మధ్యమంబు, సాంద్రి సుకరము రాజనరేంద్రివరము.'

తాత్పర్యముల నావిష్కరించుటయందును, వారప్రతిమానులని ప్రతీతి. ఆ ప్రతీతిని బట్టియే నేనును,

'పాండిత్యంబున కేమి ? ప్రౌఢ కవితా వ్యాపార సందర్భవాక్
శౌండీర్యంబుల కేమిగాని, రసభాస్వత్కావ్య భావార్థపుం
బండారంబును విప్పి నీ పగిదిఁ జెప్పంజాలు ధీశాలి యొ
క్కండుఁ లేఁడుగదయ్య మాకు నిఁక వేంకట్రాయధీమన్మణీ.'

అని వారి మృతికి వగచితిని. తమకుగల పాఠనిర్ణయ ప్రభావమునకు తార్కాణగా, ఆ శాస్త్రిగారే - శృం. నై. అవతారికలో 'ఉక్త బళ్ళారి వృత్తాంతము' నొక దానిని తెలుపుకొనియున్నారు. దాని సారాంశ మేమనగా.—

'రతిక్రీడా హంసమోహ గ్రహణ శశిభృత పార్థనోన్నిద్ర తారా
పతియై దుఃఖించు సత్యప్రస్మర నిజదృగ్బాష్పధారాగతుండుఁ'

అను పూర్వముద్రిణ పాఠమును, *మూలగ్రంథ సాహాయ్యము లేకయే - 'రతిఁగ్రీడా' 'గ్రహిళ' 'శిశు' 'ప్రార్థితో' 'సద్యః' 'తేందు' - అని సవరించి అర్థము చెప్పిరట. అందు కచటి పండితులు బళిబళి యని సాధువాదములు పలికి అభినందించిరట. పిమ్మట చూడఁగా ఆ సవరణ మూలమునకు సమ్మసరిపోయియుండెనట ! మూలము నెఱుగకయే అనువాదమును సవరించుట, అది మూలమునకు సరిపోవుట అద్భుతమయిన సంగతిగదా ! వారి పాఠనిర్ణయప్రజ్ఞ అంత నిపుణమన్నమాట. అట్టి ప్రజ్ఞావిశేషముగల ఆ శాస్త్రిగారే ఈ సారంగధరను పరిష్కరించి టీకతో గూడా ప్రకటించినారు. కారణమేమోగాని, పరిష్కరణము-టీకయును, వారి పేరుప్రతిష్ఠల కేమాత్రమున్ను తగినవిగాలేవు. అంతేకాదు, చూడను చూడను ఆ శాస్త్రిగారు సర్వసామాన్యములైన ప్రమాదములను గుర్తింపగల మెలకువయైనను లేనివారనియు, వారి 'ఉక్తబళ్ళారి వృత్తాంతము' ఉత్త బూటకమో, లేక 'మిడతంభొట్లజోస్యమో' అయ్యుండవలెననియు, అనుకొనుట కనువుగా నున్నవి. ఎందుకు విస్తరము ?

వారిప్రతిలో నాబుద్ధికి పొడకట్టిన పాఠదోషములు 510. వారిటీకలో నా దృష్టికందిన అర్థదోషములు 385. వెరసి 895. ఒక అయిదింటిమాటకేమి 900 అనండి. అసలు గ్రంథసంఖ్య ఆరువందల యెనభైతొమ్మిదే సుమండీ !

---

* ఆ వృత్తాంతము సత్యమే అయ్యుండవచ్చును గాని, వారు చేసిన సవరణ మాత్రము సరియైనదిగా లేదు. ఆ చర్చకిది చోటుకాదు.

శాస్త్రిగారి పాఠదోషములు 510 లోను సగానికి సగము (వారిచే నిరసింప బడిన) సాహసికముద్రణమునుండి దిగుమతియైనవే. శాస్త్రిగా రేలకనుగొనలేక పోయిరోగాని, అవి చాలా అల్పములైన దోషములు. చూడండి. మాదిరికి రెండు మూడు.

| శాస్త్రిపాఠము | సాధురూపము | పుట |
| --- | --- | --- |
| సారంగధరుఁడు | సారంగరథుఁడు | ౨౪౪ |
| నల్లని చెంగల్వదోన | చల్లని చెంగల్వదోన | ౪౦౪ |
| గగుర్పొడవఁగ | గగుర్పొడువఁగ | ౩౬ |

సాహసికముద్రణములోని ఒప్పు లనేకము శాస్త్రిగారి సవరణలో తప్పులుగా విపరిణామమును పొందినవి.—

| పుట — సా. ము. పా. | | శా. పా. |
| --- | --- | --- |
| ౧౭౫ | కలకల నగుమోము | కళకళ... |
| ౧౯౭ | పాయక తోడుకొని | పాయకఁదోడు... |
| ౩౭౨ | తాన తెలుపు | తానఁదెలుపు |
| ౨౪౯ | నావిరహార్తి | తావిరహార్తి |
| ౩౫౩ | ఒసపరి | ఒకపరి |
| ౧౯౨ | నాసదనంబు | నావదనంబు-(మొదలైనవి.) |

చాలాదోషములకు కారణము శాస్త్రిగారికి తెనుగు స్వభాష కాకపోవుటయే యనిపించుచున్నది.—

చూ. 'చటుక్కు' (పు. ౩౭౩) 'ఈదళ్ళు' (౪౨౪) 'తాళిమి' (౧౬౩) 'ఁగనఁగ' (౩౬౭)

వారు సంస్కృతమున పెద్ద పండితులని పేరు. సుప్రసిద్ధమయిన 'పరంజ్యోతి' శబ్దము నెరుగక 'పరజ్యోతి' అని దిద్దినారు; (చూ. పు. ౨౦). 'పరంజ్యోతి'కి ప్రయోగములు చాలా ఇచ్చియున్నాను. అయినను ఇంకొకటి.

'త్వంహిబ్రహ్మ పరంజ్యోతి, ర్గూఢంబ్రహ్మణివాఙ్మయే
యంపశ్యం త్యమలాత్మాన, ఆకాశమివకేవలమ్.' (భాగ. 63 - 35)

'పరంజ్యోతిః జ్యోతిషామపి ప్రకాశకత్వా దవిషయః' అనివ్యాఖ్య.— 'పరంజ్యోతిః సమస్తతేజస్సులను ప్రకాశింపజేయువాడవును' అని ఆంధ్రటీక.

సిద్ధనగౌడుని యక్షగానమునను - 'అవిరళపరంజ్యోతిస్వరూపా.' అని ప్రయుక్తమైయున్నది.

ఆంధ్రవ్యాకరణవిషయమునను శాస్త్రిగారి వ్రాతలను, సంస్కరణలను తటాలున నమ్ముటకు వీలులేకున్నది.— (చూ. 'అడలకువమ్మ - తప్పకువమ్మ.' పు. ౪౨౫.) 'వెలచేలములు' (పు. ౩౨౨.) 'చదలి' (౫౧౧) 'ప్రాయఁపు' (౧౫౦.)

యతిప్రాసదోషములకు.—(చూ. పు. ౨౫౯. ౩౬౧.)

ఆటవెలది తేటగీతులను గురుతించుటలో వారు తాఱుమారగుచుందురు. (చూ. పు. ౫౪. ౧౪౫.)

పూ. ము. లో 'ఆ. వె.' అని సరిగా నుండగా అది తప్పనుకొని శాస్త్రిగారు 'తే. గీ.' అని సవరించినారు. (చూ. పు. ౩౨౫.)

పూ. ము. లో 'గీ' అనడానికి బదులుగా 'ఉ' అని పొరపాటున అచ్చుపడినది. ఆ పొరపాటునైనను గమనింపక ఆ శాస్త్రిగారును 'ఉ' అనియే ముద్రించినారు. (చూ. పు. ౪౪౩.)

ఇట్లు పూ. ము. లోని అచ్చు పొరపాటులనైనను గమనింపక 'అసలుకు సరియైన నకలు'గా ముద్రించిన శాస్త్రిగారు - 'ఈ దివ్యప్రబంధము సాహసిక ముద్రణములపాలై ఈవితీవియ పూదండ చెత్తతొట్టింబడినదో యను కరణింబురణించుచుండం గని, చింతించి, పాటుపడి బాగుపఱచి ఈ ముద్రణమును... నెలకొల్పినాఁడను."— అని వ్రాయుట తగునా ? ఇట్టి వ్రాతలు పుస్తక విక్రేతలు వ్రాయదగినవి గాని, ప్రామాణికులును - భాషారాధకులును నైన పండితులు వ్రాయదగిన వగునా ? ఆ శాస్త్రిగారిచే ఈసడింపబడిన సాహసిక ముద్రణము ముఖపత్రముమీదగూడా, "ఈ గ్రంథము లేఖకప్రమాదజనిత దోషంబులు లేనటుల పండితుల సహాయముచేఁ బరిష్కరింపఁబడి......ప్రచురింపఁబడియె" అని యున్నది.

మరి ఆ వ్రాతకును శాస్త్రిగారి వ్రాతకును భేదమేమి ? ఏమనగా— సాహసికముద్రణపు వ్రాతను పండితలోకము నమ్మలేదు; అందువలన చెడలేదు. శాస్త్రిగారి వ్రాతను నమ్మినది; అందువలన చెడినది. ఇంతేభేదము.

శాస్త్రిగారి ప్రతి యిట్లు పూర్వముద్రణ ప్రమాదములతోను, అపపాఠములతోను, వారి దిద్దుబాటువలన పొసగిన దొసగులతోను నిండి దుర్గ్రాహ్యముగా నున్నందున గ్రంథమునకెల్ల జీర్ణోద్ధారమే కావలసి వచ్చినది. అంతట నేను బహుశ్రమకోర్చి యీ క్రింది గ్రంథసామగ్రి సహాయమున సాధుపాఠములను యథామతి సంతరించుకొన్నాను.

(1) 1885 సం. ముద్రితప్రతి.

(2) తంజావూరు సరస్వతీమహల్ తాళపత్రప్రతులు. 5

(a) 203. సమగ్రము.

(b) 204 D 279. ప్రథమాశ్వాసము 144 వ పద్యముతో ప్రారంభము. గ్రంథపాతములున్నవి. ఆశ్వాస విభాగముగాని ఆశ్వాసాంత పద్యాలుగాని లేవు. ఒకేక్రమములో వ్రాయబడియున్నది.

(c) 205. సమగ్రము. సత్వంబు నేకాశ్వాసము.

(d) 206. ఈప్రతి తృ. ఆ. లో 173 వరకేఉన్నది.

(e) 207. ప్రథమాశ్వాసములేదు. ద్వి. ఆ. రెండవపద్యముతో ప్రారంభము.

(3) మదరాసు - ప్రా. పు. భాండాగారములోని వ్రాతప్రతులు. 4

| | | |
|---|---|---|
| 877. | తాటియాకులప్రతి - సమగ్రము. | |
| 879. | కాగితముల ప్రతి - ,, | (లఘుటీక.) |
| 880. | ,, ,, ,, | (సవ్యాఖ్యానము) |
| 169. | తాటియాకుల ప్రతి. | |

(4) నవనాథచరిత్ర.

(5) బాణాల శంభుదాసుని ద్విపద - సారంగధర.

(6) కూచిమంచి తిమ్మకవి ,, ,,

(7) శబ్దరత్నాకరము.

(8) ప్రౌఢ్యనిఘంటువు.

(9) అప్పకవీయము.

పై పుస్తకములలో పాఠనిర్ణయమున నాకెక్కువ తోడుపడినది గౌరన నవనాథచరిత్ర. కారణమేమనగా ఈ సారంగధరరచన కదియే మూలము. (వివరములకు (చూ. 'కవితావిశేషములు.')

శబ్దరత్నాకరమునను, ప్రౌఢ్యనిఘంటువునను ఉదాహృతములైయున్న పద్యములవలన నాకెన్నో సంశయములుతీరినవి.

## ౪ వ్యాఖ్యాన వ్యాఖ్యానము

ఇక వ్యాఖ్యానము సంగతి.— శాస్త్రిగారు మూలముతో వ్యాఖ్యానమొకటి ముద్రించినారు. అదే పూర్వటీక. దానినే నేను, పూ. టీ. అని వ్యవహరించినాను. మూలమువలెనే ఆ వ్యాఖ్యానముకూడా బహువిధదోష భూయిష్ఠముగా నున్నదని వ్రాయవలసివచ్చినందుకు చింతించుచున్నాను.

అసలు పద్యములు 689. అందులో 90 కి-వ్యాఖ్యానము లేనేలేదు. 471 కి-లఘుటీక ఒకటి-రెండు పదములతో నే ముగిసినది. మిగిలిన 128 పద్యములకు మాత్రమే కొంచెము విపులమైన టీక. ఆ కొంచెము టీకలోను తేలిన తప్పులు 385. ఈ నాటి టీకలలో †'పాండురంగ' టీకవంటివి అత్యాధములు కొన్ని లేకపోలేదుగాని, మరీ ఇంత యన్యాయపుటీక యెక్కడను నా కగపడలేదు. తొలుత చదివినప్పుడు, ఈ టీక నిజముగా-ఆంధ్ర మల్లినాథు డనిపించుకొన్న శాస్త్రిగారిదేనా అన్న సందేహము కలిగినది. ముఖపత్రముమీది 'స్వవిరచితవ్యాఖ్య' అన్న అక్షరములను చూచుటతోనే తొలగినది.

ఆం. ప్ర. విమర్శ. అవతారికలో ఆ శాస్త్రిగారే సెలవిచ్చినట్లు - కతిపయ పదములకు సజీవ నిర్జీవ సాధనములచే అర్థమెఱుంగుట గ్రంథార్థమెఱుంగుట కాదు. గ్రంథార్థములో అన్నిపదములయర్థము, వాక్యములయర్థము, కథాసందర్భము, రసంబు నుంగూడఁజేరును. శాస్త్రిగారీకావ్యములోని అనేకపద్యములకు, వాక్యములకు, పదములకు గల - అర్థవిశేషమును అర్థమును గుర్తింపలేదు; సరిగదా - పైపెచ్చు విపరీతార్థములను వ్రాసినారు. చూడండి.

(1) చిత్రాంగి పలువరుస వజ్రముల తలలయందు మసెడిదట! (పు. ౩౪౦)
(2) సూర్యునికి మందేహులతో పోరు రాత్రియందట! (పు. ౨౭౨.)
(3) కూతలనగా - వేదపాఠములట! (పు. ౩౧౩.)
(4) అనూరునిమీద గంగ ప్రవహించినదట! (పు. ౪౭౪.)
(5) బంగారుసమూహమట! (పు. ౨౧౨.)
(6) లోకములో బంగారురూక లేదట! (పు. ౧౮౩.)
(7) సాయంకాలముయొక్క యెఱ్ఱచీకటులట! (పు. ౨౭౧.)
(8) నల్లనిచెంగల్వదొనయట! (పు. ౪౮౪.)
(9) ఆనాడు దేవదానవులు తరిచినది మందరపర్వతమునట! (పు. ౩౦౭)
(10) గుఱ్ఱముతలమీద బిరుదుగా 'తలగడ' పెట్టుమరట! (పు. ౮౭.)
(11) సుబుద్ధి సారంగధరునికి కాలు అడ్డముపెట్టినాడట! (పు. ౧౯౬.)
(12) తలగుచ్చి కౌగిలించుట యనగా శిరస్సును పొడిచి ఆలింగనముచేయుట యట!
(పు. ౨౯౦.)

---

† ఈ గ్రంథములో దొరలిన పాఠదోషములు పెక్కులు శాస్త్రిగారు తమ యొద్ది ప్రతిలో సవరించిపెట్టుకొనియున్నారని వినికి. అది నిజమే యయినచో శిష్యులు వానిని వెల్లడింతురుగాక.

(13) ఒడ్డకట్టులనగా - వేవి భ్లట!! (పు. ౨౬౨.)

(14) ‡ మాడెత్తుమాట - అంటే, అధికమైనమాట యట ! (పు. ౫౯.)

ఎన్నని చూపించను ? వ్యాఖ్యానమంతా యిట్లేయున్నది.

నిఘంటువులలో నున్న పదములకును అపార్థములు వ్రాసినారు.

| పుట | పదము | శా. టీ. | సరియైనఅర్థము |
|---|---|---|---|
| ౬౫ | కాఱడవి | నల్లనైన వనము | దట్టమైనఅడవి |
| ౬౯ | కారుపోతు | మదించినదున్న | అడవిదున్న |
| ౭౯ | పంచకము | గుండెలు | గుఱ్ఱముయొక్క పిరుదు |
| ౧౭౬ | కోశేరు | నాగటిచాలు | కాడికి తలక్రిందుగాగట్టిన నాగలి |
| ౨౪౬ | వసులపాతర | ఇనుపమేకులస్థానము | పందెపు కోడిపుంజు |
| ౧౮౧ | పికము | చిలుక | కోకిల |
| ౨౮౩ | లతాంతము | చిగురు | పువ్వు |
| ౨౫ | నుదుటఁ | కంటిఱెప్పమీఁద | నొసటియందు |

పాఠకులారా, చిత్తగించితిరా వ్యాఖ్యానవైఖరి ? చిట్టచివరకు 'పికము = చిలుక; నుదురు = కంటిరెప్ప' అనేవరకు దిగినదికదా ! మరి యీ పనికిమాలిన కసు మాలపు వ్రాత - అంతా, ఆ శాస్త్రిగారిదే అయ్యుండునా ? 'స్వవిరచితవ్యాఖ్య' అని ఆయనగారు వ్రాసిన వ్రాసిరిగాక నమ్మదగియున్నదా ! కాకపోతే మరి,

## ౫ పూ. టీ. కర్త యెవరు ?

అంటారా ? మనవిచేస్తాను. సత్యము చెప్పక తప్పదుగనుక చెప్పుచున్నాను. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున ప్రతిపద టీకా సహితమైన కాగితపు వ్రాతప్రతి యొకటి యున్నది † అందలి టీక వాడుకభాషలో ఉన్నది. శాస్త్రిగారు

‡ 'గోరంతదీపంబు కొండలకువెలుగు - గోపాలక్రిష్ణమ్మ గోవులకువెలుగు;
మాడంతదీపంబు మేడలకువెలుగు - మాచిన్ని అబ్బాయి మాకళ్ళ వెలుగు'
— గేయము. (ప్రాచీనము.)

† 'ఆటీకను వ్రాసినవారు జూలూరి అప్పయ్యగారు, అని అంటారు కాని మనుచరిత్రకు చక్కనిటీక వ్రాసిన ఆ పండితుడు - 'పికము = చిలుక' - 'నుదురు= కంటిరెప్ప' అనురీతి తప్పుటీకలు వ్రాయునా ?

బ్రౌను - అప్పయ్యగారినిగురించి యిట్లు వ్రాసినాడు.

'Zuluri Appaiia, a poet and grammarian who at my desire wrote Telugu commentaries on the Manucharitra, the Vijaya-vilasam and some other poems.'

Other poems లో సారంగధరచరిత్ర ఉన్నదికాబోలు !

ఆ టీకనే యెత్తి వ్రాసికొని, లేదా వ్రాయించుకొని, గ్రంథవిస్తరభీతిచే కాబోలు లఘూకరించి, తమ సొంతటీక యనిపించుటకు కాబోలు నిజ గ్రాంథికభాషలోనికి మార్చి ముద్రించినారు. వారు ఆభాషను మార్చినవిధమూ, ఆ మార్పువల్ల ఆ టీకకు కలిగిన గుణదోషములు మీకు తెలియుటకు కొన్ని పంక్తు లుదాహరిస్తాను.

(1) వ్రాతప్రతి. (౧-౮. క్రింద.) "యీ పద్యగీతిలో కర్తృ పదము 'ఆరాజు' అని చెప్పుటచేతను ఆ రాజనరేంద్రునియందు చంద్రత్వారోపణచేసి అర్థద్వయము గలుగచెప్పినాడు."

శాస్త్రిగారిమార్పు.— 'ఈపద్యములో రాజనరేంద్రునియందు చంద్రత్వారోపముచేత అర్థద్వయము కలదు.'

చంద్రత్వారోపమునకు గల కారణము, శాస్త్రిగారి మార్పులో ఎగిరిపోయినది.

(2) వ్రా. ప్ర.— (౧—౩౭) "చొక్కులురంజిల్లన్ = శ్రమనివారణమయ్యేటట్టుగా."
శా. మా.— 'శ్రమలు నివారణమగునట్టుగా.' (తప్పు. చూ. పు. ౮౧)

(3) వ్రా. ప్ర.— (౧ - ౫౩) "ఆరితేరి"
శా. మా.— 'ఆఱితేఱి' (తప్పు. చూ. పు. ౫౫.)

(4) వ్రా. ప్ర.— (౧ - ౧౧౨) "శిలాపట్టభంగములు.— సిలా = రాళ్లయొక్క, పట్టభంగము = మెట్లు."
శా. మా.— 'శిలా = రాతియొక్క, పట్ట = బల్లలయొక్క, భంగంబులు = మెట్లు.' (తప్పు. చూ. పు. ౧౨౯.)

(5) వ్రా. ప్ర.— (౨-౮౭) "రూకంతగానిలేదు.— రూకకంటే అధికములేదని అర్థము; బంగారు రూకలే నని భావము."
శా. మా.— 'రూకం. . . లేదు = ఇంచుకంతయేని లేదు. (బంగారురూక లేదనియు భావము. (తప్పు. చూ. పు. ౧౬౮.)

(6) వ్రా. ప్ర.— (౨-౧౬౦) "సంజక్రొంజీకటుల్ = సాయంకాలపు సంధ్యారాగములు."
శా. మా.— 'సంజ కెంజీఁకటుల్ = సాయంకాలముయొక్క యెఱ్ఱచీఁకటులు.' (తప్పు. చూ. పు. ౨౭౨.)

(7) వ్రా. ప్ర — (౨-౧౮౮) "ద్విజకులమ్ముల కూఁతలు = బ్రాహ్మణసమూహముల యొక్క ధ్వను లని యర్థాంతరము."
శా. మా.— 'ద్విజ. . .తలు = బ్రాహ్మణసమూహముల వేదపాఠములు. (తప్పు. పు. ౩౧౩.)

(8) వ్రా. ప్ర.— "విషాణ = కొమ్ముల"

శా. మా.— 'విషాణ = కొఅలతో' (తప్పు. పు. ౪౩౪.)

మరియు, శాస్త్రిగారు గ్రహించిన ముద్రణప్రతిలోని మూలమునకును, టీకా పుస్తకములోని మూలమునకును పాఠములలో కొన్ని భేదములున్నవి. వానిని గమనింపక వారట్లే ముద్రించినారు. అందువల్ల శాస్త్రిగారి టీకలో మూలభిన్నములు; అమూలకములు నగు పదము లనేక మేర్పడినవి. మచ్చుకొక నాలుగైదు.—

| | మూలములో | టీకలో |
|---|---|---|
| ౧-౫౩ | ప్రాదుర్భవంబై | ప్రాదుర్భవంబునన్ |
| ౧-౭౫ | తమతోడ | తమితోడన్ = ప్రేమతో |
| ౧-౮౦ | ఇరువంకలను | ఇరు పక్కియలన్ |
| ౧-౧౨౭ | గ్రస్త | స్రస్త |
| ౧-౧౨౭ | [1]బిరుదైక | బిరుదాంక |
| ౨-౧౬౯ | వాల్నిలిపి | [2]వాలుపఅపి |

అమూలకములు - వానికి టీక.

| | |
|---|---|
| ౧-౬౧ | విజృంభించి = సామర్థ్యమును ప్రకాశింపఁజేసి |
| ౧-౮౨ | వాగెలోన్ = కళ్లెమును తగిలించుటలో |

ఈ యుదాహృత గ్రంథమువల్ల, శాస్త్రిగారు మూలగ్రంథమును వలెనే - టీకను గూడా సవరించినవారేగాని తత్కర్తలు కారని నిర్వివాదముగా ఏర్పడినదిగదా. ఇట్టి బహిరంగసత్యమును మరుగుపరిచి, పెద్దలయిన శాస్త్రిగారు— ఆటీకను 'స్వరచిత వ్యాఖ్య'గా ప్రకటించుకొన్నారు. అంతటితో తృప్తిపడక, 'విజ' - 'విన్నపము'లో—

'సారంగధరచరిత్రమును మద్విరచిత విపులవ్యాఖ్యతో పూర్వతరమాసంబున ప్రకటించినంతట దానిని రసికులు హర్షపూర్వకముగా పరికించినవారై ...యీ రసోత్తర ప్రబంధమును సయితము ఎల్లవారికిని సుబోధంబగునట్లు *మద్విరచిత విపుల వ్యాఖ్యానముతో ప్రకటింపుదునుగాక యని తమ యాప్సితమును దెలియఁజేయుడు... ‡సకల సౌకర్య సంపన్నంబుగా ఈ ముద్రణమును సమకూర్చినాఁడ.'

---

1-2 ఫుట్‌నోటులో ప్రమాదమున జారిపోయినవి.

* ఆ రసికులు 'త్వద్విరచిత విపుల వ్యాఖ్యానముతో ప్రకటింతువుగాక' అని అనియుందురుగాని 'మద్విరచిత వ్యాఖ్యానముతో ప్రకటింపుదునుగాక' అని అనియుందురా ?

‡ విజయవిలాస టీకకూడా తప్పులతో నిండియున్నదని శ్రీ తాపీ ధర్మారావునాయుడుగారు ఆంధ్రదేశమున అనేక స్థలములలో (నెల్లూరిలోను) ఉపన్యాసములు చేసియున్నారు. ఆ టీకయును శాస్త్రిగారి సొంతము కాదటగదా !

అనియును వ్రాసినారు. ఎంతటి సాహసము! ఇతర రచనను స్వరచితముగా ప్రకటించుట గొప్ప తప్పుకదా! సత్యమేనాటికైనను బయటపడక మానదన్న సంగతి నెఱిగిన పండితులయ్యును శాస్త్రిగారిట్టి కక్కుఱితి కేల పాలుపడిరో! మూల గ్రంథమును సరిగా చదివి సంస్కరింపకయే - 'యీ దివ్యప్రబంధము సాహసికముద్రణముల పాలై - (చెడియుండఁ) గని, చింతించి, పాటుపడి బాగుపఱిచి ఈముద్రణమును... నెలకొల్పినాఁడను' అనియు, ఏనాఁడో - ఎవరో వ్రాసియుంచిన - ఒక అనామకపుటీకను సంగ్రహించి - రూపుమార్చి - 'స్వరచిత-విపులవ్యాఖ్య'యనియు, అలీకమును లిఖించుటవలన, ఆ శాస్త్రిగారి సమాఖ్యకు గలిగిన కళంకముకంటెను సారస్వతమునకు గలిగినముప్పు గొప్పది. వెంకట్రాయశాస్త్రిగారు గొప్పవిమర్శకులు; వారిగ్రంథములు సుపరిశోధితములు; నిర్దుష్టములు - అన్న నమ్మకమున సామాన్యులే కాక విద్వాంసులు సైతము - ఈ సారంగధరలోని అసాధుపాఠములను అపరిశీలితముగా గ్రహించుటయు, తన్మూలమున ఆయా కృతులు దోషదూషితములగుటయు తటస్థించినది. ఈ యంశము ప్రాజ్ఞలోకమునకు తెలియుటకే - శాస్త్రిప్రతిలోని తప్పులు వావిళ్ళవారిప్రతిలోని కెక్కినవిధమును, శా. ప్ర. లోని అపపాఠములు సూర్యారాయాంధ్ర నిఘంటువున నెలకొన్నతావులును, నా టీకలో అందందు చూపియున్నాను.—

విషయవిస్పష్టతకు ఇంకా, ఒకటి రెండుదాహరణలు:—

గా. హరి. పూ. ము. లో - "సురుఁగకచొచ్చి కాసుకు నన్నుఁగొనక" అని యున్నది. 'కాసుకు' అనుట 'నఃకా' సూత్రమునకు విరుద్ధమని, వేదంవారు 'కాసుగ' అని దిద్దివేసినారు. (చూ. పు. 58.)

'కాసుకుగొను; చీరికిగొను, పూరికిగొను, అను పలుకుబడులు వ్యవహారసిద్ధములు. వ్యవహారసిద్ధమైన భాషయే గౌరన గ్రహించినది, 'కాసుకుఁగొనరు' అను పలుకుబడిని ఆ కవి నవ-చరిత్రలోఁగూడా వాడినాడు.—

'భామలు కోరి తప్పకచూచిరేనిఁ, గామునిమదిలోనఁ గాసుకుఁగొనరు.' (పు. 155)

కావున 'కాసుకు' అనునదే కవిపాఠము. తత్త్వమిట్లుండగా, సూ. ని. కవిపాఠమును కడకుద్రోసి 'కాసుగ నన్నుఁగొనక' అన్న శాస్త్రిపాఠమునే గ్రహించినది.

నామిత్రులు, గద్వాలసంస్థాన విద్వాంసులచే 'అపరపాణిని' యని వినుతింపబడిన ప్రసిద్ధపండితులు, బ్ర. సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, విద్యార్థుల కొరకు 'ఆంధ్రప్రబంధకథలు' అని యొకగ్రంథము వ్రాసినారు. అందులో ఈ 'సారంగధర' పద్యము లుదాహృతములై యున్నవి. శాస్త్రిగారి అపపాఠము లక్కడి

కిని ఎక్కినవిగదా! ఎందుకెక్కవు? వే. వేం. శాస్త్రిగారిపాఠము నిరుపద్దముగదా అని 'సన్నిధాన'పండితులు పరిశీలింపకుండానే పరిగ్రహించినారు. ఇట్లు 'ఆంధ్ర మల్లినాథు'ని పరిష్కరణములను - వ్యాఖ్యానములను నమ్మి తప్పులకగ్గమైన ప్రాజ్ఞులెందరో! ఇక నమబోటి అల్పజ్ఞుల సంఖ్య కంతమేయుండదుగదా! నా సొంతవిషయముకూడా ఒకటి మనవిచేస్తాను.

నేను రఘువంశము - మేఘసందేశము తెనిగించుదినములలో శాస్త్రిగారి వ్రాతలమీద ఎక్కువ లక్ష్యభావము కలిగియుండెడివాడను. అందువలన వారిభాష కొంత నా రచనలలోనికిని చొచ్చుకొన్నది. సహజమేగదా! రఘు. 5-44. టీకలో వారు ఏనుగుదంతములను 'కోఱ'లన్నారు. ఆ వ్రాతను నమ్మి నేనును 'కోఱ'లనియే అన్నాను. ఏనుగుదంతమును 'కొమ్ము' అనవలెనుగాని 'కోఱ' అనరాదని యిటీవల తెలిసికొన్నాను. ('పలుగొమ్ములమెకము = ఏనుఁగు' - శ. ర.; "ఎన్నికమీఱుచుం బెరిగె నేనిక కొమ్మున దాదిలోమ్మునక్" రుక్మాం.)

ఇట్లు వేదంవారి అపశబ్దములు, అపపాఠములు, అపార్థములు, అప్రయోగములును ఈ నాటి కోశములలోనికిని - కావ్యములలోనికిని ప్రాకి పాతుకొనియున్నవి. పాతుకొనుచున్నవి. దీనికంతకును మూలమేమి?

శాస్త్రిగారి వ్రాతలన్నీ నిరుపద్దములేనన్న నమ్మకమేగదా! శాస్త్రిగారు పండితులైనను, వారికిని భ్రమప్రమాదములుకలవు. కావున వారివ్రాతలనుగూడా గట్టిగా కనిపించి కైకొనుట మంచిదని విద్వల్లోకమునకు విన్నపము.

ప్రకృతమునకు వత్తము - 'పూ. టీ. కర్త ఎవడో ప్రాచీనుడుగాని శాస్త్రిగారు కా'రన్నది ప్రకృతాంశము. ఇప్పట్టున చెప్పవలసిన గొప్ప విశేషమొకటి యున్నది.

సారంగధరటీక- స్వవిరచిత విపులవ్యాఖ్యానమనియు, 'దానిని చదివిన రసికులు (ఎవరో?) హర్షించి, అట్టి వ్యాఖ్యానమునే 'విజయ' కున్ను వ్రాయవలసినదని కోరగా, వారికోరిక మేరకు పాఠనిర్ణయ వ్యాఖ్యానరచనాది పరిక్లేశము వహించి సకలసౌకర్యసంపన్నంబుగా ఈ ముద్రణమును సమకూర్చినాఁడ'ననియు గ్రంథముఖమున ప్రకటించిన శాస్త్రిగారే బ్ర॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారితో - ఏసందర్భముననో ‡'సారంగ - విజయవిలాస టీకలు రెండును నేను రచించినవి కావు.' అని

---

‡ భారతి. విభవ-వైశాఖము.—

'శ్రీ శాస్త్రులవారు విజయవిలాస సారంగధర చరిత్రములకు టిప్పణులను తమ యొద్దఁ బనిచేయుచున్న యొక గ్రంథకర్త, అప్పయపంతులుగారి ప్రాఁతటీక ననుసరించి వ్రాసికొనివచ్చియిచ్చిన లఘుటీకను సరిపఱిచి రచించిరట! అట్లు సరిపఱుచుటలో నా లఘుటీకలోని ప్రమాదములు కొన్ని యపరిశీలితములుగా నట్టె విడువఁబడియుండునని శాస్త్రులవారు నాతోననిరి.'

చెప్పిరట! శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ఆ సంగతిని, ఆంధ్రవిశారదులు, తాపీ ధర్మా రావునాయుడుగారు 'విజ' - 'సారంగ' టీకలలోని లోపములనుగూర్చి విమర్శించి వెంకట్రాయశాస్త్రిగారికి ఒత్తిడికలిగించిన సందర్భములో — శ్రీ శాస్త్రిగారికి సాయ పడుతలంపుతో - బయటపెట్టినారు. అందువల్ల వెంకట్రాయశాస్త్రిగారికి కలిగిన ఉపకారమేమోగాని, వారు అన్యరచితములను స్వరచితములుగా ప్రకటించుకొన్న మాట మాత్రము నిజమని స్పష్టపడినది.

మరియు ప్రభాకరశాస్త్రిగారు 'సారంగ'-టీకాదోషములనుగూర్చి యిట్లనిరి.- 'అట్లు సరిపఱుచుటలో నా లఘుటీకలోని ప్రమాదములు కొన్ని యపరిశీలితములుగా నట్టె విడువఁబడియుండునని శాస్త్రులవారు నాతో ననిరి. అది యట్లే యుండును. ఏల నఁగా, ఉప్పనైనట్టి - అను పదమునకు గొప్ప అని జూలూరి అప్పయపంతులుగారి టీకలో నుండఁగా (ఉన్నట్లు ధర్మారావుగారు వ్రాసిరి.) శాస్త్రులుగారి టిప్పణిలోఁ గూడ నదేకలదు. శాస్త్రులుగారు స్వయము ఇట్టు వ్రాయుదురని నేను నమ్మఁజాల నయ్యెదను.'

తప్పును గుర్తింపలేకపోవుట; ఒప్పుగాభావించి ప్రకటించుట - స్వయము తప్పుచేయుటయే యగును. 'ఉప్పనైన = గొప్ప' అన్న తప్పు టీకను శాస్త్రిగారు స్వయము వ్రాయకపోయినను, చదివి - సమ్మతించి- సరిపఱిచి ప్రచురించిరి కావున ఆతప్పు వారు సొంతముగా జేసినదే యగుచున్నది. దొరకిన దోసగు అది యొక్కటే యైనచో జారుపాటనవచ్చును. అట్టి దోసగులు నూరులసంఖ్యకు మీరినప్పుడు? ఎందుకు ముఖప్రీతివ్రాతలు! 'ఉప్పనైన = గొప్ప' అను తప్పునకు తోడుబోయిన తప్పులు - ఆశాస్త్రిగారు స్వయము వ్రాసినవి - వారి యితరటీకలలో విరివిగా నున్నవి. ఆ టీకలను సునిశితముగా చూడనివారు 'నమ్మఁజాల'మనెదరు - కాని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు మాత్రము వేదంవారి వ్రాతలలోని నెరసుల నెరుగనివారు కారు. ఎరిగియు 'నేను నమ్మఁజాలనయ్యెదను' అనుట యెందువల్లననగా; తమకు సహజమగు పరాపకర్షణ పరాఙ్ముఖతచేతను, వే. వేం. శాస్త్రిగారియెడ గల విశే షాభిమానముచేతను. దేనిచేతనైన నేమి 'నమ్మఁజాల' ననిరిగదా! ప్రాజ్ఞులు వారే అట్లు సెలవిచ్చినప్పుడు ఇక సామాన్యులు నమ్ముటెట్లు? శ్రీ శాస్త్రిగారిని నమ్మించు టకు కాకపోయినను సామాన్యలోకమును హెచ్చరించుటకైనను - వేదంవారు స్వయము వ్రాసిన తప్పులు కొన్ని తెలియజెప్పుట అవసరము కావున (గ్రంథవిస్తరభయమున) రకమున కొకటి - రెండుగా మాత్ర ముదాహరిస్తాను.

## ౬. పాఠదోషములు

### ౧. గళాసిక

శృంగారనైషధము:— 'సురతతాండవంబునకుఁ గళాసిక యగు పారవశ్యంబు నకుఁ గుసుమకార్ముక నర్మకర్మ కాండకేళీసమాపనా శర్మసారంబు సమవిభక్తంబుగాఁ బంచికొని యనుభవించుచు.' (7—187.)

'గళాసిక = గండగత్తెర (ఆతాండవమును ఆఁపునది యనుట - గళ = కంఠము యొక్క - అసిక = కత్తెర - స్వార్థికప్రత్యయము చేరినందున పుంలింగము స్త్రీలింగ ముగా మారినది.)' అని, సర్వం - వ్యాఖ్య.

'గళాసిక' అనుట తప్పు. 'సురతతాండవమునకు పారవశ్యము - గండగత్తెర' యనుట అనుచితము.— అది 'కళాసిక' గాని 'గళాసిక' కాదు. 'కళాసిక = తాండ వాదుల చివరఁ గావించు కృత్యవిశేషము.' (సూ. ని.)

(1) సీ. 'శిఖితాండవము కళాసిక చేసి సడలించెఁ
గఱకుటేఁకలపేరి కాసెబిగువు.' (పాండు. ౪-3౭)

(2) వ. 'మత్తవనమయూర మత్తకాశిని సకల మధురకంఠ
కేకా గీతికావసానంబునం § గళాసించె.' (కాశీ. 3-౨3).

(3) ద్వి.- 'అల మహానటుఁడు సంధ్యాతాండవంబు
లలినటియించి కళాసించుగతిని.' (నవ. పు. 67.)

'కళాసిక' - తెనుగుపదము. సంస్కృత మనుకొన్నందువలన 'గళాసిక' యై తుదకు 'గండగత్తెర' యైనది.

### ౨. వ్రయ్యవడు

క. 'వ్రయ్యావడకుండ నాడిరి
వియ్యపుమేలంబు లుభయవిధబాంధవులుఁ' (శృం. నై. 6-109)

'వియ్యపు - మేలములు = పరిహాసములు, వ్రయ్యావడకుండఁ = తునియ క్రింద పడకుండునట్లుగా - (ఒకమాటకైనను బదులు మానక - లేక - ఎడతెంపులేకుండ) ఆడిరి'.— సర్వంకషావ్యాఖ్య.

మాటలు వ్రయ్యుటయు, అవ్రయ్య = వ్రక్క - (=ఖండము) క్రిందపడుటయు లోకములో లేని వింతసంగతి. కావున శ్రీవారి టీక సరియైనదికాదు.

---

§ 'గళాపించె' అని వావిళ్ళవారిప్రతి.

'ప్రయ్యవడు' (అని సరియైన రూపము.) = నిందపడు. వియ్యాలవారు-(అనుచిత ప్రసంగములతో) ప్రయ్యవడకుండ = నిందపడకుండా - నాజూకుగా సరసము లాడుకొన్నారని సరియైనయర్థము.—

'ప్రయ్యవడు' శ. ర. లో లేదు. భారతమునను, శ్రీనాథుని ఇతరకృతులలోను ఉన్నది.

(1) 'పురుషహీనయైనఁ బరమపతివ్రత
యయ్యు జగముచేతఁ బ్రయ్యఁబడదె ?' (ఆది. 6-256.)

ప్రయ్యి, ప్రయి, ప్రై.—

(2) 'పంకజసూతిపై నెరయఁ బ్రయ్యెడి వేగమ యగ్నిఁ జొచ్చెదన్.'
—కాశీ. 5-163

(3) 'ప్రయిమాలి యేమిటి కయినను గర్థించు.' (శాంతి. 3-399)

(4) 'బన్నములన్నియుం దెలిపి ప్రైయిడ నేయనిపోయె నార్తయై.'
—విరాట. 2-154.

(5) 'ప్రైవడిపోయెఁగాక ధృతరాష్ట్రుఁడు గన్నదియేమి యాసభన్.'
—కర్ణ. 3-224.

## ౩. గొడ్డునీఁగి

శృం. నై.— ప్రాచీన (1915) ముద్రణమున,

సీ. 'రజతాచలంబేలు రాజు పట్టపుదేవి
గౌరి యెవ్వనిఁ గాంచె గొడ్డువీఁగి.' (6-72.)

అనియున్నది. శాస్త్రిగారికి దొరకిన తాళ. ప్ర. రెంటిలోను - 'వీఁగి' అనియె యున్నదట. అయితే ఒక పూ. ము. లో మాత్రము 'గొడ్డు - నీఁగి' అని యున్నదట. వారు తాళప్రతుల పాఠము నుజ్జగించి 'నీఁగి' నే గ్రహించి-"గొడ్డు = వంధ్యాత్వమును, నీఁగి = (లేక లేక కడుపు తనియ - రూ. ఈఁగి) తీర్చుకొని" అని వ్యాఖ్యానించినారు. 'గొడ్డు వీఁగి' అనునదే సరియైన పలుకుబడి.

బ్రౌను 'కొంతకాలంబు పోయిన గొడ్డువీఁగి - కాంతి జితహేమ సుమగర్భగర్భమయ్యె' (వేం. పంచ. 5-5) అను ప్రయోగమిచ్చి, - 'వీఁగి = వదలి' అని యర్థము గూడా చెప్పినాడు. మరికొన్ని ప్రయోగములు.—

(1) 'గొడ్డువీఁగి కనియెఁ గొడుకు నెంతయు మూర్తి
మంతు నెలఁతలందు మహితభాగ్య.' (హరి. పూ. 5-165.)

(2) 'కని ప్రాచి గొడ్డువీఁగంగ రత్నమువంటి
పుత్రసంతానంబు పుట్టెననఁగ.' (రామాభ్యు. 2-106.)

(3) 'కానక కానక గొడ్డువీఁగి-కాం, చిన తనయుండవీవు.' (పరమ. 2-174).

(4) 'దండినోములునోచి తన గొడ్డువీఁగి కడపట నీయట్టి కల్యాణశీలు,
గొడుకుఁగాఁగని.' (నవనాథ. పు. 71.)

(5) 'నిను మేదినీ, గుప్తికెక్కని యెట్టకేనియు గొడ్డువీఁగితినంచు'
(భా. రా. అయో. 73)

(6) 'గొడ్డువీఁగి కన్నబిడ్డండుగావున.' (కాశీ. 4-87)

౪. కిటకిటని

క. "కీల్జడకటినటి, యింపం గిటు కిటని కా నొకింతచలింపఁ" (విజ. 3-79)

'కిటకిటని = కిటకిటమనెడి' అని వారిటీక.

'కిటకిటని (కిటకిట + అని) కొను', అనుపాఠము తప్పు.

'అని కొను = అనెడి కొను' అనుటీక అంతకంటెను తప్పు.—

'గిటగిటని' (= సన్నని) అని సరియైనపాఠము. గ్రామ్యములో 'గిటగిటన' క్రిందనున్నది. శ. ర. లో. † "గిటగిటన = అల్పము, కృశము, సూక్ష్మము. (విశేషణమగుచో 'గిటగిటని నడుము'-)" అని స్పష్టముగా చెప్పబడియున్నది.

'కటిభరము పొంకమును గిటగిటని నడుము' (పరమ. 3—125.)

## ౭. అర్థదోషములు

### ౧ పంకరుహాయతాక్షి

శృం. నై.— "పంకరుహాయతాక్షి = కమలములవంటివి - నిడుదలును అగు నేత్రములు కలదైన యీ దమయంతియొక్క—" (పు. 296)

'పంక...తాక్షి' యనగా, 'పంకరుహములవలె ఆయతములయిన అక్షులుకలది' యని సరియైన యర్థము. వ్యాఖ్యాతలుచెప్పిన యర్థము శాస్త్రవిరుద్ధము.

### ౨ అంపకోల

'ఆముక్త' — "అంపకోలఁ = బాణపుఁ గట్టెచేతను" (పు. 458)

---

† ఆశాస్త్రిగారే, గొ. హరి. (పు. 165) లో - "కటకటా, భారమెక్కడ నుండివచ్చె - గిటగిటనైన యీ కీరవాణికిని" అన్నచోట 'గిటగిటనైన = అల్పమయిన' అన్నారు. 'అల్పమయిన కీరవాణి' అంటే అర్థమేమో!

'అంపకోల' యనగా 'బాణమే' గాని 'కట్టె' కాదు.—

'అంప = బాణముయొక్క, కోల = కట్టె' అని యర్థముచేయుట ఎరుక చాలమిచేత.

ఆ. వె. 'వింటఁదొడిగి యేయ వెసఁ జనునెంత ద
వ్వంత దవ్వు చనునె యంపకోల
దేవుఁడైన రిత్తచేవైవ?' (కళా. 7-202)

## ౩ ఉద్యానము - వల్లకాడు

హితో. చం.— "అస్తిజీర్ణోద్యానే మందవిషో నామసర్పః" అని మూలము. 'వల్లకాటిలో మందవిషమని పామొకటి యుండెను' అని శాస్త్రిగారి తెనిగింపు. (పు. 247.)

జీర్ణోద్యానమనగా, 'పాడుబడినతోట'గాని 'వల్లకాడు'కాదు. హితోపదేశమును ఆంగ్లీకరించిన 'కేల్' పండితుడు - 'జీర్ణోద్యానం - an old garden' అనియే అన్నాడు. 'ఆప్టే'- నిఘంటువులో 'జీర్ణోద్యానం - ruined or neglected garden' అని చెప్పబడియున్నది. కాబట్టి, 'జీర్ణోద్యానము = వల్లకాడు'అనుట విపరీతపాండిత్య మనిపించుకొంటుంది. (ఇక్కడ చెప్పవలసిన విశేషములు కొన్ని కలవు. స్థలసంకోచముచేత సంక్షేపించితిని.)

## ౪ సూర్యకాంతములు

శృం. నై.— 'ఎండకు సూర్యకాంతములును వెన్నెలకు చంద్రకాంతములును కరఁగును.' (పు. 730)

'ఎండకు సూర్యకాంతములు కరఁగు' ననుట తప్పు. సూర్యకిరణ స్పర్శచేత సూర్యకాంతము వేడి యెక్కునుగాని కరగదు. ఆ వేడి యెక్కుటనే భర్తృహరి యిట్లు చమత్కరించి చెప్పినాడు.—

"య దచేతనోపి పాదైః స్పృష్టః ప్రజ్వలతి సవితు రినకాంతః" — శార్ఙ్గధరపద్ధతి. భట్టమురారి మహాకవిమాటలు వినండి.—

"ఉద్దామద్యుమణిద్యుతి వ్యతికర ప్రక్రీడ దర్కోపల జ్వాలాజాల జటాల జాంగలతటీ నిష్కూజకోయష్టయః" (అనర్ఘరాఘవము.)

"నలినీబాంధవ భానుతప్త రవికాంతస్యంది నీహార కందళితో చూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముల్ దెల్పెడిన్" అను మనుచరిత్ర పద్యమైనను స్ఫురింప లేదు కాబోలు శాస్త్రిగారికి!

## ౫ వామ

ప్రతాపరుద్రీయము:—

క. 'ఊరఁగల వామ లెల్లరు, నీరాణిని నీమెఫ్రూజ నీక్షించినచో
సారమతి నల్ల యనసూ, యారుంధతులగుట కొక్క యంకిలియున్నే' (9-2).
'వామలు = కుటిలస్త్రీలు' అని వారిదే టీక.

వామాశబ్దమునకు 'కుటిలస్త్రీ' యను అర్థము కోశములలో లేదు. పై పెచ్చు 'ఉత్తమస్త్రీ' యని యున్నది.

"వామ = ఉత్తమస్త్రీ" (శ. ర.)

"వామ - A woman, A lovely woman" (ఆప్టి)

"వామ - సుందరమైనస్త్రీ" (బ్రౌను.)

"ప్రతీపదర్శినీ వామా వనితా" (అమరము.)

"వామా - వమతి సౌందర్యం ఇతి. యద్వా వమతి ప్రతికూలమేవార్థం కథయతి - యద్వా వామః కామో స్త్యస్యా ఇతి - సామాన్యాస్త్రీ ఇత్యమరః - యథా గీతగోవిందే.—"శ్లిష్యతి కామంచుంబతి కామపి కామపి రమయతి వామామ్, పశ్యతి సస్మిత చారుపరా మపరా మనుగచ్ఛతి, రామామ్." (శబ్దార్థకల్పద్రుమము)

క. 'భూమినుమనోమరద్రుమ, వామాప్రద్యుమ్న' (కావ్యా. సం. 2-175.)

చ. '...రాశికెక్కి యిన సత్కృతిఁగైకొను కన్యకన్య, శా
శ్వతమతి నిట్లుగామనిన వామయె వామగదమ్మ కోమలీ'. —వసు. 6-57.

వ. 'ఇవ్విధంబున నవ్వామ.' (దమయంతి.) (శృం. నై. 7-187.)

శ్లో. 'అగశ్శతం విదధతోపి సమిద్ధకామా
నాధీయతే పరుషమక్షర మస్యవామాః' (నైష. 11-92)

'వామాః - స్త్రియః' అని వ్యాఖ్య.

కావున 'వామలు = కుటిలస్త్రీలు' అనుట సరిగాదు. 'వామత్వేన వక్రస్వభావత్వేన వామా' అను వ్యుత్పత్తినిచూచి 'వామ = కుటిలస్త్రీ' అనుకొన్నారుకాబోలు. పొరపాటు. అట్లయినచో - 'అల్పం బలమస్యాః అబలా' అనియున్నది కావున 'అబలా = దుర్బలస్త్రీ (= లేవలేనిఆడది) అని చెప్పవచ్చునుగదా! అట్లైవరైనను వ్రాసిరా ?

## ౬ కుట్టిమము

క. 'నెలపొడుపుల సురనది ని, ర్మలతర తదగారకుట్టిమస్రవదిందూ
పలతుందిలాపయగుచుం, దెలివొందుఁ బతివ్రతౌచితీ సంపత్తిన్." (శృం. నై. 2-39)

'ఆ కుండిన పురముయొక్క - ఇండ్లయొక్క, కుట్టిమ = నెలకట్టులయందు (= జాతిచట్టా నేలలయందు) ఓడుచున్న - చంద్రకాంత శిలలచేత, తుందిల = ప్రవృద్ధములయిన, ఆప = నీరు కలది.—మందాకినికన్న పట్టణము ఉన్నతమని యర్థము— కావున సంబంధాతిశయోక్తి' అని వ్యాఖ్యానము.

పట్టణమే మందాకినికన్న ఉన్నతమట! పట్టణమనగా - పట్టణముండు ప్రదేశ మన్నమాట. కావ్యములలో 'పట్టణములోని మేడ లున్నతము' లని వర్ణించుట కలదు గాని - 'పట్టణమే' ఉన్నతమనుట యెందును లేదు.— శ. ర. లో 'కుట్టిమము = నెలకట్టు; జాతికట్టనపు నేల' అని యున్నది. 'నేల' యనగా మేడలోని అడుగు భాగముగదా' అనుకొని, ఆభాగము మందాకినికన్న ఉన్నతము కాకపోతే అందలి చంద్రకాంతములనుండి ఓడికలు కట్టు జలము ఆమందాకినిలోనికి ప్రవహింపదుగదా - అనుకొని శాస్త్రిగారు 'ఆపట్టణపు - నేల' యే మందాకినికంటే యెత్తన్నారు. పెద్ద పొరపాటు.

'కుట్టిమము' అనగా రాళ్లు పరిచిన ప్రదేశము. అది మేడలోని అడుగుభాగము కావచ్చును. మేడమీది ప్రదేశమును కావచ్చును. ప్రకృతపద్యములోని 'కుట్టిమములు' గృహోపరిభాగములు. కావుననే చంద్రకిరణములు సోకుటయు, అందలి చంద్రకాంత ములు కరగి పారుటయును. కుట్టిమములు మందాకిని కన్న ఉన్నతములని చెప్పుట ద్వారా కవి, మేడల యౌన్నత్యమును తెలిపినాడు. ఆపద్యములోనున్న చమత్కార మదే. పాపము, వ్యాఖ్యాతలు గ్రహింపలేక పోయినారు.

నామాటయందు నమ్మకము చాలని పెద్దలు మూలమును చూడండి.

'యదగార ఘటాట్టకుట్టిమస్రవ దిందూపల తుందిలాపయా,
ముముచే న పతివ్ర తౌచితీ ప్రతిచంద్రోదయ మభ్రగంగయా.' (2-89)

'యదగారఘటానాం యస్యాః గృహ సమూహానా మట్టా ఉపరిగృహాస్తేషు కుట్టిమా బద్ధభూమయ స్తాసు స్రవంతః......అనేన ఆకాశగంగాయా అపి కుట్టిమానా మూర్ధ్వభావత్వం సూచ్యతే.' (నారా. వ్యాఖ్య)

యస్యాః నగర్యా అగారఘటాసు గృహసమూహేషు అట్టానాం అట్టాలకా నాం కుట్టిమేషు బద్ధభూమిషు - స్రవద్భిః ఇందుసంపర్కాత్ - స్యందమానైరిందూ పలైః...—తథాచాగారాణా మతీందు మండల మౌన్నత్యంవ్యజ్యతే" (మల్లి.)

కాబట్టి 'మందాకినికన్న పట్టణము ఉన్నత'మనుట తప్పు; పద్యములోని కుట్టి మములు - మేడలలోని అడుగుభాగము లనుకొనుట అంతకంటెను తప్పు.

మాఘుకవి ద్వారకలోని 'కుట్టిమములు' మేఘమండలమునకు పైయెత్తునున్నట్లు వర్ణించినాడు.

'కాంతేందు కాంతోపల కుట్టిమేషు, ప్రతిక్షపం హర్మ్యతలేషు యత్ర
ఉచ్చైరధఃపాతి పయోముచోఽపి, సమూహ మూహుః పయసాం ప్రణాళ్యః'
(3-44)

కంచిశరభకవి - 'కుట్టిమములు (= నెలకట్టులు) స్త్రీలెక్కి విహరింపదగిన స్థలము'లని చెప్పినాడు.—

సీ. 'పటికంపు నెలకట్టు పైనెక్కి బెగడొందు
నింతి యిచ్చటగుట్ట లెట్టుదాటె.' (హరిశ్చంద్ర) బ్రౌ. నుండి

## ౭ పడిదెంబు — విద్రిచి

శృం. నై. "వెన్న పడిదంబు జొబ్బిల విద్రిచి విద్రిచి
వార యాత్రికు లనుమోదవంతు లగుచు
వలచి భుజియించి రొగిఁ బిండి వంటకములు" (6-120)

† 'వెన్న పడిదంబు = వెన్నతోఁజేసిన భక్ష్యవిశేషము, జొబ్బిలన్ = ద్రవము ఉట్టిపడునట్లు, విద్రిచి విద్రిచి = విఱిచి విఱిచి' - అని సర్వంకషావ్యాఖ్య.

'వెన్నపడిదెము' - వెన్నబిస్కెట్టువంటి గట్టి వస్తువనుకొని, 'విద్రిచి విద్రిచి = విఱిచి విఱిచి' అని యర్థము వ్రాసినారు. చాలతప్పు.

వెన్నపడిదెము - విరువదగిన గట్టివస్తువును కాదు. విద్రుచుట యనగా విఱుచుటయును కాదు.— పడిదెము- ద్రవరూపమైన (మజ్జిగ పులుసువంటి) వ్యంజన విశేషము. (చూ. శ. ర.)

సీ. 'అప్పడంబులు వడియములుఁ దాలింపులుఁ
బలుచని నులివెచ్చ పడిదెములును.' (జైమి. 3-51)

బ్రౌను ఇట్లు వివరముగా వ్రాసియున్నాడు.—

'పడిదెము or పడిదెం. A cèrtain decoction. బోళము in చికిత్సా సారము- 23. 'దధితైల ఖలైస్సమం. టీ॥ గ్రాహులైన పదార్థాలతోను పెరుగునూనె పడిదంతోను ప్రాతరాహా (రా) న్నము పథ్యము భోంచేశేది. 'శొంఠి దాడిమ కల్కాఢ్యః ఖళస్సర్వాతిసారజిత్. టీ॥ శొంఠిన్ని దాడింబకాయను నూరి కలిపి కాచిన పడిదం సర్వాతిసారహరం. పడిదము. ఖలః which is explained in శబ్దార్థ కల్పతరువు. కల్కము.

శ. ని. లో 'కట్టు = చారు, పడిదెము' అని యున్నది.

విద్రుచుట = విదిలించుట (చూ. శ. ర.)

'విద్రుచుట - విదిలించుట- To shake off, beat off, get rid of' (బ్రౌను)

---

'పడిదంబు' అనుట తప్పు. పడిదెము. రూపా.— పడిదియము.

"హిడింబుండను నొక్కరక్కసుండు వారి దవ్వులంజూచి మేవెంచి రూక్ష కేశంబులు విద్రిచి" (భా. ఆది. 6–186.)

సీ. 'మొగివిచ్చు పసిఁడిగేదఁగి రేకు గమిమించు
విశదచ్ఛదంబులు విద్రిచి విదిర్చి.' —పాండు. 4-220

## ౮ చిదిపిజాలు

శృం. నై. "ప్రాంత పై చీర చెఱఁగున బడుగువాఁడు
హేమశైలంబు † చిదిపి జాలెన్నిముడుచు"? (8-148.)

'బడుగువాఁడు = అశక్తుఁడు (దుర్బలుఁడు) హేమశైలంబున్ = బంగరు కొండను - (మేరువును) చిదిపి = చిన్నచిన్న జాలుగా చిదియఁగొట్టి, ఎన్ని జాలు ముడుఁచున్ = కొంచెపాటియేని ముడిఁచి కొనిపోఁజాలఁడు.' అని సర్వం - వ్యాఖ్య.

దుర్బలుడేమి? మేరువును చిన్నచిన్న జాలుగా చిదియఁగొట్టుటయేమి? ఆంధ్ర మల్లినాథులు 'చిదిపిజాలు' అను తేటతెనుగు పలుకుబడి నెఱుఁగక, 'చిదిపి' విశేషణమని తెలియక, క్రియ యని భ్రమించి, అసంభవమగు అర్థమును చెప్పి పద్యభావమును పాడుచేసినారు. విశేష విమర్శ కిక్కడ చోటులేదు. కావున ప్రకృతపు 'చిదిపిజాల' కొక ప్రయోగమాత్ర మిచ్చి అవతలి విషయము నందుకొంటాను.

గీ. 'కనకశైలంబు తలయంపిగా శయించి, చిదిపిరాలేరఁబోయిన చెలువుగాదె?
ఇహపరములిచ్చు పతిభక్తియెడలి యతివ,యొండువిధమున మోక్షంబు నొందఁజనుట.'
(రుక్మాం, 4-85)

చిదిపి = పరుషము, అల్పము - నికృష్టము - (చిదిపి = చిడిపి = చిలిపి.) చూ. శ. ర.

'సంస్కృతసాహిత్యమంటు; ఎక్కడ నున్నదో దివ్వటీలు వెలిఁగించి వెదకుఁడు.'— అని కొ. వెం. పంతులుగారిని గేలిచేసిన శాస్త్రులవారు, తెనుగుపద్యములకు - పదములకు గూడా తప్పర్థములు వ్రాసిరేమండీ !

# ౪ వ్యాకరణ దోషములు

## ౧ నేర్పరురాలు

బిల్హణీయము - 'రాజపుత్రీ ప్రౌఢా ఆసీత్ = రాజకన్య నేర్పరురాలాయెను' అని టీక.

---

† 'చిడిపిజాలు' అని శ. ర. పాఠము. (చూ. 'చిడిపి' క్రింద.)

నేర్పు గల స్త్రీ 'నేర్పరి' యేగాని 'నేర్పరురాలు' కాదు. స్త్రీయే కాదు. పురుషుఁడైనను 'నేర్పరి' యే. "అరి ప్రత్యయంబు, కలవాఁడు - కలది అనునర్థంబున 'జాల', 'నేరుపు' మొదలగు శబ్దంబుల కగును." (చూ. గుప్తా. ప్ర. తద్ధిత. 17.)

"ఎంత నేర్పరివమ్మ యింతిరో నీవు" ‡(బాణాసురయుద్ధము.)

"నే, ర్పరియౌ వైశ్యకులోత్తముం డవచితిప్పం డల్పుఁడే."(హర. పీఠిక.)

పురుషుఁడు - 'నేర్పరుఁడు'; స్త్రీ - నేర్పరురాలు; అమహత్తు - నేర్పరము, అగునను కొనుట పొరపాటు.

మరియు, అదంత తత్సమమునకు 'ఆలు' పరమగునపుడు జరుగఁదగిన - (బా. సం. 30) కార్యమును - ఇదంతమును - దేశ్యమును నైన 'నేర్పరి'కి పట్టించుట చాలా పొరపాటు.

## ౨ ఆఱురిపులు

(a) 'కామ కోప లోభ గర్వమోహార్ష్యల
లోని యాఱురిపులఁగా నెఱుంగు
బయలిశాత్రవులను భజించుటేపాటి.' (హితో. చం. సంధి. 75.)

(b) 'ఆఱురిపులమనికి' (నాగానందము. పు. 7.)

ఆఱురిపులు; మూడు కొడుకులు, రెండు కూతుండ్లు - అని తెనుగువారనరు. కామక్రోధాదిగుణములు మహత్తులు కాకపోయినను రిపులుగా చెప్పబడినపుడు మహత్తులుగానే పరిగణితములగును.

"లోకములన్నియుఁ గడియలోన జయించిన వాఁడ విం ద్రియా
నీకముఁ జిత్తముఁ గెలువ నేరవు, నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకర శత్రులార్వురఁ బ్రభిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁడొకఁడు నేర్పునఁ జూడుము దానవేశ్వరా."

—భాగవతము. 7-267.

ఈపద్యములోని భీకర శత్రులార్వురు నెవరు? కామాదులే.

## ౩ పరదేశులు

గౌ. హరి.—"పరదేశులకు గుళ్లపంచలుగాక." (పు. 180)

అని శాస్త్రిపాఠము. 'పరదేశులు' అనుట తప్పు; 'పరదేసులు' అనవలెను. 'పరదేశి' బహువచనమైనప్పుడు దాని శవర్ణము సవర్ణమగునని- గుప్తా. ప్రకా. లో స్పష్టముగా తెలుపబడియున్నది. (చూ. బా. తత్స. 45. క్రింద.) కావున, పరదేశులు, రాశులు, రశ్మిలు, పేశులు, అని ముద్రించుట ప్రమాదము.

‡ చూ. గి. వ్యాససంగ్రహము. (పు. 3౨౬.)

## ౪ ఫలములుకావవు

హితో. చం.—"విషవృక్షములు పథ్యమయిన ఫలములు కావవు" (పు. 149.)

చిన్నయసూరి 'అగమాన్య చకారములకు......ముత్తు పరంబగునపుడు పవల గును' (క్రి. 88.) అన్నాడుగనుకను, 'పూచు' నకు వ్యతిరేకమున 'పూవవు' అను రూపము కనబడుచున్నది గావునను శాస్త్రిగారు 'కాచు' నకు వ్యతిరేకమున 'కావవు' అన్నారు. కాని, అట్లనుట సంప్రదాయము కాదు. 'కాయవు' అనుట సంప్ర దాయము.

(1) 'కొడుకులు లేనట్టి కోమలిబ్రదుకు
పూచికాయనియట్టి భూజంబువిధము' (పల్నా. చరి. పు. 52)

(2) 'మాయల కతకారి మందులమారి
కాయని పడుచెట్టు.' ( " — పీఠిక. పు. 89)

(3) 'సారె పండఁగ మేలు సమకూరు మాకింత
కాయక పండుచే కరణిఁగలుగు' (శశాంక. 4 - 166.)

(4) 'త్రోయ కహో పరస్థలముఁ ద్రొక్కియుఁ జూచినయేని నాలుగేన్
గాయలు కాయ వచ్చెలువ గర్భమునం దెటువంటిపాపమో.'
—వేం. పంచ. 1 - 588

(5) 'The tamarind tree does not bear - ఆ చింతచెట్టు కాయడము లేదు.' (బ్రౌను)

కావున 'కావవు' అనుట సరికాదు. మరియు, కాచు, ( = ఎండకాయు) రాచు, వాచు, చాఁచు, మొదలగు క్రియలకు ('పూచు'ను బట్టి—) వ్యతిరేకమున,—

ఎండ కావదు ఒళ్ళు వావదు
ఆమెకాలికి పసుపు రావదు వాడు చేయిచావఁడు.

అనురూపములు వాడుట తప్పు.

## ౫ కాతఁ

"పాతాళంబందుఁగానీ, ప్రళయపవన గర్భంబునం దైనఁగానీ
త్రోతుర్గాతఁ మహీశుఁ దురకలు" (ప్రతాప. 5-12.)

శాస్త్రిగారికి పరమప్రమాణమయిన బాలవ్యాకరణమును బట్టి ఎడు త వర్ణంబులు ఆశీశ్శాపసంప్రార్థనంబులయందేగదా వచ్చునది ? మరి 'తురకలు మహీశుఁ త్రోతుర్ గాతఁ' అంటే; శాపమా ? ఆశీస్సా ? సంప్రార్థనమా ? 'ఒకవేళ

త్రోసినఁ ద్రోయనిమ్ము' అనునర్థమున - 'కాతణ్' అనవచ్చునా ? అందుకు భారత ప్రయోగమున్నదా ?

భారతేతర కవిప్రయోగమొకటి- "జాతితొలంగుఁగాత, గుణశక్తి రసాతల సీమకుంజనుం, గాత...బహుభంగుల విత్తమె మాకుమేలు" (భర్తృ. ౧-౩౨) అనునది కనబడుచున్నది. కాని అది వారికి కొఱగాదుగదా; మరి వారి 'మహీశు'నిగతియేమి? తురక లాతనిని (ప్రతాపరుద్రుని) పాతాళంబందుగానీ, ప్రళయపవనగర్భంబునందు గానీ, నిష్కర్షగా త్రోయవలసినదేనా ? పాపము !

### ౬ అడుగు

శృం. నై- (పీఠిక) - "అయ్యా, నీ వెవ్వరవు ? శిరోమణిగా వర్ధిల్లుము అని యడిగెను"

నీ వెవ్వరవు - అని యడుగుట కలదుగాని 'వర్ధిల్లుము' అని అడుగుటయును కలదా ? 'నీ వెవ్వరవు ? అని యడిగి, 'వర్ధిల్లుము' అని దీవించెను.- అనుట క్రమము. శాస్త్రిగారి వాక్యరచనలో తప్పున్నది. ఇట్టి తప్పును క్రిందితరగతి విద్యార్థులు చేయుట కలదు.

కొక్కొండ పండితులు 'లేఁడయ్యెడుఙ్' అని ప్రయోగింపగా అది ‡తప్పనుకొని "నలువదియేండ్ల యాంధ్రపండితుల యాంధ్ర వ్యాకరణజ్ఞానము ఎట్లు లేఁగుచున్నదో యరయుఁడు. - వీరే క్రొత్తవ్యాకరణము చేయవలసినవారు" అని హేళన చేసిన శాస్త్రిగారి వ్రాతలలో విద్యార్థులు చేయదగిన వ్యాకరణదోషము లుండుటకు కారణమేమంటారు ?

## ౭ శబ్దదోషములు

### ౧ ఒరవడి

'విజయ' - (పు. 24) లో 'మేలుబంతి = ఒరవడి' అన్నారు మళ్లి, పు. 124 లో - 'మేలుబంతులు = ఒరువడి పత్త్రులు' అన్నారు. వారే తిక్కనవిజయములో 'వరువడి' అన్నారట (చూ. వే. వే. స్మృతి. - పు. 57.)

శ. ర. లో (సూ. ని. లోను) 'ఒరవడి' అనురూప మొక్కటే యున్నది. ఆంధ్ర మల్లినాథులు 'ఒరువడి'; 'వరువడి' అనురూపము లెక్కడ సంపాదించినారో ? ఇంతకును వారి మతమున ఏరూపము సాధువో తేలుటెట్లు ?

---

‡ చూ. భాషాభేషజము. (పు. ౬౪.)

. . .

## ౨ గరిట

'ఆముక్త'.— "అయ్యగపలక = ఆకెంకాయచిప్పల గరిటలతో" (పు. 82) 'గరిట' అనుట తప్పు. 'గరిటె' అనుట ఒప్పు. అది యట్లుండఁగా (గ్రాంథికపు) గరిటె- అరసున్నాకలది. "నేయిఁగరిం బెడుక బోయకయున్న" (పండితా. వాద. పు. ౨౦౩.) సూ. ని. కావున 'గరిఁటె' అనవలయును.

'గరిట' అనురూపము పామరవ్యవహారముననైనను ఉన్నదా ?

## ౩ గావత్తు

విమర్శవినోదము.— "చైత్రమాసరాత్రిలో మింటియధోభాగము తెలుఁగు గావత్తు నాకారమున ధవళిమ దువాళించుచుండఁగా" (పు. 40.)

'వత్తు' వాడుకభాషలోనిది. 'ఒత్తు' గ్రాంథికము.-

అప్పకవీయము.—

తే. 'ఒత్తుజడ్డయు ద్విత్వసంయుక్తములును.' (2-13)

వ. 'ఇటువలెఁ గ్రిందను వ్రాసిన యొత్తులకే తలకట్లు.' (2-40)

వైయాకరణపారిజాతము.—

'అథర్వణోక్తమగు ఒత్తుగుర్తు'; 'పయిరీతి నొత్తు వర్ణము.' (పు. 233). చూ. పు. 264 న్యా.

ఆం. పం. భాషాభేషజము.—

'ఒత్తు లేకుండా' (పు. ౧౫౮) ఒత్తు ఉన్నప్పుడు'; ఒత్తుపోగానే' (పు. ౧౫౯)

S. S. L. C. Examiners' Report 1939.—

'ఐత్వము - తాయొత్తు వీనిభేదము పలువురకు తెలియదు - (పు. 12.)

బ్రౌను 'ఒత్తు' - 'వత్తు' కూడా గ్రహించినాఁడు. (ఆతఁడు గ్రాంథికమునకు ప్రమాణము కాడుగదా ?) శ. ర. లో వీరూపమును లేదు. సూ. ని. వకారాదిగా భావించెనేమో; ఒకారము క్రింద చూపలేదు. దానికేమిగాని, ఇట్లు 'ఒరువడి', 'వరువడి', 'గరిట', 'గా వత్తు' - వంటి అపభ్రంశములను వాడియున్న శాస్త్రిగారు.— నెల్లూరు టవునుహాలులో ఆంధ్ర సాహిత్య పరిషద్దశమవార్షికసభలో అధ్యక్షస్థానమునుండి - " 'సెనగలు' - సాధురూపము. పామరులు 'శెనిగలు' అందురు. పామరతరులు 'శెనిగెలు' అని ఎత్వాంతము చేయుదురు. శెనిగె లన్నందుకు నా గుమాస్తాను బ్రాహ్మణు నొకనిని నేను తటిమి వైచితిని" అని గంభీరముగా ఉపన్యసించినారు. అందుకు వారి శిష్యులును తదనుయాయులును ఆనాడు పొందిన హర్షమునకు హద్దేలేదు. తత్త్వ మిలా ఉంటుంది. సర్వజ్ఞులెవరండీ ?

X

## ౪ చేరు

'శనిగె లన్నందుకు నా గుమాస్తాను తతిమి వైచితి' నన్న ఆ శాస్త్రిగారే - ఆ యుపన్యాసములోనే, "విమర్శలవిషయమున - రసమును (అనఁగా చేరును) రుచి చూచి ఈ రసమెవరిది (అనఁగా నీ చారు నెవరు కాఁచినారు) అని యడుగవల యును. అట్లడిగినదే రసము" అన్నారు.

వారి దృష్టిలో 'చారు' అపశబ్దము; 'చేరు' సుశబ్దము; అనగా గ్రాంథికము. అందువలననే వారు 'చేరు'ను సొంతభాషలో ప్రయోగించి 'చారు'ను లోకభాషలో చూపినారు. కాని 'చారు' అపశబ్దము కాదు; సుశబ్దమే. గ్రాంథికమే.

(1) 'చారులుఁ దియ్యగూరలు' (కాశీఖండము. 7—185.)

(2) 'తియ్యని †చారులుఁ దిమ్మనంబులుఙ్' (ఆముక్త. 1—81.)

(3) 'వడియంబులు చారు లూరగాయలు' (శశాంక. 3—14.)

(4) 'చాఱులుఁ బిండివంటలును శర్కరయుఙ్' (హరవిలాసము. 1—32.)

చారు - సారశబ్దభవము. సారము = చారు, అనుటకు -

'సారం భోజనసారం - సారం సారంగలోచనాధరతః
పిబ ఖలు వారం వారం - నోచే న్మధ్యాభవతి సంసారః.'
'అమ్లికాఫల సంభూతం - సారం, వాతవినాశనమ్
పిత్తశ్లేష్మకరం కించిత్ - సురుచ్యం వహ్నిబోధకమ్.'

—యోగరత్నాకరము. (పు. ౧౩౪.)

సారమే కన్నడమున 'సారు' తెనుగున 'చారు' అయినది. (కట్టు చారు; చారు. లక్ష్మీనారాయణీయము.) ‡కొన్నిగ్రంథములలో ఈ 'చారు' - 'చేరు'గా ముద్రితమైయున్నది. బ్రౌను 'చారు Error for చేరు' అన్నాడు. 'చాఱులు ... శర్కరయుఙ్' - అను (యతిస్థాన) ప్రయోగమునుచూడక కాబోలు శ. ర. కర్త 'చారు'క్రింద ఇట్లువ్రాసినాడు.— 'ఈయర్థమందిది యిట్లు దంత్యాదిగా నొకచోట ప్రయోగింపబడియున్నది. అయినను వాడుకయందు తాలవ్యాదిగా కనఁబడుటవలన అది యుక్తముగా తోఁచదు.'- శ. ర. కర్త వే. వేం. శాస్త్రిగారికి గురువు. గురువు గారి వ్రాతమీది గురిచేత కాబోలు 'చారు'ను నిరసించి 'చేరు'ను గ్రహించినారు.

---

† శాస్త్రిగారి ప్రతిలోగూడా 'చారులు' అనియే యున్నది. ఎందుకుండదు? వావిళ్లవారిప్రతిలో ఉన్నప్పుడు.

‡ 'వరగుల్ చేరులు' (పాండు. 2—24.); 'బజ్జులుఁ దియ్యచేరులు' (జైమిని. 3-50) ఇవి యతిస్థానప్రయోగములుకావు.

కాని 'చేరు' లోకవ్యవహారమునను, కావ్యములలో ప్రమాణింపదగినతావునను కనబడుటలేదు. 'చేరు' అని తెనుగువారనరు సరిగదా పైపెచ్చు ఆపదము తెనుగుచెవులకు ఒకవిధముగా ఏహ్యముకూడాను.- 'చేరుమాద' పశువులకు (ముగవానికి) వచ్చు ఒకవ్యాధి. కావున 'చేరును రుచిచూచి' యనుట రోత. తగినప్రయోగము లభించువరకును 'చేరు' గ్రాంథికమనుకొనుటకును వీలుపడదుగదా!

## ౧౦ సాహసపు సవరణలు

### ౧ కోవెల

'కోవెల' అను రూప మసాధు వనుకొని గొ. హరి. (పు. 37) లో - 'కోయిల'గా సవరించినారు. పొరపాటు.

సీ. 'నిగిడి తెర్వరుల గుండెలు జల్లురనఁ జేర్చి
పెళపెళనార్చు కోవెలపుఁదోడు.' (యయా. ౫. ఆ.)

గీ. 'కొమ్మయిలు పుల్గు, కోవెల - కోయిలనఁగ' (సాంబ. తిర్య. 77.)

### ౨ యోగవాగంబు

బా. శం. సారంగధరలో - "ఘనమైన యోగవాగంబులు దొడిగి" అను పూ. ము. పాఠమును 'ఘనమైన యోగవాహనముపైనెక్కి' అని సవరించినారు. (సవరించినట్లు చెప్పలేదు.)

బ్రౌణ్యములో 'యోగవాగంబులు దొడిగి' అను పాఠమే యున్నది. 'యోగవాగ(ము)లు = అంతరిక్షమార్గమున పోయెడు యోగసిద్ధులు మెట్టెడు పావకోళ్లు' (శ. ర.)

'యోగవాగములు' అనుట తప్పనుకొని 'యోగవాహనము'గా దిద్దినారు. 'యోగవాహనము' నిఘంటువులలో లేదు.

### ౩ ప్రౌఢిమ

శ్రీనాథమహాకవి శృ. నై. లో ఆరుసారులును, ఇతరత్ర దాదాపు పదిసారులును వాడిన 'ప్రౌఢిమ' ను - 'ప్రౌఢి కి ఇమనిచ్ రా' దంటూ 'ప్రౌఢి' అని దిద్దివేసినారు. 'ఇమనిచ్' రాకపోతే రాకపోవుగాక. శ్రీనాథుడు ఇష్టపడి వాడిన పదమును దిద్దివేయుటకు శాస్త్రీగారెవరు ? 'ప్రౌఢిమ' ను శ్రీనాథుడే గాదు- అతని పిమ్మటి విద్వత్కవు లెల్లరును వాడినారు. అమోఘములయిన రెండు ప్రయోగములు మాత్రమే ఉదాహరిస్తాను.

(1) 'సారస్వత ప్రౌఢిమార్థి, యీ సురియచేత నాలుకఁ గొనికొనియు' (కళా. 3-108.)
(2) 'మారుమూరు ప్రాపు వోకార్చె నేఁడు నీ
దైన ప్రౌఢిమహిమ భానుకులుఁడ; (రా. పాం. 1-30.)

## ౪ తలపుచ్చె

గౌ. హరి. 'ఈ యింతిఁ గొనివచ్చు టెఱిఁగిన నన్ను
బోయినప్పుడె తల పుచ్చుక మ్రింగు' (పు. 169.)

అని వ్రా. ము. పాఠము. 'పుచ్చుక' అనుట తప్పని శాస్త్రిగారు 'తలపుచ్చెను మ్రింగు' అని దిద్దివేసినారు.

'తల పుచ్చుక మ్రింగు' అనునది జాతీయము. (తలకాయ పుచ్చుకొని - అమాంతముగా మ్రింగివేస్తాడు.- అనగా) నామీద ఆగ్రహపడతాడు, అని భావము. ఆ భావము శాస్త్రిగారి సవరణలో అభావమయినది. 'పుచ్చుక' అనుట తప్పు కానే కాదు.

సీ. 'ఒక్కటి గలుపుక యుగ్గళింప' (అప్ప. 4-148.)

## ౫ సైయన

గౌ. హరి - వ్రా. ము. లో.-

'చయ్యన బహువేదశాస్త్ర పారీణు-లయ్యున్న నాశిష్యు లందఱిలోన.'

అనియున్నది. 'అయి + ఉన్న = అయ్యున్న' అనుచో సంధి దుష్టమగు నను కొని, శ్రీ శాస్త్రిగారు,

'సైయన బహు...............పారీణు
లైయున్న...............లోన.' (పు. 114.)

అని దిద్ది - 'సై అనఁగా = శీఘ్రముగా' అని టీకగూడా సెలవిచ్చినారు. చాలా సాహసము.

'అయ్యున్న' - సంధి దుష్టముకాదు. శిష్టమే.-

క. 'ఇయ్యాహారంబులచే, నయ్యా బడలికలు దీఱెనా ? సంతోషం
బయ్యున్నదే ? పరి తుష్టం, బయ్యెనె ? ప్రాద్దెక్కె మిగుల నాఁకొంటివిగా.'
—విష్ణుపురాణము. 3-352

కావున 'ఐ యున్న' అని దిద్దుట అనవసరము. అది యట్లుండఁగా 'శీఘ్రముగా' అను నర్థమిచ్చు పదము 'చయ్యన'గాని - 'సై యన' కాదు.— (చూ. శ. ర.)

క. 'సెయ్య మెఱిఁగించి చేరుము
చయ్యన నిజసేవకాను సారిణి శారిణి.' (భాగ - 10. 1697.)

'చయ్యన'ను 'గౌరన' నవనాథచరిత్రలోఁగూడా వాడినాడు.

"తగుబంధుజనులు నంతఃపురాంగనలు
సయ్యన ముదమంద సకల భూజనులు
దయ్యంబు మనమీఁద దయచేసెననుచు." (పు. 178.)

శాస్త్రిగారిచేతిలో పడియున్నచో 'సయ్యన' - సైయన అగుటయే కాక 'దయ్యంబు' - 'దాయంబో - లేక, దైయంబో, అయ్యుండెడిదే గదా!

## ౬ కిణాంకములు

ఆం. ప్ర. విమర్శ—

'బుజమందు నారికాయలున్నట్లు ఈ వచనములో పంతులవారు వ్రాసియున్నారు. నారికాయలకు బుజమందు ప్రసక్తి యగపడదు. నారికాయలు ప్రకోష్ఠమందుఁ గలుగును. కవులును అట్లే వర్ణింతురు.' (పు. 31.)

నారిదెబ్బలు బుజమందు - కాదు, రెండు బుజములయందును కలుగునని మహాకవి కాళిదాసే వర్ణించి చెప్పినాడు; చూడండి.

"జ్యాఘాత రేఖే సుభుజో భుజాభ్యాం
బిభర్తి యశ్చాపభృతాం పురోగః,
రిపుశ్రియాం సాంజనబాష్పసేకే
బందీకృతానామివ పద్ధతీ ద్వే." (రఘు. 6—55.)

'పద్ధతీ ఇవ ద్వే జ్యాఘాతానాం మౌర్వీకిణానాంరేఖే రాజీ భుజాభ్యాం బిభర్తి' (మల్లి.)

శాస్త్రిగారి ఆక్షేపము సరియైనదేనా?

# ౧౧ అన్వయదోషములు

## ౧ ఎట్లాలించు

"ఆమోదాశ్రు భరంబు వెల్లిగొన నెట్లాలించుఁ గర్ణంబులన్?
రోమాంచంబు వహించు నేకరణి నీ రోమాంకురంబైన మైన్?
భూమీచక్రము పూని యెట్లు తలలూఁపున్ బన్నగస్వామి? యు
ద్దామప్రౌఢిని నీదుకీర్తి ఫణభృత్కాంతామణుల్ పాడఁగన్."

శృం. నై. 5—137.

నాగకాంతలు కాళింగుని కీర్తిని పాడినప్పుడు, పన్నగస్వామి గానరసజ్ఞుఁడయ్యును, కనులందు ఆనందపూరము వెల్లువ పొడువఁగా చెవులతో నెట్లాలించును?

(పాములకు చెవులే కన్నులు. తెఱచినం గనఁబడును; మూసిన వినఁబడును. మూసి వినుచుండఁగా బాష్పోత్కరము వెల్లివాఁడిచి ఱెప్పలం ద్రోచికొని వెలువడి కన్నులం దెఱచినచో వినుట నిలిచిపోవును. కావున కడవెడల వినలేఁడనుట.—

గానరసగ్రహణముచేతఁ బులకలు గలుగుట ప్రసిద్ధమయినను ఆ యనంతుఁడు వెండ్రుకలు లేని దేహము గలవాఁడు అగుటచేత, రోమాంచమును వహించలేడు.-

పాట విని యానందించువారు తల యూఁడింతురు. ఆదిశేషుఁడు తలపై భూభారమును పూనియున్న కారణమున తల లూఁపఁజాలఁడు.— అనునది వారి వ్యాఖ్యాన సారము.

'ఇట రసగ్రహణరూప పుష్కల కారణమున్నను - శ్రవణ రోమహర్షణ శిరః కంపన రూపకార్యములు జనింపనందున విశేషోక్తి'.— అని వారి అలంకారనిర్ణయము.

రసగ్రహణము కారణమట! శ్రవణము కార్యమట! కారణమున్నను కార్యము జనింపలేదట! అనగా పన్నగస్వామి పాటలోని రసమును గ్రహించినను - పాటవినుట జరుగలేదన్నమాట. ఆహాహా! ఎంతచక్కని వ్యాఖ్యానము! ఇట్టి స్వభావవిరుద్ధపు వ్రాతను ఆంధ్రమల్లినాథు లెట్లు వ్రాసిరోగదా! సరే; శ్రవణరూపకార్యము జనింపనే లేదనిరిగదా, మరి శ్రవణమే లేనపుడు రోమహర్షణశిరఃకంపనాదులు జనింపకపోవుటలో వింతయేమున్నది? విశేషమేమున్నది? ఏ విశేషమును లేనిచోట 'విశేషోక్తి' అలంకార మెట్లు పుట్టినది? శాస్త్రిగారికి అసలుతత్త్వము అవగతముకాలేదు.

'కర్ణంబులన్ - ఆనందాశ్రుభరంబు వెల్లిగొనన్ - ఎట్లాలించున్' అన్నమాటకు, 'ఆలింపజాలడు; కావుననే ఆనందాశ్రువులను వహింపడు' అని యర్థము. అంతేగాని 'ఆలింపనే యాలింపడు' అని యర్థముకాదు. శ్రీనాథుని రచనలో కొంచెము తిరుగుడున్నది. ఆ తిరుగుడు కనుగొనలేక శాస్త్రిగారు తప్పర్థము చేసినారు. మూలమును చదివియున్నచో ఈతప్పు జరిగియుండదు.

"అంతస్సంతోషబాష్పైః స్థగయతి న దృశస్తాభిరాకర్ణయిష్యన్" (12-39.)

'యస్మాత్ ఉరగపతిః శేషః అంతః సంతోషబాష్పైరానందాశ్రుభిః కృత్వా దృశో నేత్రాణి న స్థగయ త్యాచ్ఛాదయతి. యతః తాభి ర్దృగ్భిః ఏతద్గుణా నాకర్ణయిష్యన్ సన్ చక్షుః శ్రవత్వాదశ్రుభిర్నేత్రాచ్ఛాదనేన గుణానాకర్ణనశంకయా ఆనందాశ్రుభిర్దృశో నాచ్ఛాదయతి.' (నారా. వ్యాఖ్య.)

పన్నగస్వామి నాగకన్యలపాటను ఆలించునుగాని - గానశ్రవణభంగశంకచేత ఆనందాశ్రువులను వహించుటలేదు. ఆలించుటయను పుష్కలకారణమున్నను ఆనందాశ్రువులు వహించుటయను కార్యము జనింపనందున 'విశేషోక్తి' అనుట క్రమము.

పెద్ద పెద్ద పద్యములకే కాదు చిన్నచిన్న గద్యపు ముక్కలకు కూడా అర్థమును సరిగా చేసికొనక తప్పుటీకలు వ్రాసియున్నారు - సర్వంకషా వ్యాఖ్యానకర్తలు.

## ౨ చిగురుంగొడుగు

శృం. నై.— "నభోమండలమున గండుమీను పడగ పొలుపారఁ జిగురు జగజంపుగొడుగునీడ, వాడని వనమాల వక్షస్స్థలంబునఁ గ్రాల రతియును దానును నేతెంచిన." (7—44)

'గండుమీనుపడగ = టెక్కెమగు మగచేప, చిగురు జగజంపు = చిగురులనెడి ప్రశస్తమయిన జాలరుగల, గొడుగు' అని వారి వ్యాఖ్య.

చిగురులు జాలరయితే మరి గొడుగేది ? గొడుగులేని జాలరు గోడలేని చిత్రముకాదా ? వారి యన్వయమార్గము తప్పు. చిగురే గొడుగు; 'జగజంపు' దానికి విశేషణము. 'జగజంపు = జాలరుగల, చిగురుగొడుగు' అన్నమాట. చిత్తజునికి చిగురాకు గొడుగు అనుటకు:—

సీ. 'కర్ణికారపు మొగ్గ కనకంపు గుబ్బగాఁ
గోయిల నోరూరు గొడుగుతోడ.' (ఉ. హరి. 2—194.)

సీ. 'కోకిలవ్రాతంబు గ్రుక్కిళ్లు మ్రింగించు
క్రొమ్మావి చిగురాకు గొడుగుతోడ.' (హరి. 3—88.)

సీ. 'వెడవిల్తు చివురాకు గొడుగులు కొనివచ్చి
చరణద్వయంబుగా సవదరించి.' (శకు. 2—176.)

సీ. 'కప్రంపుటరిగ యొక్కవిలాసిని వహింపఁ
జిగురాకు గొడుగొక్క మగువపూన.' (చంద్రభాను.)

చిగురు జగజంపు గొడుగువంటి సమాసమును శ్రీనాథుడు కాశీఖండములో పలుమారు వాడినాడు.—

(1) 'వెల్లజగజంపు గొడుగుల వెల్లును.' (5—275.)
జగజంపు వెల్లగొడుగులు - అనియే అన్వయము (ఇట్లే తక్కిన తావులను.)

(2) సీ. 'అచ్చవెన్నెలచాయ హెచ్చుకుందాడెడు
వెలిపట్టు జగజంపు వలువతోడ.' (2—294.)

(3) సీ. గీ. 'చంద్రికాపాండు కౌశేయ శాటిమైన
యతను జగజంపు గొడుగెవ్వఁ - డు.' (4—195.)

# ౧౨ సాదృశ్యభ్రాంతి

## ౧ మనికి - మనికితము

హితో. చం. "ఈ రహస్యమెఱిఁగి యెడలకే యుండును
మతిఁగలాఁడు తనదు మనికితమును." (పు. 53.)

'ఇతి విజ్ఞాయ మతిమాన్ స్వస్థానం న పరిత్యజేత్' అని మూలము. శాస్త్రిగారు 'స్వస్థానము'ను - 'తనదు మనికిత' మన్నారు. తప్పు. స్థానము = మనికి, గాని 'మనికితము' కాదు. 'మనికిత' మనగా దుఃఖము.—

సీ. 'వెంజిలియనఁగ మనికితంబనఁగ దుండు
డు కనందగు మనోవ్యథకు సమాఖ్య' (ఆం. భా. 1–137.)

"మనికితము - Grief, affliction, sorrow వ్యాకులము. అనగా విచారము". (బ్రౌను.)

చ. "వనజముఖీ కుచోపరి నివాససుఖోన్నతి నుక్కుమాని నా
మనికిత మార్పవచ్చితివి మౌక్తికహారమ." (వసు. 4–102.)

## ౨. మాలి - మాలియ

శృం. నై.—"ద్రోహాదము 'తోఁటమాలియలు' చేసినందున".— 'తోఁటమాలెలు' దాడిమవృక్షమునకు...పాఁగను పట్టింతురు.' (పు. 56.)

తోటపనిచేయువాడు - 'తోటమాలి'గాని 'తోటమాలియ' కాదు; తోటమాలె'యును కాదు.

"మాలి = తోటకాఁచువాఁడు" (శ. ర.)

"మాలి = A gardener" (బ్రౌను.)

మాలియ ( = మాలె) = పుష్పమాలిక.

శ. ర. లో 'తోఁటమాలె; తోఁటమాలియ, తో మాలియ యొక్క రూపాంతరములు. తో మాలియ ( = తో మాలె) = ఆకులు పువ్వులు కూర్చికట్టిన దండ, వనమాల' అని స్పష్టముగా చెప్పబడియున్నది. కావున 'తోటమాలి'ని 'తోఁటమాలియ' ( - మాలె) అనుట తప్పు.

అక్షరసాదృశ్యముగల పదములను గుర్తించుటలో ఆ శాస్త్రిగారిట్లు తారుమారయిన తావులనేకము. ఈ ప్రకారముగా ఆ శాస్త్రిగారి సకల గ్రంథములును సారంగధర చరిత్రలోని దోషములకు సజాతీయములయిన దోషములతో నిండియున్నవి.

‡ఒక కొన్నిదోషములను నేనింతకుముందే అందందు ప్రకటించి యున్నాను.— వానిమాట యెందుకు? సారంగధర చరిత్ర - 'విజ్ఞప్తి'లో గూడా అట్టి దోషము లున్నవి. చూడండి.-

## ౧౩ విజ్ఞప్తిదోషములు

### ౧ గీత - మనుస్మృతి

"మాత్రా స్వస్రా దుహిత్రా వా నో వివిక్తాసనో భవేత్
బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి.
అను గీతోక్తమయిన లోకపరిపాటికి కడు దవ్వైవాఁడై."

పై శ్లోకము మనుస్మృతిలో (2-215) ది గాని 'గీత' లోనిది కాదు. ఆదిలోనే హంసపాదు !—

### ౨ అనివాక్యము

"ఘృతకుమ్భసమానారీ తప్తాఙ్గారసమఃపుమాఞ్
అని నీతికోవిదవాక్యమునకు ఉదాహరణభూతమై."

'అని...వాక్యమునకు' అనుట తప్పు. 'అను ... వాక్యమునకు' అనవలెను. శృం. నై. పీఠికలోగూడా - 'వారణాసియందు గోవిందచంద్రుఁడని రాజు ఏలు చుండెను' అన్నారు. 'అనురాజు' అనుట ఒప్పు.

### ౩ పొరఁబాటు

"తండ్రి పొరఁబాటు నెన్నక."

'పొరపాటు'గాని 'పొరఁబాటు' కాదు. 'పొరపడు' క్రియ; దానికృదంతము 'పొరపాటు.' పొరపడుట యనగా, పొరస్సుపొందుట. పొర - ద్వితీయకు బదులుగా వచ్చిన ప్రథమ. (వివరములకు, చూ. 'మూసి' వారి వివరణము. బా. సంధి. ౪౬.)

---

‡ 'కతిపయ శబ్దార్థస్వరూప పరిశీలనము' (విక్రమ - ఉగాదిసంచిక.)
'పాడబము' (ఆంధ్ర - సంక్రాంతి సంచిక.)
'జ్యోత్స్న' ( ,, సారస్వతానుబంధము. - తేదీ తెలియదు.)
'రాచవారు' (వృష - ఉగాదిసంచిక.)
'గౌరన హరిశ్చంద్ర - టిప్పణము' (ఆం. సారస్వ. 1942 జనవరి, 11, 18, 25.)
'యతినియతి' (వావిళ్లవారి సన్మాన సంపుటము.)
'కొన్ని శబ్దములు వాని యర్థములు' (మల్లాదివారి షష్టిపూర్తిసంచిక.)
'ఆముక్తమాల్యద - వ్యాఖ్యలు' (జనమంచివారి ష. సం. - వెలువడనున్నది.

"సిగ్గుపడు = సిగ్గుఁజెందు, లజ్జించు
చెవుడుపడు = చెవుడుకలది యగు
ఓటుపడు = అపజయపడు
పొరపడు = ప్రమాదపడు
పొరపాటు = పొరపడుట, ప్రమాదము." (శ. ర.)
"కొతుకుపడు = (కొతుకు+పడు) లుప్తవర్ణముగాని లుప్తపదముగాని యగు.
కొంకుపడు = భయపడు." (సూ. ని.)

ప్రామాణికులయిన ఆంధ్రపండితుల వ్రాతలలో 'పొరపడు'; 'పొరపాటు' అనురూపములే యున్నవి.—

అక్కిరాజు ఉమాకాంతముగారి - చంద్రాలోకపీఠికలో "వృత్తాన్తములోఁ బొరపాటులు వ్రాసిరి."— "సూరకవి పొరపాటును జూపెదను" అనియున్నది.— సౌందరనందకావ్యములో - 'పొరపాటపరాధము' (పు. 29.) అనియేయున్నది.

సప్తమ్యర్థమునద్వితీయాంతమైన 'పొరన్' అనుపదమునకు 'పడు' అను ప్రయుక్తమై - పొరంబడు = 'పొరఁబడు' అను క్రియ యేర్పడినదనియు, 'పొరయందు పడు' అని యర్థమనియు, పొరఁబాటు = 'పొరఁబాటు' పై క్రియనుండి పుట్టిన కృదంతమనియు, కొందరు పెద్ద లందురు. వే. వేం. శాస్త్రిగారును ఆభావముతోనే 'పొరఁబాటు' అనిరేమో ?

పొరన్ - పడు, అని వేరు వేరు పదములగుచో ఆ రెంటిని చేర్చి క్రియ యనుటయు- ఆ క్రియనుండి 'పొరంబాటు' అను కృదంతము పుట్టుటయు పొసఁగదుకదా ?

వ్యవహారములో 'పొరంబడు' - 'పొరంబాటు', లేవుగాని - 'పొరబడు' - 'పొరబాటు' ఉన్నవి. అందు 'పా' 'బా' యగుట ద్రుతకార్యముకాదు. అవి సరళాదేశమును పొందిన రూపములు. బ్రౌను ఆ రెండు రూపములను పఠించినాడు. భాషాభేషజము - పు. ౧౫౭ లో 'పొరబాటు' అనియు, పు. ౨౦౩ లో 'పొరబడ్డారు' అనియు సరళాదేశ రూపములు వాడబడియున్నవి.

## ౪ తలిదండ్రులనుబోయి

"యోగసామ్రాజ్యంబును బొంది, తండ్రి పొరఁబాటు సెన్నక తలిదండ్రులను బోయి దర్శించి, వారి వెతందీర్చి, వారికి......సుతోత్పత్తి గలుగునని తెలిపి...గురు సాన్నిధ్యముం జేరిన..."

పొంది, దర్శించి, తీర్చి - అను క్త్వార్థముల కడ 'కామా'లు పెట్టిన శాస్త్రిగారు 'బోయి' దగ్గర పెట్టకపోవుటకు కారణమేమి ? ఆ 'పోయి' క్త్వార్థముకాదా ?

తక్కిన వాటి వంటిది కాదా ? పోవుటయు పూర్వకాలిక వ్యాపారములలో నొకటి కావున 'పోయి' అన్నచోట గూడా 'కామా' తప్పక పెట్టవలెను. కాని వారి వాక్యములో అట్లు పెట్టుటకు వీలులేదు. 'తలిదండ్రులనుబోయి, దర్శించి,' అంటే అర్థమే వ్యర్థమగును. కావున వారి వాక్యరచన సరియైనది కా దన్నమాట. 'పొర పాటు నెన్నక (యింటికి) పోయి, తలిదండ్రులను దర్శించి' అని సరియైన రచన. తలిదండ్రులను బోయి' అనుట తప్పు.

## ౫ కరణిం బురణించు

"ఈ దివ్యప్రబంధము సాహసిక ముద్రణములపాలై ఈవి తీవియపూదండ చెత్త తొట్టిం బడినదో యను కరణిం బురణించు చుండంగని, చింతించి, పొటుపడి బాగుపఱిచి."

'కరణి' యనగా, విధము; 'పురణించుట' యనగా, వర్ధిల్లుట; విజృంభించుట. కావున వాక్యమున్నతీఱున ఏర్పడుచున్న అర్థమిది.

ఈ దివ్యప్రబంధము - ఈవి...దండ = కల్పకుసుమమాల, చెత్త తొట్టి యందు - పడినదో = పడినదేమో, అను కరణిజ = అన్నవిధముగా, పురణించుచుం డజ = వర్ధిల్లుచుండగా - లేక, విజృంభించు చుండగా, కని - చింతించి.

సాహసిక ముద్రము (ల) పాలైన ప్రబంధమును, 'చెత్త తొట్టిలో పడిన... పూదండ యేమో' అని ఉత్ప్రేక్షించుటకు హేతువు లేదు. చెత్త తొట్టిలోబడిన పూదండ 'వర్ధిల్లదు'. కావున - 'పూదండవలె - వర్ధిల్లుచుండగా' అనుటయును పొస గదు. 'వర్ధిల్లుచున్నదానిని కని చింతించితి' - ననుటయు ననుచితము. కావున ఆ వాక్యమే తప్పు. §

'ఈ...ప్రబంధము సాహసిక ముద్రణములపాలై - చెత్త తొట్టింబడిన ఈవి తీ వియ పూదండను పురుడించుచుండంగని, చింతించి' అంటే అర్థము సరిపడును. అన ర్థము తొలగును.

'కరణిం బురణించు' అను రీతి శబ్దాలంకారము శాస్త్రిగారికి మిక్కిలి ప్రియము. ఆం. ప్ర. విమర్శలో, కొక్కొండ పండితుని వెక్కిరించుటలోగూడా- 'నన్నుఁ బెండ్లాడవే చెంచీత- నీకు బహు పున్నెముంటదే చెంచీత, అని చెంచిత పాట సరణిం బురణించుచున్నది' అన్నారు. (చూ. పు. ౨౫౬.)

కాని, పోలు; పోలికయగు, అను నర్థమున వాడదగినది 'పురుడించు' గాని 'పురణించు' కాదు.

---

§ శాస్త్రిశిష్యులు 'సారంగ' (Advertisement) ప్రకటనకు ఈ వాక్య మునే నేడు వినియోగించుచున్నారు. పాపము ! వారికేమెరుక ?

"పురణించు = (పురడించు.) వర్ధిల్లు; విజృంభించు.
పురడించు = పోలికయగు." (శ. ర.)

'పురడించు' - పురుడు, అను పదమునుండి పుట్టిన దేశ్యక్రియ' యనియు, 'పురణించు'- పూరణమ్, అను సంస్కృత పదమునుండి పుట్టిన వైకృత క్రియ యనియు నిఘంటువులలో చెప్పబడియున్నది. (చూ. శ. ర.; శు. ని.)

కావున 'పురడించు' అను నర్థమున 'పురణించు' అను క్రియను వాడుట పొరపాటు.

ఈ పొరపాటు శాస్త్రిగారి వ్రాతలలో తరుచుగా జరిగినది.

1. 'పూని యితండు వార్ధి యొఱపుం బురణించు.' (నాగా. పు. 44.)
   'పురణించుడ్ = పోలును' అని వారిదే టీక.
2. 'కల్పవృక్షముం బురణించు చుండఁగా' (ఆం. ప్ర. వి. పు. 86.)
3. 'నిండు బిందెలజత జక్కవకవం బురణించు పాలిండ్లు' (దళ. చరి. పు. 2.)
4. 'ప్రతాపంబు పెంపున మధ్యాహ్నమార్తాండుం బురణించుచు.' (అపుటలోనే.)
   పురణించు - పురుడించు, అను క్రియలను ప్రాచీనకవులిట్లు వాడినారు.
   -"గోవులు ప్రతివత్సరంబును ప్రసూతలై క్రేపులు పురణించివచ్చు"

(హరి. పూ. ౬. ఆ.) శ. ర.

"కురుబలమదె పురణించె బడలుపఱుతము రమ్మా" (భార. ద్రో. ౫, ఆ.) శ.ర.-

'పురణించు,' రూపాం.— పురాణించు.

"నాచేతఁ గ్రేపులు పురాణించుటంజేసి.' (భా. విరాట. ౧ ఆ.) శ. ర.

"దండకము.— ఉరస్సీమ జీమూతమై హార వర్షోపలశ్రేణి రాణించు మించుల్ బురాణింపఁగాఁ జేయు." (పాండు. 4. 77.) శ. ర.

"క. బలశాలియైన హంసముఁ
   బిలిచితి పురుడించిపాఱ బేలతనమునన్
   గలవే యింతకు మును హం
   సలతోఁ బురుడించు వాయసంబులు జగతిన్." (భా. కర్ణ. 2-60.)

"క. చనుమొలకలు గల కన్యా
   జనములఁ బురుడించెఁ బద్మ సరసీరేఖల్." (పాండు. 4-38.)

## ౬ బరువులు — ఎరువులు

"బరువులు నెరువులుంగాని కబ్బంపుఁ దొడవులును"

గ్రాంథికభాషలో 'ఎరువు' అనగా, పేడ; పెంట. (చూ. శ. ర.) కావున 'ఎరువులుగాని...తొడవులు' అనుట రోత. 'ఎరవులు కాని...' అనవలెను. 'ఎర' వనగా ఒకటి రెండుదినములు వాడుకొనుటకై యడిగి తెచ్చుకొను సొమ్ము - (శ. ర.)

క. 'కడులోభమ్మున నొండ్లవి సొమ్ములు
రమ్మనినన్ వచ్చునే? యెరవు సతమగునే? (భా. అర. 4-347.)

వ్యవహారభాషలో 'ఎరవు'ను - 'ఎరువు' అనుటయును కలదు. అందువల్లనే, బ్రౌను - 'ఎరువు Lending, loan· Menure, dung.' అన్నాడు. ౧౮౪౭ లో ముద్రితమైన విజ్ఞానేశ్వరీయము తెనుగు వివరణమున - 'యాచిత మనఁగా ఎరువు దీసుకొన్న సొమ్ము' అని యున్నది. (చూ. పు. ౬౧.)

భారతేతరభాష పనికిరాదని శఠించు వీరగ్రాంథికులు, 'ఎరవు'ను - 'ఎరువు' అనుట ప్రాయశ్చిత్తములేని మహాదోషముకాదా ?

౭ తల్లికి

"వెంటనే వానికి కాలుసేతులు వచ్చినవి. దేవతలు వానికి చౌరంగి యని పేరిడిరి. మత్స్యేంద్రనాథుఁడు వానిం దోడ్కొనిపోయి తల్లి కొసంగెను."

ఎవనితల్లికి ? మత్స్యేంద్రుని తల్లికేనా ?

ఈదోషము లన్నియు శాస్త్రిగారి సొంతములే గాని, యితరకృతములు కావు గదా? మరి వారియెడ నెంత యభిమానమున్నను - 'శాస్త్రులుగారు స్వయము ఇట్లు వ్రాయుదురని నేను నమ్మఁజాలనయ్యెదను' అనుట యెలాగు ?

వారుచేసిన భాషాసేవకు ఎల్లరును వారియెడ నభిమానము కలిగియుండవలసినదే. వారిని భూషింపవలసినదే.

సీ. 'సంతరించితి వాంధ్ర సంస్కృత ద్రావిడ, హూణ వాక్పాండిత్య ముజ్జ్వలముగ,
విరచించితివి చారుతర కల్పనా చమ, త్కృతు లొప్పఁగ స్వతంత్ర కృతులుకొన్ని,
తెనిఁగించితివి కష్టమున కోర్చి తూచాలు, చెడకుండఁ గొన్ని సంస్కృతపుఁ గృతులు,
విరచించితి వభేద్య విషయ సంఘటితమ్ము, లగు ప్రౌఢకావ్య గూఢార్థములను,
కలము గొన్నది సుత తుది గడియ దాఁక, జీవితంబెల్ల శారదా సేవకొఱకె
ధారవోసితి; సాటి యెవ్వారునీకు ? ప్రాజ్ఞసత్తమ! వేంకటరాయశాస్త్రి.'

అని నేను భూషింపలేదా ? అట్లని గుణదోష విచారమున సత్యము కప్పిపుచ్చుట యెట్లు ? అభిమానమున తప్పులను కప్పిపుచ్చి గొప్పచేయుటయు, ఈర్ష్యాసూయలవలన, ఒప్పులను గూడా తప్పులుగా చెప్పి దెప్పుటయు ప్రాజ్ఞులొప్పు పని కాదు గదా ! వే. వేం. శాస్త్రిగారు పూజ్యులౌదురుగాక వారి దోషములు పూజ్యము

లగునా ? వారి గ్రంథము లన్నియు దోషబహుళముగా నున్నవి. ఈనాడు పిన్నలు- పెద్దలు, పండితులు- పామరులు, ఎల్లవారును శాస్త్రిగారి గ్రంథములలోని అచ్చుతప్పులను గూడా ఒప్పులుగానే భావించి శాస్త్రిగారియెడ గల ప్రమాణబుద్ధి వలన అపరిశీలితముగనే గ్రహించుచున్నారు. అందుమూలమున భాష కళంకిత మగుచున్నది. ఈ యెల్ల విషయములను లోకమునకు తెలుపు తలపుతో తయారుచేసిన మచ్చుతునకే- ఈ సారంగధర చరిత్ర. అందువల్లనే యిందు అల్పాల్ప ప్రమాదములు సైత ముజ్జగింపబడక యథావకాశము- ఎత్తిచూపబడినవి. ఈ సారంగధరకు జరిగిన సంస్కారము వారి తక్కిన యెల్లగ్రంథములకును జరిగిననేగాని భాషకు కలుగుచున్న చెట్ట తొలగదు. అంతవరకును ఆ కృతులనుండి పాఠములను గ్రహించు పెద్దలు ప్రతి పదమును పరిశీలించి గ్రహించుట శ్రేయము.

## ౧౪ కథాప్రాశస్త్యము

శీలరక్షణమునకుగా ఘోరశిక్షకు గురియైన సారంగధరుని పవిత్రచరిత్రము తెనుగువారి యుల్లములను కొల్లగొని ద్విపదలుగా, పదములుగా, పద్యములుగా, గద్యములుగా, చాటువులుగా, నాటకములుగా బహుముఖముల ప్రకటితమై ప్రశస్తి కెక్కినది. సారంగధరుని కథను గౌరన, బాణాల శంభుదాసు, కూచిమంచి తిమ్మకవి ద్విపదకావ్యములుగా వ్రాసినారు. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో † 'పరశురామకవి' కృతమగు ద్విపదకావ్య మొకటి కలదట. సముఖము వెంకటకృష్ణప్పనాయకు డీకథను గద్యముగా రచించినట్లు - 1942 S. S. L. C - తెలుగుటెక్స్టు - పు. 170 లో తెలుపబడియున్నది. ‡ 'సిద్ధనగౌడు' అను లింగధారి వ్రాసిన యక్షగానము (గుజిలీపుస్తకము) ఒకటి ప్రచారములో నున్నది. $ విశాఖమండలములోని 'మరువాడ' గ్రామవాసి 'పసకాడ సన్యాసి' యను సాలెకులస్థుడు సారంగధర చరితను పాటగా పాడినాడు. § స్త్రీల సారస్వతములోని సారంగధరచరిత్ర పాటలు రెండు శ్రీ చింతాదీక్షితులుగారు ప్రకటించినారు.

మారవి కవికృత భాస్కరశతకములోని,

'అంగన నమ్మరాదు తనయంకెకు రాని మహాబలాఢ్యు వే
భంగుల మాయలొడ్డి చెఱుపం దలపెట్టు; వివేకియైన సా

† చూ. కూ. తిమ్మకవి సారంగధర చరిత్ర పీఠిక.

‡ ఈ పుస్తకమును శ్రీ చింతా దీక్షితులుగారు నాకు దయచేసినారు.

$ చూ. గి. వ్యాససంగ్రహము. (పు. 3౨౨.)

§ చూ. గి. వ్యా. (పు. ౨౪3.)

రంగధరుఁ బదంబులు కరంబులు గోయఁగఁ జేసెఁ దొల్లి చి
త్రాంగి యనేకముల్ నుడువరాని కుయుక్తులుపన్ని భాస్కరా.'

అను పద్యము సారంగధరుని కథకును తెనుగువారి హృదయములకును గల చిరకాల పరిచితిని సువ్యక్తము చేయుచున్నది.

## ౧౫ కథాప్రారంభము

ఈ సారంగధర రచనకు మూలము గౌరన నవనాథచరిత్ర మని చెప్పితినిగదా. వెంకటకవి కథాసరణిని గూడా ఆ గ్రంథమునుండియే గ్రహించినాడు. కాని ఉప క్రమణోపసంహారములలో కొన్ని యంశములను తొలగించినాడు. కథాపురుషుల నామములలో కొన్ని మార్పుచేసినాడు. వానిని క్రమముగా చూపి అందువలని గుణ దోషములు కూడా వివరిస్తాను. నవనాథచరిత్రమున కథాప్రారంభ మిట్లున్నది.—

శివపుత్రుడగు మీననాథుడు తండ్రి యాజ్ఞను పొంది భూలోకమునకు వచ్చి, 'కాళింగ బంగాళ...కోస లాది' దేశములు చూచుకొనుచు వచ్చి వచ్చి, మాళవదేశ మును చొచ్చి, 'ఆదేశపు రాజు 'రాజమహేంద్రుడు' మంచివాడనియు, అతడుండు 'మాంధాతపురము' దర్శనీయ మనియు, అచటి జనులవలన విని, చూచు వేడుకతో ఆ పురమున కరిగి, అందు కొంతకాలముండి, పిమ్మట, అచటికి సమీపముననున్న కొండగుహలో వాసమేర్పరుచుకొని, యోగాభ్యాసమున కాలము గడుపుచుండెను. మీననాథుడు, తన జాడల నొరు లెరుగకుండుటకై మారువేషముతో అలమందలకు పోయి- పా లడిగి పుచ్చుకొనుచు దేహయాత్ర సాగించుచుండెను. కొంతకాలమునకు రాజనరేంద్రుని పసులకాపరి యగు ఒక గొల్లవాడు మీననాథునికి భక్తుడై, ప్రతి దినమును సూర్యోదయవేళకు - కమ్మగా కాచిన ఆవుపాలు తెచ్చి యిచ్చుచుండెను. గొల్లని భక్తికి సంతుష్టుడై మీననాథు డాతనియెడ మిగుల దయగలిగి యుండెను.— అన్న తర్వాత:— 'ఇట నంత రాజమహేంద్ర భూవిభుఁడు...రాజ్యము సేయుచుండెఁ, గొడుకు నొక్కరుని...బడయంగ మదిఁ గోరి...పార్వతీరమణు...నాశ్ర యించి' అని సారంగధర కథాప్రారంభము. తక్కిన కథయంతయు ఈపద్యకావ్య మున నున్నట్లే.

వేంకటకవి మత్స్యనాథుని మాట యెత్తలేదు; గొల్లని గొడవను తడవనూలేదు. అందువల్ల ప్రధానకథ కెట్టిభంగమును లేదుగాని,

'తనగుహలోపలఁ నిలిపి తాను గ్రోలఁగఁ జిక్కనట్టి చి
క్కని తరిపాలు దానపుడు కంఠముమోవఁగఁ ద్రావఁజేయ,' (3-౧౯౪.)

అన్నచోట 'ఈ తరిపాలు ఎక్కడివి?' అన్న శంకకు సరియైన సమాధానము లభింపదు. అంతమాత్రమే.

## ౧౬. కథారంగము

గౌరనకృతిలో కథారంగము 1 మాళవదేశమున 2 మాంధాతపురమనియు, ఆపురమున కధిపతి రాజమహేంద్రుడనియు నున్నది.

ఇక్కడ వెంకటకవి ఒక చిన్న పోకిరి పని చేసినాడు. ఏమనగా ? మాళవదేశమును మాళవదేశముగానే యుంచి 'మాంధాతపురము' ను 'రాజమహేంద్రము'గను, 'రాజమహేంద్రు'ని- 'రాజనరేంద్రుడు'గను మార్చినాడు. అంతేకాక ఆ రాజనరేంద్రునికి 'రాజరాజనరేంద్రుడు', 'రాజరాజు' అనునవి పర్యాయనామములన్నాడు.

గీ. ‹మహిని రాజనరేంద్రుఁడు, మాళవపతి,
‡ రాజరాజనరేంద్రుఁడు, రాజరాజు
ననఁగఁ బేరెన్నికకు నెక్కి యతిశయిల్లు
నింద్ర విభవుండు $ రాజమహేంద్రవిభుఁడు.' (౧-౫.)

---

1 'Hindustan and Dukhan were divided into four kingdoms. Gurjara westword. Malwa centrical. Gauda (Bengal and Bahar) eastward and Lateswaraj south word & etc" (చూ. బ్రౌ. 'లాటదేశము.')

2 "మాంధాతపురము కథాప్రయోజనమునకయి కవి కల్పించినది కాదు. ఇంపీరియల్ గజిటియర్ ఆఫ్ ఇండియా - అను గ్రంథమున మాళవదేశమున నర్మదానదియొడ్డున మాంధాతపురము కలదని వ్రాయఁబడియున్నది. అది గొప్ప పుణ్యక్షేత్రము. అక్కడ సిద్ధేశ్వరాలయ మొకటి కలదఁట." (6-5-22. ఆంధ్రసారస్వతానుబంధము.) వే. ప్రభాకరశాస్త్రి.

‡ మాళవ దేశాధిపతియు, ఉజ్జయినీపురాధిపతియు, శృంగవంశ సముద్భవుఁడును నగు 'రాజరాజనరేంద్రు' డొకడు కలడనియు, ఆతనికిని కుసుమసెట్టి కూతురికిని సంబంధించిన కథ యొకటి మార్కండేయ పురాణోత్తరభాగమున కలదనియు, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసినారు. (చూ. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక. పు. ౧౪౭.)

$ రాజమహేంద్రవిభుఁడు- అనగా రాజమహేంద్రము యొక్క ప్రభువు అని యర్థము. ఈ యర్థమును గ్రహింపక వే. వే. శాస్త్రిగారు అసమంజసార్థమును చెప్పినారు. (చూ. పు. ౧౧.)

రాజరాజనరేంద్రుడు; రాజరాజు; రాజమహేంద్రుడు అను నామాంతరములు గల రాజనరేంద్రుడు ఆంధ్రదేశమున రాజమహేంద్ర(వర)మునకు ప్రభువనుట సుప్రసిద్ధము కావున వెంకటకవి చేసినమార్పు - అదాటున విన్నవారికిని - కన్నవారికిని, సారంగధరచరిత్ర ఆంధ్రదేశమున - రాజమహేంద్రమున - రాజనరేంద్రునియింటనే ప్రవృత్తమైనది కాబోలు నన్న భ్రాంతికి హేతువగుచున్నదిగదా? కాలక్రమమున మాళవదేశముమాట మరుగుపడిపోగా - ఆ కథ ఆంధ్రదేశమున జరిగినన్నదియే సిద్ధాంతముకాగా - రాజమహేంద్రమున 'సారంగధరునిమెట్టు'; 'చిత్రాంగిమేడ' 'రత్నాంగిమేడ' వెలసినవి. అయితే పరిశీలించి చూడగా ఆ 'మెట్టు' ఆ 'మేడలు' రాజమహేంద్రమున వెలయుటకు కారణము వెంకటకవి తన రచనలో చేసిన యీ చిరుతుకమార్పు కాదనియు, సారంగధరునికథ నిజముగా రాజమహేంద్రముననే జరిగినట్లు చెప్పు వ్రాతలు వెంకటకవికాలమునకు ముందే కలవనియు తేర్పడుచున్నది.

క్రీ. శ. 1560 ప్రాంతమున ‡ బాలభాగవత మను ద్విపదకావ్యమును రచించిన దోనేరు కోనేరుకవి, విమలాదిత్యుడు భానుమతియందు రాజరాజనరేంద్రుని గనెననియు, అతడు రాజమహేంద్రివరంబను పేరి రాజధానిం గట్టించి వేఁగిదేశం బేలెననియు,

'ఆ రాజమణికార్యుఁడగు పెద్దకొడుకు - సారంగధరుఁ డతిశాంతుఁడైయుండి
ఆసక్తిఁ బినతల్లియైన చిత్రాంగి - చేసిన యాపదఁ జెచ్చెరఁగడచి
అనఘుఁడై చౌరంగి యను సిద్ధుఁడయ్యె'

ననియు వ్రాసియున్నాడు. కావున సారంగధరునికథ రాజమహేంద్రివరమునకేనాడో ముడిపెట్టబడినది. అట్టి చిరకాలబంధమును వదలింప గొంకియు, కేవలమసత్యమును లిఖింప జంకియు కాబోలు, చేమకూరకవి 'సారంగధరునికథ జరిగినది ¶ రాజమహేంద్రమున రాజనరేంద్రుని యింటనే' అనిచెప్పి(అశ్వత్థామా హతః -కుంజరః. అన్నట్లు) 'అయితే అది మాళవదేశములో' అన్నాడు.

---

‡ ఈ గ్రంథమును శ్రీ. కో. రామకృష్ణయ్యపంతులుగారు నవనాథచరిత్ర పీఠికలో ఉదాహరించినారు.

¶ వే. వేం. శాస్త్రిగారు, (సారంగ - విజ్ఞప్తిలో) 'ఈ...కథాపురుషులు రాజమహేంద్రవరము నేలిన రాజరాజనరేంద్రుడును తత్పుత్త్రుఁడు సారంగధరుఁడు నని యాంధ్రదేశమున వాడుటకలదు. కాని ఈ గ్రంథమందు ఈ రాజరాజనరేంద్రుఁడు మాళవరాజుగా చెప్పఁబడి యున్నాఁడు' అన్నారు.

ఇక వెంకటకవి గ్రంథమునకు వెనుక పొడమిన సారంగధరచరిత్రలలో మాంధాత పురముతోపాటు మాళవదేశముకూడా మాయమైపోయినది.

---

రాజరాజనరేంద్రుడు మాళవరాజుగానే కాక, రాజమహేంద్రము నేలినవాడుగా కూడా చెప్పబడియున్న సంగతి శాస్త్రిగారికి తెలియలేదు.

నవనాథచరిత్ర పీఠికలో శ్రీ రామకృష్ణయ్య పంతులుగారున్ను 'సారంగధర చరిత్రమును ప్రబంధముగా రచించిన వెంకటకవిగూడ సారంగధరున కాంధ్రదేశముతో...సంబంధ మున్నట్లు తెలిపియుండలేదు. ఈతడును గౌరనవలె రాజనరేంద్రుని మాళవపతిగానే వర్ణించియున్నాడు' అన్నారు.

. 6—5—22 ఆంధ్ర- సారస్వతానుబంధములో 'సారంగధరునికథ' అను వ్యాసములో బ్ర॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రిట్లు వ్రాసియున్నారు.

"చేమకూర వేంకటనాథుఁ డను కవీశ్వరుఁడు ఈ సారంగధర కథనే యప్పకవి కంటె నలువదేండ్ల ముందు ప్రబంధముగా రచించినాఁడు. అందు సారంగధరుని తండ్రి రాజమహేంద్రుడు - మాళవపతి యని యున్నది. పద్య ముదాహరించు చున్నాఁడను.

గీ. 'మహిని రాజమహేంద్రుఁడు, మాళవపతి,
రాజరాజనరేంద్రుఁడు, రాజరాజు
ననఁగఁ బేరెన్నికకు నెక్కి యతిశయిల్లు
నింద్ర విభవుండు రాజమహేంద్రవిభుఁడు'

ఇంతవఱకు జరిపిన పర్యాలోచనము వలన సారంగధరుఁడు రాజమహేంద్రవరపు రాజరాజనరేంద్రుని కొడుకనుట కాధారముగా నగపడిన యహోబలపండితీయము నప్పకవీయము నప్రమాణము లగుటయేకాక యాతఁడు రాజమహేంద్రవరమువాఁడే కాఁడని ప్రబల నిషేధముకూడ లభించినది."

ప్రభాకరశాస్త్రిగారు కూడా పద్యార్థమును పరిశీలించి గ్రహించలేదు. ౨-౩౩ర వ వచనములో 'మాటవాసి గల రాజమహేంద్రవాసి' అని యున్న సంగతి గమనించినట్లును లేదు. అది యట్లుండగా, వా రుదాహరించిన పద్యములో - మొదటి పాదమున 'రాజమహేంద్రుఁడు', తుదిపాదమున 'రాజమహేంద్రవిభుఁడు' అని యిరువురున్నారు. రాజమహేంద్రుడు - మాళవపతి; సరే. మరి పద్యాంతమున పొడుకొనియున్న 'రాజమహేంద్రవిభుఁ' డెవడు ? ఆ పాఠమును వా రే ప్రతినుండి గ్రహించినారోగాని నేను చూచిన ప్రతులలో 'రాజనరేంద్రుఁడు - మాళవపతి' అనియే యున్నది. అంతేకాదు; వెంకటకవి గ్రంథములో రాజుకు 'రాజమహేంద్రుడు' అను పేరు లేనేలేదు.

(వే. వేం. శాస్త్రిగారు ప్రకటించిన ప్రతిలో) బా. శంభుదాసుడు మాళవ దేశముమాట యెత్తక రాజరాజనరేంద్రుడు ¹రాజమహేంద్రవరము నేలిన ప్రభువని మాత్రమే చెప్పినాడు.—

'చతురుఁడు రాజరాజనరేంద్రుఁ డపుడు- రాజమహేంద్రవరంబు చెన్నారు
రాజధానిగ నెల్లరాజులు గొలువ- ఏకచక్రంబుగా నేలుచు.' (పు. 2, 3.)

శంభుదాసుడు 'రాజమహేంద్రము' ను 'రాజమహేంద్రవరము' గా సవరించినాడు. అయితే, అతడు సారంగధరునికికన్యను వెదకఁబోయినవారు - 'మాళవ నేపాళ మగధ పాంచాల- చోళ మత్స్య పుళింద శూరసే నాంధ్ర' దేశముల జరించినట్లు చెప్పినాడు. అందువల్ల ఆతని 'రాజమహేంద్రవరము' మాళవదేశములోనిది కాదు సరికదా ఆంధ్రదేశములోనిదిన్ని కాదు; మరి యెక్కడిదో ?

కూ. తిమ్మకవి, యీ సారంగధరునికథ గోదావరియొడ్డున రాజమహేంద్రవరములోనే జరిగినదని స్పష్టముగా లిఖించినాడు; చూడండి.

"తిలకింప గౌతమీతీరదేశమున- సేతు కాశీముఖక్షేత్రంబులట్ల
భూతలఖ్యాతిచేఁ బొదలుచుఁ గోటి - లింగ తీర్థ స్నానలీలలఁ బొంపె (?)
సంగి మార్కండేయ శంభుపదాజ్జ- పూజావిధ ప్రాప్తి పొసఁగ నెసంగు
రాజమహేంద్రవరంబను వీడు- ఆవీడు పాలించు ననయంబు వేల్పు
టా వీ డితని కంచు నర్థులు వొగడ- రాజరాజనరేంద్ర రాజన్యవరుఁడు."

ఇక నిటీవల బయలువెడలిన వ్యాఖ్యానములలోను, కావ్యములలోను, సారంగధరుని కథ ఆంధ్రదేశమున- రాజమహేంద్రవరమున, జరిగినట్లు వర్ణింపబడుటలో వింత యేముండును ?

---

¹ 13—5—22 ఆంధ్ర- సారస్వతానుబంధములో వే. ప్ర. శాస్త్రిగారిట్లు వ్రాసినారు.- "ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో...బా. శం. ద్విపద సారంగధర చరిత్రము చేతికిఁ జిక్కినది. అది యనేక ప్రతుల పాఠభేదములతో ౖబౌను దొరగారు వ్రాయించినది. అందు సారంగధరుఁడు రాజమహేంద్రము వాఁడని కానరాదు. అనేకప్రతుల పాఠభేదములను వారు వ్రాయించిరి. ఏ ప్రతిలోను రాజమహేంద్రము ప్రస్తావము కానరాదు. మహోపాధ్యాయ శ్రీ వేంకటరాయ శాస్త్రులుగారు ముద్రించిన ప్రతిలో రాజమహేంద్రవరము వాఁడని యున్నది. ప్రాంత గుజిలీపుస్తకమును జూచి వారు పునర్ముద్రణము చేసినారు. ఆ పుస్తకములో నుండెనేమో. తాళపత్ర ప్రతులలోఁ గానరాదు."

హఠయోగప్రదీపికా వ్యాఖ్యానములో- శ్రీ రాచకొండ అన్నయ్యశాస్త్రి గారు - 'మత్స్యేంద్రనాథుఁడా చౌరంగిని యనుగ్రహించెను. ఈ మత్స్యేంద్ర చౌరంగుల వృత్తాంతము ఆంధ్రదేశమునందు ప్రచలితమై యున్న సారంగధరచరిత్రమై యుండఁబోలు' (పు. 14.) నన్నారు.

§ కీ. శే. వంగూరి సుబ్బారావుగారు సారంగధరునికథ రాజమహేంద్రవరమున జరిగినట్లే భావించినారు.

నా మిత్రుడు కవికోకిల జి. జాషువ, రాజమహేంద్రవరములో- చిత్రాంగి మేడలో ఇప్పటికిని పావురాలు మూలుగుచున్నవంటాడు; వినండి.

'తొలి సారంగధరుండు వట్టి యపవాదుఁ నెత్తిపైఁ దాల్చి క
త్తులపాలైన విషాదగాథ వినలేదో నీవు చిత్రాంగి మే
డలలో మూలుగుచున్న విప్పటికిఁ గూడన్ బావురాల్, నీతికిన్
బలియై పోయిన రాజనందనుని దౌర్భాగ్యంబు నూహింపుచున్.'

—గబ్బిలము.

ఇట్లు సారంగధరునికథ తొలుత మాళవదేశమున- మాంధాతపురమునబుట్టి, రాజమహేంద్రము మార్గమున అంచెలమీద ఆంధ్రదేశమునకు దిగి రాజమహేంద్రవరమున ఇరవుకొన్నది. అంతతో ఆగినదా ? గుంటూరుమండలమునను ప్రతిఫలించి గులకరించినది. †గుంటూరుజిల్లా- పల్నాడుతాలూకాలో కృష్ణదరిని 'సారంగుపల్లె' యని ఒక చిన్నగ్రామమును, దానికి సమీపమున 'సారంగధరగుట్ట' యను చిన్న కొండయును, ఆ కొండమీద సారంగధరుని కాళ్లు చేతులు ఖండింపబడెనన్న కథయును కలవు. కొంచెము శ్రమకోర్చి విచారించినచో అందుకు తగిన స్థలపురాణము కూడా ఆ ప్రాంతముల లభింపవచ్చును. నెల్లూరుమండలమునను, కోవూరు తాలూ

---

§ శతకకవుల చరిత్రలో కూ. తిమ్మకవి సారంగధర చరిత్రను గూర్చి వ్రాస్తూ ఇట్లన్నారు.

'చిరకాలమునుండి వ్యాపించి సారంగధరునిమెట్ట మొదలగు చిహ్నములు గూడ గలిగియున్న యీ కథ సత్యమే యని స్థాపించుట కీ కావ్యము ప్రబల సాక్ష్యము కావలసిన యవసరము లేకపోయినను...రాజరాజు గాథలు తిమ్మకవినాటి కెట్లు ప్రచారమునందున్నవి తెలిసికొనుటకైన నిది యాధారము కాఁగలదని నమ్ముచున్నాను.' (పు. 233.)

† ఈ సంగతిని నాకు బ్ర॥ మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు దయతో తెలిపినారు.

కాలో చిత్రాంగికోట, రత్నాంగికోట, అను ప్రదేశములు వెలసినవిగాని, ఎందు వల్లనో సారంగధరుని కథ మాత్ర మా ప్రదేశములకు ముడిపెట్టబడలేదు. ¶ఇట్లే సారంగధరుని కథతో సంబంధములేని రత్నాంగిమేడ - చిత్రాంగిమేడ- యున్న స్థలములు కన్నడదేశములో హంపీ సమీపముననున్న కంపిలి నగరము ప్రాంతమునను గలవట !

ఇంతకును చెప్పవచ్చినదేమంటే ? మహాత్ములకథలను - మహాపురుషుల జీవితములను తమతమ అభిజనములకు - అనువగుచో అన్వయములకును, అతుకుపెట్టుకొని యానందించుట మానవస్వభావము. (ఇందుకు, బమ్మెరపోతరాజును ఒంటిమిట్టకు లాగజూచుట, ‡గజేంద్రమోక్షణము (రాజమండ్రికడ) గోదావరిమడుగులోనే జరిగినదనుట, మొదలగు తార్కాణలు మనమెరిగినవి యెన్నియేని కలవు గదా?) చేమకూర వెంకటకవియును అట్టి యానందలేశము నభిలషించియే - ఆలాటి చిన్నమార్పును చేసెనేమో యని తోచుచున్నది. కానిచో, గౌరనకథను యథాక్షరము గ్రహించినవాడు - ఆ పేరులను మాత్రము మార్చవలసిన అక్కరయేమి ?

సారంగధరచరిత్రమును చెప్పు గ్రంథములలో ఇప్పటికి లభించినవానిలో గౌ. నవనాథచరిత్రమే ప్రాచీనతమము. అది 15వ శతాబ్దిపూర్వార్ధమున రచింపబడినదని పెద్దల సిద్ధాంతము. గౌరన తాను ఆ నాథచరిత్రమును శ్రీగిరి కవికృత పద్యప్రబంధమునుబట్టి రచించినట్లు చెప్పుకొన్నాడు.

"అపర, శివమూర్తి సంతతాశ్రిత కల్పతరువు. ఘనముక్తి కాంతభిక్షావృత్తి రాయ, డనుపమంబైన మహావైభవంబు- దనర...గొలువుండి,- నవనాథవరుల పుణ్యప్రవర్తనలు, పరగ- శ్రీగిరికవి పద్యబంధముల విరచించినాఁ డది ద్విపదకావ్యమునఁ- జెప్పింపవలయు, ... ... ... చెప్పి కమలజ విష్ణుసేవ్యమానునకు, శ్రీశైలపతికి... అంకితం బొనరింపుమనుచు తాంబూలంబు లొసఁగి, గారవించుటయు,...శ్రీ మల్లికార్జున శ్రీమహాదేవు పేర నే నొనరించి ప్రియ కథాసూత్రి- మేరీతిననిన."— (నవనాథ. పు. 7.)

---

¶ చూ. నవనాథ. పీఠిక. పు. XXVI.

‡ గజేంద్రమోక్షణము గోదావరిమడుగులోనే జరిగిన దనియు, గజేంద్రాకృతి గల కొండ యిప్పటికిని ఆకథను సూచించుచు (రాజమండ్రికడనే) ఆమడుగు ఒడ్డుననే యున్నదనియు శ్రీ గరిమెళ్ల కృష్ణమూర్తి పంతులుగారు - (డిస్ట్రిక్టుమునసబు) నెల్లూరిలో ఒకనాటిసభలో సభ్యులకు విన్నవించినారు.

శ్రీగిరికవి పద్యప్రబంధమును పఠించు భాగ్యము మనకు ఇప్పటికిలేదు. కాన అం దీ సారంగునికథ యేదేశమున- ఏప్రదేశమున- ఎట్లు ప్రవృత్తమైనట్లు చెప్పబడి యున్నదో తెలియదు. మనకు గౌరన కృతియే ప్రమాణము. దానినిబట్టి సారంగధర చరిత్ర *మాళవదేశమున- మాంధాతపురమున జరిగినట్లు భావించుటయే సమంజసము. †అప్పకవి, సారంగధరుని కథకును- నన్న యాంధ్రపక్కికిని పొత్తుకలిపి పొలిపిన గాథ కలలోని వార్త గావున విశ్వాస్యము కాదని శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులుగారు, నవనాథ- పీఠికలో విపులముగా విమర్శించి చెప్పినారు గావున ఆజోలి యిక మన కక్కరలేదు.

ఒక్కమాట.— వే. వేం. శాస్త్రిగారు 'మఱి యీ కథకు మూలమనందగి నట్టిది చౌరంగి యను మహాపురుషునికథ ‡నాథచరిత్రములం దిట్లున్నది' అని భులేశ్వరవృత్తాంత మొకటి యుదాహరించినారు. (చూ. సారంగ -పీఠిక.)

అందు సారంగధరుని కథ పోలికలున్నవి. అంతేగాని వేంకటకవి రచన కది మూలముకాదు. గౌరన నవనాథచరిత్రమే వేంకటకవి సారంగధర కథకు మూలము.

## ౧౭ చిత్రాంగి

గౌరనకథలోను, అట్లే యీ పద్యకావ్యములోనుగూడా 'చిత్రాంగి' రాజ నరేంద్రుని ఉంపుడుగత్తెగనే చెప్పబడినది.

సుబుద్ధి మాటలు.—

"కటకటా నీవెఱుంగని నీతికలదె ?
అలలకుఁ వెలయాండ్లకు మదిని
కలకాలములును నెక్కడివి నిల్కడలు." (నవ - పు. 41.)
"...'చిత్రాంగి తల్లి నాకనియె దకట
వారకాంతల కెందైన వావిగలదె ?" (ఇందు - ౨-౨౫.)

---

* స్త్రీల పాటలలో ఈ కథ మాళవదేశమున జరిగినట్లే యున్నది. సిద్ధన గాడు, కథాస్థానము 'హస్తినాపురి' మన్నాడు.

† అప్పకవి వ్రాత ననుసరించి అహోబల పండితుడును- 'రాజరాజ తనూజాత స్సారంగధరబాలకః, సకృతః పాణిపాదేన రహితోఽజనిహేతునా; మత్స్యేంద్ర నామ సిద్ధేంద్ర మహిమ్నా సిద్ధతాంగతః' అన్నాడు. (చూ. అహో. పం. పీఠిక. 67—68.)

‡ ఈ నాథచరిత్ర మెవరు వ్రాసినదో వారు చెప్పలేదు.

బాణాల శంభుదాసు డిచిత్రాంగిపాత్రవిషయమున కొంత చిత్రకథ కల్పించి నాడు. సారంగధరునికొరకు వ్రాసి పంపిన చిత్రాంగిపటము తనచేతికి రాగా, రాజ నరేంద్రుడు చూచి మోహించి, – '...అచ్చటికి కత్తినిబంపి' వివాహకార్యము నెరవేర్చి † చిత్రాంగిని తనభార్యగా చేసికొనెనట. పిమ్మట చిత్రాంగి తన చెలికత్తెలతో – 'పటములో వ్రాసిన బాలుండు గాఁడు – ఎటువంటి దీసుద్ది యెఱిఁగింపుఁ' డనెనట. అపుడా చెలికత్తెలు – 'పటములో లిఖింపబడినవాఁడు పట్టపుదేవి రత్నాంగి కొడుకు– సారంగధరుడు – నవమన్మథుడు' అని చెప్పిరట. చిత్రాంగి తన తలవ్రాతకు చింతించి – 'కలితసుందరమూర్తిఁ గన్నులఁజూడ – సమయంబుఁ దలపోసి సారంగధరుని – రాకఁ గోరుచు నుండె'నట. తరువాతి కథ యంతయును సమానమే.

కూచిమంచి తిమ్మకవియు చిత్రాంగిని రాజకన్యగను– రాజుభార్యగను, భావించినాడు. అందువల్లనే, సారంగధరునిచేత, 'పరికింప నెఱరాచ పడఁతు లెందైన– ధర నన్యపురుషులఁ దలఁపఁగోరుదురె ?' అని అనిపించినాడు. కాని చిత్రాంగి రాజకన్యయు ఇల్లాలును నైనచో, అట్టి కనువేదురును – అంతటి గయ్యాళితనమును ఆమెయెడ కలుగ జెప్పుట యొప్పదు సరిగదా, బుద్ధిమంతుడైన సుబుద్ధి ఆ యిల్లాలి శీలమును ముందుగా – అకారణముగా– అంతగా శంకించి – 'అక్కడికేగినచో కీడు తప్పక కలుగు' నని చెప్పుటయు – సారంగధరుని యత్నమున కంతగా అడ్డగాళ్లు వేయుటయు, అనుచితప్రసంగ మనిపించుకొనును. కాబట్టి శంభుదాసుడు చేసిన సవరణ సరసమైనదికాదు. తదనుసారి తిమ్మకవి రచన రుచిరమైనదికాదు.

## ౧౮ మంజువాణి

గౌరన సారంగధరుని భార్యపేరు 'మంగళాంగి' యన్నాడు. తన కల్పనా చమత్కృతికి అనువుగా లేదని కాబోలు వెంకటకవి 'మంగళాంగి'ని 'మంజువాణి'గా మార్చినాడు. (చూ. ౧-౬౦.)

## ౧౯ ఉపసంహారము

గౌరన కృతిలో చివర సారంగధరుడు మత్స్యేంద్రుని నిగ్రహమునకు గురియై పిమ్మట అనుగ్రహమునకు పాత్రమై తరించుటను తెలుపు కథాభాగము చక్కని రచనకలదీ కొంత కలదు. నీతిమార్గమునే కాక నివృత్తిమార్గమునుగూడా మనసుకెక్క– బోధించు ఆ మంచి ఘట్టమును వెంకటకవి యెందువల్లనో చాలా సంక్షేపించినాడు. వేదాంతబోధ కావ్యశిల్పమునకు తగినది కాదనుమతమునకు చేరినవాడేమో అతడు ?

† సిద్ధనగౌడుని యక్షగానమునను, స్త్రీల పాటలలోను గూడా చిత్రాంగి రాజు రెండవభార్యగానే చెప్పబడినది.

## ౨౦ మత్స్యేంద్రనాథుడు

గౌరన, సారంగధరు ననుగ్రహించిన సిద్ధుడు 'మీననాథు'డనియు, ఆతడు శివ తనూభవుడనియు చెప్పి, ఆ మీననాథునే అందందు 'మత్స్యనాథు' డనియును వ్యవహరించినాడు. మీన మత్స్యశబ్దముల కర్థమున భేదములేదుగాని, మీననాథుడు - మత్స్యనాథుడు, భిన్నవ్యక్తులు.

"శ్రీ ఆదినాథ మత్స్యేంద్ర శాబరానందభైరవాః
చౌరంగీ మీన గోరక్ష విరూపాక్ష బిలేశయాః." హఠయోగప్రదీపిక. (1–5.)

అందు ¶ మత్స్యేంద్రనాథుడే శివతనూభవుడు. † మీననాథుడు మత్స్యేంద్రనాథుని కుమారుడు. మురుడీనగరపు రాణియైన 'మైనాకిని'యందు కలిగినవాడు. పరిశీలింపగా నాథపంథకు చేరిన నాథపరంపరలో ప్రథముడును- ప్రభావవంతుడును మత్స్యేంద్రనాథు డనియే యేర్పడుచున్నది. హ. ప్ర. కర్తయైన శ్రీ స్వాత్మారామ యోగీంద్రుడు, మత్స్యేంద్రు నిట్లు స్మరించినాడు.

'హఠ విద్యాం హి మత్స్యేంద్ర గోరక్షాద్యావిజానతే
స్వాత్మారామోఽథవా యోగీ జానీతే తత్ప్రసాదతః.'

హఠయోగమున మత్స్యేంద్రనాథుని పేర ఒక యాసనముకూడా కలదు. (పు. 18.)

మత్స్యేంద్రనాథుని గూర్చిన ప్రశంస 'హఠవిలాసము' లో ఇట్లున్నది.—

సీ. "ఏదేవిఁగొల్చి మత్స్యేంద్రనాథాదులు యోగ సంసిద్ధికి నోడయులైరి." (పీఠిక. 3.)

సారంగధరు ననుగ్రహించిన నాథుడు మత్స్యేంద్రు డనియే హ. ప్ర. వ్యాఖ్యాతలు వ్రాసినారు. అందువలననే కాబోలు వేంకటకవి తన గ్రంథమున మత్స్యేంద్రునే పేర్కొన్నాడు. ఈ గ్రంథమంతయు పరిశీలించిరేమో! వే. వేం. శాస్త్రిగారు 'మీననాథుఁడు మత్స్యేంద్రుని కుమారు' డనుటయే గాక 'ప్రాచీన ముద్రణములో

---

¶ చూ. హ. ప్ర. వ్యాఖ్య.

† చూ. బచ్చు రామన్నగుప్తగారి 'నవనాథభక్తులచరిత్ర' (పు. 129.)

గుప్తగారు ఆ గ్రంథమును, దుండిరాజ కుమారుడగు మాలూ పండితుడు మహారాష్ట్రభాషలో 'నోవీ' బద్ధముగ విరచించిన గ్రంథము ననుసరించి రచించిరట. మాలూ పండితుని రచనకు మూలము గోరక్షసిద్ధుడు 'కీమ్యాగర' భాషలో వ్రాసిన గ్రంథమట. (చూ. పీఠిక.) ఆగ్రంథములో - మత్స్యేంద్ర గోరక్ష గహనీ జాలంధర కానీప భర్తరీవట సిద్ధనాగ రేవణ చర్పటులు నవనాథులని చెప్పబడియున్నది.

సారంగధరు ననుగ్రహించిన యోగిని పేర్కొనుటలో మత్స్యశబ్దము కొన్నిమాఱులు మీనశబ్దము కొన్ని మాఱులును గలవు. అయినను యతియందు మత్స్యశబ్దమే యుండుటం బట్టియు, చౌరంగిని రక్షించినవాఁడు మత్స్యేంద్రుఁడ యగుటంబట్టియు ఆనామము అన్ని యెడలను మత్స్యేంద్రనాథుఁడుగానే యుండనోపు' నని, చక్కని హెచ్చరిక వ్రాసినారు.

## ౨౧ చౌరంగి

చౌరంగులు - ఒకరి కిద్దరు ముగ్గురు తేలినారు. అందరును మత్స్యేంద్రుని మహిమచే నేర్పడ్డవారే. ఇందు సారంగధరుడు 'చౌరంగి' యయ్యెను. శాస్త్రిగా రుదాహరించిన కథలో - చంద్రశేఖరుడు 'చౌరంగి'యైనాడు. అట్లే బ. రా. గుప్త గారి గ్రంథములోను 'కృష్ణాగరుడు' అను రాజకుమారుడు 'చౌరంగి' అయినట్లున్నది. (అందలి ఈ కథ అంతయు సారంగధరుని కథయే. కథాపురుషుల పేర్లు మాత్రము భిన్నములు.) ఇట్లొకరికిద్దరు ముగ్గురు చౌరంగు లగుట యెట్లు? ఇంతకును 'చౌరంగి'యను పదమున కర్థమేమి ?

గుప్తగారి గ్రంథములో కృష్ణాగరుని కరచరణములు చతురంగపీఠముపై నరుక బడెననియు - అందువలన నతనికి చౌరంగనాథుడను నామము పెట్టబడె ననియు నున్నది. చంద్రశేఖరుడు 'చౌరంగి'యయిన విధమేమో శాస్త్రిగారు చెప్పలేదు. గౌరనయును 'అరుదార చౌరంగి యను నామ మొసఁగి - మరి వానికిట్లనె మత్స్యేంద్రుడెలమి' నన్నాడేగాని, ఆ పేరాసగుటకు కారణము చెప్పలేదు.- అందువల్ల సారంగ ధర చరిత్రము వ్రాసిన కవు లితరులును చెప్పలేదు. శబ్దార్థమును బట్టి నేనొక యూహా

---

| ఇందు- | అందు- |
|---|---|
| ఈ మాంధాతపురము. (రాజమహేంద్రము) | కౌండిన్యనగరము |
| రాజమహేంద్రుడు. (రాజనరేంద్రుడు) | శశాంగనృపాలుడు |
| రత్నాంగి. (పట్టపుదేవి) | మందాకిని. (మొదటిభార్య.) |
| సారంగధరుడు. | కృష్ణాగరుడు. |
| చిత్రాంగి. (ఉంపుడుగత్తె) | భుజావంతి - (మందాకినీ మరణానంతరము- రెండవభార్య. ఈమె తొలుత కృష్ణాగరునికై యుద్దేశింపబడినది.) |
| గొల్లవాడు - (తరువాత గోరక్షుడు.) | గోరక్షనాథుడు. |
| మత్స్యేంద్రనాథుడు. | మత్స్యేంద్రనాథుడు |

చేసితిని. (చూ. పు. ౫౧౫.) నా యూహామును బలపరచు వ్రాతయొకటి యిటీవల హ. ప్ర. వ్యాఖ్యానములో ఇట్లు లభించినది.—

'హిందూస్థాన భాషయందు కాళ్లుచేతులు తగ్గిన మనుష్యునకు చౌరంగి యని పేరు. మత్స్యేంద్రనాథాదు లరణ్యమున సంచరించు చుండినపుడు చౌరంగికి వారి దర్శనము కాఁగా కాళ్లును చేతులును వచ్చెను. అంత చౌరంగి మత్స్యేంద్రనాథాదులు సిద్ధపురుషులని గ్రహించి వారికి శిష్యుఁడాయెను. ఈ చరిత్రమే సారంగధర చరిత్రగా మాఱినట్లు తోఁచెడిని.'

ఎట్లయిన నేమి? చౌరంగులు ముగ్గురును పినతల్లి మోహామునకు గురియైనవారే; ముగ్గురును కరపాదఖండన దండన కగ్గమైనవారే; ముగ్గురును మత్స్యేంద్రుని మహిమచే మరల కరచరణములు పొందినవారే; అగుదురుగాక. మరి యీ ముగ్గురిలో నాథత్వమును పొందిన చౌరంగి యెవడు? 'అసలు చౌరంగి మన సారంగధరుడు; తక్కిన యిర్వురును నకలు చౌరంగులు' అనుకొనవచ్చునా? ఈ సారంగధరుని కథవంటి కథ కొంచెము మార్పుతో[1] కన్నడభాషలో- 'కుమార రాముని కథ' యను పేరుతో కలదట! ఆ కుమారరాముడును పినతల్లి మోహామునకు గురియైనవాడేనట! అయితే వానికి విధింపబడినది మరణదండనమట; అందువలన ఆకథలో కరచరణ ఖండనము; మత్స్యేంద్రుని మహిమ; చౌరంగి నామకరణము అనునవి లేవు. మొత్తము మీద ఈ పోలిక కథలన్నియు ఏదో యొకదానికి అనుకృతు లనుటలో తప్పులేదు. మరి మన సారంగధరుని కథయే తొలికథయై యుండునా?

శ్రీయుతులు ఒంగోలు వెంకటరంగయ్య పంతులుగారు 'చౌరంగి' యే కాలక్రమమున శారంగి - సారంగ - సారంగధరుడు, అయ్యె నన్నారు. వారి వాక్యములనే ఉదాహరించుచున్నాను.

"సారంగధర సమాసములోని సారంగశబ్దము "చౌరంగ" యను మహారాష్ట్రదేశభాషాశబ్దముగా నున్నది. మోల్సువర్తుగారి (Moles worth) మహారాష్ట్ర నిఘంటువునందు 'చౌరంగ' శబ్దమునకు కాలుసేతులు కట్టివేయబడుట (To be bound up hand & foot) అనియు, చౌరంగణ అను పదమునకు కాలు సేతులు తెగఁగొట్టబడుట (To mutilate by chopping off hands and feet) అనియు అర్థము లున్నవి. షేక్స్పియరుగారి (Shakespear) హిందూస్థాని నిఘంటువులో శారంగి అనగా కత్తిసాములో నొకవిధమైన దనియు - కత్తి త్రిప్పుటలో యెదుటనున్న జంతువుయొక్క నాలుగుకాళ్ళను ఒక్క దెబ్బతో తెగఁగొట్టుట అనియు నున్నది.

---

[1] చూ. నవనాథ. పీఠిక. (పు. XXV.)

ఈ యాధారములను చూచిన మూలపదము 'చౌరంగ' అనియుండి యుచ్చారణ భేదములచే 'సారంగ' అని మారియుండ వచ్చునని తోచుచున్నది. అట్లగునెడల వీనిపేరు సారంగుడని నిలువక సారంగధరు డెట్లాయెనని ప్రశ్నింపవచ్చును. వే. వేం. శాస్త్రిలవారు...ఈ సారంగధరుని కథకు మూలమనం దగినట్టిది 'చౌరంగి' యను మహాపురుషుని కథయని... తెలిపియున్నారు.— ఆకథలో చౌరంగునికి చంద్రశేఖరు డని పేరట— సాక్షాత్ చంద్రశేఖరుడె సారంగధరుడును అయి యుండుటచే కించిద్భేదమును కల్పించి 'చౌరంగ' శబ్దార్థము తెలియక ఆకథలోని చంద్రశేఖరుని సారంగధరునిగ యెవ్వరో మార్చియుందురు." (ప్రమాధి ఫాల్గున భారతి.)

సారంగధరుడు (భగవంతుడైన) చంద్రశేఖరుని యనుగ్రహమున పుట్టినవాడు. అందువలన "పటుబుద్ధి నెరయ నప్సార్థివేశ్వరుఁడు - సారంగధరుఁడని చంద్రశేఖరుని- పేరిడి యాబాలుఁ బ్రియమునఁ బిల్చు" కొన్నాడు. అంతేగాని, శాస్త్రిగారి కథలోని చంద్రశేఖరుని బట్టి సారంగధరు డేర్పడలేదు. సారంగధరుని కథకు శాస్త్రిగారి కథ మూలము కాదని నిరూపించితిని గదా!

చౌరంగ, సారంగ (ధర) శబ్దములలోని వర్ణసామ్యమును బట్టి పంతులుగా రట్లూహించిరిగాక. మరి కృష్ణగరుడు - చౌరంగియయ్యె నన్నచోటునో? అట్టి యూహ కం దవకాశము లేదుగదా?

## ౨౨ కవితావిశేషములు

సారంగధర చరిత్రము చక్కని జాను తెనుగు కావ్యము. జానుతెను గనగా, వ్యవహారసిద్ధమును- జాతీయము (idiomatic) ను నైన తియ్యని తేటతెనుగు. అచ్చ తెను గను పేర కల్పింపబడు కృత్రిమాంధ్రము ఈ జాతికి చెందినది కాదు. ‡జాను తెనుగును పాలకురికి సోమనాథకవియు, నన్నిచోడ కవిరాజు నిట్లు ప్రశంసించి యున్నారు.

'ఉరుతర గద్య పద్యోక్తులకంటె - సరసమై పరగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ- గూర్చెద ద్విపదలు గోర్కిదైవాఱ'

—బసవపురాణము.

'బలు పొడతోలు సీరయును, బాఁపసరుల్, గిలుపారుకన్ను, వె
న్నెల తల, సేఁదుఁ గుత్తుకయు, నిండినవేలుపు టేఱు, వల్దు వూ
సలు గల టేని లెంకవని జానుఁదెనుంగున విన్నవించెదన్
వలపు మదిన్ దలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా.'

—వృషాధిపశతకము.

---

‡ వివరములకు బసవపురాణ పీఠిక. (చూ. పు. ౮3.)

'సరళముగా(గ భావములు జాను(దెనుంగున నింపు పెంపుతో(
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన సర్గము లొత్తగిల్ల బం
ధురముగ( బ్రాణముల్ మధుమృదుత్వరసంబున( గందళింప న
క్షరములు సూక్తు లార్యులకు( గర్ణరసాయనలీల( బ్రాల(గాక్.'

—కుమారసంభవము.

వెంకటకవి తెనుగుపొలము నాలు(గంచులు తిరిగి, ఆటలు, పాటలు, ఆచారములు - అలవాటులు, సంప్రదాయములు - సాంగెములు మున్నగువాని తీరుతియ్యాను లెరిగి, సీమసీమలలోని జాతీయములైన పలుకుబడులను - నానుడులను (లోకోక్తులను) సంతరించి, అందు మేల్తరము లేర్చి కూర్చి, నుడికారపుసొంపుతో ప్రతిపద్య చమత్కృతితో ఈకమ్మని కావ్యమును తీర్చినాడు. అందువల్లనే, కేవల తత్సమపద గ్రథితములు - సంస్కృతభాషైకచాతురీ స్ఫోరకములు నగు ప్రబంధములకు తోబుట్టువయ్యును - ఈ కబ్బము చొక్కపు తెనుగుదనముతో శోభిల్లి తెనుగుతల్లి కొక క్రొత్తతోడవయి యలరారు చున్నది. ఇందు కవివాడిన నానుడుల లెక్కకంటెను, వానిని వాడుటలో అతడు చూపిన నేర్పు మిక్కిలి కొనియాడ దగినది.

లోకోక్తి యనగా సామెత. (= దృష్టాంతవాక్యము) అట్టి వాక్యమునందలి పదములు వాని యర్థము మన కప్రధానములు; ఆయర్థముద్వారా సూచితమగు భావము ప్రధానము.—

'ఇంటి దీపమని ముద్దుపెట్టుకోబోతే మూతిమీసాలు తెగ్గాలినట్లు' అనునది లోకోక్తి. ఇందలి దీపము - ముద్దుపెట్టుకొనుట - మీసాలుకాలుట - అను నంశములు అప్రధానములు. 'మనవాడు(గదా అని మేలుచేయబోతే - దుర్జనుడు కీడేచేయును' అనునది (భావము) ప్రధానము.

కవులు సామాన్యముగా లోకోక్తులను - భావప్రధానములుగానే వాడుచుందురు.

'అంతలేసి మహాత్ముల నింతసేయు
మాకు నినుసంహరించుట మాత్రమెంత?
యెందు గుడిమ్రింగువానికి నంది పిండి
వడియ మనుపల్కు లెఱు(గవే పుడమిలోన.' (విక్ర. 2—238.)

ఇందులో— గుడి...వడియము - అనుటవల్ల, అంతగొప్పపని చేయువానికి ఈ చిన్నపని యేపాటి, అన్న భావము తెలుపబడినది. అంతేగాని ప్రకృతమున, గుడి మ్రింగుట- నంది' ఇత్యాదులతో సంబంధములేదు. వెంకటకవి లోకోక్తిని వాడుచో-ఆయుక్తిలోని పదములకును - ఆ ప్రకరణమున సంబంధ ముండియే తీరును - చూడండి,

'ఇటు పూజింతము 'నేర్చిన, యటుల గిరీశు నొకయాకు నలమునఁ, గొండం
తటి దేవరకును గొండం, తటిపత్త్రి వెట్టువారు ధరణింగలరే ?' (౧-౧౬.)

ఇక్కడ, 'కొండంతటి దేవరకు కొండంతటి పత్త్రి వెట్టువారుకలరా' అనునది లోకోక్తి. గొప్పవారికి, వారిదర్జాకు తగినంతగా అర్పించి తనుపగలమా - అని భావము. 'ఆకు అలము' అనునది లోకోక్తి; ఏదో అల్పాల్పవస్తువు, అని భావము. పైరచనలో భావము మాత్రమే కాక, దేవర 'గిరీశుడు' కావున కొండంతవాడే యగుటయు, పూజా ద్రవ్యమగు పత్త్రి, 'ఆకు - అలమే' యగుటయు విశేషము. ఈక్రింది లోకోక్తులన్నియు నిట్టి చమత్కృతితో సమర్థింపబడినవే.

'కుత్తుకవిషము నాలుక బెల్లము'. (౧-౨౩.)
'ఏనుఁగుపోవు వీథి - సింహము మెడఁగంట.' (౧-౧౦౦.)
'గ్రామో నాస్తి కుతస్సీమా.' (౨-౭౭.)
'ఏటావలి గిలిగింతలు.' (౨-౧౬౩.)
'గాలి గలయప్పుడె తూరుపెత్తుఁ బట్టు.' (౧-౧౬౪.)
'తలప్రాణము తోకకు వచ్చె.' (౨-౧౨౯.)
'మేనమామపోలిక.' (౨-౧౭౨.)

జాతీయోక్తులతో శ్లేషార్థమును సమర్థించుటయందును వెంకటకవి నిరుపమానుడు:—

'శకున మడ్డగించిన పని.' (౨-౪౯.)
'బొట్టుపెట్టినట్లు.' (౨-౧౬౮.)
'పట్టియాడు.' (౨-౨౦౯.)
'పులుసు విఱుగు' (౨-౨౨౨.)
'పిచ్చుకుంటుమీఁద భాగీరథి' (౩-౧౭౭.)

ఇక శ్లేష బిగింపులులేని సాదా పలుకుబడులా ? కావలసినన్ని:—

'మనసెఱుఁగని కల్ల - ఒడలు మఱచిన నివము.' (౨-౩౨.)
'మెత్తని చోటనె గుద్దలివాడి.' (,,—౩౪.)
'నిలువు నీరునఁ బండినట్లు.' (,,—౮౨.)
'కులానికి సొడ్డంటే చిన్నప్పుడే వేరుపడ్డానన్నట్లు.' (,,—౧౦౯.)
'నీళ్లలోని ముల్లు.' (,,—౨౫౫.)
'వ్రేళ్లసందు జాఱువారు.' (౩—౫౪.)
¹ 'మూడు తెరువులు.' (,,—౧౦౭.)

---

¹ మూడు తెరువులు- వంటిదే, 'మూడు వలపుల్' అను జాతీయము.
చ. 'యిటు లాడిసంగమం, బునసె విభుండు మూడువలపుల్ వలచెన్
ఫణిరాజ కన్యకన్.' (విజ. ౧-౧౨౮.)

ఇది యనువాదము- అని తెలియకుండునట్లు సంస్కృతోక్తులను తెనుగున వెల యించుటలో వెంకన గట్టివాడు.—

(a) 'భామినీ, రాజుల చిత్తముల్ తెలియరా దెటుపో యెటువచ్చునో.' (౨—౮.)

సంస్కృతము.— 'విశ్వాసో నైవ కర్తవ్యః స్త్రీషు రాజకులేషుచ.' (హితో. మిత్రలాభః. ౨౦.)

(b) 'పదరకుమీ లెస్స పదిం, బదిగ విచారించి సేయు మంచిదిసుమ్మీ.' (౨—౨౬౧.)

సం.— 'సహసా విదధీత నక్రియామ్.' (చూ. సారంగ. పు. 3౫౮.)

(c) 'రాజానుమతము ధర్మము.' (౨—౨౨౭.)

సం.— 'రాజ్ఞా య దనుమతో ధర్మః.'

(d) 'కలికితుమ్మెదయానినలుంగనివిరిం బోని, మొలకప్రాయముం బూని యలరు వాని.' (3-౧౦౮.)

ఈభావము శాకుంతలములోని 'అనాఘ్రాతం పుష్పమ్' అను శ్లోకమునుండి గ్రహింపబడినది.

సారంగధరకర్త వాడిన శబ్దము లనేకము శ. ర.లో లేవు. కొన్ని గ్రామ్యము నను లేవు. (ఈవ్యాఖ్యానమున నాకెక్కువ ఉపకరించినది గ్రామ్యమే.)

(1) 'బజగెడి' (= బజగేడి.). 3—౨౧3.

ఇది 'నానగేడి' వంటిది కాబోలును! (చూ. నాగపూడివారి పారిజాతము. 5—20.)

(2) 'చనుమానము' (౨-౬3.)

(3) 'సబ్బిణి.'

వెంకటకవికి శబ్దాలంకారమున మక్కువ యెక్కువ. అందును యమకమున ఆతడు పెట్టినది పేరు. మచ్చుకు;—

'జనవరులకున్ § - జనవరులకున్ - మనసరులకున్ - దొరలకున్' (౧-౨౭.)

'బోటియలకడ - నెటియలయెడ - నెటియలవడ.

పరియలుగా - మరియలుగా - నురియలుగా.' (౨-౧౦౬.)

---

§ 'చనవరి' యను పదమున క్రిందిది ప్రయోగము నాకిటీవల జ్ఞప్తివచ్చినది.— "నీ; కనుగుణమైన యానమును నాసనమున్ రుచిరాతపత్రముం, జనవరి కొల్వునిచ్చెద గజవ్రజముం బరికింపు పెంపుతోన్." (భా. విరాట. 1—220.)

'నందనసంతానము - (ఆశ్రితపటలీ) నందన సంతానము.' (౧-౭౫.)

'రారాయని (తలిరాకు జి) రారాయని.' (౭-౧౭౮.)

'నీపాల (బెట్టుకొనుమవ) నీపాల' (౧-౯౯.)

తేట తెనుగు పదములతో శ్లేషచమత్కారములు చేయుటలో వెంకన అద్వితీయుడు. ఆతని కవనమంతయు నట్టి చమత్కృతులతో నిండియుండును. కావున ఉదాహరణములను చూపుట తేలనిపని. కవితారసికు లీ క్రింద సూచితములగు పట్టులు ముఖ్యముగా గమనింతురు కాక.

చిత్రాంగీ సారంగధర సంవాదఘట్టము. ద్వి. ఆ. ౧౭౨; ౧౭౪, మొదలు ౧౮౯ వరకును; తృ. ఆ. ౪౩, ౯౭, ౧౭౫.

ఇట్లెన్నని యుదాహరింపగలము ? గ్రంథమంతయు నిట్టి శిల్పనైపుణముతోనే నిండియున్నది. వెంకటకవి రెండవకృతియగు విజయవిలాసమునను శబ్దశిల్పము కలదు గాని శ్లేషాది చమత్కృతు లింత ప్రౌఢమయినవి అందులేవు. ఈ రహస్యమును గమనించియే బ్రౌనుపండితుడు ఈ రెండుకావ్యముల తారతమ్యమును తెలుపుచూ ఇట్లన్నాడు.—

"విజయవిలాసము a poem in three books: describing the marriage of Arjuna.- సారంగధర పద్యకావ్యము. This poem is greatly admired for the beauty of its style which is very intricate."

శిల్పనైపుణిచే చెన్నుమిగిలినను కవితాకమనీయత యందును, రచనా సౌష్ఠవము నందును సారంగధర, విజయవిలాసమున కించుక వెనుకపడినమాట నిజము. అందువల్లనే శ. ర. కర్త "చేమకూర వేంకటనాథుఁడు విజయవిలాస రచనా నైపుణ్యముం బట్టి నాలవతరగతియందుఁ జేర్పఁబడినను సారంగధరచరిత్ర రచననుబట్టి అయిదవతరగతియందుఁ జేర్పఁబడవలసినవాఁడుగా నున్నాఁడు" అన్నాడు.

ఒక్క పద్యమునైనను చక్కగా చదివి చవిచూచినవారు కాకపోయినను శ్రీ వెంకట్రాయశాస్త్రిగారు, ప్రౌఢముగా సారంగధర నిట్లు ప్రశంసించినారు.—

"ఇందు పూమొగ్గలువోలె తామే విడుశ్లేషలును, ద్రాక్షాపాకంబున నోరూర రసమొలుకు రచనలును, సదాచారాభిమానముం బురికొలుపు ధర్మ్యనిబంధన నైపుణియు, విసిగింపని వర్ణనలును, బరువులు నెరవులుంగాని కబ్బంపుఁ దొడవులును, ఈ ప్రబంధమును భారతీ భాండారమందు కడు నుచ్చస్థానమందు నెలకొల్పుచున్నవి."

ఆంధ్రకవితా లోకమున వెంకటకవి మార్గము ప్రత్యేకముగా ప్రశంసింపదగినది. అందువల్లనే కవితారసికుడైన రఘునాథనృపాలుడు 'క్షితిలో నీ మార్గమెవరికిక్క

రాదు సుమీ' అని అగ్గించినాడు. ¶ 'ఒడలి చెలువునందు నెడమ సగంబుతోఁ - గుడి సగంబె సాటి గూడుఁజెలికి' అన్నట్లు, వెంకటకవి సారంగధరకు సాటిరాదగిన మేటి కావ్యము వెంకటకవి విజయవిలాసమే.

వెంకటకవి కాలమున కవులు ఒకరిని మించి ఒకరు పోటాపోటీలమీద రచనలు సాగించిన ట్లీ క్రింది పద్యముచేత వెంకటకవి సూచించినాడు.

"క్షితిపయి వట్టి మ్రాఁకులుఁ జిగిర్ప వసంతుఁడు దా రసోపగుం
భిత పదవాసనల్ నెఱప, మెచ్చక చంద్రుఁడు మిన్నునం బ్రస
న్నతయును సౌకుమార్యముఁ గనంబడ ఱాల్గరఁగంగఁజేసె; నే
గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా." (విజ. 1-210.)

¶ 'మెచ్చరేకదా' - అంటే, (వట్టి మ్రాకులను పల్లవింపజేసినందుకు వసంతుని ప్రజ్ఞను మెచ్చక, చంద్రుడు రాళ్లను కరగించి మిక్కిలి ప్రజ్ఞను ప్రకటించినట్లు-) ఇంతకు మించి మేము రచింపలేమా ? అని స్పర్థించి గుణవత్తర రచనలు కావింతురని కవి హృదయము. వెంకటకవి రచన అట్టి భావముతోనే ప్రవృత్తమయినది కాబోలు !

## ౧ అనుకృతులు

ఇక్కడ ఒక్కవిశేషము.—

ఈ సారంగధర రచనలోని తెనుగుదనపు సోయగమునను, తన్మూలమున కవికి గలిగిన యశస్సునను, నవనాథచరిత్రకూ - గౌరనకూ, కొంత భాగమున్నది. అది యెట్లంటే; పిడుపర్తి బసవన పాలకురికి సోమనాథుని బసవపురాణపు ద్విపదలను పద్యములుగా రచించినట్టు, వెంకటకవి గౌరన సారంగధర ద్విపదలను పద్యములుగా రచించినాడు. ఆ రచించుటలో గౌరన కృతినుండి కథతోపాటు మంచి మంచి పలుకు బళ్లు కూడా పట్టుబడి పట్టినాడు. విడివిడి నుడులమాట యటుండ, ఎన్నో తావులలో

---

¶ శాలివాహన గాథా సప్తశతీ సారము.—
'చక్కఁదనము గల్గు చానలు జగములోఁ - నెందఱున్న నేమి ? యింతి వినుము,
ఒడలి చెలువునందు నెడమసగంబుతోఁ - గుడి సగంబె సాటి గూడుఁ జెలికి.'

¶ వే. వేం. శాస్త్రిగారు, 'లోకములో నెట్టి కవులును తమకాలపుఁ గవులను మచ్చరింతురే గాని మెచ్చుకొనరుగదా- అని కవిమెట్టి' అన్నారు.

శాస్త్రిగారు చేసిన ఊహ పద్యార్థమునకును భావమునకును, విరుద్ధము. తన రచనకంటెను మే లరమైన రచన నింకొకరు చేసినప్పుడు, అందుకు సిగ్గుపడక గుణజ్ఞుడైన (వెంకనవంటి) కవి మెట్టివెట్టునా ? ఎవనితో ? ఏమని ?

అందలి ద్విపద లన్నీ యిందు పద్యములుగా మారి కూర్చున్నవి. ఆ మారిన తీరు తెలియుటకు ఒకటి రెండు ఘట్టముల నుదాహరిస్తాను.

౧

నవనాథ:—

'తల్లి, నాయెడ నీకుఁ దగునె కోపంబు - మల్లడిగొనుచున్న మన్మథు వెతకుఁ
గాక నీపలుకు విఘాతమాటలకుఁ - జీకాకుపడి ధర్మశీలంబు వదలి
తెక్కలిప్రాణంబు తీపని గోర్కె - నిక్కంబుగాఁ దీర్చ నిమిసార్థసుఖము-
కొడఁబడ జనులచే నొగిరట్టు దిట్టు-గుడిచి యీ తనువు వీడ్కొనినంత జముని
దూతలచే నొచ్చి తుదివచ్చి హీన - జాతిఁ బుట్టుటకంటె జగములోఁ గీర్తి
వెలయ, నీకును మహీవిభునకుఁ బ్రియము- దలకొనునంతకుఁ దలయొగ్గి మనసు
గట్టిగానిలిపి కొంకక చావు కాస-గట్టియుండఁగ దైవగతి యటమీఁద.' (పు. ౯౧.)

సారంగ:—

'తల్లీ నాపై నీకుం, జెల్లునె కోపంబు? మదన శితశరపాళీ
హల్లక నిహతి వ్యథచేఁ, దల్లడపడి పట్టిదూఱు తగవాపూనక్? (౨-౧౪౦.)
'ఇపు డీవాడు భయంకరోక్తులకుఁగా నే లోఁగి దుర్వృత్తి న
ల్పపు సౌఖ్యంబగు నీమనోరథము దీర్పంబూనినన్ లోకమం
దపకీర్తింబడి, మీఁదఁద్రెళ్ళి యమబాధానీకముంజెంది హీ
నపుజాతిం దుదిఁబుట్టఁగావలయుఁ గాంతా, పెక్కువేలేండ్లిలన్.'
అట్లగుటకంటె నిఁక వినవమ్మయొకటి, జగతిలోఁగీర్తి వెలయఁగా దెగువమీఱి
నీవు రాజున కింపు సంధిల్లఁజేత, కియ్యకొనియుండ, నటమీఁద నీశ్వరాజ్ఞ.' (౨-౧౪౨.)

౨

నవనాథ:—

'పలికితి, నోరి! నాపతిలేని వెనక - నలుకక కనుఁబెట్టి యంతఃపురంబు
వన్నెలుపచరించి వడిఁజొచ్చివచ్చి - నన్నుఁజేపట్టి మన్మథవికారమున
వెడమాటలాడెదు విభునికేఁగూర్తు - నోడలు ప్రాణంబులు నుర్వీశుసొమ్ము
పాపాత్మ! పినతల్లిఁబట్టి యీరీతి - నేసిన కష్టు లేయెడ నైనఁగలరె.' (పు. ౯౨.)

సారంగ:—

'ఓరీ నాపతిలేనిచో భయములే కొక్కింత శుద్ధాంత మెం
దయ్యారం బేర్పడఁజొచ్చి నన్నుఁగని కామాంధుండవై ప్రేలె దీ

వా రాజన్యుని సొమ్ము ప్రాయమును నా ప్రాణంబుఁ, బొమ్మా రకే
యీరీతిఁ బినతల్లిబట్టిన ఖలుండెచ్చోఁ గలండేమహిన్?' (౨-౨౨౮.)

గౌరన ద్విపదను వెంకటకవి పద్యీకరించినట్లే, వెంకన పద్యములను, బాణాల శంభుదాసుడు, కూచిమంచి తిమ్మకవియును, ద్విపదీకరించినారు. ఆ యిరువురి రచనలలోను వెంకటకవి పలుకులు చాలా తావులలో తావుకొనియున్నవి. కావున ఆ రెండు గ్రంథములును నా యుద్యమమున నుపకరించినవి.- రచనా సామ్యము తెలియుట కొకొక్క యుదాహరణము.—

వెంకటకవి:—

'తల గలిగినఁ గుళ్లాయలు, గల వేవగనైన నీవు గలిగినఁ దా ద్వ
క్కళలరవము లెన్నియైనన్, కలిగెడుఁ బోకుమని యడ్డగాత్వేయంగన్'—(౨-౧౬.)

బా. శంభుదాసుడు:—

'పోవలదట్టి పావురములు లేవె ? తలయున్న కుళ్లాయి తగిలింపవచ్చు
కలరవంబులు నీవు గలిగినం గలవు.' (పు. 19.)

వెంకటకవి:—

'అభ్రమాతంగంబు హస్తంబులోఁజిక్కి కదలెడు పుండరీకంబనంగ,
హరివిధు ల్వొఱఁగండఁ బెరుగు నంబరకేశు తల వాఁకఁ దేలాడు నెలయనంగ,
మిన్నేటి దరులందు మేఁత లాడుచునున్న యుదుటు రాయంచ లేఁగొదమ
యనఁగ.' (౧-౧౨౨.)

కూ. తిమ్మకవి:—

'అమరాపగా సైకతాగ్రభాగములఁ- గొమరారు రాయంచ కొదమ యనంగ
గగనకేశుని శిరోగ్రంబెక్కఁ జాగు- తొగలసంగడికాని తునియ యనంగ
ననిమిషద్విరదంబు హస్తంబులోనఁ- బొనరారు వెలిదమ్మి పూమొగ్గయనఁగ.'
(పు. 4.)

వెంకటకవి కవిత్వములో ఇతరకవులభావములు - తదనుకరణములుకూడా అందందు కనబడుచున్నవి.—

(1) 'మిత్రుండు వడినంత మెఱసి ధామంబు ముందుగ నాక్రమించెదు ద్రోహివీవు.'
(౨-౧౮౨.)

ఇందులో, 'పరిపతతి - యువతి జనేషు శనైశ్శనైరనంగః' అను శ్లోకభావ మిముడ్చబడి యున్నది.

(2) 'అగ్రకుంతల తటీ రాకా నిశాకాల శశ్వపమాస్యము.' (3-౮౫.)

అను కల్పనము - శృం. నై. లోని 'అలకతిమిరాభిదృశ్యపాలార్ధచంద్ర' (3-160)ను బట్టి చేయబడినట్లున్నది. కాని కల్పన మంత సుష్ఠుగా లేదు.

(3) 'స్నిగ్ధ సారస్వత స్నిద్ధ సారస్వతా' (౨-౨౧౬.)

ఈ రచన ఆనందమఖికృత జీవానందన నాటకములోని ౧ 'ఇతరాపేక్షణా త్సార స్వ్వత స్సారస్వతోదయః.' అను రచనను తలపించుచున్నది.

(4) "పాతాళమటుసొచ్చి బ్రతుకుదమనిసుమీ, తాము వేమఱు భూమిఁ ద్రవ్వుచుండు,
మింటఁ జందురుఁ జేరి మేలౌదమని సుమీ, తాము నుప్పరమును దాటుచుండు,
......కిరులు - హారిణంబు లనయంబు, తొలఁతఁ బెద్ద లరుగు నోళ వెతింగి."
(౧-౭౨.)

అను రచనను ఈ క్రింది శ్లోకమునకును గల భావైక్యమును పాఠకులు గమనింతురు గాక.

> శ్లో. "కిం కారణం ను ధనపాల మృగా యదేతే
> వ్యోమోత్పతంతి, విలిఖంతి భువం వరాహాః ?
> దేవ త్వదస్త్రచకితాః శ్రయితుం స్వజాతిం
> ఏ కే మృగాంకమృగ మాదివరాహ మన్యే."
>
> —— తిలకమంజరీ - పీఠిక.

## ౨ అఖండయతి

గౌరనరచనలో, 'నిలువక వ్రాయువ్వ నెట్లాడె నోరు' (పు. 47.) 'నెమ్మది యట్లుండె నిమ్మహి నీకు' (పు. 48.) అని అఖండయతి వాడబడియున్నది. అట్లే వెంకటకవియు అఖండయతిని వాడినాడు.—

'సద్రూపక, మేలా వరియింపుమనుచు - మీఁదఁ గా బడినఁ గా' (౨-౫౬.)

'నడువఁగా లేక యుండెడు నాతనికిని' (3-౨౫౭.)

ఈ యఖండయతిని పాలకురికి సోమనాథాదులు పాటించియున్నారు. శ్రీనాథుని రచనలలోను భారతమునను గూడా అఖండయతి కనబడుచున్నది.

క. 'సంభరణప్రౌఢ నిజభు - జార్గళ యుగళీ' (కాశీ. పీఠిక. 63.)

---

౧ 'ఆనందరాయ మఖినో వాల్మీకే రివ యోగినః
ఇతరాపేక్షణా త్సార స్వ్వత స్సారస్వతోదయః'

ఆనందమఖి 17 వ శతాబ్ది పూర్వార్ధమున తంజావూరిని పాలించిన, ('శరభాజీ' యను నామాంతరముగల) 'శాహజీ'యొద్ద మంత్రిగా నున్నవాడు.

† గీ. 'అట్లుగావున వినవేడ్క—యయ్యెఁ జెప్ప
వయ్య పుణ్యసతీ ప్రభావంబు నాకు.' (భా. అర. 1-3.)

సారంగధరచరిత్రమున ఈ క్రిందిపద్యములలో యతిప్రాసములు తప్పినవి.

'పడ్డ న్యేయక తనయిచ్ఛగా సరగునన్' (౧-౯౪.)
'నీవు చచ్చువెనుక నామృషా చిత్రాంగి' (౩-౨౪౪.)

కొన్ని వ్రాతప్రతులలో 'నా వితాచిత్రాంగి'; నావృథాచిత్రాంగి' అను సవరణ లున్నవి. అవి లక్షణరక్షణ కితరులచేత చేయబడినవిగా కనబడుచున్నవి.

## ౨౩ భాషావిశేషములు

భాషానియమములను పాటించుట యందును వెంకన గౌరన మార్గమునే యనుసరించినాడు. 'భారత భాషయే భాష; తదితరభాష-భాష కాదు; అభారత ప్రయోగములు అపరిగ్రాహ్యములు' అను $ శాస్త్రిగారివంటి వీరగ్రాంథికపండితులకు పనికిరాని భాష గౌరన రచనలలో (అంతకు పూర్వులయిన పాలకురికి సోమనాథాది శివకవుల రచనలలో వలెనే) విరివిగా నున్నది. నవనాథ చరిత్రమునను, హరిశ్చంద్రలోను గూడా, గౌరన—

'పలికటు మునిఁగి'; 'చూడామణున్న'; ¶'పట్టుఁటు'; 'ఎల్లందు'; 'నిత్య తెసఁగుచె'; 'తప్పించుక'; 'మునున్న'; ‡'కాఁగాదు అకట' (విసంధి) వంటి సంధికార్యములను;- 'పుడమిాశుఁడు'; 'ప్రవిమల పోగులు'; 'మాల్యవంత మహీధరము' వంటి సమాసములను మాత్రమే కాక 'పంగ్రెండోయేట'; 'ఒనరిస్తిని' వంటి వ్యావహారిక రూపములను గూడా వాడి యున్నాడు.

అట్టి విశేషములీ సారంగధరయందును తరుచుగా నున్నవి. వానిని నాటీకలో ఆయాయి తావులలో వివరించియే యున్నాను. కొన్నిటి నిక్కడ దిక్ప్రదర్శనముగా సూచిస్తాను.

---

† చూ. భారతవిశేషములు.

$'అభారత ప్రయోగములు (వెంకట్రాయశాస్త్రిల) వారు అంగీకరించరట; వారు అంగీకరించ మనడము వారి గ్రంథములలోని భాషను గురించి కాదు సుమండీ; ఇతరుల గ్రంథములు విమర్శించినప్పుడే. వారు వ్రాసేభాష ఇంచుమించుగా అంతా అభారత భాషే, (ఆం. భి. భాషాభేషజము. పు. ౨౦౭.)

¶'పట్టభద్రుని మూర్తి పట్టుఁట బాలుఁడు' (హరిశ్చంద్ర. పు. 221)

‡'కల్ల చేయరుగదా కాఁగాదు అకట' (నవనాథ. పు. 161)

## ౧. సంధికార్యములు

'పెట్టించు' (౧-౭౩) 'ఎటు పోయెటువచ్చినో' (౨-౭) 'వావేల' (౨-౧౧౭) 'పెట్టుక' (౧-౬౨) 'మీఁదెక్కి' (౨-౮౧) 'నామీఁదాన' (౩-౭౫) 'ఇంకాదేవినె' (౨-౨౮౨) 'నసారత సౌఖ్యోన్నతి' (౨-౯౨) 'బాదమ్ములు' (౨-౧౮౨) 'కను కార్తి' (౩-౯౪) § 'అట్లనె' (౩-౯౩) ‡ 'చేసితివి ఏలా' (౩-౮౮) విసంధి.

## ౨. అపూర్వరూపములు

'యౌవనులు' (౧-౧౧౦) † భూవరేణ్యుఁడు' (౧-౧౦౮) 'మొకమజ్జనము' (౩-౧౫౫) 'సహజన్మి' (౨-౧౭౫).

## ౩ రేఫఱకారములు

ప్రాసమున రేఫముతో శకటరేఫమునకు మైత్రిని కూర్చుట (౨-౩౯) అట్లుండగా, వెంకటకవి- శబ్దాలంకార సౌభాగ్య రక్షణార్థ మెన్నో తావులలో ¶ బండిరాకు బహిష్కారమే పెట్టినాడు.—

'మేలావర సద్రూపక మేలావరియింపుము' (౨-౬౬.)
'కనికరమేది — ఇంకనికరమేది నీ విభుఁడు' (౩-౨౧౬.)
'చరులార లేటి మచ్చరులార' (౩-౨౩౬.)
'మాకుమారు వచింపని మాకుమారు' (౩-౨౩౬.)

## ౪ వ్యావహారికరూపములు

'ఆసించియున్నా.' (౨-౯౨.) ♦ వాంఛుచ్చినావు.' (౨-౯౩.) 'కొండేనకు' (౨-౩౪౮.) 'యావ' (౧-౧౦౩.)

సోమనాథగౌరన ప్రభృతులు—అట్లే వెంకటకవియు భారతభాష నెరుఁగనివారుకారు. ఎరిగియు, తద్భిన్నప్రయోగముల నేలచేసిరనగా: భారతకవులవలెనే వీరును భాషాసంస్కర్తలు. కాలక్రమమున భాషయు, దానిమర్యాదలును మారు

---

§ బసవ - (పు. ౧౨౧) లో - 'మఱి యట్లనే మెచ్చి' అను ప్రయోగమున్నది. (వివరములకు - 'పాశుపతము' చూచునది.)

‡ చేసితివి యేలా' అని శా. పా.

† 'వరేణ్య' శబ్దమును కవి 'భర్త' అను నర్థమున వాడినాడు.

¶ బండి 'ఱా' అని వ్రాయుట క్రమముగా దని నా అభిప్రాయము.

♦ నావు - నాము - నాన్నులు వే. వేం. శాస్త్రిగారిమతమున మహాదోషములు. వివరములకు - చూ. బాలకవి శరణ్యము - (పు. 226.)

చుండుననియు, కవియైనవాడు తనకాలమున రూఢికెక్కినభాషను సంగ్రహించి యథోచితము ప్రయోగించుట సంభావ్యమనియు, కావ్యభాష వ్యావహారికమున కెంత దగ్గరగానున్న అంత ఆనందదాయకమనియు, కావ్యప్రయోజన మానందమే యనియు, నెరిగినవారు కావున భారతమున కెక్కనిభాషను సంతరించియు - భారత కాలమునాటి ప్రయోగనియమబంధములను కొంతవరకు సడలించియు - భాషకు సముచిత సంస్కార మొసగినారు. ఈ తత్త్వము నెరుగని పెద్దలు పరిష్కర్తలై ఆయా గ్రంథముల రూపములను మార్చివేసినారు. భాషా పరిణామము తెలియకుండునట్లు స్వాశయానుసారముగా ప్రాచీన కృతులను దిద్దివేయుట భాష కుపకారము చేయుట కాదు. సేవచేయుటయును కాదు. వెంకట్రాయశాస్త్రిగారి పరిష్కరణమువలన పూర్వకవుల గ్రంథములకు జరిగిన యపకారమును [1] శ్రీ గిడుగు పండితులు చాలవరకు లోకమునకు తెలిపియున్నారు. నా యీ గ్రంథమువలన మరికొంత తెలియగలదని నా నమ్మకము.

## ౨౪. జితకాశి టీకా హృదయము

ఈ టీకను వ్రాయుటలో నే నింతకుముందు టీకా కర్తలెవరును త్రొక్కని క్రొత్త త్రోవయొకటి త్రొక్కినాను. అది యేమనగా:- నాకు అసాధువు లని తోచిన పూర్వముద్రణ పాఠములను - పూర్వటీకా వివరణములను, ఏ పుటలో వానిని ఆపుటలోనే అధోభాగమున చూపి - అందుకుగల కారణములనుగూడా తెలిపినాను. అందువల్ల గ్రంథము విస్తరిల్లినది. పరిశ్రమమును అధికమైనది. అన్నిటికి నోర్చి యింత పని చేయవలసిన అక్కరయే మనగా: వెంకట్రాయశాస్త్రిగారు లబ్ధప్రతిష్ఠులు. గట్టి పలుకుబడి సంపాదించుకొన్న గడుసు పండితులు. అందువల్ల ఎట్టి తప్పులతడికెయైనను

---

[1] "తమ కిష్టముగాని శబ్దములు ప్రాచీన గ్రంథములలో కనబడితే, దిద్ది మరి కనబడకుండా తీసివేసి, పరిష్కరించి అచ్చువేయించే పండితులలో ఈ శాస్త్రులవారు అగ్రగణ్యులు. వీరు పరిష్కరించిన పద్యాలు రచించిన కవులు ఇప్పుడు చూడడము సంభవమైతే తాము రచించిన వని పోల్చుకోలేనట్టు అవి మారిపోయినవి."- "తెలుగు భాషకు, తెలుగు సారస్వతమునకు, తెలుగు వ్యవహారమునకు, తెలుగుదేశమునకు, ఇట్టి పండితుల భ్రమప్రమాదాహంకారములవల్ల అపరిమితమయిన కీడు కలుగుతున్నదని నమ్మి, ఆకీడు తొలగించడము లోకోపకారకమయిన పని అని ఉపదేశిస్తున్నాము. మాచేత నయినంత మట్టుకు అట్టిపని చేస్తున్నాము. గనుక మొగమోటము లేకుండా మాకు సత్యమని తోచిన సంగతులు స్పష్టముగా విశదపరుస్తున్నాము." (భాషాభేషజము పు. ౬౬, ౧౫౪)

వారిపేరుమీద ప్రకటితమయ్యేనా, అది నిరుద్దమును - నిరుపమానమును, అయిన ఉత్కృష్టగ్రంథమే. అందుకు - ఈ సారంగధర - విజయవిలాస టీకలు దోషభూయిష్ఠములయ్యును ఇంతకాలము పండితలోకమున నిరాక్షేపముగా చెలామణియగుట ప్రబల నిదర్శనముగదా? (ఆముక్త - టీకయును ఈ తరగతికి చెందినదే సుమండీ. -) శాస్త్రిగారియెడ లోకమునకుగల ప్రమాణబుద్ధిని ప్రకటించు కథయొకటి, నా అనుభవములోనిది కలదు. విన్నవిస్తాను.

నేనీ సారంగధరను పరిశీలించుచూ, ఇందలి తప్పుల కాశ్చర్యపడుచూ, ఇది నిజముగా శాస్త్రిగారు పరిశీలించి - వ్యాఖ్యానించిన గ్రంథమేనా యని శంకించుచున్న దినములలో, ఒకనాడొక పెద్దమనిషితో మాట్లాడుచుండగా - (అతడును కొంచెము డొక్కశుద్ధి అయినవాడే) సారంగధర ప్రస్తావము వచ్చినది. అప్పుడాతడు 'శాస్త్రిగారూ మీరు సారంగధరచరిత్ర చదివి చూచినారా? అది గొప్ప గ్రంథమే గాని శాస్త్రిగారి టీకయే లేకపోతే దాని మొఖం చూచేవాం డెవరండీ? శాస్త్రిగారు వ్రాసినది లఘుటీక; అయితే యేమీ? అద్భుతముగా వున్నది. ఏ కావ్యానికైనా టీకవ్రాస్తే వారే వ్రాయాలి. ఇతరులు వ్రాసే టీకలేమిటీకలు - చచ్చుటీలు' అన్నాడు. ఆపెద్దమనిషి యేమితెలిసి 'సారంగ' టీక నలాపొగడడము? ఏమీ తెలిసికాదు. ఆ టీక శాస్త్రిగారి పేరనున్నది గనుకనే. చూచారా వారిపేరు ప్రభావము? ఆయన గారు దేశమున సంపాదించుకొన్న పలుకుబడి అట్టిది. అట్టిగట్టి పండితుని పేరనున్న వ్రాతలను తప్పనుట కెంత బందోబస్తు కావలె? ఆది యేమితప్పో, ఎట్టితప్పో, ఎట్లు తప్పో, ఎందుకు తప్పో, విప్పిచెప్పక - ఊరక 'తప్పు' అంటే మనమాటను నమ్మువారెవరు? ఇంకొకవిశేషము, తప్పొప్పులను కనిపెట్టు తెలివితేటలు లేకున్నను - శాస్త్రిగారి మీది మూఢవిశ్వాసమున, పిడివాదమునకు దిగువారి యలజడి యట్లుండగా, శాస్త్రిగారి యెడగల గాఢాభిమానమున తప్పులను గూడా ఒప్పులుగా మార్చు పూనికతో రాద్ధాంత సిద్ధాంతములుకు దిగు పండితులకు ప్రత్యుత్తరము చెప్పక తప్పదు గదా! అట్టివారివలని యొత్తిడి కొంతకు కొంత అనుభవమునకు వచ్చియున్నందుననే, గ్రంథప్రకటనానంతరమైనను నాకీశ్రమ తప్పదనితోచి, పూర్వపక్ష సిద్ధాంతముల నెల్ల నిండే పొందుపరిచితిని. నీ సిద్ధాంతముల కిక పూర్వపక్షములు పుట్టవా అంటే అది వేరేవిషయము.

మరియు, తప్పొప్పులను గూర్చి నేనింత విపులముగా విమర్శించి వ్రాయుటకు ఇంకొక గొప్ప కారణమున్నది.— ఈగ్రంథములో తేలిన పాఠదోషములు 510. అర్థదోషములు 385. మొత్తం. 895. ఈ 895 తప్పులకును శాస్త్రిగారొక్కరే హక్కుదారులుకారు. భాగస్వాములున్నారు. పాఠ దోషములలో శాస్త్రిగారును

పూర్వ (సాహసిక) ముద్రణకర్తయు భాగస్థులు; అర్థదోషములలో శాస్త్రిగారును పూ. టీ. కర్తయు భాగస్థులు, శాస్త్రిగారికి అటు పాఠదోషములలోను ఇటు అర్థదోషములలోను గూడా భాగమున్నది. మొత్తముమీద పెద్దభాగస్థులు కాబట్టి, ఈ యుమ్మడి సొత్తులో ఎవరి భాగమెంతో ఉరామరికగానైనా చెప్పక, అంతయు నొక్కరికే కట్టిపెట్టుట సబబు కాదుగదా! అందుకనే శ్రమమైన నయ్యెగాక యని కొంత విపులముగా వివరించితిని. కాని, 'ఆ దివ్యప్రబంధము - ఈవితీయపూదండ చెత్త తొట్టింబడినదో యను కరణిం బురణించుచుండగా - కని, చింతించి, పాటుపడి బాగుపఱిచిన' వారు మా శాస్త్రిగారు. కావున అందలి తప్పొప్పులకు సంబంధించిన సర్వ హక్కులును మా శాస్త్రిగారివే. అందితరులకు భాగము కల్పించుటకు మేము సుతరామును సమ్మతింపమని శాస్త్రిశిష్యులు వివాదమునకు దిగుదురేమో!

వెంకటకవి రచన పలుతావులలో సుఘటితముగా లేదు. అట్టి తావులలో నేనును 'స్థితస్యగతి శ్చింతనీయా' అన్నట్లు వ్యాఖ్యానము నెట్లో సరిపరచినాను.

ఆశ్వాసాద్యంతపద్యముల జోలికి నేను పోలేదు. ఎందువల్లననగా? అవి విజయవిలాసమునకు చెందినవి గావునను; శ్రీ తాపీ ధర్మారావునాయుడుగారి విజయవిలాస వ్యాఖ్యానమున వ్యాఖ్యాతములైయుండునన్న నిశ్చయముచేతను.

ఈ గ్రంథమునకు తొట్టతొల్త పుట్టినటీక వాడుకభాషలోనే యున్నది కావునను, గ్రంథకర్తకును వ్యావహారికభాషాప్రియమే కావునను, టీకలను వాడుకభాషలో వ్రాయునాచారము ప్రాచీనకాలమునుండియు కలదు గావునను, భావమును - అర్థమును బోధించుటకు వ్యవహారసిద్ధమయిన భాష మిక్కిలి అనుకూలము కావునను, వ్యావహారికవాసనసోకని చొక్కపు గ్రాంథికము వ్రాయుట దుష్కరము కావునను - నేనీ టీకను వాడుకభాషలోనే వ్రాసితిని. అర్థానుస్వారశకటరేఫముల గొడవను వ్యవహారభాషలో ప్రవేశపెట్టుట హాస్యహేతువు గాన - ఆరెంటిని నేనుజ్జగించితిని.

ప్రాచీనకావ్యములను పరిష్కరించుటకును, విపులవ్యాఖ్యానములు వ్రాయుటకును, పరిపూర్ణమగు భాషాపాండిత్యము - ప్రమాదములేని ప్రతిభాసంపత్తి - తగిన గ్రంథసామగ్రి - అదనున కొదవు ధనసహాయము ఉండవలెను. గ్రంథసామగ్రి ధనసాహాయ్యములమాట అట్లుండగా నాకుగల భాషాపరిచయము పరిమితము. నాబుద్ధి ప్రమాదమునకు పుట్టిల్లు; కావున నాపరిష్కరణ వ్యాఖ్యానములు సమగ్రములు కాజాలవు; నిర్దుష్టములున్నూ కానోపవు. కాని పలువురు పండితులను హెచ్చరించి, సారంగధరచరిత్రకు చక్కని సంస్కారము జరిపించుటకు ప్రేరకములు కావచ్చునని నానమ్మకము.

ఈ యుద్యమమున, 'మహామహోపాధ్యాయు'లైన అంతటి శాస్త్రిగారికే తప్పుల నుండి తప్పించుకొన తరము కాదయ్యెననగా ఇక సామాన్యోపాధ్యాయుడనైన

నాసంగతి వేరుగా చెప్పవలెనా? నాయీ పరిష్కరణమున పూర్వపుదోషము లెన్ని దూసిపోయినవో - క్రొత్తదోషము లెన్ని చేరుకొన్నవో - గ్రంథము పండితులచేతి కెక్కినపిమ్మట గాని బయటబడవు. కాలక్రమమున అట్టివాని నెల్ల తెలిసికొని - అంతటి భాగ్యముపుట్టుచో - పునర్ముద్రణమున సవరించు కొందును. నావిమర్శనము నకు తత్త్వనిర్ణయము ప్రధానోద్దేశ్యము కావున ఒక్క వెంకట్రాయశాస్త్రిగారి వ్రాత లనేకాక నాకు మాననీయులును - మిత్రులును నైన పలువురు పండితుల రచనలను గూడా ప్రసక్తానుప్రసక్తముగా అందందు పరామర్శించి యున్నాను. అందు కా పండితులెల్లరును నన్ను మన్నింపవలయునని వినయపూర్వకముగా వేడుచున్నాను.

## ౨౫ ఏతద్వ్యాఖ్యానప్రసక్తి

నే నీ వ్యాఖ్యానమును వెంకట్రాయశాస్త్రిగారి శిష్యుల ప్రేరేపణవల్ల వ్రాసి తినేగాని లేకున్న వ్రాసియుండెడివాడను కాను. ఆ కథాక్రమం బెట్టిదనిన.—

విశ్వమునకెల్ల వెంకట్రాయశాస్త్రిగా రొక్కరే నిక్కమైన పండితులనీ, ఇతర పండితులు నామమాత్ర పండితులనీ, తమకుగల తెలివితేటలు లోకమున మరి యెవ్వ రికిని లేవనీ- శాస్త్రిగారి శిష్యులకొక వెఱ్ఱి నమ్మకము. ఆ నమ్మకపు బిఱ్ఱున, నెల్లూ రిలో § శాస్త్రిగారి వర్థంతి సభలలో తమ పగ్గెల నుగ్గళించుకొను నుబలాటములో ఆ శాస్త్రి శిష్యులు ఎన్నోమారులు దూరదేశవిద్వాంసులను దుడుకుమాట లన్నారు. పరిసర పండితులను పరిహసించినారు. ఉండూరు పండితులను ఉల్లసము లాడినారు. తుట్టతుదకు, సమక్షమునయున్న నన్ను- మొగమోటమైనను లేక, నిక్కృష్టపు వ్రాతలతో చురుకుముట్ట చెనకి కదలగూన్చినారు. మరియు, మా గురువులు శ్రీ తిరుపతివేంకట కవులు 'జితకాశి' యను పదమునకు అర్థము తప్పుగా చెప్పిరని వారి నధిక్షేపించి- ఆర్భాటము చేసినారు.- 'తదల్పమపినోపేక్ష్యమ్' అన్నారు. అంతతో తృప్తిపడక చాలగా తూలనాడి యెక్కువగా హేళన చేసినారు. అందుకు తత్త్వమును గుర్తింప నేరని పౌరప్రముఖులు కొందరు వారిని బళి బళి !! యనుటయు మమ్ము హి హి హీ !!! యనుటయును జరిగినది.

ఆ శాస్త్రి శిష్యు లంతగావిజృంభించుటకు కారణమేమనుకొన్నారు? వారి గురువుగారి వ్రాతలన్నీ ఒప్పుల కుప్పలనీ - వానిలో అల్పదోషమైనను ఉండదనీ -

§ వివరములకు 'ఓదార్పు' చూచునది.

‖ వారికొక భ్రాంతి. భ్రాంతి కాకపోతే, లోకములో తప్పులేనివా డొక డున్నాడా ? భ్రాంతిప్రభావమున శాస్త్రిగారి యంతేవాసులు పిన్న పెద్ద అంతరువులేకుండా ఎంతెంతటి అంతర్వాణులనుగూడా ఎగతాళి చేయదొడగిరి; కావున ఆభ్రాంతిని కొంతకుకొంతైన తొలగింపకున్నచో భావికాలమున వారివారికి బొత్తిగా ఓరువ రాదనిపించినది. మరి వారిభ్రాంతిని తొలగించుటకు మార్గమేది? శాస్త్రిగారి గ్రంథములలోను దోషములు కలవని వారి మనసుకు తెలియజెప్పవలయు. కావున దోషాన్వేషణము నా కవశ్యకర్తవ్యమైనది. శాస్త్రిగారి (యిన్ని) గ్రంథములలో అల్పదోషమొక్కటియైనను చిక్కకపోవునా యని ఒకొక్కక్క గ్రంథమునే విప్పిచూతును గదా! అదేమిచిత్రమో దోషములులేని గ్రంథమే కనబడలేదు. ఆదోషములైనను ఎన్ని? ఒకట్లు, పదులు కావు; నూర్లు. ఎటువంటివి ? పండితులుకాదు భాషతో అల్పాల్పపరిచయముగల సామాన్యులును చేయజెల్లనివి. చూడండి.

(1) 'ఆదివరాహము = ఏదుపంది' - (శృం. నై. పు. 703.)
(2) 'వల = ఊరి.' (శృం. నై. పు. 209.)
(3) 'భల్లాతకి = ముంతమామిడిచెట్టు' (ఆముక్త. పు. 645.)
(4) 'చేవెలుఁగు = పటిమగల కంఠస్వరము' (ఆముక్త. పు. 271.
(5) † 'మేలుబంతులు = ఒరువడిపంక్తులు' (విజయ. పు. 124.)

---

‖ శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు నా 'ఓదార్పు'పై నభిప్రాయమిచ్చుచూ, ఇట్లు వ్రాసినారు. రాజమహేంద్రవరం. 2—9—38.

'ఓదార్పులోని విషయము భాషకు వేయిమడుగులుగా నాకు ప్రియమైనది. వేదంవారి పాండిత్యము ఏలాటిదో వారిశిష్యులకు తెలియదు. నేను కొంచెము అది నిరూపించినాను. మీరు సందేహానికి ఎడములేకుండా చేసినారు. మీగ్రంథం మిమ్ములను సుపరిచితులను చేసినది. మీ దర్శనము చేయవలెనన్న అభిలాషకూడా పుట్టినది.— గ్రాంథికభాష బాగా రానివారు రచించిన గ్రంథాలలో అపరిమితముగా దోషము లున్నవి. వేదంవారివి అలాటి గ్రంథాలే. కథాసరిత్సాగరములో వేలకొలదిగా తప్పు లున్నవి.'

† మేలుబంతి = అయ్యవారువ్రాసియిచ్చుఅక్షరపంక్తి. ఆపంక్తిని చూచి విద్యార్థి వ్రాయువ్రాత 'ఒరవడి'. (చూ. శ. ర.)

లోకవ్యవహారమునుండి రెండు దాహరణలు.

(a) శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారు.— 'ప్రతిదానికి సంస్కృతపు వరవడి మనకు తప్పదు.' (గి. వ్యా. సం. పు. 33 ౨.)

(6) 'అనురాగాంబుధి తటాన నటుఁ దెరయెత్తక్.' 'తటానక్ = ఒడ్డు పైకి. తెరయెత్తక్ = పొంగి కరుళ్లెత్తఁగా?' (విజయ. పు. 99.)

¶తటానక్ = తటాలున, అని సరియైన యర్థము. $'కరుళ్లు' అనుట తప్పు. 'కరళ్లు' అనవలెను.

(7) 'నుదుటక్ = కంటి ఱెప్పమీఁద' (సారంగ. పు. 9.)

(8) 'బిడ్డకుట్టులు = వేవిళ్లు' (సారంగ. పు. 87.)

ఇట్టి యర్థదోషములే కాక, పరకాయించిన కొలదిని- పాఠదోషములు, అన్వయదోషములు, వ్యాకరణదోషములు, అలంకారదోషములు, అవేమిటి? ఇవేమిటి? సకలవిధములయిన దోషములును వారి సకల వ్యాఖ్యానములలోను - వారి సొంతకృతులలోను గూడ దొరకినవి. 'బావి త్రవ్వబోగా భూతము బయటపడె'నన్న సామెత నిజమైనది. అప్పు డేమిచేయుటకును నాకు తోఁచలేదు. శిష్యుల భ్రాంతిని చిగురంట తీసివేయుటకు తగిన సామగ్రి చేతికి చిక్కినది గదా యని ఆదోషముల నెల్ల ఒక్కుమ్మడిగా వెల్లడించితినా శాస్త్రిగారి పెద్దపేరుకు మంచిదెబ్బ. అట్లని ఊరకొంటినా శిష్యులతప్పు తాళరానివి.

ఇట్లాలోచించగా, ఆలోచించగా శాస్త్రి శిష్యులవలన మావంటి భాషారాధకులకు గలుగు బాధకంటెను శాస్త్రిగారి తప్పుల నొప్పులుగా నమ్మి విద్యార్థులు వల్లెవేయుట చేతను, పండితులు ప్రమాణముగా గ్రహించుట మూలమునను భాషకు కలుగుచున్న అపకారము గొప్పదిగా నాబుద్ధికి పొడకట్టినది. ఆదోషములను వెల్లడించినచో శాస్త్రిగారి వాసి వరిముల్లువాసి తరిగిననూ, భాషకు మేరుపర్వతమంత మేలుకల్గును కావునను, 'తదల్పమపినోపేక్ష్యమ్' అని శాస్త్రిగారి శిష్యులే త్రోవచూపిరి కావునను, 'శాస్త్రిగారి టీకల తత్త్వమిట్టిదని అప్పుడప్పుడు విద్వత్సభలలో కొలదికొలదిగా వెలువరించుట మంచిదని నిశ్చయించుకొన్నాను. అంతేకాక, శాస్త్రిగారిచే వ్యాఖ్యాతము

---

(b) శ్రీ చింతా దీక్షితులుగారు.— 'ప్రబంధలక్షణములను ఎదుట బెట్టుకొని వరవడి దిద్దుకొనే ప్రబంధకవుల కావ్యాలకంటె ... ఈపాటలలో గుణము అతిశయముగా ఉన్నది.' (గి. వ్యా. సం. పు. ౨౫౪.)

(c) కర్నూలు హైస్కూలు పండితులు, బ్ర. మేడవరపు రామబ్రహ్మశాస్త్రిగారు.— సీ. 'వరవల్లు వ్రాయంగవలె నీచరిత్రంబు - పతిదేవతలు మేలుబంతి యనుచు.' (ఈపద్యము శ్రీ బెడగంటి రామారాయ పుత్రిక వివాహ సందర్భము లోనిది).

¶'తటాలున, తటాల్న, తటాన అని కవులు వాడినారు' (భేషజము. పు. ౭౭.)

$'కరుడు = గట్టిపడిన ముద్ద; కరడు = అల' (శ.ర.)

లయిన గ్రంథములలో నొక్కదానిని చక్కగా సంస్కరించి వ్యాఖ్యానించి అచ్చు వేయించినచో, అది యొక గొప్ప భాషాసేవయు-పాఠకలోకమునకు చక్కని హెచ్చరికయు నగుననుకొన్నాను. అందుకు తగిన గ్రంథము (ఆకారముచేత చిన్నది. అందువల్ల తప్పులు తక్కువగా నుండవచ్చునని) సారంగధర చరిత్ర మనియు నిర్ణయించుకొన్నాను. కాని అంతటిపనికి పూనుకొనుటకు ధైర్యము చాలకపోయినది. ఇట్లుండగా, ఆదినములలోనే- నెల్లూరిలోనే- ఉపాధ్యాయ పండిత పరిషత్తు, అందు నే నుపన్యసించుట తటస్థించినది. అయితే ఉపన్యాసమునకు నిర్ణీతమయిన కాలము పది నిముసములు మాత్రమే. ఆ పదినిమిషములలోను శాస్త్రిగారి యశస్సున కేమాత్రమును క్షతి కలుగకుండునట్లు ముందుగా వారి యఖండ పాండిత్య ప్రతిభావిశేషములను కొనియాడి, 'అంతటి పెద్దలు దిద్దిన గ్రంథములలోను - వ్రాసిన వ్యాఖ్యానములలోను జారుపాటు లున్నవి; వానిని సవరించి చక్కపరుచుట ఆశాస్త్రిగారుచేసిన భాషాసేవకు మెరుగుపెట్టుట యగు'నని చెప్పి - అందు కుదాహరణగా శృంగారనైషధమునుండి ఒకటి రెండంశములను చూపి సాధక బాధకములను సన్నగా విన్నవించుకొన్నాను. అధ్యక్షులు - సాయం వాదరాభిమానములు గల శ్రీయుతులు మామిడిపూడి వెంకటరంగయ్య పంతులు గారు, సభాంతమున 'ఇట్లా యీ గ్రంథములలోని లోపములను వెల్లడించుటకంటే ఏదేనొక కావ్యమునకు వ్యాఖ్యానము వ్రాయుట మంచి' దని నన్ను మందలించిరి. శాస్త్రిగారి లోపములను వెల్లడించితినని మనస్సున నాయాసపడి అభిప్రాయగర్భితముగా అట్లు మందలించిరేమో ననుకొని సభానంతరము వారిని కలిసికొంటిని; వారి కట్టి భావము లేనేలేదని తెలిసికొంటిని. భాషావిమర్శ తత్త్వ విదులగు ప్రాజ్ఞుల కట్టిభావము లేలుండును ? అప్పుడు నా సారంగధర పరిశోధనవ్యాఖ్యానముల మాట యెత్తితిని. ఆ మాట వినగానే వారు సంతోషపూర్వకముగా 'అట్టి పరిశోధనలు నేడు భాష కత్యావశ్యకములు. మీరు త్వరగా ఆ పని పూర్తిచేయవలసినది.' అని నాకు ప్రోత్సాహ మొసగిరి. వారికి నా కృతజ్ఞతా వందనములు. ఆనాడే టీకాకరణమునకు నిశ్చయించుకొని పరిశోధనకు ప్రారంభించితిని. కాని గ్రంథము సాగితేనా ? పాద పాదమునా పాఠదోషమే. అడుగడుగునా అర్థదోషమే. గ్రంథమింతగా తప్పులతో నిండి యుండుననీ, నా టీక యింత విపులమగుననీ ఆదిలోనే ననుకొనలేదు. పది పద్యాలకు వ్రాసి చూడగా ఇది సులభముగా తేలునట్టి పనికాదని తెలిసినది. గ్రంథమున ప్రతి పదమును పరిశీలింపవలసి వచ్చినది. సాధుపాఠమును సరియైన యర్థమును తోపనీయని అపపాఠాపార్థ పిశాచములవలన చీటికి మాటికి చిత్తముకు కలుగు చీదర నెట్లో తొలగించుకొనుచు- యథాశక్తి పరిశ్రమించి గ్రంథము నిప్పటికి పాటిగా సిద్ధపరిచితిని.

ఏతావతా నన్నీ వ్యాఖ్యాన రచనకు పురికొల్పినవారు శాస్త్రిగారి శిష్యు లన్నది ప్రధానాంశము. ఏ మార్గమున నైన నేమి నాచే నిట్టి యుత్తమ కార్యమును చేయించినవారు నా కృతజ్ఞతకు పాత్రులు కాకపోరుగదా ?

ఇకనైనను శాస్త్రిశిష్యులు పండితులను పరిహసింపకుందురు గాక. విద్యార్థులు గురుసహాయమును పొందక శాస్త్రిగారి వ్యాఖ్యానములను వల్లెవేయకుందురు గాక. పండితులు శాస్త్రిగారి వ్రాతలను పరిశీలింపక పరిగ్రహింపకుందురు గాక. భాషాదేవికి భద్రమగునుగాక. లోకము సత్యమునకు స్వాగతము చెప్పునుగాక.

నా యీ టీక 'జితకాశి' వివాదము మూలమున నుదయించినది కావున 'జిత కాశి' యనియే నామకరణము చేసితిని.

జితకాశి = జయశీలము

'జితకాశిన్ - Victorious, proud of victory.' (ఆప్టి.)

నే నీ వ్యాఖ్యానమును రెండేండ్లకు మునుపే ముగించి ముద్రణమున కిచ్చితిని. కాని అచ్చువారి నచ్చువల్ల గ్రంథము వెలువడుట కింత కాలము పట్టినది. ఇందు మొదటి 37 ఫారములును - నెల్లూరు ప్రభాత ప్రెస్‌లో ఒకటిన్నర సంవత్సరమునకు అచ్చయి నవి. తక్కిన గ్రంథమంతయును తెనాలి - భారతీ ముద్రణాలయమున 25 దినములలో తయారయినది. నా కెట్టి కష్టమును - నష్టమును కలిగింపక గౌరవాభిమానములతో, అల్పకాలములోనే - గ్రంథమును సర్వాంగసుందరముగా తీర్చియిచ్చిన భారతీ ముద్ర ణాలయాధికారులకు అనేక ధన్యవాదములు.

## ౨౬. కృతజ్ఞత

తొలుదొల్త నేనీ సారంగధర వ్యాఖ్యానములోని లోపములను కొన్నిటిని తడ వుచు సూత్రప్రాయమగు నొక చిన్న విమర్శవ్రాసి ప్రత్యేకగ్రంథముగా ప్రకటింప దలచి, నాతలపును ప్రస్తావవశమున శ్రీయుతులు వాకాటి సంజీవిసెట్టిగారికి తెలిపి కొన్ని యంశములను వినిపించితిని. నా జీవితమునకు ముఖ్యావలంబమును, నాయభ్యుద యమునకు మూలకారణమును, నన్ను కవిగా - పండితునిగా మాత్రమే కాక, సచివుని గను - ప్రాణబంధువుగను మన్నించు పరమ మిత్రమును నైన శ్రీ సెట్టిగారు మీరీ కేవల విమర్శను ప్రకటించితిరేని పదగురుపండితులును ఒక్కమారు తిలకించుటతో దీని ప్రయోజనము తీరిపోవును; పిమ్మట చదువువారుండరు. సామాన్య పాఠకలోకము నకు మీ విమర్శనము ఉపకరింపదు; అంతేకాక ఈ లఘు పరామర్శవలన పూర్వటీకా దోషములు సర్వమును తొలగి సారంగధర చరిత్రము సురక్షితము కాదు. కావున

మీ రీయుద్యమము నుజ్జగించి, అసలు గ్రంథమును ఆమూలాగ్రము పరిశోధించి, చేమకూర కవిరాజు కావ్యకళా కౌశలము ఎల్లవారికిని సుబోధ మగునట్లు విపులమగు టీక వ్రాయుట మంచిది. అట్టిపనికి వ్యయమును - ప్రయాసమును అధికమగునందురా? అగుగాక. వ్యయము నాది; ప్రయాసము మీది' అని తమకు సహజమగు ఔదార్యమును- ప్రాచీన కావ్యరక్షణాభిలాషయు - నాయెడగల చెలికారపు చనవును విశదమగునట్లు పలికిరి. అంతట నేను వారి యభిలాషను ఆజ్ఞగా భావించి, యథాశక్తి గ్రంథమును తయారొనరించి నివేదించితిని. శ్రీ సెట్టిగారు సంతసించి గ్రంథము త్వరలో వెలువడవలెనని నాకంటే హెచ్చుగా ముచ్చటపడి అచ్చున కేర్పాటు కావించిరి. కాని మా ముచ్చట చెల్లలేదు. పైపెచ్చు అచ్చువారి మితిమీరిన జాగువలన ముద్రణవ్యయము మొదట మేమనుకొన్న మొత్తమునకు అంతకంత అధికముకూడా అయ్యెను. ఏమైనను శ్రీ సెట్టిగారు సంపన్నగృహస్థులును - స్థిరసంకల్పులును - త్యాగశీలురును లోకజ్ఞులును కావున ఆ యధికవ్యయమును సైతము ఓరిమితో సహించి, భరించి, గ్రంథము నిట్లు లోకమున వెలయించి, నా బహుకాల పరిశ్రమమును ఫలవంతము కావించినారు. వారికి నా కృతజ్ఞతాపూర్వకానేక శుభాశీస్సులు.

మ. కవితామాధురి, పాండితీపటిమ, వ్యాఖ్యానప్రకారంబు, లి
ట్టివటంచుఁ గుఱుతించి ప్రోచు ప్రభువేడీ - యంచు నానాసలన్
మివులం బాతరలాడఁగాఁదగిన యీ నిర్భాగ్యకాలంబునం
దవురా భాగ్యము! చిక్కెఁ గల్పసదృశుం డాప్తుండు నాకియ్యెడన్.

సీ. శ్రీ వేదగిరినారసింహు సింగారించెఁ
దులలేని బంగారు తొడుపుతొడిగి;
అలకంచి వరదరాజులకు సైదోడుగా
లీలమై నిలిపె గోపాలమూర్తి;
తిరుపతి వేంకటేశ్వరు పదాబ్జముల నా
రాధించె నిత్యనీరాజనమున;
అల జగన్నాథున కనువుకొల్పెను భక్తి
ననుదినంబును నొక్కయారగింపు;
గీ. ఏసుకృతి, యేమహోదయుం, డేవిశుద్ధుఁ
డట్టి వాకాటి నరసింహసెట్టి కూర్మి

పట్టి జగజెట్టి సంజీవిసెట్టి విబుధ
మానసీయోన్నతగుణుండు, మత్సఖుండు. 2

గీ. ధర్మము లొనర్చుపట్ల సంతతము విభుని
కన్న మున్నయి సత్కీర్తి గన్న ధీరు
రాలు యతిరాజమాంబ గర్భంబు పంట
శేముషీ జితభట్టి - సంజీవిసెట్టి. 3

గీ. ఆత్మజనక ప్రతిష్ఠిత మైన రామ
మందిరంబును తీర్పించె సుందరముగ
దైవభక్తియు - పితృభక్తి తాండవించు
చిత్తము కలాఁడు, సంజీవిసెట్టి విభుఁడు. 4

ఆ. వె. చిత్తబంభరంబు శ్రీరంగనాయక
పాదపంకజమున భద్రపఱిచి
చీకు చింత లేని చిత్రసంసారియై
తనరు మత్సఖుండు తత్త్వవిదుఁడు. 5

సీ. నీవాఁడ ననెడు వానికి నభయంబిచ్చి
కాంక్షితంబు లొసంగు కనికరంబు,
ప్రతిఘటియించుచో పాలాక్షు నైనను
గణుతికిఁ గొనని మొక్కలపు తెగువ,
కాల్గదల్పకయె లక్షలకు లక్షలు గాఁగ
గడియించు వాణిజ్య కౌశలంబు,
సత్కార్యములకు వెచ్చముపెట్టు పట్టున
వెనుక ముం దరయని వితరణంబు,

గీ. ఒడలి తోడనె పుట్టిన తోడవులగుచుఁ
దనరఁ, దన రమ్యకీర్తి దిక్తటులఁ గ్రమ్మఁ,
గ్రమ్మరింపఁగరాని స్థైర్యమ్ము మెఱయ,
వఱలు సరిలేని సిరుల మత్పరమసఖుఁడు. 6

మ. తెలుగుం బాసను బోలె లీలమెయి హిందీ ద్రావి డాంగ్లేయ భా
షల నేర్పుం గడియించినట్టి బహుసూక్ష్మగ్రాహి; యెంతెంత లె
క్కల చిక్కుల్ త్రుటిలోఁ దెమల్చఁ గల ప్రజ్ఞాశాలి; వాకాటి వం
శ్యలలామంబు ప్రశంససేయ వలదే సంజీవిసెట్టి ప్రభున్. 7

క. లలితతరకవితలం గల
మలుపులు మర్మములు తెలిసి, మవ్వము చెడి నొ
క్కలు వోకుండఁగఁ జవిగొను
మెలఁకువ మత్సఖుని సొమ్ము మృషకాదుసుఁడీ. 8

క. మెఱమెచ్చుల దానములకు
దొరకొనఁ, దర్వాంబటంచుఁ దోఁచినయెడఁ దా
నఱగొఱగనిచ్చు టెఱుఁగం,
డరయఁగ మత్సఖునిత్యాగ మసదృశము కదా! 9

క. వ్యవహారముననె కా ద
భ్యవహారమ్మునను గూడఁ బదుగురు తనతో
నవిరతము నుందు రా వై
భవముం గొనియాడ వలయుఁ బ్రత్యేకముగా. 10

గీ. సంపదాపత్ప్రచండ ఝంఝా ప్రభావ
మే మహాధీరు హృదయ మహీధరంబుఁ
జెనకఁ జాలదొ, అట్టి సంజీవిసెట్టి
కెవరు సాటి! నిజానికి - ఎవరు పోటి! 11

చ. అనృతము పేలవంపుఁ బలుకాడ నెఱుంగని జిహ్వ, సింహాసం
హననత, దుర్వినీత దురహంకృతి సైపని శౌర్యమున్, మహా
జనగణనీయ వాక్పటిమ, చక్కనెసంగిన మద్వయస్యునిన్
వినుతి యొనర్చు లోకము వణిక్కులనూతనభూషణంబుగన్. 12

సీ. దిటవుమైఁ బాశ్చాత్య దేశమ్ములకు నేగి
దోస్తిసల్పెను తెల్ల దొరలతోడ;
బడెబడె కోటికి పడగలెత్తిన మారు
వాడీలతో బరాబరిగ మెలఁగె;
చెలువారు తనపలుకు సిగపూవు గావించె
ద్రావిడదేశ వర్తకుల కెల్ల;
తూరుపుకోస్తాల దొడ్డరెడ్లకు మంచి
నచ్చిన మిత్రమై మెచ్చువడసె;
గీ. అతులిత ప్రజ్ఞగల బుధుం, డదురుగుండె
పిఱికి కండయు లేని హాం వీరుఁ, డర్య
శేఖరుండౌర! సంజీవిసెట్టి; యతని
సాటి యగునెట్లు సామాన్య సార్థవహులు? 12

గీ. నేను శ్రీనాథునకు నెనగాను గాక
అవచి త్రిపురాంతకునకు హెచ్చగు నిజంబు
మామకసఖుం, డఖండ సంపత్సమృద్ధి
భోగపూర్ణత స్వాశ్రితపోషణమున. 13

గీ. చేత మిగురొత్త నాఁడు చేయూఁతయొసఁగి
మార్గమొనరించె భవన నిర్మాణమునకు;
సర్వసాహ్యంబు తానేయొసంగి నేఁడు
మార్గమొనరించె - గ్రంథ నిర్మాణమునకు. 14

గీ. ప్రాక్సముద్రపు టొడిలోనఁ బరిఢవిల్లు
చేవగల యనంతపురము 'జీవిగడ్డ'
వెలసె 'సంజీవి'; తత్త్వమ్ము తెలిసి వాడు
కొనెడు ఘనుల కభీష్టముల్ కొల్లకొల్ల. 15

శా. శ్రీవాల్లభ్యము, దానశౌండత, బుధశ్రేణీ సమారాధన
ప్రావీణ్యమ్మును, దీనరక్షణ కళా పారమ్యముల్ నిచ్చలున్
దైవారంగ ననుగ్రహించుత జగత్సంధాత సంధాతగ
శ్రీవాకాటి వరాన్వయప్రభవు సంజీవిన్ చిరంజీవిగన్. 16

చిత్రభాను
విజయదశమి
నెల్లూరు.

దీపాల పిచ్చయ్యశాస్త్రి.

# విషయసూచిక

## (సారంగధర చరిత్రము)

శ్రీ

# సారంగధర చరిత్రము

## ప్రథమాశ్వాసము

క. *శ్రీధుర్య శౌర్య, ధైర్య
క్ష్మాధర మూర్ధన్య, యాదిగర్భేశ్వర, వి
ద్యాధిక, వితరణదీక్షా
రాధాసుత, యచ్యుతేంద్ర రఘునాథ నృపా. ౧

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన సారంగధరచరిత్రంబను మహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన. ౨

### — రాజనరేంద్రుఁడు —

క. రాజనరేంద్రుఁడు, రిపుఫణి
రాజనరేంద్రుఁడు, కళా పరాక్రమ రేఖా
రాజితభోగ పరాజిత
రాజనరేంద్రుఁడు, సుధాకరకులుం డలరున్. 3

టీక.— రిపు ఫణిరాజ నరేంద్రుఁడు = శత్రువు లనెడు సర్పశ్రేష్ఠములకు విషవైద్యుడును:—('నరేంద్రో వార్త్తికే రాజ్ఞి విషవైద్యేపి కథ్యతే'— విశ్వ.) కళా...ంద్రుఁడు- కళా = కాంతిచేతను, పరాక్రమరేఖా = శౌర్య లక్షణముచేతను, రాజితభోగ= ఒప్పుచున్న సుఖానుభవముచేతను, పరాజిత = ఓడింపబడిన, రాజ – నర – ఇంద్రుఁడు= చంద్రుడు, అర్జునుడు, దేవేంద్రుడు, కల

---

*ఇది విజయవిలాసమున ద్వితీయాశ్వాస ప్రారంభ పద్యము.

వాడును. (అనగా- కళా పరాక్రమ భోగములచేత వరుసగా, చంద్రార్జున దేవేంద్రులను మించినవాడును-) సుధాకరకులుండు= చంద్రవంశము వాడును, (అయిన) రాజనరేంద్రుడు (అను పేరుగల రాజు), అలరున్= ఒప్పును.

రాజనరేంద్రుడు చంద్రవంశపురాజు; శత్రువులను శాసించువాడు; చంద్రుని వలె కాంతిమంతుడు; అర్జునుని వలె పరాక్రమవంతుడు; దేవేంద్రుని వలె మహాభోగి, అని, తాత్పర్యము.

సీ. తన యభ్యుదయము ♦ నిత్యముఁ గోరు నిజ సుహృ
ద్ద్విజ బుధ వ్రాతంబు వేడ్కనుండఁ
బగ లెంచుఁ బొడగానఁబడకుండ నడఁచి నాఁ
డమృతమే యీ రూప మయ్యె ననఁగఁ
*వనపాదములకును దమ తలలకు లంకె
పాటని దుర్గాధిపతులు పల్కఁ
‡జల్లఁదనముగల్గు సన్మార్గవర్తి మేల్!
మా యన్న యని ప్రజల్ గాంచి మ్రొక్క

గీ. జారచోరాదులకు భీతి సంఘటిల్ల,
సహితచక్రము లల్లల నాడుచుండ,
నేలె నా రాజు కువలయ మింపుదనర
నాడి తప్పక భరతమర్యాద వెలయ. ౮

ఈ పద్యమున 'రాజ' శబ్దశ్లేషచేత అర్థాంతరకల్పనము చేయబడినది.
టీక.—తన, అభ్యుదయము = అభివృద్ధిని, నిత్యమున్ = ఎల్లప్పుడును, కోరు = అభిలషించునట్టి, నిజ = తన, సుహృత్ = మిత్రులయొక్కయు, ద్విజ = బ్రాహ్మణులయొక్కయు, బుధ = విద్వాంసులయొక్కయు, వ్రాతంబు = సమూహము వేడ్కన్ = వేడ్కతో, ఉండగా- (అని, రాజుపరమైన యర్థము.)

---

శా. పా. ♦ 'నిత్యముగోరి.' పాఠాంతరములు:— * 'తత్పాదముద్రకు' ‡ 'నయమునఁగల్గు సన్మార్గము మాయన్న నీయందెయని ప్రజల్ నిలిచి మ్రొక్క',

తన, అభ్యుదయము= రాక, (=చంద్రోదయము) *నిత్యముఁ=ప్రతిదినము కోరు= అపేక్షించునట్టి, నిజసుహృత్ ద్విజ = తనకు మిత్రములయిన (చకోర) పక్షులయొక్కయు, ('ద్విజో విప్రేణ్డజే దంతే'- నానార్థ రత్నమాల). బుధ = దేవతలయొక్కయు, ('బుధ స్స్యాన్ సుతే సౌమ్యే'- నా.ర.) వ్రాతంబు, వేడ్కనుండఁ, (అని, చంద్రపరమున.)

చకోరములు చంద్రకిరణములను భక్షించి బ్రతుకునని కవిసమయము. దేవతలు చంద్రునిలోని యమృతమును త్రావుదురు.—

"భక్ష్యార్థం సర్వదేవానాం సోమస్సృష్టః స్వయంభువా
తత్రస్థ మమృతంచాపి సంభూతం సూర్యతేజసా
త్రయంచ త్రిశతం చైవ త్రయస్త్రింశ త్తథైవ చ
త్రయశ్చ త్రిసహస్రాశ్చ దేవా స్సోమం పిబంతియే."

—దేవీపురాణము.

పగలు= విరోధములు, ఎందుఁ పొడగానఁబడకుండఁ = ఎక్కడను తల చూపకుండునట్లుగా, అడఁచినాఁడు= అణచివేసినాడు. (ప్రజలలో ఎట్టి విరోధములును లేకుండునట్లు చేసినాడు-అనుట.) అమృతమే యీ రూప మయ్యెనఁగఁ = అమృతమే యీ రాజు రూపమును దాల్చెను.(=రాజు సర్వథా ఆనందజనకుడు) అని (ప్రజలు) కొనియాడగా, [అని రాజు పరమున నర్థము.]

---

*'నిత్యముఁ' అను పదమునకు పూ. టీ. లో రాజపరమునను చంద్రపరమునను గూడా ఒకటే యర్థము సూచితమైయున్నది. అది సరికాదు.

'నిత్యము= ప్రతిదినము; ఎల్లప్పుడు. అని రెండర్థములు. 'ప్రతిదినము' అనునర్థము శ. ర. లో లేదు. బ్రౌణ్యమున నిట్లున్నది. — "నిత్యము Daily, always' 'నిత్యము వల్లె చెట్టు' - 'నిత్యహోమము' is daily sacrifice, as distinguished from నైమిత్తికము, the occasional one: so also నిత్యకర్మము daily rites నిత్యానందుడు, he who is always delightful."

చంద్రుడు, ఉదయాస్తమయములు కలవాఁడు; కావున ఆతని యుదయమునకై దినదినమును (ప్రతిచంద్రోదయము) ఎదురుచూచుట చకోరాదుల పక్షమునను, రాజుగారి యభివృద్ధిని నిరంతరము వాంఛించుట సుహృదాదుల పక్షమునను, వివక్షితార్థములు.

పగలు = పగటివేళ, ఎందుఁ - పొడగానఁబడకుండఁ = ఎక్కడా కనబడకుండా, నడచినాఁడు = వర్తించినాడు, అమృతమే యీరూపమయ్యెననఁగ = ఈత డమృతస్వరూపుడే యని లోకమనగా, (అని చంద్రపరము.)

..చంద్రు డమృతమయు డనుటకు.—

శ్లో. "ఉడుగణపరివారో నాయకో ప్యోషధీనా
మమృతమయశరీరః కాంతియుక్తోపి చంద్రః,
భవతి విగతరశ్మి ర్మండలం ప్రాప్య భానోః
పర సదన నివిష్టః కో లఘుత్వం నయాతి?" (భామినీ విలాసమ్.)

క. "అమృతమయమూర్తి, బుధహిత
విమలవిభోద్భాసిమసృణవిలసన శుభ ల
క్ష్మమహిత వక్షుఁడు, విధుఁ డఁట
కుముదానందప్రదానకుశలుఁడుగాఁడే?" (పాండు. 3-113.)

అడఁచి- నడచి, అనుక్రియలలో, తొలిదానిలో అరసున్న యున్నది; మలిదానిలో లేదు. లేకున్నను శ్లేషార్థమున తప్పు కాదు. "శ్లేషేసఖండ నిర్బింద్వో ర్మేళనం కుత్రచిన్మతమ్" (అథర్వణ. సంధి. 22.)

తవపాదములకును = తన(రాజుయొక్క) చరణములకును, ('తన' నామార్థాభిధాయి. చూ. (ప్రౌ. శబ్ద. 78) తమ తలలకుఁ, లంకెపాటుని = ఎడతెగని సంబంధమని. (ప్రభూ, నీ పాదములు మా శిరముల ధరింతుమని) దుర్గాధిపతులు = (దుర్గ + అధిపతులు) దుర్గములకు అధిపతులయిన పెద్దపెద్దరాజులు, పలుకఁ = తెలుపుకొనుచుండగా, (అని, రాజుపరమున.)

దుర్గములు ఆరువిధములు:—

'ధన్వదుర్గం మహీదుర్గ మబ్దుర్గం వార్క్షమేవ వా
నృదుర్గం గిరిదుర్గం వా సమాశ్రిత్య వసేత్ పురమ్.' (మనుస్మృతి. 7-70)

కామందకమున, ఈ దుర్గము లయిదు విధములే.—

'ఔదకం పార్వతం వార్క్షం మైరిణం ధాన్వనం తథా
ప్రశస్తం శస్త్రమతిభి ర్దుర్గం దుర్గోపచింతకైః.' (4-59)

౫ తనపాదములకున్ = తన కిరణములకును ('పాదారశ్మ్యంఘ్రి తుర్యాంశాః' అమ.) తమ - తలలకును, లంకెపాటని, దుర్గా + అధిపతులు = ఈశ్వరులు. (ఏకాదశ రుద్రు లని, భా.) పలుకుచుండఁగా - (అని, చంద్రపరము.)

చల్లఁదనము = శాంతస్వభావము, కలుగు = కలిగిన - వాఁడు, సన్మార్గవర్తి = ధర్మమార్గమున వర్తించువాఁడు. మేల్ = బళిరా, మా అన్న = మాకు తండ్రి (వంటివాఁడు) అని, ప్రజలు, కొంచి = దర్శించి, మ్రొక్కన్, (అని రాజుపరము)

'అన్న = తండ్రి' – అనుటకు:—

గీ. 'తల్లి బోధించుఁ దత్త్వరత్వంబు గలిగి
యన్న, మీ యన్న చెప్పినయట్లు చేయు' (కాశీ. 4–83.)

---

పూ.టీ. ౫ 'తత్ = ఆచంద్రునియొక్క, పాదములకున్ = నాలవ భాగములకును (చంద్రఖండముల కని, భావము) తమ శిఖలకును - లంకెపాటని, దుర్గాధిపతులు = రుద్రమూర్తులు, పల్కన్.'

ఇక్కడ పాదములకు 'నాలవభాగము' లని యర్థము చెప్పుట సరికాదు. శివుని శిరమునను, అట్లే రుద్రుల శిఖలయందును, ఉండునది చంద్రుని 'కళ' యే గాని 'నాలవభాగము' కాదు. 'కళ' యనగా పదారవపాలు. (=వీసము.) 'కలాతు షోడశో భాగః' అని, అమరము.

శివుని శిరమున నుండునది 'కళ'యే యనుటకు:—

(1) 'మృత్యుం జయస్యైవ వసన్ జటాయాం
న క్షీయతే తద్భయ దూరమృత్యుః,
న వర్ధతేచ స్వసుధాప్త జీవ
స్రగ్ముండ రాహూద్భవ భీ రతీవ.' (నైష. 22-61.)

'శివస్య జటాయాం వస న్నేవ చంద్రః షోడశాంశ భూతో నక్షీయతే నాల్పపరిమాణో భవతి. కలామాత్ర స్వరూపే ణైవ తత్ర సదా వసం స్త తోపి న్యూనపరిమాణో న భవతీ త్యర్థః తర్హి తత్రవసన్ వర్ధతే కిమ్ న.' (నారా. వ్యాఖ్య.)

చల్లఁదనము కల్గు = చల్లని కిరణములు గలవాడు, (చంద్రుడు శిశిర కిరణుడు-) సత్=నక్షత్రముల యొక్క, మార్గ=మార్గము (=ఆకాశము) నందు, వర్తి=. చరించువాడు. మా = లక్ష్మికి, అన్న, అని, ప్రజలు కొంచియొక్కఁగా, (అని, చంద్రపరమున.- నెలపొడుపును చూచి నమస్కరించుట లోకమున ఆచారము.)

జార... ఘటిల్లఁగా= (చండశాసనత చేత) జారులకును చోరులకును భయము కలుగగా (అని, రాజుపరము) వెన్నెలలో తమతప్పులు బయలగునని జారులును, చోరులును, భయపడగా (అని, చంద్ర పరమున)

---

(2) "అగణ్యతం విదధతోపి సమిద్ధ కామా
నాధీయతే పరుష మక్షర మస్య వామాః,
చాంద్రీ న తత్ర హరమౌళి శయాళురేకా
నధ్యాయ హేతు తిథి కేతు రపైతి లేఖా." (నైష. 11-92)

'తత్రోజ్జయిన్యాం హరమౌళౌ శయాళుః స్థితా అనధ్యాయ హేతు స్తిథిః ప్రతిపత్ తస్యాః కేతు శ్చిహ్నం చాంద్రీ ఏకాలేఖా కలా నాపైతి న గచ్ఛతి' [నారా. వ్యాఖ్య.]

(3) "సర్వాభి స్సర్వదా చంద్ర స్తం కళాభి ర్నిషేవతే
నాదత్తే కేవలాంరేఖాం హరచూడామణీ కృతామ్." (కుమా. 2-34)

(4) "పదియేను దినంబులకుం
బదియే న్కళ లెక్కుమేను పరిపూర్ణముగాఁ
బదియూఁటివ కళ యితనిది
మదిరాక్షి, వృషధ్వజుండు మౌళిధరించెన్." (శృం. నై. 8-200)

(5) "మున్నీటి రాచూలిముక్కఁ గొంజడలోనఁ
గ్రొవ్విరిగాఁ దాల్చుకొన్న మేటి," (ఆం, భా. 1-37)

గ్రంథములయందు, 'ఇందుకళాధరుఁడు'- 'అర్ధేందుమౌళి' 'ఖండేందుశేఖరుఁడు'- 'బుడుతనెల తాల్పు' ఇత్యాదిగా వ్యవహారము కలదుగాని, 'పాదేందుధరుఁడు'- 'పాతికనెలతాల్పు' అనుట యెందును కనబడదు. 'అర్ధేందు

అహిత చక్రములు = శత్రుమండలములు, అల్లలనాడుచుండఁ = గడగడలాడుచుండఁగా, (అని, రాజుపరము)

అహిత = తనకు మిత్రములు గాని, చక్రములు = చక్రవాకములు, అల్లలనాడుచుండఁ, [అని, చంద్రపరమున;- చంద్రుఁడు చక్రవాకములకు విరోధి.)

---

మౌళి' యన్నచోట 'అర్థ' మునకు 'ఖండ' మనియర్థముగాని 'సగ' మనికాదు. "తత్రవ్యక్తం దృషది చరణన్యాస మర్ధేందు మౌళేః (మేఘ. 1-59) 'అర్ధశ్చాప్యర్ధ విందుశ్చేత్యర్థేందుః- 'అర్థః ఖండే సమాంశేర్థమ్' ఇతివిశ్వః. స మౌళౌ యస్య తస్యేశ్వరస్య". [మల్లినాథుఁడు.]

రుద్రుల శిఖలయం దుండునవియును చంద్రుని 'కళ' లే యనుటకు.—

(1) "ఆవర్జిత జటామౌళి విలంబి శశికోటయః

రుద్రాణామపి మూర్ధానః క్షతహుంకార శంసినః." (కుమా.సం. 2-26)

'మౌళిషు జటాజూటేషు విలంబిన్యః స్రంసిన్యః శశికోటయః శశిరేఖాయేషాం తే తథోక్తా రుద్రాణామపి, ఏకాదశానా మితి శేషః.' [మల్లి]

(2) "ఏకాద శైకాదశ రుద్రమౌళీ
నస్తం యతో యాంతి కలాః కి మస్య
ప్రవిశ్య శేషాస్తు భవంతి పంచ
పంచేషు తూణీ మిషవోర్ధచంద్రాః." (నైష, 22-115)

'చంద్రస్యైకాదశకలా ఏకాదశానాం రుద్రాణాం మౌళీఁ ప్రతియాంతి కిల గచ్ఛంతీవ. శేషాః పంచకలాస్తు పునః పంచేషోః కామస్య తూణీ మల్పమిషధిం ప్రవిశ్యార్ధచంద్రాకారత్వా దర్ధచంద్రాఖ్యా ఇషవో భవంతి.' (నారా. వ్యాఖ్య)

('అర్ధచంద్రబాణము = నెలవంకకోల'- చూ. లక్ష్మీనారాయణీయము)

రుద్రమూర్తుల సంఖ్య పదకొండుగదా? చంద్రుఁడు నాలుగు భాగము లయినచో పదకొండుగురు ధరించుటెట్లు? అది యట్లుండఁగా, చంద్రుఁడు నాలుగు ముక్కలుగా చీల్చబడినయెడల, మొదటికే మోసమువచ్చి, స్వరూపమే నాశమగునుగదా? మరి, దుర్గాధిపతులు "మీ పాదములకును మా తలలకును లంకెపాటు" అని యనుట యెవరితో?

అడితప్పక = పలికిబొంకకయు, భరత మర్యాద వెలయఁగ = (పరిపాలనమున) చక్రవర్తియైన భరతుని పద్ధతి యొప్పునట్లును,- [అని యర్థము ] *భర... వెలయఁగ = నటుని పద్ధతి యొప్పగా- (ఉత్తముఁడైన నటునివలె.) తప్పక-అడి= తప్పుచేయకుండా-నేర్పుతో నటించి,- (అని చమత్కారము.)

---

ఈ పద్యమును చూడండి—

చ. 'ఉడుపతి వంశకర్త, మహి మోన్నతి కెయ్యది మేర? నాఁడు పా
లొక్కడలి జనించి నప్పుడు దళంబుగ నంటిన మేని జిడ్డు వోఁ
గడుగు కొనంగనబ్బె ననికా, శివు నౌదల యేటఁ బాదముల్
దడఁబడ నోలలాడుచు హళాహళిగా వడి నీఁదులాడెడిఁగ. '

జైమి - పీఠిక. 28.

మరి, యీ శివుని నెత్తిమీది "పాదములు" చంద్రుని "నాలుగవ భాగము" లేనా? ఒక్క శివుని శిరముమీదనే నాలుగు భాగములును ఉన్నవా? చంద్రుడు నాలుగు భాగములుగా తెగియు, శివుని శిరమున నోలలాడుచున్నాడా? ఎంను కింకను విస్తరము?- దుర్గాధిపతుల తలలమీది "పాదములు" చంద్రకిరణములుగాని 'నాలవ భాగములు' కావు.

---

పూ. టీ.— *"నాట్యాచార్యుఁడయిన భరతముని వలె నాట్యములో తప్పుచేయక."

భరతముని 'నాట్యశాస్త్ర నిర్మాత' గాని కేవల నాట్యాచార్యుడు కాడు. ఆచార్యుడనగా ఒకరికడ నేర్చుకొని మరియొకరికి నేర్పువాడు. నాట్యాచార్యుడు= నట్టువొజ్జ. (ఆట నేర్పువాడు) 'మాళవిక'లో గణదాసహరదత్తులును, విరాటునింట బృహన్నలయును నాట్యాచార్యులు —"నట్టువొజ్జనై మెలఁగుదు నగళులందు" (భార-విరా. 1—242.) భరతమునియును కొందరికి ఆచార్యక మొనరించి యుండ వచ్చును; అక్కరపడినప్పుడు ఆడియు నుండవచ్చును. అంతమాత్రమున- ఆ శాస్త్ర కర్తను-నాట్యాచార్య నట శబ్దములతో నిర్దేశింపగూడదు. శాస్త్రకర్తకును-నాట్యాచార్య నటులకును, అధికారమున నెంతో యంతరమున్నది. అందువల్లనే నిఘంటు కర్తలు భరతమునిని - 'నాట్యకృత్తు'గా చెప్పినారు. నాట్యాచార్యుడుగా గాని, నటుడుగా గానిచెప్పలేదు.

అదియట్లుండగా, 'భరత' శబ్దము శాస్త్రకర్తయైన మునియందు వర్తించినను

ఆ రాజు = రాజనరేంద్రుడు, ఇంపుతనరన్ = సుఖము కలుగునట్లు, కువలయము = భూమండలమును, ఏలెను = పాలించెను.

ఆ రాజు = చంద్రుడు, భ - రత - మర్యాద వెలయన్ = నక్షత్రములతోడి కలయిక ఒప్పగా, ఇంపుతనరన్ = ఆనందము కలుగునట్లు, కువలయము = కలువను, ఏలెను = ఏలుకొనెను = వికసింపజేసెను.

---

'భరతునివలె ఆడి' అనుచోట మాత్రమా యర్థ ముచితము కాదు. ఆడుట (నాట్యము) నటధర్మముగాని, నాట్యశాస్త్రకర్తృధర్మము కాదు; నాట్యాచార్యధర్మము కాదు. కావున అక్కడ 'భరత' శబ్దము నటపర్యాయ మగునేగాని యితరము కాదు. నటుడే గాక నాట్యశాస్త్రకర్తయు నైనయెడల మిక్కిలి చక్కగా ఆడును గదా! అని స్థూలదృష్టుల యూహ. చక్కగా ఆడనేర్చినవాడే 'నటుడు'. నటత్వమున లోపమున్నయెడల శాస్త్రకర్తయయ్యును ప్రయోజనములేదు. కావున, అది సరియైన యూహ కాదు. నటుడు శాస్త్రకర్తయైన యెడల మరీబాగా ఆడుననుకొనుట పొరపాటు.

భరతము, భరతుడు, (=నటుడు) అను పదములు, శ. ర. లో లేవు. కాని యితర నిఘంటువులలో నున్నవి. 'భరత' శబ్దము నటునియందు వర్తించు ననుటకు కొన్ని ప్రమాణములు, —

(1) 'భరత శ్శబరే రామానుజే భారతవర్షకే,
దుష్యంతజే నటే నాట్యశాస్త్రకృత్తంతువాయయోః.' (నా.ర.)

(2) 'భరతుడు An actor, dancer. The name of a celebrated writer on dramatic composition.' (బ్రౌణ్యము)

(3) 'తత్క్రామి త్యుదాసతే భరతాః'— (మాలతీ) 'భరతాః తచ్ఛాస్త్రాధ్యేతారో నటాః'— (వ్యాఖ్య)

ప్రతినాటకమునను అంతమున భరతవాక్యముండును. ఆవాక్యమునుచెప్పు 'భరతుడు' నటుడేగాని 'భరతముని' కాడు.—

(4) 'భరతవాక్యమ్, = నటవాక్యమ్. నాటకాభినయ సమాప్తౌ సామాజికేభ్యో నటే నాశీ ర్దీయత ఇత్యర్థః.'

—శాకుంతల వ్యాఖ్య.

గీ. మహిని రాజనరేంద్రుఁడు, మాళవపతి,
రాజరాజనరేంద్రుఁడు, రాజరాజు
ననఁగఁ జే రెన్నికకు నెక్కి యతిశయిల్లు
నింద్రవిభవుండు, రాజమహేంద్రవిభుఁడు. ౫

టీక.—ఇంద్రవిభవుండు = ఇంద్రుని యైశ్వర్యమువంటి యైశ్వర్యముగల,

(5) 'భరతవాక్యం —The closing stanza in a drama, containing an expression of good wishes on the part of the actors, and put in the mouth of some person entitled to give a blessing. It is so called because it is spoken by the chief actor, as a member of the dramatic party, and not in his dramatic character, all acting being over; see commentary. For this meaning of భరత, *cf* భవభూతిర్నామ కవిః నిసర్గ సౌహృదేన భరతేషు' *&* c. మాల - మాధ. 1- P. 8. It may have been possibly so called in honour of the sage Bharata ('the vakya enjoined by Bharata,' since it is invariably so named) who is commonly regarded as the founder of the sciences of music and dramaturgy.- He is also represented as the manager of the dramas of the gods. *cf.* vik. 11 - 18.

—M. R. Kale - B. A.

మరియును, వూ. టీ. కర్తలు, 'ఆడి తప్పక భరతమర్యాద వెలయ' అను వాక్యమును శ్లేషగతుడైన చంద్రునికి గూడా లగించి,—'చంద్రుఁడు పలికిబొంకక భరతచక్రవర్తివలె కలువను ఏలెను' అని లిఖించినారు. అంతేకాక—'ఈపద్యములో రాజనరేంద్రునియందు చంద్రత్వారోపముచేత అర్థద్వయము కలదు' అనియు నన్నారు. పొరపాటు.

రాజశబ్ద శ్లేషచేత చంద్రవిషయమును, భరతశబ్ద శ్లేషచేత నటవిషయమును స్ఫురింపజేయబడినవి. అంతేగాని రాజనరేంద్రునియందు చంద్రత్వముగాని, భరతత్వముగాని ఆరోపింపబడలేదు.

*రాజమహేంద్రవిభుఁడు=రాజమహేంద్రము-(అనుపట్టణపు) ప్రభువు, మహిని = భూమియందు, 'రాజనరేంద్రుఁడు.'- 'మాళవపతి'- 'రాజరాజనరేంద్రుఁడు'- 'రాజరాజు,' అనఁగన్ = అని లోకులు వ్యవహరింపగా, పేరు- ఎన్నికకును్ెక్కె = ప్రసిద్ధికెక్కె; అతిశయిల్లున్ = వర్ధిల్లుచుండెను.

క. కల రా యిలరాయనికిం
గులసతి రత్నాంగి, భోగకుటిలశిరోజా
తిలకము చిత్రాంగియు, నన
నెలజవ్వను లిరువు రంబుజేందునిభాస్యల్. ౬

టీక.— ఆ ఇలరాయనికిన్ = ఆ భూమిపతికి, కులసతి = ఇల్లాలు, రత్నాంగియు; భోగ కుటిలశిరోజా తిలకము = భోగపు కాంతలలో మిన్నయైన - చిత్రాంగియు, అనన్ = అను పేరులుగల, ఇరువురు ఎలజవ్వనులు = ఇద్దరు లేత వయసు కాంతలు, అంబుజ = కమలముతోను, ఇందు = చంద్రునితోను, నిభ = సమమయిన, ఆస్యల్ = ముఖములు గలవారు, కలరు.— వారిలో రత్నాంగి అంబుజనిభాస్య యనియు, చిత్రాంగి యిందునిభాస్య యనియు, క్రమముగా అన్వయము. దానిచేత అంబుజమునకు- ఇందునకువలెనే, వారిద్దరికిని పరస్పరము విరోధ మని సూచన.

---

* పూ. టీ.—'మాళవపతి = మాళవదేశపురాజు. రాజమహేంద్రవిభుఁడు= రాజశ్రేష్ఠుఁడైనరాజు.'

'రాజమహేంద్రవిభుఁడు'- అను సమాసము, 'రాజమహేంద్రుఁడను విభుఁ'- డని సంభావనా పూర్వపద కర్మధారయ మైనను కావలె; లేదా 'రాజమహేంద్రము యొక్క విభుఁడు'- అని, షష్ఠీ తత్పురుష మైనను కావలె; అంతేగాని 'రాజశ్రేష్ఠుఁడైన రాజు' అని విశేషణ పూర్వపద కర్మధారయము కానేరదు. తొలుత 'రాజశ్రేష్ఠు' డనిచెప్పి, వెంటనే అతనినే - మరల 'రాజు' అనుటయెట్లు ? రాజనరేంద్రుఁడు రాజమహేంద్రముయొక్క విభుఁడు. అతడు 'రాజమహేంద్రవాసి' (చూ. ౨-౨౩౮)

క. ♦ఆతనికిఁ శ క్తిత్రయ
రీతిం గడుఁ బెంపు గాంచిరి నయార్ణవుఁడున్
నీతిజ్ఞుఁడు మతిమంతుఁడు
†ధీ తిలకం బలరఁగా సుధీతిలకంబుల్. ౭

టీక-ఆతనికిన్ = ఆరాజునకు, *ధీ తిలకం బలరఁగాన్ -ధీ = బుద్ధి యనెడి తిలకంబు = అలంకారము, అలరఁగాన్ = ఒప్పగాఁ(= బుద్ధియే భూషణముగా కలిగిన), సుధీతిలకంబుల్ = పండితశ్రేష్ఠులు, ('సుధీః కోవిదో బుధః' అమ.) నయార్ణవుఁడు, నీతిజ్ఞుఁడు, మతిమంతుఁడు, (అను పేరులు గల మంత్రులు ముగ్గురు) §శ క్తిత్రియరీతిన్ = ప్రభుమంత్రోత్సాహము లను మూడుశక్తులవలెను, పెంపు గాంచిరి = ఒప్పిరి.

తిలకము = అలంకారము, అనుటకు.—

"సోయ మద్య మకరందనందనో
జీవలోక తిలకః ప్రలీయతే." (మాలతీ- 9-21.)

జీవలోకస్య తిలక ఇవ. తిలకో మండనవిశేషః— (వ్యాఖ్య)

---

♦ కొన్ని ప్రతులలో లేదు

† శా. పా.—'ధీతిలకంబు లరయన్' (ఇదే పూ. ము. పా.)

* పూ. టీ— 'ధీ తిలకంబులు = బుద్ధికి అలంకారము లయినవారు.'

మానవునికి బుద్ధి యలంకార మగును గాని, బుద్ధికి మానవు డలంకారము కాడు. ('ధీ తిలకం బలర యా సుధీ' మద. తాళ. పా.) 'అలరఁగా' అని నేను సవరించితిని.

§ పూ. టీ.— 'ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులయొక్క— మూఁటివలె'- ఇచ్ఛాది శక్తులు, ఆత్మకు సంబంధించినవిగాని, రాజ్య తంత్రమునకు సంబంధించినవి కావు.

(1) "ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ
సర్వాధారా సుప్రతిష్ఠా సదస ద్రూపధారిణీ." -(లలితా. 181.)

(2) సీ. 'ఏ లేమ శశిమౌళి కిచ్ఛా క్రియా జ్ఞాన
శక్తియై కలిగించె సకలజగము.' (కాశీ. 4-150)

రాజ్యతంత్రనిర్వహణమునకుకావలసిన శక్తులు ప్రభుమంత్రోత్సాహములు.—

(1) 'శక్తయ స్తిస్రః ప్రభావోత్సాహ మంత్రజాః' (అమ. క్షత్రి.)

(2) "ప్రియతమాభి రసౌ నృపతి ర్వభౌ
తిసృభిరేవ భువం సహశక్తిభిః." (రఘు. 9-18.)

తిసృభిః ప్రభుమంత్రోత్సాహ శక్తిభి రేవ- (మల్లి.)

## — సంతానచింత —

గీ. * ఈక్రమంబున రాజనరేంద్రవిభుఁడు
నీతిరహితంబు గాకుండ, నీతిరహిత
మౌనటుల, భూమి రామరాజ్యముగ నేలు
చుండి రత్నాంగిఁ గనుఁగొనియొక్కనాఁడు. ౮

టీక.— నీతిరహితంబు = ధర్మశూన్యము, కాకుండఁగ, (= నీతి సహిత మగునట్లును,) ఈతి రహితము = ఈతి బాధలు లేనిది, ఔనటులఁగ; (ఈతి బాధలారు.— (అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, మిడుతలు, చిలుకలు, చేరువరాజు.) రాజనరేంద్రవిభుఁడు, భూమిని, రామరాజ్యముగఁ = శ్రీరాముని రాజ్యముతో సమానముగా, ఏలుచుండి, (రాముడు ప్రజారాధనమే ప్రధానముగా రాజ్యమును

---

(3) "అనూన పుత్రం సమయే శచీసమా,
త్రిసాధనా శక్తి రి వార్థ మక్షయమ్." (రఘు. 3-13)

త్రీణి ప్రభావ మంత్రోత్సాహాత్మకాని సాధనా న్యుత్పాదకాని యస్యాస్సా త్రిసాధనా శక్తిః. (మల్లి.)

(4) మాఘకావ్యమున, రాజనీతి.—

"మద్గుణా శ్శక్తయ స్త్రిస్రి స్సిద్ధయ శ్చోదయా స్త్రయః
గ్రంథా నధీత్య వ్యాకర్తు మితి దుర్మేధసోప్యలమ్." (2-26)

శక్తయః ప్రభుమంత్రోత్సాహా స్తిస్రః. (మల్లి.)

(5) సీ. "తనదు శక్తిత్రయంబున సమస్త ప్రపం
చంబుల కభివృద్ధి సంభవిల్లఁ,
జెలఁగె, విశ్వేశ్వరుఁడు రాజశేఖరుఁడు."(కాశీ. మాహా. 1-28)

శక్తిత్రయంబునఁ = ఇచ్ఛాజ్ఞాన క్రియలచేత (విశ్వేశ్వరపరమున), ప్రభుమంత్రోత్సాహములచేత- (రాజశేఖరపరమున.)

పాఠాం.— * 'ఇట్లు దొరతన మమరి యా నృపవరుండు.—......భూమి స్వారాజ్యమునుగ.'

పాలించెను కావున నాతనిరాజ్యమున ప్రజలెట్టి కొరతయు లే కుండి రనిప్రతీతి. రాజనరేంద్రుడును తనప్రజ కెట్టి కొరతయును లే కుండునట్లు, రామునితో సమానముగా రాజ్యమును పాలించెనని - భా.)

'నీతి రహిత మానటులపాలించె' ననుట విరోధము. 'ఈతిరహిత మానటుల పాలించె' ననుట తత్పరిహారము.

సీ. సంతానరహితసంసారంబు నాయక
రత్నంబు లేని హారంబుగాదె?
పుమపత్యదూర మానమితసామ్రాజ్యంబు
ధాత్రిఁ జంద్రుఁడు లేని రాత్రి గాదె?
ఆత్మజవ్యతిరిక్తమగు వర్తనము *సద
సద్వివేకములేని చదువుగాదె?
సుకుమారతనూన్య మానకళంకజీవనం
బల మరాళము లేని కొలనుగాదె?

---

శా, పా.—* 'నారిలేని శరాసనంబు గాదె.'

నాయకరత్నములేని హారము, చంద్రుడులేని రాత్రి, మరాళములేని కొలను, అనువరుసలో 'నారిలేని శరాసనము'ను చెప్పుట సరికాదు. హారాదులకు నాయకరత్నాదు లలంకారములు. మరి, శరాసనమునకో నారి ప్రధాన మయిన అవయవము కాని, అలంకారమాత్రము కాదు. నారిలేని శరాసనము,— చూపులేని కన్ను, నాలుకలేని నోరు, ప్రాణములేని దేహము, అను తరగతిలో చేరదగినదికాని, పైవరుసలో చేరదగినదికాదు. ఎందుకిన్ని మాటలు? నారి లేనియెడల శరాసనము పాడుపడవలసినదే. మరి పనికిరాదు.

ఆ. వె "చాయమార్విలేని చాపదండము నోజ
లలితతంత్రిలేని యొళగుఁబోలె
నవనితనయలేని యావాస మంతయుఁ
బాడువాటి యుండెఁ బార్థివుండు." (భాస్క—అర. 225)

వా. ము. లో, 'సదసత్' పాఠమే యున్నది. ఆపాఠము, తంజ. వ్రాత ప్రతులలోను నున్నది.

29740

గీ. నందనవిహీన మైన సేనావితాన
మరయ శిఖరంబు లేని గోపురము గాదె?
నేత్రపర్వంబు గావించుపుత్త్రుఁ డింక
మనకు నెన్నఁడు గల్గునో వనజగంధి. ౯

టీక:— సంతానరహిత సంసారంబు = మగబిడ్డలేని కాపురము, నాయక రత్నంబులేని= ప్రధానమణిలేనట్టి, హారంబు కాదె? (అవునన్నమాట.).— పుమ్ + అపత్యదూరము– ఔ = మగసంతతిలేని, అమితసామ్రాజ్యంబు = గొప్పరాచరికము (సమ్రాట్టు భావము సామ్రాజ్యము = చక్రవర్తిత్వము.) చంద్రుడులేని రాత్రి కాదె?— ఆత్మజవ్యతిరిక్తమగు వర్తనము = కుమారుడులేని మనుగడ, సదసత్ వివేకములేని = మంచి చెడ్డలను గుర్తించు జ్ఞానములేని, చదువుగాదె?— సు కుమార శూన్యము ఔ = మంచికొడుకులేని, అకళంక జీవనంబు = ఎట్టిలోపమును లేని బ్రదుకు, మరాళములేని = హంసలేని, కొలను కాదె?– నందన విహీనమైన= పుత్రుడులేని, సేనావితానము= సేనలగుంపు, శిఖరంబులేని– గోపురము– కాదె?– నేత్రపర్వంబు = కనులపండువు - కావించు పుత్రుఁడు, ఎన్నఁడు కల్గునో?

సంతానములేని సంసారము, నాయకమణిలేని హారమువలెను, చంద్రుడులేని రాత్రివలెను, వివేకములేని చదువువలెను, హంసలేని కొలనువలెను, శోభావిహీనము అని, తాత్పర్యము.

జిలుగుంబల్కులు విన్నఁ, జిన్నిగొనబుంజెయ్వుల్ గనుంగొన్న, నా
దలమూర్కొన్నను, ముద్దుగొన్నఁ, దనువుం దార్కొన్న, నూహింపనుం
బలుకన్ రానిసుఖంబుఁ జెందునటుగాఁ బంచేంద్రియోత్సాహ మై,
తలిదండ్రుల్ విలసిల్లఁ గాఁ దనయుఁ డేతన్మాత్రుఁడే యెన్నఁగన్. ౧౦

టీక.— జిలుగుంబల్కులు విన్నన్ = వచ్చియురాని ముద్దుమాటలు వినగా (చెవులకును), చిన్ని గొనబుంజెయ్వుల్ కనుంగొన్నన్ = రమ్యము లయిన చిన్న తనపు చేష్టలను చూడగా (కనులకును) ఔదలన్ మూర్కొన్నను = శిరస్సును మూచూడగా (నాసికకును) ముద్దుగొన్నన్ = ముద్దుపెట్టుకొనగా (జిహ్వకును) తనువున్–తార్కొన్నన్ = ఆలింగనముచేసికొనగా (త్వగింద్రియమునకును) ఊహింపనున్ = ఇట్టిదని యనుకొనుటకును, పలుకన్ = ఇట్టిదని చెప్పుటకును, రాని= వీలు

పడని, సుఖంబును, చెందునట్లుగా * పంచేంద్రియోత్సాహమై = చెవి మొదలగు నింద్రియముల కైదింటికిని ఆనందము కలిగి, తలిదండ్రుల్ - విలసిల్లఁగాన్ = సంతోషమున పొంగగా, (=తల్లిదండ్రులకానందమును కలగించువాడు గనుకనే) తనయుడు= (అనబడుచున్నాడు.) అట్టి తనయుఁడు- ఏతన్మాత్రుఁడే= సామాన్యుడా, (అనగా అట్టితనయుడుకలుగుట గొప్ప భాగ్యముగాని సాధారణవిషయము కాదని భావము.).—

ఉ. చక్కిలిగింత వెట్టినను సారెఁ గికాకిక నవ్వుచున్ బయిం
బక్కఁ బడంగఁ జక్కనికుమారుని మక్కువమీఱ నేడ్వఁరాఁ
జెక్కిలి గీఁటి యెత్తి యెదఁ జేర్చి ముచ్చట ‡ దీరునట్లుగా,
నక్కట! ముద్దులాడ వలదా †కలదా యటువంటిభాగ్యముల్. ౧౧

టీక.—ఏడుపు రాన్ చెక్కిలి గీఁటి = ఏడుపు వచ్చునట్లుగా బుగ్గగిల్లి, ఎత్తి = ఎత్తుకొని;— ముద్దులాడవలదా? (పసిబిడ్డల నేడిపించి ముద్దులాడుట కొందరికి ముచ్చట.)—†కలదా? అటువంటి భాగ్యముల్ = (మనకు అటువంటిభాగ్యము కూడా ఉన్నదా! (లేకపోయెనని దుఃఖమును వెలార్చుట.)

క. ఈశ్వరకృప గద యీసక
‡ లైశ్వర్య సుఖములు ప్రాప్తమగుటకుఁ గాశీ
విశ్వపతి మనకు నిపుడొక
శాశ్వతయశుఁడైన సుతుఁ బ్రసాదింపఁడొకో? ౧౨

---

పూ. టీ.—*'పంచే...హమై = త్వక్చక్షుఃశ్రోత్రజిహ్వాఘ్రాణములనెడి యైదింద్రియములకును.'

పద్యమున పంచేంద్రియములును, పూ. టీ. కర్తలు గ్రహించిన త్వగాది పదములులేవు. ఆపదములను గైకొన్నచో అన్వయము చెడును.

శా.పా.—‡ తీఱు [తప్పు] †'వలదా యిటువంటి' (ఇదే. ప్రా. ము. పా.) 'కలదాయిటువంటి' – తంజ. తాళ. పా.

పూ. టీ.—† 'వలదా = అక్కఱలేదా- భాగ్యముల్ = సుకృతముకూడ.'

'సుకృతముకూడ అక్కఱలేదా?' అనిరాజు ప్రశ్నించుటలో అర్థములేదు. 'అక్కరలే'దని యెవ్వరనిరి?

గా. పా.—‡ 'సకలైశ్వర్యములెల్ల'

గీ. తాఁ గుమారునిఁ గని పరితోషానందంబు గాంచు
నట్టి సర్వజ్ఞుఁ, డఖిలభక్తాళిఁ బ్రోచు
శంకరుఁడు, మహాదేవుఁ, డాస్వామి నమ్మి
నార మెంట, మనకోర్కి యీడేఱు టరుదె!　　౧౩

టీక.— తాన్=తాను, ¶కుమారునిన్= కొడుకును (కుమారస్వామిని), సర్వజ్ఞుఁడు= సకలము నెరిగినవాడు (సర్వజ్ఞుడు - అను పేరుగలవాడు,) శంకరుఁడు= సుఖమును కలిగించువాడు (శంకరుడు - పేరు) మహాదేవుఁడు = గొప్పవేలుపు (మహాదేవుడు - పేరు).

ఈశ్వరుడు కుమారుని గని ఆయానందము ననుభవించి యెరిగినవాడు కావున మనకును అట్టి యానందమును కలిగించుననియు, సర్వజ్ఞుడు కావున మనమనసులోని కోరిక నెరిగి తీర్పఁగలడనియు, శంకరుడు కావున మనకు తప్పక సుఖమును కలిగించుననియు, మహాదేవుడు కావున ఆయన కసాధ్యకార్యము లుండవనియు- అందువలన మనయభీష్టమును తీర్చుట ఆయనకొక పెద్దపని కాదనియు- భావము.

## —: ఈశ్వరార్చనము :—

గీ. ఇపుడు శైవవ్రతంబు *లే మేమి గలవొ
సలుపఁ దగు వాని, నటు లైన సఫల మగును
భక్తజనులకు ముంగొంగుబసిఁడి గాఁడె
చూడు మెలనాఁగ యల †చంద్రచూడుఁ డరయ.　　౧౪

టీక.— ఎలనాఁగ= ఇంతీ, చంద్రచూడుఁడు=శంకరుడు, ముంగొంగుపసిఁడి=

---

¶ పూ. టీ.— 'కుమారునిన్= కుమారస్వామియైన పుత్త్రుని'
కుమారస్వామియైన పుత్త్రుఁడు? ఇది యర్థములేనిమాట. సర్వజ్ఞశంకరాది శబ్దములకువలెనే కుమార శబ్దమునకును, అర్థము - అర్థాంతరము, వేరువేరుగా చెప్పకపోవుట పొరపాటు. మరియును వారు, 'భక్తాళిఁబ్రోచు శంకరుఁడు' అనుసమాసములోని 'ప్రోచు' అను క్రియావిశేషణమునకు 'ప్రోచున్ = రక్షించును' అనిటీక వ్రాసినారు. సరికాదు. ప్రోచు = రక్షించునట్టి' యని వ్రాయవలెను.

* శా. పా— 'ఏమేమిగలవు' † 'చంద్రజూటు' (ఇది ప్రా. ము. పా) 'చూడు...చంద్రచూడు' (డరయ) అని, శబ్దాలంకారము; కవి కభిమతము.

3

ముందరికొంగున కట్టుకొన్న బంగారము. (అక్కఱకు అందునది, అని, భా.)

క. నెలపూదాలుపు మన పూ
జలు మెచ్చునె?యని మదిఁ విచారింపకు, చీ
కిలిమాకిలిగా* నల్లిన
చెలఁది తెర లూఁచి సంతసించుట లేదే? ౧౫

టీక.— నెల పూ దాలుఁపు= చంద్రధరుడు. (నెల నే పూవుగా ధరించిన మహానుభావుడు— కావున) మనపూజలు మెచ్చునే, అని విచారింపకుము! చీకిలిమాకిలి గాఁ= కొక్కిరిబిక్కిరిగా (చూ. శ. ర.) అల్లిన, చెలఁదితెరల్= సాలెపురుగు బూజుతెరలను, చూచి మెచ్చలేదా?

పూర్వము శ్రీకాళహస్తిలో శివలింగమునకు పైభాగమున నొక సాలెపురుగు భక్తిభావమున చిత్రవిచిత్రముగా బూజు నల్లెననియు, ఆయల్లికలకు మెచ్చి యీశ్వరుడు ముక్తి నిచ్చె ననియు పురాణకథ.

క. ఇట పూజింతము నేర్చిన
యటుల గిరీశు నొకయాకు నలమునఁ, గొండం
తటిదేవరకును గొండం
తటి పత్తిరి వెట్టువారు ధరణిం గలరే? ౧౬

టీక.—గిరీశుఁ = (కైలాసాధిపతి) ఈశ్వరుని = ('కొండంత దేవరకు కొండంతపత్తిరి'— 'ఆకు-అలము' అనునవి లోకోక్తులు)

'గిరీశ' శబ్ద సారస్యముచేత 'దేవర కొండంతవాడే' యగుటయు, పూజాద్రవ్యములయిన - పత్రపుష్పములు, 'ఆకు అలమే' అగుటయు నిందు చమత్కారము. ఇట్టిదే.—

ఎ. గీ॥ 'అనఘ యెవ్వారలైనఁ గొండంత వారి
కవనిఁ గొండంతపూజ సేయంగఁగలరె?
భక్తి నే నిచ్చు నీ పుష్పపత్రి తోయ
మాత్రములు గైకొనుటెగాక గోత్రతిలక.' (వసు- 2-121)

---

* పాఠా.— 'చీగిలి మాగిలి' గా (తంజ. తా. పా.)
జీగిలి మాగిలిగా- Anuk, Confusedly (బ్రౌను)

గీ. అని ప్రియోక్తుల శిష్యుఁ గొనియాడి యప్పుడు
సకలజనములు శివపూజ సలుపకున్న
నాజ్ఞ యని చాటఁ బనిచి, శివాలయములు
ధరణిఁ గట్టించె నూహింపఁ దప్పకుండ. ౧౭

టీక.— ఆజ్ఞ = శిక్ష.

క. రాజశిఖామణిపూజలు
రాజశిఖామణి యొనర్చె *రమ్యదళాళిన్
రాజీవకుముదచంపక
రాజీవకుళాది కుసుమరాసుల వేడ్కన్. ౧౮

టీక.— రాజశిఖామణి = రాజశ్రేష్ఠుడయిన ఆ రాజనరేంద్రుడు, రాజశిఖామణి పూజలు = (చంద్రుని, శిఖయందు మణిగా ధరించిన) యీశ్వరుని పూజలు, రమ్య = మనోహరములయిన, దళ ఆళిన్ = పత్రముల మొత్తములచేతను, రాజీవ = కమలముల యొక్కయు, కుముద = కలువలయొక్కయు, చంపక = సంపంగెల యొక్కయు, రాజీ = మొత్తములచేతను, వకుళ = పొగడ, ఆది = మొదలయిన, కుసుమ = పూవులయొక్క, రాసులన్ = మొత్తములచేతను, వేడ్కన్ = ప్రీతితో, ఒనర్చెన్ = చేసెను.

క. వివిధఘనదానములు భూ
ధవమణి పరిశుద్ధుఁడై ముదంబున నొసఁగెన్
శివభక్తులు పెద్దలు నగు
నవనీసురవర్యులకు శివార్పణ మనుచున్. ౧౯

టీక.— భూధవమణి = ఆ రాజశ్రేష్ఠుడు, పరిశుద్ధుఁడై = స్నానాదులచేత శుచియై, వివి...ములు = అనేకవిధము లయిన గొప్ప దానములు, (గోదాన భూదాన హిరణ్యదానాదులు)— అవనీ సురవర్యులకున్ = బ్రాహ్మణశ్రేష్ఠులకు, ముదమునన్ = సంతోషముతో, ఒసఁగెను.

* 'రమ్యదళాళీ' తంజ. పాఠము.

గీ. అంతఁ గాశీవిభునిపూజ కరుగుదెంచి
పత్నియును దాను నత్యంతభక్తితోడ
♦ధ్యాన మొనరించె నయనహస్తములు మోడ్చి;
దేవ †హరహర హరమహాదేవ యనుచు. ౨౦

టీక.—అంతఁ = అటుపిమ్మట, కాశీవిభుని పూజకున్ = ఈశ్వరారాధనకు, అరుగుదెంచి = దేవాలయమునకుపోయి, నయనహస్తములుమోడ్చి = (భక్తిపారవశ్యముచేత-) నయనములను, (నమస్కారముచేయుటకు-) హస్తములను, ముకుళింపజేసి; ధ్యానమొనరించెను.—(దేవ...యనుచున్— స్నానంబొనర్చె- అని అవతలికి అన్వయము.)

సీ. స్నానం బొనర్చె మందాకినీధరునకు
వస్త్రం బొసఁగెఁ గృత్తివాసునకును
రత్నాసనము వెట్టె రజతాద్రినిలయున
కలఁదె గంధము భసితాంగునకును
సమరించెఁ బుష్పంబు చంద్రశేఖరునకు
నిచ్చె ధూపం బనలేక్షణునకు
నునిచె దీపము *పరంజ్యోతిస్స్వరూపున
కమృతాన్న మిడియె విషాశనునకు

♦ శా. పా.— 'స్నానమొనరించి'
పూజచేయుటకు వచ్చిన రాజు, 'దేవాలయములో- ఈశ్వరుని యెదుట భార్యతోఁగూడి స్నానమొనరించె' ననుట అనుచితము. ప్రా. ము. లోను, తాళపత్రులలోనుగూడా 'ధ్యాన' అను పాఠమున్నది.

† పాఠాం.—పురహరశివ.

* శా. పా.— 'పరజ్యోతి': ('పరజ్యోతిః స్వరూపునకున్ = అన్నిటికన్న నధికమయిన జ్యోతిస్సే స్వరూపముగాఁ గలవానికి' అని, పూ. టీ.)

ప్రా. ము. నను, వ్రాత ప్రతులలోను గూడా, 'పరంజ్యోతి' అను పాఠమేయున్నది. ఆరూపము తప్పని కాబోలు 'పరజ్యోతి' అని దిద్దినారు. వారు

గీ. దండ మర్పించె నల జగద్వందితునకు
నమిత ధారాళ నారాళ హర్ష బాష్ప
నిబిడ పులకాంకు రాంకిత నేత్ర గాత్రుఁ
డగుచు రాజనరేంద్ర ధరాధివిభుఁడు. ౨౧

టీక.—రాజనరేంద్ర ధరాధివిభుఁడు, అమిత... గాత్రుఁడు.— అమిత = విస్తారమైన, ధారాళ= అడ్డులేక ప్రవహించుచున్న, నారాళ = (న + అరాళ) కుటిలములు కాని, హర్షబాష్ప = ఆనందాశ్రువుల చేతను, నిబిడ = ఒత్తయిన, పులకాంకుర = పులకల మొలకల చేతను, అంకిత = చిహ్నితములైన, నేత్ర గాత్రుఁడు= నేత్రములును - గాత్రమును కలవాడును, (హర్షబాష్పముల చేత అంకితము

---

కుమారసంభవ టీకలోను, 'పరజ్యోతిని లోపల సాక్షాత్కరించుకొని' (3–58) అనియే వ్రాసినాడు.

'పరంజ్యోతి' 'పరంధాముఁడు - అను శబ్దము లసాధువులు కావు. అప్రసిద్ధములును కావు. సంస్కృతాంధ్ర కావ్యములయం దెల్లెడలను కనబడుచుండునవే.

(1) "పరంజ్యోతిః పరంధామ పరాకాశ పరాత్పరః." (రామ సహస్రము)
(2) "పశేశీ పారగా పారా, పరంజ్యోతి స్స్వరూపిణీ." (అన్న. సహ.)
(3) "అపరిచ్ఛిన్నావ్యయ, ని
త్య, పరంజ్యోతిర్మయుండ వై" (సీతా. సం. 2–80.)
(4) "స హి దేవః పరంజ్యోతి స్తమఃపారే వ్యవస్థితమ్." (కు. సం. 2–58.)
పరంజ్యోతిః పరమాత్మాహి (మల్లి)
(5) 'దండివెలుగు అనగా పరంజ్యోతి. The great light *ie.* God.' (బ్రౌను.)
(6) " ఆ పరంధాముఁడు గాని, చారుగుణధాముఁడు గాఁడు సమీర నందనా." (సీతా. సం. 1–81.)

పరంజ్యోతి, పరంధాముఁడు, పరంతపుఁడు, పరంపర, పరాత్పరుఁడు, ప్రభృతి శబ్దములను పరజ్యోతి, పరధాముఁడు, పరతపుఁడు, పరపర, పరపరుఁడు, అని దిద్దుట సరి కాదు.

లయిన నేత్రములు కలవాడు, పులకాంకురముల చేత అంకితమయిన గాత్రము కల వాడు – అని క్రమముగా అన్వయము) అగుచు, మందాకినీ ధరునకుఁ = (మూడు లోకములను పవిత్రము చేయగల గంగను తలదాల్చిన వానికి, స్నానంబొనర్చెను= అభిషేకముచేసెను, కృత్తివాసునకుఁ = (గజ)చర్మము వస్త్రముగాగలవానికి, వస్త్రం బొసఁగెఁ; రజతాద్రి నిలయునకుఁ=వెండికొండ యిల్లుగా గలవానికి, రత్నాసనము పెట్టెఁ=రత్నాలపీటవేసెను; భసితాంగునకుఁ = దేహమున- బూడిదపూసుకొను వానికి, గంధము, అలఁదెఁ = పూసెను; చంద్రశేఖరునకుఁ = చందమామ సిగ దండగా గలవానికి, పుష్పంబు, సవరించెఁ = అలంకరించెను; అనల + ఈక్షణు నకుఁ = అగ్ని నేత్రునికి, ధూపంబునిచ్చెను; పరంజ్యోతిః స్వరూపునకుఁ = సర్వాధిక మయిన తేజస్సే స్వరూపముగా గలవానికి, దీపమును, ఉనిచెఁ = సమర్పించెను; విషాశనునకుఁ = విష (హాలాహల) మును భక్షించినవానికి, అమృ తాన్నమును – ఇడియెఁ = అర్పించెను; జగత్ వందితునకుఁ = లోకముల చేత నమస్కరింప బడువానికి, దండము అర్పించెఁ = నమస్కరించెను.

రాజు తనకుగల భక్తికొలదిని ఈశ్వరునికి అర్చనలు చేసెనేగాని, ఆ మహా దేవున కొయర్చ లేపాటివి, అని భావము.

చర్మమును ధరించువానికి సొగసైన వస్త్రములిచ్చుటయు, బూడిదెబుస్న న్నకు గంధమలదుటయు, మొదలే అగ్ని నేత్రుడైనవానికి మరల ధూపమువేయు టయు, విషమును తిను మొరటువానికి కమ్మని భోజన మిడుటయు తోచనివని గదా, అని యొక చమత్కారము.

సీ. మంత్రాభిషేక మేమర్యాదఁ జేసెనో
తల కెక్కినవిషంబు దొలఁగలేదు
గారుడమణిహార మేరీతి నిడియెనో
మెడఁ జుట్టుకొన్న పా మెడలలేదు
నుదుట గంధపుబిందు వవి యెట్లుపెట్టెనో
నెఱయు మూసినకన్ను దెఱవలేదు
ధూపవిశేష మేరూపునఁ గూర్చెనో
వెంటాడు భూతముల్ విడువలేదు

గీ. దెలియ నమృతకరుం డనఁ దేజరిల్లు
నోషధీశకులంబున నుద్భవిల్లి
యెన్నికకు నెక్కు †రాజనరేంద్రవిభుఁడు
పంచశరవైరిపూజ గావించునపుడు. ౭౭

ఈపద్యమున 'నరేంద్ర' శబ్దశ్లేషచేత విషవైద్య భూతవైద్యములు స్ఫురింప జేయబడినవి.

అమృతకరుండు అనఁ = అమృతమయము లయిన కిరణములు గలవాఁడు— అనగా, తేజరిల్లు = ప్రకాశించునట్టి, ఓషధీశ కులంబునఁ = చంద్రుని వంశము నందు, ('ఓషధీశో నిశాపతిః.' అమ) ఉద్భవిల్లి = పుట్టి, ఎన్నికకు నెక్కు, రాజనరేంద్రవిభుఁడు = రాజనరేంద్రు డనురాజు. (అని యర్థము.)

అమృతకరుఁడు అనఁ = అమృతహస్తు డని లోకులు పొగడఁగా, తేజరిల్లు= వాసిగాంచిన, ఓషధీశ కులంబునఁ = మందు మాఁకుల కధికారియైన =(విషహర ములయిన వేరు - వెల్లంకులు, తెలిసి వాడ నేర్చిన) వాని వంశమందు, ఉద్భవిల్లి- ఎన్నికకు నెక్కిన, రాజ - నరేంద్ర - విభుఁడు = ఉత్తమ విషవైద్యులలో మేటి యైనవాఁడు; ఉత్తమ మాంత్రికు డనియును (అర్థాంతరము.)

'ఓషధు' లనగా మూలికలు.—('ఓషధ్యో జాతిమాత్రే స్యురజాతౌ సర్వ మౌషధమ్'—అమ.) 'నరేంద్రుఁడు= మాంత్రికుడు', అనుటకు.—'క్రియేత కాస్యాణక నరేంద్రస్య కేనచి దనంతశక్తినా సి ధ్యాంతరాయః' (దశ — చరితమ్ ఉత్తర. 7.)

వైద్యులలో 'అమృతహస్తులు'- 'దగ్ధహస్తులు' అని రెండు తరగతులు. 'అమృత హస్తు' డనగా 'చేతివాసి' కలవాఁడు. అతని చేతిమీఁదిగా, ఎట్టి సామాన్యౌషధము నిచ్చినను అది యమృతకల్పమై యారోగ్యమునిచ్చు ననియు.— దగ్ధహస్తుని చేయి తగిలిన యెడల ఎట్టి మహౌషధ మైనను నీరసిల్లి వ్యర్థ మగుననియు లోకమున ప్రతీతి. బ్రౌను ఇట్లు వ్రాసియున్నాఁడు— "వానిది అమృత హస్తము- వాఁడు అమృత హస్తము గలవాఁడు he has a healing hand; వాఁడికి చెయివాసి కద్దు

† శాస్త్రిగారి ప్రతిలోను, ఇతర ప్రతులలోనుగూడా, 'రాజమహేంద్రవిభుఁడు' అని యున్నది. కాని, రాజునందు 'నరేంద్రత్వము (=విషవైద్యత్వము- మాంత్రికత్వమును) లేనియెడల పద్యమున కవి యమర్చిన అర్థాంతర చమత్కృతి యంతయు నంతరించును. కావున 'నరేంద్ర' అని నేను సవరించినాను.

he has a lucky hand, he is fortunate in his practice"

పంచశరవైరి పూజ = ఈశ్వరార్చనము, కావించునపుడు. (కర్త. రాజనరేంద్రుడు) (a) మంత్రాభిషేకము – మంత్రములతోడి యభిషేకము, ఏమర్యాదన్ = ఏరీతిగా- చేసెనో, (కాని) తల కెక్కిన విషంబు = ఈశ్వరుని తలపై నెలకొనియున్న నీరు (గంగ).— ('జీవనీయం కుశం విషమ్'-అమ) తొలఁగలేదు = అట్లేయున్నది.

శివుడు తన తలమీది జలమును (=గంగను) తొలగించి రా జర్పించిన అభిషేకజలమును ధరింపలేదని యర్థము. అర్చింపబడినది శిలావిగ్రహము కావున ఆవిగ్రహముపై చెక్కబడిన గంగ యట్లే యున్న దని భావము.

మంత్రా...చేసెనో = (ఇక్కడకర్త – విషవైద్యుడు) మంత్రించి నీళ్లను ఏరీతిగా చల్లెనో గాని, తల కెక్కిన * విషంబు=తలవరకును వ్యాపించిన విషము, తొలఁగలేదు = దిగలేదు. వైద్యుడు మంత్రించి నీళ్లు చల్లిన వెంటనే, విషము దిగుట లోకమునకలదు.—ప్రకృతమున అట్లు దిగలేదని అర్థాంతరము.

(b) (కర్త – రాజు) గారుడమణి హారము = గరుడపచ్చల పేరు, ఏరీతిగా నిడియెనో = ఏవిధముగా సమర్పించెనో, గాని,— మెడఁజుట్టుకొన్న పాము = శివుడు అలంకారార్థము కంఠమునకు చుట్టుకొనియున్న పాము, ఎడలలేదు = తొలగలేదు.

ఈశ్వరుడు రాజు సమర్పించిన గరుడపచ్చల హారమును గ్రహించి అలంకరించు

---

* పూ. టీ. 'విషంబు = కాలకూటము'

కాలకూట మనునది, ఒక విషవిశేషము గాని, విషసాధారణముకాదు – కాలకూట కాకోల హాలాహలాదులు విషవిశేషము లని, అమర కోశమున చెప్పబడియున్నది. తేలు, పాము మొదలగువాని విషమును 'కాలకూట' మనుట తగదు. 'వానికి విషము తల కెక్కిన' దని అనవలసినచోట – 'వానికి కాలకూటము తల కెక్కినది' అనుట తప్పు, కావున, ప్రకృతమున, తలకెక్కిన విషమును- 'కాలకూటముగా' చెప్పుట పొరపాటు. ఈశ్వరుడు కాలకూటమును త్రావెనుగాని, అది యాతని తల కెక్కలేదు. కంఠముననే నిల్చిపోయినది.

సీ. 'కమలించెగాక యంగజ విరోధి శిరోధిఁ,
దల కెక్కఁజాలెనే హాలహలంబు' వసు–4-29.

కొని, తన భుజగహారమును విసర్జింపలేదని యర్థము. ఆ శిలాప్రతిమకు చెక్కిన పాపసర్పమట్లేయున్న దని భావము.

గారుడమణిహారము = గరుడపచ్చలహారము, (గారుడ మను మంత్రముచేత మంత్రించిన రత్నాలదండ - అనియును) ఏరీతిగా వేసినాడో గాని (కర్త- విష వైద్యుడు)—మెడకుపెనవేసికొనియున్న పాము వదలిపోలేదు అని అర్థం.

గారుడమంత్రము సర్పములకు ప్రాణాంతకము. ఆమంత్రముతో మంత్రించి యిసుక చల్లినయెడల ఆ చోటికి పాము లు రా వని జనశ్రుతి. [illegible]రుడపచ్చలును విషహారములే.

'విషరోగోపశమనే కర్మ స్వాథగ్వణేషు చ
శస్యతే మునిభి ర్యస్మా దయం మరకతోమణిః' (గరుడపురాణము)

(౮) *నుదుటన్ = నొసటియందు, గంధపుబిందువు = గంధపుమక్క (బొట్టు) ను, (కర్త - రాజు) అది యెట్లుపెట్టెనో కాని, (నెరయన్) ‡ మూసిన కన్ను తెఱవలేదు = కన్నెత్తిచూడలేదు.

రాజు,ఈశ్వరుని నొసట గంధపుబొట్టు పెట్టి అలంకరించినాడేగాని,అందుకు మెచ్చి యాదేవుడు కన్నెత్తిచూడనైనను లేదు - అని యర్థము. శిలావిగ్రహము నకు చూపులేదు కావున చూడలేదని, భావము.

---

* పూ. టీ.— 'నుదుటన్ = కంటిఱెప్పమీఁద బొట్టుదిద్దిన కన్ను దెఱచుట...లోకములో ప్రసిద్ధము'.—

'నుదు' రనగా 'నొసలు' గాని 'కంటిరెప్ప' కాదు; కంటి రెప్పమీద బొట్టు పెట్టుట మానవలోకములో ఎక్కడను లేదు. 'ప్రసిద్ధ' మనుట సాహసము.

‡ పూ. టీ.— 'మూసినకన్ను = అనలనేత్రము. [అది ప్రళయకాల మందుతప్ప మఱియెప్పుడును శివుఁడు తెఱవఁడు ]—'

ఆమాటనిజమేగాని, ఆ యనలనేత్రమును తెరిపింపవలె నన్న పట్టుదల రాజు కేలకలిగెను! సంతు లే దన్నదుఃఖమున కోరువలేక ఆ యనలమునబడి భస్మమైపోవనెంచెను కాబోలు!

రాజు పూజించినది శిలావిగ్రహమునన్న విషయమును పూ. టీ. కర్తలు గుర్తింపలేదు.

విష వైద్యుడు మంత్రించి గంధపుబొట్టు పెట్టినను - మూసినకన్ను తెరవ లేదు - (ఇది జాతీయము) ఒళ్ళు తెలియక అట్లే పడియున్నాడని అర్థాంతరము.

భూతము సోకి గాని, సర్పాదుల విషము వ్యాపించిగాని స్మృతి తప్పిన వారికి మంత్రించి నొసట విభూతి పెట్టుటయు, వెంటనే వారు స్మృతివచ్చి కన్ను తెరచి చూచుటయు లోకమున కలదు (ఇక్కడ విభూతికిబదులు గంధము చెప్పబడినది.) ప్రకృతమున నట్లు జరుగలేదన్నమాట.

(d) ధూపవిశేషము = అగరు మొదలగువానితో మంచి సువాసనగల ధూపమును, ఏరూపునఁ గూర్చెనో = ఏవిధముగా అర్పించెనోగాని, వెంటాడు భూతముల్ = ఈశ్వరుని వెంట నుండు ప్రమథగణములు, విడువలేదు (ఈశ్వరుడు భూతేశుడు. 'భూతానాం ప్రమథానా మీశః' అని వ్యుత్పత్తి-).

ధూపవిశేషములచేత నెంతగా సంతోషపరచినను, ఈశ్వరుడు ప్రమథగణము నవతలికిపంపి, రాజుగారికి ఏకాంత మియ్యలేదని, యర్థము. ఆప్రతిమ చుట్టును అమర్చబడియున్న నందీశ్వర చండీశ్వ రాది ప్రతిమ లట్లే యున్నవని భావము.

వైద్యుడు, ఎన్ని రకముల ధూపములు వేసినను, వెంటబడియున్న, భూతముల్ = పిశాచములు, విడిచి పోనేలేదు - అని అర్థాంతరము.

మొండి పిశాచములకు మసాంబ్రము మొదలగు వస్తువులతో - ధూపములు వేయుటయు, ఆదుర్గంధముకు తట్టుకొనలేక, అవి వదలిపోవుటయు లోకమున కలదు. ప్రకృతమున అట్లు జరుగలేదన్నమాట.

నమకము, చమకము, మహాన్యాసము మొదలగు మంత్రములతో నుతించుచు అభిషేకము చేసినను, పచ్చలహారము మొదలగు విలువగల కానుకలు పెట్టినను, గంధము మున్నగువానిచేత నలంకరించినను, అగరు మొదలగు సుగంధద్రవ్యములతో ధూపములు వేసినను, ఆదేవునియందు ప్రసన్నతాలక్షణములేవియును చూపట్టలేదు. కారణమేమో? శ్రద్ధాభక్తులలోగాని - మంత్ర తంత్రాదులలోగాని, యేమేని లోపముజరిగెనా? లేదు - లేదు. అర్చింపబడినది శిలావిగ్రహము కావున, ఆదేవునియం దెట్టిమార్పును చూపట్టకుండుట స్వాభావికమే, అని సాముదాయికార్థము.

విష వైద్య భూత వైద్యాదికథనము చమత్కారము.

ఉ. చేరి నృపాలుఁ డర్పణము సేసిన చక్కెర లుప్పతిల్లు పం
దేరము లారగించుచు నుతింపఁదొడంగె మహేశుఁ డింపునన్
సారెకుఁ 'గుత్తుకన్ విసము నాలుక బెల్లము వెట్టి యాడుటల్
* మేర లటయ్యె సామి' యని మేలము లాడుచు గౌరి నవ్వఁగన్.

టీ.—కుత్తుకన్ విసము- నాలుకన్ బెల్లము - వెట్టి ఆడుటల్ = మన సులో మరభిప్రాయము నుంచుకొని పైకి తియ్యగా మాట్లాడుట. (ఆడుటల్ = నటించుట - అని, సారస్యము) మేరలటయ్యె = న్యాయమటయ్యె, సామి? అని, మేలములాడుచున్ = పరిహాసకములు పలుకుచూ, గౌరి - నవ్వగా, మహేశుఁడు = శివుడు, నృపాలుఁడు - అర్పణచేసిన = అర్పించిన, చక్కెరలు-ఉప్ప తిల్లు = విస్తారముగా చక్కెరవేసిచేసిన, పందేరములు = భక్ష్యాది నివేదనలు. ఆరగించుచున్, ఇంపునన్ = ఆనందముతో, నుతింపఁదొడంగెన్=(ఈతడుమంచి భక్తుడని) రాజును మెచ్చజొచ్చెను.

'మున్నాలిక బెల్లము - అంగిట విషము' అని లోకోక్తి. కడుపులో కప టముపెట్టుకొని పైకి తియ్యగా మాట్లాడుట - అని దానికి లక్ష్యార్థము. సహజము గనే కుత్తుకను విషముగలిగియున్న శివుని నోటికి బెల్లపు - అప్పచ్చులందిచ్చి, కవి లోకోక్తికి వాచ్యార్థమును గూడా జోడించినాడు.

గౌరి పరిహాసవాక్యమున, స్వామీ, సంతానము నియ్యక యింతకాలము మిడికించిన తాము, ఇప్పుడా రాజును ప్రశంసించుట వట్టినటన; మీ నటన 'ముక్కాలిక బెల్లము - అంగిట విషము' అను లోకోక్తికి చక్కని తార్కాణముగా నున్నది, అని యెత్తిపొడుపు.

గీ. ఇట్టు లత్యంతభక్తిమై నెపుడు నంగ
రంగవైభవముల సముగ్రంబులైన
యారగింపుల సంతుష్టి నలవరించి
శివుఁ ద్రికాలంబులంపుఁ ♦ బూజించుచుండె ౨౮

❘ పాఠాం.—'పండేరము......నటింప' (శ..ర.)

* శా. పా.—'మేరలటమ్యె సామికని' ('సామికిన్ = శివునికి, మేరలు అటుఅయ్యెన్ = ఒప్పినవయ్యెను.'—పూ. టీ.)

♦ పాఠాం.—'పూజింపఁదొణఁగె.'

విషవైద్యుడు మంత్రించి గందపుబొట్టు పెట్టినను - మూసినకన్ను తెరవ లేదు - (ఇది జాతీయము) ఒళ్ళు తెలియక అట్లే పడియున్నాడని అర్థాంతరము.

భూతము సోకిగాని, సర్పాదుల విషము వ్యాపించిగాని స్మృతి తప్పిన వారికి మంత్రించి నొసట విభూతి పెట్టుటయు, వెంటనే వారు స్మృతివచ్చి కన్ను తెరచి చూచుటయు లోకమున కలదు (ఇక్కడ విభూతికిబదులు గందము చెప్పబడినది.) ప్రకృతమున నట్లు జరుగలేదన్నమాట.

(d) ధూపవిశేషము = అగరు మొదలగువానితో మంచి సువాసనగల ధూపము, ఏరూపునఁ గూర్చెనో = ఏవిధముగా అర్పించెనో గాని, వెంటాడు భూతముల్ = ఈశ్వరుని వెంట నుండు ప్రమథగణములు, విడువలేదు (ఈశ్వరుడు భూతేశుడు. 'భూతానాం ప్రమథానా మీశః' అని వ్యుత్పత్తి-).

ధూపవిశేషములచేత నెంతగా సంతోషపరచినను, ఈశ్వరుడు ప్రమథగణము నవతలికిపంపి, రాజుగారికి ఏకాంత మియ్యలేదని, యర్థము. ఆప్రతిమ చుట్టును అమర్చబడియున్న నందీశ్వర చండీశ్వ రాది ప్రతిమ లట్లే యున్నవని భావము.

వైద్యుడు, ఎన్నిరకముల ధూపములు వేసినను, వెంటబడియున్న, భూతముల్= పిశాచములు, విడిచి పోనేలేదు - అని అర్థాంతరము.

మొండి పిశాచములకు మసాంబ్రము మొదలగు వస్తువులతో - ధూపములు వేయుటయు, ఆదుర్గంధమును తట్టుకొనలేక, అవి వదలిపోవుటయు లోకమున కలదు. ప్రకృతమున అట్లు జరుగలేదన్నమాట.

నమకము, చమకము, మహాన్యాసము మొదలగు మంత్రములతో నుతించుచు అభిషేకము చేసినను, పచ్చలహారము మొదలగు విలువగల కానుకలు పెట్టినను, గందము మున్నగువానిచేత నలంకరించినను, అగరు మొదలగు సుగంధద్రవ్యములతో ధూపములువేసినను, ఆదేవునియందు ప్రసన్నతాలక్షణములేవియును చూపట్టలేదు. కారణమేమో? (శ్రద్ధాభక్తులలోగాని - మంత్ర తంత్రాదులలోగాని, యేమేని లోపముజరిగెనా? లేదు - లేదు. అర్చింపబడినది శిలావిగ్రహము కావున, ఆదేవునియం దెట్టిమార్పును చూపట్టకుండుట స్వాభావికమే, అని సాముదాయికార్థము.

విషవైద్య భూతవైద్యాదికథనము చమత్కారము.

ఉ. చేరి నృపాలుఁ డర్పణము సేసిన చక్కెర లుప్పతిల్లఁ బం
¶దేరము లారగించుచు నుతింపఁదొడంగె మహేశుఁ డింపునన్
సారెకుఁ 'గుత్తుకన్ విషము నాలుక బెల్లము వెట్టి యాడుటల్
*మేర లటయ్య సామి'యని మేలము లాడుచు గౌరి నవ్వఁగన్.

టీ.—కుత్తుకన్ విషము- నాలుకన్ బెల్లము - పెట్టి ఆడుటల్ = మనసులో మరఖిప్రాయము నుంచుకొని పైకి తియ్యగా మాట్లాడుట. (ఆడుటల్ = నటించుట - అని, సారస్యము) మేరలటయ్య = న్యాయమటయ్య, సామి? అని, మేలములాడుచున్ = పరిహాసకములు పలుకుచూ, గౌరి - నవ్వగా, మహేశుఁడు = శివుడు, నృపాలుఁడు - అర్పణచేసిన = అర్పించిన, చక్కెరలు-ఉప్పతిల్లు = విస్తారముగా చక్కెర వేసిచేసిన, పందేరములు = భక్ష్యాది నివేదనలు. ఆరగించుచున్, ఇంపునన్ = ఆనందముతో, నుతింపఁదొడంగెన్=(ఈతడు మంచి భక్తుడని) రాజును మెచ్చజొచ్చెను.

'మున్నాలిక బెల్లము - అంగిట విషము' అని లోకోక్తి. కడుపులో కపటముపెట్టుకొని పైకి తియ్యగా మాట్లాడుట - అని దానికి లక్ష్యార్థము. సహజముగనే కుత్తుకను విషముగలిగియున్న శివుని నోటికి బెల్లపు - అప్పచ్చులందిచ్చి, కవి లోకోక్తికి వాచ్యార్థమును గూడా జోడించినాడు.

గౌరి పరిహాసవాక్యమున, స్వామీ, సంతానము నియ్యక యింత కాలము మిడికించిన తాము, ఇప్పుడా రాజును ప్రశంసించుట వట్టినటన; మీ నటన 'మున్నాలిక బెల్లము - అంగిట విషము'అను లోకోక్తికి చక్కని తార్కాణముగా నున్నది, అని యెత్తిపొడుపు.

గీ. ఇట్టు లత్యంతభక్తిమై నెపుడు నంగ
రంగవైభవముల సమగ్రంబులైన
యారగింపుల సంతుష్టి నలవరించి
శివుఁ ద్రికాలంబులందుఁ ♦బూజించుచుండె ౨౮

---

¶ పాఠాం.—'పండేరము.....నటింప' (శ..ర.)

* శా. పా.—'మేరలటమ్యొ సామికని' ('సామికిన్ = శివునికి, మేరలు అటుఅయ్యెన్ = ఒప్పినవయ్యెను.'—పూ. టీ.)

♦ పాఠాం.—'పూజింపఁదొణఁగె.'

టీక.—అంగరంగ వైభవములన్ = సకలవిధములయిన కైంకర్యములచేతను సమ...గింపులన్ = కొదవలేని నివేదనల చేతను. —త్రికాలంబులందున్ = ఉదయ మధ్యాహ్న సాయం సమయములయందును, పూజించుచుండెను.

అంగ రంగ వైభవములు..— అనగా, 'అంగ = దేహముయొక్కయు, రంగ=ఆలయముయొక్కయు, విభవములు' అని ప్రతి పదార్థము. 'సమస్తభోగములు' అని సంప్రదాయార్థము. బ్రౌణ్యమున ఇట్లున్నది.—

"అంగరంగ వైభవములు Enjoyment of riches or excellencies; pomp, luxury; సమస్తభోగములు. రంగడు అంగరంగ వైభవములతో వేంచేస్తున్నాడు the god was carried in procession with all kinds of homage."

క. 'తిరునాళ్లను దేరులు నన
వరతంబును నంగరంగవైభవములునుం
దిరమగును దేవళంబులఁ
బరఁగఁగ నొకకోఁడిగూయ పల్లియ నైనన్'(పల్ల. వి|ప.1-60)

క. నందన సంతానము మది
యందుం † గోరి భజియింప నాశ్రితపటలీ
నందనసంతానం బగు
నిందుకళాధరుఁడు పార్వతీశ్వరుఁ డంతన్. ౨౫

టీక.— * నందన సంతానమున్ = పుత్రసంతతిని, మదియందున్ కోరి,

---

† శా. పా.—'గోరుచు భజింప'.

* పూ. టీ.—'నందన సంతానము = కుమారుల పరంపరను'.

ఇక్కడ 'నందనసంతాన' మనగా నందనరూప సంతానము (=నందనుడే) గాని 'నందనుల యొక్క - సంతానము (=పరంపర) కాదు. రాజు కోరినదియు, రాజశేఖరు డిచ్చినదియు, నొక్క కుమారుడే. 'కుమారుల పరంపరను' కాదు. పుత్రసంతానము, పుత్రికాసంతానము, అను వ్యవహారము ప్రసిద్ధము.—

సీ. 'కనిపొంచి గొడ్డుమీఁగంగ రత్నమువంటి
పుత్త్రసంతానంబు పుట్టెననఁగ
భువనసయనంబు లోకబాంధవుఁడుమించె'. [రామా-2-106.]

భజియింపఁగ = సేవింపగా, ¶ ఆశ్రి...ంబు — ఆశ్రిత = భక్తులయొక్క, పటలీ= సమూహమును, నందన = ఆనందింపజేయుట యందు, సంతానము = కల్పవృక్ష మయిన, (అనగా, కల్పవృక్షమువలె కోరిన కోరికలెల్లను తీర్చి ఆనందమును కూర్చు వాఁడయిన-) ఇందు కళాధరుఁడు; పార్వతీశ్వరుఁడు.

సీ. వరదానసంపద వామోత్తమాంగముల్
　　శైలజాగంగల సాక్షి దెలుపఁ,
గోపప్రసాదైకగుణమూర్తిఁ జూపులు
　　చందమామల్లుని సాక్షి దెలుప,
ఖలశిక్ష సాధురక్షణమునఁ గటియుఁ గేల్
　　శార్దూలమృగముల సాక్షి దెలుప,
ననుపమాజ్ఞాసిద్ధిఁ † బునుకగంగాళంబు
　　♦ సరసీరుహాసను సాక్షి దెలుప,

---

¶ పూ. టీ.— 'ఆశ్రి...ంబు = భక్తులయొక్క సమూహమునకు నందనవన మందున్నట్టి కల్పవృక్షము'.

కల్పవృక్షము నందనవనమునందే గాని మరొకచోట నుండునది కాదు. కావున 'నందనవనమునందున్నట్టి కల్పవృక్ష'మని కవియనడు.

† శా. పా.— 'పునుక గంకాళంబు' ('పునుక కంకాళము(ల్?) = కపాలమను పాత్రము' అని, పూ. టీ.)

'కంకాళము' అనగా అస్థిపంజరముగాని 'పాత్రము' కాదు. 'పునుక గంగాళంబు' అని సరియైన పాఠము, పూ. ము. న నున్నది.

♦ శా. పా — 'సరసీరుహాక్షుల' ('సరసీరుహాసనుఁడు = బ్రహ్మను'- పూ. టీ.)

'సరసీరుహాక్షుల' అనునది అచ్చుపొరపాటు. తప్పయినను శ్రీ శాస్త్రిగారి ముద్రణమున నున్నందున అనుమానింపక వావిళ్ళవారును 'సరసీరుహాక్షుల' అనియే ముద్రించినారు.

గీ. బంధురాష్ట్రవిభూతులు పరిఢవిల్లఁ
దనను రాజశిఖామణిత్వంబు వెలయఁ
బ్రమదమున మందహాసయానములతోడ
వచ్చి ధరణీతలేంద్రుని స్వప్నమునను. ౨౮

ఈపద్యమున 'రాజశిఖామణి' శబ్దశ్లేషచేత, ఈశ్వరునియందు- 'రాజశ్రేష్ఠత్వము' అమర్చబడినది.

టీక. (1) వామోత్తమాంగముల్.- వామాంగము = (ఈశ్వరుని) శరీరములోని యెడమభాగము, ఉత్తమాంగము = శిరస్సు, వరదాన సంపదన్ = వరరూపమయిన త్యాగసమృద్ధియందు - (శ్రేష్ఠమయిన త్యాగసమృద్ధియందు, అని అర్థాంతరము.) శైలజాగంగలన్ = పార్వతిని - గంగను, సాక్షి దెలుపన్ = దృష్టాంతముగా తెలియజేయుచుండగా.-('సాక్షి - Proof, evedence' బ్రౌను.-క. 'తప్పితివో యిచ్చెదనని, చెప్పితివో కపటసాక్షి'-భాగ. 1-355.)

ఈతడు గొప్ప త్యాగి. కోరువారలకు తన శరీరము నైనను దానముచేయువాడు - అందులకే పార్వతీగంగలే సాక్షులు అని, తన (శరీర) వామభాగమును్న శిరమును్న తెలియజేయుచుండగా, అని తాత్పర్యము.

ఈశ్వరుని వామార్థమున పార్వతియు శిరమున గంగయు నుండు రనుట సువిదితము. (వామోత్తమాంగప్రదానముచేత ఇందు దానసమృద్ధి చెప్పబడినది.)

(2) చూపులు, కోప...రూఢిన్ = నిగ్రహముచేతను - అనుగ్రహముచేతను - ప్రసిద్ధమయిన - స్వభావ నిశ్చయమునందు, చందమామ అల్లునిన్ = [చంద్రునికి మేనల్లు డైన] మన్మథుని - సాక్షి తెలుపన్.

ఈతడు కోపించినయెడల నాశనముచేయుటకును, కరుణించినయెడల బ్రతికించుటకును, చాలిన గొప్పప్రభావముకలవాడు; - అందుకు మన్మథుడేసాక్షి - అని చూపులు తెలియజేయుచుండగా, అని - తా.

ఈశ్వరుడు కోపించి మన్మథుని వేడికంటజూచి భస్మముకావించె ననియు - (రతివిలాపముచేత) కరుణించి, మరల బ్రతికించె ననియు - పురాణము. (ఇందు, చంపి మరల బ్రతికించుట ద్వారా - కోపప్రసాదములు చెప్పబడినవి.)

(3) కటియుగ్ = మొలయును, కేల్ = చేయియును, ఖలశిక్షన్ = దుష్టశిక్షణమునందును, సాధురక్షణమునన్ = శిష్టరక్షణమునందును, శార్దూల

మృగములన్ = పెద్దపులిని - జింకను, (క్రమముగా) సాక్షిదెలుపన్.

ఈతడు దుర్మార్గులను శిక్షించువాడు; సన్మార్గులను రక్షించువాడు. అందుకు పెద్దపులి జింకపిల్లయే సాక్షులు అని, కటియును హస్తమును తెలుపుచుండగా అని, తా.

ఈశ్వరుడు పులితోలు కట్టుకొను ననియు - లేడిని చేతబట్టుకొను ననియు- పురాణము. [ఇందు, పులిని దంపుట జింకను మన్నించుటద్వారా, ఖలశిక్షణ సాధు రక్షణములు చెప్పబడినవి.)

(4) పునఃకంగాళంబు = [illegible] కంగాళమువలె చేతనున్న తలపుర్రె, అను...సిద్ధిన్ = సాటిలేని దండనశక్తియందు, సరసీరుహాసనున్ = బ్రహ్మను, సాక్షిదెలుపన్.

ఈతడు, నిరుపమానమయిన ఆజ్ఞాసిద్ధికలవాడు. అందుకు బ్రహ్మదేవుడే సాక్షి, అని చేతనున్న తలపుర్రె తెలుపుచుండగా - అని, తా.

పూర్వము బ్రహ్మకు అయిదుతలలుండెననియు, ఒకప్పుడు శివుడు కోపించి, యొక తల నెగురగొట్టెననియు, ఆ తలపుర్రెనే చేత వాల్చి శివుడు చరించుచుండు ననియు, పురాణగాథ. (బ్రహ్మదేవుని తలతీసె ననుటద్వారా యిందు ఆజ్ఞా సిద్ధి చెప్పబడినది.)

బంధుర = విస్తారమయిన, అష్టవిభూతులు = అణిమాద్యష్టసిద్ధులు (= అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము) పరిఢవిల్లన్ = అతిశయింపగా - (అని, యర్థము)

అష్టవిభూతులు = (గృహము, శయ్య, వస్త్రము, ఆభరణము, స్త్రీ, పుష్పము, గంధము, తాంబూలము - అను) † అష్టభోగములు, పరిఢవిల్లన్, (అని అర్థాం.)

తనదు, ♦ రాజశిఖామణిత్వంబు = చంద్రశేఖరత్వము = ఈశ్వరత్వము, (రాజశ్రేష్ఠత్వము, అని అర్థాం) వెలయన్ = ప్రకటముకాగా, ప్రమదమునన్ =

---

† "దాసో భృత్య స్సుతో బంధు ర్వస్తు వాహన మేవచ
ధనధాన్య సమృద్ధి శ్చా ప్యష్టభోగాః ప్రకీర్తితాః" —అని కొందరు.

♦ పాఠాం.—'రాజశిరోమణిత్వంబు'

సంతోషముతో, ¶మంద - హాసయానములతోడ = చిఱునవ్వుతో - మెల్లని నడకతో, (మంద హాస మందగమనములు మహాపురుషలక్షణములు)*ధరణీతలేంద్రుని = భూపతియైన రాజనరేంద్రునియొక్క, స్వప్నమునను వచ్చి = కలలోకనబడి.

దానసంపద, కోపప్రసాదములు, ఖలశిక్షణ సాధురక్షణములు, ఆజ్ఞాసిద్ధి, అష్టభోగములు, అనునవి రాజశ్రేష్ఠ (=సార్వభౌమ) లక్షణములు. ఆలక్షణము లమరి యున్నవి కావున నే, 'రాజశిఖామణి' (=చంద్రశేఖరుడు) రాజశ్రేష్ఠుడును, అయ్యున్నాడని చమత్కారము.

దానసంప దాదు లుత్తమరాజ లక్షణములనుటకు.—

సీ. "మీఱిన రాజు బల్మి నడంప, లోనైన
నభినవస్థితిఁ బెంప, నతఁడె నేర్చుఁ
దేరిచూచినఁ దీవ్రదీప్తిఁ జూపి, జనాళి
కక్షిసాఫల్య మీ, నతఁడె నేర్చు
సింధులింకఁ బ్రతాపశిఖిఁ బూన, విశ్రాణి
తాంబుల నవి నింప, నతఁడె నేర్చు
సమి దున్ముఖుని తేజము మలంపఁ, బాదంబు
లంటిన వెలయింప నతఁడె నేర్చు" (వసు. 1.118)

---

¶ శా. సా.—'మందహాసాననములతోడ' ('చిఱునవ్వుగలిగిన, ఈశానాది ముఖములతో.'— అని, పూ. టీ)

ఈశానాదిముఖములు, ఈశ్వరునికే గాని, శ్లేషలోని రాజశ్రేష్ఠునియెడ చెల్లవు (పూ. టీ. లో అర్థాంతర ప్రస్తావమే లేదు.) 'మంద హాస యానముల తోడ' అను పాఠము పూ. ము. నను, వ్రాతప్రతులలోను నున్నది.

* పూ. టీ.—'ధరణీతలేంద్రుని = భూలోక దేవేంద్రుని యొక్క అనగా రాజరాజనరేంద్రుని యొక్క.)'

అర్థించిన యతడు (రాజనరేంద్రుడు) సామాన్యరాజనియు, సాక్షాత్కరించిన యతడు 'రాజశిఖామణి' (=రాజాధిరాజు) అనియు, పద్యమున సాగ స్యము. కావున, అర్థియైన 'రాజనరేంద్రు'ని భూలోకదేవేంద్రునిగా చెప్పుట ఉచితము కాదు.

ఉ. "కోపముచూపినం బగఱకుం దలచూపఁగరాదు, సుప్రసా
దోపగతిం గనుంగొనిన నోముసిరుల్ శరణార్థికోటికిన్,
గోపమునుం బ్రసాదము నకుంఠితముల్ నృపు లీమువత్తురే
పాపనృపాలచంద్రునకుఁ బాపవిదూరునికిం గళాధృతిన్"
—రామా. 1-102

ఈశ్వరునియందు 'రాజశేఖర' త్వమును జెప్పుట కవులకు పరిపాటి:—

(1) సీ. "తన యాజ్ఞ జంగమస్థావర జంతు సం
తాన మెన్నఁడు జవదాటు వెఱవఁ
దన తేజమున నర్బుద న్యర్బు దోష్ణర్చ
ధార్క-చంద్రములైన నడఁగిపోవఁ
దనదు శక్తిత్రియంబున సమస్త ప్రపం
చంబుల కభివృద్ధి సంభవిల్లఁ
దన మహాప్రకృతి పెద్దల చిత్తవృత్తికి
నగణితాశ్చర్యంబు నావహింపఁ
జెలఁగె విశ్వేశ్వరుఁడు, రాజశేఖరుండు." (కాశీ. మా-1-28.)

(2) సీ. "మును దిస్సమొలసామియును రాజశేఖర
త్వము దాల్చె నీతనివంకఁ గాదె,
యనఁగ జాబిల్లి ప్రాకె నయ్యభ్రవీథి" (మల్ల. విప్ర. 3-35.)

## — వరప్రదానము —

గీ. ధారుణీనాథ, విను మేను దావకీన
సదమ లాత్యంతభక్తికి సంతసిలితి,
నీవు చేసినపూజ వర్ణింపఁ దరమె?
♦యిదిగో యిట్టె ఫలించు నీ యీప్సితంబు. ౨౭

---

♦ శా. పా.— 'యిదిగో నిపుడె' ('యిదిగో యిట్టె' పూ. ము; తంజ. తా. పా.) 'నీకు సంతానము త్వరలోనే కలుగగల' దనుట యుచితముగాని — 'ఇప్పుడే' కలుగుననుట యుచితము కాదు; కావున 'ఇపుడె' అను పాఠము సరికాదు. 'ఇదిగో' ద్రుతప్రకృతికము కా దని భాషావిదుల సిద్ధాంతము.

టీక.—తావకీన = నీ, సద... క్తికిన్ = మంచి - నిర్మలమైన విశేష భక్తికి, సంతసిలితిన్, నీ, ఈప్సితంబు = కోరిక, ఇదిగో- ఇట్టె ఫలించున్ = త్వరలోనే సిద్ధించును.

'ఇదిగో - యిట్టె, (జాతీయము) ఇట్టె= శీఘ్రముగా; అశ్రమముగా. (శ. ర. లోలేదు.) "ఇట్టె - Thus, at once - 'గట్టిగా నినుబట్టికడఁగి మాయింటికి, కిట్టె కొంపోయెద మిది కల్లగాదు'' (నల . 5 - 778)"— బ్రౌణ్య.

---

బ్రః॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. —

"అదిగొ మ్మనుచుఁ జల్ల నందంద నెగయు"—(పుట . 109.) అది గొమ్మనుచు = అదిగో + అనుచు, అదిగో, ఇదిగో, వీఁడుగో, వాఁడుగో అను రూపములుఁగలవు. 'కొనుము' కు- కొమ్ము, కో, అను రూపములుఁగలవు. అదిగొనుము = దానిని గ్రహింపుము, చూడుము అని యర్థము. 'కొనుము' రూపాంతరము 'కో' అనుటచే నా పదము కళ గాని ద్రుతాంతము గాదు.

"అది,గో కానంబడియెఁ దెల్లగొల్లెన భంగిన్"

అని వరాహపురాణమునఁ (ప్రాసమున) గలదు. పింగళిసూరన దానిని ద్రుతాంతముగాఁ బ్రయోగించుట చింత్యము — 'మనము మ్రిచ్చిలి చొచ్చిన మత్తి కాఁడు, వీఁడుగొ మ్మని'— ఉత్తర హరివంశము"

బసవపురాణము పీఠిక (పుట 115)

శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు :—

"అదిగో, అదుగో, అడుగో..."— ఇత్యాదులు దేశ్యములు కళలు ప్రతిపదోక్తావ్యయములు. ఈ యంశమునకు అహోబల 496 పుటయు, సంగ్రహవ్యా. 89 పుటయుఁ జూడఁదగు.

ద్రుత ప్రకృతికములు గానిచోఁ గళాపూర్ణోదయ ప్రయోగము కుదురదని యొకవాదము రావచ్చును, అది ద్రుతోపజీవిత్వము వలనఁ గుదురును. ఈ యంశమునకు అహోబల. 358 పుట చూడఁదగును.

శ్రుతిరంజకతం బట్టి ద్రుతముచేరును. లేనిచో మానును. ఇది సంగ్రహముగా వ్రాసిన ప్రత్యుత్తరము. ఈ రహస్యము నెఱుంగనివారు దీనిని ద్రుతాంతమని భ్రమపడుదురు. అయినచో, 'మిక్కిలి' 'అప్పుడు' లోనైనవికూడ వారికి ద్రుతాంతములే కావలసివచ్చును.— ఈ ద్రుతోపజీవిత్వముకూడ దీనికి హ్రాస్వరూపస్థితిలోలేదు.— (షష్టిపూర్తి సంపుటము. 7. పాశుపతము పుట. 89)

"ఏదియును జూడ కీ జగద్ధితచరిత్రుఁ
డిట్టిచని బాలభానుని బట్టె నపుడు"

—(నూ. ని.) ఉ. రా. 5-100

ఇట్టె వస్తాడు, ఇట్టెపోతాడు, ఎక్కడినుంచో ఇట్టెవచ్చాడు, అని యిట్లు నేఁటివ్యవహారమునఁ, 'ఇట్టె' భూతార్థముననే వినబడుచున్నది.

క. రత్నాంగి కుదయమాయె నొక
రత్నమువంటితనయుండు రమణీయకళా
నూత్నహరిణాంకుఁ డాసుత
రత్నము *పేరిడుము నాకు రాజనరేంద్రా. ౭౮

టీక.—రమ...కుఁడు.—రమణీయ = మనోహరమయిన, కళా = కాంతి చేత, †నూత్న హరిణాంకుఁడు = క్రొత్తచంద్రుఁడు (అనదగినవాడు), రత్నమువంటి

---

* శా. పా.—'రత్నమునిదు నాదు పేరు' ('అసుతరత్నముక్ = అపుత్ర శ్రేష్ఠునికి'—పూ. టీ.)

రత్నమును నా పేరిడుము – అనుట సరికాదు. పేరిడుట రత్నమునకుగాని రత్నమును కాదు. 'రత్నముక్' అను ద్వితీయాంతరూపమునకు, 'రత్నమునకు = పుత్రశ్రేష్ఠునికి అను నర్థము సిద్ధింపదు. గావున 'నాదు పేరిడుము' అనదలచినచో 'రత్నముకిదు నాదు పేరు' అనవలెను. అట్టి పాఠము వారికి లభించినట్లులేదు. పూ. ము. నను, తంజ. వ్రాతప్రతులలో కొన్నింటను, 'రత్నము పేరిడుముమాకు –(నాకు)' అను పాఠమున్నది. 'పేరిడుట' యనగా అంకితముచేయుట. ఈయర్థము ననే కవి, విజయ (1-39) లో 'బిడ్డలనెందఱుఁ బేరువెట్టినక్, దీరునె మీఋణంబు' అని యున్నాడు. ఇట్లే, పరమయోగివిలాసకర్తయు,—

సీ. 'చరితంబునకు సంతసమునొంది బిడ్డను
బేరువెట్టక తీర దీ ఋణమని'—(5-46.)

'పేరువెట్టు' అను క్రియను వాడియున్నాడు. మరియు నీ 'సారంగ' లోనే 3౦ పద్యమున, 'తనకుఁ బేరిడుము' అని మరియొకమారును ప్రయుక్తమైయున్నది. కావున 'పేరిడుమునాకు' అనుపాఠమే సాధువు.

† పూ. టీ.—'క్రొత్తయైన చంద్రుఁడు – ఉదయించును.'

రత్నాంగికి కేవలము చంద్రుడే యుదయించునని చెప్పుట సరసము కాదు.

తనయుండౌ, ఉదయమౌను = కలుగును. (చంద్రుఁడు కావున ఉదయమగునని సార స్యము.) అసుతరత్నముఁ = ఉత్తముఁడైన ఆకుమారుని, నాపేర — పేరిడుము = నాపు అంకితముచేయుము. (వానికి నా పేరుపెట్టుము, అని — భా.)

క. అని యేఁగె; నంతలో ది
గ్గన మేల్కని విభుఁడు 'హా సుహాదేవ' యటం
చును మేను * గగుర్పొడువఁగ
ననుమోదాశ్చర్యమగ్నుఁడై ‖ యున్నంతన్. ౨౯

టీక.— మేను = శరీరము, గగుర్పొడువఁగన్ = (ఆనందముచేత) పులకిం పగా, అనుమోద = సంతోషమునందును, ఆశ్చర్య = అచ్చెరువునందును, మగ్నుఁ డు = మునిగినవాడు, (మిక్కిలి యానందమును — ఆశ్చర్యమును పొందినవాడు) ఐయున్నంతన్ = అయియుండఁగా.

ఉ. బల్లునఁ దెల్లవాఱిన నృపాలుఁడు మంత్రులఁ బిల్వఁ బంచి, యు
త్ఫుల్లముఖారవిందుఁ డయి, తొట్టిన వేడుకచే మనంబు రం
జిల్లఁగ, రేయి గన్నకలఁ జెప్పె ‡ నదంతయు నాను పూర్విగా;
సల్లలితాంతరంగు లయి సామి, 'హసా' దని వార లూఁకొనన్.

టీక.— (మంత్రులు) సల్లలితాంతరంగు లయి = ప్రసన్నహృదయులై, సామి = ప్రభూ, ♦హసాదు - అని = మేలు మేలని, ఊఁకొనన్ = ఊఁకొ ట్టుచూ వినగా, నృపాలుఁడు, ఉత్ఫు...డయి = వికసించిన ముఖ (కమల)ము కల వాడై (ముఖము అరవిందము కావున నే ఉదయవేళ వికసించిన దని సారస్యము)

---

* శా. పా.— 'గగుర్పొడవఁగ'

ప్రా. ము. లో 'పొడవగ' అని, యున్నది. దానినిబట్టి శాస్త్రిగారును, వారిని నమ్మి 'వావిళ్ల' వారును 'పొడవఁగ' అనియే ముద్రించినారు. ప్రమా దము. ధాతువు 'గగుర్పొడుచు' గాని 'గగుర్పొడచు' కాదు.

‖ శా. పా 'డయ్యెనటంతన్'

‡ శా. పా.— 'నదెంతయు' ('కలజెప్పనదెంతయు' పూ. ము. పా.) జెప్పెనదంతయు, అని నాసవరణ.

♦ పూ. టీ.— 'హసాదు = మహాప్రసాదము.'

* తొట్టిన వేడుకచేన్ = నిండారిన సంతోషముచేత, మనంబు రంజిల్లఁగన్ = మనసు ఆనందమున పొంగగా, రేయి గన్న కలను. ఆనుపూర్విగాన్ = మొదటి నుండి తుదివరకును - క్రమముగా, అనంతయున్ = ఆ వృత్తాంతమంతయును చెప్పెను.

ఉ. చెప్పిన సంతసిల్లి, నృపశేఖర, రత్నమువంటి నందనుం
డొప్పులకుప్పగల్గుఁ, † దనకున్నతిఁ బేరిడుమంచు వేడ్కతో
నప్పరమేశ్వరుండె యిటు లానతి యిచ్చిన నెంతభాగ్య మ
ప్పప్ప! భవత్ప్రభావ ‡ విభవాఢ్యత యే మని సన్నుతింపఁగన్.

---

'మహాప్రసాద' మనుమాట ఆజ్ఞాంగీకారమున విధేయతాసూచకముగా వాడదగినది. ఇక్కడ 'ఆజ్ఞ' లేదు, 'అంగీకారమును' లేదు. రాజుగారి భాగ్యవిశేషమును ప్రశంసించుట ప్రకృతము. కావున. హసాదు = మేలు; బళి, అనుట యుచితము.

* పూ. టీ.—'తొట్టిన = పొందినట్టి - వేడుకచే.'

'తొట్టిన వేడుక' యనగా నిండారిన - అతిశయించిన వేడుకగాని, 'పొందినట్టి వేడుక' కాదు. —"పెట్టని కోట నీకు హరి, భీముఁడు నర్జునుఁడున్ రణంబునన్, దొట్టినమంటలు."— భా. ఉద్యో. 1-297.

† శా. పా.— 'తనదున్నతిఁ బేరిడుమంచు' ('తనది = తన సంబంధమైనట్టి, పేరు = నామము, ఉన్నతిన్ = గొప్పగా, ఇడుము ఉంపుము' పూ. టీ.)

'తన పేరు' అనుటకు, 'తనది పేరు' అనుట తెనుగు సంప్రదాయము కాదు. 'నాదియమ్మ; మాదియక్క' ఇత్యాది వ్యవహారము తెనుగు సంఘమున వినబడదు. 'తనది' విశేష్యముగాని, విశేషణము కాదు. కావున, 'తన సంబంధమైనట్టి' అను టీక సరికాదు.— 'తన పేరు గొప్పగా పెట్టుము' - అని రచింపలేక, కవి - 'తనది గొప్పగా పేరుపెట్టుము' అని డొంకతిరుగుడు తప్పు వ్రాత వ్రాసెననుట విశ్వాస్యము కాదు.

పూ. ము. నను, తంజ. వ్రాత ప్రతులలోను, 'తనకున్నతి' అను పాఠమున్నది. కావున 'తనదున్న' పాఠముకంటెను 'తనకున్న' పాఠమే మేల్తరమని, దానినే కైకొన్నాను.— 'పేరిడు' అను క్రియనుగూర్చి ౨౮ వ పద్యము కడచూచునది.

‡ పాఠాం.—'ప్రతాప మహిమాఢ్యత.'

టీక.—నృపశేఖర,...నందనుండు, ఒప్పులకుప్ప = సద్గుణములప్రోవు, కల్గుఁ = నీకుపుట్టును, వానికి, ఉన్నతిఁ = గొప్పగా, తనపేరు పేరిడుము = నాపేరు పెట్టుము, అంచుఁ = అని, అప్పరమేశ్వరుండే, ఆనతియిచ్చినఁ = ఆజ్ఞాపించితే, అది - ఎంతభాగ్యము! (గొప్పభాగ్యమని భా.) అప్పప్ప = ఔరౌరా, భవత్ప్రభావ విభవాఢ్యతఁ = నీ ప్రభావముయొక్కయు - ఐశ్వర్యముయొక్కయు - సమృద్ధిని, ఏమని సన్నుతింపఁగఁ = ఏమని కొనియాడవచ్చును? (కొనియాడ శక్యము కాదని, భా.)

క. అనుచుఁ జెలరేఁగి మంత్రులుఁ
గొనియాడుచు నుండి; రంతఁ గొన్ని దినంబుల్
జనఁ, గనకాచలకార్ముక
వినుతైకకృపాకటాక్ష వీక్షణమహిమన్. ౩౨

టీక.—కనకాచలకార్ముక = బంగారుకొండ విల్లుగాగలవాఁడైన పరమేశ్వరునియొక్క, వినుత = (లోకముచే) కొనియాడబడినట్టియు, ఏక = ప్రసిద్ధమైనట్టియు, కృపా = దయతోఁగూడుకొన్న, కటాక్షవీక్షణ = చూపుయొక్క మహిమన్ = ప్రభావముచేత.

క. నెల మసలెన్ రత్నాంగికి,
బలిసెఁ జిట్టుములు నరుచి బడలిక *యూర్పుల్,
తెలుపెక్కెఁ దళుకుఁజెక్కులు,
నలఁతికవును గొప్ప యయ్యె, నారేర్పడియెన్. ౩౩

టీక —రత్నాంగికిన్, నెలమసలెన్ = నెలతప్పెను (=గర్భమాయెను) చిట్టుములు = వేవిళ్ళ సంబంధమయిన ఓకిలింతలు అరుచి = నోటికి వస్తువును రుచింపకపోవుట, బడలిక = అలసట, ఊర్పుల్ = ఉచ్ఛ్వాస నిశ్వాసములు, బలిసెన్ = మెండయ్యెను. అలఁతి కవును = సన్నని నడుము, గొప్పయయ్యెను, ఆరు = నూగారు, ఏర్పడెను.

'నెలమసలు' — ఇదియొక జాతీయము (శ. ర. లోకేమ) "దానికి నెలమసలినది a month has passed with her. i.e. she has been a month pregnant." (బ్రౌను)

* శా. పా.— 'లూర్పుల్'

శా. ఏవే, భోజన మేటి కొల్లఁ? డిటు లేలే మేన బల్సొమ్ములే
వేవిం బూనవు? తెల్లఁబాఱె మొగ మేమీ రాజుతో నల్గి నా
వో? వామాక్షిరో† తెల్పవే యనుచు గర్భోక్తుల్ చెలుల్ పల్కఁగా
వేవిళ్లం బొరలెన్ లతాంగి, పతికిన్ వేడ్కల్ కొనల్ సాగఁగన్.

టీక.—వామాక్షిరో = (అందమయిన కన్నులుగల) ఓ రత్నాంగీ, ఏవే, భోజన మేటికొల్లవు? ఈవు = నీవు, ఇటులు, బల్సొమ్ములు = గొప్ప గొప్ప ఆభరణములు, ఏవిన్ = ఏవికూడా, ఏలే పూనవు = ఎందుకే ధరింపవు? మొగము, తెల్లఁబాఱెన్ = తెల్లబాఱినది, ఏమీ రాజుతో అల్గినావో? తెల్పవే, అనుచున్, చెలుల్ = చెలికత్తెలు, గర్భోక్తుల్ = గర్భితములైన = అర్థాంతరము గర్భమునగల మాటలను (గర్భసంబంధ మయిన మాటలను, అని అర్థాం,) పల్కఁగా, పతికిన్, వేడ్కల్ = సంతోషము, కొనల్ సాగఁగన్ = బహుముఖముల విస్తరిల్లగా, లతాంగి = ఆ రత్నాంగి, వేవిళ్ళన్ = వేవిళ్ళతో, పొరలెన్ = ప్రవర్తిల్లెను.

భోజన మొల్లకపోవుటయు, సొమ్ములను ధరింపకపోవుటయు, మొగము తెల్లబారుటయు, వేవిళ్లుగల వెలదికిని, పతితో అలిగిన పడతికిని సమానధర్మములు. వేవిళ్లతో నున్న సంగతి యెఱుగనట్లు, రత్నాంగి చెలికత్తెలు మిక్కిలి చమత్కారముగా ఏమమ్మా రాజుతో అలిగినావా? భోజనాదుల నొల్లవేమి? యని లాలించినారు. ఆ లాలనముచేతనే ఓహో, 'వేవిళ్లా' యని పరిహసించుట వ్యంగ్యము.

గర్భవతులు సొమ్ముల నెక్కువగా ధరింపరనుటకు.—

"శరీర సాదా దసమగ్రభూషణా,
ముఖేన సా లక్ష్యత లోధ్రపాండునా

---

†శా. పా.— 'యంచు, నర్మరసగర్భోక్తుల్' ('పరిహాసముతోఁగూడుకొన్న మాటలను (అర్థాంతరమును బోధించువాక్యములను.)'—అని, పూ. టీ.)

'నర్మరసగర్భోక్తుల్' అను పాఠమున 'నర్మరసము గర్భమునగల ఉక్తులు' అన్న యర్థమే గాని 'గర్భసంబంధమయిన ఉక్తులు' అను చమత్కారము సిద్ధింపదు. 'తెల్పవేయనుచు - గర్భోక్తుల్' అనియే, పూ. ము. పా. ఆపాఠము, తంజ. తా. ప్రతులలోనునున్నది

'గర్భోక్తులు'.— 'గర్భకలమంబుల' వంటి సమాసము. "గర్భకలమంబులు కాఁజె లతాంగి జంఘికల్" (వసు - 2-74.)

తను ప్రకాశేన విచేయతారకా,
ప్రభాతకల్పా శశినేవ శర్వరీ.'' —రఘు. 3-2.

శా. మించెం బోరచికోరికల్, గడు విజృంభించె దనుగ్లాని, కా
న్పించె న్మేచకకాంతి చూచుకములన్, *చెక్కిళ్ళపైఁ దెల్పు రె
ట్టించెన్, ‡ కూర్కులు సందడించె, నడ చండించెన్, మృదామో
దముౕ, గాంచెన్ వాతెఱ, యోసరించెఁ ద్రివళుల్ నానాఁటికిన్
బోటికిన్.

టీక.—బోటికిన్ = ఆరత్నాంగికి, నానాఁటికిన్ దినదినమునకు, పోరచి కోరికల్ = సూడిదెల మీది వాంఛలు, మించెన్; తనుగ్లాని = (శరీరమున) పాలు మాలిక, విజృంభించెన్ = అధికమాయెను, చూచుకములన్ = చను మొనలయందు మేచకకాంతి = నల్లనిచాయ, కాన్పించెను; చెక్కి...ంచెన్ = చెక్కిళ్ళయందు తెల్లదనము మెండయ్యెను. (గర్భవతులకు చెక్కులు తెలుపెక్కుట సహజము.) కూర్కులు = నిద్ర, సందడించెన్ = అధిక మయ్యెను. (చూలెంతలకు నిద్రయు నధికము) నడచండించెన్ = నడక మందగించెను. వాతెఱ = అధరము, మృత్ ఆమోదముౕ = మట్టివాసనను, కాంచెను. త్రివళుల్ = గర్భముమీది మూడు ముడతలును, ఓసరించెన్ = తొలగెను.

శ. ర. లో 'ఓసరించు' ఓసరిల్లుకు – ప్రేరణరూపము (=తొలగించు) అని యున్నది. కాని, 'ఓసరించు' కు 'తొలగు' అను నర్థమును నున్నది.

"ఓసరించుట- To turn aside, remove, to fail, to step aside, evade, తగ్గుట, తరుగుట, తక్కువ అవుట" (బ్రౌను)

---

* శా. పా.—'చెక్కుల్ తగన్ దెల్పు రెట్టించెన్' (ఇది ప్రా. ము. పా. 'చెక్కులు తగన్ తెల్పు రెట్టించెను' అంటే యర్థ మేమో, పూ. టీ. లో లేదు. నాకును తోచలేదు. 'చెక్కిళ్ళపైఁ దెల్పు రెట్టించెన్' అను సాధుపాఠముతో ఈ పద్యము 'విజయ' (2 – 36) లో నున్నది, ('నేత్రంబులం దెల్పు...' పాఠాం.)

‡ శా. పా.— 'కోర్కులు సందడించె' (పా). ము పా.)

మించెం బోరచి 'కోరికల్'—'కోర్కులు' సందడించె అని, కోర్కులు రెండుమారులు వచ్చి, పునరుక్తిదోష మేర్పడుచున్నది. 'కూర్కులు సందడించె' అను సాధుపాఠము, 'విజయ' (2-36) లో నున్నది.

వ. "తదనీశం గర్భంబు దప్పి నితనికి నోసరించి పోవలయు"
—భా. ద్రో. 4-12.

## — సారంగధర జననము —

వ. ఇవ్విధంబున ¶ నిర్భరగర్భభారనితాంతతాంత యగు నక్కాంతకుం బుంసవనాది సమస్త శుభకృత్యంబులు నిర్వర్తించిన యనంతరంబ నవమాసంబులు*గడచన నొక్క పుణ్యాలగ్నంబునం గుమారుండు జన్మించిన. ३౬

టీక.—ఇవ్విధంబున, నిర్భ...తాంత= గర్భముయొక్క బరువుచేత మిక్కిలి బడలినది, అగు - ఆకాంతకు, పుంస...బులు = పుంసవనము (పురుషసంతతి పుట్టవలెనని చేసెడి యొకానొక శుభకర్మము) ఆది = మొదలుగాగల, సమస్త = సకలమైన, శుభకృత్యంబులు = శుభకార్యములు, నిర్వర్తించిన అనంతరంబ= జరిపిన తరువాత.

క. దిక్కులు మెఱసెన్; నెఱసెన్
† జొక్కుల రంజిల్లి గాడ్పు; జొబ్బిల్లి సుధా
భుక్కులమంజులసుమన
స్సుక్కులవానలు గురిసెఁ; మొరసెం దూర్యంబుల్. ३౭

¶ పాఠాం—'దుర్భర'— *'గడచిన'—

పాఠభేదములు.

"నెఱసెన్ జుక్కలు, వలి నాలిగాలి జొబ్బిల్లి సుధా, భుక్కుల మనూన సూన." (మద. తాళ. ప్రతి.)

"చొక్కుల రంజిల్లి గాడ్పు జొబ్బిల్లి" (మద. టీకాసహిత మైన కాకితపు వ్రాత ప్రతి) ఈ క్రిందివి, తంజ. తాళ. ప్రతుల పాఠములు.—

"నెఱసెన్, జొక్కుల వలి నాలిగాలి"—"జొక్కుల లేఁజల్లగాడ్పు"—"జుక్కులలరెఁ జల్లగాడ్పు"—

†శా. పా.—"జొక్కులు రంజిల్ల గాడ్పు, జొబ్బిల్ల" ('చొక్కులు రంజిల్లన్ = శ్రీమలు నివారణమగునట్లుగా జొబ్బిల్లన్ = నిండారునట్లుగా' అని రూ. టీ.)

టీక.—దిక్కులు మెఱసెన్ = దిశలు ప్రకాశించెను. గాడ్పు = వాయువు, చొక్కులన్ రంజిల్లి సెలసెన్ = పారవశ్యమున సోలి సుడిసెను, సుధాభుక్కుల = అమృతభోజనుల (=దేవతల) విరైన ('సుధాభుక్ కుల' అని, పూ. టీ.) మంజుల = సుమనస్ – స్రక్కుల = మనోజ్ఞములైన పూలదండల యొక్క, వానలు, జొబ్బిల్లి = అతిశయించి, కురిసెను, తూర్యంబుల్ = మంగళవాద్యములు, మొరసెన్ = మ్రోగెను.

'స్రక్కు' అను రూపము చిన్నయసూరిమతమున అసాధువు. (బా. తత్స. 72.) కాని, అహోబలపతి మతమున సాధువే.—(చూ. అహో. హలంత. 10.)

ఒక్క ప్రయోగము.—"భూపాలవశానులేపముల స్రక్కుల మిక్కిలి టెక్కుం జెందియున్"– (ఉ. రా. 8-247)

ఉత్తమపురుషు లుద్భవించినప్పుడు దిక్కులు ప్రకాశించినట్లును, చల్లనిగాలి వీచినట్లును, దేవదుందుభులు మ్రోగినట్లును, పూలవానలు కురిసినట్లును వర్ణించుట ప్రాచీన కవులకు సంప్రదాయము.

సీ. 'దిక్కులు మిక్కిలి తెలివిదాల్చె,
కమ్మని చల్లనిగాలి మెల్లనవీచె
హోమానలంబు చెన్నొంది వెలిఁగె
... ... ...
అలరు సోనలుగురిసి రమ్యామరవరులు
దేవదేవుని దేవకీదేవికనఁగ.' (భాగ. 10 పూ. 100)

"దిశః ప్రసేదు ర్మరుతో వవుః సుఖాః
ప్రదక్షిణార్చి ర్హవిరగ్నిరాదదే,
బభూవసర్వం శుభశంసి తత్ క్షణం
భవోహి లోకాభ్యుదయాయ తాదృశామ్" (రఘు. 3-14)

---

'చొక్కులు = శ్రమలు; రంజిల్లు = నివారణమగు' – అను టీక సరియైనది కాదు. ఆ పదముల కా యర్థములు నిఘంటువులలో లేవు.

(1) 'రంజిల్లు = అనురాగమునుపొందు' (శ. ర.)

(2) 'రంజిల్లుట or రంజిలుట To be glad or pleased'– (బ్రౌను.)

'జొబ్బిల్లన్ = నిండారునట్లుగా' అనుటయును సరికాదు. ఇతర వస్తువులేవో నిండారునట్లుగా పూలవాన కురిసెననుటలో అర్థములేదు. 'జొబ్బిల్లి' అనుట యుచితము.

చ. బిసబిస వాలు కీలుజడ పిక్కలు ద్రొక్కుచు ♦ వెన్నడింపఁగా
మిసిమిపిసాళిగుబ్బచనుమిట్టలు పయ్యెద నుబ్బనెత్తఁగా
నసురుసురై యలంతినడు మల్లలనాడఁగ ముందుముందుగా
నొసపరి బాగులాడి యపు డొక్కతె వచ్చి నృపాలుతోఁ దనెన్.

టీక:— ⁋వాలు = పొడుగైన, కీలుజడ, *బిసబిసన్ = చకచక, పిక్కలు త్రొక్కుచున్ = పిక్కలమీఁద నటించుచు, వెన్నడింపఁగాన్ = వెనుక వర్తించుచుండఁగా; మిసిమి...మిట్టలు = కాంతిసంతములును - పొగరు కలవియును - ఉన్న

♦ తా.పా.— 'వెన్ నటింపఁగా'. (వెన్ = వెన్నున, నటించుచుండఁగా అని, పూ. టీ.)

'వెన్నడింపఁగా' అని ప్రా. ము. పాఠము. అది తప్పని కాబోలు 'వెన్ నటింపఁగా' అనిదిద్దినారు. దిద్దుబాటు పొరపాటు. 'వెన్నడించు' (=వెన్నాడు) ధాతు వున్నది. (చూ. శ. ర.) తంజ. తాళ. ప్రతులలోను 'వెన్నడింపఁగా' అను పాఠ మున్నది. జడ 'వెన్నాడు' నట్లు చెప్పుటయును ప్రసిద్ధమే.— 'వెన్నాడఁగల వేణికాభరముతో వెన్నాడెఁ దానాతనిన్' (శ్రవణానందము. 3-27.)

"వెన్నాడుట or వెన్నడుట To toss about (supine) on the back వీపున యిటుఅటు కదలుట (ఇలా 1-10) 'గుదిగొని వెన్నాడు కుసుమ పుంజము తోడ, టీ॥ వెన్నాడు- వీపున కదలుతూవుండే" (బ్రౌణ్యము.)

⁋ పూ టీ.— 'వాలు = ఒప్పుచున్న - కీలుజడ.' 'వాలు'నకు 'ఒప్పు' అను నర్థము నిఘంటువులలో లేదు. 'వాలు = పొడుగు' అనియున్నది. ప్రకృతమున కుచితమయిన యర్థమును అదే జడపొడుగైనది కావుననే పిక్కలు త్రొక్కఁగలిగినది.

* పూ టీ.— 'బిసబిసన్ = బిసబిస అనుధ్వనితో.' జడ 'బిసబిస'— అని ధ్వనిచేయుట లోకములో లేదు. 'బిసబిస'— చకచక, రివరివ, వంటి శబ్దము, బిసబిస - విసవిస, సమానార్థకములు.—

(a) "విసవిస = త్రిప్పుట నవ్వుట ముసుటలయందగు ధ్వన్యనుకరణము. 'కరబిసరుహంబులు విసవిసందిప్పి'" — "బిసబిస = వేగము." (చూ. శ. ర.)

(b) "బిసబిస - Rapidly, with a spring." "విసవిస, fast, quickly, hurriedly, వడిగా, చివచివ 'విసవిస పవనుడు జవమున, విసరిన వడి బాపు జలదవిసరము భంగిన్.'" (బ్రౌణ్యము.)

తములును నైన వలుద కుచములు, పయ్యెదను, ఉబ్బనెత్తఁగాన్ =ఉబుకనెత్తగా, అలంతి = సన్నని, నడుము, అసురుసురై= మిక్కిలి శ్రమనొంది, అల్లలనాడఁగాన్ జవజవలాడగా, ముందుముందుగాన్ = అందరికంటెను ముందుగా, ఒసపరిబాగులాఁడి= అందగత్తెయైన అంగన, ఒక్కతె వచ్చి, నృపాలుతోడుతన్ = రాజుతో (ముందరి కన్వయము)

క. మగవానిఁ గనిరి శంబరు
పగవానిం బోనివానిఁ బట్టపుదేవుల్
జగతీనాథునకు, నావుడు
మొగమొకయింతయి బుజాలు మూఁడయి వేడ్కన్. ౩౯

టీక.—పట్టపుదేవుల్ = పట్టపుదేవిగారు (పూజ్యతయందు బహువచనము) శంబరు పగవానిన్ = (శంబరాసురునికి విరోధియైన) మన్మథుని, పోనివానిన్= పోలినవానిని, మగవానిన్ = మగపిల్లవానిని, కనిరి, నావుడున్ = అనగా, మొగము - ఒక యింతయి = సంతోషమున ముఖము వికసించి, బుజాలు మూడయి = ఉత్సాహాతిశయమున బుజాలుబ్బి, వేడ్కన్ = వేడుకతో, (అవతలి కన్వయము.)

('మొగమింతైనది', 'బుజాలు మూడయినవి.'- సంతోషాతిశయమును తెలుపు జాతీయములు.-)

క. ఆ మేలు వార్తఁ దెచ్చిన
భామకు, బడిబడిని వెంటఁ బనువారలకున్,
భూమిపతి భూసురార్థి
స్తోమములకు, లెక్కలేనిసొమ్ము లొసంగెన్. ౪౦

---

(c) వ. "కరువలి విసవిస విసరం గసర ముసర." (మల్ల. విప్రి. 3-60.)
(d) క. "బిసబిస నెప్పుడు నుడుగక
విసరెడి వలిచేత వడఁకు విదువకు." (భాగ. 10 ఉ. 1001.)
(e) చ. "బిసబిసఁబోక యొయ్య నడపింపుఁడు" (పాంచా. 4 ఆ.) బిసబిసఁబోక 'బిసబిస యని ధ్వనియగునట్లుగా పోక' అని యర్థముకాదు. 'చకచక (= వడివడిగా) పోక' - అనియర్థము.

టీక.—ఆ-మేలువార్తన్ = ఆ శుభవార్తను, తెచ్చిన భామకును, ↑బడిబడిని = మాటిమాటికిని, వెంటఁబడు వారలకును, భూసు...ములకున్-*భూసుర= బ్రాహ్మణుల యొక్కయు, అర్థి = యాచకుల యొక్కయు, స్తోమములకున్= సమూహములకును, భూమిపతి = రాజు, లెక్కలేని సొమ్ములు = మితిలేని ద్రవ్యాదులు, ఒసంగెను.

క. జననాథచంద్రుఁ డివ్విధ
మున బహువిధదానములనుఁ బుత్త్రోత్సవ మిం
పొనరంగఁ జేసి సూతక [illegible]
దినములు వెడలించెఁ ♦బ్రభుత దేజరిలంగన్. ౭౧

టీక.—జననాథచంద్రుఁడు = రాజశ్రేష్ఠుఁడు, బహువిధదానములను = అనేక విధములయిన దానములతో, పుత్త్రోత్సవమున్ = కొడుకు కలిగె నన్న ఆనందమును తెలుపు ఉత్సవమును, ప్రభుత తేజరిలంగన్ = తన ప్రాభవము ప్రకటము కాగా, ఇవ్విధమునన్, ఇంపు - ఒనరంగన్ చేసి = ఆనందముగా కావించి, సూతకదినములు = పురిటిదినములు, వెడలించెన్ = వెళ్ళబుచ్చెను.

---

↑ పూ. టీ.—"బడిబడిని = క్రమక్రమముగానే."

'బడిబడి' యనగా, వెంటవెంట; మీఁదమీఁద; మాటిమాటికి; అని సరియైన యర్థము. "బడిబడి Repeatedly, one after another- మాటిమాటికి" (బ్రౌను.)

క. 'తోడితెమ్మనె మా రా జడె
బడిబడి వచ్చెదరు వేగ పనివిను మనుచున్' (ఉ.హరి.1.55.)

పరా:—(పూ. టీ. వ్రాతప్రతిలో "బడిబడిని = వెంబడి వెంబడి- వెంట బడువారలకు" అని సరిగానే యున్నది)

* పూ. టీ — "భూ...లకున్ = బ్రాహ్మణులయిన యాచకులయొక్క సమూహములకు."—

ఆ రాజు బ్రాహ్మణులయిన యాచకులకే గాని, బ్రాహ్మణేతరు లయిన యాచకుల కియ్యలేదనియు, ఆ బ్రాహ్మణులలోను, యాచకు లైనవారికే గాని పూజ్యులైన వారి కియ్యలే దనియు, అర్థముచేయుట సమంజసము కాదు.

♦ శా. పా.—'ముదము.'

సూతకము = పురుడు, అంటు.- 'సూతకం ద్వివిధం ప్రోక్తం, జాతకం చ మృతం తథా.'— జాతాశౌచము మొదటి సూతక మనియు, మృతాశౌచము రెండవ సూతక మనియు, వ్యవహారము.

సీ. 'ఎట్టి చుట్టంబేని యింటికి కే తేర రెం
డవ సూతకముఁ దెల్పి ¶ రవలఁ జొనుపు.'

(పాండు. 4-149.)

ఉ. పొంగుచు బంధుమిత్త్రబుధపుంగవమంత్రిజనంబుఁ జూచి, తె
ల్పెం గలలోన వచ్చి మునుపే తన పేరిడు మంచు వేడ్కతో
నంగజవైరి; యాయనదయం గద గల్గెనటంచుఁ బల్కి- సా
రంగధరాహ్వయం బిడియె రాజనరేంద్రుఁ డనుంగుఁజూలికిన్. ౮౨

టీక.—రాజనరేంద్రుఁడు, బంధు...జనంబున్ = చుట్టములు - స్నేహితులు - పండితశ్రేష్ఠులు - మంత్రులు, నైన (తన) జనమును, పొంగుచున్ = ఆనందమున నుబ్బుచు, చూచి,—అంగజవైరి = (మన్మథునికి శత్రువైన) ఈశ్వరుడు, కలలోనవచ్చి, తన పేరిడుమంచున్ = పిల్లవానికి తన పేరు పెట్టవలసిన దని, వేడ్కతో, మునుపే తెల్పెను. ఆయన దయంగద(వీడు) కల్గెను = పుట్టెను, అటంచున్ పల్కి, అనుంగుచూలికిన్ = తన ప్రియ పుత్త్రునికి, సారంగధరాహ్వయంబు = సారంగధరు డను పేరు. ఇడియెన్ = పెట్టెను. (సారంగము (=జింక) ను, ధరించువాడు, కనుక ఈశ్వరునికి 'సారంగధరు' డని నామము. ఆ నామమే పిల్లవానికి పెట్టబడెను.)

వ. ఇట్లు కృతనామకరణుండై రాజసూనుం డనుదినప్రవర్ధమానుం
డగు చున్నంత. ౮౩

టీక.—రాజసూనుండు = రాజకుమారుడు, కృతనామకరణుండై = పేరు పెట్టబడినవాడై, అనుదిన ప్రవర్ధమానుండు = దినముల క్రమమున వృద్ధి నొందుచున్న వాడు, అగుచున్నంతన్ = అవుచుండగా,

ఉ. ‡పాలసలోనఁ బోసి చనుఁబాలు నెయిం గిలకొట్టి కాళ్లపై
బాలకు నుంచి వేలితో సెలవిప్పి నెడగానిడి యుగ్గు వెట్టి యా

¶ 'అవలికనుపు' అను పాఠమున్న దేమో?

‡ శా. పా.—'పాలెడ'

కే లటు భోజపై నిమిరి † కెంజిఱుచేతుల నెత్తి గట్టురా
చూలియనుంగు సామికిని జోతలుజోతలటంచుఁబల్కుచున్. ४४

టీక.—దనుఁబాలు, నెయ్యిన్ = నెయ్యమును, పాలడలోనన్ = చిన్న శంఖములో, పోసి, గిలకొట్టి = రంగరించి, వ్రేల్ = వ్రేలు, నెలవిపైన్ = పెదవులమీద, ఎడ కాన్ = ఎడము కలుగునట్లుగా (—నోరు ఇంచుక విప్పబడునట్లుగా) ఇడి = (నోటిలో) ఉంచి; కెంజిఱుచేతులన్ = ఎఱ్ఱనైన చిన్ని చేతులను, గట్టు...సామికిని = (కొండలకు రాజయిన హిమవంతుని కూతురి ప్రియభర్తకు) పార్వతీపతికి, జోతలు = నమస్కారములు, అటంచున్ పల్కుచున్ = ఉచ్చరించుచు. (పసిబిడ్డల చేతులను జోడించి పైకెత్తి 'జోతలు' 'జోతలు' అనుట, అనిపించుట, వాడుక.)

పూర్వకాలమున పసిబిడ్డలకు ఉగ్గు-పాలు, పోయుటకు శంఖమును వాడెడివారు.

(1) "శ్రీరాజీవాక్షు వక్షస్స్థల నిలయ రమాహస్త వాస్తవ్య లోల
లీలాబ్జాన్నిష్పతంతీ మధుర మధుఝరీ నాభిపద్మే మురారేః,
అస్తోకం లోక మాత్రా ద్వియుగముఖ శిశో రాననే వ్యర్ప్యమాణం
శంఖపాత్రేణ దివ్యం పయ ఇతి విబుధై శ్శంక్యమానా పునాతు."

—విశ్వగుణాదర్శము.

(2) "జలకము లార్చి, పాలు జలజచ్ఛదపాళికఁ గిప్పి, తమ్మి సం
కులదేలి దేనె లుగ్గులిడి"— (వసు. 3-27.)

ఉగ్గు, పాలు, పోయుటకు శంఖమనుకూలముగా నుండును. కావుననే నేడు శంఖమునకు బదులుగా వాడబడిన ఉగ్గుగిన్నెలును శంఖసారూప్యమునే పొందియున్నవి.

క. కన్నుంగవఁ గాటుక యిడి
చన్నిచ్చుచు నేడు పుడిసి, చక్కనిముద్దుం

పాత్రి. ము, సను, మద. తంజ. వ్రాతప్రతులలోను, నిఘంటువులయందును 'పాలడ' అని అకారమధ్యరూపమేగాని 'లెడ' అను రూపములేదు. 'పాలు † అడఁగు = పాలడ.' (శ. ర.) 'పాలడ. A shell used as a spoon or ladle in giving milk to a child.' (బ్రౌను)

† 'కెంజిగి'

జిన్నికుమారుని మారుని
*పెన్నుద్దిని బత్తి నెత్తి పెంచిరి దాదుల్. ౨౭

టీక.—మారుని పెన్నుద్దిని = మదనునితో సమానుడయినవానిని (పెను + ఉద్ది.—చూ. ప్రౌ. సంధి. 9.) బత్తిన్ = భక్తితో, దాదుల్ = పాలిచ్చి పెంచు తల్లులు. (రాజుల యిండ్లలో బిడ్డలను పాలిచ్చి పెంచుటకు కొందరు స్త్రీలు నియోగింపబడుదురు,—వారే దాదులు. దాది. (ప్ర. ధాత్రి.)

గీ. లాలి గట్టిరి గంధోపలాలితాఖి
† లాలిసుమసాంద్రచంద్రోపలాలిసౌధ
లాలితస్థలి హరునిల్లాలిఁ బాడి
మేలిజవరాలిగములు రాచూలి కపుడు. ౨౮

టీక.—♦ మేలి జవరాలిగములు = అందకత్తెలయిన యువతుల సమూహములు, హరుని యిల్లాలిన్ పాడి = పార్వతిమీది పాటలుపాడి, రాచూలికిన్ = రాజకుమారునికి,గంధో...స్థలిన్.—గంధ = సువాసనలచేత, ‡ఉపలాలిత = బుజ్జగింపబడిన- (అనగా సంతోషపెట్టబడిన) అఖిల = సకలమయిన, అలి = తుమ్మెదలుగల, సుమ = పుష్పములచేత, సాంద్ర = దట్టమైనదియు, అనగా నిండినదియు; చంద్రోపల = చంద్రకాంత మణులయొక్క, ఆలి = సమూహములతో నిర్మింపబడినదియు నైన, సౌధ = మేడయందలి, లాలితస్థలిన్ = మనోజ్ఞమైన ప్రదేశమున, లాలిగట్టిరి = ఉయ్యాలవేసిరి.

చంద్రకాంతపుమేడలో కమ్మనివాసనలను జిమ్ము పూవులతో నిండియున్న మనోహర ప్రదేశమున దాదులు ఉయ్యాలవేసి రని తాత్పర్యము.

---

* పాఠాం.— 'పెన్నుజ్జిని'

† 'లాలిసమసాంద్ర'.—'లాలికల చంద్రకాంతోప లాలి'

♦ పూ. టీ.—'మేలి జవరాలి గములు = చక్కని యౌవన స్త్రీ సమూహములు,—

'యౌవనస్త్రీలు'— 'బాల్యపురుషులు'— అను కూర్పులు రుచిరములుకావు.

‡ పూ. టీ.—'ఉపలాలిత = శోభితమైనట్టి.'

'ఉపలాలించుట' యనగా 'బుజ్జగించుట' గాని 'శోభింపచేయుట కాదు.'

ఉ. పూ నెఱి మేని రాకొమరుఁ బొత్తులలోపల నుంచి 'గట్టువి
ల్కానివరప్రసాదమునఁ గల్గిన చక్కనియన్న నిద్ర పో
మ్మా, ననుఁ గన్నతండ్రి' యని మక్కువఁ జొక్కఁగ జోలవాడిరిం
పూనిన జాళువాపసిఁడియుయ్యెల నయ్యెలనాఁగలూఁచుచున్. ౪౭

టీక.—అయ్యెలనాఁగలు= ఆస్త్రీలు, పూనెఱిమేని రాకొమరున్ = పూవువలె మనోజ్ఞమైన శరీరముగల ఆ రాచబిడ్డను. * పొత్తులలోపలన్ ఉంచి =పొత్తి గుడ్డలలో పరుండబెట్టి; గట్టు...యన్న = ఈశ్వరుని వరప్రసాదమున జన్మించిన సౌందర్యరాశీ, ననుఁగన్నతండ్రీ= (ఇది ప్రేమను సూచించు మాట.) అనుచూ, ఇంపూ......య్యెలన్ = సొగసైన మేలిమి బంగారుయ్యెలను, ఊపుచూ, చొక్కఁగన్ = ఆబిడ్డడు పాటవిని యానందమున సోలగా, జోలపాడిరి.

క. జోల్ల్వాడిరి యమృతపు
జాలుం జోకొట్టఁ జాలు సరసపుఁజూపుల్
డోలాయమానముగ ను
య్యాలో జంపాలో యనుచు నా లోలాక్షుల్. ౪౮

టీక.—ఆ లోలాక్షుల్ = చంచలనేత్రములుగల ఆస్త్రీలు, అమృతపు జాలును, జోకొట్టఁజాలు = చల్లగా నిదురపుచ్చజాలిన (అనగా అమృతపు జాలు

---

* పూ. టీ.—'పొత్తు లనఁగా బిడ్డలు ఇరుపార్శ్వములం బొర్లకుండ నిడివిగా చుట్టి పఱుచు వస్త్రములు'.—

'చుట్టిపఱుచు' అర్థములేనిమాట. 'చుట్టు' 'పఱుచు' పరస్పర విరుద్ధక్రియలు. పఱచవలసినదానిని 'చుట్టుట' కానిపని. 'పొత్తులు' =పసిబిడ్డల పక్కమైపఱచు చిన్న గుడ్డలుగాని 'గుడ్డచుట్టలు' కావు.—

"పొత్తిగుడ్డ- Baby linen' —(బ్రౌ్ణ్యము)
సీ. "...కడుపునకొను, బెట్టుఁ బొత్తులమీఁదఁ బెట్టు"
కాశీ. మాహా. 4-11.

పొత్తులమీఁదఁ బెట్టుట, యనగా- పొత్తిగుడ్డలమీద పరుండబెట్టుటగాని, నిడివిగాచుట్టిన గుడ్డచుట్టమీద పెట్టుట కాదు.

"పొత్తి = పొత్తిగుడ్డ = మెత్తని సన్నని పాఁతవస్త్రము." (శ. ర.)

వంటి) సరసపు చూపులు, డోలాయమానములగు= ఉయ్యాలవలె నూగుచుండగా, జోలల్ పాడితి.

ఆ స్త్రీలు పుట్టుకతోనే చంచలలోచనలనియు, వారిచూపులు మనోజ్ఞతమములు- ఆనందదాయకములు ననియు, వారు ఉయ్యాల ఊపులతోపాటు మీదికిని క్రిందికిని చూచుచు, ఉయ్యాల నూచుచూ జోలలుపాడి రనియు, క్రిందికిని మీదికిని ఎడతెగకుండా ప్రసరించుచున్న వారిచూపులు అమృతపు జాలువలె నుండె ననియు తాత్పర్యము.

సీ. కను ఱెప్ప వేయక కనుఁగొంచుఁ దనలోన
నుంగుంగ యని సారె నుగ్గడింప
నెలనవ్వు పాలబుగ్గలపై దువాళింప
నత్తత్త యని * దోఁగి యాడుచుండ
విద్దెముల్ సేయుచు వింత లే కెవ్వరు
చప్పట ల్చఱచిన ‡ సరస కరుగ
జిలిబిలి ముద్దుమాటలతోడ దాది వ్రే
లంది మెల్లనె తప్పటడుగు లిడఁగఁ
గీ. గను మొఱఁగి చెలుల్ మఱుఁగున నడఁగి
తొంగి చూచి ¶దోబూచి యన్నం గికాకి

---

* శా. పా.—'డొంగి'.

'డొంగి' అను పాఠము తప్పు. 'డొంగుట = డాగుట' (చూ. శ. ర.) 'డొంగవలె వచ్చి యిచ్చట డొంగినావదేమయా బావగారు"–
(వైజ. 4-36.)

'దోఁగియాడు' అనియే వ్రాతప్రతుల పాఠము. ('డొంగి' గుజిలీపా.)

‡ శా. పా.— 'సరగసరుగ'

'సరగ' నగుటకంటెను-'సరస'కరుగుట యుచితతరము.

¶ శా. పా.—'దూబూచి'.-శాస్త్రిప్రతిలోను, తక్కిన ప్రతులలోనుగూడా 'దూబూచి' అను పాఠమే యున్నది. శ. ర. కర్త 'దూయు + బూచి= దూబూచి అనివివరించి, యీ పద్యమునే యుదాహరించినాడు.—కాని, లోకమున వ్యవహారము

కన్నఁగఁ గుమారుఁ గౌఁగిట గారవించి
యలరుదురు వేడ్కఁ దలిదండ్రు లనుదినంబు ౪౯

టీక:— 'ఉంగుంగ' = పసిబిడ్డల యేడ్పున నేర్పడు శబ్దమున కనుకరణము. ఉగ్గడింపఁగ = పలుకఁగా;— ఎలనవ్వు = చిన్నినగవు, *పాలబుగ్గలపైఁ = లేత బుగ్గలమీద, దువాళింపఁగ = పరువులుపారగా (అనగా వ్యాపింపగా);— దోఁగి యాడుచుండఁగ = దోగాడుచుండగా;— విద్దెముల్ చేయుచుఁ = వినోదముగా క్రీడించుచు, వింతలేక = క్రొత్త యనునది లేక, సరస కరుగఁగ = దగ్గరికిపోవు చుండగా.— దాదివ్రేలుఁ అంది = దాదియొక్క వ్రేలిని పట్టుకొని.— చెలుల్ = దాదులు, కనుమొఱంగి = మాయచేసి, మఱుంగున నడంగి = చాటున దాగి యుండి, తొంగిచూచి, దోబూచియన్నఁ = దాదులు- దోబూచి' అని నవ్వు లకు బెదరింపగా, కికాకికఁ, నగఁ = నవ్వగా (చూచి), తలిదండ్రులు-అనుదినం బుఁ = ప్రతిదినమును, అలరుదురు = సంతోషింతురు.

---

మాత్రము 'దోబూచి' యనియే. వ్యవహారభాషను సంతరించిన బ్రౌనుపండితుడు 'దోబూచి' అను రూపమునే పఠించినాడు. ఆయన కావించిన నిర్వచనమిటులున్నది- 'దోబూచి A cry like Ghost! Ghost! (For అదుగో బూచి)'

'అదుగో బూచి' యను నుడి 'అదో బూచి' యను సంగ్రహరూపమును చెందగా, దానినుండి 'దోబూచి' అను సంగ్రహతరరూప ముత్పన్నమైన దనుట యుక్తియుక్తముగా నున్నది.- "దొంగ- బూచి! దోబూచి" అని యీ లోకోక్తి యొక్క సంపూర్ణరూపము. (తెనుగుదేశమున నేటికిని నున్నది.)

ఉ. "దొంగబూచి దో బూచులకుఁ భయంపడు నె భూతము
లక్కట భూతలంబునఁ" (శ్రీ తిరుపతి వేంకటకవులు.)

గీ. 'నీడ లారెడు నీ చెట్లతోడ దొంగ
బూచి, దోబూచి యాడుచుఁ బొద్దుగడపు
చందమామను బట్టెంచవు గదన్న' (తొలకరి)

*పూ. టీ.—'పాలబుగ్గలపైఁ = పాలవంటి చెక్కిళ్ళమీద'.— పాల బుగ్గలనగా, పాలుత్రాగు వయసున ఉబ్బుగా నుండు లేతబుగ్గలుగాని 'పాలవంటి బుగ్గలు' కావు. "పాలబుగ్గలు—అనగా, బిడ్డల చెక్కిళ్లు" (బ్రౌను)

శ. ర. కర్త 'పాలబుగ్గలు = పాలంటిన బుగ్గలు' అన్నాడు. పొరపాటు.

కరముల్ సాఁచి తమిన్ 'ద యింద,' యని రాగంబొప్పఁగాఁ జీరఁ దా
మరమోమందలి రావిరేక తులకింపన్ జేరి బింబాధరం
బరుదారన్ రసవంతమై మెఱయఁగా నంకంబుపై నిల్చి బా
పురె! సారంగధరుఁడు ముద్దు గురియుం బోతండ్రి యుప్పొంగఁగన్. ౧౫౦

టీక.—తమిన్ = ప్రేమతో, ద = రా, ఇంద = ఇటురా, అని, రాగము = అనురాగము; ఒప్పఁగాన్, చీరన్=పిలువగా; తామర...రేక=తామర పువ్వువంటి ముఖమునందలి 'రావిరేక' అను భూషణవిశేషము, తులకింపన్ = ప్రకాశింపగా, చేరి = దగ్గరికివచ్చి, బింబాధరంబు = దొండపండువంటి క్రింది పెదవి, అరుదారన్ = ఆశ్చర్యము కలుగునట్లుగా, రసవంతమై = సౌందర్య రసముతోనిండి, మెఱయఁగాన్, అంకంబుపై నిల్చి = తొడమీద కూర్చుండి, ముద్దు కురియున్ = ముద్దులుకులుకును.

'ద, (=దా), ఇందా' జాతీయము. (శ. ర. లో లేదు) "దా. An interjection signifying come! యిందా Come this way ఇంద - Come here, here it is ఇందండి Behold ye! see! here it is!"
—(బ్రౌణ్యము.)

†గీ. ఇనకరస్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్ని సారంగధరుఁడు భాసిల్లుకరణి
నినకరస్పర్శనంబున నింపుఁగాంచి
చిన్ని సారంగధరుఁడు భాసిల్లె నంత. ౧౫౧

టీక.—*ఇన కర స్పర్శనంబునన్— ఇన = సూర్యుని యొక్క, కరస్పర్శనంబునన్ = కిరణ ప్రదానముచేత (= సూర్యుడు కిరణముల నొసగుటచేత)

---

†కొన్ని ప్రతులలో లేదు.

*పూ. టీ.— 'ఇన...బునన్ - ఇన = సూర్యుని- కర = కిరణముల యొక్క - స్పర్శనంబునన్ = తాఁకుటచేత...'-

సూర్యకిరణములు తాకినయెడల చంద్రుడు వెలవెలబోవునుగాని, భాసిల్లడు సూర్యకిరణములు చంద్రునియందు ప్రవేశించుననియు, తన్మూలముననే చంద్రుని కాంతి క్రమ క్రమాభివృద్ధిని గాంచుననియును శాస్త్రము.

(i)ఇంపుగాంచి=తేజమును చెంది, చిన్ని సారంగధరుఁడు=బాలచంద్రుడు, (ii) భాసిల్లుకరణిన్ = ప్రకాశించు విధమున, (iii) ఇన కర స్పర్శనంబునన్ = ప్రభువైన రాజనరేంద్రుని లాలనముచేత, ఇంపుఁగాంచి = మెఱుఁగెక్కి, చిన్ని-సారంగధరుఁడు, భాసిల్లెన్ = ప్రకాశించెను.

ఈ పద్యము రఘువంశములోని యీ క్రింది శ్లోకమును తలపించుచున్నది.

"పితుః ప్రయత్నా త్స సమగ్రసంపద
శ్శుభై శ్శరీరావయవై ర్దినే దినే,
పుపోష వృద్ధిం హరిదశ్వదీధితే
రనుప్రవేశా దివ బాలచంద్రమాః" (3-22)

---

"సలిలమయే శశిని రవే
ర్దీధితయో మూర్ఛితా స్తమో నైశం
క్షపయంతి దర్పణోదర
నిహితా ఇవ మందిరస్యాంతః." (వరాహసంహిత.)

"కలాః షోడశ సోమస్య శుక్లే వర్ధయు తేరవిః" (దేవీపురాణము.)

కావున, చంద్రపరమున 'ఇనకరస్పర్శన' మనగా 'సూర్యకిరణప్రదాన' మని సరియైన అర్థము. 'తాకుట' యని కాదు. 'స్పర్శనము = ప్రదానము' అని కోశముల యందున్నది.

(1) 'స్పర్శనము-Touching, coming into contact with. Gift, donation. తాకడము. తగలడము. దానము (బ్రౌను)

(2) 'విశ్రాణనం వితరణం స్పర్శనం ప్రతిపాదనమ్' (అమ)

పూ.టీ.- (i)'ఇంపున్ కాంచి = ప్రీతిని పొంది'

సూర్యకిరణస్పర్శనముచేత చంద్రుడు పొందునది 'తేజోవృద్ధి' గాని 'ప్రీతి' కాదు.

(ii) భాసిల్లుకరణిన్ = 'వెంపొందునటువలెనే.' 'భాసిల్లుట' యనగా ప్రకాశించుట కాని, 'వెంపొందుట" కాదు 'భాసృదీప్తౌ' అని, ధాతుపాఠము..

(iii) 'ఇన = రాజనరేంద్రునియొక్క, కరస్పర్శనంబునన్=హస్తస్పర్శచేత అనుటయు తప్పే.

*ఆ వె. ఇట్లు తల్లిదండ్రు లెంతయు గారాన
†నేటఁ బెంచువానిఁ బూటఁ బెంచి
సరవి వరవిభూతిఁ జౌలోపనయనాది
సత్క్రియాచయంబు సలిపి రంత. ౧౦౩

టీక.—గారానన్ = (గారామునన్) మిక్కిలి ప్రేమతో, ఏటఁబెంచువానిని పూటఁబెంచి (ఇది జాతీయోక్తి.- ఎక్కువ మక్కువతో పోషించి అని భావము.) వరవిభూతిన్ = అధికమైన ఐశ్వర్యముతో, చౌలో...యంబు.— చౌల = చూడాకర్మ (జుట్టుపెట్టి తలవెంట్రుకలుతీయుట) ఉపనయన = వడుగు, ఆది = మొదలైన, సత్క్రియా = సత్కర్మలయొక్క, చయంబు = మొత్తమును సరవిన్ = వరుసగా, చలిపిరి = చేసిరి.

వ. ఇట్లు ‡యౌవన ప్రాదుర్భావంబునఁ దేజరిల్లి, శాస్త్రంబులు క్రోడీకరించి, పురాణంబులు హృద్గతంబులు గావించి §నీతులు

---

* ఈ 'యాటవెలది' ప్రా. ము. నను, దాని ననుసరించిన శాస్త్రిగారి ముద్రణముననుగీతముగా పేర్కొనబడినది; ప్రమాదము. ఈప్రమాదము శాస్త్రిగారి ప్రతిలో మరి రెండు మూడు తావులలో గూడా జరిగినది. (చూ. 2-48; 3-28; 3-177)

† పాఠాం.— 'నాటఁబెంచువాని'.

‡ శా. పా.—'యౌవనప్రాదుర్భావంబై' (యౌవన ప్రాదుర్భావంబునన్= వయస్సు పుట్టుటచేతను' - అని, పూ. టీ.)

'వయస్సుపుట్టిన' దనుట, సంప్రదాయము కాదు. 'వయస్సువచ్చిన' దనుట యొప్పు. విదేశీయుఁడైన బ్రౌనుకూడా.—'వయస్సువచ్చినవాడు- a full grown boy' అనియే అన్నాడు.

సీ. "ఈడేరి నవఁగను వయసువచ్చెననుట వఱలు"
—(ఆం. భా. 3-94)

"తొడఁబుట్టుదానిఁ దొలుతన మను విచ్చి
వయసు వచ్చువెనుక వలచినట్లు"
—(చాటు. రత్నా. పు. 168)

§ పాఠాం.—'నీతులం లాలాజలంబులుచేసి'.

విస్తరంబుగాఁ దెలిసి గజహయరథారోహణంబు లభ్యసించి, బహువిధాయుధసాధనల [1]నారితేఱి, సకలవిద్యాపారీణుం డయ్యె నప్పుడు. ౫౩

టీక.—యౌవన ప్రాదుర్భావంబునన్ = యౌవనోదయముచేత (అనగా వయసువచ్చి) తేజరిల్లి = ప్రకాశించి (సారంగధరుడు) శాస్త్రంబులు, శ్రోత్రీకరించి = పరిశీలించి, పురాణంబులు, హృద్గతములు గావించి = మనసునకు తెచ్చుకొని, నీతులు = నీతిశాస్త్రములు, విస్తరముగాన్ = సమగ్రముగా- తెలిసి, గజ...బులు- ఏనుగులను- గుఱ్ఱములను- రథములను- ఎక్కుట, అభ్యసించి = నేర్చుకొని, బహువిధ + ఆయుధ = అనేకవిధము లయిన ఆయుధములయొక్క, సాధనలన్ = అభ్యాసములయందు, ఆరితేఱి = నిపుణుడు, సకల...ండు = సమస్త విద్యలను సంపూర్ణముగా నెఱిఁగినవాడు, అయ్యెను.

రాజయినవాడు వాహనముల నెక్కుటయందు మంచి నేర్పరియై యుండవలెను.

---

[1] శా. పా —'ఆఱితేఱి.'

'ఆరు = నిండు; ఆఱు = నశించు.' (శ. ర.)

'ఆఱుట' యనగా 'నశించుట' కావున 'ఆఱిన' పిమ్మట మరల తేఱుట వట్టిది. 'ఆఱి తేఱిన వా డొక్క మన్మథుడు తప్ప మరియెవ్వడును లేడు. (సీ. హరుకంటిసెగ కోర్చి యాఱితేఱిన మారుఁ డలరుఁ జిచ్చఱవాడి ములుకు లేయ"- విజ. 3. 25.— 'చచ్చిబ్రదికినవాడనియు, 'గడితేరినవా' డనియు శ్లేష) 'ఆరి తేఱి' అనవలెను. "ఆరితేఱియు బలుగుంటుమారి యయ్యె" (హంస. 6-110).— ఆరితేఱినదొంగ (చూ. సూ. ని. 'గరిడిముచ్చు.') ఆరు - ఆఱులకొక్క ప్రయోగము.—

క. మ, ద్ఘోరశరనిహతిఁ బడఁ గ
న్నారఁ గనుంగొనక కోప మాఱునె యొంటన్."
(భా. కర్ణ. 1-124.)

'ఆరుట' యన నిండుటకును అర్థ మగును. నిండెనను అర్థము చెప్పునప్పుడు లఘురేఫయును 'అడంగె' నను నర్థమున - గురురేఫయు నగును,
(సర్వ. ల. సా. సం. పు, 130)

సీ. 'వాహ్యాళిభూమి రేవంతనైషధు లట్లు
హయరత్నముల నెక్కి యాడ నేర్చు'
—(భీమ- 1-66.)

క. 'అవల్గత్తురగ బహువిధారోహకళా
రేవంతునకున్' —(మను 1-43)

క. సారంగధరుఁడు మించెన్
ధీరత బహు వేదశాస్త్ర * దీక్షాగురుతన్
సారెకు నవక్రవిక్రమ
భూరికళావిభవసారపుంగవు లెంచన్. ౫౮

టీక.—సారంగధరుఁడు, అవక్ర...గవులు.—అవక్ర= ఋజువైన, విక్రమ= పరాక్రమముయొక్కయు, భూరికళా = గొప్ప విద్యలయొక్కయు, విభవసార = సంపత్సారము కలవారిలో, పుంగవులు = శ్రేష్ఠులు, సారెకున్ = మాటిమాటికిని, ఎంచన్ = కొనియాడగా, ధీరతన్ = ధైర్యముచేతను, బహువేదశాస్త్ర దీక్షా గురుతన్ = అనేకములయిన వేదములయొక్కయు, శాస్త్రములయొక్కయు (అధీతి బోధాచరణ ప్రచారములనెడి) నియమములను పాటించుటయందలి గౌరవము చేతను, మించెన్ = అతిశయించెను.

(ఈపద్యమునకు సరియైనపాఠము లభింపలేదు.)

సీ. శ్రుతిమార్గములనంటి ♦ శోభిల్లుఁ దెలివిమై
నాతనిచూడ్కి యే మనఁగ వచ్చు?
సాధుకుంజరపంక్తి సంగతి విలసిల్లు
నాతనినడక యే మనఁగవచ్చు?

---

*శా.పా.—'దీక్షాగురుడై' ('అవ...గవులు.—వంకరగానట్టి పరాక్రమము గల సకలవిద్యా సంపత్సార శ్రేష్ఠులు, నుతింపఁగా, పలుమాఱు ధైర్యముచేత అనేకములైన వేదములయొక్కయు, వ్యాకరణాది శాస్త్రములయొక్కయు, నియతులందు అధికుఁడై మించెను'- అని, పూ. టీ.)

"ధీరత, పృథులాఘువాస్త్ర" - అని, మద. తాళ. పా.; ప్రా. ము. నను, పెక్కువ్రాతప్రతులతోను- 'బహుళోపశాస్త్ర' అనియున్నది. పూ. టీ. వ్రాత ప్రతిలో 'ఉపశాస్త్ర = ప్రతిశాస్త్రములయొక్క' అని యున్నది.

♦ శా. పా.—'శోభిల్లె' (ఇది గు. పా.)

దాక్షాయణీనాథుఁ దగిలి లోఁగొనఁ జాలు
నాతని తేజ మే మనఁగ వచ్చు?
నించువిల్కాని జయించు నాతని నిర్మ
లాకారమహిమ యే మనఁగవచ్చు?

గీ. వసుధఁ బుట్టెను పెరిఁగెను వారిలోనఁ
గని విని యెఱుంగ మంతటిఘనునినౌర!
యీతడు జోడును సరి సాటి యొరుడు లే ద
*తండు దేవుండు గాక మర్త్యుండె తలఁప! ౧౧

టీక.—ఆతని, చూడ్కి = చూపు (= కనులు) శ్రుతిమార్గములనంటి = చెవులవరకును వ్యాపించి (అంతటి విశాలములని - భా.) తెలివిమైన్ = ధావళ్యముతో, శోభిల్లున్ = ప్రకాశించుచున్నవి.— [చూడ్కి = ఆలోచన, (అనగా మనోదృష్టి) శ్రుతిమార్గముల నంటి = వేదమార్గములను- (= ధర్మములను) అనుసరించి, తెలివిమైన్ = జ్ఞానముతో, శోభిల్లును — అని, అర్థాం.] ఆతని, నడక = గమనము (నడచు తీరు) † సాధుకుంజరపంక్తి = ఉత్తమజాతి గజసమూహము యొక్క, సంగతిన్ = (సమ్యక్‌గతిన్) మంచినడకతో అనగా, ఉత్తమజాతి యేనుగుయొక్క నడకవలె, విలసిల్లున్ = ఒప్పుచున్నది — [నడక = ప్రవర్తనము, సాధుకుంజర - ఉత్తమ పురుషులయొక్క, పంక్తి - సంగతిన్ = సమూహముతోడి సాంగత్యముచేత, విలసిల్లును, అని అర్థాం.] ఆతని, తేజము = కాంతి ('తేజః ప్రభావే దీప్తౌచ' అమ.) దాక్షాయణీ నాథున్ = చంద్రుని, (ఇరువదియేడు తారలును, దక్షుని కూతుండ్లు. కావున దాక్షాయణులు; 'దాక్షాయ

---

తక్కిన మూడుపాదములలోను క్రియలు, విలసిల్లున్ - చాలున్ - జయించున్, అని తద్ధర్మార్థకములుగా నున్నవి. కావున, ఇది భూతముగా నుండుట ప్రక్రమభంగము. 'శోభిల్లు' అనియే తంజ. తాళ. పా.

* శా. పా.—'అతండమర్త్యుండుగాక.'

† పూ.టీ.—'సాధు కుంజర పంక్తి = శ్రేష్ఠమైన గజసమూహముయొక్క సంగతిన్ = సాంగత్యముచేతను.'- మానవుడైన సారంగధరునికి, ఏనుగుల సాంగత్యమా!!

జ్యోత్స్నీత్యాది తారాః.' అమ.) తగిలి = ఎదిరించి, లోఁగొనఁజాలుఁ = లో బరుచుకొన జాలును. [ఆతని, తేజము = పరాక్రమము, ('అధిక్షే పావమానా దేః ప్రయుక్తస్య పరేణయత్; ప్రాణాత్యయే ప్యవస్థానం తత్తేజ స్స ముదాహృతమ్.') దాక్షాయణీనాథుఁ = ఈశ్వరుని, ('ఆర్యా దాక్షాయణీ చైవ గిరిజా' అమ.) లోఁగొనఁజాలు, నని అర్థాం.] ఆతని, నిర్మలాకారమహిమ = కళంకము లేని రూపముయొక్క ప్రభావము (సౌందర్యము.) ఇంచు విల్కానిఁ = చెరకు విల్లుగలవానిని (=మన్మథుని) జయించును.— సారంగధరుడు, ఆకారమహిమ గలవాడనియు, మన్మథుడు బొత్తిగా దేహము లేనివాడనియు సారస్యము. [ఆకార మహిమ = ఆకారముయొక్క గొప్పదనము. (వ్యాయామ పరిపాటిచేత కండలు తిరిగి గట్టిపారియున్న దేహమన్నమాట.) ఇంచు విల్కానిఁ,— ఇంచు = ఒప్పునట్టి (= ప్రసిద్ధుడైన) విల్కానిఁ, జయించును, అని అర్థాం.]

ఆతని చూడ్కికి ఈడు, నడకకుజోడు, తేజమునకు సరి, ఆకారమునకు సాటి, ఎందునులేదు. అతండు దేవుఁడుగాక, మర్త్యుండే = మనుష్యుడా! (కాడనుట)! చంద్రుడు, శంకరుడు, మన్మథుడు మొదలగు దేవతలను జయింపగలవాడగుటచేతను, శ్రుతిమార్గములనుబట్టి వర్తించు వా డగుటచేతను, ఆతనియందు దేవత్వముకల దని భావము.

క. మాడెత్తు మాట యెవ్వరి
నాడఁడు, సత్యంబు వీడ నాడఁడు, ఖలులం
గూడఁడు, పరకామినులం
జూడఁడు, సారంగధరుఁడు సుతమాత్రుండే. ౧౬

టీక.—* మాడ + ఎత్తు మాట = ('మాడ' వరహాలో సగము 16 గురిగింజలయెత్తు) స్వల్పపుమాటయైనను, ఎవ్వరిఁ, ఆడడు = అనడు. (ఎవరినిగాని, అత్యల్పముగా నైనను నిందింపడు - అని, భా.) సత్యంబుఁ, వీడనాడఁడు = వదిలిపెట్టడు, ఖలులఁ = దుష్టులను, కూడఁడు = చేరడు, పరకామినులఁ = ఇతరుల స్త్రీలను, (కన్నెత్తి) చూడఁడు, సుతమాత్రుండే = సామాన్య సుతుడా? (ఉత్తమపుత్రుడని, భా.)

*పూ. టీ.—'మాడెత్తుమాట = అధికమైనమాటను.'
'మాడెత్తు', చిన్నమంత' అనునవి అల్పార్థమును తెల్పు లోకోక్తులు. వానికి 'అధిక' మనియర్థము చెప్పుట కేవలము విరుద్ధము. కొన్ని ప్రయోగములు.—

క. ఔరా యని జను లెన్నఁగఁ
గూరిమితోఁ దండ్రిమాట గురువాక్యముగా
గోరంతయు జవదాఁటక
యా రాజకుమారచంద్రుఁ డలరఁగ నంతన్. ౧౭

టీక.— ఆ రాజకుమారచంద్రుఁడు = ఉత్తముఁడైన యా రాజకుమారుడు, తండ్రిమాట, గురువాక్యముగాన్ = గురువుగారి యాజ్ఞనువలె, జవదాఁటక= అతిక్రమింపక, (తండ్రియందలి చనవుచేత అలక్ష్యముచేయక భయభక్తులతో అనుసరించుచు) అలరఁగన్ = ఒప్పియుండగా.— (గురుశబ్దము తండ్రియందును వర్తించును గావున తండ్రి వాక్యము గురువాక్యము కూడా అయినదని చమత్కారము)

మ. వనజాతాహితవంశవారినిధి భాస్వత్కౌస్తుభం బైన రా
జనరేంద్రుండు నవీనయౌవనవిలాసశ్రీజగన్మోహనాం
గుని సారంగధరున్ విశేషగుణయుక్తున్ యౌవరాజ్యాభిషి
క్తునిఁగావించి నిజాన్వయంబుసమమైకోత్తంసంబునన్. ౧౮

టీక —వనజా...భంబు- వనజాత = కమలములకు, అహిత = విరోధియైన చంద్రునియొక్క, వంశ = కులమను, వారినిధి = సముద్రమునకు, భాస్వత్ కౌస్తుభంబు = ప్రకాశించుచున్న కౌస్తుభరత్నమయిన రాజనరేంద్రుడు. (సముద్రమును మథించినపుడు పుట్టినది కౌస్తుభ మను రత్నము) నవీన......గునిన్.— నవీన=నూతనమైన, యౌవన విలాసశ్రీ = ఎలప్రాయపు సోయగము కలిమిచేత, జగన్మోహన అంగునిన్= లోకమును మోహింపజేయు శరీరము కలవానిని,విశేషగుణయుక్తున్= ఉత్తమగుణములతో గూడినవానిని, సారంగధరుని, యౌవరాజ్యాభిషిక్తునిన్ కావించి= యువరాజుగా అభిషేకించి (యువరాజునుచేసి) నిజా...బునన్ = నిజ అన్వ

(1) సీ. క్రోధ మొందిన నైనఁ గొడుకు దుర్గుణమెంచి
యత్త మాఁటెత్తుమా టాడ వెఱచు.' (శుక. 3-486)

(2) గీ. "చిన్నవాఁడును బ్రియు నొక్క చిన్నమంత
మాట యాడిన విని తాపమగ్న వగుదు." (కళా. 4-128)

(3) వ. "ఒకనాడును మాఁటెత్తుమాట పడని వాఁడు గావున''
(ఈగ్రంథమున చే- 3-163.)

యంబు=తన వంశమునకు, సమమౌ=సమానమయిన, కో కా... ంబునన్.—కోక=చక్ర వాకములకు, ఆప్త = ప్రియుడైన సూర్యునియొక్క, వంశంబునన్. (అవతలి పద్యముతో అన్వయము.)

క. పేరుగల ఘూర్జరాధిపు
గారాబుఁగొమార్తెఁ బెండ్లిగావించెఁ దగన్
*సారంగధరునకున్ మన
సారంగను మంజువాణి యను నలివేణిన్. ౫౯

టీక.—ఘూర్జర + అధిపు = ఘూర్జరదేశపు రాజుయొక్క, గారాబు కొమార్తెన్ = ముద్దులబిడ్డను, 'మంజువాణి' అను (పేరుగల) అలివేణిన్ = కన్యను, (అలివేణి = తుమ్మెదలవలె నల్లనైన జడగలది) పెండ్లిగావించెను.

క. తారావళి యఁట నఖము, లు
రోరుహములు రెండు †మంజరులె యఁట, నేత్రా
కారంబులు ధవళము లఁట,
యీ రమణిన్ మంజువాణి యనఁ జెల్లదొకో! ౬౦

టీక.—నఖములు = గోళ్ళు, తారావళి యఁట = నక్షత్రముల వరుస యఁట. ('తారావళి' యను కావ్యరచనావిశేష మట-అని యర్థం) ఉరోరుహములు = కుచములు, రెండున్, మంజరులే యఁట = పూగుత్తులే నట ('మంజరి' యను రచనా విశేషములేనట -అనియర్థం) నేత్రాకారంబులు = కనులయొక్క స్వరూపములు; ధవళములఁట = తెల్లనివట. ('ధవళములు' అను రచనావిశేషములట- అని, అర్థం.) కాబట్టి, ఆరమణిన్ = ఆసారంగధరునిభార్యను, మంజువాణి (= పేరు) మనోహరమైనవాక్కుకలది; అనన్ చెల్లదొకో = చెల్లును.

తారావళి, మంజరులు, ధవళములు, అనుకావ్యరచనా విశేషము లుండుట చేత నామె నిజముగా మంజువాణియే యని చమత్కారము.

---

*పాఠాం.—'సారంగధరునకును విభ, వారూఢిగ...యనులోలాక్షిన్'

†పాఠాం.—'మంజరులఁట ను నేత్రా.'

గీ. సకలవైభవములతోఁ బొసంగ నిటులు
రాజరాజవిభుండు గారాబుఁ ♦కొడుకు
పరిణయ మొనర్చి యానందభరితుఁ డగుచు
నుండెఁ గొన్నిదినము; లంత నొక్కనాఁడు. ౬౧

టీక.—సక...తోన్ = సమస్తవిభవములతోను, పొసంగన్ = ఒప్పునట్లు, కొడుకు పరిణయము = కొడుకుయొక్క పెండ్లి. ఒనర్చి, ఆనందభరితుఁడు = సంతోషముతో నిండినవాడు.

## — చెంచులు రాజును దర్శించుట —

సీ. నిలుచుండి చామరల్ జేతులు వెట్టుక కిరీట
ములు గల రాజులు కొలువు సేయ,
⁽వేటాలు తునియలు వేయు మేలైన వ
జీర్లు వచ్చి సలాముచేసి నిలువ,
శరణాగతారాతిధరణీరమణు లయ్యె
జిమ్యలు వెట్టుచు సేవ సలుప,
*సాటికిఁ బోటికి సరససంగీతసా
హిత్యాదివిద్యలు నృత్యమాడ,

♦శా.పా.—'కొడుకుఁ బరిణయము'

ప్రాచీ ము. లో 'కొడుకు బరిణయము' అనియున్నది. శాస్త్రిగారు, 'బ' కారమునకు ముందరసున్న పెట్టినారు, అందువల్ల వావిళ్ళవారును 'కొడుకుఁ బరిణయము' అనియే ముద్రించినారు. పొరపాటు.

కొడుకుంబరిణయము; రాజుంగొడుకు, అని; ష. త. సమాసమున నుగాగమ సంధిచేయుట సరికాదు. 'కొడుకున్ - పరిణయ మొనర్చి' యనుట భాషాసంప్రదాయము కాదు. పరిణయ మొనర్చుట 'కొడుకునకు' గాని, 'కొడుకును' కాదు.

⁽ పాఠాం.—(1) 'వేటాలు గనెలుగా వేయు వజీరులు, చేరవచ్చి' (2) 'వేటాలు తునకలు ధాటిగా వేయు మేలైన వజీరులు సలాముచేసి, *సాటికి బేటికి'

గీ. మనవిసనవుల కేతెంచి మన్నెవారు
వేళ యెప్పుడౌనో కో యని వేఁచుచుండ
నమ్మహీపాలుఁడప్పుడు సింహాసనస్థుఁ
డగుచు నొడ్డోలగం బున్నయవసరమున. ౬౨

టీక.—కిరీటములుగల రాజులు = (సామాన్యపు జమీన్‌దారులు కారన్న మాట.) వేటు ఆఱు తునియలు వేయు = ఒక్క కత్తిదెబ్బకు ఆఱేసి తునుకలగు నట్లుగా కొట్టఁగలిగిన' *మేలైన వజీర్లు = మేటి గుఱ్ఱపురౌతులు, శర...మణులు—శరణాగత = శరణువేఁడుటకు వచ్చిన, అరాతిధరణీరమణులు=శత్రురాజులు, అయ్య జియ్యలు పెట్టుచున్ = అయ్యా జియ్యా అని మనవులు సేయుచు, సేవసలుపన్= సేవలుచేయుచుండఁగా;– సరస = రసవంతములయిన, సంగీతము – సాహిత్యము, ఆది = మొదలయిన, విద్యలు, సాటికిన్ = సామ్యమునకును, పోటికిన్ = స్పర్ధచే తను(తనమోఁల) నృత్యమాడన్ = ప్రవృత్తములగుచుండఁగా (అనగా గాయనీగాయనులు సంగీతములు పాడుచుండఁగా, పండితులు శాస్త్రార్థచర్చలను జరుపుచుండఁగా— అని భావము);–మనవిచనవులకున్ = విన్నపములు చేసికొనుటకును–చనవు సంపాదించుకొనుటకును, ఏతెంచి, మన్నెవారు = చిన్నచిన్న జమీన్‌దారులు, వేళ... వేఁడుచుండఁగా,—సింహాసనస్థుఁడై= సింహాసనమున గూర్చుండి, ఒడ్డోలగంబున్న అవసరమునన్ = నిండుకొలువు తీరియున్న వేళ.

---

*పూ. టీ.—'వజీర్లు = సేనానాయకులు.'

'వజీరు' అనగా, యుద్ధవీరుఁడు; యుద్ధవీరుఁడైన గుఱ్ఱపురౌతు. "వజీరు Wazir మంత్రి; but usually it means a horse man రౌతు or warrior" బ్రౌను)— శ. ర. కర్త 'వజీరుఁడు = జోదు, శూరుఁడు' అని యర్థము చెప్పి, అందు కీ పద్యమునే యుదాహరించియున్నాఁడు,— గాన 'వేటాఱు తునియలుగా వేయు రౌతుల' నిట్లు వర్ణించియున్నాఁడు;—

"అరుదుగా రౌతున హయముఁ బల్లమును
దురమున వేటాఱు తునియలుఁగాఁగ
నడిగొని యడిదాన నైచి కందాన
మడుచు రౌతులు." హరిశ్చంద్ర 1-131.)

మఱికొన్ని ప్రయోగములు.—

'చంకఁ జేతులు పెట్టుక.'

'పెట్టుక'-'పెట్టుకొని'కి సంగ్రహరూపము; సాను వే. చిన్నయసూరి యసాధు వన్నాడు; కాని తత్పూర్వులు- ప్రామాణికులెందరో వాడియున్నారు.—మ॥ 'ద, ర్పకశస్త్రంబుల గాఁడిపాఱు నవలాభావంపు బల్గాయమ్మాఁదుకగాఁ బంగఁజెలుల్ ఘటించు కలిపొత్తుల్వోలె నప్పట్టునన్' (చంద్రా. 4-176.) వివరములకు, బాల కవిశరణ్యమున 'పట్టుక'యను పట్టున చూచునది.

'కొని'కి కాదేశము, శాస్త్రిగారి దృష్టిలో గొప్ప తప్పు విజయవిలాసము (1-134) లో 'ఊఁపుక' జఘన్యప్రయోగ మన్నారు. ప్రాచీనముద్రణమునను, శ.ర. లోను గల "బొమికె లెత్తుక పాఱిపోవు శునుల" అను (ఆముక్త. 6.18) పాఠమును 'బొమికె లెత్తుచు' అని దిద్దివేసినారు. ఆమార్గమున నిచ్చట ,చంకఁజేతులు పెట్టుచు' అని దిద్దినచో పద్యార్థము పాడయి హాస్యాస్పదమగును గదా! ప్రాచీనకవిప్రయోగములను మనయిష్టమువచ్చినట్లు మార్చుట చాలా తప్పు.

మ. పులితోల్కాసెల నంట దోఁపినపిడెంబుల్ *పీలిపూఁదావళం
బులు బల్సింగపుఁజుంచుదండకడియంబుల్ చెంపలన్ జెక్కఁ, పీఁ
కలు కెంజేగుఱుబొట్లు జుంజుఱుసిగల్ గౌరంపుమైపూఁతలున్,
బలుదూపు ల్వాడవిండ్లును న్జెలు వొనర్పన్ వచ్చి కేల్మోడ్చుచున్.

టీక.— పులితోల్కాసెలన్ = పులిచర్మపు దట్టీలయందు, అంటదోఁపిన

---

(i) "పరిపరి యశ్వంబు పల్లంబు కేఁడు
దురమున వేటాఱు తునియలు గాఁగ" (కాటమరాజుకథ.)

(ii) "మదదంతావళ దంతముల్ నఱకు నమ్మావంతు లుద్భ్రాంతతన్
బెదరం బల్లము గుత్తుమన్ రవుతునన్ వేటాఱుతుండెంబులై
బెదరంగా వడిత్రెవ్వియు వీరరథికశ్రేణిన్." (విక్ర. 6-79.)

వేటాఱుతునియలుగా వేయుటకు, వాఁడు 'సేనానాయకుడే' అయ్యుండ నక్కఱలేదు. అట్టి ప్రజ్ఞయున్నచో నెవ్వడైనను 'వేయ'వచ్చును— 'వజీరు'శూర వాచకశబ్దము. 'విజయరఘునాథ తొండమాన్ విభు వజీర,'

—చాటు. రత్నా. పు. 127.

*శా. పా.— 'నూలిపూఁ దావళంబులు' (= నూలుబంతుల హారములు' అని పూ.టీ.)

†పిడెంబుల్ = పూర్తిగా దోపిన బాకులును; పీలిపూఁదావళింబులు = పికిలిపిట్టల యీకల హారములను, బలుసింగపు చుంచువండకడియఁబుల్ = సింహము జూలుతో చేసిన పెద్ద రెట్టకడియములును, చెంపలన్, తలలో యీ చెంపన – ఆ చెంపన చెక్కుపీఁకలు = చెరివిన యీకలును, కెంజేగురుబొట్లు = ఎఱ్ఱని తిలకములును, జుంజుఱుసిగల్ = చింపిరిజుట్టులును, గొరంపు మై పూఁతలున్ = శరీరమున తెల్లని గంధపు పూతలును, బలుతూపుల్ = గొప్పబాణములను, వెడవిండ్లును = పెద్దపెద్దధనుస్సులును, చెలువొనర్పన్ = అందగింపగా, వచ్చి, కేల్ మోడ్చుచున్ = మ్రొక్కుచు,—

---

పూ. ము. నను, వ్రాతప్రతులలోనుగూడా 'పీలిపూదావళింబులు' అను పాఠమేయున్నది. (పీలి = పికిలి) 'పీలిపూ' లనగా పికిలిపిట్టల యీకలతో చేసిన పూలు. భిల్లులకుమిక్కిలి ప్రియములు, వారు వానిని ధరింతురనియు, రాజుకు కానుకలుగా గూడా ఇత్తురనియు కావ్యములయందున్నది.

సీ. గురివెందపట్టెళ్ళకును దోడు సందిళ్ళఁ
బీలిదండలు గూర్చి చాలఁ దొడిగి,
యెదనెడఁ బికిలిపూ లిడిన సంకుల పేర్లు
కోరెంద పూసలఁ గూడఁ దాల్చి." (యయాతి. 1-102)

(రాజుకు కానుకలు)

"జవ్వాజి పిల్లులు, గోరోచన మిఱ్ఱులున్ పికిలిపూలున్." (రామా. 2-౯.)

"పికిలిపూలు పూతపిల్లు లేనికకొమ్ము
లలరఁదెనె- కానుకచేసిరి." (—యయాతి. 1-103; 104)

ఎందుకు గ్రంథవిస్తరము? కావ్యములలో నేమి, నిఘంటువులలో నేమి – పీలిపూలు – పికిలిపూబంతులు – పికిలి కుచ్చులు – పీలి పాగలు, కనబడుచున్న వే గాని, 'నూలిపూలు' గాని, 'నూలిపూఁ దావళిములు' గాని కనబడుటలేదు.

†పూ. టీ.— పిడెంబుల్ = చిన్నబాణములు.

'పిడె' మనగా 'బాకుగాని 'చిన్నబాణము' కాదు. (చూ. శ. ర.)

"సురకటారి పిడెంబున శోభిలును గ
రాసి నామంబులై" — (ఆం. భా. 2-214)

[కావలో కత్తినిదోపుకొందురుగాని బాణాలను దోపుకొనరు.]

§ క. జల్లులు, పునుఁగుజవాదుల
పిల్లులు, కుందేటిలేటిపిల్లలు, మొదలౌ
నెల్ల సువస్తువ్రులను శో
భిల్లం గానుక లొసంగి భిల్లజనంబుల్. ౬౪

టీక:—భిల్లజనంబుల్ = చెంచువాండ్రు, జల్లులు = చామరములను, పునుఁగు జవాదుల పిల్లులు = పునుగుపిల్లులును - జవాది పిల్లులును, కుందేటిలేటి పిల్లలు = కుందేటి పిల్లలు - లేడిపిల్లలు, మొదలయిన, సువస్తువ్రులను, కానుకలు - ఒసంగి = ఇచ్చి.

శా. సామీ, వింజపుఁగొండకాఱడవిపజ్జన్ గూడెముల్ గట్టి మీ
సేమంబే సత మిచ్చఁ గోరి బలుబైసిన్ బాగ్గెమున్ గల్గి యా
బూమిన్ వేఁటలఁ దోఁటలం దిరిగి మీపున్నెన మా కచ్చికం
బేమిన్ లేక *సుగాన నుండుదుము నీవే దిక్కుగా నెమ్మదిన్. ౬౫

టీక.—వింజపుకొండ = వింధ్యపర్వతముయొక్క, ❡కాఱడవి పజ్జన్ = దట్టమయిన అడవికి సమీపమున, గూడెముల్ గట్టి = పల్లెల నేర్పరచుకొని,—

---

§ కొన్ని ప్రతులలో, 63, 64; 65 పద్యములు లేవు. 64 కు మారుగా ఈక్రింది పద్యమున్నది.

ఉ బెట్టుడుతేల్, పునుంగులును, బెబ్బులి జున్నులు, చారపప్పునున్
జిట్టెలు, జుంటితేనియలు, సింగపు పిల్లలు, బల్మెకంబువా
కట్టుల మందుమూలికలు, కర్లజవాదియు, (బచ్చకపత్రముం
బట్టిన బొంగులున్, బొగడపండ్లును, కానుక లిచ్చి రయ్యెడన్.

*శా. పా.—'సుఖాన' (ఇది పూ. ము. పా.)

ఈ పద్యమున కవి చెంచులకు (పాత్రోచితముగా) అచ్చతెనుగు పదములనే వాడినాడు. ఈ యచ్చతెనుగు పద్యమున 'సుఖాన' అను తత్సమరూప ముండుట తగదు. 'సుగాన' అని తంజ తాళ. పాఠము.

❡పూ. టీ.—'కాఱడవి పజ్జన్ = నల్లనైన వనము సమీపమున.' 'కాఱడవి' యనగా సాంద్రారణ్యము గాని, నల్లని యడవి కాదు. 'నల్లని' అను నర్థము నిచ్చు 'కారు' లఘురేఫయుతము. (చూ. శ. ర.) కాఱడవి = సాంద్రారణ్యమనుటకు.—

జైసిఁగ = గౌరవమును, బాగ్గెముఁగ = భాగ్యమును, కల్గి, మీపున్నెన = మీపుణ్యముచేత- (మీ యనుగ్రహముః-అనుట) అచ్చికంబు = కొరత, ఏమిఁగలేక = ఏమియును లేకుండా, నెమ్మదిఁగ = శాంతముగా, సుగానఁగ = సుఖముగా, ఉందుము.

జైసిఁగ,—ఏమిఁగ, అని యుంగర్ణహీనముగా వాడవచ్చును.

( చూ. ప్రౌఢ. శబ్ద, 116; బాల-శర. పుట. 134.)

ఉ. అయ్యా పరాకు మాని తెలియఁగ వినుఁ, ♦లచ్చనదేవుఁడుఁగ సిరా
మయ్యయు సీతమమ్మకొఱకై తొలుతఁగ గనుపట్టుముచ్చుబల్
దయ్యపు మూఁకఁ జెండిన పొలానకు మొన్నను వేఁటలాడుకోఁ
జయ్యనఁ బోయి యా యడవిచాయలఁ గంటిమి వాల్మెకంబులఁగ.

టీక.—అయ్యా = ప్రభూ, పరాకుమాని = ఎచ్చరిక గలిగి, విను, లచ్చనదేవుఁడుఁగ = లక్ష్మణుడును, సిరామయ్యయుఁగ = శ్రీరాముడును, సీతమమ్మకొఱకై = సీతకొరకు,తొలుతఁగ...మూఁకఁగ.— తొలుతఁగ కనుపట్టు = తమకు మొట్టమొదట అగపడిన, ముచ్చు = మాయావులయిన, బల్దయ్యపుమూఁకఁగ = గొప్ప పిశాచముల (=రాక్షసుల) సమూహమును, చెండినపొలానకుఁగ = సంహరించిన ప్రదేశమునకు, పోయి, ఆయడవి, చాయలఁగ = ప్రాంతములందు, వాల్మెకంబులఁగ = గొప్పగొప్ప మృగములను, కంటిమి.

---

క. "కాఁదూఱని, కాఱడవిం బఱచుచో నొకానొకచోటఁగ"

(చంద్రభాను చరిత్ర.)

సీ. "లేఁడిగ పులికిఁ గళ్లెముపెట్టి వయ్యాళిఁ
దోలుఁ గాఱడవి నీ వుండగేఁడు" (ఉ. రా. 7-392)

క॥ "కాఱడవిఁ బఱచు మృగముల నూఱడకందిగిచి" (భా.ఆది.4-19.)

♦ నవనాథ చరిత్రమున.—

"వినవయ్యరాజ, నావిన్నపంబొకటి
మును రామదేవర ముచ్చురక్కసులఁ
జలమునఁ బోరిఁగొని జయముచేకొన్న
పొలమునకును వేఁటఁబోయివచ్చితిమి." (పు, 34.)

క. అందల మందల లేకిపు
డందలమంద లయి యున్న వయ్య మెకంబుల్
చెందామర *కొలనివలెఁ
దెందేప ల వేమి సెప్పఁ? దేవుఁ డెఱుంగున్. ౬౭

టీక.—మెకంబుల్ = మృగములు, అందు = ఆవింజప్రకొండ కాఁడవి యందు, అందల - మందల లేక = మితి మేర లేక, అల-మందలయి = అలల గుంపులవలెనయి, ఉన్నయవ్వి; అవి = ఆమృగములు, * చెందామరకొలనివలెన్ = సొగసైన తామరలకొలనువలె, (కొలనులోని తామరతంపరవలె, అని భావము కానోపును.) తెందేపలు = అసంఖ్యాకములు. (తెప్పలు + తెప్పలు = తెందెప్పలు, రూ. తెందేపలు.) ఏమిచెప్పన్ = ఏమని చెప్పుదును; దేవుఁడెఱుంగున్ = అవి యెన్నో దేవుడే యెఱుఁగును. (మనుష్యులు లెక్కించి చెప్పజాలరన్నమాట)

* 'కొలనువలెన్ దెందెప్పలు' శ. ర. పా.

* పూ. టీ.—'ఎఱ్ఱనిదామరల చెఱువువలెనే-మృగములు మిక్కుటములు.'

'చెన్నుశబ్దము వృత్తియందు శోణార్థకము' (బాల. సంధి- 37) అను వాక్యము మీఁద ఆధారపడి పూ. టీ. కర్తలు 'చెందామర = ఎఱ్ఱని దామర' అన్నారు. కాని- ఎఱ్ఱదనమున కిందు ప్రసక్తిలేదు. కావున నిక్కడ వృత్తియందును చెన్ను శబ్దము మనోజ్ఞార్థమునసే ప్రయుక్తమైన దనుకొనుట యుచితము. అట్లు ప్రయోగించుట ప్రాచీనకవులకు సమ్మతమే -

సీ. 'చందురులో నున్న కందుఁ దా మణఁగించు
తేఁవ జెందలల కొండియలు చెలఁగ.' (మల్ల. విప్ర. 1-68.)

'తామరల చెఱువువలెనే మృగములు మిక్కుటములు'- అంటే యర్థమేమో?

'ఎఱ్ఱనిదామరలు' అనుటయును సరికాదు. ఎఱ్ఱని- నల్లని, మున్నగు గుణ వాచకములలోని 'ని' కారముమీఁది పరుషములు సరళములు కావు. గసడదవలును కావు, కావున 'ఎఱ్ఱని తామరలు' అనవలెను.

1. "ఒడలు తెల్లని తురగోత్తము వాలంబు" (భార. ఆది. 2-34)

2. "అలకని తెల్వి' (హరి. ఉ. 7. ఆ.)

'తియ్యని బండు,- తియ్యనివండు; కమ్మనిజల్లు - కమ్మనిసల్లి' అనురీతి వ్యవహార మెందును వినబడుట లేదు. కాబట్టి, 'ఎఱ్ఱని దామర' లనుట సరికాదు.

'అందల మందల' అను పలుకుబడి నిఘంటువులలో లేదు కాని, లోకమున వాడుకలోనున్నది.

సీ. † కోల్పులు ల్మంపిల్లి గోటగోట మని రొప్పి
 బలుసింగముల నైనఁ బట్టఁ జూచుఁ,
గండక్రొవ్వునఁ గన్ను గానక పందులు
 బిరుదేనుఁగుల నైన నోరయఁజూచుఁ,
గాఱుపుల్ దిని యామ్ము కవిసి మఱబోతులు
 కారుపోతుల నైన ♦ గదుమఁ జూచుఁ,
బోతరించి సివంగు ‡ లీతలాతలచేసి
 గబ్బియెల్గుల నైన గిబ్బఁజూచు,

---

† శా. పా.—'క్రొల్పులుల్' = ('క్రొల్పులుల్ = పెద్దపులులు'- పూ. టీ) 'పెద్ద అను నర్థము నిచ్చు పదము 'కోలు'గాని క్రొలు కాదు. "కోలు= పెద్ద; కోలుపులి." (శ. ర.).—"కోలుపులి- A royal tiger." (బ్రౌను.)— భారతము (ముద్రితప్రతుల) లో 'కోలుఁపులి' యే పలుమారుకనబడుచున్నది. అయితే 'కోలు = పెద్ద; కోలుపులి, అన్న శ. ర. కర్తయే, 'గోటగోట' అను పదముక్రింద "క్రొల్పులుల్ మంపిల్లి" అను పాఠమును పఠించినాడు. కాని, బ్రౌణ్యములో- ఈపద్యము 'మంపిర్లుట' అను పదముక్రింద 'కోల్పులుల్' అను పాఠముతోనే యుదాహృతమైనది. పూ. ము. నను 'కోల్పులుల్' అనియే యున్నది. సూ. ని. 'క్రొలుపులి' అను రూపమును గ్రహించలేదు. 'కోల్పులి = పెద్దపులి' అనుటయే కాక, 'గోటగోట' అను పదముక్రింద 'కోల్పులుల్ మంపిల్లి' అనియే యుదాహరించినది.

ప్రాసమునన్న యీ 'కోలుపులి' గమనింపదగినది.—

 క. 'ఈ కోలుపులుల కతమున
 నీ కాననమున.' (విష్ణు. పు. 5-275.)

'క్రొలుపులి'-ప్రాగులు, ప్రప్వా, ప్రగ్గము, క్రొతి, అను వర్గమునకు చేరినది కాబోలు!

♦ శా. పా.—'గదుమఁజూచు'.—'కదుము' అను క్రియ భాషలో లేదు. 'కవియఁజూచు' అని పూ. ము. పా.

‡ శా. పా.— 'ఈతలాతల నేచి' ('ఈతలాతలచేసి' - తంజ. పా.)

గీ. సామి, వాని చలంబు మచ్చరము బలమి
యెక్క డేవంక నే మని యెంచ వచ్చు
నొకటి నొక్కటి సడ్డసేయక మెలంగు
నా పొలంబునఁ దరతరం బై మెకములు. ౬౭

టీక.—కోల్పులుల్ = పెద్దపులులు, *మంపిల్లి = మత్తిల్లి (=మదించి) గొటి గొటుమని, రొప్పి = శబ్దించి, బలుసింగములనైనన్ = గొప్ప గొప్ప సింహములనైనను, పట్టన్ చూచున్ = గావుపట్టయత్నించును.— పందులు, కండకొవ్వునన్= మదాతిశయముచేత, బిరుదు † ఏనుఁగులనైనన్ = మదపుటేనుగులను సైతము, ఒరయన్ చూచున్ = డీకొనఁజూచును.— మన్ బోతులు = మనుబోతులనెడి మృగములు, కాలుపుల్ = దట్టముగా పెరిగిన పచ్చిక, తిని, ఆముకవిసి = పొగరెక్కి, † కారుపోతులనైనన్ = అడవి దున్నలనైనను. ‡ గదుమఁజూచున్ = గద్దింపగడగును.— సివంగులు = ఒకజాతి చిరుతపులులు, పోతరించి = బలిసి, ఈతలాతలచేసి = తారుమారుచేసి,గబ్బి యెల్గులన్ = మదించిన యెలుఁగుగొడ్లనైనను, గిబ్బన్ చూచున్ = చంపబోవును, ('గిబ్బు' అనుక్రియ నిఘంటువులలో లేదు.)

---

*పూ. టీ.—మంపిల్లి = నిద్రమబ్బుగొని.

ఆయడవిలోని పెద్దపులులు సింహములనైనను పట్టఁజూచుట 'మదముచేత' గాని 'నిద్రమబ్బు' చేతకాదు. 'మంపిల్లి = నిద్రమబ్బుగొని' అనునది పద్యభావము బొత్తిగా అవగతముగాని యనుచితపుటీక. శ. ర. కర్త 'మంపిల్లు = మత్తిల్లు (=మదించు) అని యర్థముచెప్పి, ఆయర్థమున కీపద్యమునే యుదాహరించినాడు. పూ. టీ. కర్త ఇదియు నెరుగరు. అయితే శబ్దార్థ చంద్రికాకారులు ఆంధ్రవాచస్పత్యమున 'మంపిల్లుట – నిద్రమబ్బుగావుండుట' అని యున్నది. అది సరియైన యర్థముకాదు. ఆయర్థమును పూ. టీ. వారల్లే యనాలోచితముగా గ్రహించుట పొరపాటు. నిద్రచేత సైతము మంపిల వచ్చును. కాని అది ప్రకరణోచితమయిన యర్థము (ఇక్కడ) కాదు.— 'మంపిలు= మత్తిలు' అనుట కింకొక ప్రయోగము. ద్వి. "పరలోక సౌఖ్య సంపదల మంపిలుము." (విష్ణుపు. ఉ. ౫. ఆ.) శ. ర.

† పూ. టీ.—'కారుపోతులన్ = మదించిన దున్నలను.'

కారుపోతనగా అడవిదున్నగాని, మదించిన దున్నకాదు. (చూ. శ. ర.) "కారెనుపోతనఁ గారుదున్నయనంగ వనమహిషంబొప్పు." (ఆం.భా. 2-88.)

‡ పూ. టీ.—గదమన్ = చంపుటకు.

వాని, చలంబు = పట్టుదల, మచ్చరము, బలిమి = బలము, ఏమనియెంచ వచ్చున్ = ఎంతని చెప్పవచ్చును? (చెప్పవీలులేదని, భా.) ఒకటినొక్కటి, సడ్డసేయక = లెక్కపెట్టక, అపాలంబునన్ = ఆయాడవియందు, మెకంబులు = మృగములు, తరతరంబై = గుంపులు గుంపులై, మెలంగును = వర్తించుచుండును. ('తరము A number or collective body'– బ్రౌను.)

గీ. జింకదాఁటులు మంచి తేజీల పిల్ల
లనఁగఁ దగి యుప్పరముదాఁటునప్పు డడ్డ
మైనఁ బసదాఁటు నెలలేడి నైన, దాఁటుఁ
జిఱుతపులి నైన, నే మని చెప్పవచ్చు. ౬౯

టీక.—జింకదాఁటులు = లేళ్ళమందలు, తేజీలపిల్లలనఁగన్ = ఉన్నత జాతి గుఱ్ఱపుపిల్లలోయన్నట్లు, ('తేజినా నున్నతవాజియై విలసిల్లు',— ఆం. భా. 2-197) ఉప్పరము దాఁటు నప్పుడు = కుప్పించి దుముకునపుడు, నెలలేడినైనన్ = చంద్రునిలోని జింకనైనను; పసదాటును; (అంతటిలాఘవముకలవి యని, భా.) చిఱుతపులినైనన్ = తమ్ము చంపి తినునట్టి పులినైనను, దాఁటును; (అంతగా కొవ్వి కన్నుగానకున్నవని, భా.)—

'ఉప్పరముదాఁటు=పైకెగురు' అనుటకు,– 'అంటినఁ గందునో యను మేని నునుఁగాంతి యిరుగెలంకులకు నుప్పరముదాఁటు' (విక్ర. 8-101) ద్వి.— 'ఉదధిమండలముదాఁక నుప్పర మెగసి," (నవనాథ. పు. 39.)

*గీ. ఏనుఁగుమదంబువఱదఁ †గారెనుపపాలఁ,
బంది నే వెల్లువలఁ జిక్కఁబాఱుచెన్ను

---

'కదుమన్' అని మూలము; 'గదమన్' అని టీక. ఏమయినను భాషలో కదుము – గదుము, అను క్రియలేగాని 'కదము' – 'గదము' అను క్రియలేలేవు. 'గదుము' అను క్రియనే వారు 'గదము' అనిరి కాబోలు! అట్లైనను, గదుము = గద్దించు (చూ. శ. ర.) గాని 'చంపు' కాదు.— సీ. 'అదలించె గద్దించె నదలించె ననఁగను, గది మెసంచనుమాటగాఁ జెలంగు.' (ఆం. భా. 3-125.)

*కొన్ని ప్రతులలో లేదు.—

†శా. పా.—'వఱద, గారెనుపపాలు, పంది నే వెల్లువలు,' (...మదజల ప్రవాహమును, ...యెనుముల పాలును, ...నేతి ప్రవాహములును చిక్కఁబడి నట్టిదడి.'– అని. పూ. శి.)

దఱుఁగ దల మందువేసవిఁ; దఱుమఁ గలుగఁ
జాల్, మెకా లందు దొప్పున జాతి పడును. ౭౦

టీక.—ఏనుఁగు మదంబుకాలువలన్ = ఏనుగుల మదజలపు వాగు చేతను, కారెనుప పాలన్ = అడవి బఱ్ఱెలపాలచేతను, పందినేవెల్లువలన్ = పందుల నేతి ప్రవాహములచేతను (ఇక్కడ నెయ్యి యనగా క్రొవ్వు = మేనిజిడ్డు. — 'నెయి వెల్లువల' - పాఠాం.) చిక్కఁబాఱు చెమ్మ = చిక్కఁబడియున్న తడి, మందువేసవిన్ = మన్నుమండే యెండాకాలమునను, తఱుఁగదు = తగ్గదు. తఱుమఁగలుగన్ (= కలిగినన్) చాలన్ = మనమూరక తరుముటకు యత్నించినచాలును, మెకాలు = మృగములు, అందున్ = ఆచిక్కని చెమ్మలో, (కాళ్ళు) జాఱి, దొప్పునన్ = దబ్బున - పడును.

ఉ. ఉల్లములోన నే మనుచు నుందువొ యేనొకదబ్బ దబ్బెదన్
బల్లిదపువ్వరాహములు భద్రగజంబులమీఁద †నాదికోఁ
బెల్లుగ నెక్కు వానికొసవెండ్రుక యొక్కటి రెమ్మ దీసినన్
జిల్లున వెల్లఁ బో చమురు చిమ్మనగ్రోవిని జిమ్ము కైవడిన్. ౭౧

టీక.—ఉల్లములోనన్ = నీ మనసులో, ఏ మనుచునుందువో = ఏమను కొంటున్నావో, ఏను = నేను, ఒక దబ్బ దబ్బెదన్ = ఒకమాట చెప్పెదను,

---

'ప్రవాహమును - పాలును - ప్రవాహములను చిక్కఁబడినట్టి తడి.'- ఇది అర్థశూన్యవాక్యము. చిక్కఁబడినది తడి; అందుకు కారణము ప్రవాహాదులు. కావున హేతువులయిన ప్రవాహాదులు తృతీయలో నుండవలెను. 'వలన(న్)', - 'వెల్లువలఁ జాలువారు చెమ్మ' అని పూ. ము. నను.— 'వలద - వెల్లువలఁజిక్కఁ బాఱుచెమ్మ' అని, తంజ- ప్రతిలోను, తృతీయాంత పాఠములున్నవి. ఒక్క 'పాలు' మాత్రము ప్రథమాంతముగానున్నవి. అది ప్రమాదమైయుండును.

'కారెనుప' అనుటయును తప్పే. అడవి యను నర్థమునిచ్చునది 'కారు' గాని 'కాఱు' కాదు. కారు + ఎనుము = కారెనుము = అడవిబఱ్ఱె.

†శా. పా.—'అదుకోన్' ('అదుకోన్ = అనుకొనుటకు'- పూ. టీ.)

అదుకొను అను క్రియకు 'అనుకొను' అను అర్థము నిఘంటువులలో లేదు. ఉన్నను ప్రకరణోచితము కాదు.— "అదికొను = క్రోధముతో నూటిగాఁ బరుగిడు; ఎదుర్కొను." (సూ. ని.) "అదికొను = కన్నువేయు." (శ. ర.)

బల్లిదపుఁ వరాహములు = (ఆయడవిలోనుండు) బలిష్ఠములైన పందులు, ఎపుడుఁ, భద్రగజంబుల మీఁదఁ = భద్రజాతి యేనుగులమీద, ఆడికోఁ = మచ్చరమున దుముకుటకు, పెల్లుగఁ= మిక్కిలిగా, ఎక్కుఁ = విజృంభించి - పైపైకి పోవుచుం డును. (అంతగా పొగ రెక్కియున్న వన్నమాట.) కొనవెంట్రుక, రెమ్మ తీసి నఁ = ఒడిసిలాగినయెడల, చమురు = క్రొవ్వు, చిమ్మ...వడిఁ = చిమ్మన గొట్ట ముతో చిమ్మిన విధముగా, జిల్లునఁ వెళ్ళుఁ - పో = నిశ్చయముగా జిల్లున బయటికి వచ్చును. ('పో' 'పొమ్ము, నిశ్చయార్థంబునం దగు.' ప్రౌ. వాక్య. 22.)

సీ. తాము శక్తిహాయంబు లై మంద మని సుమీ
మొగులు *చొచ్చినయట్టు లెగురుచుండు,
దిక్కాలములు మోచి రెక్కొంద మని సుమీ
యల దరు ల్తాము గోరాడుచుండుఁ,
బాతాళ మటు సొచ్చి బ్రదుకుద మని సుమీ
తాము వేమఱు భూమిఁ ద్రవ్వుచుండు,
మింటఁ జందురుఁ జేరి †మే లౌద మని సుమీ
తాము నుప్పరమును దాటుచుండు,

---

వ. 'వృషభంబున కాదికొను బెబ్బులియుఁబోలె.' (భా. విరా. 5.73)
ఉ. '...యేనుఁగుఁ జంపనాదిగొను సింగంబుఁ విడంబించి.'
(ఉ. హరి. 5-251.)
వ. 'పొట్టేళ్ళకైయాదిగొని నీర్గికాలుద్రవ్వి...మెండుకొనియుండు జాగి లంబులంగాంచి.' (మను. 4-27)

పాఠభేదములు —
'అదుకొవెళ్ళగ నొక్కదాని.' (పూ. ము.) 'నాలుగెన్నోశైపు డెక్కుచుండు. (మద. తాళ. పా.) 'నాలుగేఁ వేళ్ళగుడుండు' (మద. కాగితపువ్రాతప్రతి.)
'నాలుగేఁ వేళ్ళగుడుండు'
'అదుకొఁ బెల్లగుచుండు.' —తంజ. తాళ. పాఠములు.
* పాఠాం.— 'నీర్దచ్చినశైగుడు' † 'మీఁదౌద'

ఆ. హరులు గరులు గిరులు హరిణంబు లనయంబు
తొలుతఁ బెద్ద †లరుఁగు నొళవెఱింగి;
యటులు పోవనిత్తు మఁటవయ్యె తముఁ జుట్టి
పట్టి నేలతోడఁ గొట్ట కిపుడు? ౭౨

ఈ పద్యమున పెద్దపాదములు నాలుగింటికిని చిన్నపాదములలోని, హరులు, కరులు, కిరులు, హరిణములు — అను నాలుగింటితోను వరుసగా అన్వయము.—

టీక.-హరులు=సింహములు, తొలుతక్=పూర్వము, పెద్దలు, అరుగు-ఒళవు= పోయినజాడ (=రహస్యము) ఎఱింగి = తెలిసికొని.—(పూర్వము, తమకులమున పెద్దయైన సింహ మొకటి శక్తికి వాహనమై, కిరాతులబారినుండి తొలగి సుఖమున్న మర్మమును తెలిసికొని అని భావము.) తామును, శక్తిహయంబులై = అట్లే ఆ శక్తికి (పార్వతికి) వాహనములై, మందమని సుమీ = బ్రతుకుదమని సుమా, మొకులు చొచ్చిన యట్టులు = మబ్బులలోనికి దూరుచున్నవో యను విధమున, ఎగురుచుండును.

కరులు = ఏనుగులు, తొలుత...వెఱింగి = తమకులము పెద్దలయిన కుంజరములు కొన్ని దిక్కులను మోచుచు కిరాతుల బారి తప్పి సుఖమున్న జాడ విని, తామును, దిక్కులములు మోచి = దిక్కుల అంచులను వహించి, రెక్కొండమని చుమీ = సుఖపడుదమనిసుమా, అలదరల్ = పెద్దపెద్ద కొండగట్టులను కోరాడుచుండును = కొమ్ములతో చెలగుచుండును.

కిరులు = పందులు, తొలుత...వెఱింగి = మనువు, తమ కులమున పెద్దయైన ఆదివరాహము పాతాళమును జొచ్చి కిరాతుల బాధలేక హాయిగానున్న దన్న కథవిని, తామును అటుల పాతాళమునుచొచ్చి బ్రతుకుదమని సుమా, వేమఱుక్ = పలుమారు, భూమిని త్రవ్వుచుండును.

---

† శా. పా.—'పెద్దలెఱుఁగు నొళవెఱిఁగి' ('ఒళవు = ఉపాయము'- పూ. టీ.) 'ఒళవు' నకు, ఉపాయమనునర్థము కనబడదు. ఒళవు= మర్మము '(శ.ర.) 'ఒళవు - Secret intelligence' (బ్రౌను)

'పెద్దలరుగు సుళువెఱింగి' — తంజ. పా.

'పెద్దలెఱుగు నెళవెఱింగి' — పూ. ము. పా.

హరిణంబులు = లేళ్ళు, తొలుత...వెతెంగి = ఇంతకుమున్ను, తమకులమున పెద్దయయిన లేడి యొకటి చంద్రునిలోఁ జేరి కిరాతుల చేతుల కందక సుఖమున్న వార్త తెలిసి, తామును, మింటన్ = ఆకాశమందు, చందురుఁ జేరి, మేలు వొందమని కుమీ = సుఖముగా నుందమనిసుమా, ఉప్పరమును దాఁటుచుండున్ = ఆకాశమున కెగురుచుండును.

ఇపుడు, తమున్ = ఆజంతువులను (చూ.ప్రౌ. శబ్ద. 78) చుట్టి = నిర్బంధించి. పట్టి, నేలతోడఁ గొట్టక = చంపక, పోనిత్తుమఁటవయ్య? (పోనియ్య మని భా.— 'అఁటవయ్య' చూ. ప్రౌఢ. (క్రియా. 4-5-9.)

†మబ్బులను చూచి యేనుగు లనుకొని యెగురుట సింహములకు స్వభావము. స్వభావముగనే యెగురుటను, దేవలోకమున నున్న శక్తి కడకుపోవు పూనికతో ముందుగా చేయు లంఘనాభ్యాసముగా చెప్పుట చమత్కారము.— కొండదరులను గోరాడుట యేనుగులకు సహజ గుణము. ఆ సహజగుణమును, ఇకముందు దిక్కాలములను మోయ నిశ్చయించుకొని, అందుకుగా నభ్యాసార్థము కొండలను మోచుటగా చెప్పుట చమత్కారము.— భూమిని కుళ్ళగించుట పందుల కలవాటు. ఆ యలవాటును, పాతాళమునకు పోవుకలపుతో భూమిని త్రవ్వుటగా చెప్పుట చమత్కారము.— చంగున పైకెగిరి దుముకుట లేళ్ళకు స్వభావము. స్వభావముగనే పై కెగురుటను, ఆకాశమునం దున్న చంద్రునిలోఁ జేరు ప్రయత్నముగా జెప్పుట చమత్కారము.

సీ. * వెదురుచే ల్కలుపు దీసి దివంబుఁ గాపాడు
కమతీలు మా కేకలములు సుమ్ము,
‡కరిముత్తియపు రేకఁ ♦గనిపెట్టు సంగాత
కాండ్రు మా కల్ల సింగములు సుమ్ము,

---

† 'యే సంరంభోత్పతనరభసాః స్వాంగభంగాయ తస్మిన్
ముక్తాధ్వానం సపది శరభా లంఘ యేయు ర్భవంతమ్'

మేఘ. 1-58.

* కొన్ని ప్రతులలో లేదు.— ‡ పాఠాం.—'గజముత్తియపు'.
♦ శా. పా.—'కనిపట్టు'. ('కనిపెట్టు' పూ. ము. పా.)
శ. ర. లో 'కనిపట్టు = వెదకిపట్టు' అనియున్నది. దానినిబట్టి, పూ. టీ.

జింకవేఁటలఁ గాచి జంకించి దొడ్డిఁ దో
    ల్గొల్లలు మాకుఁ ‡గోల్పులులు సుమ్ము,
పుట్టజు న్నంగళ్ళఁ †బెట్టుంచు వాఁడుక
    కోమట్లు మా కెల్లగొల్లు సుమ్ము,
గీ. §వాటివాటిలో నింత తాటోటు చేసి
యటమటింపక యుండఁ బైయుద్ధికముగ
నేవఁ దిరుగాడు విశ్వాసు లెపుడు మాకు
జాగిలంబులు సుమ్ము మాసామికాన. ౭౩

టీక.—సామికాన = ప్రభూ, ('కాన' తెనుగు సంబోధనమునకు ప్రేమ వాత్సల్యద్యోతకముగా అనుప్రయుక్తమగును. ప్రౌ. శబ్ద. 15.) మాకు, ఏకలములు= అడవిపందులు, కలుపుతీసి = పైరులోని చెడ్డమొక్కలను తొలగించి, పెసరుచేలు

---

వారు 'కనిపెట్టు'ను—'కనిపట్టు'గా మార్చినారు. పొరపాటు. 'కనిపట్టు' సరికాదు (చర్చకిది 'తావు కాదు.) 'కనిపెట్టు - To find out, discover.' (బ్రౌను.)

‡ శా. పా.— 'క్రోల్పులులు' (చూ. ౭౧ పద్యముక్రింద ).–'గిరిదుర్గములఁ బూనికెలఁగాయుతాణెదారులు మాకు నెపుడు బెబ్బులులు సుమ్మి'.—పాతాం

† శా. పా.—'పెట్టించు' (ఇది పూ. ము. పా.)

కోమట్లు తేనె మొదలగు వస్తువులను అంగళ్ళయందు, 'పెట్టిఉంచు'వారు గాని, యితరులచేత 'పెట్టించువారు'గారు. పెట్టి + ఉంచు = పెట్టుంచు, అనుచో సంధి దుష్టమును కాదు. చేమకూర కవికే కాదు, తిక్కన మహాకవికిని ఆ సంధి యిష్టమే.—

విజయ.–'అనవలసంటేఁగాక.' (1–161) 'అటు చూపిటునిటు చూపటు', (2–202) భార. 'అందుఁబడి తేలాడు (తేలి + ఆడు) వెలిగొడుగులు.' (విరాట. 5-60.)

§ శా. పా.—'వాటిలో నిసుమంత' ('వాటివాటిలోనింత' పూ.ము.పా.) 'వాటిలోకా - గ్రామ్య'మని శాస్త్రిగారి ఆక్షేపము. ఆక్షేపము సరియైనది కాదు. (చూ. బాల. శర. పు. 51.)

కాపాడు, *కమతీలు = సేద్యగాండ్లు ('కమ్మతీఁడనఁగను...హాలికాభిధ' ఆం. భా. 2–29.)

అడవిజాతులవారికి వెదురుబియ్య మాహారద్రవ్యము:—కాళహస్తి మాహాత్మ్యమున బోయ యింటి వర్ణనము.— 'కీచక తండులంబులం బిండిగొట్టి కొట్రంబోసి యుప్పి గొప్పలుగాఁజేసి యావించిన కుడుములబానలు' (3-36)

వెదురుధాన్య మడవిపందులకును ప్రియమయిన పదార్థమే.—

చ. 'బలిమి నిఁకేమి చెప్ప విను, పందు వెదుళ్లవలీల మోరత్రో
పులఁబడఁ ద్రొప్పవంచికొను పోలికవంచి, తదగ్ర ధాన్యముల్
సెలవుల ఫేన ముట్టి పడ జిట్టులతోడనె చప్పరించు న
ప్పాలము వరాహపోతములు భూవర, తొండములేని యేనుఁగుల్'

— మను. 4-18.

వెదురుధాన్యము తమకు ప్రియపదార్థమయినను, అడవిపందులా చెంచులకు వెరచి, వెదుళ్లజోలికిపోక ఆ చుట్టుప్రక్కలనుండు తుంగముస్తెలను - చెట్లదుంపలను మాత్రమే కుళ్లగించి తిని జీవించుచుండునని భావము — సహజములయిన వెదురుటడవులను చేలుగను, స్వభావముగనే మొక్కమోడులను కుళ్లగించుటను కలుపుతీయుటగను, అడవిపందులను సేద్యగాండ్రుగను చెప్పుట చమత్కారము.

(2) సింగములు = సింహములు, కరిముత్తియపురేకల్ = ఏనుగుల తలల నుండి రాలిన ముత్యాల జాడలను, కనిపెట్టి = మెలకువతో తెలిసికొని, చెప్పు, సంగాతకాండ్రు = స్నేహితులు.

---

* వ్యా. టీ.—'కమతీలు = పైరుపండించు కూలివాండ్రు'.—'కమతీలు' సేద్యగాండ్రుగాని 'కూలివాండ్రు' కారు. కూలిపని, హాలికవృత్తి భిన్నకృత్యములు.

సీ. 'కూలిపనులుచేయ హాలికవృత్తికి
నోపుదు వీకృత్య ముచితమగునె?' (హరిశ్చం.4–107)

క. 'దాసుఁడు భృత్యుఁడు నెంతయు
వాసిగఁబనిచేయువారు; వారలలోనన్
దాసుఁడు విలిచిన భటుఁడు
ద్వాసిత భృత్యుండు కూలిపనివాఁడెందున్.'

—విజ్ఞా. ప్రా. 36.

ఏనుగు తలయందు ముత్యములుండునని శాస్త్రము.—

"కరీంద్ర జీమూత వరాహశంఖ మత్స్యాహి శుక్త్యుద్భవ వేణుజాని,
ముక్తాఫలాని ప్రథితానిలోకే తేషాంతు శుక్త్యుద్భవమేవభూరిః"

(రత్నశాస్త్రము.)

సింహములేనుగులను చంపు ననియు, ఆ సింహములచే చంపబడిన యేనుగుల తలలనుండి రాలిన ముత్యములను చెంచులు తెచ్చుకొందురనియు, భా.-సింహములు స్వభావముగనే యేనుగులను చంపుటను, చెంచులకు ముత్యాలను సంతరించుటగాను, సింహములను చెంచులకు స్నేహితులుగాను చెప్పుట చమత్కారము.

(3) మాకు, కోల్పులులు = పెద్దపులులు, జింక వేటలన్ = జింకలనెడి గొఱ్ఱె (పోతు) లను, కాచి = మేపి ('కాచు to nourish' బ్రౌను) జంకించి = అదలించి, దొడ్డిన్ తోలు = దొడ్డిలోనికి తోలునట్టి, గొల్లలు.

జింకలను చంపితినుట పులుల కభీష్టమయినను, చెంచులకు వెరచి పులులా జింకలను చంపవనియు, అందువలన నవి యథేష్టముగా అడవియందుతిరిగి మేసి కడుపులుగట్టి సుఖముగా నుండుననియు, భా.—పులులను గొల్లలుగను, లేళ్లను గొఱ్ఱెలుగను, పులులు లేళ్ళను చంపకపోవుటను మేపి కాపాడుటగను, చెప్పుట చమత్కారము.

(4) మాకు, ఎలుగొడ్లు, పుట్టజున్ను = పుట్టతేనె, అంగళ్ళన్ = అంగళ్ళయందు, పెట్టుంచు = పెట్టియుంచునట్టి, వాడుకకోమట్లు = వాడుకగా ఇంటికి వలయు వెచ్చము నిచ్చు వర్తకులు.

ఎలుగుగొడ్లకు తేనె మిక్కిలి ప్రియమయిన ఆహారము. అయినను, ఆ చెంచులకు జడిసి అవి తేనెతెట్టెలను, ముట్టుకొనవని భా.— ఎలుగుగొడ్లను కోమటులుగను, తేనెతెట్టెలను, అంగళ్ళయందమ్మకమునకు సిద్ధముగా పెట్టియుంచబడిన తేనెగను చెప్పుట చమత్కారము.

వాటివాటిలోన్ = ఆయావస్తువులలో, తాటోటుచేసి = మోసముచేసి, అటుమటింపకయుండన్ = కాజేయకుండునట్లు పై అద్దికముగన్ = పైకావలిగా, *ఏవన్ = మిక్కిలి జాగరూకతతో, కనిపెట్టి తిరుగాడు - విశ్వాసులు = పారాయిచ్చుచుండు నమ్మకమైన బంటో(?)తులు, జాగిలములు.

---

* పూ. టీ. 'ఏవన్ = వ్యాజముచేత.'

'ఏవ'కు వ్యాజమనే యర్థ మేకోశముననులేదు. "ఎచ్చరిక యెచ్చరించేవ... యననొప్పు నవధానము." (ఆం. భా. 1-128) ఏవ=యావ. (చూ. ౭౫ వ పద్యము) శ. ర. లో 'ఏవ = రోత' అని మాత్రమే యున్నది.

చెంచులకు అడవిపందులు సేద్యగాండ్రు; సింహములు నెచ్చెలులు; బెబ్బులులు గొల్లలు; ఎలుగులు వాడుక కోమట్లు; అనుటచేత ఆ చెంచుల దర్పమత్యంతమని వ్యంగ్యము. అట్లే,జాగిలములు సింహవ్యాఘ్రములమీద అధికారమును చలాయించు పారా జవానులనుటచేత, ఆ జాగిలములు సింహాదులకంటెను శౌర్యవంతములని వ్యంగ్యము.

♦ సీ. ఒకసింగ మల్లసత్తికిఁ గ్రిందు సొచ్చుట
మా◊డాక కటునిల్వ నోడి కాదె?
వాలుఁదోల్పంది పాతాళంబుఁ దూఱుట
మాడాక కటునిల్వ నోడి కాదె?
హరిణం బొకటి రాజు †శరణంబుచొచ్చుట
మాడాక కటునిల్వ నోడి కాదె?
వడి దచ్చియేనుఁగుల్ కడభూమిఁ జేరుట
మాడాక కటు నిల్వ నోడి కాదె?

గీ. కనుగలిగి ముందె తప్పించుకొనియెఁ గాక
కొట్టి కోలాహలము చేసి కూలఁ గుమ్మి
చెండి చెకపిక లాడమా యుండె నేని?
మించి పోయినసుద్దుల నెంచ నేల. ౭౪

---

♦ కొన్ని ప్రతులలో లేదు.

◊ శా. పా.—‘మాధాక...నోడికాదె.’

ఈ పాఠమున డ-ధ ప్రాసము; అప్రశస్తము. ‘డాక’ సాధురూపము. (చూ. శ. ర.) వాడుకలో, దారము - ధారము; గాలి - ఘాలి; బావి - భావి; అయినట్లే, డాక - ఢాక, అయినవి.

† శా. పా.—‘శరణంబుఁ జొచ్చుట.’

శరణముచొచ్చు; శరణుచొచ్చు, అనునవి క్రియలు. కావున ‘శరణంబుఁ= శరణును, చొచ్చు = ప్రవేశించు’ అను నర్థముగా, ‘శరణంబుఁ జొచ్చు’; ‘శరణుఁజొచ్చు’ అనుట సరికాదు. (చూ. శ. ర.) శాస్త్రిగారి వ్రాతలలో సర్వత్ర అసాధురూపమే కనబడుచున్నది.

టీక.—ఒక సింగము, అల్ల...సొచ్చుట = ఆశక్తి (పార్వతి) క్రిందదూరుట (వాహనముగా నుండుట యని భా.); వాలు తోల్పంది = మిక్కిలి శౌర్యము కలదియైన ఆదివరాహము, పాతాళంబుఁ దూఱుట= పాతాళలోకమున తలదాచు కొనుట (సముద్రమున మునిగిన భూమి నుద్ధరించుటకు దానిక్రిందికిపోవుట-అని భా); హరిణంబు = జింక-ఒకటి, రాజుఁ శరణంబు-చొచ్చుట = ప్రభువు నాశ్రయించుట. (చంద్రునిలో (మచ్చగా) నుండుట యని-భా.); దచ్చియేనుఁగుల్ = అష్టగజములును ('తనరు నిరునాలు గనిమిది దచ్చి యనఁగ'—ఆం. సం.) కడభూమిఁజేరుట = ఎవరికిని అందుబాటు గాని చిట్టచివర ప్రదేశమున నుండుట (కడ భూమి = దిగంతము, అని భా. 'దెస దిక్కు కడ యన దిశ యొప్పు'-సాంబ. దేవ. ౨౦.) మాడాకకు = మా దెబ్బకు, అటునిల్వఁ ఓడి కాదె = నిలువలేకనే కదా. కనుగలిగి = జాగరూకతగలిగి, ముందె-తప్పించుకొనియెఁగాక = బ్రతికి పోయినవిగాని. ఉండెనేని = ఇప్పుడిక్కడ ఉన్నయెడల, కొట్టి కోలాహలము చేసి = అల్లకల్లోలముచేసి, కూలఁగ్రుమ్మి = పడబొడిచి, చెండి = చంపి, చెకపికలాడమా = కకపికలుచేయమా? మించిపోయిన సుద్దులఁ = కడచిపోయిన కథలను, ఎంచనేల = అనుకొనియేమి ప్రయోజనము!

'క్రిందు సొచ్చుట' జాతీయము. "వాడికింద జొరబడ్డాను"-వానికి లోబడి వాని నాశ్రయించుకొని యున్నాడు అని భా.

క. * కైవడి మెకములఁ గుమ్మడి
కైవడి మాయావచేవ కనఁ బోయెదుగా
దేవర మా దేవరవలె
వేవేగమె సామి, వేట విచ్చేయవమా. ౭౮

టీక —కైవడిఁ = చేతి జవముచేత (కైవడి యనంగఁ దగు రీతి, కరజవంబు'- ఆం. భా. ౩-౯౨) మెకములఁ = మృగములను, కుమ్మడి కైవడిఁ= (మేము) పొడుచునట్టి విధమును, ♦ మా, యావ — చేవ = మాకుగల మెలకు

*ఈపద్యము పూ. ము. లో, పా ర పా టు న ౭౬ వదిగా ముద్రితమైనది. దానిని గమనింపక శాస్త్రిగారును, వారినినమ్మి వావిళ్లవారును, అట్లే ఆక్రమము గనే ముద్రించినారు. (తంజ. తాళ. ప్రతిలో ౭౮ వదిగానే నున్నది.)

♦ పూ. టీ.—'మా - ఆవ = జ్ఞానము'

ర్షను — ధైర్యమును, కనఁబోయెదుగా = చూచెదవుగదా! దేవర = ప్రభూ, †మా దేవరవలెన్ = మాపాలి దేవునివలె, సామి, వేవేగమె = శీఘ్రముగా, వేఁట విచ్చేయవయా = వేటకు రావయ్యా. ('యావ'—'ఏవ' కు వ్యావహారిక రూపము)

చ.*అన విని మందహాస మొలయం ‡దమితోడ విభుండుపొండు మీ
వెనుకనె వత్తు, నన్నియును వేఁటకు నాయితపెట్టుఁ డిప్పుడే,
యని యచిరత్న §రత్న ఖచితాభరణంబులు పట్టుకోక లి
చ్చినఁగొని చెంచుఱేండ్రపుడు సింగఁడు బూరఁడునై ముదంబునన్.

టీ.—అనన్ - విని, విభుండు = రాజు, మందహాసము = చిరునవ్వు, ఒలయన్ = ఒప్పగా, (అనగా చిరునవ్వునవ్వి.) తమితోడన్ = ఉత్సాహముతో- (మీరు) పొండు - (నేను) మీ వెనుక నేవత్తును; వేఁటకున్, అన్నియును = కావలసిన యెల్ల పరికరములను, ఇప్పుడే, ఆయితపెట్టుఁడు = సిద్ధపరుపుడు, అని, అచి... పంక్తులు.—అచిరత్న = నూతనములైన, §రత్న = రత్నములను, ఖచిత = చెక్కిన ఆభరణంబులు = సొమ్ములను, పట్టుకోకలు = పట్టువస్త్రములను ('చేలములు బుట్టంబు దువ్వలువ చీర కోక వలువయనఁగ.' ఆం. నం. మాన. 27) ఇచ్చినఁ

---

'యావ'ను 'ఆవ' యనుకొనుట తెలియమి. 'ఆవ = జ్ఞానము' అని టీక వ్రాయుట సాహసము.

† పూ. టీ.—'మాదేవరవలెన్ = లక్ష్మీభర్తయైన విష్ణువవలెనే, అతిశీఘ్రముగానే రావయ్యా.'

చెంచులు రాజును 'విష్ణువవలెనే — శీఘ్రముగానే, రమ్మన్నారట! వట్టి మాట. అతుకనివ్రాత.—'మా దేవర; భూదేవర; క్ష్మాదేవర' అను మిశ్రసమాసములు అశ్రుతచరములు. అదియట్లుండగా, పద్యమున కవి చెంచులకు - పాత్రోచితభావముగా, అచ్చ తెనుగు పదములనే వాడినాడు. కావున నిందు 'మా' అను సంస్కృత పదమును చొప్పించుట తప్పు.

*ఇది శా. ప్ర. లో, ౭౯ వ పద్యము.— అందువలన అన్వయక్రమమునకు భంగము.

‡ శా. పా.— 'తమతోడ.'— రాజు చెంచుల కాభరణాదుల నిచ్చినది 'తమితోడ' గాని 'తమతోడ' కాదు. ('తమి'—తంజ. పా.)

శా. పా.—రత్నఖచితాభరణాంబర పంక్తులిచ్చి పంచిన.'—'ఆభరణంబులు వేడ్కతోడ నిచ్చిన.'-పాఠాం.

§పూ.టీ.—'రత్న ఖచిత = రత్నములతో చెక్కఁబడిన సొమ్ములయొక్కయు'

కొని = తీసికొని, చెంచులందఱు), ముదంబునన్ = సంతోషముచేత * సింగఁడై - బూరఁడును - ఐ = ఉప్పొంగి (=సంతోషమున సుబ్బితబ్బిబ్బై)

## —: వేటసన్నాహము :—

క. చనిరంత వేఁటఁ బోవం
　జన మీ రాయిత్తపడి వెసన్ రండనుచున్
　జనవరులన్ జనవరులన్
　‡ మనసరులన్ దొరల ననిపి మహిపతి దానున్. 　　౭౭

టీక.— చనిరి = (చెంచులు) పోయిరి. అంతన్ = అటుపిమ్మట, వేఁటఁ బోవన్ = వేటకుపోవుటకు, చనన్ = తగునట్లు, మీరు, ఆయిత్తపడి = సిద్ధపడి, వెసన్ = త్వరగా, రండనుచున్,- జనవరులన్ = రాజులను, † చనవరులన్ =

---

ఆభరణములయందు రత్నములు చెక్కఁబడును గాని, రత్నములతో ఆభరణములు చెక్కఁబడవు.

* పూ. టీ.—'సింగఁడు = సింహమువంటివాఁడు, బూరఁడున్ = పూరించినవాఁడును.'

'బూరఁ'డనగా పూరించినవాడట! ఏమిపూరించినవాడో? అసలా యర్థమున కాకరమేమో? ప్రయోజనమేమో? పూ. టీ. లో తెలదు. శ. ర. కర్త 'సింగఁడు = కోపించినవాఁడు, బూరఁడు = విజృంభించినవాఁడు' అన్నాడు. కాని, అట్లా పదములను విడదీసి యర్థము చెప్పుట సరికాదు. 'సింగఁడు = కోపించినవాఁడు' అనుటయు సరికాదు. 'ఉత్సాహమున పొంగి' - 'విజృంభించి' అను అర్థములలో 'సింగఁడు బూరఁడై' అనుట జాతీయముగా కనబడుచున్నది.—

చ. "నీయుపకారకృత్యముల్, గుఱిగడవం బ్రియంబు తమిఁ గొండలు కోటులు చేసి చెప్పితిన్. ఉ. చెప్పిన నంతరంగమున సింగఁడు బూరఁడునై." (వేం పం. 4-52)

‡ శా. పా.—'మన సరలన్' ఇది యర్థములేనిమాట. వావిళ్లవారిపాఠమునే గ్రహించినారు. పూ. ము. లో 'మన సలరన్' అని యున్నది. పూ. టీ. లో, 'మనసు అలరన్ = మనస్సు సంతోషింపఁగా' అని యున్నది. జనవరులన్ - చనవరులన్ - దొరలన్, అను వరుసలో, నడుమ 'అలరన్' అని యుండుట శబ్దాలంకారభంజకము. కావున 'మనసరులన్' అని యుండుట యుచితమని నేను భావించినాను.

† పూ. టీ.—చనవరులన్ = 'స్నేహితులను'

ఉద్యోగులను, మనసరులన్ - ద్రిపౌరలన్ = మనస్వులయిన సేనానాయకులను అనిపి = పంపి, మహీపతి, తానున్ = తానుగూడా (మం అ.)

'మనసరి = మనస్వి' అనుటకు,—

క. 'అనయము నిజపరివారం
బనయముగాకుండ నచట నతిశౌర్యమునన్
మనసరియే కేసరి యని
మనసరి రా కొమరుమూఁక మను మనురీతిన్.' (రామా. 1-138.)

(శ. ర. లో 'మనసరి=బుద్ధిమంతుఁడు-' అని యున్నది. అది సరియైన యర్థము కాదు.)

---

చనవరి = చనవుకలవాడు, స్నేహితుడు; ఇది యౌగికమయిన యర్థము. 'రాజకీయోద్యోగి' అనునది రూఢ్యర్థము. (శ. ర. లో లేదు) 'చనవరి = A courtier, a favourite, a pet, (బ్రౌను) రాజసంబంధి జనులను చెప్పునప్పుడు రాజకీయోద్యోగి (=సేవకుడు) అనునదే సంప్రదాయార్థము.

(1) మ. 'నాయకుల్ గాయకుల్, చనవర్లున్ గణికాజనంబులును
బల్ సామంతులున్ మంత్రులున్.' (చంద్రరేఖా 3-11)

(2) ద్విపద—'చతురులై నుతికెక్కు సన్మంత్రులార,
చనవరులార, మా సామంతులార' (గౌ. హ. 2-389)

('చనవరు' లకు, శాస్త్రిగారు లఘుటీక వ్రాయక వదలినారు.)

(3) గీ. 'అన్నిటికిఁ దానె చనవరి యగుచుఁ దిరుగ
నావిధముసెల్లఁ గడు దేవదేవి రోసి.' (మల్ల. విప్ర. 4-15)

(చనవరి యగుచున్ = నౌకరగుచు, అని యర్థము.)

ద్రి పూ. టీ — 'దొరలన్ = ప్రభువులను'

పైన 'జనవరులన్ = రాజులను' అని చెప్పి, మరల దొరలన్ = ప్రభువులను అని చెప్పుట, పునరుక్తిదోషము. కావున 'దొరలన్ = సేనానాయకులను' అనుట యుచితము. దొర = సేనానాయకు డనుటకు,—

క. 'తనదొరలుఁ దానుదారక
దనుజేంద్రుఁడు కార్తికేయుఁదాఁకిన.' (భా. శల్య. 2-188.)

సీ. 'బలములు గడసినఁ గలగుండు వడ దొరల్
దొరలు ద్రెళ్ళినఁ బోదల్ దూలుబలము' (చంద్రా. 6 ఆ.)

‡ గీ. అంతిపుర మేఁగి మజ్జనం బాడి వేఁటఁ
*బోవుతమి డేగపదనుగ భోజనంబు
సేసి యాఖేటవిహారణోచితము గాఁగఁ
దత్తఱంబునఁ గైసేసి; ♦బిత్తరముగ. ౭౮

టీక.— అంతిపురమేఁగి = అంతఃపురమునకుపోయి, మజ్జనంబాడి = స్నానముచేసి, వేఁటఁబోవుతమిన్ = వేటకుపోవు ఉత్సాహాతిశయముచేత, డేగపదనుగన్ = త్వరత్వరగాను - మిక్కిలి తేలికగాను, భోజనంబుచేసి, ♪ఆఖేట... గాఁగన్ = వేటయందలి సంచారమునకు తగినట్లుగా, తత్తఱంబునన్ = ఆదరబాదరగా, కైసేసి = అలంకరించుకొని.— బిత్తరముగన్ = సొగసుగా, (ముందరికన్వయము )

డేగపదను.— డేగ, యిటుతచ్చుచూ ఒకచేపను, అటు పోవుచూ ఒక పిట్టను తన్నుకొనిపోయి తినును. రాజును అట్లే (అరగంటసేపు కూర్చుండి ఆకంఠముగా పట్టింపక) అటొక ముద్ద యిటొక ముద్దగా భుజించెనని, భా.

---

‡ ఈ పద్యము పూ. ము. లో లేదు.

* తా. పా.— 'వేఁటఁబోవుతతి' ('తతిన్ = సమయమందు' అని, పూ. టీ )

డేగపదనుగా భోజనముచేయుటకు కారణము వేటకు పోవుటయందలి 'తమి' గాని, వేటకుపోవునట్టి 'తతి' కాదు. పూ. టీ. లో 'డేగపదను' త్యక్తము. పూ. టీ. కాగితపు వ్రాత ప్రతిలో 'డేగపదనుగన్ = శ్యేనపక్వముగా' అని యున్నది.

♦ తా. పా.— 'చిత్తరువుగ' ('చిత్తరువుగన్ = ఆశ్చర్యముగా, కైసేసి = అలంకారముచేసికొని' అని, పూ. టీ.)

ఆఖేట విహారణోచితముగాఁగన్ కైసేసి, అని ముగియుచుండగా, మరల 'చిత్తరువుగన్ కైసేసి' అని యన్వయించుటెట్లు? ('బిత్తరముగ' అని, తంజ. తాళ. పా.)

♪ పూ. టీ.—'ఆఖేట విహరణము = వేటయొక్క క్రీడ.'
'వేటయొక్క క్రీడ' అనుట తెనుగు సంప్రదాయము కాదు.

సీ. †ఒంటుముత్తెములతో నొంటుకెంపులకాంతి
చెక్కులజవ్వాదిఁ జికిలిసేయ,
♦హురుమంజిముత్యాల యొరగుపాగ మెఱుంగు
నొసలిబిత్తరిబొట్టు ముసుగు వేయ,
జాతినీలపుఁదాళిచాక చక్యప్రభల్
కస్తూరినెఱిపూఁతఁ గుస్తరింప,
సొగసు *సూర్య పటంపు సురివాలు ¶మైఁ దళ్కు
హొంబట్టుదట్టిపై నోలగింపఁ,
గీ. జేతివజ్రంపుఁబిడితోడి చిక్కటారి
చాయ వలెవాటుదుప్పటి ‡సంకుఁదోమ,
రాచిలుక తేజినెక్కెడు రౌ తనంగఁ
జక్కఁదన ముప్పతిల్లంగ జనవిభుండు. ౭౯

టీక.—ఒంటుముత్తెములతోన్ = అంటుజోడులోని ముత్యాలతో, ('పో్రఁగనఁ గర్ణవేష్టన సంజ్ఞయై వెలయుఁ దద్విశేషాభిధానమై చెలఁగు గంటీ లొంట్లు.' ఆం. భా. 2-148.) ఒంటు = కూడియున్న, ('ఒంటుట To agree with one's health'.– బ్రౌను ) కెంపులకాంతి, చెక్కుల జవ్వాదిన్ = చెక్కిళ్ళయందలి జవ్వాజియను సుగంధ ద్రవ్యమును. చికిలిసేయన్ = మెఱుగెక్కించ

† శా. పా.—ఒంటిముత్తెములతో నొంటి కెంపులకాంతి.'—

ఇది పూ. ము. పాఠము. వావిళ్ళవారి ప్రతిలోను ఈపాఠమే యున్నది. అర్థమేమో పూ. టీ కర్తలు చెప్పలేదు. మద. వ్రాతప్రతిలో- 'ఒంటుముత్తెము లతో నొంటు' అను పాఠము లభించినది.—

పాఠాం —హురుమంజిపూసల నొరగ బాఱు మెఱుంగు - నొసలి బంతికి బెట్టు ముసుగు వేయ.' (పూ. ము.) 'యొరగు బాగు మెఱుంగు.' (తంజ. తా. పా.).—

* 'సూర్యపుటంపు.

¶ శా. పా.—'మైతళ్కు'

‡ శా. పా.—'సంకు దోఁప' ('సంకుదోమ' పూ.ము.; మద. తా. ప్రతి.)

పగా.—(ముత్యాలకాంతియు, కెంపులకాంతియు మిశ్రమైనయెడల జవ్వాజి రంగేర్పడును. అందువల్లనే చెక్కిళ్ళయందు పూసియున్న జవ్వాజిపూత ఆ మిశ్రకాంతితో కలిసి మరింత ప్రకాశించినదని, భా.)— ♦ హురు... మెఱుంగు = హురుమంజిదేశపు ముత్యాలు కూర్చిన వంక తలపాగా యొక్క కాంతి, నొసలి బిత్తరి బొట్టుకన్ = నొసటనున్న సోయగపు తిలకమును, ముసుఁగు వేయన్ = కమ్ముకొనగా.— (తలపాగ ముత్యాల తెల్లని కాంతి నొసటి తెల్లని తిలకముతో కలిసి ప్రకాశించినదని, భా.)—

తెల్లని బొట్టుధరించు ఆచారము కలదు.

"స్నానవారి ఘటరాజ దుకూలా,
గౌర మృత్తిలకబిందు ముఖేందుః,
కేశశేష జల మౌక్తికదంతా
తం బభాజ సుభగాప్లవన శ్రీః." (నైష. 21-)

"చంద్రరజమున నొక పూర్ణచంద్రవదన
చంద్రమండల తిలకంబు సఖికిఁ దీర్చె." (శృం. నై. 8-100)

జాతినీలపుతాళి = మేలయిన నీలముల పతకముయొక్క, చాకచక్యప్రభల్ = చకచక కాంతులు, కస్తూరి నెఱిపూఁతన్, కస్తురింపన్ = బుజ్జగింపగా.— (నీలముల కాంతియు కస్తూరివర్ణమును నలుపే కావున ఒండొంటితో కలిసి ప్రకాశించినవని, భా.) సొగసు = అందమైన, సూర్యపటంపుసురెవాలు = * మొకమల్ ఒరతోడి చురకత్తి, మైన్ = పార్శ్వభాగమున, తళ్కు...ధట్టిపైన్ = కాంతులీనుచున్న బంగారువన్నె పట్టు దట్టిమీద, ఓలగింపన్ = (కొలువై) యుండగా (రాజు పట్టుదట్టీకట్టుకొని,

---

♦ వ్యా. టీ.—'హురుమంజి = శ్రేష్ఠమైన.'

'హురుమంజి' ఒకదేశము. ఆదేశపు ముత్యములు శ్రేష్ఠములని ప్రసిద్ధి. అంతేగాని, 'హురుమంజి'= శ్రేష్ఠమైన—అనునర్థమునిచ్చు విశేషణము కాదు. అనగా, హురుమంజి కవిత్వము; హురుమంజిపాట; హురుమంజికూర, అని విశేషణముగా వాడకూడదు

* పూ. టీ.—'మొకమల్ పట్టుయొక్క— కత్తియొక్క— మైతళ్కు= దేహకాంతి,...కాసెమీఁదను కొలువుతీరియుండగా—ప్రకాశింపగా.'

పట్టుకును, కత్తికిని దేహముకలదా? కత్తి ఒరలోగదా ఉండునది? దాని కాంతి కాసెమైని ప్రకాశించుటెట్లు?

మొకమల్ పట్టువేసికుట్టిన యొరలో కత్తిని పెట్టి, దానిని దట్టీమీద ఒకవైపున వ్రేలాడదగిలించుకొన్నాడని, భా.)

చేతి...చాయ.— చేతి = తనచేతనున్న, వజ్రంపు పిడితోడి = వజ్రపు పిడిగల, చిక్కటారి = (చికి + కటారి) చిన్నకత్తియొక్క, చాయ = కాంతి, వలెవాటు దుప్పటి ❡ సంకుఁ = వల్లెవాటువస్త్రము నెడు శంఖమును, తోమఁ = పరిశుద్ధిచేయఁగా.— (చికిలిచేసిన కత్తియొక్క తెల్లనిడాలు, శంఖమువలె తెల్లనైన వల్లెవాటుపై ప్రసరించినదనియు దానిచే వల్లెవాటు వస్త్రము మిక్కిలిగా ప్రకాశించినదనియు, భా.):— రా చిలుక...తనంగఁ = మన్మథుడో అన్నట్లు (మన్మథునికి చిలుక వాహనము.)

గీ. నగరు వెలువడి వేఁటసన్నాహమునను*
హితులు మన్నీలు దుర్గాధిపతులు దొరలు
వేత్రహస్తులు రౌతులు వీరభటులు
బలసి ♦యిరువంకలను జేరి కొలిచి రాఁగ. ౧౦

టీక.— వేఁట సన్నాహమునను = వేటకుపోవు ప్రయత్నముతో, హితులు, మన్నీలు = చిన్నచిన్న రాజులు (మన్నెమనగా సమ్మానించియిచ్చిన భూభాగము, అట్టిప్రదేశములకు ప్రభువులయినవారు మన్నీలు.) దుర్గాధిపతులు = కోటలుఁగల పెద్దరాజులు, దొరలు = సేనానాయకులు, వేత్రహస్తులు = బెత్తాలవారు

---

❡ పూ. టీ.—(చిన్నబాకుయొక్క కాంతిచేత) 'సంకుదోఁప = సందేహము కలుగఁగా.'

ఏమి సందేహము కలిగినదో! ఆసందేహము కలుగుటకు కారణమేమో! పూ. టీ. లో తేలదు. అసలు 'సంకు' అను పదమునకు 'సందేహము' అను నర్థమెక్కడనున్నదో నాకు కనబడలేదు. 'సంకు' శంఖ శబ్దభవము. 'శంక' శబ్దభవము కాదు. (చూ. శు. ని.)

"సంకు వలమురి యనఁగ శంఖము వెలయు." (సాంబ. దేవ-14)

'దోఁప' అనుపాఠముతప్పు. 'సంకుదోమ' అను పాఠము, పూ. ము. నను మద. తా. ప్రతిలోను, ఉన్నది.

*శా. పా.— 'సన్నాహమునకు. (ఇది పూ. ము. పా.)

♦పాఠాం.— ఇరుదెసబలమంత' 'ఇరుపక్కియలను'

రౌతులు = రాహుత్తులు (= గుఱ్ఱపురౌతులు) వీరభటులు = వీరులయిన బంట్లును, బలసి = పరివేష్టించి, ఇరువంకలను = కుడియెడమలను, చేరి, కొలిచిరాఁగా, (రాజు) నగరువెలువడి = అంతఃపురమునుండి వెలువడి (ముందరికన్వయము)

సీ. మురువైన చక్కని మొగముట్టు సవరించి
నవరత్నమయ ఖలీనం బొనర్చి
పచ్చసూర్యపటంపుఁ బల్లంబు ఘటియించి
*బిరుదుఁదలాటంబు నిరవుకొలిపి
చికిలిచేకాటంపుఁ బికిలి కుచ్చు లమర్చి
యపరంజిపక్కెర యలవరించి
సముకట్టుజల్లులు సమకూర్చి యిరువంక
గొరకసింగిణిపోమల్ గూర్చికట్టి
గీ. పంచకము మొమ్మ విరివియై పరిఢవిల్ల
మోడి శిర స్సెత్తరముఁ గల్గి మొయిలులోని
జలము త్రేనోపు పాదరసంబు వంటి
యుత్తమాశ్వంబు సాహిణి మొకఁడు నిలుప. ౮౧

టీక.—మురువైన = సొగసైన, మొగముట్టు= గుఱ్ఱముముఖమునకు తగిలించు భూషణము, ('మొగముట్టనఁగ నశ్వముఖభూషదనరు.'-ఆం. భా. 2-199) సవరించి, నవరత్నమయ ఖలీనంబు- ఒనర్చి = నవరత్నములుచెక్కిన కళ్ళెము పెట్టి, పచ్చ... పల్లంబు = పచ్చని మొకమల్ పట్టుజీను (పల్లము. పరి. పల్యాణము)

---

* శా. పా.—'బిరుదుఁదలాడంబు' ('బిరుదైన తలగడను.'—పూ.టీ.)

గుఱ్ఱము తలమీద బిరుదుగా నుంచదగినది 'తలాటము' గాని 'తలాడము' కాదు. 'తలగడ' కానేకాదు.

(1) సీ॥ "తలాటమంచనఁగ నశ్వశిరోధి, భూషణసంజ్ఞయై పొసగుచుండు"
(ఆం. భా. 2-199)

(2) "తలాటము = (తల + ఆటు.) పికిలిపిట్టల ఈకలు లోనగు వానిచే కేర్పఱచి గుఱ్ఱము నెత్తిని నిలువుగా నమర్చెడు తురాయి."
(..., ర.)

ఘటించి = అమర్చి, బిరుదు తలాటంబుక్ = బిరుదైన తురాయిని (=తలకుచ్చును) ఇరవుకొలిపి = శిరసుపై నెలకొలిపి: చికిలి = మెరుగులుపెట్టిన, చొకాటంపు = అందమయిన, పికిలికుచ్చులు = పికిలిపిట్ట యీకలతో కట్టినకుచ్చులు, అమర్చి; అపరంజిపక్కెర = మేలిమి బంగారు కవచము, ('శశ్వేతనుత్రాణ మడరుఁ బక్కెరయన.'- ఆం.భా. 1-199. ఇక్కడ కవచమనగా గుఱ్ఱముదేహముమీద కప్పు వస్త్రమని, భా.] అలవరించి = అలంకరించి; పసకట్టుజల్లులు = కవచమునకు సంబంధించిన జాలరులు, సమకూర్చి; గొరక = బాణములయొక్క యీకలు. (గొరక, ప్రి.

---

(3) 'పేలిపంచె తలాటంబు పేరొజంబు.' (మను. 4-28)
('పేలిపంచె తలాటంబు = పికిలిపిట్ట యీకెల తురాయిన్ని'- జూబూరు వారిటీక)

(4) సీ. 'జేజేలరాయని తేజీ తలాటమై
పరఁగెడు పికిలిపూఁబంతియనఁగ.' (యయా. 2-104)

(5) సీ. 'ఉపసుధర్మాస్థాని నున్న వేలుపుఁ గత్తె
లానికి బట్టు తలాటమనఁగ.' (వరాహ. 4-145)

(6) సీ. పచ్చలుగూర్చిన పయిఁడి పుట్టిముమీఁది
కెంబట్టు జిగి తలాటంబుతోడ.' (చిత్రభార. 4-19 )

ప్రాచీన ముద్రణమునను, పెక్కు వ్రాత ప్రతులలోనుగూడా 'తలాటంబు' అనియేయున్నది. అంతేకాక, యీ సారంగధరకు మూలమయిన నవనాథ చరిత్రమునసైతము— 'బిరుదు తలాటంబు పీలిజల్లెడలు' (పుట. 36) అనియే యున్నది. అయితే, తంజ, ప్రతులలో నొకదానిలోమాత్రము 'తలాడంబు' అని యున్నది. మరిన్ని 'తలాడంబు' అను పదము (వావిళ్ళ) ఉ. రా. 7- 397 లో సీ. 'కళుకు నీల్లంపు సింగంపుఁ దలాడంబు.' అన్నచోటగూడా కనబడుచున్నది. కాని, నిఘంటుకర్తలెవ్వరును ఆరూపమును గ్రహించలేదు. తలాడము, తలాటమునకు రూపాంతరమయినను 'తలగడ' యన్నయర్థము మాత్రము కేవల మసమంజసము. బొత్తిగా అనుచితము.

సింహతలాటము; (= సింహలలాటము) సింహతలాటపు మురుగులు; పులి తలాటము, లోకమున బిరుదచిహ్నములు.

1. ద్వి —'సిరిగులుక్కు రత్నాలసింహతలాట, బిరుదాంకములఁజాలఁ బెంపొందు జవన, తురగంబునెక్కి.' సా. ప్రి. పు. 9)

ఖురాలకము,—'చిన్న నేజయుం నమ్ము చెలంగును గోరకనా' ఆం. భా. ౬_44.) సింగిణి= కొమ్ముతో జేయబడిన ధనుస్సులయొక్కయు. (సింగిణికి మొదటిరూపము సింగాణి. ప్రి. శార్ఙ్గము.) పొదుల్ = కట్టలు.— *పంచకము = పిరుదుభాగము, ఆొమ్ము = ఎదురురొమ్మున్ను, విరివియై = విశాలమై, పరిఢవిల్లఁగ = ఒప్పఁగా, §మోడి = బింకమును, శిరసు + ఎత్తరము= శిరస్సుయొక్క యౌన్నత్యమును,కల్గి, మొయిలులోని జలముఁగ = మబ్బులలోని నీటినైనను, తేనోపు = తీసికొని రాఁగలిగి నట్టిదియు (అనగా మబ్బులలోని కైనను చెంగలింపజాలిన లాఘువము కలదియు.) పాదరసమువంటి = పాదరసమువలె చురుకుదనమును పరువులువారు స్వభావ మును కలదియునైన, ఉత్తమాశ్వంబును, సాహిణి= గుఱ్ఱపువాడు, నిలుపఁగ = తెచ్చి యెదుటనిలువబెట్టగా.

చురుకైన గుఱ్ఱమును పాదరసముతో పోల్చుట పరిపాటి.—

గీ. 'సరిదొరలు దండనొరయ నాస్థానమండ
పమున నిలుచున్న యంతలోఁ బాదరసము
ఝోకగలతేజి, నింను సంజోకఁజేసి
యెదుట నటుదెచ్చినిల్పె సాహిణియొకండు'		(శుక. 1–2౮౦)

ద్విపద.—'పరగఁబన్నినయట్టి పాదరసంబు
కరణిఖంజిల్లు తొక్కనిచోట్లు దొక్కు
తురగరత్నము'.		(నవనాథ - పు. 86.)

---

* పూ. టీ.—'పంచకము = గుండెలు.'

గొప్పపొరపాటు. పంచకము = పిరుదుప్రదేశముగాని, గుండెలుకావు సీ. 'పంచకంబన నశ్వ పశ్చాత్ప్రదేశమా' (ఆం. భా. 2-200) శ. ర. కర్త 'పంచకము= అశ్వముయొక్క పశ్చాత్ప్రదేశము' అని యర్థముచెప్పి, అందుకే 'సారంగ'పద్యమునే యుదాహరించినాడు.

§ శా. పా.— 'మోడి శిరసెత్తుటయు' ('మోడిఁగ = శృంగారముగా' అని, పూ. టీ.)

'మోడి' కి శృంగార మను నర్థము నిఘంటువులలో లేదు. 'శిరసెత్తరము. తంజ. తా. పా.

ఉ. *ఉక్కడమైన మంచి †తనువొప్పెడు నా హయరత్న, మెక్కినన్
గక్కస మేమి లేక రవగాలును జోడన ♦యడ్డవేడెముల్
లుక్కడువాళి జంగనడలుం గనిపించుచుఁ బోయిపోయి, రా
జక్కడ వన్నె సోఁక నటు హాయనినన్ గదలెన్ జరీలునన్. ౮౨

టీక.—ఉక్కడమైన = ఉన్నతమయిన, మంచి తనువు – ఒప్పెడు = చక్కని శరీరముగల, ఆ హయరత్నము, ఎక్కినన్ = రాజు – ఎక్కగా, కక్కస మేమిలేక = నడకలో పొటుదన మేమాత్రమునులేకుండా, రవగాలును = ముందరి

---

* శా. పా.— 'ఉక్కళమైన' ('ఉక్కళము, = ఉన్నతము, పూ.టీ.)

'ఉక్కటమైన' పూ. ము ; 'ఉక్కళమైన'. (బ్రౌ. - తంజ. ప్రతులు; 'ఉక్కడమైన' శ. ర.— శ. ర. పాఠమే సాధువు, ఎట్లనగా:—

ఉక్కడము; ఉక్కళము; భిన్నపదములు. ఉత్కట - భవము ఉక్కడము = (విశేషణము) గొప్ప. ఉక్కళము = (దేశ్యము; విశేష్యము.) శత్రువుల రాకను కనిపెట్టుటకై యుంచిన కావలి; (వైకృ) పట్టణమునకు పోవు రాజమార్గము. (చూ. శ. ర.) సీ. 'ఉపనిష్కరంబొప్పు నుక్కళమున'. ఆం. భా. 2-9. ('ఉపనిష్కరంబన నుక్కళంబమరును' అని, సూ. ని. పా.)

'ఉక్కళము' నకు, ఉక్కడము; ఉక్కణము, అను రూపాంతరములు కలవు గాని, ఉత్కటార్థకమైన 'ఉక్కడము' నకు – 'ఉక్కళ' మను రూపాంతరము లేదు, కావున 'ఉన్నతము' అను నర్థమున 'ఉక్కళమైన' అను పాఠము సాధువు కాదు.

† శా. పా.— 'మనువొప్పెడు' ('మనువు = జాతి' పూ. టీ.)

'మనువు' నకు 'జాతి' యను నర్థము కోశములలోలేదు. 'హనువొప్పెడు' అని, శ. ర. 'తనువొప్పగ' అని, మద. తా. పా.

♦ శా. పా.—'అడ్డవేడెముల్లుక్కుదువాళి.' (దుక్కుదువాళి= మఱుఁగుపడి నట్టిదవుడు' పూ. టీ.)

ఈపాఠము, అర్థముగూడా సరియైనవికావు, 'అడ్డవేడెముల్ – లుక్క' అని సాధుపాఠము. టీకాసహితమైన కాగితపు వ్రాతప్రతిలోను మద. తాళ. ప్రతిలోను, 'రవగాలు' అను పదము క్రింద బ్రాహ్మ్యమునను, ఉన్నది.— శ. ర. లోను, సూ. ని. లోనుగూడా 'లుక్క' 'ఉలుక్క' గా పఠితమైయున్నది; ప్రమాదము. (వివరములకు. చూ. విక్రమ – ఉగాది సంచిక.)

రెండుకాళ్లొకమారును — వెనుకటి రెండుకాళ్లొకమారును, ఎగురునట్లు నడచునడక. (=ఆస్కందితము) జోడన = చౌకళించి దూకుట, (=ధౌరితకము.) అడ్డవేడెముల్ పాముసడకవంటి నడకలును (=రేచితము.) ఉరుకు = మెల్లని నడక, ('చనును — లుక్కనఁగ నీచగతి పేరు.' ఆం. భా. 2-198.) దువాళి = సమవేగముగల నడక, (=ప్లుతము.) ♦జంగ నడలుఁ = కాలు చాచివేసి నడచు నడక (=జంఘాలగతు) లున్న, కనిపించుచుఁ = ప్రదర్శించుచు, పోయిపోయి, రాజు, అక్కడ= పొట్ట క్రింద, వన్నెసోఁకఁ = (కాలి) అంకెము తాకునట్లుగా, హో - అనినఁ = హో యని యదలించగా, జకేలునఁ = వెంటనే - శీఘ్రముగా, కదలెను.

రాజు గుఱ్ఱమునెక్కి కాలియంకెవన్నెయ పొట్టక్రింద తగులునట్లు తన్ని యద లింపగా, ఆగుఱ్ఱము పలురకములయిన నడకలు చూపించుచు పోయె నని, తా.

గీ. ఎనయఁ ‡ గడుజోడగించి త్రోలినహయంబు
దనువక్షంబు నేలపైఁ దాఁకినటుల
నోరిలోఁ గాళ్లు వెళ్లెడునో యనంగఁ
గంచుమించుగ ధరణి గ్రిక్కదలఁ గదల. ౮౩

టీక.—జోడగించి = జోడన అను గతివిశేషమునకు పురికొల్పి (జోడన = చౌకళించి దూకుట.) త్రోలినఁ = కదలింపగా, హయంబు, వక్షంబు = రొమ్ము, నేలపై తాకినట్లును, నోరిలోఁ = నోటిలోనుండి, కాళ్ళు, వెళ్ళెడినో - అనంగఁ = వెళ్లివచ్చుచున్నవో అన్నట్లును, (ముందరికాళ్లు ముందరికిని, వెనుకటి కాళ్లు వెనుకకును, పూర్తిగాచాచి రొమ్ము నేల కంటుచున్నదో యన్నట్లుగా సాగి పరుగెత్తునప్పుడు, ముందరికాళ్లు మూతికంటుచుండును; అప్పుడు చూచువారికి ఆ కాళ్లు నోటిలోనుండి వెళ్లివచ్చుచున్నవో అన్నట్లే కనబడుచుండును. *కంచుమించు

---

♦పాఠాం — 'జిల్గునడలుఁ' (శ. ర.)

అశ్వగతి విశేషమయిన 'జంగ' ను వదలి విశేషణమాత్రమయిన 'జిల్గు' ను గ్రహించుట యుచితమగునా?

‡ శా. పా.— 'చెవిఁబొడిగించి' (పూ. టీ. లేదు.)

'కడు బోడగించి' అని, పూ. ము; శరలో 'జోడగించు' అను పదము క్రింద సరియైన పాఠమున్నది. పూ. ము. లో 'జో' కు బదులు 'బో' యుండుట అచ్చుపొరపాటు.

* పూ. టీ.— 'కంచుమించుగఁ = అగపడకపోవునట్లుగా'

గన్ = అత్యంతవేగముగను, ధరణి గ్రక్కదలన్ = భూమి దద్దరిల్లగాను, (గుఱ్ఱము) కదలన్ = కదలగా.

'నోరిలో వెళ్లెడునో' అనుచోట 'ఉండి' కి లోపము. (చూ. బాల. కార. 11.) 'నూతిలో వెలువడఁ గోమలిందిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్' (భార. ఆది. 3-144.)

గీ. అసమతురగ సమారూఢుఁ డైనవిభుఁడు
కదలునప్పుడు దిక్కులు గగనతలముఁ
గప్పెఁ గెంధూళి సాంధ్యరాగంబు మించి
గదిసెఁ జీఁకట్లు చక్రంబు లొదిగె నంత. ౮౪

ఈపద్యమున అసమతురగాది శబ్దశ్లేషచే సూర్యాస్తమయలక్షణము స్ఫురింపజేయబడినది.

టీక.—♦ అసమ...విభుఁడు.—అసమ = సాటిలేని, తురగ = గుఱ్ఱమును, సమారూఢుఁడైన విభుఁడు = ఎక్కినట్టి రాజు, [అసమ = బేసి (సప్త)సంఖ్యగల తురగములను పూన్చిన తేరెక్కిన (దిన) విభుఁడు = సూర్యుడు, అర్థాం.] కదలునపుడు = ప్రయాణముచేయునపుడు, [క్రుంకుసమయమున, అర్థాం] కెంధూళి = ఎఱ్ఱని దుమారము, సాంధ్యరాగంబున్ మించి = సాయంకాలపు ఎఱుపునుమించి, దిక్కులు - గగనతలంబును, కప్పెను; —[సాంధ్యరాగంబు, మించి = అతిశయించి

---

శ. ర. లో 'కంచుమించు = అగోచరము' అని యున్నది. దానినిబట్టి పూ టీ. వారును 'అగపడకపోవునట్లుగా' అన్నారు. సరికాదు.

"కంచుమించుగా - Rapidly, like a flash.- (పరచుట - అను పదముక్రింద) కంచుమించుగా పరచుట - అడ్డులేకుండా పరుగెత్తుట" (బ్రౌణ్యము.)

వ. "మడమలందాటించిన ఘోటకంబు......కంచుమించుగా బరచుట గగనచరుల వెరగుపరచె" (మను. 4-162)

('కంచు...చుట = అడ్డులేకుండా పరుగెత్తుట'- జూ. టీక.)

♦ పూ. టీ. లో సూర్యప్రస్తావములేదుగాని, 'చక్రములు = జక్కవలు, ఒదిగెన్ = తొలఁగెను' అని మాత్రమున్నది. వేటకుపోవు రాజు ప్రయాణమునకును, జక్కవలు తొలఁగుటకును సంబంధమేమో ఆటీకలో తేలదు.

మరియు, 'ఒదిగెన్' అను నిరనుస్వారక్రియకు 'తొలఁగెను' అని టీక వ్రాయుట పొరపాటు. 'తొలఁగు' అను నర్థమున 'ఒదుఁగు' సానుస్వారము. "శిని

...కప్పెను - అని, అర్థాం] చీకట్లు కదిసెన్ = దుమారము క్రమ్ముటచేత - వెలుతురు తగ్గిపోయెను — [సూర్యుడు వక్రింపుటచేత చీకట్లు, కదిసెన్ = చేరుకొనెను అని అర్థాం] అంతన్, చక్రంబులు = సేనలు, ఒదిగెన్ = అధికమయ్యెను. (ఎక్కడెక్కడి సేనలును ఒక్కటిగా గూడుకొని విస్తారమై రాజు వెంట కదలెనని భావము.) చక్రములు = జక్కవలు, ఒదిఁగెన్ = దాగుకొనెను. [అని అర్థాం.]

'ఒదుగు = అధికమగు'— అనుటకు.—

" అఘమెొకింతయొనర్చిన నది యొకపుడు
కాలమున కొల్లునాటి దుఃఖములు దెచ్చు;
నోదుగఁ జేసినఁ దలయేమ మొదలుగాఁగఁ
గలుగు తెవులుల వేదన గడలు కొలుపు." (మార్కం- 2-87.)

క. వల లురులు బోనులు సివం
గులబండ్లును బొనఁగఁగా జిగురుగుండెల డే
గల జాగిలములఁ గొని యపు
డలబలములతోడ మృగయు లరిగిరి వెంటన్. ౮౫

టీక.—*వలలు (=జాలములు), ఉరులు = ఉచ్చులు, బోనులు = మృగములను బట్టే కపట యంత్రములు, సివంగుల బండ్లును.=వేట కలవాటుచేసిన సివంగులను తీసికొనుబోవు బండ్లును, జిగురు గండెలున్ = పక్షులను పట్టుకొనుటకు బందనపూసి తయారుచేసిన దారపు చుట్టలను, డేగలన్ = డేగ యను పేరుగల (ఒకజాతి) పక్షులను, (డేగ సాధారణ పక్షులను, కుందేలు మొదలగు చిన్న చిన్న జంతువులను వేటాడును.) జాగిలములన్ = వేటకుక్కలను, కొని = వెంట తీసికొని, మృగయులు = వేట కాండ్రు, †అలబలములతోన్ = కలకలధ్వనులతో,

---

మనుమండు నద్దనుజు శీఘ్రమ నాలుగు నారసంబులన్, వెనుకకొదుంగ జేసి" (భా. భీష్మ. 2-228)

కవి, సేనలపక్షమున 'ఒదిగెన్ = అధికమయ్యె' ననియు,చక్రవాకముల పక్షమున 'ఒదిఁగెన్ = దాగె' ననియు, భావించినాడు. పూ. టీ. కర్తలు గమనించలేదు. అందువల్లనే 'చక్ర' శబ్దమునకు 'సేన' లను నర్థమును వ్రాయనేలేదు.

* శాస్త్రిగారి దృష్టిలో, వల - ఉరి ఒక్కటే. శృం. నై. (పు. 209)లో 'ఉరులు= వలలుగా' అన్నారు. (వివరములకు, చూ. 'ఓదార్య' పుట. 12; 109)

†పూ. టీ.—"అలబలములతోన్ = అసేనలతో." ఇక్కడ, అల-బల

వెంటన్ అరిగిరి = ఆరాజు వెంటపోయిరి.

'సివంగి' ఒకజాతి చిరుతపులి. (=సివ్వంగి). సివంగులను వేటకలవరచువాడుక కలదు.

(1) "...వలలును, సివ్వంగులు, కుక్కలు, కృష్ణకురంగంబులు, ముంగిసలు, ఎగ్గులు మొదలుగా వేటకు దిద్దిన జంతువులును." (కాళహస్తి. 3-62.)

(2) "గాటపుబోనులుం జిగురుగండెలు సివ్వంగిబండ్లు" (ఉ. రా. 7.401)

> క. భూభాగనభోభాగ స
> మాభోగనిరోధి మేదురాశ్వవ్రజ రిం
> ఖాభీషణ ఘననినద స
> మాభీలదిగంతబలసమన్వితుఁ డగుచున్. ౮౬

టీక.—భూభాగ...న్వితుఁడు – భూభాగ = భూమియొక్కయు, నభోభాగ = ఆకాశముయొక్కయు, సమాభోగ = వైశాల్యమును, నిరోధి = అడ్డగించుచున్న (అనగా ఆక్రమించుచున్న) దియు, మేదుర = నిబిడమును నయిన, అశ్వ... నినద.– అశ్వవ్రజ = గుఱ్ఱపు గుంపులయొక్క, రింఖా = గొరిజల (ఘట్టన) వలని, భీషణ = భయంకరమైన, ఘననినద = గొప్పశబ్దముచేత, సమాభీల = మిక్కిలి భయంకరములైన, దిగంత=దిక్కుల తుదలుగల, బల = సేనలతో సమన్వితుఁడు = కూడుకొన్నవాఁడు - అగుచున్.

## — వేఁట —

> మ. చని యంతం గనియెన్ బ్రమోదమున నా సర్వంకషోదారధీ
> ఖని, కూలంకషదానతోయరఘుర కృత్కోశల్యమేఘాయితా
> త్యనఘాస్తోకయశోఘనుం డెమట, దుందాభ్రభ్రింకసాశేషపు
> ష్పనిధానావనిజాగ్రగణ్యము విరాజద్దండకారణ్యమున్. ౮౭

ములు, అని రెండు పదములు కావు. 'అలబలములు' ఏకపదము. 'కలకలధ్వనులు' అని ప్రకరణోచితమయిన యర్థము. (మృగయులు గాక వేరేసేన లెక్కడివో?)

(a) "కలకలధ్వని దోఁచు నలబలంబన" (ఆం. భా. 1.121.)

(b) "అలబలము లసంఖ్యములై యలబలములు సేయుచుండ" (విజయ. 3.141.)

(c) "క్షోభమేమాత్రము పుట్టినను – అలబలము వినరామందునా"

—చిన్నయసూరి మిత్రభేదము.

టీక,—సర్వంకష = సకల విషయములను ఒరయునట్టిదియు, ఉదార = గొప్పదియు, నైన, ధీ = బుద్ధికి, ఖని = గని (ఆకరము)అయినవాఁడును, కూలం... ఘనుండు.— కూలంకష = గట్టులనొరయు, దానతోయఝర = దానజల ప్రవాహమును, కృత్ = చేయునట్టి, కౌశల్య = నేర్పుచేత, మేఘాయిత = మేఘమువలె నయిన, (మేఘవ దాచరితం మేఘాయితమ్.) అత్యనఘ = మిక్కిలి పాపరహిత మైన, అస్తోక = అల్పముకాని, యశః = కీర్తిచేత, * ఘనుఁడు = గొప్పవాఁడును. (అనల్పమును అతిపవిత్రమును నైన ఆతని యశస్సు, దానజలప్రవాహమును కూలంకషముగా ప్రవహింపజేయు! మేఘమువంటి దైనది. ఆరాజు గొప్ప దాతయనియు, యశస్వంతుఁడనియు సాముదాయికార్థము.) అయిన, ఆ రాజనరేంద్రుఁడు, ఎదుటన్, † రుంద్ర= విపులములును. ('రుంద్రో విపులమ్'. అమ.) అభ్రంకష= (ఉన్నతిచేత) ఆకాశము నంటుచున్నవియు, అశేషపుష్ప = సమస్తవిధములైన పువ్వులకును, నిధాన = ఉనికిపట్టులును, అయిన, ‡ అవనిజ = వృక్షములచేత, అగ్రగణ్యము = మొదట లెక్కింపదగినది యగు, విరాజత్ = ప్రకాశించుచున్న, దండకారణ్యమును, ప్రమోదమునన్, కనియెను.

'దానాది ప్రభవా కీర్తిః ప్రతాపప్రభవం యశః'.- (దానాదులవలన కలుగునది కీర్తి; ప్రతాపమువలన నేర్పడునది యశస్సు.) అని, కీర్తి యశస్సులకు భేదము చెప్పఁబడియున్నను, కవులభేదముగా వాడుటయును కలదు; అది కవి వివక్షాధీనము. కావున ఈ పద్యమున, దానప్రభవమయిన కీర్తిని యశస్సుగా చెప్పుట తప్పుకాదు.

---

* పూ. టీ.—'యశోఘనుఁడు = కీర్తిచేత దట్టమయినవాఁడు.'

ఘనుఁడనగా గొప్పవాఁడు గాని, 'దట్టమయినవాఁడు' కాదు.

† పూ. టీ.—'రుంద్ర = గొప్పదియైన, నిధాన = నిక్షేపమైనట్టి, వృక్షశ్రేష్ఠములు గలదాని.'

'వృక్షశ్రేష్ఠములు' బహువచనము గావున, 'గొప్పది – నిక్షేపమైనట్టిది,' అనుట తప్పు. రుంద్రనిక్షేపశబ్దములు ఏకవచనమున కనబడుచున్నందున పూ.టీ. కర్తలీతప్పుచేసినారు. (చూ, ౨-౧౩౯ క్రింద.)

‡ పూ. టీ.— 'అవనిజ అగ్రగణ్యమున్ = వృక్షశ్రేష్ఠములుగల దానిని.'

'అవనిజాగ్రగణ్యములు కలది' అని బహువ్రీహిగా చెప్పుట సరసమయిన సరణి కాదు.

మ. కని సొత్తే హరి పుండరీక సపది గ్రస్త ప్రతిత్యక్త దం
తినికాయైణతతుల్ నిరాకుల సముద్వృత్తంబులై †వర్తిలెన్
ఘన నిస్సాణ మృదంగ కాహళ హుడుక్కా భూరిభేరీనిగుం
భన గంభీర విజృంభణ ధ్వని కదంబంబుల్ వనిం బొల్చినన్. ౮౮

టీక.—కని = (ఆ దండకారణ్యమును) చూచి, చొత్తేన్ = అందు ప్రవేశింపగా, హరి...తతుల్.— హరి = సింహములచేతను, పుండరీక = పెద్దపులుల చేతను, సపది = అప్పుడే ('సద్యస్సపది తత్‌క్షణే.' అమ.) గ్రస్త = పట్టుకొనబడి, ప్రతిత్యక్త = విడువబడిన, దంతినికాయ = ఏనుగుల మొత్తములును, ఏణతతుల్ = జింకల గుంపులును, (సింహములచేత ఏనుగులు - పులులచేత జింకలు, అని క్రమము.) ఘన...కదంబంబుల్.—ఘన=గొప్పవియైన, నిస్సాణ=నిస్సాణము, మృదంగము= మద్దెల, కాహళి=బాకా, హుడుక్కా=ఉడుక, భూరిభేరీ=పెద్దనగారా, (అను వాద్యములయొక్క) * నిగుంభన= (రూ. నిగుంఫనము.) కూడికచేత, ♦ గంభీర విజృంభణ = విస్తారమయిన వ్యాప్తిగల (= మిక్కిలిగా వ్యాపించిన) ధ్వనికదంబంబుల్= శబ్దసమూహములు (= అనేకవిధములయిన శబ్దములు.) వనిన్ పొల్చినన్ = అడవి

---

†శా. పా.—'వర్తిలన్' (ప్రవర్తింపఁగా అని, పూ. టీ.)

ధ్వనికదంబంబుల్ పొల్చినన్, దంతినికాయైణతతుల్ వర్తిలన్, అనుట చేత పద్యమున అర్థము పూర్తియగుటలేదు. 'వర్తిలన్' అను క్రియకు అవతలిపద్యముతో అన్వయమునులేదు కావున 'వర్తిలెన్' అని యుండుట యుచితమని నేను సవరించినాను.

పూటీ.—'నిగుంభన = నిండినటువంటి'

'నిస్సాణముయొక్కయు, మద్దెలయొక్కయు...నిండినటువంటి...ధ్వనికదంబములు' అని వారియర్థము. నిగుంభన మనగా, కూర్పు (=కూడిక) గాని, 'నిండినది' కాదు. 'నిగుంభనము'- విశేష్యము. "గుంభనము - Composition, in verse or prose. పదగుంభనము." (బ్రౌను.)

పూ. టీ.—'గంభీ...భణ= అగాధమైన - వ్యాపించుటగల.'

శబ్దముయొక్క 'వ్యాపించుట' కు 'అగాధమైన' అను విశేషణ ముచితముకాదు. అగాధ మనగా లోతయినది. "అగాధ Unfathomable, very deep, bottomless." (ఆప్టి). — శబ్దము వ్యాపించవలసినది వెడలుపుగాగాని లోతుగా కాదు.

యందు నిండుకొనగా, నిరాకుల సముద్వృత్తంబులై — ♦ నిరాకుల = ఆకులత లేనట్టియు, సముత్ = ముదముతోకూడినట్టియు, వృత్తంబులై = జీవనము (= బ్రదుకు) కలవియై, వర్తిలెన్ - (కర్త. - పూర్వోక్తములయిన యేనుగులును జింకలును.)

సింహము, పులి, మొదలగునవి జంతువును పట్టుకొన్న వెంటనే చంపక అప్పటికివదలి, అవతల మరికొంత సేపటికి దానిపై దుమికి చంపి తినును. అట్లే దండకారణ్యములోని సింహములును, పులులును, ఏనుగులను-జింకలను పట్టుకొని పిమ్మట చంపుతలపుతో వదలియుండగా, ఇంతలో రాజుగారి మృగయావాద్యముల చప్పుడు లుప్పతిల్లెననియు, ఆశబ్దముల కదలి అవి పరువెత్తగా, ఏనుగులును-జింకలును చావు తప్పి నిర్భయముగను సంతోషముగను వర్తిల్లెననియు తాత్పర్యము.

క. సెలవిండు లెక్కవెట్టుచు,
'సెల విండు నృపాల' యనుచుఁ, జేరి కిరాతుల్
వలకేల మొ్రక్కి, చూడుము
వల కేల మెకాలఁ దోలవలె మే మునికిన్? ౮౯

టీక.— కిరాతుల్ = వేటవారలయిన ఆ చెంచులు, సెలవిండులు = సెలసు బద్దల ధనుస్సులను (సెల - తొలిరూపము. సెలసు = ఒకచెట్టు) సెలవు + ఇండు = ఆజ్ఞ యియ్యండి-అనుచు, వలకేలన్ - మ్రొక్కి = కుడిచేత నమస్కరించి, మేమునికిన్ = మేమున్నాము గనుక, మెకాలన్ = మృగములను, వలకు + ఏల - తోలవలెను = వలయొద్ది ఆవలలోని కెందుకుతోలవలెను ? (తోలనక్కర లేదు. మేమే వెంబడించి వేటాడుదుము.— అని భా.)

---

♦ పూ టీ— 'నిరా...బులు = వ్యాకులత లేనట్లుగా సంతోషముతో గూడుకొన్న నడత కలవి.'

సంతోషముతోఁ గూడుకొనుట 'వ్యాకులత లేనట్లుగా'; వ్యాకులతయున్నట్లుగా; అని రెండువిధములా ?

'నడత' యనగా నడవడిక. (Conduct; behaviour) సింహాదులవలని బాధ తొలగుటవలన 'నిరాకులము'ను- 'ముత్సహితము'ను అయినది మృగముల బ్రదుకు (=జీవనము- mode of life) గాని, 'నడత' కాదు. వృత్తము = జీవనము. 'వృత్తంస్యాత్...జీవనేవర్తనేపిచ.' (నా. ర.)

'ఉనికి = ఉండుట' అనుటకు:—

చ. "ఎఱుఁగనె నీవు ప్రాంతమున నింతట నంతటనున్కి—" (శృం. నై. 1–104)

సీ. "బాలచంద్రికఁ బొంది పాయక బేతాళుఁ
డొకఁ డున్న వాఁడు, వాఁడునికి తెలియ
నెవ్వరు నెఱుఁగరు" —(దశ. చరి - 3–70)

గీ. పులులఁ జట్టలు చీరి, దుప్పులను లేళ్ల
నేకలమ్ములఁ*గుమ్మి కూరాకుచేసి,
యమరఁ జమరులఁ బట్టి పాలార్తు మిపుడు;
సామి చూడుము నీబంట్ల సత్తు వనుచు. ౯౦

టీక.—పులులన్, చట్టలు చీరి = చంపి, ఏకలమ్ములన్ = అడవి పందులను, కుమ్మి కూరాకుచేసి = నజ్జునజ్జుగా నలుగబొడిచి, చమరులన్ = (ఆడ) సవరపుదుప్పులను (చమరి-బ. చమరులు) పట్టి పాలార్తుము = నిర్బంధించి బాధింతుము.

'కుమ్మి కూరాకుచేయు'; 'పట్టి పాలార్చు'-జాతీయములు, 'పట్టి పాలార్చు' అను క్రియ, పూర్వకృతులయందు 'ఉపేక్షించు' అను నర్థముననేగాని 'బాధించు' అను నర్థమున నగపడదు. (శ. ర.)

క. ఆరభటుల్ విలసిల్లఁగ
వీరభటుల్ గెడపి రపుడు విభుకట్టెదుటన్
సైరిభముల మదవదనీ
చైరిభముల సింహశరభ శార్దూలములన్. ౯౧

టీక.—వీరభటులు = వీరులయిన ఆ బంట్లు, ఆరభటుల్ విలసిల్లఁగన్ = కోలాహల ధ్వనులు చెలరేగగా, విభుకట్టెదుటన్ = రాజుగారి యెట్టయెదుట, సైరిభములన్ = అడవిదున్నలను, మద...భములన్.— మదవత్ = మదముగలిగినవియు, అనీచైః = అల్పములుకానివి, అనగా గొప్పవియు నయిన, 'అత్యనీచైః' అమ.) ఇభములన్ = ఏనుగులను, సింహ శరభ శార్దూలములన్, కెడపిరి = చంపిరి.

---

* శా. పా.—'క్రిమ్మి'

కుమ్మి కూరాకుచేయు - అను నుడిని 'క్రిమ్మి కూరాకుచేయు -అని సవరించుట యనుచితము. 'కుమ్మి కూరాకు' అనుటలోఁగల ఉచ్చారణ సౌందర్యము 'క్రిమ్మి కూరాకు' అనుటలో అంతరించును.

'శరభము' ఎనిమిదికాళ్లు గలిగి సింహమును చంపెడు మృగము. దానికి కన్నులు తలమీఁద నుండును. శరభమునకు, తెనుఁగున 'మీఁగండ్లమెకము' అని పేరు. మహాభారతమున, "అష్టపా దూర్ధ్వనయనః శరభో వనగోచరః" అని చెప్పఁబడినది. (చూ. సు. పరిశో.)

సీ. జిగు రంటిఁటుల*వెఱఁ తగిలి పోనీక యీ
సింగాణి మనుబోతుఁ జెండివైచుఁ,
గమఁకుఁకేఁగయుఁ బోలె వడిఁ దోలి కఱచి యీ
కస్తూరి మృప్పల గావుపట్టుఁ,
♦వ్రాత్రొంచి గొర్లలోఁ దోఁడేలు సొచ్చిన
ట్లీగబ్బి లేళ్ల నట్టిట్టు సేయుఁ,
దగను వైఖరిఁ †దూఁటి తెగువ నీసురగాలి
పీఁటవెట్టినపంది బీఁచ నడఁచు,
గీ. నని యిటులు ‡పేరువేర నాయకునియెదుటఁ
బోటుబంటుఁదనంబులు వేఁటకాండ్రు
మెచ్చి పొగడుచు మెకములమీఁద గొలుసు
లులిపి జాగిలముల నుసికొలిపి రపుడు. ౯౨

---

* శా. పా.— 'వెఱ్ఱదగిలి'.— శ. ర. లో 'వెఱతవులు; వెఱ్ఱవులు' అను రూపములే చూపబడియున్నవి.

♦ పాఠాం.— 'తుండిరించి.'— 'తూండిరించి.'

† శా. పా.— 'వైఖరి దూఁటి'

'చొచ్చు' అను నర్థమునిచ్చు ధాతువు 'తూఁటు' గాని 'దూఁటు' కాదు. దూఁటు= నిందించు. (చూ. శ. ర.)

‡ శా. పా.— 'వేఱువేఱ; (ఇది. పూ. ము. పా.)

'పేరుపేర' అని తంజ. తా. పా. సాధువు. పేరు + పేరు = పేరువేరు, పేర్వేరు.

సీ. 'పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలలతోఁడ వియ్యంబు లందు.' (భాగ. 10 పూ. 1689)

టీక.—(పద్యములోని సింగాణి, కస్తూరి, గబ్బి, సురగాలి, వేటకాండ్రు కుక్కలకు పెట్టిన పేరులు.—) ఈ సింగాణి, జిగురు-అంటినటులన్ = బందనతగులుకొన్నట్లు, వెన్‌తగిలి = వెంటనంటి, మనుఁబోతును, చెండివైచున్ = చంపివేయును;— ఈ కస్తూరి, కదుఁదురీఁగయుపోలెన్ = కందురీగవలె, కఱచి, దుప్పులను, గావుపట్టున్ = చంపును;— ఈ గబ్బి, † తొట్రించి = తొట్రిలజేసి (=తడబరచి) లేళ్లను, అట్టిట్టుచేయున్ =బాధపెట్టి భంగపరచును;— ఈ సుర గాలి, తగరువైఖరిన్ = పొట్టేలువలె, తూటి = చొరబడి, పీఁటపెట్టిన పందిన్ =

---

గీ 'కారవుల సేమ మెల్లఁ బేర్వేర నడిగె.' (ఉద్యో. 2–116)

(శ. ర. లో, 'వేరు = అన్యము. కారవుల సేమ మెల్ల వేర్వేరనడిగె.' అని యున్నది. సరి కాదు )

'పేరు వేరు'- కళిలమీద 'వేరువేరు' అయి, కాలక్రమమున 'వేఱు వేఱు' గా పరిణమించినది. (వివరములకు, చూ. బసవ. పీఠిక. పు. 112.)

† పూ. టీ.—'తొట్రించి = తడఁబడి.'

నడవలేక తానే 'తడఁబడు' బడుగు కుక్క, లేళ్ల నిట్టట్టుచేయునా? తొట్రించు= తొట్రిలఁజేయు (ప్రే.క్రి.) కావున 'తడఁబడి' యని యర్థముచెప్పుట తప్పు.

♦ పూ. టీ —'పీఁటపెట్టిన = కూర్చున్నటువంటి, పందిన్, పీఁచము అణఁచున్ = గర్వము పోగొట్టును.'

పీటపెట్టుట, యనగా ఊరక కూర్చుండుట కాదు. అడిచినను పొడిచినను లెక్కపెట్టక మొండికివేసి మోహరించి కూర్చుండుట.—

గీ. ఈఁటె పోటులఁ బడి ప్రేవు లీదులాడఁ
బోయి పోలేక దగదొట్టి పాదలుసాచ్చి
బెండువడియును జొరనీదు పీఁటపెట్టి
చూపులనె యేర్చుఁ బ్రజ, నొక్కసూకరంబు. (మను. 4–42)

అట్టి సూకరమునైనను, పీఁచమణఁచున్= చంపును' అని ప్రికృతము. 'పీచము = గర్వము, అణఁచున్ = పోగొట్టును' అను నన్వయమ్మున - 'పంది (యొక్క) గర్వము' అని, 'షష్ఠి' చెప్పవలె గాని, 'పందిన్' అని ద్వితీయ చెప్పరాదు. 'పందిఁబీఁచమణఁచు' అనియేమూలము. 'పీఁచమణఁచు' క్రియ, ఏకపదము. ('తుంచెఁ బీఁచమడఁచె...ననొగఁ బొందగు వధించెననుటకు'—ఆం. భా. 3=124.)

మొండికివేసి తూఱ్పున్న పందిని, తెగువన్ = సాహసముతో, పేఁచమడఁచుచున్ = చంపుచు; అని, పేరుపేరన్ = పేరుపేరు వరుసన, * పోటుబంటుతనంబులు = తమతమ జాగిలముల శూరత్వములు, మెచ్చి పొగడుచున్, గొలుసులు † ఉలిపి = మెడగొలుసులు వదలించి, మెకములమీఁదన్ = మృగములమీదికి, జాగిలములను, ఉసికొలిపిరి = కవియించిరి.

చ. ‡ఒడిసెలరాతిచందమున, నుర్వడి సింగిణికోల వాఁడికై
వడి, లగుడాంకటం బఱమవైఖరి, బిస్సున సాళువంబు దూ
ఱెనక్రియఁ దూటఁ బాఱె, కిటిబృందముఁ జిందఱ సేసెఁ జెంచుల
య్యెడమున బాపురే! శుని,నరేశుని మెచ్చఁగఁజేసి తా నవన్. ౯౩

---

* శా. పా.— 'కాటు బంటుఁదనంబులు' ('కొఱికెడు బంటులయొక్క గుణములను' —పూ. టీ.)

'కాటుబంటు' కఱచెడి బంటగును గాని 'కొఱికెడుబంటెన్నటికిని' కాదు. 'కాటు' కఱచు- యొక్క కృదూపము. కఱచు- కొఱుకు, భిన్నక్రియలు. కుక్క 'కఱచుబంటు' గాని, 'కొఱుకుబంటు' కాదు.—('కుక్క కాటుకు చెప్పుదెబ్బ'యని లోకోక్తి.)

'కాటు బంటు-తనము'- అనగా, కాటు బంటుయొక్క భావము గాని గుణము కాదు. ('తన వర్ణకంబు భావార్థంబునందగు.' బా. తద్ధి. 1.) కాటు బంటు = (కాటువేయుబంటు) కుక్క. కాటుబంటుతనము = కుక్క తనము (=కుక్కరత్వము.) అంతేగాని, 'కాటు బంటు = కొఱికెడు బంటులయొక్క, తనంబులు = గుణములు' అని యర్థమేర్పడదు. 'పోటుబంటుతనంబులు, అని, తంజ. తా. పా. ఆపాఠము, పూ. ము. నను ఉన్నది. 'పోటు బంటు = శూరుడు'. శ. ర.

† శా. పా.—'ఉడిపి'

'ఊడదీయు' అను నర్థమున 'ఉడుపు' అను క్రియకు ప్రయోగములేదు. (మెడకు) కట్టిన గొలుసు - త్రాడు, మొదలగునవి 'ఉడుగునవి' కావు. కావున ఉడుపుటకు వీలులేదు. 'ఉలిపి' అని సరియైనపాఠము. తంజ. వ్రాతప్రతులలోను, పూ. ము. నను, 'ఉలుపు' అను పదముక్రింద శ. ర. లోను, ఆపాఠమున్నది. 'ఉలిపి - జాగిలములనుసి- కొలిపి' అను, అనుప్రాస సౌభాగ్యము శా. పా. లో అంతరించినది. పైపెచ్చు అప్రశస్తమయిన ఱ-డ ప్రాసమొకటి తారసించినది

‡ పా. తాం —'ఒడిసెటి'

టీక — అయ్యెడయందు = ఆసమయమున, చెంచులు, ♦శుని — కుక్క, బాపురే = బలే! నరేశునిన్ = రాజును, మెచ్చఁగఁ జేసితి(వి), అనన్ = అని మెచ్చుకొనునట్లుగా, (ఒకకుక్క) ఒడి...మునన్ = ఒడిసెలనుండిపోవు రాయి వలెను, సింగి...వడిన్ = (కొమ్ముతోచేసిన) విఁటెనుండి రివ్వునబోవు బాణము వలెను, లగుడు - అను దేగ, ఆఁకటన్ = ఆకలిచేత, పఱచు వైఖరిన్ = పారు విధమునను, సాళువంబు (అనుదేగ) బిసున్నన్ = రివ్వున, తూఱుడుక్రియన్ = చొచ్చుకొనిపోవు తీరునను, కిటిబృందమున్ = పందులగుంపును, తూఱఁబాఱె= చొచ్చుకొనిపోయి, చిందఱచేసెను= అల్లకల్లోలము చేసెను.

*చ. తికమక గాఁగఁ జేసి నలుదిక్కుల నార్భటి సేయుసారమే
యకముల సెల్గికొట్టి నుఱుమాడుచు నొక్కవరాహ మేఁగెఁ, జే
వకలిమి నప్డు డాయెఱుకువాండ్రదలింపుల కేమి సడ్డ సే
యక తనయిచ్చగా సరగున న్వడివడ్డమదేభమో యనన్. ౯౮

టీక.— ఒక్క వరాహము = ఒక పంది, నలుదిక్కులన్ — ఆర్భటి చేయు సారమేయకములన్ = తన్ను నాలుగువైపులను చుట్టుకొని భయంకరశబ్దములు చేయుచున్న వేటకుక్కలను, ('కౌలేయక స్సారమేయః కుక్కురః' అమ.) తికమక గాఁగఁజేసి = చిందరవందరయై తొట్రుపడునట్లు చేసి, సెల్గి=సెలగి(ముట్టెతో కొట్టి, కోరలతో చీల్చి; అన్నమాట) నుఱుమాడుచున్ = నలినులకలు చేసి

---

♦ ప్రా.టీ.— 'శుని = ఓయాఁడుఁ గుక్క.

రాజనరేంద్రుని వేటకువచ్చినవి 'మగకుక్కలే' గాని 'ఆఁడుఁ గుక్కలు' కావు. (చూ. 95-ప; 106 ప.) కావున 'నరేశుని మెచ్చగజేసిన 'శుని' యును మగదే! 'శునిః' అను, ఇ. పుం. శబ్దమున్నది. ఎక్కడనో కాదు; శ. ర. లోనే.— 'శునిః a dog శునీ a female dog, a bitch.' (ఆప్టి)

ఈతత్త్వమును శాస్త్రిగారెరుగరు. అందువల్లనే, 'ఆముక్త' (పు. 642) లో గూడా 'శుని'కి 'ఆఁడుఁగుక్క' అనియర్థము చెప్పి వింతయైన పదప్రయోజనికను వ్రాసినారు. అంతేకాక 'శుని స్త్రీ లింగము; శ్వానము పుంలింగము' అని సిద్ధాంతముకూడా చేసినారు పెద్దప్రమాదము.

'ఆఁడుఁగుక్క' అన నక్కరలేదు. 'ఆడుకుక్క' అనవచ్చును. (చూ-శ.ర.)

* కొ. ప్రి. లేదు.

చూపుచు; చేవకలిమిన్ = శౌర్యసంపదలచేత, - ఆ యొఱుకువాండ్ర అదలింపులకు, ఏమి = ఏమాత్రమున్ను, సడ్డచేయక = లక్ష్యపెట్టక, విడివడ్డమదేభమో అనన్ = కట్లు తెంపుకొని యెగబడిన మదపుటేనుగో యనునట్లుగా, సరగునన్ = వేగముగా, తనయిచ్ఛగాన్ = తన యిష్టప్రకారము, ఏగెను.

'విడివడ్డమదేభము' అను పద మీక్రిందిపద్యమును తలపునకు తెచ్చుచున్నది.-

ఆ. వె. 'ధర్మతనయ; యుష్మదాజ్ఞానిగళ విని
బద్ధ నగుచుఁ జిక్కువడియెఁ గాక
విజయమత్తగజము విడివడ్డచో సడ్డ
సేటుగలదె విశ్వపతిరియమున?' (ఆర. విరా.)

వ. ఇవ్విధంబున నేకలంపుగుంపుల శునకపరంపరలు చెండాడుచున్న యెడ. ౯౫

టీక.—ఏకలంపు = అడవిపందులయొక్క, శునకపరంపరలు = కుక్కలగుంపులు.

క. వడిఁ దేజిఁ దోలి రా జుర
1 వడి డొంకెనపోటుగా నురఃస్థలి నపు డా
పిడికిటిగొరకన్ వేయన్
బిడికిటి బిట్టెగసి 2బిల్లబీటుగఁ బడియెన్. ౯౬

టీక.—రాజు, వడిన్ = వడిగా, తేజిన్ తోలి = (తన) గుఱ్ఱమును నడిపించి. డొంకెనపోటుగాన్ = వంకరయగుఁగుగల యీటెపోటు పొడిచిన విధముగా, ఉరఃస్థలిన్ = ఎదురురొమ్మును, పిటికిటి - గొరకన్ = (తన) పిడికిలియందున్న బాణముతో, వేయన్ = కొట్టగా, ('చిన్ననేజయమువమ్ము చెలఁగును గొరకనా'

1 శా. పా.— 'రాజుర్వడి'

వడి- (ఉర) వడి; ప్రాసమున శబ్దాలంకారము; కావున 'ర్వడి' అనుట యుచితముకాదు.

2 శా. పా.— 'బిల్ల మీటుగ' (బిల్ల బీటుగ; ప్రా. ము. పా.) 'బిల్ల బీటుగ' అనువాడుకయున్నది. 'మీటుగ' అని దిద్దనక్కరలేదు.— మీటుగన్ అను పాఠమున, బిల్ల మీటినట్లు - అని యర్థము. (బ్రౌణ్యమున 'బిల్లమీటు' కలదు. శ. ర. లో మీటు- బీటు- రెండును లేవు.)

ఆం. శా. 3-44.) పిడికిటి= ఆడపంది, బిట్టైగసి = చంగున పైకెగిరి, బిల్ల బీటుగన్= తల్లక్రిందుగా, పడియెన్.

చ. బలువిలుకాండ్రు మెచ్చ నరపాలకుఁ డేసినయాశుగం ♦బన
ర్గళముగ నేగు కేసరిని గాఁడి రసాస్థలిఁ దూఱఁ బాఱె, నా
వలఁ దనపేరు దాల్చినవాయువుఁ గ్రోలుట యొల్లు భోగిరా
ట్కులమని నాగలోకమునకున్ బగదీర్పఁగఁ బోవుకైవడిన్. ౯౭

టీక:— నరపాలకుఁడు, ఏసిన = కొట్టిన, (ప్రయోగించిన) ఆశుగంబు = బాణము, ('బాణ విశిఖా అజిహ్మగ ఖగాశు గాః' అమ.) అనర్గళముగన్ = అడ్డు లేకుండా, ఏఁగు = పోవుచున్న, కేసరిని = ఒక-సింహమును, ❙ కాఁడి = నాటి (గ్రుచ్చుకొని) ఆవలన్, తనపేరు దాల్చిన వాయువున్ = 'ఆశుగము' అను తన పేరును వహించిన గాలిని ('అనిలాశుగాః'. అమ.) భోగిరాట్కులము = (సర్పశ్రేష్ఠముల సమూహము) సర్పములు, క్రోలుటయొల్లు- అని = ఆహారముగా గ్రహించుట యేమిసబబని, (పాములు గాలినాపటించి బ్రతుకును —'భోగి జిహ్మగాః పవనాశనః' అమ) పగ తీర్పఁగన్ = పాములమీద తనకుగల ఆపగను తీర్చుకొనుటకు,

♦శా. పా.—'అనర్గళ మద నాగ కేసరిని'- '(అడ్డులేని మదపుటేనుగుతోడి సింహమును- (అడ్డులేని గర్వముగల నాగేంద్రుని అనియు.)' -అని పూ. టీ.

'మదనాగ కేసరి = మదపుటేనుఁగుతోడి సింహము' అను టీక సముచితము గాదు. ఈవర్ణనమున మదనాగమునకు ప్రసక్తియును లేదు. 'మదనారి కేసరిని గాండి' అని, మద. తాళ. పా.; 'అనర్గళముగ నేగి కేసరిని' అని, పూ. ము. పా. నే నీ పాఠమునే గ్రహించి 'ఏగి' ని 'ఏగు' గా సవరించినాను.— నాగేంద్రుని గాఁడినట్లు సారస్యము చెప్పుట సరసముగా లేదు. నాగులను చంపుటకు నాగలోకమునకు పోవుచున్నట్లు ఉత్ప్రేక్షింపబడనున్న బాణము ముందుగా— ఈ లోకముననే నాగేంద్రుని కాఁడినట్లు చెప్పుటలో సారస్యమేమి?

❙ పూ. టీ.—'కాఁడి = దూసి'

'కాఁడు'-'దూయు', భిన్నక్రియలు. "కాఁడు = నాటు; దూయు = బాణము నాటివెడలు." (శర) క. "పఱచునొకకడిఁదిఁ బతి మునుఁ, జెమరలకై యేయఁ జిప్పచినఁగఁగ నది యు, క్కుఱఁ గాఁడి - దుస్సిపాఱిన" (మను. 4-45) కావున కాఁడి = దూసి' అనుట తప్పు. ఈతప్పు గౌ - హరి - టీకలోగూడా జరిగినది. "కాఁడి = దుస్సి" (పుట. 107.)

నాగలోకమునకున్ = పాతాళమునకు ('పాతాళం బలిసద్మ రసాతలమ్, నాగలోకః'- అమ.) పోవుకైవడిన్ = పోవుచున్నదో యన్నట్లు, రసాస్థలిన్ - భూమిఁ బాతెన్ = భూమిలోనికి గ్రుచ్చుకొనిపోయెను.

రాజువేసినబాణ మొకసింహము దేహమునుండి యవతలికి దూసి భూమిలో గ్రుచ్చుకొన్నది. ఆగ్రుచ్చుకొనుట యెట్లున్నదనగా- పాతాళముననున్న పాములను చంపుటకు పోవుచున్నట్లున్నది. పాములను చంపవలసినయక్కఱ దాని కేమనగా; తాను ఆశుగము. గాలికిని ఆశుగ మను పేరు కలదు. పాములకు గాలి యాహారము. పాములు తన పేరుగల గాలిని (=ఆశుగమును) తినుటను సహింపజాలక - (ఆశుగరక్షణార్థము) పాములనెల్ల చంపుటకు పాతాళమునకు పోవుచున్నది; కాబోలునని, ఉత్ప్రేక్ష.

ఉ. భూమివరేణ్యుఁ డేయుశరముల్ పులులన్ గఱిమోవ♦నాటుటన్
పై మఱి నెళ్లు నెత్తురులు భాసిలె నా నవి పుండరీకముల్
తాము శిలీముఖంబులుఁ గదా యటు గావున రక్తసీధువాః
స్తోమము లాని కుత్తుకకుఁ దొట్టిన వెళ్లఁగఁ గ్రాసెనోయనన్. ౯౮

టీక.— భూమివరేణ్యుఁడు = రాజు, (వరేణ్యశబ్దము వరార్థమున వాడఁబడినది.) ఏయు శరముల్ = ప్రయోగించిన బాణములు, పులులన్ - ❡గఱిమోవన్ వెనుకవైపున కట్టియుండు ఈకెవరకును, నాటుటన్ = గ్రుచ్చుకొనుటచేత, పైన్ - వఱి వెళ్ళు నెత్తురులు = పైకి ఉబికినరక్తము, (ఎట్లుండెననగా-) అవి = ఆ పెద్దపులులు, పుండరీకముల్ = తెల్లదామరలును, తాము = ఆశరములు, శిలీముఖంబులు = తుమ్మెదలును, ఔఁగదా- (పుండరీకము = పులి; తెల్లదామర. 'వ్యాఘ్రే)

♦ శా. పా.— 'నాటుటల్'

'నాటుటలు - పైకి వెళ్లు నెత్తురులు భాసిలెను' అనుట సరికాదు; నెత్తురులు పైకివెళ్లుటకు 'నాటుట' కారణము. కావున 'నాటుటన్' అనుట యొప్పు. ప్రా. ము. నను, మద. తా. ప్రతిలోను, 'నాటుటన్' అనియే యున్నది.

❡ పూ. టీ.— 'గఱిమోవన్ = పిడిలోని యాఁకలవఱకు.'

'పిడి' కత్తి మొదలగువానికేగాని బాణమున కుండదు.—

"పిడి యనగను త్సరావ్యాఖ్య వెలయుచుండు." (ఆం. భా. 2-215.)

"పిడి— A handle, hilt. haft," (బ్రౌణ్యము).

ఇంకొక విశేషము.- శాస్త్రిగారి మతమున, గఱి = బాణము.

పుండరీకోనా' అమ.) శిలీముఖము = బాణము; తుమ్మెద. 'అళిబాణౌ శిలీముఖౌ.' అమ.) అటుగావునన్ = అందువల్ల,— ¶ రక్తసీధువాఃస్తోమములు అని = ఎఱ్ఱని పూదేనెలను త్రావి, కుత్తుకకున్ తోట్టినన్ = (అ పూదేనెలు) గొంతుకు ఆనగా, వెళ్లఁగన్ క్రాసెనో = వెళ్ళఁగక్కెనో, అనన్ - భాసిలెన్ = ఒప్పెను.

రాజు వేసిన బాణములు పులుల శరీరములయందు నాటుకొన్నవి. అవి నాటిన గాయములనుండి రక్తము బికినది. ఆ యుబికిన రక్త మెట్లుండెననగా?— పులులు (పుండరీకములు) తెల్లదామరలును, బాణములు (శిలీముఖములు) తుమ్మెదలును కావున, ఆ తుమ్మెద లా తామరలలోని యెఱ్ఱని పూదేనను కడుపునిండా త్రాగి, కుత్తుకల కెగదట్టగా, ఆ యెఱ్ఱని పూదేనెను వెళ్లఁగక్కెను కాబోలు నన్నట్లుండెను; అని తాత్పర్యము.

క. నీపాలఁ బెట్టుకొను మవ
నీపాల' యనుగతిఁ జేర నెగసినలేడిన్
జేపట్టి పులిని జీఱె ద
యాపరుఁ డై; రాజమౌళి కది యుక్తమెకా! ౯౯

టీక.—అవనీపాల = రాజా, నీపాలన్ పెట్టుకొనుము = నన్ను నీమరుగున నుంచుకొని కాపాడుము, అనుగతిన్ = అన్నవిధముగా, చేరన్ – నెగసిన

---

చ॥ 'మున్నరి దోరును వెన్కనీ గఱుల్' దగులును' (అలం. సా. సం పు, 15.)— 'గఱుల్ = బాణములు' అని వారిదే టీక.

'గఱి' యనగా 'A wing, the feather of an arrow' అని బ్రౌను పండితుడును, 'పక్షియీక; బాణము ఱెక్క' అని, శ. ర. కర్తయును చెప్పియున్నారు.

¶ పూ. టీ.— 'రక్తసీధువాః స్తోమములు అని = రక్తమనెడి యాసవరస సమూహములను ద్రావి.— ఎఱ్ఱనైన గజమద జలసమూహములను పానముచేసి యని యర్థాంతరము.'

బాణములకు ఆసవము త్రాగుట స్వభావము కాదు. కావున బాణపర్యాయమున 'రక్తమనెడి యాసవ...ములను ద్రావి' అనుట సరికాదు. తెల్లదామరలమీద నున్న తుమ్మెదలు, 'గజమదజల...ములను పానముచేసి, వెళ్లఁగక్కు' ననుట అసంబద్ధాలాపము.

లేడిన్ = ఎగిరి తన సమీపమున దుమికిన లేడిని. (నెగయు = ఎగయు) *చేపట్టి = మన్నించి (= కాపాడి) పులిని, చీరెన్ = చంపెను., రాజమౌళికిన్ = రాజశ్రేష్ఠునికి, అది = అట్లు ఆర్తుని రక్షించుటయు - దుష్టుని శిక్షించుటయు, యుక్తమె కా = ఉచితమేకదా; (రాజమౌళికిన్ = (చంద్రశేఖరునికి=) ఈశ్వరునికి, లేడిని చేపట్టుటయు - శార్దూలమును చంపుటయు, యుక్తమేకదా' అని చమత్కారము- శివుడు సారంగపాణి; శార్దూల చర్మాంబరుడు అనుట సుప్రసిద్ధము.)

ఇట్టి చమత్కృతి రామాభ్యుదయమున కలదు.—

క. తా రాజచంద్రుఁ డగుటను
సారంగముఁ బట్టఁగదియు శార్దూలంబున్
గారించి రాజశేఖరుఁ
డై యాధిపహింపఁ గాన, న విభుఁ డచటన్' (2-80)

చ. సమదగజంబుపై ♦కుఱుకుసామజవైరికి సూటి పెట్టు నా
గమకముఁజూచి భూపతిముఖంబున వ్యాధులమూఁక నిల్వలే
కమితభయాప్తి నోరసిలె; సౌనవు, నేనుఁగు పోవువీథి, సిం
హాము మెడగంట, యెవ్వరోరయుంగల రా నెలవంక బాణమున్?

టీక.— సమదగజంబుపైకి ఉఱుకు = మదపుటేనుగు మీదికి పరుగెత్తుచున్న, సామజవైరికిన్ = సింహమునకు, ('కంఠీరవో గజరిపుః' అమ) సూటిపెట్టు ఆ గమకమున్ చూచి = (రాజు) గురిపెట్టిన పూనికను చూచి, వ్యాధులమూఁక= చెంచులగుంపు, భూపతి ముఖంబునన్ = రాజునెదుట, నిల్వ లేక, అమితభయాప్తిన్= మిక్కిలి భయముచేత, ఓరసిలెన్ = ప్రక్కలకొదిగెను, ఔనవున్ = అదియుచితమే.— ఎందువల్లననగా- ఏనుఁగుపోవు వీధి = అది యేనుగు పరుగెత్తుచున్నమార్గము, సింహము మెడగంట = రాజువేయు బాణము, సింహము మెడలో గంటవలె తగులుకొన బోవుచున్నది. (రాజు సింహము మెడకు గురిచేసినాడన్నమాట.) కాబట్టి, ఆ నెలవంక బాణమున్ = ఆయర్ధ చంద్రబాణమును, ఎవ్వ

* పూ. టీ.—'చేపట్టి = చేతఁబట్టుకొని' శివునితోపాటు రాజుగూడా లేడిని 'చేతఁబట్టుకొనెనా? లేదు. రాజు పక్షమున 'చేపట్టు' (జాతీయము) మన్నించు. 'చేపట్టుట To adopt, to patronize." (బ్రౌను.)

♦ పాఠాం.—'పైనుఱుకు'

రొరయంగలరు! = ఎవరు తాకగలరు! (తాకుట అసాధ్యమని, భా.) ‡ఏనుఁగుపోవు వీథి - సింహము మెడగంటు, అనునవి-ఎదురొ్కనరానిది - చెనకరానిది, అను నర్థములనిచ్చు లోకోక్తులు. ఆలోకోక్తులు ప్రకృతమున సత్యములును నగుట చమత్కారము. ఏనుగుపోవు వీథికి ప్రయోగము లభింపలేదు గాని, 'సింహము మెడగంటు'కు మాత్రము లభించినది.

> చ. కుమతి శకుండు మత్సరముకోటపయిన్ విడువంగ నెంతయున్
> గమలదళంబుమీఁది యుదకంబునుబోలెఁ జలించు నామడెం
> దము, భవదీయ శౌర్య సముద్రగతపాత్రువ నుల్లసిల్లి, సిం
> సింహము మెడగంటవోలె నభయంబునఁ బొందె వసుంధరేశ్వరా."
>
> విక్ర.—4–132.

రాజు మృగమును కొట్టినంతనే పరువెత్తిపోయి ఆ మృగము శరీరమున నాటుకొన్న బాణమును తీసికొనివచ్చి రాజుకిచ్చుట వ్యాధులకు విధి. ప్రకృతమున రాజు వేయు బాణము సింహమునకు తగులబోవుచున్నది. అంతేకాక, అది మొదలే యేనుగు పోవు మార్గము. కావున అటు పోవుటయు, ఆ బాణమును తెచ్చుటయు ప్రాణోపద్రవకారి కార్యములు. అందువలన ఆవ్యాధులు జడిసి తిన్నగా మొగము తప్పింపజొచ్చిరి; అని తాత్పర్యము.

> చ. అల♦వెలయం గజారులహృదంతరముల్ నలి నజ్జు చేసె, సం
> ధిలుతమి ఋక్షసంఘముల తేజము దూలిచెఁ, బుండరీకమం
> డలిఁ దెగటార్చె, నిర్ణద టడంచె, నహాహా! కరచాతురీగతుల్
> విలసిల రాజు నైజగుణవిక్రమముం గొనియాడనయ్యెడన్. ౧౦౧

ఈ పద్యమున రాజు కర్త. రాజ శబ్దశ్లేషచేత చంద్రవిషయ మర్థాంతరము:—

---

‡ పూ. టీ.— 'ఏనుఁ...గంటు. = ఆయర్ధచంద్రబాణము ఏనుఁగుపాటిపోవుచున్నచోట సింహము మెడలోగంటువలె తగులొ్కనునట్టిది' అని మాత్రమే.

♦ శా. పా.—'అలవెనయన్' ('అలవు = అభ్యాసము, ఎనయన్ = కలుగునట్లుగా' అని, పూ. టీ.)

'అభ్యాసము కలుగునట్లుగా...చంపెను' అనగా అర్థమేమో? 'అలవేలయంగజారుల' అని, పూ. ము. 'అలవు - ఎలయన్' అని రాజు పరముగను. 'అల-

టీక — (రాజపరము.—) రాజు = రాజనరేంద్రుడు, కరచాతురీగతుల్ = (శరములను ప్రయోగించుటయందలి) హస్తచమత్కారములు, విలసిలన్ = ప్రకటముకాగా, నైజగుణవిక్రమమున్ = తన వింటినారి పరాక్రమమును, కొనియాడన్ = (లోకము) నుతింపగా, అయ్యెడన్ = ఆప్రదేశమున (=ఆయరణ్యమున) అలవు + ఎలయన్ = బలమేర్పడగా (=ప్రకటముకాగా అని భా.) గజారుల హృదంతరముల్ = సింహముల గుండెలను, ‡ నలినజ్జుచేసెన్ = చిదుచిదుగా కొట్టెను; సంధిలు + తమిన్ = సమకొన్న ఉత్సాహముతో, ఋక్షసంఘముల = ఎలుగు గుంపులయొక్క, తేజమున్ = పరాక్రమమును (=పొగరును) తూలిచెన్ = పోగొట్టెను, పుండరీకమండలిన్ = పెద్దపులుల గుంపును, తెగటార్చెన్ = చంపెను. ఇర్లదటు (ఇర్ల + అదటు) = ఇఱ్ఱులయొక్క మదమును, అడంచెన్ = అణచివేసెను. (జింకలను చంపెనని భా.)

(చంద్రపరము —) రాజు = చంద్రుడు, ('రాజాక్షత్త్రియే రజనీపతౌ' అమ.) కరచాతురీగతుల్ = కిరణములయొక్క చమత్కార ప్రసారములు, విలసిలన్ = ఒప్పగా, నైజగుణ-విక్రమమున్ = తనకు సహజమయిన దీప్తియొక్క విశేషవ్యాప్తిని, (రాజునకు దీప్తి నైజము; 'రాజతే ఇతి రాజా - రాజృదీప్తౌ' సు. ప్ర.) కొని

---

వెలయంగన్' అని చంద్రపరమునను, సరసమైన విభాగము. ఈ సారస్యము పైపాఠమున లేదు ('ఎలయు=కలుగు; ఉన్ముఖమగు;' శ.ర., సూ.ని. 'To increase' బ్రౌను)

‡ పూ. టీ.—'నలి...చేసెన్ = మెత్తనచేసెను.'

నలి- నజ్జు చేయుటయనగా పచ్చడి పచ్చడిగా నలుగబొడుచుట గాని ఊరక 'మెత్తనచేయుట' కాదు.

† పూ. టీ.—'తమిన్ = త్వరతో.'

రాజు ఎలుగుగొడ్లను వేటాడుటలో 'త్వర' యేమిటికో? పూ. టీ- కర్తల వ్రాతలలో ఔచిత్యము చాలాతక్కువ. ఇంకొక విశేషము.— వారు "రాజు = చంద్రస్వరూపుడైన రాజనరేంద్రుడు, తనయొక్క గుణపరాక్రమములను — నుతింపగా, సింహములగుండెలను మెత్తనచేసెను; విటులయొక్క గుండెలను మెత్తనచేసెను" అన్నారు.

రాజనరేంద్రుడు విటులగుండెలనుగూడా మెత్తన చేసెనా? అపరిష్కృతమైన శ్లేషార్థమునకును కర్త రాజనరేంద్రుడేనా?

యాడఁ = లోకము ప్రశంసింపగా, అయ్యెడఁ = ఆసమయమున, అల-వెలయంగఁ = సముద్రపుటలలు అతిశయింపగా, (చంద్రోదయమున సముద్రము లుప్పొంగుననుట ప్రసిద్ధము.) జారుల వ్యాదంతరముల్ = జారిణీజారుల డెందములను, నలినఁ జూచేసెఁ (చంద్రు డుదయింపగానే, సముద్రములు పొంగెననియు, జారిణీజారులు తమ రహస్య వర్తనములు బయలగుటచే వెత నందిరనియు, భా.) సంధిలు తమిఁ = సమకొనుచున్న రాత్రియందు, ఋక్షసంఘముల తేజముఁ = నక్షత్ర సమూహముల కాంతిని ('నక్షత్రమృక్షంభం తారా' అమ.) తూలిచెఁ; పుండరీకమండలిఁ = (తెల్ల) తామరల మొత్తమును, తెగటార్చెఁ = నశింపజేసెను. ఇర్ల = ఇరుల (=చీకటుల) అదటు-అడంచెఁ.

క. వాలమ్ముల దంష్ట్రికర
వాలమ్ముల నెత్తి ♦సెలసి వాలమ్ములఁ ❘బెం
జాలమ్ములఁ దగిలినకిటి
‡జాలమ్ముల దూఁటె నిద్రజాలమ్మునఁగఁ ౧౦౨

---

♦ శా. పా.—'ఎత్తివైచి' (= 'చిమ్మివేసి' - పూ. టీ.)

'ఎత్తియేసి' (పూ. ము.) 'ఎత్తిసెలసి' (తంజ. తా. పా) కోరలను కత్తులుగా చెప్పినప్పుడు- 'సెలసి = నరికి' అనుట యుచితముగాని, 'చిమ్మవేసి' అనుట యేమి యుచితము?

"సెలయుట- To chop, to cut. నఱకుట. '...సెలసి వెంపరలాడు జెట్టిలెల్ల.' మను- 4-16. సెలసి = ముష్టితో తెగనరికి." (బ్రౌను.)

❘ శా. పా.— 'వాలమ్ముల-వే.' ('వాలమ్ములఁ = తోకలతోను వే = శీఘ్రముగా, వాలమ్ములఁ = పెద్దపులులను, ఎత్తివైచి, పందిగుంపులు, దూఁటెఁ = పాఱిపోయెను.' పూ. టీ.)

ఎంతయిందజాలమయినను, పందులు తోకలతోనే పెద్దపులులనెత్తివైచుట అసంభవము. 'ఎత్తివైచి-వే-తగిలిన... జాలమ్ములఁ - దూటెఁ' అనుచోట, 'వే' అను క్రియావిశేషణమును 'వైచి' అను అసమాపకక్రియతో అన్వయించుట తప్పు. కిటిజాలమ్ములు వే తగిలిన వను పాఠ మసాధువు.

పాఠభేదములు.— 'వైజాలమ్ముల.' (పూ. ము.; కొన్ని వ్రా. ప్ర.) '...వేజాలమ్ముల.' (శ.ర.పా.) '...బెంజాలమ్ముల; (మద. తా. పా.).—

‡ శా. పా.— 'జాలమ్ములు' ('జాలమ్ముల.' శ.ర.)

టీక.— వాలు + అమ్ములన్ (తగిలిన), పెంజాలమ్ములన్ - తగిలిన, కిటి జాలమ్ములు = వాడియైన బాణములకు గురియైనట్టియు - పెద్ద పెద్ద వలలలో పడియున్నట్టియు - పందుల గుంపులు, ఇంద్రజాలమ్ము - అనఁగన్ = ఇంద్రజాల ప్రయోగమో (=గారడియో) అన్నట్లు, వాలమ్ములన్ = పెద్దపులులను, దంష్ట్రి కరవాలమ్ములన్= తమకోరలనెడి కత్తులతో (కత్తులవంటి కోరలతో-అన్నమాట.) ఎత్తి — సెలసి = ఎత్తి పారవేసియు- నరకియు, దూలెన్ = పారిపోయెను.

అలుఁగులదెబ్బలుదిని వలలలో పడియున్న పందు లొక్కుమ్మడిగా చెలరేగి వలలనుచించుకొని పరుగెత్తుచూ, తమదారి కడ్డపడిన పెద్దపులులను కోరలతో ఎత్తి పారవేసియు- నరికియు చిందరవందరచేసెను. ఆదృశ్యము చూచుటకు గారడీవలె వింతగానుండెను. అని, తా.

క. ఆవలఁ జించుక వెడలిన
నావలఁ బోనీక చెంచు లప్పు డడ్డం బై
యావల నుఱుమాడినఁ గని
యావలను విభుండు మెచ్చి హర్షము నొందెన్.　　౧౦౩

టీక.—ఆ వలన్ = ఆవలను;— ఆవలన్ పోనీయక = అవతలికి పోనియ్యక, చెంచులు, (పందులను) ♪యావలన్ = మెలకువతో, ('యావ'- ఏవ, కు వ్యావహారిక రూపము.) నుఱుమాడినన్ = వేటాడి చంపగా, విభుండు = రాజు, ♦ఆవలను = ఆ నేర్పును, మెచ్చి, హర్షము నొందెన్ = సంతోషించెను.

---

♪ పూ. టీ.— 'యావలన్ = బలములతో.'

'యావ'ను 'ఆవ' అనుకొనుట అపరిజ్ఞానము. 'ఆవ = బలము' అను టీక నిరాకరము. 25 వ పద్యమున 'ఆవ = జ్ఞానము'' అన్నారు. వారి యిష్టమే యిష్టము.

♦ పూ. టీ.— 'ఆ వలను = ఆయుపాయమును.'

వల చించుకొని విచ్చలవిడిగా పరుగెత్తు పందుల నడ్డగించి నుఱుమాడుట 'నేర్పు' గాని 'ఉపాయము' కాదు.

"వలను = ఉపాయము; నేర్పు." (శ. ర.)

"వలను - Art, skill, stratagem-" (బ్రౌను.)

చ. శ్వసనుని ఘోటి *ఘోటివలెఁ జంగున దాఁటి పయిం జనంగఁ దా
రసముయి యొక్కఁడొక్క యపరంజిపరుం జిగురొత్తువాలు వా
ల్వెసఁ గొని †కొంకి కొంకి దెగవ్రేసిబడిన్ బడి లేటికుంటు మా
నిసిపరు వంట గానఁబడె నేఁడనఁ గానఁ బడంగఁ జీలిచెన్. ౧౦౮

టీక.— శ్వసనుని ఘోటి = (వాయుదేవుని గుఱ్ఱము) లేడి, ఘోటివలెన్ = గుఱ్ఱమువలె, చంగునన్, దాఁటి = లంఘించి, పయింజనంగన్ = పైగా పోవుచుండగా, ఒక్కఁడు = ఒక వేటకాడు, అపరంజి పరుంజు- ఇగురొత్తు = బంగారు పిడితో ప్రకాశించుచున్న, (ఖడ్గాది ముష్టి సంగ్రాహ్యతలము. 'పరుఁజనఁ బరుంజన.' ఆం. భా. 2-215.) ఒక్క వాలు వాలు = ఒక వాడి కత్తిని, వెసన్ కొని = శీఘ్రముగా తీసికొని, తారసమయి = కూడముట్టి, కొంకికొంకిన్ = వంకరగానుండునట్టి కొంకిప్రదేశమును ('మడమయంచనఁగను మనుఁ బార్ష్ణి కొంకినాఁ దదుపరి దేశమై తనరుచుండు.' ఆం. భా. 2-135.) తెగవ్రేసి = తెగనరికి, బడిన్ పడి = వెంటబడి, - లేటికుంటు - మానిసి పరువు, అంటు = లేడి కుంటుచూపోయినను మనిషి పరుగుతో సమానమని లోకమనుట (ఇది లోకోక్తి) నేఁడు కానఁబడెన్ = ఈరోజు కనుపడ్డది, అనగాన్ = అనిచూచువారనగా, కానన్ పడంగన్ = ఆయడవియందు (జింక) పడిపోవునట్లు, చీలిచెన్. (కర్త.- వేటకాడు.)

వేటకాడొకడు, చంగున పైకెగిరిన యొక జింక కొంకిని అందిచాపున తెగనరికెను. తెగిన కాలితోనే ఆ జింక కుంటుచూ పరుగిడజొచ్చెను. వేటకాడు దానిని వెంబడించెను. ఆ దృశ్యమును చూచిన జనులు— 'లేడీ కుంటు మనిషి పరుగుసమానమన్న సామెత నిజమేయైనదనిరి. తుదకా కిరాతుడాజింకను కూడముట్టి చంపెను, అని తా.

క. భటుఁడొకఁడు పందిపోటున
జోటువ్రేలికి సూటి వెట్టి పూని యదల్పన్

---

* పాఠాం.—'పిల్లివలె' (పూ. ము.)

† కా. పా.—కొన్కొంకి ('కొంకికొంకి' పూ. ము.; తంజా. తా.)

గిటి ♦దూఁటి ముట్టెమొనఁ బడ
నటు చిమ్మిన ఱొమ్ము ‡ నాటి యావల వెళ్లెన్. ౧౦౫

టీక.— *భటుఁడొకఁడు = శూరుఁడయిన ఒక వేటకాఁడు, బొటవ్రేలికిన్ = బొటనవ్రేలికి, మూటిపెట్టి = మోపుచేసి, † పందిపోటునన్ = (పందులను పొడుచు) ఈటెతో, అదల్పన్ = అదలించగా, కిటి = ఒకపంది, దూఁటి = నైకిరుమికి, ('దూఁటుట - rush into, run swiftly' బ్రౌను) ముట్టెమొనన్ = లేనమూతికొనతో, అటు పడఁజిమ్మఁగన్ = ఆ యీటెను నెట్టివేయుగా, (అది) ఱొమ్మునాటి = ఆపందియొక్క వక్షమున గ్రుచ్చుకొని, ఆవలవెళ్లెన్ = అవతలివైపునకు వెళ్ళిపోయెను.

వేటకాఁ డొకఁడు బొటనవ్రేలి మోపున పందిపోటు పట్టుకొని ఒకపందిని అదిలించగా, అది యెగిరి వాని మీఁదికి దుమికి ఆ యీటెను ముట్టెతో తట్టివేసెను. అట్లు

---

♦తా. పా.—'దూఁతి' (దూఁతి = చొచ్చి' పూ. టీ.)

ధాతువు 'తూఁటు' గాని 'దూఁటు' కాదు. (చూ. 92-వ పద్యముక్రింద.) 'చొచ్చి' అనుటకంటెను 'నైకిరుమికి' అనుట యుచితతరము. పూ. ము. న 'దూఁటి' 'దూఁతి' గా ముద్రితమైయుండును.

‡ తా. పా.—'తాఁకి'.— తాకినంతమాత్రమున ఱొమ్ములో గుచ్చుకొని అవతలికి వెళ్ళిపోవునా? ('నాటి' తంజ. పా.)

* పూ. టీ.—'భటుఁడు = సేవకుఁడు'

'భటుఁడు' అనుపదమునకు, శూరుఁడు (యుద్ధవీరుఁడు), సేవకుఁడు అని రెండర్థములు. ("భటుఁడు- A servant, or a soldier." బ్రౌను.) మొక్కలించి పందిని పొడిచిన 'భటుఁడు' శూరుఁడగును గాని సేవకుఁడు కాఁడు. ('కందము చెప్పినవాఁడే కవి; పందిని పొడిచినవాఁడే బంటు.' అని లోకోక్తి.) సేవకుఁ డనగా పనివాఁడు. "సేవకుఁడు—A servant, an attendant దాసుఁడు- తమ సేవకుఁడైన- your obedient servant, so and so." (బ్రౌను.)

† పూ. టీ.—'పందిపోటునన్ = బరిసెచేతను.'

నిఘంటువులలో 'బరిస' - 'బరిచి' అనుపదములే గాని, 'బరిసె' లేదు. (చూ. శ. ర.) "బరిస బరిత యనఁ బరిఘ మొప్పు; — బరిచి యీటెయనంగఁ బరఁగుఁ గుంతము." (ఆం. భా. 2—217)

ఆ శాస్త్రిగారు 'విజయ' టీకలోఁగూడా 'తోమర = బరిసెలు' అనియే

త్రుటిలో ఆయాపై నాసికాపుష్పమిడికిబారి కుచ్చుకొనివీపులోకివెళ్ళిపోయెను.
అని - తా.

క. పొత్తియలకడ నెఱియలయెడ
నెఱి యలవడఁ బొంచి శునకనికరము త్రుంచెన్
బ్రాయలుఁగా మురియలుఁగా
ఁ నఱియలుఁగా యన శశముల నుందురులన్. ౧౧౬

టీక.— శునక నికరము = కుక్కలగుంపు, పొత్తియలకడన్ = కలుగుల యొద్దను, నెఱియలయెడన్ = నెఱ్ఱెల (=నేలపగుళ్ళ) దగ్గరను, పొంచి = కని పెట్టియుండి, * నెఱి-అలవడన్ = పరాక్రమ మేర్పడగా, శశములన్ = కుందేళ్ళను, ఉడుము + ఉందురులన్ — ఉడుములను; ఎలుకలను, ('ఉందురుర్మూషికో హ్యాఖుః' అమ:) ఉఱి-అలుఁగా = (ఉడుము మొదలగువానిని పట్టుకొనుటకై చివరన ఉచ్చుతగిలించి యుండెడు) ఉరిగోలవో, అనన్ = అన్నట్లుగా. (పట్టుకొని) † పరియలుఁగాన్ = చీలికలగునట్లుగను, మురియలుఁగాన్ = ముక్కలగునట్లుగను, త్రుంచెన్ = చీల్చివేసెను.

---

అన్నారు. (చూ. పు. 193) ఇంకొకవింత:— గా. హరి. టీకలో, 'పందిపోటును' 'బందిపోటు'గా వ్రాసినారు. (చూ. పు. 31.)

ఁ గా. పా.— 'ఉరియలుగా' ('ఉరియలుగా యనన్=ఉరిగోలయో యనునట్లు, పూ. టీ.)

విశేష్యమయిన 'అలుఁగు'లో అరసున్న ఉండవలె. అరసున్న లేని 'అలుగు' క్రియ. (చూ. శ. ర.)

* పూ. టీ.— 'నెఱి అలవడన్ = క్రమములభించునట్లుగా'— ఇది యర్థములేనివ్రాత. నెఱి = పరాక్రమము. (చూ.శ.ర.)

† పూ.టీ.— 'పరియలుగాన్ = తునుకలుగా'.—

పరియ యనగా 'చీలిక' గాని 'తునుక' కాదు.— 'గదా ప్రహారంబులం దునియలుఁ బఱియలుఁ దుమురులునై' (భార. శల్య. 2-256.) "దిక్కులార్పులం బఱియలు సేయుచున్. (భా. యు. కా.)

"అప్పలుకు కర్ణరంధ్రమ్ములవియ నాత్మ, పఱియలుగఁ దాఁకుటయును."
(మార్కం-౦-పురాణము.)

కెడసెన్ దుప్పులు, డొంకవేసె నెలుఁగుల్, గిట్టెన్ పుల్లు, ల్పింగముల్
కడగొట్టెన్, మనుఁబిళ్లు గంతుగొనె, జింకల్బిద్దె, దోరెం గిటుల్,
మడిసెన్ ♦గారెనుపోతు, లేను లిలిగెన్. మ్రిగ్గెన్ వృకవ్రాతముల్
గడుతుల్ చిక్కె, గజాళి చొక్కె, నపు డక్కాడన్ దమామాఘూళిగన్.

టీక.—మనుఁబిళ్లు = ఋశ్యమృగములు- అడవి, (మను పిడి, ఏకవచనము) కిటుల్ = పందులు, వృకవ్రాతముల్ = తోడేళ్ళగుంపులు, ఏనులు = ముండ్లపందులు, దమామాఘూళిగన్ = ముమ్మురముమ్మురముగా, కెడసెన్, డొంకవేసెన్, గిట్టెన్, కడగొట్టెన్, గంతుగొనెన్, బిద్దెన్, దోరెన్, మడిసెన్, ఇలిగెన్, మ్రిగ్గెన్ = చచ్చెను. కడుతుల్ = గోకర్ణమృగములు, (కడితి, ఏ-వ) చిక్కెన్ = పట్టుపడెను. (చిక్కుటు. To be caught, be en-snared.'- బ్రౌను.) గజాళి = ఏనుగుల మొత్తము, చొక్కెన్ = సోలిపడిపోయెను.

వ. ఇవ్విధంబున భావరేణ్యుం డయ్యరణ్యాని ననేక మృగ విహగఝాటంబుల నిరాఘాటంబుగా గిటడంచి యాఖేటకవిహారంబు చాలించి యెల్లెడలం బెల్లుగాఁ దెళ్ళిన యిఱ్ఱి జింక దుప్పి కడితి మనుఁ బోతు కొండగొఱియ యేదుపంది కుందేలు [1]గురుపోతు మొదల యిన తినుమెకంబులబొందులను శకుంతబృందంబులను బొందుగా నొక్కకందువఁ బోవ్రువేయించి యందులఁ బుళింపులు సొగయ మృగ

---

♦ శా.పా.—'కాఱెను పోతు.'

శకటరేఫము తప్పు (చూ. 70-వ పద్యముక్రింద- 'కాఱెనుప.')

చ. "కోలుపులి సైనను గారెనుపోతు సైన" (భా. విరా. 1-83.)

(పూ.టీ లో 'ఇఱుల్ = హరిణములు' అని యున్నది; కాని ఆ పదము పద్యములో లేదు.)

[1] శా.పా.—'కురుపోతు.' (కుఱుబోతు' పూ. ము.)

'కుఱుబోతు'ను, శాస్త్రిగారు 'కురుపోతు'గా దిద్దినారు. సరియైనరూపము 'గురుపోతు'. 'గురు = మృగవిశేషము.' (శ. ర.)

సీ. 'కాఁచిన గురునెయ్యి చేచాఁపఁ జాలినంత.' (పాండు. 3-87)

ద్వి.—'గురువులు వాఱెడి గురుమెకంబులును.' (నవనాధ. పు. 34)

యాధిదేవతాప్రీతిగాఁ జేయం దగుకృత్యంబు సేయించి యెల్లరకును [2]సమాంశంబులుగా మాంసంబులు పంచి యిప్పించి యుత్తమంబులగు దంతిదంతమౌక్తికనికరంబులు నికరంబులయిన కస్తూరీసంకుమదపంకంబులుఁ బొంకంబులగు చమరవాలజాలంబులు నాదిగాఁగల సమస్త వస్తువులుఁ గైకొని పుష్పరసాది బహుపదార్థంబులు పాకనిపుణపాచక రచితమహిత పిశితఖండంబు లఖండంబులుగా నేదిష్ఠభూమండలాఖండల మండలంబులు నిండు వేడుకలఁ దెచ్చి యొప్పించిన నిష్టమృష్టాన్నంబులు సంతుష్టిగాఁ దానును సకలజనంబులు భుజియించి య య్యేలమావులక్రీనీడలఁ గొండొకసేపు పరిశ్రమంబు వాయ విశ్రమించి యంత నమ్మహనీయోత్తమగంధర్వుండు వరూథినీసమన్వితుండై మంత్రిపుంగవులు కొలంగటం గొలిచిచను దేరఁ గదలి ముందటఁ గంచుకు లెచ్చరించఁ జెంచుల నవలోకించి 'పదియైన పొద్దులు నిలిచి యివ్వనవిశేషంబులు చూడ నభిలాష యయ్యెడు నియ్యడవి నుండ వసతియైన స్థలంబు గలదా' యని యడిగిన న య్యాటవికు 'లయ్యా, యిక్కడికి యోజన త్రయంబున ఘోరకాంతారంబుఁ జొచ్చిపోవ నొక్కరమ్య స్థలంబు [3]గద్దు; తత్ స్థలంబునఁ [4]జుట్టామడపెట్టునం దామర కొలంకులు శృంగారవనంబులు నెడతెగక యుండుఁ దదీయ మధ్యస్థలంబున ననర్ఘోదకంబుల ఘనదీర్ఘిక [5]కద్దందుఁ దొల్లి సీతారా

---

[2] శా.పా.—'సమాంశంబులుగాఁ బంచి.'

పంచినది దేనిని? కర్మ త్యక్తము (సమాంశంబులుగా - మాంసంబులుపంచి.' తంజ. పా.)

[3] శా.పా.—'కలదు' ('కద్దు'– తంజ. పా.)

[4] శా పా.—'ఆమడ వెడల్పున.' ('ఆమడపెట్టున'– తంజ. శా. పా.)

'ఆమడపెట్టు' జాతీయము. దాని నెరుగని వారెవరో 'వెడల్పు' పూ. ము. నన్ దిద్దినారు.

శా.పా.—'కలదు.' ('కద్దు'– తంజ. పా.)

ములు [6] విహరించిరని పెద్దలవలన వినినార మని విన్నవించి దానికిం
దోవపెట్టుచుం [7] జనం జని మధ్యమార్గంబున. ౧౦౮

టీక.—భూవరేణ్యుఁడు = రాజు, అన్యారణ్యానిన్ = ఆగొప్పఅడవి యందు, అనేక...బులన్ = పెక్కుజంతువులయొక్కయు - పక్షులయొక్కయు- సమూహములను, నిరాఘాటంబుగా = అడ్డములేకుండా, గీటడంచి = చంపి, ఆఖేటవిహారంబు = వేటసంచారము, చాలించి; ఎల్లెడన్, పెల్లుగాన్ - తెల్లిన= మిక్కిలిగా చచ్చిన, ఇఱ్ఱికడితి = కణితి (గోకర్ణమృగము), మనుఁబోతు = ఋశ్య మృగము, ( = 'The Gayal, commonly called Bison' - బ్రౌను.) గురుపోతు = గవయము, (అడవి ఆవు- అని, బ్రౌను.) మొదలైన, తిను...లను = తినదగినమృగములకళేబరములను, శకుంతబృందములన్ = పక్షుల మొత్తములను, పొందుగాన్ = చక్కగా, ఒక్కకఁదువన్ = ఒకచోట, ప్రోవువేయించి; పుళిందులు - సొగయన్=చెంచులు ఆనందమున చొక్కగా, మృగ...ప్రీతి గాన్ = వేటనురక్షించు కాటేరుడు మొదలగు వేలుపులకు ప్రీతియగునట్లుగా, చేయఁదగు కృత్యంబులుచేయించి; సమాంశంబులుగా = సమభాగములుగా.- దంతి...నంబులు= ఏనుగుదంతములయొక్క- ముత్యములయొక్క- మొత్తములు, నికరంబులయిన = శ్రేష్ఠములయిన, కస్తూరీ...కంబులు = కస్తూరియొక్క- జవాదియొక్క- పంక ములు, (బుగదపాకముగా నుండు పచ్చికస్తూరియు, జవాజియు, అన్నమాట.) చమర...లంబులు = చమరమృగములతోకల (= సవరముల) యొక్క సమూ హములు,...కైకొని;— నేదిష్ఠ...లంబులు.— నేదిష్ఠ = ఆయరణ్యమునకు మి క్కిలి సమీపముననున్న ('నేదిష్ఠమంతికతమమ్,' అమ.) భూమండలాఖండల = *ధరణీంద్రులయొక్క, మండలములు = సమూహములు, పుష్పరస- ఆది = తేనె మొదలగు- ('మకరందః పుష్పరసః.' అమ.) బహుపదార్థంబులును, పాకనిపుణ...

---

[6] శా.పా.—'విహరించుచుందురని.' ('విహరింపుచుందురని' పూ. ము.)
'విహరించిరని' తంజ. తా. పా. సాధువు.

[7] శా.పా.—'జనఁజన.' ('జని చని' తంజ. తా. పా.)
'త్రోవపెట్టుచుంజనం, జని' అనియుండుట యుచితముగదా?

* పూ.టీ.—'భూవలయ దేవేంద్రులయొక్క.'

ఆఖండల - ఇంద్ర శబ్దములు దేవేంద్రవాచకము లయ్యును- 'ధరాఖండ లుఁడు- ధరణీంద్రుడు, ఇత్యాది స్థలములలోఁ కేవలమధిపతి వాచకములే. కావున

ఖండంబులు — పాకనిపుణ= వంటచేయుటయందు నేర్పరులయిన, పాచక = వంటవాండ్లచేత, రచిత=తయారు చేయబడిన, మహిత=(శ్రేష్ఠమైన, పిశిత=మాంసముయొక్క (పిశితం తరసంమాంసమ్.' అమ ) ఖండంబులు= ముక్కలు, అఖండములుగా=సమృద్ధిగా, నిండువేడుకలన్ = మిక్కిలి ప్రేమతో, తెచ్చి, ఒప్పించినన్ = అర్పింపగా, ఇష్ట మృష్ట అన్నంబులు = ఇష్టమైనట్టియు- పరిశుద్ధమైనట్టియు- భోజనపదార్థములు, ('నిర్ణిక్తం శోధితం మృష్టమ్.' అమ ) భుజియించి;— ఎలమావుల క్రీనీడలన్ = గున్నమామిడి చెట్ల నీడలందు, పరిశ్రమంబుపాయన్ = అలసట తీరునట్లు, విశ్రమించి = సుఖముగానుండి; అమ్మహనీయోత్తమ గంధర్వుండు.— మహనీయ = గొప్పదియు, ఉత్తమ = శ్రేష్ఠమును- అయిన, గంధర్వము (= గుఱ్ఱము.) కలవాడైన, ఆరాజు, ('గంధర్వ హయ సైంధవ సప్తయః ' అమ.) వరూథినీ సమన్వితుండై = సేనలతోగూడి, ('వరూథినీ బలం సైన్యమ్. అమ.) అనియర్థము — మహనీయుడును- ఉత్తముడును- అయిన ఆగంధర్వుడు, వరూధిని యను *గంధర్వకాంతతో కూడి- అని అర్థాం.) కుఱంగటన్ = చెంత, కంచుకులు = అంతఃపురపు కావలివాండ్లు, ('సౌవిదల్లాః కంచుకిన స్థాపత్యా సౌవిదాశ్చతే.' అమ.) ఎచ్చరించన్ = హెచ్చరికలు చెప్పుచుండగా,— ప్రొద్దులు = దినములు, వసతియైన స్థలంబు = సౌకర్యముగల చోటు, ఆటవికులు = చెంచులు, యోజన త్రయంబునన్ = మూడామడలదూరమున, ఘోర కాంతారంబు = భయంకరమైన అడవి, కలదు; ఆమడపెట్టునన్ = ఎటుమాచినా ఆమడ వెడల్పున, తామర-కొలంకులు= కొలనులు, శృంగారవనములు, ఎడతెగక = తెంపులేకుండా, ఉండును; అనర్ఘోద

---

ఆపదములకు 'ధరాధిపతి; ధరణీపతి, అని టీకవ్రాయవలెను. పూ. టీ. వారికీ తత్త్వము తెలియదు. (చూ. పుట. 32. 'ధరణీతతేంద్రని.)

* పూ. టీ.—'వరూథిని యను నచ్చరతో.'

వరూథిని గంధర్వకాంతగాని అచ్చర కాదు. అచ్చరలు, గంధర్వులు భిన్నజాతులు.—'విద్యాధరోప్సరో యక్షరక్షోగంధర్వ కిన్నరాః.' (అమ.–)

"యథావిబుధసద్మన్యప్సర సోనామకన్యకా స్సంతీతి తాసాం చతుర్దశకులాని; తాభ్యాంగంధర్వైః సహ కులద్వయంజాతమ్; ఏవమేతాన్యేకత్ర చతుర్దశకులాని." (కాదంబరి.)

గీ. 'కమలలోచన, కిన్నరాంగనవె నీవు?
నీవు గంధర్వభామవే నీలవేణి?

కంబుల- ఘనదీర్ఘిక = శ్రేష్ఠమైన నీరుగల నడబావి, కర్దు = కలదు; త్రోవ పెట్టుచుక్క = దారిమాపుచు, చనఁ = చెంచులుముందు నడవగా, చని- (కర్త-రాజు.)

సీ. ♦కను మాయఁ జని సీతఁజెనకు ‡కాకాసురు
కనుమాయఁగాఁ బాటికొనినచోటు
తలకెక్క *వలపుఁ దగులు శూర్పణఖ ము
క్కును జెవుల్ † రాపాడికొనినచోటు
సహరివేషం బైన చంద్రబింబము వోలె
గుడి వ్రాసి జానకి నిడిచినచోటు
కుహనా మృగ నిశాటు గహనాధిదేవత
కనురక్తి బలియిచ్చినట్టిచోటు
గీ. గనుఁగొని విభుండు, రామలక్ష్మణులు ధర్మ
సాధువులు విష్ణుమూర్తులు సంచరించి
నార లీపుణ్యమగు నరణ్యానిఁ జూడఁ
గలిగెనని సంతసిలుచు నావలఁ జనంగ. ౧౧౯

---

అప్సరస్త్రీవె నీవు బింబాధరోష్ఠి?
రమణి, నీవు విద్యాధరరాజ సుతవె? (కాశీ. 7-169.)

గంధర్వాప్సరశ్శబ్దముల నభేదముగా వాడు వాడుకయున్నను టీకలువ్రాయుటలో మాత్ర మట్లభేదముగా అర్థముచెప్పుట సరికాదు.

♦ పాఠాం — 'కనుమాయఁజని- సుతుఁగనుమాయఁగా.'

‡ శా. పా. — 'కాకాసురుఁగను మాయఁగా.' ('కాకాసురుఁ, కనుమాయఁ = కన్నుపోవునట్లుగా, పాటికొనిన = సరిచేసిన.' అని పూ. టీ.)

కన్నుపోవునట్లుగా సరిచేయుట యనగా అర్థమేమి?

*శా. పా. — 'వలపు నాఁదగులు.'

వావిళ్ళవారును ఈపాఠమునే గ్రహించినారు కాని సరికాదు. 'వలపునఁ దగులు' అని సరియైనపాఠము. పూ. ము. నను, వ్రాతప్రతులలోను ఉన్నది.

† శా. పా. — 'రాపాడుకొనిన' (=కోయించుకొన్న' పూ. టీ.)

టీక —(ఈపద్యమున పెద్దచరణములలోని 'పాటికొనిన' మొదలగు క్రియ లకు కర్తలు రామలక్ష్మణులు.-) కనుమాయక = చని = కంటికగపడకుండా- మాయ గా పోయి, సీతక 🙰 చెనకు = సీతను గోటితో చీరిన, కాకాసుర-కను = కాకా సురుని యొక్క-కన్ను. మాయఁగాక పాటికొనినచోటు = పోవునట్లుగా, చేసిన ప్రదేశము. (పాటికొను = సరిచేయు; శ. ర.) ఆప్రదేశమున రాముడు కాకాసు రుని కన్నుపోగొట్టినాడని, భా.—

సీతారాములు చిత్రకూటమున నున్నకాలమున నొకనాడు రాముడు సీత తొడపై తలనిడికొని నిద్రించుచుండగా కాకాసురుడువచ్చి సీతవక్షోజమును గోటితో చీరెననియు, పతికి నిద్రాభంగము కలుగునని ఆమె చలింపకుండెననియు, పిదప రాముడు మేలుకొని ఆవృత్తాంతమును తెలిసికొని ఆయసురునిపై నొక దర్భపుల్లను మంత్రించివైవగా దానిచే వాయసుని కన్నొకటి చూపుచెడి నిరుపయోగమయ్యె ననియు, రామాయణకథ. (అయోధ్య – అధికపాఠసర్గ. ౯౬.)

తలకెక్కు వలపునక = పట్టరాని తమకమున, తగులు = తగులుకొనిన, శూర్పణఖ = దుష్పనాతియొక్క, ముక్కును - చెవుల్ * రాపాడి = వేధించి, కొనినచోటు = హరించిన ప్రదేశము.

శూర్పణఖ, తన్ను పరిగ్రహింపవలసినదని రాముని బాధింపగా, రాముడు లక్ష్మణునిచేత దాని ముక్కు చెవులు కోయించెనని, కథ.

సపరివేషంబైన = పరివేషముతో కూడిన, చంద్రబింబముపోలెక = చంద్ర

---

* 'శూర్పణఖ కావలెనని కోరి, ముక్కు-చెవులు కోయించుకొనె' ననుట కథకు, స్వభావమునకు కూడా విరుద్ధము - రాపాడుట యనగా చలపట్టి బాధించుటగాని 'కోయుట' కాదు; 'కోయించుట' కానేకాదు — "రాపాడు - To plague, torment. వేధించుట" (బ్రౌను.)

🙰 పూ. 'టీ.—చెనకు = అంటిన.'

'చెనకు' అనుక్రియ 'అంటు' అనియే కాక, గోరు-పల్లు మొదలగు వానితో గీరుట - నొక్కుట, అను నర్థములును కలవు. (చూ. శ. ర.)

సీ॥ 'ఏవన్నెకాని కీ లావణ్యవతి గోటి
చెనకులు కళలూరఁ జేయునొక్కొ.' (ఉ. రా. 4-194)

గోటిచెనకులు = గోటి నొక్కులు- ప్రకృతమున గోటితో గీరుట ఉచిత మయిన యర్థము.

మండలమువలె, గుడివ్రాసి = చుట్టును గీటుగీచి, జానకిన్, ఇడినచోటు = ఉంచిన ప్రదేశము.

మాయలేడియైన మారీచుడు రాముని బాణము తగిలి ప్రాణములు విడుచునపుడు 'హా! లక్ష్మణా!' అని పెద్దకేక వేసెను. ఆకేక రామునిదే యని భ్రమించి సీత, రామునికి సాయపడుటకు లక్ష్మణుని పొమ్మనెను. లక్ష్మణుడు మారీచుని మాయచేష్ట యెఱిగినవాడైనను, సీత బలవంతము మీద పోవలసివచ్చెను. అట్లు పోవునపుడు, సీతచుట్టును గీటుగీచి 'అమ్మా నీవీగీటు దాటి రావలదు. ఇది రాక్షసు లుండు ప్రదేశము. గీటుదాటితివేని అపాయము వచ్చును అని చెప్పిపోయె'నని గాథ. (ఈ గాథ రామాయణమున లేదు.)

కుహనామృగనిశాటున్ = మాయామృగమయిన రాక్షసుని = మారీచుని, గహనాధిదేవతకున్ = వనదేవతకు, అనురక్తిన్ = ప్రీతితో, బలియిచ్చినట్టిచోటు, (= మారీచుని వధించిన ప్రదేశమును) కనుగొని, ధర్మసాహసులు = మిక్కిలి ధర్మాత్ములు, విష్ణుమూర్తులు = విష్ణుస్వరూపులు, అయిన రామలక్ష్మణులు, ఈపుణ్యమగు అరణ్యానిన్ = పవిత్రమయిన యీమహారణ్యమున ('మహారణ్యమరణ్యానీ'. అమ) సంచరించినవారలు. (ఇట్టిపావనస్థలములు) చూడఁగలిగెనని, సంతసిలుచున్ - అవలఁజనంగన్ = అవతలికిపోఁగా.

గీ. అరిది యావనులు సరసు లనఁగి పెనఁగి
యెనసి శాఖోపశాఖలై యింపు మీఱి
ప్రబలి తామరతంపరై పరిఢవిల్లి
యెదుటఁ గన నయ్యె ♦వాసనపదము లగుచు.　　౧౧౦

టీక.— అరిదియా = అపూర్వము లయిన, వనులు = వృక్షవాటికలును, సరసులు = సరస్సులును, అనఁగిపెనఁగి = ఒండొంటితోచేరి, (సరస్సులును - సరస్సులచుట్టు చెట్లును, ఉన్నవని, భా.) ఎనసి = ఒప్పి, శాఖోపశాఖలై - ఇంపుమీఱి = పరంపరాభివృద్ధిని చెంది, మనోజ్ఞములై, ప్రబలి, తామరతంపరై - పరిఢవిల్లి = పరస్పరసహాయమున బలిసి ప్రకాశించి, వాసనపదములగుచున్ = నివాస

♦ శా. పా.— 'వాసనాపదములు' ('వాసనాపదములు = పరిమళస్థానములు — నివాసస్థానములు', అని, పూ. టీ.)

మునకుదగిన స్థానములై, ఎసుఁగాఁ, కనఁబడెను = కనబడెను.

శాఖోపశాఖలనుటచేత వనవృక్షములు, కొమ్మలు - కొమ్మలకు రెమ్మలునుగా విస్తరిల్లిన వనియు * 'తామరతంపర' యనుటచేత, సరస్సులలో తామర దట్టముగా అల్లుకొనిన దనియు' 'వాసనపదము' లనుటచేత, పుష్ప సమృద్ధిచేత వృక్షములును, కమలషండములచేత సరస్సులును సువాసనలకు నిలయము లయినవనియు, సారస్యము.

అరిది = ఆశ్చర్యము, యౌవనులు=ఎలప్రాయమునన్నవారును, సరసులు= రసికులును- అయిన జనులు, (స్త్రీలును పురుషులును) ఎనఁగి పెనఁగి = ఒద్దికతో, ఎనసి = కలసి మెలసివర్తించి, (ఎనయుట= గతియందుకూడుట.) శాఖోపశాఖలై= పెక్కుతెగలుగా నేర్పడి, ప్రబలి, తామరతంపరలై = కుటుంబాభివృద్ధిని గాంచి, వాసనపదము లగుచుఁ = అతిసౌభాగ్యములకు నిలువదగిన స్థానములై, కనవయ్యెను, అని అర్థాంతరము.

క. ఆతావు లపుడు గంధవ
తీతలనాథుండు సన్నుతించుచు బలసం
ఘాతము దిగు మని మెల్లన
నాతలి కటు పాదచారియై చని చెంతన్. ౧౧౧

---

పూ. ము. పరిశోధకులు శాస్త్రిగారును, వారినిబట్టి యితరులును- 'వాసనాపదములు' అనియే అన్నారు. కాని, ఆకారాంతమైన 'వాసనా' శబ్దమునకు 'నివాస' మను నర్థము లేదు. నివాసమను నర్థముగల వాసన శబ్దము అకారాంతనపుంసకము. ఆనపుంసకము 'వాసన' (=గంధము) అను నర్థమునను వర్తించును. "వాసనమ్- Perfuming, scenting. Dwelling, abiding. An abode, a dwelling" (ఆప్టే).

* పూ. టీ — 'తామరతంపర = అభివృద్ధి (కుటుంబాభివృద్ధి అనిధ్వని)' సరస్సుల పక్షమున, 'అభివృద్ధి' అనిచెప్పుట తప్పు. సరస్సు లభివృద్ధి చెందినవనగా ఒకటికినాలుగుగా నేర్పడినవని యర్థము. ప్రకృతమున అర్థమది కాదు. సరస్సులలో తామర విస్తారముగా పెరిగిన దని ప్రకృతార్థము.

సీ. 'తనయిల్లు తామర తంపరై మెఱయు, సం
పన్నలివాక్షి గాఁపున్నచోటు.' (వసు. 3-155.)

అర్థక్రమవివరములకు వ్యాఖ్య చూచునది.—

టీక.— గంధవతీతలనాథుఁడు = రాజు. (గంధవతి = భూమి; గంధము కలది, యని వ్యు. పృథివికి గంధము గుణము. పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, అను పంచభూతములకును, వరుసగా — గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము, గుణములు ) ఆతావులు- సన్నుతించుచుఁ = ఆప్రదేశములను మెచ్చుకొనుచు, (ఆసువాసనలను మెచ్చుకొనుచు, అని, అర్థాం. గంధవతీ నాథుఁడు కావున, (తావులను=) గంధములను, నుతించెనని ♦సారస్యము.—("క. తావులన స్థలములొప్పును, తావులనఁగ వాసనలనుచుఁ దగుఁ జేయు శివా". ఆ. సం. నానా. 2.) జలసంఘాతముఁ = సేనాసమూహమును, నిగుడని = విడియకలసిన దనిచెప్పి, అతలికిఁ = అవతలి ప్రదేశమునకు, పాదచారియై - చని = కాలినడకనపోయి.

సీ. మరువమావుల రవం బరువమావు లరుదైన
తావిక్రొన్నన†చెట్లు గ్రోవఁదనరఁ,
బ్రామానికపునిగ్గుఁ బ్రామానికపుశిలా
పట్టభంగంబులు పరిఢవిల్ల,
కన దంబుజాత కోకనదంబులఁ జరించు
రాయంచ జక్కవపవము లెసఁగ,
నాకాశరుచిఁ గేరు నాకాశగంగతో
నీకాశమై వారి నిండి తొలఁక
గీ. మొలక తెమ్మెరకూనలు ¶వొలయు వెలయు

---

♦ ఈ సారస్యము పూ. టీ. లో లేదు.

† శా. పా.— 'క్రొన్ననపట్లు' ('అప్పుడే వికసించిన పుష్పములుగలిగిన స్థలములు' - పూ. టీ )

పూ. ము. నను, తంజ. తా. ప్రతిలోను, 'చెట్లు' అనియున్నది. బావిప్రక్కన 'పుష్పములుగలిగిన స్థలములున్న' వనుటకంటె, పూలచెట్లున్నవనుట సహజసము కదా?

¶ శా. పా.— 'వెలయ నొలయ' ('వెలయఁగ = ఒప్పుగా' పూ. టీ )

వెలయఁగ = ఒప్పగా, అనవచ్చును గాని 'ఒప్పుగా' అనవచ్చునా? పూ. ము. నను, తంజ. ప్రతిలోనుగూడా, 'కూనలు వొలయు వెలయు' అను పాఠమే యున్నది.

♦దేవనిర్మిత మైనట్టి దిగ్గియఁ గని
దిగ్గి యగణిత విభవముల్ దేజరిలఁగ
రాజు మంత్రులుఁ దాను హర్షంబుతోడ. ౧౧౩

టీక.— మరుమావుల - రవంబు = మన్మథుని గుఱ్ఱములధ్వని (= చిలుకపలుకులు.), అమరు = ఒప్పునట్టి, మావులు = మామిడిచెట్లును, (క. 'మావులనం దగు హయములు, మావులనం బరఁగు నామ్ర మహీజంబులు.' ఆం. సం. నానా. 2.) శ్రీవఱ్ఱావి - క్రొన్ననచెట్లు = సుగంధముగల క్రొత్త క్రొత్త పూలచెట్లును, శ్రీవఱ్ఱనరఁ = ఒద్దున నొప్పియుండగా; *ప్రామానికపు = పరిమాణింపదగిన, అనగా శ్రేష్ఠమైన, నిగ్గు = కాంతిగల, ప్రామానికపు (ప్రాఁత + మానికపు) శిలాపట్ట = పలకలవలె చదునైనవియు - శ్రేష్ఠములును నైన మాణిక్యములతో కట్టబడిన, భంగంబులు = మెట్లు, పరిఢవిల్లఁ = ఒప్పగా; కన...బులఁ.—కనత్ = ప్రకాశించుచున్న, అంబుజాత = కమలములయందును, కోకనదంబులఁ = (ఎఱ్ఱ) కలువలయందును, చరించు, రాయం... వములు = రాజహంసలయొక్కయు, చక్రవాకములయొక్కయు, కంఠధ్వనులు, ఎసఁగఁ = అతిశయింపగా; ఆ-కాశరుచిఁ కేరు = అల్లిక్లు (పూల) కాంతిని పరిహసించు (చు), ఆకాశగంగతోఁ = ఆకాశగంగ (లోని యుదకము)తో, నీకాశమై = సమానమై, వారి = నీరు, నిండి, తొలఁకఁ = తొనకగా; మొలకతెమ్మెరతూనలు = అప్పుడప్పుడే బయలువెడలిన మెల్లనివాయువులు, పొలయఁ = వ్యాపించుచుండగా, దిగ్గి = దిగి (అక్కడనిలిచి, అన్నమాట.)

---

♦పాఠాం.— 'దేవనిర్మితమైన దీ శ్రీవయనుచు, దిగియగని తద్విభవములు.' (పూ. ము.)

* పూ. టీ.— 'ప్రామానికపు నిగ్గుఁ = శ్రేష్ఠమైన మాణిక్యకాంతిని, (1) ప్రాము = పఱపుచున్న, (2) ఆనికపు = సంతసగల- (3) శిలా = రాతియొక్క - పట్ట = బల్లలయొక్క - భంగంబులు = మెట్లు.'

1) ప్రాముట యనగా పూయుట. 'పఱపుట'కును 'పూయుట' యను అర్థమున్నది. కాని మెట్లు మాణిక్యకాంతిని దేనికి పూయుచున్నవి?

(2) 'ఆనికపు= సంతసగల' అనుట కాకర మేమి? 'ఆనికము' అను పదమొకటి భాషలో ఉన్నదా? ప్రసిద్ధనిఘంటువులలో నా కగపడలేదు. ఎందుకువిస్తరము! కవిశబ్దాలంకార సౌభాగ్యముకొరకు 'ప్రామాణికపు' అనుటకుమారు, 'ప్రామానికపు' అన్నాడు. ఆరహస్యమును కనుగొనలేక పూ. టీ. కర్తలు తప్పుత్రోవలు త్రొక్కినారు.

ఆ యరణ్యమున రాజొక బావినిచూచెను. అది దేవతలునిర్మించినదిగాని మాన వులు త్రివ్వినది కాదు. దానిచుట్టు ప్రక్కలను చిలుకలతో నిండిన తియ్యమామిడిగున్న లును- కమ్మని సుగంధములను గుబాళించు పలురకముల పూలచెట్లును, మనోహర ముగానుండెను. వెడల్పుగలిగి చదునైన పెద్దపెద్ద మాణిక్యములే మెట్లుగాగల ఆబావిలోని నీరు, రెల్లు పూవువలె తెల్లనై, ఆకాశగంగాజలముకంటెను స్వచ్ఛమై యుండెను. అందుగల కమలములలోను కలువలలోను చేరియున్న రాయంచలును జక్కవలును చేయు శబ్దములు వినవింపుగా నుండెను. ఆసమయమున చల్లని మెల్లని పిల్లవాయువులు వీచుచుండెను. ఆప్రదేశపు రామణీయకమునకు హర్షించుచు రా జక్కడనిలిచెను. తా.

వ. ఇవ్విధంబున నయ్యవనీవిభుం డమ్మహనీయస్థల శృంగారం బున కత్యంత సంతుష్టాంతరంగుండై యచ్చట విశ్రమించి తత్తద్విశే షంబు లప్పటప్పటికిం గనుచు వనవిహారంబు *సలుపు చున్న యెడ.

---

(3) 'శిలాపట్టభంగములు' అను పదమునకు, శిలా = రాతియొక్క, పట్ట = బల్లలయొక్క, భంగములు, అను టీక మిక్కిలి వింతగానున్నది 'శిలాపట్టమనగా, రాతిపలక = పలకవంటిరాయి "శిలాపట్టః (i) A flat stone for grinding etc.. (ii) a slab (of stone) used as a seat. (iii) A stone seat."(ఆప్టే) 'శిలాపట్ట' మను పలుకుబడి కావ్యములయందున్నదే.—

(1) 'ఏషా మే మనోరథప్రియతమా సకుసుమాస్తరణం శిలాపట్ట మధిశ యానా.' (శాకుం. 3. అం.)

శిలాపట్టం - పాషాణఫలకమ్.- (మృత్యుంజయటీక.)

(2) 'నికషపాషాణపట్టనిభం బయిన నభస్స్థలంబున.' (శృం. నై. 2- 35.) నికషపాషాణపట్టనిభంబు = ఒరగంటి పలకవంటిది. (సర్వంకషావ్యాఖ్య.)

(3) 'చంపకము గట్టుయగు శిలాపట్టంబు మెట్టి నిలిచి' (కాశీ. 5-169)

రాతిపలకను 'రాతియొక్క బల్ల' అనుటయు, బల్లలవంటి రాళ్లతో కట్టిన మెట్లను, 'రాతియొక్క బల్లలయొక్క మెట్లు' అనుటయు, తెనుగువారి తెను గనుపించుకొనదు.

* పాఠాం.— 'సలుపుచు, వినోదపరిసంగంబులఁ బొద్దుగడపుచుండె; నంత నిక్కడ.'—

టీక.—అవనీ విభుండు = రాజు, అమ్మహనీయస్థల శృంగారంబునకుఁ = గొప్పగా కొనియాడదగినదియైన ఆప్రదేశముయొక్క అందచందములకు, అత్యంత సంతుష్టాంతరంగుండై = మిక్కిలి తనిసిన మనసుకలవాడై, విశ్రమించి = అలసట తీర్చుకొని, తత్ తత్ విశేషంబులు = ఆయావింతలు, కనుచు, వనవిహారంబు సలుపుచున్నయెడఁ = వినోదార్థమటునిటు తిరుగుచున్న సమయమున.

## —. పావురాల పందెము .—

క. సారంగధరుఁడు లీలా
సారంగధరుండు సాధుసంస్తుత్యనయా
చారుండు ధర్మమర్మవి
చారుం డపు డుబుసు పోక సమ్మదలీలన్. ౧౧౪

టీక.—లీలా సారంగధరుండు = తనూవిలాసమున చంద్రుడును, సాధు...రుండు.— సాధు = పెద్దలచేత; సంస్తుత్య = కొనియాడబడదగిన, నయాచారుండు = న్యాయవర్తనము కలవాడును, ధర్మ...రుండు = ధర్మ రహస్యములయొక్క విచారము కలవాడును (ధర్మసూక్ష్మములను పరిశీలించి గ్రహించు స్వభావము కలవాడు, అని. భా.) అయిన, సారంగధరుండు, ఉబుసుపోక = ప్రొద్దుపోక, సమ్మదలీలన్ = ఉత్సాహముతో.

గీ. పారువంబులఁ బట్టెడి వారిఁ జీరి
*యుద్దవిడి రమ్మనిన భృత్యు లొకనిఁ బట్టి
పదుగు రత్తఱి బడిబడిఁ బాఱుతెంచి
పులుఁగులను దెమ్మనుచు వారిఁ బిలువ, నపుడు. ౧౧౫

టీక.—పారువంబులన్ = పావురములను, (వర్ణవ్యత్యయము, ఉ. మరకతము = మరతకము = మకరతము.) చీరి = పిలిచి, ఉద్దవిడిన్ = త్వరగా,— పులుఁగులను = పిట్టలను.

---

* శా. పా.—'ఉద్ధవడి' (ఉద్దవిడి, పూ. ము.; తంజ పా.)

'ఉద్ద' తో 'వడి' కూడనియెడల 'శీఘ్రము' అనునర్థము రాదని కాబోలు 'విడి' ని 'వడి' గా దిద్దినారు. దిద్దనక్కరలేదు. 'ఉద్దవిడి' యన్నను 'శీఘ్రము' అనియే యర్థము. (చూ. శ. ర.) శాస్త్రిగారు 'బలువిడి' ని గూడా, ఇట్లే 'బలువడి' అనిదిద్దియున్నారు. పొరపాటు.

చ. జిలుఁగగు నాభినామములు, చెంపలగందము, లోరపాగలున్
పలిపపుచేల వింతవలెవాటులు, లాఁగులు, రావిరేకలుం,
గలిగిన †గుజ్జురూపరులు కంబడిచింపులు నీలిపాఁతలీఁ
కలుఁ దగు పావుపంపుఁబుట్టిక ల్గొనివచ్చి కుమారుసన్నిధిన్. ౧౧౬.

టీక.— *జిలుఁగగు నాభినామములు = సన్నని కస్తూరి నిలువుబొట్లు, ఓర పాగలున్ = వంకరతలగుడ్డలును, వలిపపుచేల = సన్నని కండువా, కలిగిన, గుజ్జు రూపరులు = పొట్టియాకారములు కలవారు,— పావురంపుబుట్టికల్ = పావురాల నుంచుబుట్టలు.

క. మేలైన లకోరీ లొ
డ్డీలుం బదతీలు పల్లటీల్ ♦పక్కావ లూఁ
చీలుం బకదార్లును గూ
కీలు ననెడుపేరులం దగిన పార్వములన్. ౧౧౭

టీక.—లకోరీలు, ఒడ్డీలు, పదతీలు, పల్లటీలు, పక్కావలు, ఊఁచీలు, బక దార్లు, కూకీలు, అను, పేరులందగిన = పేరులుగల, పార్వములన్ = పావుర

† శా. పా.—'గుజ్జురూపములు' (ఇది పూ. ము. పా.) 'గుజ్జురూపరులు' అని తంజ. పా.

నిజానికి పావురాల బుట్టలను కొనివచ్చినవారు 'గుజ్జురూపములు కలవారు' (=గుజ్జురూపరులు) గాని కేవలము 'గుజ్జురూపములు' కావు.

* పూ. టీ — 'జిలు...ములు = దట్టమైన కస్తూరి బొట్లును.' 'జిలుగు= దట్టము' అనుట గొప్ప పొరపాటు. 'జిలుగు' దట్టమునకు విరుద్ధపదము (Antonyam).— 'జిలుగు = Fine, delicate, weak, thin'- 'దట్టము— Thickest" (బ్రౌను.)

♦ శా.పా.—'పక్కావలున్ జీలు'

పూ. ము. నను, శ. ర. లోను, 'ఒడ్డీ' అను పదముక్రింద, సూ. ని. లోను, పాఠమిట్లేయున్నది. కాని 'జీలు' సరళాదియో? పరుషాదియో? ఏక వచనాంతమో? బహువచనాంతమో? తెలియదగు మార్గములేదు. తక్కినపదము లన్నియు బహువచనములనున్నవి కావున 'జీలు' ను బహువచనమే కావలెను. మరి దానియేకవచనము ఏమో? 'జీ' యగునో 'చీ' యగునో! వేరొకటియగునో!

ములను, (పాఱువము, ఉత్ప్లవములోవముచేత పార్వము.)

ఈ పావురముల పేరులలో,- కూకీలు, పల్లటీలు, ఒడ్డీలు, బకదారి, బ్రౌన్యమునను; లకోరీ, ఒడ్డీఁడు, పల్లటీ, కూకీ, శ. ర. లోను, కనబడుచున్నవి. కాని, పదతీలు, పక్కెవలు, ఊఁచీలు, రెండు నిఘంటువులలోను లేవు. శ. ర. కర్త 'పల్లటీ' అనుపదము క్రింద ఈపద్యమును పఠించియు పద్యములోని పదములన్నిటిని తన నిఘంటువులో చూపక కొన్నిటిని జారవిడుచుట శోచనీయమయిన విషయము. ఆంధ్రభాషార్ణవము (2-89) లో, 'నేలపల్లటి, అంతరపల్లటి, కురటి, లకోరి, బట్టి, ఒడ్డీ, కూకి, బకదారి, పావురములలోని భేదములనియున్నది.

మ. వినయం బేర్పడ ముంగలన్ నిలువ నావిఖ్యాతకౌతూహలం
బున నారాజకుమారమన్మథుఁడు సొంపుల్ మీఱ మాధుర్యధు

---

మద. తాళ. ప్రతులలో నొకదానిలోను, తంజ. తాళ. ప్రతులలో నొకదానిలోను, 'పక్కెవలూఁచీలుం బకదార్లు' అనుపాఠము కనబడినది. ఊఁచీ - ఊఁచీలు' అనుపదము లుండవచ్చుననియు, అందువలన ఆపాఠము పరిగ్రాహ్యమే ననియు నాకుతోఁచినది. ఇంకను పెద్దలు పరిశీలింతురుగాక.

అసలు ప్రా. టీ. గల కాగితపు వ్రాతప్రతిలో.— "పల్లటీలున్ గకువుల్, చాలులు బకదారులు గూ, కీలుం జిల్వాలు ననందగిన పారువముల్." అను పాఠమును, 'కకువులున్ను, చాలులున్ను, చిల్వాలున్ను, అను టీకయు నున్నవి.

కకువు, చాలు, కోశములలో కనబడలేదుగాని, 'చిలువ' మాత్రము, పక్షి విశేషముగా అందందు దృగ్గోచరమవుచున్నది.

1. 'చిలువ చెలువంపుఁ బలుకుల చిలువ చెలువ.' (విజ. 1-165.)
[ఈపాదమునకు శాస్త్రిగారు వ్రాసిన టీక చాలాపొరపాటుగా నున్నది.]
2. చాటు. మణి మంజరిలో 'ఖేచరములు' అనుశీర్షికక్రింద:
సీ. 'సరస చిరాయువు జముడు కాకియుఁ జిల్వ
చింత నిప్పరికాఁడు చెఱకుపిట్ట.' (పుట. 135.)
3. 'చిలువ - A wild duck; నల్లచిలువ The black tufted duck చిలువబాయి the whistling teal.' (బ్రౌన్యము.)
4. శ. ర. కర్త దీనినే కాబోలు 'చిలవ = నీరుకోడి' అన్నాడు.

ర్యనవీనస్వనగుంభనంబు మొదలౌ నాయావినోదంబు లె
ల్లను హాళిన్ విని వారివారి మనవుల్♦పాటించి పాలించుచున్ ౧౧౮

టీక.— ఆవిర్భూత = ఉదయించిన, కౌతూహలంబునన్ = ఉత్సాహముతో, వినయం బేర్పడన్ = విధేయతకనిపించగా, ముంగలన్ నిలుపన్ = ఆ పావురములను (తెచ్చినవారు) ఎదుటనుంచగా, ఆ రాజకుమారమన్మథుండు = రాకొమారుని రూపమునన్న మన్మథుడు - అనగా మన్మథతుల్యుడైన ఆసారంగధరుడు, (ఆపావురములయొక్క) మాధు...నంబులు.- మాధుర్యధుర్య = మిక్కిలి మధురములయిన, నవీన = క్రొంగ్రొత్తలయిన, స్వనగుంభనంబు = శబ్దములకూర్పు, మొదలయిన, వినోదంబులన్ = వింతలను, హాళిన్ = సంతోషముతో - విని, మనవుల్ పాటించి = వారువారు చెప్పుకొను మనవులను మన్నించి, పాలించుచున్ = కోరికలను తీర్చుచు.

క. పారావతరత్నం బని
వేఁడి జగబిరుదు వేసి పెంచినదానిన్
గూరిచి తనసరిరాజకు
మారులతోఁ బందె మొడ్డి మాత్సర్యమునన్. ౧౧౯

క. క్రేవ వల యొడ్డి యొంటిం
బావురమున్ దిగిచి వడి నభంబున కెగయం
గా వైచి వాలికుండఁగఁ
జే విసరుచు బెదరు పుట్టఁ జేసినయంతన్. ౧౨౦

టీక.- క్రేవన్ = ప్రక్కన, వల ఒడ్డి = వలపరిచి, ఒంటిన్ = పావురమున్ ఒంటరిపావురమును, *తిగిచి = లాగి, వడిన్, నభంబునకున్ = ఆకాశమునకు, ఎగయంగాన్ వైచి = ఎగురవేసి.

♦ పాఠా.—'మనవుల్పాలించి లాలింపుచున్.'

* పూ. టీ.— 'తిగిచి = పట్టుకొని'

తిగుచుట అనగా లాగుటగాని పట్టుకొనుట కాదు. (చూ, శ. ర.) పావురమును పట్టుకొని దానికి ఉపికలుగుటకుగా చేతిని వెనుకకులాగి పిమ్మట ఆకాశమునకు విసురవలెను. ఊరక పట్టుకొని విడుచుట యెగురవేయుట కాదు.

లయగ్రాహి

పేరెములు వాఱుచు సమీరుని హుటాహుటిని
♦ గేరడము లాడెడు మహాశయముతో న
య్యారె! యనమీఱి గరుదారవము చేఁ జదలు
బూరటిల మాకొలమువారిఁ గనమా! యా
రౌర! యిది యింతగద కోకి యని ¶ యెంతయును
నూఱడి పయిం దిరిగి పారెడు చు జూడన్
దూర మెగఁ బాఱుచుఁ జోకారముయి యన్నెఱవ
నారుణము చందమునఁ బానువము మించెన్. ౧౩౧

టీక — సమీరుని హుటాహుటిని = వాయువుయొక్క వేగమును, కేరడములాడెడు మహాశయముతోన్ = ఎకసక్కెములాడునట్టి గొప్ప వేగముతో అయ్యారె అనన్ = (చూచుజనులు) ఔరా యని మెచ్చునట్లు, మీఱి = అంతకంతకును అతిశయించి, గరుత్ + ఆరవము చేన్ = రెక్కల పెద్దరొదచేత, చదలు బూరటిలన్ = ఆకాశము నిండగా, ('నిండారెనన బూరటిల్లెనా సమములై యుల్లసిల్లు'- ఆం. భా. 3-102.) మాకొలమువారిన్ = మాజాతిపక్షులను, కనమా = చూడమా!

ఆగుచు = లాగు, అనుటకు.—
క. 'సీరమునఁ బట్టితిగుచుచు
నాయణ ముసలమునఁ బటుగదా యష్టిని దు
ర్వారగతి బొరిసమగు.' (హరి. ఉ. 8. ఆ)
ఎ. గీ. 'ఇషువు దొడుగుట దివుచుట యేయుటెల్ల
నెఱుఁగరాకుండ సనిచేసె యిందువదన.' (భాగ. 10. ఉ. 107.)
వ. 'వెన్నువెనుక నెయిది కరంబులఁగుచ్చిపట్టిన నతండును దిగిచికొని తెండియుం బోవంబోవఁ బది యడుగులకొలఁది నాకొంతేయుండు ... నిలువంబట్టి' (భీష్మ. 3.-268)

♦ శా. పా.—కేరడము 'లాడుచు' (ఇది పూ. ము. పా.) 'ఆడెడు' అని తంజ. పా. ఉచితతరము.

¶ శా. పా.—'ఎంతయు - ననూరుడు? (అనూరుఁడు = సూర్యసారథి- పూ. టీ.)

(పావురమొకటియైనను (తోడుకు) లేదే! అని నిరుత్సాహముతోడి యాశ్చర్యము? ఔ! కాగ! ఓర్రి, యిదివింతగదా? అనుకొని, (ఆపావురము)ఎంతయుఁ - నూఱడి = (తోడులేకపోయిన పోరు గాకయని ధైర్యము తెచ్చుకొని) పయిందిరిగి = ఆకాశమునఁనే చుట్టి చుట్టి తిరిగి; సారెకును చూడఁగ = చూడగాచూడగా, నూరమొగఁబాఱుచుఁ = అంతకంతకును పైకిపోవుచు, ‡ చౌకారమయి = తెలుపై (వందున), అన్నలువవాహనముచందమునఁ = బ్రహ్మదేవుని వాహనమైన హంసవలె, మించెఁ = మిక్కిలి ప్రకాశించెను.

ఆపావుర మాకాశమున కెక్కిచూడగా మరి పావురమేదియుఁ గానఁబడలేదు. తానొంటరిదైనందుల కించుక నిరుత్సాహపడియు వెంటనే గిటువు తెచ్చుకొని, అది యాకాశమున వలయాకారముగా తిరిగితిరిగి అంతకంతకు మిక్కిలియెత్తునకుఁబోయెను. తెల్లని యాపావురము చూచుట కపుడు బ్రహ్మదేవుని వాహనపుహంసవలె నుండెను.

సీ. అభ్రమాతంగంబు హస్తంబులోఁ జిక్కి
కదలెడుపుండరీకం బనంగ
హరివిధుల్వోఁజఁ గందఁ బెరుగు నంబరకేశు
తలవాఁక ♦దేలాడు నెల యనంగ
మిన్నేటిదరులందు మేఁత లాడుచునున్న
యదుటు రాయంచ లేఁగోదమ యనఁగ

---

అనూరుడు సూర్యసారథే. కాదన్న దెవరు? కాని ఆయనూరుడు 'పయిని తిరిగి సారెకును (పావురమును) చూచె' ననుటమాత్ర మొప్పదగినమాట కాదు. పూ. ము. లో 'అనూరుని పయిందిరిగి) అనియున్నది. దానిని శాస్త్రిగారు 'అనూరుడు' అని దిద్దినారు. 'ఎంతయును నూఱడి' అని సరియైన పాఠము; మద. తంజ. వ్రాతప్రతులలో నున్నది.

‡ పూ. టీ —'చౌకారము = సౌందర్యము'

చౌకారమై = సౌందర్యమై అనుట సరికాదు. "చౌకారము = స్వచ్ఛమైనది" (శ. ర.)

♦ శా. పా. 'తేలెడు' (ఇది. పూ. ము. పా.).

వడిఁబోవుచో జాఱిపడు నభోమణి తేరి
తెల్లని చిన్నారి జల్లియనఁగ
గీ. ఱెక్క లార్చుచు లకుముకిపక్కిరీతిఁ
దెలుపుచు ధరణి నే మైనఁ దెలుపుఁ గనినఁ
బెట్టయని గమకించి చూపెట్టుకొనుచు
నుండెఁ బారువ మప్పు డయ్యువజనంబు. ౧౨౨

టీక.— అభ్రమాతంగంబు హస్తంబులోన్ = ఐరావతముయొక్క తొండమున, చిక్కి, కదలెడు = కదులుచున్న, పుండరీకంబు= తెల్లదామర పువ్వో;- హరి విధుల్ = విష్ణువు- బ్రహ్మయు, వెఱఁగందన్ = ఆశ్చర్యపడునట్లు, పెరుఁగు = ఆకాశమునకు బెరిగిన, అంబరకేశు = శివుని, తలవాఁకన్ = శిరసుమీఁదియేటి (గంగ) యందు, తేలాడు = తేలాడుచున్న, నెల = చంద్రుఁడో;- మిన్నేటిదరులందున్= ఆకాశగంగయొడ్డులందు, మేతలాడుచునున్న = మేయుచూ సంచరించుచున్న, ఉదుటు = మిటారపు, రాయంచ లేఁగొదమయో;- వడిన్ పోవుచోన్ = శీఘ్రముగా ప్రయాణముచేయుటలో, జాఱి, పడు = పడిన, నభో...జల్లి = సూర్యుని రథముయొక్క సొగసైనచామరమో, అనంగన్ = అన్నట్లు, ఆపారువము, ఱెక్కలు, ఆర్చుచున్ = ఆడించుచు, (ఆర్చు- చూ. బాల కి. 80.) లకుముకి పక్కిరీతిన్ తెలుపుచున్ = లకుముకి యనుపిట్టవలె కనబడుచు, ధరణిన్ = భూమిమీద, ఏమైనన్ తెలుపుఁ గనినన్, పెట్టయని = తనభార్యయని, గమకించి చూపెట్టుకొనుచున్ = తదేకదృష్టితో చూచుచు, ఉండెను, అప్పుడు, ఆయువజనంబు = ఆటలాడుచున్న పిల్లవాండ్రు.

ఆపావురము తెల్లనిది కావున, తెల్లదామరపువ్వుతోను, చందమామతోను, రాయంచకొదమతోను, వింజామరతోను, పోలిక.

---

'తేలాడు' వ్రా. ప్రా. ఉచితతరము. తేలుట యనగా మునిగినవస్తువు పైకి వచ్చుట. తేలాడుటయనగా మునుగక నీటిమీద నే కదలుచుండుట.— "చులుకనివి గానఁదేలాడెఁ జాపులపుడు." (రస. 8 గుచ్ఛము.) నీటిలోపడినవస్తువు 'తేలలేదు' అనుటకు బదులు 'తేలాడలేదు' అనుటకువీలులేదు. తేలి + ఆడు = తేలాడు. సంధి దుష్టము కానే కాదుగదా?

సీ. కంటికిం జే యొరగా నిల్పి కన్గొని
'యన్నన్న! యెంత దవ్వ' నెడువారు
వలిపచేల ముసుంగు వైచి వేమఱు సూచి
'హా! కంటిఁ గంటి నే' ననెడువారు
మొగలపై హస్తంబు లిడి తప్పకీక్షించి
'సూర! మిక్కిలి పొడ' వనెడివారు
పల్లంపునీటిలోఁ బలినీడ పరికించి
'కనిపింప దేచాయ' ననెడువారు
గీ. గొబ్బుగొబ్బునఁ దల లెత్తి కొంద ఱంతఁ
జూడఁ జూడంగఁ బాగలు వీడి పడిన
నవ్వినోదము గని నవ్వినట్టివారు
నైరి *తత్పక్షి విహరించు నవసరమున. ౧౨౩

టీక.—వలిపెచేల = సన్ననివస్త్రము; ఈక్షించి = చూచి; పాగలు = తలగుడ్డలు;

క. మినుకు మినుకనెడి మింటన్
బూనపౌన నలతెల్లమబ్బు †పొంతన దిగువా
టున నదె కలదో లేదో
యనుమాత్రము గాఁగఁ గంటివా నృపతనయా. ౧౨౪

---

*శా. పా.—'యొడ్డినయొడ్డనివారు మెఱయ.' (ప్రతిజ్ఞ చేసినవారు చేయని వారును - మెఱయ' అని పూ. టీ.)

ఒడ్డినవారు మెఱయుట సరే; ఒడ్డనివారును మెఱయుటయా? పాఠాంతరము లిట్లున్నవి.—

1. 'తత్పక్షి విహరించునట్టివేళ.' (మద. తా.)
2. 'కొందఱునొడ్డనిధాన మెఱయ' (?) - (తంజ తా.)
3. 'పరిపరివిధముల నటివేళ' (పూ. ము.)

†పాఠాం.—'పొంతను' శ. ర. పా. (చూ. దిగువాటు.)

టీక.—†పానపాన = అల్లదిగో - అక్కడ, ('అచ్చట యాడ యందలి పానపాన యయ్యెడ' ఆం. భా. ౩–౯౯) తెల్లమబ్బుపొంతన = తెల్లని మబ్బుకు దగ్గరగా, దిగువాటునన్ = క్రిందివైపుగా;— (దిగుడు + పాటు = దిగువాటు. శ. ర.)

గీ. అనినఁ జెలికాండ్ర పలు కతఁ డాలకించి
*కించి దుపహాసమున విలోకించి 'గంటి
గంటి నౌ నౌను నే ♦ ముందు గంటి' ననుచు
ననుచు మది ‡దాని మరలింతు ననుచుఁ దలఁచి. ౧౨౫

టీక,—కించిత్ - ఉపహాసమునన్ = ఇంచుక పరిహాసముగా, విలోకించి= చూచి, ననుచు మదిన్ = వికసించుచున్న మనస్సుతో.

ఉ. పెట్టను బట్టి ఱెక్క వెలుపించి కనంబడునట్లుగాఁగ న
ట్టిట్టొక రెండుమాఱులు పయిన్ ❘ సురఁటింబలెఁ జేతఁద్రిప్పుచున్
బిట్టుగఁ గేక వేసి వినఁబిల్చిన వెండి గరంగి ముద్ద యై
న ట్టిరుఱెక్కలున్ ముడిఁచి యబ్బురపుంబలునిబ్బరంబునన్. ౧౨౬

---

†పూ. టీ —'పానపాన = కనఁబడుచు.'

శ.ర.లో 'పాన = దృగ్గోచరమైనది' అనియున్నది. దాని ననుసరించినదే పూ. టీ.— కాని 'పాన', 'పానపాన' లకు, 'కనబడుట' యర్థము కాదు. ఆపదములు నిర్దేశించుటయందు వాడబడునవి. బ్రౌణ్యమున 'పానపాన = చూచాయగా- రవంతరవంత' అనియున్నది. కాని పరిష్కృతపద్యమున 'కలదో లేదో అను మాత్రముగాగ' అని యుండ నేయున్నది కావున ఆయర్థము సరిపడదు.

* పా తాం.—'కించిదభిహాసమున'. ♦ శా. పా.—'ముందుఁగంటి'

'క్రియా విశేషణంబులమీఁది యగు ధాతువున కన్నంతమునకు లోపంబు విభాషనగు' (ప్రౌ.క్రి.౨౨.) అను సూత్రము ప్రకారము, ముందుగాఁ గంటి, ముందు గంటి, అనవచ్చునేగాని 'ముందుంగంటి, ముందునుగంటి' అనుట సరికాదు.

‡ శా. పా.—'ఁదాని.' దాకు ముందర సున్న పెట్టుట తప్పు. శా. పా. ను నమ్మి వావిళ్ళవారును పెట్టినారు.

❘ శా. పా.—'సురటింబతె' (='చామరమువలె'. పూ. టీ.).—

టీక.— తెలుపించి = తెల్లగాచేసి, — సురఁటిఁబలెన్ = గుండ్రని విసనకఱ్ఱను త్రిప్పినవిధముగా — ‡ నిబ్బరంబునన్ = చిత్తస్థైర్యముతో (=నిదానముగా.)

సీ. సౌధ కేతన పటాంచల వాత ధూత ని
  ర్గత గాంగ డిండీర ఖండ మనఁగ,
సితమహాని పూర్వావసిత భూపవర్ధ్య
  త్యాగ తేంద్రాగ్ర లతాంత మనఁగ,
నవహార సంఘట్టన †స్రస్త పతయాళు
  గగనలక్ష్మీ మౌక్తికం బనఁగ,
మధ్యంది నానంతమణి లూన మందేహ
  సంత్యక్త బిరుదాంక శంఖ మనఁగ,
గీ. బకరుహాసంభవ కళత్రపత్త్రిపుత్త్రి
సురకులధురీణ కంఖాణ కరి కృపాణ
రమ్య ధావళ్య జైత్రి పారావతంబు

---

'సురటి' యని నిరనుస్వారముగా వ్రాయుట తప్పు.— చ. 'అలరు సురంటిగూండ్ల' (చంద్రాంగద.) శ. ర.— 'సురటి = చామరము' అనుటయును తప్పే. 'విసనకఱ్ఱ సురఁటి' (ఆం. భా. 2-168) "సురఁటని కొందఱు చామరమని వ్రాసియున్నారు. అది కాదు." అని, శ. ర. కర్త తెలియఁజెప్పియున్నాడు.

‡ పూ. టీ.— 'గట్టి నిశ్చయముతో.'

నిబ్బరమనగా చిత్తస్థైర్యము గాని 'గట్టి నిశ్చయము' కాదు. "నిబ్బరము= Firmness, మనసు నిబ్బరముగా వుంచుట, to restrain the affections, to curb the mind. నిశ్చలము." బ్రౌను. (ఈ యర్థము శ. ర. లో లేదు.)

† శా. పా.—'గ్రస్త' ('స్రస్తపతయాళు = జారిపడినట్టి' అని పూ. టీ.)

శాస్త్రిగారికి దొరకినమూలమున 'గ్రస్త' అనియు, టీకలో 'స్రస్త' అనియు నున్నది కాబోలు. వారట్లే ముద్రించినారు; శా. ప్ర. చూచి, మూలము మాత్రమే ముద్రించిన వావిళ్ళవారు 'గ్రస్త' అనియే ముద్రించినారు. క్రమమేకదా?

'గ్రస్త' పూ. ము. పా 'స్రస్త' తంజ. తా. పా.

గాంగ డిండీరఖండంబు లనఁగ ¶ దెగిపడు క్రమము దోఁప. ౧౨౭

టీక.— సౌధ = మేడలమీఁది, కేతన = జెండాలయొక్క, పట అంచల వాత = వస్త్రముల అంచులవలన పుట్టిన గాలిచేత, ధూత=ఎగురఁగొట్టబడి, నిర్గత = బయలు వెడలి- క్రిందికివచ్చుచున్న. గాంగ = గంగాసంబంధమయిన(అనగా గంగలోని) డిండీరఖండము = నురుగు తునక, అనఁగన్ = అనునట్లును; సితపూని = నారదమునిచేత (నారదుడు తెలుపు -) పూర్వ - అవసిత = మును పెరిగింపబడిన ('బుద్ధంబుధితం మనితం విదితం ప్రతిపన్నమవసితావగతే'-అమ) భూ = భూమిని, పునః = మరల, దిదృక్షా = చూడవలెనను ఇచ్ఛచేత, ఆగత = వచ్చిన, *ఇంద్రి + అగ = ఇంద్రుని వృక్షమయిన పారిజాతముయొక్క, లతాంతము = పుష్పము, అనఁగన్; నవ = నూతనములయిన, హీర = రతనాలదండలయొక్క, సంఘట్టనన్ = ఒరయికచేత, స్రస్త - ‡పతయాళు = (తెగి) జారి పడుచున్న, గగనలక్ష్మి = ఆకాశ లక్ష్మియొక్క, మౌక్తికంబు = ముత్యము, అనఁగన్.

---

¶ శా. పా.— 'తెగిపడ్డ' (ఇది పూ. ము. పా.)

'తెగిపడు' తంజ. పా. ఆకాశమునుండి క్రిందికి దిగుచున్న పక్షి వర్ణనము గావున 'పడ్డముక్క'తో పోల్చుట తగదు. 'పడు'అనుటయే యుచితము.

* పూ. టీ.— 'ఇంద్రి అగ = కల్పవృక్షముయొక్క'. నారదమునిచేత భూలోకమునకు కొనితేబడినది పారిజాత కుసుమముగాని, కల్పకుసుమము కాదు. పారిజాతము , కల్పము భిన్నవృక్షములు. కల్పశబ్దమమరతరువులకై దింటికిని చెల్లినను, ప్రత్యేకించి చెప్పవలసి వచ్చినప్పుడు దేని పేరుదానికే చెప్పవలెను.

" రతాజ ధామ్నా రఘు సూను రేవ
కల్పద్రుమాణా మివ పారిజాతః " (రఘు, 6. 6 )

'పారిజాతాపహరణ' మనుటకు బదులు, కల్పాపహరణమనిన చెల్లదు, కావున ప్రకృతమున 'ఇంద్రాగ = పారిజాతముయొక్క' అనుట యవసరము.

‡ పూ. టీ — 'పతయాళు = పడినట్టి'

ఆళుచ్ ప్రత్యయము తాచ్ఛీల్యార్థకము. దానికి భూతార్థము చెప్పుటతప్పు. పతయాళువు = పడునట్టిది. 'పడినది' పతితమనబడును. "పతయాళువు- Falling, cadent, deciduous, liable or accustomed to fall." (బ్రౌను)

"పతయాలు.—Tending or prone to fall, liable to fall." (ఆప్టే

మధ్యందిన = మధ్యాహ్నమునందలి, అనంతమణి= (ఆకాశమునకు మణివంటివాడైన) సూర్యునిచేత, ('అనంతంసురవర్త్మఖమ్' - 'ద్యుమణిస్తరణిర్మిత్రః' అమ.) లూన = ఛేదింపబడిన, మందేహ = మందేహుండను రాక్షసునిచేత, సంత్యక్త = విడువబడిన, బిరుదాంక = బిరుదు చిహ్నమైన, శంఖము, అనంగా, (మందేహులను రాక్షసులు [3 కోట్ల 60 లక్షలు] త్రిసంధ్యములందును సూర్యు నెదిరింతురని ప్రమాణమున్నది )

† పంకరుహాసంభవ= బ్రహ్మదేవుని యొక్క, కళత్ర=భార్యయైన సరస్వతి, పత్త్రి = వాహనమైన హంస, పుత్త్రి = కుమారుడైన నారదుడు;— సురకుల ధురీణ = దేవేంద్రుని యొక్క, కంబుగ్రీవ = శుభ్రమైన ఉచ్చైశ్శ్రవము, కరి = ఏనుగైన ఐరావతము, కృపాణ = కత్తియైన వజ్రము, అనువానియొక్క, రమ్య = మనోహరమైన, ధావళ్య = స్వచ్ఛతను, జైత్ర = జయించునదియైన (అనగా పైని పేర్కొనబడిన వస్తువులకంటెను తెల్లనిదైన) పారావతంబు = పావురము, చుక్క తెగిపడు క్రమముతోఁ బఱ.

తెల్లనికాంతితో ఆకాశమునుండి క్రిందికి దిగుచున్నందున తెగిపడుచుక్కతో సామ్యము. ఈసామ్యమునకొక్క యుదాహరణము.—

" తెగినచుక్క ధరణికి నేతెంచు కరణిఁ
దరణిజిత్ప్రభతో మేఘసరణి డిగ్గి
నందనీట శతానంద నందనుండు
మజ్జనంబాడి బాలేందుమౌళిఁ బాడి".

— పాండు. 2. 172.

---

ఆకాశమునుండి దిగుచున్న పిట్టను క్రిందపడిన ముత్యముతో పోల్చుట తప్పు. పడుచున్న ముత్యముతో పోల్చుట ఒప్పు.

† పూ.టీ.—"పంక...కృపాణ=సరస్వతి, నారదుఁడు...వజ్రాయుధము- అను వానివలెనే, రమ్యధావళ్య= మనోహరమైన తెలుపుగలిగిన- జైత్ర = జయశీలమైన- పారావతంబు."

'...కృపాణ రమ్యధావళ్యము, అని బహువ్రీహిచేసి, 'కృపాణము వలెనే...ధావళ్యముకలది' అని యర్థము చెప్పుట సరికాదు. ఆ బహువ్రీహికి 'జైత్రము' నతికించి, పిమ్మట 'పారావతము'తో గుదిగూర్చుటయు సరియైనమార్గముగాదు అది యట్లుండగా, పారావతము డిండీరఖండ లతాంత మౌక్తికాదులతో పోలుటకు 'జైత్రము' కావలసిన అక్కరయును లేదు.

గీ. అంతలోనన చిత్రాంగి యది యెఱింగి
క్రీడ సలుపుచు బంగారుమేడమీఁద
†మొలకవన్నెలు చిలుక రాచిలుకఁ బట్టి
‖చిలుకపలుకుల నటు చూపి పిలిచె నంత. ౧౨౮

టీక.—* మొలకవన్నెలు = లేఁబ్రాయపుటొయ్యారములు, చిలుకఁగ = చిందఁగా, రాచిలుకఁగ, పట్టి = చేతపట్టుకొని, చిలుకపలుకులఁగ = చిలుకపలుకుల వంటి పలుకులతో, అటుచూపి = చిలుకను పావురమునకుచూపి, పిలిచెఁగ.

చిత్రాంగి, మిక్కిలి యొయ్యారముగా చిలుకనుచేతపట్టుకొని - మేడమీద క్రీడించుచు, ఆకాశమునుండి దిగుచున్న పావురమునుచూచి, తనచేతి చిలుకనుచూపి దానిని పిలిచెను అని, తా.

— పావురము చిత్రాంగిమేడమీఁద వాలుట —

మ. కని చిల్కం దనపెంటిగాఁదలఁచి యాకైలాటపుంబుల్గు • గ్రి
క్కన మిన్నందినమేడమీఁది కటుచక్కందేలి పెన్ బాళి వి

---

† శా. పా.—'ములకవన్నెలు చిలుక రాచిలుకఁబట్టి.' (మొలక వన్నెల చిలుక...' పూ. ము. పా.) 'మొలకవెన్నెల చిలుక' తంజ. పా.

‖ పాఠా:— 'వలసియొల్లమినటుచూచి' - పూ. ము.
'వలసివల్లమి నటుచూపి పిలుచునంత.' తంజ - పా.

* పూ. టీ.—'ములక వన్నెల = ములక కాయవన్నెగలిగినటువంటి- అనగా పచ్చని వర్ణముమీఁద తెల్లనిచుక్కలు గలిగినటువంటి.'—మూలములోని 'వన్నెలు' టీకలో 'వన్నెల' అయినవి. 'చిలుకు' అనుక్రియ అసలే లేచిపోయినది. 'ములక' కు ములకకాయ- అను అర్థము బలాత్కారముగా తేబడినది. నిజాని కీటీక శాస్త్రి గారి సొంతముకాదు. అసలు పూ. టీ. వ్రాతప్రతిలో ఇట్లున్నది.—

'మొలకవన్నెల - మొలక కాయ వన్నెగలిగినటువంటి - అనగా పచ్చని కాయమీద తెల్లని చుక్కలు గలిగినదనుట.'—

'మొలక'ను 'ములక' గను, 'పచ్చనికాయ'ను 'పచ్చనివర్ణము' గను, సవరించి, శాస్త్రిగారు పైమాటలనే యనువదించినారు. ప్రాయికముగా వారి టీకలన్నియు నీమార్గముననే నడుచుచుండును.

• శా. పా.— 'గ్రక్కన...మీఁదికిఁదలుకుంగాలితో జాఱి.'

చ్చినటెక్కుల్ పయిఁడంచె ప్రోఁతలు దగన్ జిత్రాంగి రత్నాంగినం
దనుఁ గారింపఁగ వచ్చినట్టివిధియో నా వచ్చివ్రాలెన్ దమిన్.

టీక.— అ- కైలాటపుం బుల్గు = ఆ మాయలమారి పక్షి, చిల్కుక్, తన, పెంటిగాన్ = ఆడు పావురముగా, తలఁచి, గ్రక్కునన్ = శీఘ్రముగా, మిన్నందిన = మిక్కిలి యెత్తయిన- మేడమీఁదికిన్, అటు- చక్కందేలి = చక్కగా వచ్చి, పెన్‌బాళిన్ = (పెంటిమీఁది) విస్తార ప్రేమచేత,— విచ్చిన టెక్కులు, పయిఁడంచె = కాలిబంగారుటంచు యొక్క, ప్రోఁతలు, తగన్ = ఒప్పగా, చిత్రాంగిన్, రత్నాంగినందనున్ = సారంగధరుని, కారింపఁగన్ = బాధించుటకు, వచ్చినట్టి, విధియో, నాన్ = అనగా, వచ్చి, తమిన్ = త్వరగా, వ్రాలెన్.

చ. కెలఁకుల నిల్లు వ్రాల, వలకేలను మెల్లనఁ బట్టి దువ్వి యా
నళినదళాక్షి ‘పక్షి యనునామము దీని కెచెల్లుఁ బిల్చియుం
బిలువక మున్నె వచ్చె నిఱుప్రేమ దొలంకఁగ; నింక దీనిచేఁ
గలుగు నిజంబుగాఁ దనకుఁ♦గాంక్షలుదీర సుఖంబు చెందఁగన్ ౧౩౦

---

శబ్దము ‘తళుకు’ గాని, ‘తళుక్కు’ కాదు. తళుక్కు - అను రూపము అనుకృతియందు మాత్రమే ‘తళు’క్కనును గాని వేరుగా కనబడదు. కావున ‘తళుక్కుఁగాంతి’ పాఠము సరికాదు. (శాస్త్రిగారి మీది విశ్వాసముచేత; సూ. ని. ఈ యసాధుపాఠమునే గ్రహించినది. చూ. కైలాటము.)

పాఠభేదములు—

‘గ్రక్కున... మీఁదికయి చక్కందేలి పైవ్రాలి.’ (మద. తా. పా.)
‘గ్రక్కున... ,, కటు ,, పైబాళి.’ (పూ. ము. పా)
‘గ్రక్కున... ,, ,, ,, పెంబాళి.’ (తంజ. తా. పా.)

♦ తా. పా.— ‘కాంక్షలు దీఱ’ (ఇది పూ. ము. పా.)

తీరు = చక్కఁబడు; తీఱు = నశించు. (శ. ర.)— చిత్రాంగి యభీష్టము, ‘కాంక్షలు సిద్ధింపవలె’నని గాని, ‘నశింపవలె’నని కాదు. ముక్తులయిన మహానుభావులకుగాని కాంక్షలు నశింపవు. కావున ‘కాంక్షలుదీర’ అనియుండవలెను. శాస్త్రిగారి వ్రాతలలో ‘కోర్కులు తీరుటకు’ బదులు ‘తీఱుట’యే తరుచుకనబడుచున్నది:-

(i) శృం. నైషధము— “అసిద్ధ అర్థుఁగాక — (తీఱినకోరికగలవాఁడు కాని

టీక.— * కెలఁకులన్ = తనప్రక్కన,- వ్రీలన్ = వ్రీలగా. వలకేల నుపట్టి = కుడిచేతితో పట్టుకొని దువ్వి, అనలినదళాక్షి = ఆయింతి = చిత్రాంగి, (ఇట్లనెను) పిల్చియుంబిలువకమున్నె, నిజు పేరిమ తోలంకఁగన్ = మిక్కిలి పేరిమ యుట్టిపడగా, వచ్చెను, కావున, పక్షి - అను నామము దీనికె చెల్లున్ = ('పక్షి' పక్షములు = ఱెక్కలుకలది, అనియర్థము, పక్షము = తనయెడ నభిమానముకలది, అని సారస్యము.) సారంగధరుఁడు పిల్చినపోక, తన పక్షమువచ్చిన దని భావము.

గీ. సందియము లే దొకింతయు నిందు కిపుడు
వచ్చు సారంగధరుఁ డింక ♦వచ్చినపుడె
తగులు నా చేత, ననుచు సంతసము నొంది
మేడదిగి వచ్చి యప్పు డామెఱుఁగుఁబోఁడి. ౧౩౧

టీక.— నా చేతన్ తగులున్ = నా చేతికి చిక్కును.

శా. బంగారాన మెఱుంగు వెట్టినగతిం బైపై గుబాళించు లేఁ
జెంగల్వం గనుఁ దావి గట్టినటులన్ ♦జిన్నారిజాబిల్లిమోఁ

వానినిగా- కోరిక తీఱనివానినిగా) — ఆత్మన్ - తలఁచున్, తనకోరిక తీఱునది కాదని." ( పుట, 349 )

(ii) విక్రమోర్వశీయము.— క. "ఎల్లరకోర్కులు దీఱుత, మెల్లరు నంచింతుగ్రాత మెల్లధరిత్రిన్. (5–129)

* పూ. టీ.— 'కెలఁకులన్ = పార్శ్వములయందు.'

పావురమొక్కటే కావున బహుపార్శ్వములయందు వాలుట అసంభవము. 'కెలఁకులు' అని బహువచనమునన్నను, పార్శ్వమున, అని ప్రకరణముంబట్టి యేకవచనముగా అర్థము చెప్పవచ్చును.

సీ. 'కెలఁకులనున్న తంగేటిజున్ను గృహమేధి' (మను. 1-23)

కెలకులఁమన్న = సరసనున్న - అని. జూలూరివారి టీక.

♦ శా. పా —'వచ్చునపుడె' (ఇది, పూ. ము. పా.) 'వచ్చినపుడె' తంజ. పా. 'వచ్చెనేని, తగులు నా బారి'- పాఠాం.

♦ పాఠాం.— 'శీతాంశుబింబంబునన్'

దం గన్పట్ట సుధారసం బిడుక్రియన్ దన్మోహనాంగంబునన్
సింగారించె వధూటికామణి మణిశ్రేణీపరిష్కారముల్. ౧౩౨

టీక.— పై పైన్ †గుబాళించు = మిక్కిలిగా పరిమళములను విరజిమ్ము, లేఁజెంగల్వన్ = లేత చెంగలువ పుష్పమునకు, తావికట్టినటులన్ = సౌరభమును పట్టించినట్లును, (గంధశూన్యపదార్థములకు సుగంధకుసుమములనుకట్టి సువాసనలు కలిగించుటకు తావికట్టుట యని పేరు.) *చిన్నారి = ఇంపైన, జాబిల్లిమీఁదన్ = చందమామమీద, సుధారసంబు = అమృతమును, ఇడుక్రియన్ = ఉంచినట్లును, వధూటికామణి = స్త్రీ రత్నమయిన చిత్రాంగి, తత్ - మోహనాంగంబునన్ = మోహింపజేయునదియైన తన శరీరమున, మణిశ్రేణీ పరిష్కారముల్ = మణిమయ ములైన భూషణములను, సింగారించెను = అలంకరించుకొనెను.

సహజముగనే మెరుగుగల బంగారమునకు మరల మెరుగు పెట్టినట్లును, స్వాభావముగనే కెత్తావులనీను లేతచెంగలువకు సువాసనలు పట్టించినట్లును, పుట్టుకతోనే అమృతమయుఁడైన చంద్రునిమీద మరియు నమృతరసము చిలికినట్లును, చిత్రాంగి స్వయంసుందరమైన తన తనువున ననేక మణిభూషణముల నలంకరించుకొనెను.

---

† పూ. టీ.— 'గుబాళించు = ప్రకాశించునట్టి.'

గుబాళించుట యనగా వాసనకొట్టుటగాని ప్రకాశించుట గాదు. (సూ. శ. ర.) — "గుబాళించుట - To be emitted or burst forth as scent కస్తురితావి గుబాళించు తమ్మికొలను. Vijaya." (బ్రౌను)

సీ. 'తావిగుబాళింపఁ దగు గందవొడియుమ్యోఁ
బాదులు త్రవ్వఁబైఁబడిన దుమ్ము'. (మల్ల. విప్ర. 3-40)

* పూ. టీ.— 'చిన్నారిజాబిల్లి మీఁదన్ = బాలచంద్రుని మీఁద.'

చిన్నారి, 'చిన్న'కు పర్యాయమనుకొని, 'బాలచంద్రుని' డన్నారు. పొరపాటు. 'చిన్నారి = మనోజ్ఞము. (చిన్నారిచిగురు. చిన్నారిజాబిల్లి;- శ. ర) 'చిన్నారి - Delicate, pretty.' (బ్రౌను.)

సీ. 'చిన్నారి పొన్నారి చెక్కుటద్దములపైఁ
జిఱునవ్వు మొలకలు చెంగలింప.' (విక్ర. 7-172.)

బాలచంద్రుని యం దమృతము పూర్తిగానుండదు కావున అమృతము చిలుకుట అవసరమే కావచ్చును. ఆ యుపమానమునుబట్టి చిత్రాంగి మేనియందును అందచందము లరగొరయునికియు, అకొరతను పూరించుటకు కలంకారాము లవసరమే యనియు నేర్పడి కవిరచన మంతయు వ్యర్థమగును కావున పూ. టీ. సరికాదు.

వ. ఇవ్విధంబున బహువిధాభరణభూషితయై యయ్యెడ. ౧౩౩

సీ. రహిఁ గట్టె తగెఁ గర్ణమహనీయ విభవంబు
తాటంకములమీఁదితగులు గల్గి,
యచలాయత నితంబ మతిశయిల్లి చెలంగెఁ
గాంచి వజ్రపరిభాకలనఁ దనరి,
కృశమై కవును పేదటికము వాయక మెప్పెఁ
బ్రియుశింపఁ దగు నీవిఁ బరిధవిల్లి,
యలరారె మిన్నంది యరుణకరంబులు
ఘనకంకణములతోఁ దనరి పెనఁగి,

గీ. యహహ! యద్భుతశృంగార మభినుతింపఁ
దరమె? వాసనకుల్కుఁకుందనపుబొమ్మ,
కలికిరూపైన రత్నమో, కాక యల్ల
మోహినియొ, నాఁగఁ జితాంగి మురు వెసంగి. ౧౩౪

టీక.—(1) కర్ణమహనీయ విభవంబు = కర్ణునియొక్క గొప్పదనము, తాటంకములమీఁది తగులు = కుండలములమీఁది లోభము - కలిగియును, రహిఁగట్టితగెఁ = వాసిగాంచియొప్పెను.— కర్ణుడు సహజములయిన కవచకుండలములు కలవాఁడు. ఆకవచమును కుండలములును అమృతమయములు. వాని ప్రభావముచేత నాతడు శత్రువుల కజయ్యుడైయుండెను. అతత్త్వము నెరింగి యింద్రు డర్జునపక్షపాతమున పేదపాఱుని వేషమున కర్ణునికడ కరిగి, ఆ కవచమును కుండలములను యాచించెను. ఆ మహనీయ వస్తువుల ప్రభావమును, ఇంద్రుని కపటవర్తనమును నెరింగియు, కర్ణుడు అమోఘదానశీలుడు కావున కాదనక కవచమును - కుండలములనుగూడా యిచ్చివేసెను; అని భారత కథ. కావున కర్ణుని విభవము కుండలములమీఁది లోభమున దగిలి వాసిగాంచెననుట విరోధము.

తాటంకములు (=కమ్మలు) ధరించుటచేత కర్ణములు మిక్కిలి ప్రకాశించిన వని - పరిహారము.

---

శా. పా.—'నీవి పరిఢవిల్లి'- పరిఢవిల్లినది నీవి కాదు; కవును. పరిఢవిల్లుట నీవిచేత. కావున 'నీవిఁబరిఢవిల్లి' అనవలెను.

(౩) * వజ్రప్రభాకలనఁ దనరి = వజ్రాయుధముయొక్క కాంతిచేత నొప్పి, అచల = కొండయొక్క, ఆయత = విశాలమైన, నితంబము = నడుముప్రదేశము ('కటకోఽస్త్రీ నితంబోఽద్రేః' అమ.) అతిశయిల్లి, చెలంగెఁ = ప్రకాశించెను.- పూర్వకాలమున కొండలకు రెక్కలుండెడివనియు, వానిని ఇంద్రుఁడు వజ్రాయుధముతో నఱికివేసెననియు పురాణగాథ. కావున పర్వతమధ్యము తనకు వైరియైన వజ్రాయుధము కాంతిచేత మిక్కిలి ప్రకాశించిన దనుట విరోధము.

అచల = కొండవలె, ఆయత = విశాలమైన, నితంబము = పిఱుఁదుభాగము, ('పశ్చాన్నితంబః స్త్రీకట్యాః' అమ) కాంచి = మొలనూలియందలి, వజ్రప్రభాకలనఁ = వజ్రముల కాంతిచేత, తనరి- చెలంగెఁ, అనుట పరిహారము.

---

* పూ. టీ.— 'కాంచి...దనరి = మొలత్రాటి వజ్రమణుల యొక్క కాంతియను వజ్రాయుధకాంతి యొక్క సంబంధముతో నొప్పి, అచలా...చెలంగెఁ = పర్వతముయొక్క విశాలమైన నెత్తము అతిశయించి ప్రకాశించెను, అది విరోధము.'

'చిత్రాంగియొక్క మొలత్రాటి వజ్రమణుల కాంతితో, పర్వతముయొక్క ...నెత్తము ప్రకాశించె' ననుట అసంబద్ధాలాపము.— 'కాంచి = మొలత్రాడు' అనుట తప్పు. మొలత్రాడు పురుషులకే గాని స్త్రీలకుండదు. స్త్రీభూషణమయిన కాంచి 'మొలనూలు' గాని మొలత్రాడు కాదు. పురుషుల మొలత్రాటిని- మొలనూలనుటయు, స్త్రీల మొలనూలును, మొలత్రాడనుటయు సంప్రదాయ విరుద్ధము. మొలనూలు- మొలత్రాడుల భేదము నెఱుఁగనివారి కొఱకు బ్రౌనుదొర యిట్లు విపులముగా వ్రాసియున్నాఁడు —

"మొలతాడు – The small string tied round a Hindu's waist whence is suspended the bit of cloth which covers the privities కటిసూత్రము. బంగారు మొలతాడు a woven cord of golden wire.— మొలనూలు- A girdle, a zone: a cestus of gold or silver: which in old times was set with small bells: as that worn by infants still is made. కాంచి, రశనా."

ఆ శాస్త్రిగారి యితర టీకలలోను, కాంచి మేఖలాదులు 'మొలత్రాడు' గానే టీకింపబడియున్నవి. (చూ. శృం. నై. పు. 494; ఆముక్త. పు. 717.) మఱియు, 'నితంబము = నెత్తము' అనుట పొరపాటు. నితంబము- కొండయొక్క

(3) ప్రిణుతింపఁదగు- నీవిఁ = కొనియాడదగినంతటి మూలధనముతో ('నీవీపరిణోమూలధనమ్.' అమ.) పరిఘవిల్లి = ఒప్పియుండు, కవును = నడుము, కృశమై, పేదతికము పాయక ఒప్పెఁ = దారిద్ర్యము తొలఁగక, అప్లేయుండెను.

కావలసినంత ధనము కలిగియుండియును పేదరికము పాయకయున్నదనుట విరోధము.

ప్రిణుతింపఁదగు, నీవిఁ = పోకముడిచేతఁ పరిఘవిల్లి, కవును, పేదతికము పాయక = బలిసి వికారము కాక, కృశమై = పలుచనై, యున్నదనుటచేత పరిహారము.

(4) అరుణకరంబులు = సూర్యుని కిరణములు ('మిహిరారుణపూషణః' అమ.) ఘన- కంకణములతోఁ = మేఘములతోను- జలబిందువులతోను ('కంశిరోంబు నోః' అమ) కూడియుండియును, (మేఘ జలబిందువులచేత అడ్డగింపబడియు, నన్న మాట.) మిన్నంది = ఆకాశముముట్టి, అలరారెఁ = ప్రకాశించెను.- మేఘముల చేతను వర్షబిందువులచేతను అడ్డగింపబడిన సూర్యుని కిరణములు ప్రకాశించెననుట విరోధము.

అరుణకరంబులు = ఎఱ్ఱని హస్తములు, ఘనకంకణములతోఁ = గొప్ప భూషణములతో ('కంకణంకరభూషణమ్'- అమ) కూడి, మిన్నంది అలరారెఁ = మిక్కిలి ప్రకాశించెను- అనుటచేత పరిహారము.

---

నడుముగాని నెత్తము కాదు. (చూ. శ. ర.) 'నితంబః- The slope, ridge, side, flank of a mountain.' (ఆప్టి) నెత్తము = కొండపై భాగము. ('నెత్త మంచనఁ బ్రిస్థమలరును; ఆం. భా. 2-29.)

సీ. 'నెత్తమ్ము లేకొండ నెత్తమ్ములందాడు
విద్యాధరీకోటి విటులతోడ.'- (మను. 4-115.)

'నెత్తమ్ములందు = అగ్రభాగములయందు.' అని జూలూరివారి టీక.

## విరోధము - ఆభాసము.

పూ. టీ. కర్తలు—'కర్ణునియొక్క పొగడఁదగిన యైశ్వర్యము కర్ణభూషణములమీఁది లోభముగలిగి శోభనుపొంది యొప్పెను, అని విరోధము; కమ్మలు ధరించుటచేత చెవులు ప్రకాశించినవని ఆభాసము'.— అని, యిట్టే తక్కిన పాదములలోను శ్లేషార్థమును 'విరోధ' మనియు, వాస్తవార్థమును 'ఆభాస' మనియు

ఔర = ఆశ్చర్యము, అద్భుతశృంగారము = ఈశృంగారము మిక్కిలి ఆశ్చర్యకరమైనది. అభినుతింపఁదగనె = పొగడశక్యమా! వాసన కుల్కు కుందనపుబొమ్మ = సువాసనల విరజిమ్ము బంగారుబొమ్మ, కలికి రూపైన రత్నమో = స్త్రీరూపమును ధరించిన రత్నమో, కాక = కానియెడల, అల్లమోహినియో, నాఁగన్ = అనగా, చిత్రాంగి, మురువెసఁగి = సింగారమతిశయించి.

క. ప్రియమై రమణీయ మణీ
మయమై ♦అతిచిత్రచిత్రమంజిమనయమై
నయమైన చిలుకపలుకుల
నయగారమునం జెలంగిన యగారమునన్. ౧౩౫

టీక.—ప్రియమై = ప్రేమపాత్రమై, రమణీయ మణీమయమై = మనోజ్ఞములయిన రత్నములతో నిర్మింపబడినదై, అతి...నయమై.—అతిచిత్ర = మిక్కిలి చిత్రమయిన, చిత్ర = చిత్తరువులయొక్క, మంజిమనయమై = సొబగు పొందిక కలదై, (చిత్రవిచిత్రములయిన చిత్తరువులతో అలంకరింపబడి, అని భా. 'నయః Behaviour' ఆప్టే.) నయమైన = మృదువైన (= విన సొంపైన) చిలుకపలుకుల, *నయగారమునన్ = ముద్దుముచ్చటలచేత, చెలంగిన = ఒప్పిన, అగారమునన్ = మేడయందు ('భవనాగార మందిరమ్'- అమ.)

క. వెయ్యాఱులు †తనయుఁడిగపు
టొయ్యారులు గొలువఁ జెలువ మొలుకఁగఁ గొలువై

---

వ్యవహరించినారు. గొప్ప పొరపాటు.

ఆపాతతః స్ఫురించు విరోధార్థమునకు, వాస్తవార్థము పరిహారముగాని ఆభాసముకాదు. పరిహారోక్తిచేత ఆభాసముగా పర్యవసించునది విరోధము. కావున వాస్తవమయిన అర్థమును ఆభాసమనుట సరికాదు.

♦ శా. పా.— 'అతిచిత్రభిత్తి' — 'అతిచిత్ర మంజు మంజీరములన్' (పూ. ము.; శ. ర.)—'అతి చిత్ర చిత్ర' తంజ. తాళ. పా.

* పూ. టీ.—'నయగారమునన్ = అతి ప్రేమచేత'
నయగారమునకు అతిప్రేమ యను నర్థములేదు.

† పాఠాం.—'తనునుడిగపు.'

గయ్యాళి చిలుకతేజీ
వయ్యాళి పిసాళియాలివలె నున్నంతన్. ౧౩౬

టీక.—ఉడిగపు టొయ్యారులు = పనికత్తెలయిన విలాసవతులు, కొలువఁగ = సేవించుచుండఁగా, చెలువము - ఒలుకఁగ = అందము చిందఁగా, గయ్యాళి = ధూర్త రాలయిన చిత్రాంగి, *చిలుకతేజీవయ్యాళి = చిలుకనెక్కి విహరించువాఁడైన - మన్మథుని, పిసాళి ఆలివలెఁ = మిటారపురాణివలె, అనఁగా రతివలె, కొలువై ఉన్నంతఁ = కొలువుతీరియుండఁగా.

గయ్యాళియు రతివలె విలాసవతియునైన చిత్రాంగి తన చెలికత్తెలంగూడి కొల్వుండియుండఁగ, అని తా.

‡సీ. సరసాగ్రేసర వాసరప్రభుతనూజసూలలక్ష్మా పురం
దరజిద్భోగధురంధరా భరతశాస్త్రప్రౌఢమార్గైకలా
స్వరసోత్పాదనకోవిదా శ్రవణభూషాదివ్యరత్న†ప్రభా
తరణి శ్రీకరగల్లభా విభవధృత్తంజాపురీవల్లభా. ౧౩౭

క. తరుణీమన్మథ యాశ్రిత
భరణాగుణాభరణ శౌర్యబహురాజ్యధురం
ధర సత్యాదిమచక్రే
శ్వర యభినవభోజరాజవరబిరుదాంకా. ౧౩౮

*పూ. టీ.—'చిలుక...సాళి= చిలుక గుఱ్ఱపు విహారముగల కుత్సితునిభార్య - (రతి) వలె.'

ప్రకృతమున వక్తవ్యము, చిత్రాంగియొక్క విలాసాతిశయము గాని మన్మథుని కుత్సితత్వముకాదు. కుత్సితుని భార్యగా చెప్పుటచేత రతియొక్క సౌందర్యాతిశయము సూచితమును కాదు. మొదలు మన్మథుని కుత్సితుఁడనుటకు హేతువేమి?

‡ ఈ పద్యములు మూఁడును విజయవిలాసము ప్రథమాశ్వాసమున నున్నవే. అందలి నాలుగవ పద్య మిందు త్యక్తము.

† పాఠాం.—'త్రిపా.'

తోటకము.-

> అతులాగమశాస్త్రవిరస్తమనో
> జ్ఞ తులాధికవిద్వదివాస్తశతి
> క్రితులాధ శుభోదయకారణర
> త్నతులాపురుషాదికదానచణా. ౧౩౯

గద్యము.- ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధ*ప్రసిద్ధవాగ్వైభవ సుధాసారజనిత యశోలంకారాలంకార చేమకూర లక్ష్మణామాత్యకుమార సమారాధితశుభసమాజ వేంకటరాజప్రణీతంబైన సారంగధరచరిత్రంబను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

ఇది శ్రీకంకంటిదీక్షితులాపంచాననశేషాద్యనేకబిరుదవిఖ్యాతవిద్వత్కవీశ్వర తిరుపతి వేంకటేశ్వరకృపాపాత్రచ్ఛాత్ర కాశ్యప సగోత్ర శిష్టాలాన్వయ పవిత్ర సరస్వతీనృసింహపుత్ర రాజలక్ష్మీకళత్ర ప్రాచీనప్రబంధపఠనచణధురీణ పిచ్చయశాస్త్రి ప్రణీతంబును, ‘జిత కాశి’ నామకంబును నగు సారంగధర చరిత్ర టీక యందు ప్రథమాశ్వాసము.



* శా. పా.— ‘ప్రసిద్ధవాగ్వైభవ చేమకూర లక్ష్మణామాత్యతనూభవ సదా...’ (ఇది పూ. ము. పా.)

శ్రీ

# సారంగధర చరిత్రము

## ద్వితీయాశ్వాసము

†శ్రీజానకీమనోహర
‡పూజాంచిత హృత్సయోజ పోష్యాఖిలది
గ్రాజ సకలార్థిజనని
ర్వ్యాజకృపా యచ్యుతేంద్రరఘునాథనృపా. ౧

వ. అవధరింపుము. ౨

క. ఆరీతిఁ బారువము పో
సారంగధరుండు తోడిజననాథసుతుల్
సారెకుఁ గేకలు వేయఁగఁ
గాకాకూర మయి మనసు కళవళపడఁగన్. 3

టీక.— పారువము = పావురము, పోన్ = పోగా, కాకాకూరమయి= చిందరవందరయై, కళవళపడఁగన్ = తహ తహ పడగా.

ఉ. 'బెంగ లిడంగ గెంటి ♦యిట వెంటనిగానక తేలిపోయి; చి
త్రాంగి విచిత్రరత్న భవనాంగణ ¶సీమను దేలవ్రాలె నా

---

† ఈపద్యము విజయవిలాసము తృతీయాశ్వాసప్రారంభమున 'రఘునాథమణీ' అను పాఠముతోనున్నది.

‡ పాఠాం.— 'పూజాన్విత.'

♦ శా. పా.— 'యటఁబెంటిని... దేలి'
'యిటు వెంటిని... తేలి' శ. ర. పా. 'యటు వెంటిని... దేలి' ప్రా. పా.;
'యిటఁబెంటిని... దేలిపోయి.' తంజ. పా.

¶ పాఠాం.— 'సీమన దేల'

బంగరు ముద్దు పావురము; బాపురే! యంతిపురంబులోని కే
భంగుల సన్నుల న్వెదకెఁ బంగరా దిఁక నేమి సేయుదున్

టీక.— బెంగలు + ఇపంగఁగన్ = (పిరందరును) కేకలు పెట్టుటచేత. కొంటె = చెవరి, †చిత్రాం...సీమను = చిత్రాంగిదేవియొక్క విచిత్రమయిన రత్నాల మేడముంగిటి. (= లోగిటిలో) తేలవ్రాలెన్ = తిన్నదిగా వాలెను.

గీ. తామసము సేయఁదగ దిఁక దీమసమున,
నేపరి నైననేఁ బోక పిర సనుచుఁ
బోవ, సుతిమంతుఁడు సుబుద్ధి శీఘ్ర
దర్శి గావున సారంగధరుఁడు కనియె. ౫౭

టీక.— దీమసమునన్ = *దిమాకుచేత, తామసము = ఆలస్యము, ఇంకచేయఁదగదు; శీఘ్రదర్శి = తొందరపు యోచనకలవాడు. సారంగధరుఁడున్ = సారంగ

---

‡ శా. పా.—'ముద్దుఁ బావురము' (ముద్దుపావురము' అని, పూ. ము. పా.)

'ముద్దుపావురము' అనుట తప్పని 'ముద్దుఁబావురము' అని సవరించినారు. సవరింపనక్కరలేదు. 'ముద్దుఁబావురము; కొలువుఁగూటము; ఆఁడుఁగుక్క' ఇత్యాదులు శుద్ధిక ప్రతులు: శాస్త్రిగారి వ్రాతలలోనే తరుచుగా కనబడుచున్నవి. 'ఆగమ శాస్త్ర మనిత్యముగావున ఈనుగాగమసంధి చేయకపోయినను తప్పుకాదని వైయాకరణుల సిద్ధాంతము. (చూ. ఆం. భా. శాసనము. సంధి. ౫౮.)

†పూ. టీ.— 'అంగణసీమన్ = మధ్యప్రదేశమందు.'

'అంగణ' మనగా, ముంగిలి – లోగిలి, యగునుగాని 'యింటి మధ్యప్రదేశము' కాదు. "అంగణ – మెఱుఁగందగు ముంగిలియన" (ఆం, భా. 2-19) 'మధ్యప్రదేశము' అనవలసినచోట ప్రాజ్ఞులు 'నడియంగణ' మన్నారు. "విరితోఁగ చందువా తెగల వేడుకయా నడియంగణంబులోఁ, బఱచిన రత్నకంబళిని." (ఉ. రా. 6—128.)

అంగణము – ఇంటిలోని మధ్యప్రదేశమేనైనయెడల – అచటికి పావురము దూరవలెగాని వాలుటయెట్లు? అది యసంభవము. కావున పూ. టీ. తప్పు.

*పూ. టీ.— 'ధైర్యముచేత.'

ఇక్కడ 'దీమసు' మనగా ధైర్యము కాదు. నాపావురము రాక యె

ఫగునితో (చూ. భా. కార. 6,) అనియెన్ = ఇట్లనెను.

— సుబుద్ధి ప్రబోధము —

ఉ. మన్నన చేసి మీరు బహుమానముతో [1]నను నేలినారు, నేఁ
గన్నది దెల్పకుండిన నఘం బగుఁ, గా దని [2]వెగ్గలింప కీ
విన్నప [3]మాలకింపుము, [4]వివేకివి గాని మఱొండు గావు, నీ
కెన్నఁడు లేనిమోజ యిది యే†మటు పోయినహానియయ్యెడున్.

టీక.—వెగ్గలింపక = నిరసింపక, ఎన్నఁడులేని ఓజ = ఏనాడులేనిపద్ధతి.

ఉ. రా జొకఁ డూరలేఁడు, చెలి * ప్రియపుబిత్తరి, నీవు రూపరే
ఖాజితమన్మథుండ, వటు కావునఁ బోఁ దగదయ్య నీకు నో

---

పోతుందిలే- అను నిమాకు (=హామిక). ‘తామసము చేయఁదగదు. ఇంకదీమసమున ...నేఁ బోకతీరదు’ అని పూ. టీ. అన్వయసరణి. సరికాదు.

[1] పాఠాం.—‘మము.’ [2] ‘వేగిరింప కీ’ [3] ‘మాదరింపుము’ [4] ‘వివేకివి గాన నె ఱుంగరాదె.’

† శా. పా.—‘అటుఁ బోయిన.’

పోవుట ‘అటు’ గాని ‘అటున్’ కాదు. ‘అటుపోయిన’ అని పూ. ము. శా. పా. లోని (అటు మీది) యరసున్న ప్రమాదపతితము. ఐతేయేమి? దానిని తొలగించుటకు ధైర్యములేక వావిళ్ళవారు, ‘పో’ ను ‘బో’ గా మార్చి ముద్రించినారు. శాస్త్రిగారి యెడఁగల భ్రమకు గల బిగువట్టిది.

ప్రాచీన కృతులలో, ‘అచటికి’ అను అర్థమున ‘అట’ యనియే గాని ‘అటు’ ‘అటున్’ అనుట కనబడదు.

‘ఇట యట పోవంజాలక.’ (శాంతి. 3—285.)
‘అటపోవఁ బోవంగలవన్.’ ( ,, 3—475.)
‘అటవోవుచుండ.’ — (ద్రోణ. 3—169.)
‘అటుయిట యేఁగుచు నాత్మలోపలను.’ (బసవ. పుట. 84.)

* శా. పా.—‘ప్రియఁపుబిత్తరి.’ (‘ప్రియముబిత్తరి’ పూ. ము.)

‘ప్రియము’ను ‘ప్రియపు’ అని సవరించుట సరియే కాని ‘పు’ వర్ణమునకు ముందు- అరసున్న పెట్టుటమాత్రము సరికాదు. ముపర్ణకమున కాదేశముగావచ్చిన ‘ంపు’ లోని నెరసున్న అరసున్న కానేరదు. కావున ‘ప్రియఁపు’ అనిముద్రించుట

రాజకుమార, యెక్కడికి రా కిటు సూపఁ గదయ్య భామినీ
రాజులచిత్తము ల్దెలియరా ! యెటుపో యెటువచ్చునో కదా. ౭

టీక.— చెలి - చిత్రాంగి, సాధుప్రవృత్తికి = నయమునలోనున్న మిటారి నీవు, సూప... భుండవు - అకారణప్రతిసంపతి మన్ననఁ గమించినవాడవు. భామినీ రాజుల చిత్తములు - స్త్రీలయొక్కయు రాజులయొక్కయు చిత్తవృత్తులు. ఎటుపోయి-ఎటువచ్చునో = ఎట్లు పరిణమించునో, తెలియరాదుకదా!

పోయి + ఎటు = పోయెటు; క్వార్థేకారసంధి. సాధువే (మా. పా). సంధి. ౭.)

క. వలపు సటు, వావులా నహి,
యలసత్యము సున్న, తలఁపు లభ్రచ్ఛాయల్;
తలఁ దడవి బాస చేసిన
జలజాక్షుల నమ్మరాదు సారంగధరా. ౮

టీక.—వలపు = మోహము, సటు = కల్లమోసము, వావులా - తల్లి-కొడుకు; అన్న-చెల్లెలు, అనుక్రమములా. నహి - లేవు. తలఁపులు - అభ్రచ్ఛా

---

లప్పు. తప్పో-ఒప్పో, శా. సా. ను బట్టి వావిళ్లవారును 'ప్రియఁపు' అనియే ముద్రించినారు. ఎందుకు ముద్రించరు! 'యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః.'

౭ శా. పా.— 'యెటు బోయెటు'

ఎటుపోయి; ఎటువోయి; అనవచ్చునేగాని 'ఎటుబోయి' అనఁగూడదు. కళమీఁది 'ప' 'బ' కాదు.

* శా. పా.—తలఁదడిపి' (= 'శిరఃస్నానముచేసి' అని, పూ. టీ.)

బాసచేయుట, యెదుటివాని శిరమును 'తడవి' గాని 'తడిపి' కాదు. మద. తా. ప్రతులలోను, తంజ. తాళ. ప్రతులలో కొన్నింటను- 'తలతడివి' అనియున్నది. పూ. ము. నను, వావిళ్ల, ప్రతిలోను, తంజ. తాళ. ప్రతులలో కొన్నింటను, తుదకు కొండపల్లివారి ప్రతిలోను. — 'తడవి' అనియేయున్నది. వారు 'తడివి' అను పాఠమునుమార్చి 'వి' - 'పి' గా దిద్దియుందురు. అదిపోరపాటు. కవులెల్లరును - 'తడవి' అనియే వాడియున్నారు. ఒకకొన్ని ప్రయోగములు.—

ఈ సారంగధరకు ముందటి వెనుకటి సారంగధరలన్నిటిలోను, 'తడవి' యన్న యర్థమే స్పష్టముగా కనబడుచున్నది.

ముల్ = భావములు మబ్బులనీడలు (= నిలుకడలేనివి) కాబట్టి, తలతడవి బాస చేసినన్ = (మన) తలపై చేయి పెట్టి ప్రమాణము చేసినను, జలజాక్షులన్ = స్త్రీలను, నమ్మరాదు.

(1) న[illegible]చరిత్ర.—

'నగవుచే బూక నాకు నమ్మిక పుట్టఁ
గ్రచ్చఱ నొకబాస గావింపుఁడనుమఁ
జెచ్చెరఁ దనతలఁ జెయ్యి వెట్టించి, కాని.' (పు. 152.)

(2) 'నవనాథ' కవి తన హరిశ్చంద్రలోఁగూడా, యీబాస నిట్లువాడినాడు.

'రిత్తమ్రొక్కులు మ్రొక్కి ప్రియములు పలికి
నెత్తిఁ జేతులు వెట్టి నిక్కముల్ నొడివి' (2-614)

(3) బాణాల శంభుదాసుని సారంగధర:—

'పాలతోఁ, దలయంటి, బాసజేసినను
స్త్రీల నమ్మఁగరాదు చిత్తంబులోన.' (పు. 17.)

పాలతో బాసచేసినను, తలయంటి = శిరస్సుముట్టి, బాసచేసినను, అని యర్థము. పాలలో చేయద్ది బాసచేయుట లోకముననున్నది. (బ్రౌను 'పాలతో తలయంటి' Even though they wash their heads in milk and then swear' అని యర్థము చెప్పినాడు. కాని యది యంతయుచితముగా తోచుటలేదు.)

(4) పాలవంచి తిమ్మకవి సారంగధర.—

'పలుమరు తలముట్టి బాసఁజేసినను
తలిరుఁబోఁడుల నమ్మఁదగదు కుమార.' (పు. 6.)

ఇక నితర కవుల ప్రయోగములు —

(5) 'తలతడవి బాస చేసిన
వెలయాలిని నమ్మరాదు వినరా సుమతీ.'

(6) ఈపద్యమునకే సంస్కృతానువాదము.—

'శప్తమపి శిరఃస్పృష్ట్వా
ప్రత్యేతవ్యా న కామిన్యః.' (నీతి గీతలు - 55.)

(7) గీ॥ 'చెంచునింటికిఁబోయి చెంచెతఁ బ్రియము
చెప్పినమ్మించి, తలమీఁదఁజేయి వెట్టి
వెఱకు మని'.— (కాశీ. 5. 71.)

గీ. వయసువాఁడును మిగుల భాగ్యమువాఁడు
నన్నిట నొయారి యై యున్నట్టివాఁడు
దైవగతి నొంటిపాటునఁ దగిలెనేని
రోజ చెడి పైకొనదె యెట్టి యువిదయైన?

టీక.—భాగ్యమువాఁడు = అందముగలవాఁడు ఓజచెడి — నీతివాలి; ఉవిద = యువతి.

వ. అని యటుండె నిమ్నగ. ౧౨

ఉ. ఇంతులమాఁపు నాటుకొను *కొంచనుదే మగవారిచిత్తముల్?
గాంతలకన్నుసన్నల మెలంగుఁ గదా మనసంబకంబు లా

---

(8) చ. 'సందెకాడ నిటు నచ్చెదనంచు భవచ్ఛిగంబుపైఁ
గరమిడిపోయినట్టి తిలఘాతకుగాలి...' (శ్రీనాథునిచాటువు.)

(9) విధవవైశాఖ భాగతిలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రిట్లు వ్రాసియున్నారు.

"తలదడపి = స్నానముచేసి, అని టిప్పణిలోనున్నది. ఇందు 'తలవడవి' అనుపాఠముండవలెను. ఇట్టిప్రమాదము లింకనుగొన్ని సారంగధరచరిత్ర టిప్పణిలో గలవు."

అయితే ఒకమాట.— 'తలతడిపి' కాదుగాని "తలమునిగి" బాసచేయు ఆచారముమాత్రము లోకమునమున్నది. ఆయాచారమును పెద్దన్నగారు చెప్పియున్నారు.

చ. "జిలుఁగులఁ బెట్టుమందొడలఁ జెందిరికపావడ యంతు మైతడిన్
బెళబెళలేని చీరఁ గటి బింకపు చన్నులఁ జేర్చికొంచు, నే
జలకములాడి యాడి యొకచాన కరస్థితకేశయై నృపున్
వెలువడిచూచె, లోబడితి నీకని బాసను నిల్చెనో యనన్." (౦-౧౭)

తలమునిగి ప్రమాణముచేయుట లోకముననుండుగాక. అంతమాత్రమున 'తలవడవి' — అనుపాఠమును 'తలదడిపి' అని దిద్దగూడదు. అందును సారంగధరచరిత్ర వ్రాసిన కవులెల్లరును ఏకగ్రీవముగా వాడిన ప్రయోగమును సారంగధరలోనే దిద్దుట మిక్కిలి సాహసము.

శా. పా.— 'ఎంతరుదే,' ; 'కన్నుసన్నలె.'

ద్యంతము లెంచి చూడ జవరాండ్రయెడాటములందు శక్యమే
యెంతటివానికైనఁ జలియింపక బిగ్గ మనంబు నిల్పఁగన్, ౧౧

టీక.—ఇంతులచూపు, మగవారి - చిత్తమునన్ = మనసునందు, నాటుకొ నుట, ఎందు = ఎచటగాని, అరుదే = ఆశ్చర్యమా? — ఆశ్చర్యముకాదు; ఎందు వల్లననగా? ఆద్యంతము లెంచిచూడన్ = పూర్వోత్తరములను పరిశీలించి చూచిన యెడల, మరు సంబకంబులు = మన్మథుని బాణములు, కాంతల కన్నుసన్నలన్ = స్త్రీల కనుసైగలనుబట్టియే - మెలంగున్ కదా? (స్త్రీ యెవనిని వలచిచూచునో వానినే మన్మథుడు బాణములతో కొట్టునని భా).— ఎంచిచూడన్, మరుసంబ కంబులు = అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము - అను వానిలో * ఆద్యంతములు = ఆదియైన అరవిందము - అంతమైన నీలోత్పలమున్ను, కాంతల కన్నుసన్నలన్ = కాంతల కన్నులన్న సంజ్ఞతోనే - మెలంగుఁగదా? కమ లము - కలువ, కాంతల కన్నులుగానే చెప్పబడుచున్నవిగదా - (అని చమత్కా రము.) ఎంతటివానికైనన్ = ఎంతటి ప్రజ్ఞాశాలికైనను, జవరాండ్ర † ఎడాటము లందున్ = యువతుల విషయమున, మనంబు, చలింపక = చెదరకుండ, బిగ్గనిల్పఁ గన్ = గట్టిగా నిల్పియుంచుటకు, శక్యమే = శక్యముకాదు.

ఆ. వె. నిజము భీష్మునంతటి జితేంద్రియునకైన
నాశ పుట్టు మది నిరాశ పుట్ట
దితరు లనఁగ నెంత యేకాంతమై యున్న
ధనముపట్ల యువతి జనముపట్ల?

* ఆద్యంతచమత్కారము పూ. టీ. లోలేదు. ఆ చమత్కారము వసుచరిత్ర మున నిట్లు ప్రయుక్తమైయున్నది.—

ఉ. "ఇంతి మృదూక్తిమాధురికి నిక్షురసం బెన వోలఁజాలకా
ద్యంతమునోడి మధ్యమ గుణాశ్రయమై తెలకాఁక నెన్ని జ
న్మాంతరముల్ వహించియుఁ దనంతనె ఖండములయ్యెగాని, యా
వంతయుఁ బూనదెంత పొడియయ్యు నఖండతదీయసంపదన్.' (2-46.)

† పూ. టీ. — 'ఎడాటములందున్ = క్రీడలందు.'
స్త్రీల క్రీడలలోనికి దిగినపిమ్మట మనసు నిల్వలేకపోవుటలో వింతలేదు. కావున 'స్త్రీలవిషయమున' అని చెప్పుట సముచితము.

క. వినమే తొల్లిటి తపసుల?
వనితలకుఁ లోనుగానివారుం గలరే?
మన మనఁగ నెంత కరఁగక
మన మనఁగా నెంత కలికి మటుమాయలకున్? ౧౩

టీక.— తొల్లిటి తపసులన్ = పూర్వకాలపు తపస్వులనుగురించి, వినమే = మనమువినుటలేదా. (వారిలో) వనితలకున్ - లోనుగానివారున్ = = లోబడనివారుకూడా - కలరే? ( = లేరని భా.) అంతటివారే అట్లయి రనగా, కలికిమటుమాయలకున్ = ఆడుదానిమాయలకు, కరఁగక = సంతసించిలోబడక - ఉండుటకు, మనము-అనఁగన్-ఎంత = మనమంటే - ఎంతమాత్రపువాండ్లము? మనము-అనగాన్-ఎంత = మన మనస్సనగా ఏపాటిది?

చ. గుఱుతుగ స్త్రీలకుఁ మగలకుఁ మది నిల్కడ లెందు లేవు. నీ
వెఱుగనినీతియుం గలదె? యేటికిఁ దత్తఱపాటు ‡ మీఁదిచే
టెఱుఁగవు నీవివేక మిపు డెక్కడఁ బోయె విచారహీనతన్
గఱటితనంబునన్ బదరి కార్యము సేసిన మెత్తురే * ఘనుల్. ౧౪

టీక.— మీఁదిచేటు = తరువాతవచ్చుకీడు. ¶ కఱటితనంబునన్ = మూర్ఖత్వముచేత. పదరి = తొందరపడి.

---

‘ఎడాటమునన్ = విషయమున’ అనుటకు.—

(1) సీ. ‘వెప మేమియును లేక నీయెడాటమ్మునఁ
బాడిఁ దప్పడుగదా భైరవుండు.’ (భీమ. 2-88.)

(2) ఉ. ‘అన్నలపట్లఁ దమ్ములయెడాటమునన్ సముఁడంచు.’ (విజ.1-27.)

(3) వ. ‘ఈయనుచిత ప్రయోజనంబులెల్లఁ బరులయెడంగాక మాయెడా
టంబునం దగవులగునే.’ (మల్ల. విప్ర. 4-69.)

‡ శా. పా.— ‘మీఁదకెత్తెఱుఁగవు.’ * ‘జనుల్’

¶ పూ. టీ.— ‘కఱటి తనంబునన్ = దుర్జనస్వభావముచేత.’

సారంగధరుడు చిత్రాంగి మేడకుపోవలెనని పట్టుపట్టుట, సుబుద్ధిమాట వినక పోవుటయు చిత్రాంగి తత్త్వము నెఱుగక గాని, దుర్జనస్వభావముచేత కాదు. కావున అతని కఱటి తనము ‘మూర్ఖత’ గాని దౌర్జన్యము కాదు.

“కరటి అనగా మంకు stubborn, brutish.” (బ్రౌను.)

చ. నృపతికుమార లోకమున నీసరి చక్కనివారు లేరు, నీ
విపు డటు పోయినప్పుడె పయింబడి నిన్వలవంతఁ బట్టు న
చ్చపలమృగాక్షి; నీ వది పొసఁగక వచ్చితి వేని రాజుతోఁ
కపటముగాఁగఁ జెప్పి నినుఁ గల్లరిఁ జేయుఁ జుమీ నిజంబుగన్. ౧౫

టీక — అచ్చపలమృగాక్షి = ఆచిత్రాంగి. (చంచలములైన చూపులుకలది. అనగా కనువేదురు కలది అనిభావము.) పయింబడి, వలవంతన్ = మన్మథవ్యథచేత- (కామోద్రేకముచేత) పట్టన్ = నిన్ను పట్టుకొనును. (పిమ్మట) నిన్ను, కల్లరిన్ చేయున్ = అసత్యమాడినవానినిగా చేయును.

క. తల గలిగినఁ గుళ్లాయులు
గల వేవగనైన నీవు గలిగినఁ దావ్ర
క్కలరవము లెన్ని యైనన్
గలిగెడుఁ బోకు మని * యడ్డగా ల్వేయంగన్. ౧౬

వ "వ్యావహారిక సత్యత్వంబుప్రకటించు ప్రపంచంబుచేత వంచితులగు నెఱుక లేని కటుటులకరణి హరిణంబులు మరీచికావీచికాపానవివశంబులై దిశలఁబరి భ్రమించె" (పాండు. 4- 16.)

శ. ర. లో "కటుటి = వంచకుఁడు" అని యున్నది. పూ. టీ. కర్త లాభావమునే గ్రహించినారు. పొరపాటు.

నెం. 205. (తంజావూరు) తాళపత్రప్రతిలో ౧౫ తర్వాత ఈక్రింది అధికపాఠమున్నది.

వ. అదియునుంగాక

క. చిత్రాంగి నిన్నుఁ దలఁపున
పుత్రుఁడవని చూడలేక పొగులును నినుమా
శత్రువురా లటు పోకుము
చిత్రాంగి యున్నట్టి (?) మేడ చెంతకునధిపా.

* శా. పా — "అడ్డఁగాల్వేయంగన్." ("అడ్డఁగాల్వేయంగన్ = కాలు పెట్టఁగా" అని పూ. టీ.)

శబ్దము 'అడ్డగాలు' గాని 'అడ్డఁగాలు' కాదు. శ. ర. కర్త "అడ్డగాలు (అడ్డము + కాలు) అడ్డకట్ట = అడ్డి; విఘ్నము." అనివివరించి అక్కడ ఈపద్యమునే యుదాహరించియున్నాడు.— శాస్త్రిగారు 'గా' కు ముందరసున్న పెట్టుట

టీక.— తాదృక్ కలరవములు = అటువంటి పావురములు, ఏవగనైనన్ = ఏవిధముననైనను, కలిగెడున్ = వచ్చును. పోవుమని, అడ్డగాల్ వేయంగన్ = అడ్డ మాటలు చెప్పి నిరోధింపగా.

క. కోపమునం జూచి యప్పుడా
భూపాలకుమారుఁ డను సుబుద్ధికి 'పొపో
పోపో మ్మ్మరక వలవని
పాపము గట్టెదవు చాలుఁ బదివే ల్వచ్చెన్. ౧౭

టీక.—వలవని పాపము = లేనిపోని పాపము. పదివేలువచ్చెన్ = నీయుపదేశమున పదివేలు (ధనము) లభించినట్లయినది- (ఇంతట ఊరక పో- పో- అని హేళన.)

'పదివేలువచ్చెన్' - ఇదియొక జాతీయము,

గీ. "చాలు పదివేలువచ్చె పాంచాలిదొరికి
నట్టెకద నేఁడు మనయూరి గట్టుగన్న."

పాంచా. పరి. పు. 17

---

పొరపాటు. 'అడ్డగాలు, అడ్డకత్తి, అడ్డపాప, అడ్డచాఁపు మొదలగు పదములకు 'అడ్డంగాలు, అడ్డంగత్తి, అడ్డంబాప, అడ్డంజాఁపు-' అను ననిష్టరూపములను కల్పించుట తప్పు.

'అడ్డగాల్ వేయంగన్' అను జాతీయమునకు 'కాలు అడ్డముపెట్టఁగా' అని టీక వ్రాయుటవలన పూ. టీ. కర్తలకు జాతీయమైన తెనుగుతో పరిచయముచాల తక్కువఅని యేర్పడుచున్నది. విదేశీయుఁడైన బ్రౌనుదొర "అడ్డకర్రలు Obstacles, obstructions, hindrances- విఘాతము. నాపనికి అడ్డకర్రలు వేస్తున్నాడు he throws difficulties in my way." అని ఎంతో చక్కఁగా చెప్పియున్నాడే; చూచుకొనగూడదు?

'అడ్డగాల్వేయుట = అడ్డముగా కాలుపెట్టుట.'
'అడ్డపుల్లవేయుట = అడ్డముగా పుల్లపెట్టుట.'
'కయ్యానికి తలపడుట = యుద్ధమునకు శిరస్సు పడిపోవుట.'

అను రీతి టీకలు పెద్దలని పేరుపడినవారి వ్రాతలలో నుండుటవలన, భవిష్యత్కాలమునభాషకు కలుగు ముప్పు గొప్పదికదా!

చ. అరమర లేక నీ వహరహంబును మచ్చిక( గూడిమాడి ముఁ
‡ పెరిఁగిన మందెమేలమున భీతిల కంటివి గాక యిట్టు లొం
డొరు లని పోవ నోపుదు రఁటోయి ప్రధానికుమార, నేఁడు ని
ష్ఠురతర ఘోరపాతకపుసుద్దులు నీవలనన్ వినంబడెన్. ౧౮

టీక.—♦ ప్రధానికుమార = మంత్రిపుత్రా, అరమరలేక = ఎట్టిభేదమును లేక, అహారహంబును = ఎల్లప్పుడును, కూడిమాడి = కలసిమెలసి, పెరిఁగిన, *మందెమేలమునన్ = చనవుచేత;...పాతకపుసుద్దులు = పాపపు కథలు,

---

‡ శా. పా.—'ముఁ,బెరిఁగిన' (ఇది పూ. ము. పా.)

'మును' కళ గాని ద్రుతప్రకృతికము కాదు.—

క. 'మునుకలు గంగా నదిలో
మును కలుగంగా దిగి.' (విజ. 1—120)

'మునుచెడిన రావణాదుల' (విరాట. 2-58) 'తన మునుపడ్డ బన్నములు' (ఉద్యో. 3-102) 'సంధించి మున్ పోయి.', (కాశీ. 6-37.) 'మునుమున్, గన్నం దగన్ గొండ్రు' (ఉద్యో. 1-70) అనుచోట కకారము గకారమగుట కళాకార్యముగాని ద్రుతకార్యము కాదు. కాబట్టి 'మున్ బెరిఁగి' అనుట తప్పు. పూ. ము, ను బట్టి శాస్త్రిగారు, వారిని నమ్మి వావిళ్లవారును పొరపాటుచేసినారు.

♦ 'ప్రధాని (శ. ర. లో లేదు) A superior or governor. A minister, a president. A principal',—(బ్రౌను.)

* పూ. టీ.—'మందెమేలమునన్ = పరిహాసముచేత.'

'పరిహాసముచేత' అనుట సరి కాదు. పరిహాసమునకు, అనియే లోకమున వాడుక. అది యట్లుండగా, కూడిమాడి పెరుగుటచే నేర్పడునది 'చనవు' గాని పరిహాసము కాదు, సుబుద్ధి చౌరవచేసికొని హితవు చెప్పినదియు 'చనవు' చేతనే. ఆ రచనకు మూలమయిన నవనాథచరిత్రమున నిట్లున్నది.

"నను నీవు పిన్నటినాఁటి నుండియును
మననూదఁ గొలిచిన మందెమేలమునఁ
బలికితి గాక" (పుట. 41.)

"మందెమేలము. Over familiarity, leading to insolence, meddling, impertinence. మించిన చనవు." (బ్రౌను.)

ఉ. ఎక్కడిసుద్దు లయ్య యివి? యెవ్వరి కైనను జెల్లుఁ గా కిలం
దక్కినరోజ లా విమలతామరసాక్షికిఁ గల్గ నేర్చునే
యక్కట తప్పి దారి యటు లైనను నా హృదయాంబుజాత మా
దిక్కునఁ జిక్కునే పరసతీవిముఖం బని నీ వెఱుఁగవే? ౧౯

టీక — ఎక్కడి సుద్దులు = ఎక్కడి మాటలు; (పనికిమాలినవి- అని భా.).— † తక్కినరోజలు = (క్రమము) తప్పినవర్తనములు,— ఆ - విమల తామరసాక్షికిన్ = స్వచ్ఛములయిన తామరలవంటి కనులుగల - ఆ చిత్రాంగిదేవికి (పరిశుద్ధురాలికి - అని భా.) కల్గనేర్చునే = కలుగనే కలుగవు. తప్పిదారి = పొరపాటున. అటులైనను = అట్టి దుర్బుద్ధి ఆమెకు కలిగినను, నా హృదయాంబుజాతము = నా మనస్సు, ఆదిక్కునన్ = అచ్చటు, చిక్కునే = పట్టుపడునా (-ఆమెకు వశమగునా?) నామనసు - పరసతీ విముఖంబు = ఇతర స్త్రీలవిషయమున ఇచ్ఛలేనిది. అని నీవెఱుఁగవా?

'తప్పిదారి.' జాతీయము. తప్పి + తారి (కళమీద దకారాదేశము.)= తప్పి-దారి. పొరపాటున; ఎట్టకేలకు; ఎట్లైననుసరే; అనునర్థములలో వాడుక.

గీ. 'శతమతికి,- వాస్తికునకుఁ బొమందునకును,
గర్భముగుటించి యాచించు గర్హితునకు
నీ పరమగోప్య మో పుత్రి, యోపురంధ్రి,
తప్పిదారియు నెఱిఁగింపఁ దగవుగాదు.' (పాండు, 1—211.)

గీ. 'దారితో త్రోవశాలై, తప్పిదారియతనిఁ
జూచితిమె యంచు.' (ఉ. రా. 1—123)

('తప్పితారి' అని వావిళ్ల ప్రతిపాఠము. అసాధువు.)

శ్లో. 'ఆషాఢ శుద్ధ పంచమ్యాం వచ్చునే వృద్ధగౌతమీ;
అథవా తప్పిదారైన ద్వాదశ్యా మదితప్పదూ.'

['వచ్చెనే' అని శా. పా. (అముక్త. పుట. 122) సరికాదు.]

---

† పూ. టీ — తక్కినరోజలు = మిగిలినక్రమములు'.—

కొన్నిక్రమములు ముందుచెప్పియుండినగదా 'మిగిలినక్రమములు' అనవలసినది? వారు ముందేమి క్రమములుచెప్పిరి? 'మిగిలిన = విలువయున్న, క్రమములు ఆమెకు కలుగనేర్చునే' అనునది ప్రకరణానుగుణమయిన యర్థము కాదు. తక్కు = తప్పు. (సూ. శ. ర.)

క. ఆదేవి యొక్కటియు నుఱి
యీదేవియు నొక్కటియునె యిద్దఱు నాకుఁ
గాదిలితల్లులు గా రే
భేదంబులు గలవె తల్లిబిడ్డల కెందుఁ. ౨౦

టీక.— గాదిలి = ప్రియమైన.

క. *అమె యఁట నన్ను బలిమిఁ
గామించు నఁట యొడఁబడక క్రిమ్మఱి నే రా
స్వామికి వెగటుగ ననునఁట
యామాటకె యాజ్ఞ వెట్టు నఁట విభుఁ డహహా! ౨౧

టీక.— నేఁ = నేను, ఒడఁబడక= ఇష్టపడక, క్రిమ్మఱిరాఁ=తిరిగిరాగా, స్వామికిఁ = ప్రభువునకు, వెగటుగఁ = రోతపుట్టునట్లు, అనునఁట = చెప్పునఁట, విభుఁడు = రాజు, ఆమాటకె, ఆజ్ఞవెట్టునఁట = శిక్షించునట.

ఉ. ఆ యను పాతకం బని భయంపడ కూరక యేల నాపయిఁ
మాయలువన్ని భూవరునునంబుఁ †గనారిలఁ జేయుఁ? జేసెఁ బో,
యాయనయేలపుత్త్రుఁడని యాత్మఁదలంపక నొంచు? నాయెనా
లే యిది వట్టిశంక పని లే దిటు వంటివె నీతిమార్గముల్? ౨౨

టీక.— కనారిలఁ = కోపయుక్తమగునట్లు, ఏలచేయును, ఏలనొంచుఁ = ఎందుకు నొప్పించును?

క. నామదికిఁ సరి పో దిది
యేమి, యవశ్యంబు పోదు నిప్పుడె దెత్తుఁ

---

* పాఠాం.— 'అమఁట నన్నఁట'

† శా. పా.— 'కలంగఁగ' (ఇది పూ. ము. పా.)

తంజ. తాళ - ప్రతులలో నాలుగింటిలోను - 'గనారిల' అను పాఠమే యున్నది.

నా ♦ముద్దు పావురము నని
భూమీశవరసుతుఁడు గడచి పోవ, నతఁ డనియెన్. ౨౩

ఆ. వె. ఈ సుబుద్ధిమాట లెంతలే యని పోమె
ఈసు బుద్ధి నిడుఁ జుమీ లతాంగి
నిలు పరాకు మాని తలపోసి చూడుమా
నిలుప రాకు మనుచు నలుగ నేల. ౨౪

టీక.— ఈ - సుబుద్ధిమాటలు, ఎంతలే = ఏమిలెక్క, అని, పోయెదవు, లతాంగి = ఓచిత్రాంగి, ఈసు-బుద్ధిన్-ఇడును = మనసులో నీమీద ఈర్ష్యవహించును, నిలుప-రాకుము = నన్ను నిరోధింపవద్దు, అనుచున్; అలుగనేల = ఎందుకు కోపించెదవు, నిలు - పరాకుమాని.

గీ. నిన్నుఁ జూచిన నెటువంటి నెలఁత కైన
మనసు గరఁగక యుండునా † మనుజనాథ
తనయ, 'చిత్రాంగి తల్లి నా' కనియె దకట
వారకాంతల కెందైన వావి కలదె? ౨౫ *

టీక.— వారకాంతలకున్ = భోగమువాండ్లకు, వావి = కొడుకు, తమ్ముడు, అను నియమము, కలదె = లేదు.

---

♦ శా. పా.— 'ముద్దుఁబావురము' ('ముద్దుపారువము' నని పూ. ము.పా., తంజ తాళ. పాఠమున్న.)

'ముద్దుపారువము' ను 'ముద్దుఁబావురము' గా మార్చుట రోత. (చూ. ౪-వ పద్యముక్రింద.)

† శా. పా.— 'మనుజనాథ, యల్లచిత్రాంగి' ('మనుజనాథతనయ, చిత్రాంగి' అని తంజ. పా.)

సారంగధరు డప్పటి కింకను 'మనుజనాథుఁడు' కాలేదు. కావున శా. పా. సరి కాదు.

* ఈ ౨౫ మొదలు ౨౭ వరకు గల పద్యములు, పూ. ము. నను, కొన్ని వ్రాతప్రతులలోను లేవు.

క. ఏకాంత నైనఁ బురుషుం
డేకాంతమునందుఁ జేరు నేనియు నతనిన్
లోకాపవాద మంటదె?
చీకాకుగ ధైర్య మెడలఁ జేయఁడె మరుఁడున్? ౨౩

టీక.—లోకాపవాదము = లోకమువలననింద, అంటదె = చుట్టుకొనదా? మరుఁడున్ = మన్మథుడును, చీకాకుగన్ = చిందరవందరగా (చేసి) ధైర్యము, ఎడలన్‌చేయఁడె = పోగొట్టడా?

క. వేగ నరేంద్రుఁడు రాకే
బాగా యిటు చనఁగ వాఁడిపలు మొన సోఁకన్
భోగంబున నిను ‡ మెదుపదె
భోగిని యైనపుడు చేరఁ బోరాదు సుమీ. ౨౪

టీకా.—(ఈపద్యమున చిత్రాంగి భోగినీశబ్దశ్లేషచేత సర్పముగా చెప్పబడుచున్నది.—) నరేంద్రుఁడు = రాజు, (విషవైద్యుడు. అని, అర్థాం) రాకే = రాకమును పే.— ఆశడు లేని సమయమున' అని భా. వేగ- ఇటుచనన్ = ఇట్లు తొందరపడిపోవుట, బాగా = మంచిదా? (మంచిదికాదనుట.) ఆదిత్రాంగి భోగినియైనపుడు = భోగకాంత అయినందున, [ఆమ- పాము కాబట్టి, అని- అర్థాం.) వాఁడి పలుమొన సోఁకన్ = దంతక్షతములు కలుగునట్లుగా, (తీక్ష్ణము లైన కోరలు దిగబడునట్లుగా, అని- అర్థాం.) భోగంబునన్ = సంభోగమునందు, (పడగచేత,- అని అర్థాం.) నినున్ మెదుపదె = నిన్ను నలిపివేయదా? (= నలిపివేయును) కాబట్టి, దానిని- చేరఁబోరాదు సుమీ.

‡ పాఠాం.—'ఐ'దుపదె'

ప్రా.టీ.- 'భోగస్త్రీయైనందున. (పగడవిప్పియున్నపుడని యర్థాంతరము.)'

పాము పడగవిప్పియున్నప్పుడు 'భోగిని' యై, ఇతర సమయమున 'భోగిని' కాకపోదు. అది యెప్పుడును 'భోగిని' యే. 'భోగిని' యనగా 'పడగ కలది' యని యర్థము. పడగను విప్పినను- ముడిచినను, భోగిని- భోగినియే. కావున 'భోగినియైనపుడు' అనగా- 'భోగిని కాబట్టి' అని సరియైనయర్థము. ప్రా. టీ. తప్పు.

ఆ. వె. ఉగ్రశాసనుండు * నిగ్రహింపఁగ రాజు,
తనయుఁడనుచుఁ దప్పు ♦ తాళి వినఁడు
తండ్రి సేయు నాజ్ఞ తాళెద నంటివా
నింద నిజము గాఁగ నిలుచు నీకు. ౨౭

టీక.— నిగ్రహింపఁగన్ = తిరస్కరించుటకు, రాజు, ఉగ్రశాసనుండు = చండశాసనుడు. (రాజు చండశాసనుడుగావున నీవు తిరస్కరింపజాలవు) అతడు, తనయుఁడనుచున్ = నా అబ్బాయిగదా అని, తాళి = నిదానించి, తప్పున్ = నీ నేరమును, వినఁడు = వినవైనను వినడు (వెంటనే శిక్షవిధించునని భా.).— శిక్షను సహింతునంటివా? లోకమున నిందపడుదువు.

గీ. చదువుకొంటివి నీతిశాస్త్రంబు లెల్ల
నీ వెఱుఁగని మేరలు లేవు జగతి
నైనఁ దెలిపితి నీమన సయ్యె యింక
ధాత వ్రాసినవ్రాఁతకుఁ దప్పుగలదె?

టీక.— మేరలు = ధర్మములు.

క. 'ఈ రాసుతుసమ్ముఖమునఁ
జేరి యెవరు బుద్ధిమతులు చెప్పెడివారల్

---

* తా. పా.— 'నిగ్రహింపక' ('నిగ్రహింపఁగ' తంజ. పా. ఉచిత తరము.—)

♦ తా. పా.— 'తాళిమిడఁడు' (తాళిమి ఇడఁడు= ఓర్వఁడు, అని పూ.టీ.) 'తాళు' యొక్క కృదూపము 'తాలిమి' గాని తాళిమి కాదు.— "తాళు అని ధాతువుగానున్నపుడు దలకు లకారముతోనుండును. ఈ ళకారము కృదంతత్వావస్థయందు లఘు లకారమయి 'తాలిమి' అగు. రూపాం.— తాల్మి" (గుప్తా.ప్రకా. పుట. 484.)

నిదానించు, ఓర్చు, అనునర్థమున 'తాళిమిడు' అను క్రియయున్నదేమో? 'తాళివినఁడు' తంజ. తా. పా. (ఇవి; ఈ పద్యములు పూ. ము. లలేవు.)

లేరె రాయని పెద్దలు
‖ దూఱుదు † రందుకొఱ కళుకుతో ననవలసెన్. ౩౦

టీక.—సమ్ముఖమునన్ = ఒద్ద, చేరి- బుద్ధిమతులు = హితములు (=మంచి మాటలు), దూఱుదురు = నిందింతురు,- అళుకుతోన్ = జంకుతో, అనవలసెన్= చెప్పవలసివచ్చినది.

'బుద్ధిమతులు చెప్ప' - ఇదియొక జాతీయోక్తి.—
ఎ. గీ. బుద్ధిమతిఁ జెప్పి స్వాములు దిద్దుకొనిన
నేపనికినైన దాసురా లోపఁగలదు." (వైజ. 2-111.)

"బుద్ధి- వ్రాయగల బుద్ధిమతులకు వ్రాయించి పంపిస్తారావలెను. This is a common phrase at the end of letters, implying "I request a reply"- (బ్రౌను.)

క. ‡ నావల్లఁ † గొదవ లే దిఁక
దేవరకును విన్నవించితిని, మీచిత్తం;
బీవిధముఁ దెలుపకున్న ధ
రావరసుత మీ రెఱుఁగరా సర్వజ్ఞుల్? ౩౧

టీక.— ధరావరసుత = భూపాలకుమారా, సర్వజ్ఞుల్ = అన్నిసంగతులు ఎఱిగినవారు.

---

‖ శా. పా.—'దూఱుదురు.' తప్పు. దూఱుదురు. ఒప్పు.(చూ. ౬౧ క్రింద)

† శా. పా.—'రటుగాన నళుకుతో.'

పూ. ము. నను, తంజ. ప్రతులలో నాలుగింటను 'రందుకొఱకళుకుతో' అను పాఠమేయున్నది.

‡ శా. పా.— 'నావలన' (పూ, ము. పా.)

వ్రాతప్రతులలో పెక్కింటిలో 'వల్ల' అనియేయున్నది. 'వలన' అని దిద్దనక్కరలేదు. (వివరములకు, 'ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజము' 102-105, పేరాలను, బాల. శర. వ, 'వల్ల' అను ప్రకరణమును చూచునది.)

† శా. పా.— 'కొదువ' (ఇది పూ. ము, పా.)

'కొదవ' తంజ. పా. శ. ర. లోగూడా 'కొదవ' 'కొద' అను రూపములే గాని 'కొదువ' లేదు. 'ఇట్టికొదవ మాకొదవసేల' (రామా. 3. ఆ.) అని యమక

క. అనిన నగి యెందుఁ గలదే
మన సెఱుఁగని కల్ల యొడలు మఱచిన సివమున్?
కనె దందు కేమి, మనసుకు
మనసే తార్కాణ మని కుమారుఁడు వేగన్. 3౭

టీకా.—మనసు + ఎఱుఁగని, కల్ల = అబద్ధము, ఒడలు = శరీరమును- మఱచిన- సివమున్ = దేవతావేశమున్ను, ఎందున్-కలదే? (=లేదనుట.)- అందు కేమి = దానికేమి? (నీకుతోఁచినమాట నీవు చెప్పితివి. నామనస్థైర్యమును) కనెదు = నీవేచూచెదవు. (నామనసు దృఢమైనది; పవిత్రమైనది. అనువిషయమున, నా) మనసుకుఁ నా) మనసే, తార్కాణము = సాక్షి.

'మన సెరుగనికల్లా? ఒళ్లెరుగనిసివమా?' అనిలోకోక్తి. కల్ల చెప్పబూనుకొన్న వాఁడు, ముందుగా మనసులో సరిపరచుకొని గాని చెప్పఁడు; సివమెక్కి (ంచుకొని) యెగురువాఁడు శరీరమునకెట్టి యాపదయు రాకుండ చూచుకొనుచునే యెగురును. కావున మనసెరుగని కల్లయు, ఒడలెరుగని సివమును నుండవని లోకోక్తి యొక్క భావము.

'పరసతీ విముఖమైన నామనసున నాకెరుకలేకయే కామము కలుగుట అసంభవము. చిత్రాంగి మదనావేశ మెక్కించుగాక; ఎక్కించినను నేను ఒడలు మరచి వర్తింపను' అని సారంగధరుని పలుకుల తాత్పర్యము.

---

మున నిబద్ధమైయున్నది, కొదవ, అంతిమాక్షుర లోపమును చెంది 'కొద' అవుచున్నది. (చూ. శ. ర.) నట్టువ, నట్టు; తట్టువ, తట్టు; చట్టువు, చట్టు; రట్టువు, రట్టు; కొలఁకువు, కొలఁకు; పుట్టుక, పుట్టు; నడక, నడ; పొదరు, పొద; పరిభ్రష్టులీతర గతికి చేరినవే. కావున కొదయొక్క తొలిరూపమైన 'కొదవ'ను 'కొదువ' అనుట సరికాదు. శాస్త్రిగారి వ్రాతలలో సర్వత్ర 'కొదువ' యే కనబడుచున్నది.

౧ శా. పా.—'కలదె మన సెఱుఁగనికలయు.'

'కల' మనస్సునకు జాగ్రత్త తొలగినప్పుడు గలిగెడి యొక యవస్థ. అది యాక స్మికము. జాగ్రత్త లేని సమయమున అకస్మికముగా గలుగు కలను మనసు ముందుగా నెరుగుట కానిపని. కావున కలలు మనసెరుగనివేగాని యెరిగినవి కాజాలవు. కల ఆకస్మికము, అనుటకు.—

క. వల దన్న మాన కరిగెఁ
జలమునఁ దనపాలివిధి వెసఁ గొనిపోవఁ;
దొలుజన్మంబునఁ జేసిన
కొలయును బుణ్యంబు కట్టికుడుపక *పోనే. 33

టీక.— కొల = పాపము, కట్టికుడుపక = నిర్బంధించి ఆ యా కృత్యముల ఫల మనుభవింపజేయక, పోనే = పోవునా;

క. చనుచో వాకిటిపెద్దలు
గని సిగ్గున లేచి ‡'రాజుగా రిట లేరే'

---

¶ "పాత్రీభూతు లెస్స పరికించి యతఁడడు
గకయునొకఁడు సెప్పకయు మునుపుఁ
బనసపండ్లు దిగిన పరిగ స్వప్నముగన్న
నెఱిఁగ, నొసఁగి వెఱఁగు పఱుచుటొప్పు". (ఆము. 4-274)

'స్వప్నముగన్న నెఱిఁ = ఆకస్మికము గాననుట.'— సంజీవని.

'మనస్సున కెరుకలేకుండా కలరానియట్లే నాకెరుకలేక కామముకలుగ'దనుట సరికాదు. కలవంటిదికాదు కామము. కామమును మనసునిరోధింప వచ్చును. కల నట్లు నిరోధింపరాదు. సారంగధరునికి గలుగు కామము కల వంటిదే యగుచో అది యని వార్యమగును. అప్పుడాతని పరసతీవిముఖత భంగమగును. కావున 'కల' పాఠము గ్రాహ్యము కాదు. పూ. ము. నను, తంజ. ప్రతులు నాలుగింటిలోను గూడా 'కల్ల' పాఠమే యున్నది. కల్ల చెప్పుట మనసుకు లోబడిన పని. ప్రయత్నపూర్వకమగు కృత్యము. కామమునట్టిదే.

* శా. పా.— 'ఉన్నే'

పూ. ము. నను, పెక్కు వ్రాతప్రతులలోను, 'పోనే' అను పాఠమున్నది. బా. శం. అనువాదమునను, 'కట్టి కుడ్వకపోనె కర్మబంధములు' (3-172.) అని యున్నది. కావున నదియే సరియైన పాఠము.

పోవునే, వు లోపముచేత 'పోనె' యవుచున్నది. శా. 'నీ కార్యార్థమె పూని తానెచటికేనిం గొంచుపోచున్న వాఁడో.' (క శా 3-88)

‡ శా. పా.—'రాజు గారిట లేరే! యని కొదుకుచు, ననలేకుండిన' (కొదుకుచుఁ = నోరుకదలఁబడుచు' అని పూ. టీ.) 'కొతుకుచు' పాఠాం.

---

¶ ఈపద్యమునకు శాస్త్రిగారు వ్రాసిన టీక చాలా పొరపాటుగానున్నది.

యని కొంకుదు మన, 'లేకుం
డిన నే మాయె' నని మందటిలఁ బల్కెఁ దగఁ. ౩౮

టీక.—వాకిటి పెద్దలు = ద్వారపు కావలి పెద్దలు. రాజు గారితులేనే-అని, కొంకుదుమన్ అనన్ = సంకోచింతుము, అనగా.—మందటిలన్ పల్కె = సంకోచపడుచున్నట్లు పలికెను (—లేకపోతేనేమి? పరవాలేదులే, అని)

సీ. సికపువ్వు‡ లెత్తుతావికి వెంటఁ బడు తేఁట్ల
ఝుంకృతి మాగధ స్తవము గాఁగ,
గడిఁది రాచకుమార గండ పెండేరంపు
రవళి కంచుకిలోక రవముగాఁగఁ,
దల చుట్టివచ్చు దృగ్ధాళధళ్యప్రభ
లిరువంక వేయు చామరలుగాఁగ,
నలుదెస ల్మించునిట్లు గొలుపు దేహచ్ఛాయ
తలఁగఁ ద్రోయఁగ రాని బలము గాఁగ,

గీ. రాజసంబునఁ గక్ష్యాంతరములు గడచి
యరిగె నపుడు జగన్మోహనాంగవిజిత
రాజరాజకుమారసారంగధరుఁడు
రాజరాజకుమార సారంగధరుఁడు. ౩౯

టీక.—జగన్మోహ...ధరుఁడు.—జగన్మోహన = లోకమును మోహింప చేయునట్టి, అంగ = శరీరముచేత, విజిత = జయింపబడిన, రాజరాజకుమార= (కుబే

---

ఆ కావలివారు, ఏమియునన లేకయే యుండినయెడల, మరి సారంగధరుడు 'మందటిలఁబల్కె' వలసినపనియేమి? ఏమియునుండదు. కావున ఆ యన్వయము సరి కాదు. మరియు, కావలివాండ్రు ఏమియునన లేకుండుటకు కారణము 'సంకోచము' కాని 'నోరు తడఁబడుట' కాదు.

కొంకు = సంకోచించు, అనుటకు.—

క. 'తనకు ననిష్టంబగునో, యని కొంకుట-శంక.' (న. భూ. 3-58)

"కొంకుట - కొంకుట. To doubt, hesitate, pine" (బ్రౌను).

‡ శా. పా.—'లెత్తుఁదావికి.' ('లెత్తుతావికి' అని పూ. ము.) 'ఎత్తుతావి'

నుని కుమారుడైన) నలకూబరుడును, సారంగధరుఁడు = చంద్రుడును- కలవాఁడు (అనగా — నలకూబచంద్రులవలె అందగాడు) అయిన, రాజరాజ కుమార సారంగధరుఁడు = రాజరాజుయొక్క కుమారుడైన సారంగధరుడు - సిగపువ్వుటెత్తుతావికిన్ = సిగకుచుట్టిన పూలదండల సువాసనకు ('సరము లెత్తులు దండలు సరుల నంగ, నామధేయంబులగుఁ బువ్వుదామములకు' ఆం. సం. స్థా. 29) వెంటఁబడు, తేంట్ల ఝుంకృతి = తుమ్మెదల ఝుంకారము. మాగధస్తవము కాఁగన్ = స్తుతిపాఠకుల పొగడ్త కాగా, కడిఁది...రవళి.—*కడిఁది రాయకుమార = వీరులయిన రాజకుమారులకు, ('రాయః A king, prince It is a coruption of రాజన్' ఆప్టి.) గండ = మగడు, అను బిరుదుచిహ్నమైన, గండపెండేరంపు రవళి = కాలియందెయొక్క శబ్దము, కంచుకిలోకరరవము= అంతఃపురపు కావలివాండ్ర కలకలము, కాఁగన్;-

---

అను పూ. ము. పా. తప్పని కాబోలు శాస్త్రిగారు 'ఎత్తుఁదావి' అని సవరించినారు. సవరణ సరియైనది కాదు 'ఎత్తుతావి' ష. త. కావున నుగాగమసంధిచేయుట తగదు. ఇక్లేవారు 'కొడుకుఁబరిణయము'- (౧-౬౧) 'కొప్పుఁగప్పుడాలు' (౨-౭౧) అని మరి రెండుతావులలోఁగూడా ఈ సంధిని చేసినారు.

*పూ.టీ.—కడిఁది = గొప్పయైనటువంటి, రాయకుమార = సారంగధరుని యొక్క, గండపెండేరంపు = బిరుదుటందెయొక్క, రవళి.'

(a) రాయకుమార - గండపెండేరము' అని, షష్ఠీ తత్పురుషమా? 'రాయకుమారయిల్లు' 'రాయకుమారయన్న'; 'రాయకుమారపెండ్లాము' అని ష. త. చేయవచ్చునా? కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు.' (బా. సమా. 3.) కావున 'కుమార' శబ్దముతో 'గండపెండేరము' ను గుదిగూర్చుట సరి కాదు.

(b) 'గొప్పదియైన — రాయకుమారుని (=సారంగధరుని) యొక్క — బిరుదుటందెరవళి- కంచుకిరవము కాగా, సారంగధరుఁడరిగె'— ననుట వన 'సౌందర్యవతియైన - రాజతనయుని భార్య (=సీత) తనకు సహచరి కాగా - రాముడరణ్యమునకరిగెను' అనుటవలె హాస్యభాజనముగానున్నది.

(c) పద్యమునగల, సికపువ్వుటెత్తులు, నేత్రకాంతులు, దేహచ్ఛాయ, అనువానికడ చెప్పక, ఒక్క 'గండపెండేరము' కడమాత్రము 'సారంగధరుని యొక్క' అని చెప్పుటవలన, పువ్వుటెత్తులు మొదలైనవి అతనివి కావనియు, గండపెండేరము మాత్రమే అతనిదనియు నొక విపరీతార్థమేర్పడుచున్నది. కావున పూ. టీ. యన్వయమార్గము సరియైనది కాదు.

తలచుట్టినమ్ము = తలచుట్టును వ్యాపించియున్న (= విశాలములైన) దృక్ ధారాధళ్య ప్రభలు = నేత్రముల ధళధళ కాంతులు, ఇరువంకల = రెండువైపులను, జేయు; చామరలు (చామరము. రూపాం.— 'చామర') కాఁగఁ;- నలుదెసల = నాల్గుదిక్కులను, మిఱుమిట్లుగొలుపు = మిఱుమిట్లుగొనజేయు, దేహచ్ఛాయ, తలఁగఁ ద్రోయఁగరాని = ఎడబాయరాని, బలము కాఁగ = సిబ్బంది కాగా;— రాజసంబు

తత్త్వమేమనగా?— 'కడిఁది రాయకుమారగండ - పెండేరపు రవళి' అని సరిపడిన విభాగము. 'గండ' శబ్దము కన్నడము, 'మగడు' అనియర్థము.

(1) "మూరురాయరగండ పెండేర మణిమ
రీచి రింఛోళిగలయు నావృతములగుచు." (మను. 1-15.)

'మూరు...పెండేర = అశ్వపతి గజపతి నరపతి అనే ముగ్గురు రాజులకు మగడనే - బిరుదుగల కాలియందె యొక్క,' అని జూలూరివారి టీక.

(2) "ఎం, తెంబరగండాంక - యతులధృతినిశ్శంకా." (వసు. 3-187.)

'ఎం తెంబరఁడనెడు రాజునకు మగఁడవు గనుక నెంతెంబరగండఁ డనెడు బిరుదు గలవాఁడా.' అని వ్యాఖ్య.

(3) "గబ్బిమన్నెకుమారగండ - పెండారంపు
జిగి పదాగ్రంబుపైఁ జెంగలింప." (విజ. 1-36)

'గబ్బి...జిగి = గర్వితులయిన మన్నెరాకొమరులయొక్క జేత (యని తెలుపుటకై బిరుదుగా ధరించినట్టి) యందెయొక్క కాంతి' అని టీక.

'రాజద్రోహరగండ', 'ఉభయరగండ'; 'జగనొబ్బగండ', 'గండరగండ', 'రాయకుమారగండ' అనునవి బిరుదుపదములు. బిరుదుపదములలో సమాసదుష్టత లేదు.

క. "గండఁడు, శంభుద్రోహర
గండఁడు, మహి నన్యదైవగండరులకుఁదా
ఖండఁడగు వీరభద్రుఁడు
దండెత్తె." — (వీరభద్ర. 5-79)

సీ. దర్పితాహితనృపోత్తములు నిన్నెదిరింపఁ
గలరె ధీరోత్తమగండ బిరుద." (నరస- 5-167)

నన్ = రాచకీవితో, ‡ కక్ష్యాంతరములు = హజారములు, కడచి = దాటి, అరిగెన్ = పోయెను.

—: చిత్రాంగివలపు :—

గీ. అంత నొక కాంత యరుదెంచి యతనిఁ గాంచి
సరగఁ జని 'యమ్మ సారంగధరుఁడు వచ్చు
చున్నవాఁ' డని దెలుప న య్యుత్పలాక్షి
కోర్కి లీడేఱె నని మెచ్చుకొనుచు నపుడు. ౩౬

ఉ. కంతుఁడొ? కాక యారజని కాంతుఁడొ? లేక ‡జయంతుఁడో యితం,
డెంతవిలాస మెంతకళ యెంతయొయార మటంచువిస్మయా
క్రాంతమనంబు*తోడఁ బులకల్ దొలఁకన్ గనుఱెప్ప వేయక
కాంత మహాభిలాషఁ దటకాపడి చూచెఁగుమారశేఖరున్. ౩౭

టీక.—కంతుఁడో = మన్మథుడో, రజనికాంతుఁడో = చంద్రుడో, జయంతుఁడో = ఇంద్రునికుమారుడో; ఎంతవిలాసము! ఎంతకళ! ఎంతబయ్యారము (కం

‡ పూ. టీ.— 'కక్ష్యాంతరములు = లోఁగిళ్లు.'

వ్యవహారమున 'లోగిలి- లోగిండ్లు-లోగిళ్లు' అనియేగాని 'లోఁగలి-లోఁగండ్లు-లోఁగళ్లు' అని వినబడుటలేదు. శ. ర. కర్త 'లోఁగిలి. లోఁగలి యొక్క రూపాంతరము. (వాడుకయందిట్లు కనఁబడుచున్నది కాని దీనికిఁదగిన ప్రయోగము చిక్కినదికాదు.)' అన్నాడు. అందువల్ల 'లోగిండ్లు' అంటే, యెక్కడ గ్రామ్యతాదోషము తటస్థించునో అన్న భయమున పూ. టీ. వారు 'లోఁగళ్లు' అన్నారు. పాపము, వారికి (శ. ర.) నిఘంటు భాషాపరిచయమేగాని వ్యవహారభాషతోను - కావ్యప్రయోగములతోనుగూడా - పరిచయముతక్కువ. 'లోఁగిలి' కావ్యములందెల్ల కలదు.

(1) "నికర్షణ మొప్పు లోఁగిలియన." (ఆం. భా. 2-23.)

(2) "నీ, లోఁగిటఁజేర్పనే యుభయలోకసుఖంబులు నన్నుఁబొందినన్" (ఉ-హరి. 1-64)

(3) "గంటి చిత్రాంగి లోఁగిటికేల్రావాలె." (నవనాథ- పు. 29.)

‡ పాఠాం.—'వసంతుఁడో,'

* 'తో సపులకస్తనియై' అని శా. పా.

కునివలె విలాసవంతుడనియు, రజనికాంతునివలె కళానిధియనియు, జయంతునివలె * ఒయ్యారము కలవాడనియు, (క్రమముగా అన్వయము.) విస్మ...బుతోఁ = మనస్సున ఆశ్చర్యము నిండుకొనగా. పపు...నిర్యై = కుచములు పులకరింపగా, ఆకాంత = చిత్రాంగి, కుమార శేఖరుఁ = యువకులలో మేటియైన సారంగ ధరుని. మహాకేళిలావుఁ, * తటకాపడి = ఆశ్చర్యాతిశయముచేత - రిచ్చపడి కను ఱెప్పవేయక చూచెను.

చ. ఉరుకుచ డెందమెంత మ్రుచ్చవొ మఱి తియ్యనితుంటవింటనే
‡ విరవిరవోవు నారిఁ గొని పెన్మిటి గొజ్జెఁగతూపు చేత ¶ న
చ్చెరువుగఁ బొంచి కంటికి దిసింపనివాఁడవు డేసి యార్చెఁబో
సురసుర సుక్కి; మెత్త నగుచోటనె గుద్దలి వాఁడియూఁ గదా.

టీక.—ఉరుకుచ = (గొప్పకుచములుగల) ఆచిత్రాంగియొక్క, డెందము= చిత్తము, ఎంతమ్రుచ్చవో = ఎంత మెత్తనిదో, మఱి- ♦కంటికి దిసింపనివాఁడు = కంటికి కనబడనివాడయిన మన్మథుడు=అతనుడు. (కంటికి కాగనివాడు. అత్యల్పుడని సారస్యము) అచ్చెరువుగఁ, తియ్యని తుంట వింటనే = కమ్మని చెరకుగడ ధనువు

---

*పూ. టీ.—'తటకాపడి = తొట్రుపడి.'

'తటకాపడుట' యనగా 'రిచ్చపడుట' గాని - తొట్రుపడుట కాదు. తొట్రుపడుట = తడఁబడుట. (చూ. శ. ర.) 'ఆశ్చర్యమును జెందెననుమాట కర్థమా, తటకాపడెననంగ.' (ఆం. భా. 8—101.) "తటకపడుట. To be surprised" (బ్రౌను.) శ. ర. కర్త 'తటకాపడు = చేష్టలు తక్కు' అని యర్థముచెప్పి, అందుకీపద్యమునే యుదాహరించినాడు. కావున పూ. టీ. సరికాదు.

‡ శా.పా.— 'విరవిరఁబోవు'.—ధాతువు 'విరవిరవోవు' గాని 'విరవిరం బోవు' కాదు.

¶ పాఠాం.—'మచ్చరమునఁ బొంచి చచ్చియును చావనివాఁడవు డేసియార్చె' ('విరివిరిఁబోవు'-అనియొక పాఠము. అర్థాంతర చమత్కారము లేదు గావున గ్రాహ్యము కాదు.)

♦ పూ. టీ.—'దిసింపనివాఁడు = అందగింపనివాఁడు.'

'దిసించు' అను క్రియ నిఘంటువులలో లేదుగాని, లోకవ్యవహారమునమున్నది. కొన్ని కావ్యములందును ఉన్నది. కాని, ఆక్రియకు 'అందగించు' అను నర్థము లేదు.

తోనే ['తియ్యని' అనుటచేత, అధనువు ఆనందదాయకమైనదిగాని బాధాకరమైనదికాదనిన్ని- 'తుంట' అనుటచేత, అదియును తునుకయేగాని సమగ్రమయినది కాదనిన్ని, అట్టి యాయుధముతో గొట్టుట అచ్చెరువుగదా యనిన్ని, సారస్యము) విరవిరపోవు వారిఁ గొని = తురతురలేచిపోవు తుమ్మెదలబారు నారిగా గ్రహించి (ఒకటిగా నేర్పడక విరవిర విరిసిపోవు వారి అని సారస్యము) పెన్నెఱి గొజ్జెఁగ తూపుచేతన్.— * పెన్నెఱి=గొప్ప తలకట్టులోని, గొజ్జఁగిపూవు బాణము చేతనే (చాలామృదువయిన పుష్పముతోనే అని సారస్యము) పొంచి= చాటుగా నుండి కనిపెట్టి, సురసురసుర్క్కన్ = మిక్కిలి సోలి పడిపోవునట్లుగా, ఏసి =కొట్టి, ఆర్చెన్పో = సింహనాదముచేసెను.—

'మెత్తనగుచోటను గుద్దలి వాడియాఁగదా' (ఇదిలోకోక్తి) భూమి మెత్తగా నున్నచోట గుద్దలి చాలవాడిగలదియై తెగునుగదా! అట్లే చిత్రాంగి మనసు

---

'ఏమిరా నీకంటికి నేను దిసాయించడంలేదా'- అని వ్యవహారము. అంటే, 'నీకంటికి నేనొక లెక్కగా కనబడుటలేదా' అని యర్థము. 'దిసించు' నకు 'దిసాయించు' వ్యావహారిక రూపము,— ఇట్లే, హరించు– హరాయించు; భరించు- భరాయించు; పరికించు, పరకాయించు. 'దిసించు' నకొక్క ప్రయోగము.—

చ. "తెరువరులైనయట్టి పరదేశ మహీసురు లర్థవాంఛఁ ద
త్పురమున కేఁగుదేర వెతదోస్యములం బచరించి వారి ని
ర్భరగతితోడఁ గూయుఁ, దమబాఁపఁడె గెల్చెనటంచుఁ గాఁపు ల
చ్చెరువడ 'నాదుకంటికి దిసింతురె వీ' రని యాతఁడుబ్బునన్." (శుక.-3-439)

* పూ. టీ.— 'పెన్నెఱి = గొప్ప, గొజ్జెఁగతూపుచేతన్'

'(పెను + నెఱి) పెన్నెఱి = మిక్కిలిగొప్ప' అనియర్థముచెప్పుట సరికాదు. 'నెఱి' కి 'గొప్ప' అను నర్థమున్నను ఇక్కడ పనికిరాదు. చిత్రాంగి చిత్తము చాలమృదువనియు, అందుచేతనే మదనుడు అల్పములు- అసమగ్రములు- అందదుకులు నైన సాధనములతోనే సుర్క్కిపడగొట్టెననియు కవి చెప్పుచుండగా పూ. టీ. కర్తలు మిక్కిలి గొప్పబాణముతో కొట్టినట్లు చెప్పుట యేమిసబబు?

'పెన్నెఱి = గొప్పతలకట్టు' అనునది ప్రకరణోచితమయిన యర్థము. ('నెఱి Hair, tresses'. బ్రౌను.)

ఉ. 'గండఫలామృతభానుశిలాతలంబులన్, వేమఱు జారి యూఁతఁ గొను నిద్దపు పెన్నెఱి తీవ జొంపముల్.' (వసు. 2-67.)

మెత్తనైయున్న కారణమున, తను వేలేని అతనుడు, అరగౌర ధనుస్సుతో, విరవిర బోవునారితో, ఆమె తలలోని మెత్తని పూవు నేబాణముగాచేసి, సొక్కపడ గొట్టి తనపరాక్రమమును ప్రకటించెను. [మెత్తనవి చిత్తములపై అతనుని పరాక్రమ మంత తెగువగా పనిచేయజాలదని - భావము.)

క. ఇంతంతగాని తమి న
కాంతామణి యట్టులతనిఁ గనుఁగొని మణిపీ
ఠాంతరము డిగ్గి యతఁ డ
ల్లంతట రా హర్షమగ్నయై తనలోనన్. ౩౯

టీం.—తమిన్ = మోహముచేత, మణిపీఠాంతరమున్ డిగ్గి = రత్నాలపీట నుండి దిగి, హర్షమగ్నయై = ఆనందమున మునిగి పోయినదై.

క. ♦సారంగనయన తన మన
సారంగను గౌఁగిలించి యలరఁగ నపు డా
సారంగధరునిఁ గూర్పఁడె
సారంగధరుం డటంచు సారెం గలఁగున్. ౪౦

టీక.—సారంగధరుండు = (జింకనుచేత ధరించువాడు) శివుడు, తన మనసారంగను = తనయొక్క కోరిక తీరునట్లు, కౌఁగిలించి, అలరఁగన్ = ఆనందింపగా, సారంగధరునిన్, కూర్పఁడె = కూర్పకపోవునా? అని, సారంగనయన = (జింక కన్నులవంటి కన్నులుగల) చిత్రాంగి, సారెన్ = మాటిమాటికిని, కలఁగున్ = కళవళపడుచుండెను.

ఆ. వె. ఔర వీని మోహనాకార✻ రేఖ లే
మారు మాఱు, హరికుమారు మాఱు;
వీని కన్నుదోయి విరిదమ్మిలొ గలతీ
రేపు మాపు బాపు! రేపుమాపు. ౪౧

---

♦ పూ. ము. నను, కొన్నివ్రాతప్రతులలోనుగూడాలేదు.

✻ పా. పా.— 'రేఖవేమాఱుమారు హరికుమారుమాఱు.' ('వేమాఱున్=పలుమాఱును, మారున్, హరికుమారున్, మాఱున్ = తక్కువపఱుచును.' అని, పూ. టీ.)

టీక.—వీని = ఈసారంగధరుని, మోహన ఆకార రేఖలే = మోహమును గలిగించునట్టి రూపులోని రేఖలే, మారుమాఱు = మన్మథునికి ప్రతి (అనగా సమానము) హరిసుమారు మాఱు = ఇంద్రుని కొమరుడైన జయంతునికి ప్రతి. (రూపులోని రేఖలే మన్మథ జయంతులకు సాటి యనుటచేత ఆతని సంపూర్ణరూపవైభవము నిరుపమానమని భావము.) వీని- కన్నుదోయి, బాపు = ఔరా! రేపుమాపు = ఉదయమును- సాయమును, (రేలుంబవళ్ళు - అన్నమాట) విరిదమ్మితొగలతీరు = వికసించిన కమలములయొక్కయు, కలువలయొక్కయు సోయగమును, ఏపుమాపుఁ = గర్వభంగముచేయును. (ధిక్కరించును) పగలు కమలములను - రాత్రికలువలను అని క్రమముగా అన్వయము.—

'ఏపుమాపుఁ'- సామ్యవాచకము.—

"స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి
ఆక్రోశ త్యవజానాతి కదర్థయతి నిందతి...
తస్యచానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః
ఉపమాయామిమే ప్రోక్తాః కవీనాంబుద్ధిసౌఖ్యదాః" —దండి.

---

శబ్దాలంకార సరణినిబట్టి- 'మారుమాఱు, (హరిసు) మారు మాఱు' అని యుండవలెగాని 'మాఱు మారు- మారుమాఱు' అని తారుమారుగా నుండఁగూడదు. అది యట్లుండగా 'మాఱు' అను అకర్మకక్రియకు 'తక్కువపఱుచును' అని సకర్మకార్థము చెప్పుట తప్పు. అసలు, పద్యములోని 'మాఱు' విశేషణముగాని క్రియ.కాదు. క్రియయనుకొనుట ప్రమాదము. ఆక్రియఅకర్మకమో సకర్మకమోగూడా గమనింపక టీకవ్రాయుట సాహసము.

'మాఱు'ను విశేషణముగా కవులు వాడిన విధము తెలియుటకు కొన్ని యుదాహరణములు.—

(1) 'అమేయపరాక్రమ నీకుఁ బాండవుల్, మాఱె' (భా. కర్ణ. 8-10.)

(2) మారుని మాఱు సాగరకుమారునిబట్టము గట్టెనోయనన్.' -(శశాం.3-12)

(3) 'కుందెనమాఱువోరు, వసిగొయ్యలదండులు పండులు.' (వేం. పం. 3-224)

పై శబ్దాలంకారమును తలపించు మరియొకరచన.—

'మారశౌరిరూప మహిమాస్పదంబున
మారుఁబోలుఁ గూచిమారుఁబోలు,
వీరవైరిభయద విక్రమ క్రీడఁ గాం
తేయుఁబోలు, వైనతేయుఁబోలు.' (దశ. చరి. 1-42.)

స. చక్కఁగా సోగయై ముక్కు కోలేరు పె
　　ట్టినరీతి సంపెంగమొక్కు దెగడ,
లచ్చియన్నకుఁ దమ్ములకును వాదులు పెట్టి
　　† కలకల నగు మోము కళల నీన,
కంఠము ద్దిరిగి ‡బల్గొండలు దాపించి
　　నటువలె నెగుబుజా లతిశయిల్లఁ,
గమ్మఁ దీసినలీలఁ గనుపట్టునెమ్మేని
　　మిసమిస ల్కడు మిఱుమిట్లు ♦గొలుప,

---

† శా. పా.— 'కళకళ నగుమోము.' ('కలకల...' పూ. ము. పా.)

నవ్వుటయందగుధ్వనికి అనుకరణము 'కలకల' గాని 'కళకళ' కాదు. (చూ శ. ర.) 'కలకల Aloud. కలకల నవ్వుట to laugh heartily or aloud (బ్రౌను.) " ఎవ్వరోకోయీ, పితికితనమింతయులవడఁ, గఱపిన వారనుచు శౌ కల కల నవ్వెఁ." (భా. ఉద్యో. 3-57.)

'కలకల' అను పాఠముతప్పని సంస్కర్తలు 'కళకళ' అని సవరించినారు. సరికాదు. (లకారమునకు ళకారము వాడుట అరవసంప్రదాయము. శాస్త్రిగారు గూడా 'ఆముక్త' (పు. 357.) లో 'మద్దెల' ను 'మద్దెళ' అని ఆరుమారు లన్నారు.- శా. పా. ను బట్టి వావిళ్లవారును 'కళకళ...' అనియే యన్నారు.

‡ పాఠాం.— 'కీల్కొండ.'

♦ శా. పా.— మిఱుమిట్లు గొనఁగ.'

మేని మిసమిసలు, మిఱుమిట్లు గొలుపునుగాని, కొనవు. మిఱుమిట్లు కొనుట యనగా అత్యంత కాంతిని చూచుటచేత దృష్టిచెదరుట.—

"కనులు చెదరంగ జీకట్లుక్రమ్మెననుట
కలరు మిఱుమిట్లు గొనెనన." (ఆం. భా. 3-109.)

'మిఱిమిట్లుకొనుట- To be dazzled దృష్టిచెదురుట.'' (బ్రౌను.) ఏతావతా మిఱుమిట్లు కొనునవి కన్నులుగాని, కాంతులుకావు; కావున శా. పా. తప్పు. పూ. ము. నను, వ్రాతప్రతులలోనుగూడా "మిఱుమిట్లుగొలుప" అనియే యున్నది. వావిళ్లవారు శా. పా. నే గ్రహించినారు.

గీ. నమగులబెడంగు హంసల నాస గొల్వఁ
జెలఁగి యమ్మక్క *యొకట నొచ్చెమ్ము లేక
నిలువునీరునఁ బాడిన ట్లలరినాఁడు
వేయుఁ గన్నులు వలయుఁ బో వీనిఁ జూడ. ౭౨

టీక.— ముక్కు, ‡కోటేరు పెట్టినరీతిన్ = తలక్రిందుగా కాడికి కట్టబడిన నాగలివలె (ఉండి) సంపెంగఱెక్కన్ = చంపకపుష్పము యొక్క రేకుని, తెగడన్ = నిందింపగా, (తెగడు - ఉపమావాచకము.) తలక్రిందుగానుండు నాగలియు

---

* శా. పా.—'ఒక్కయొచ్చెమ్ము." ("ఒకట నొచ్చెమ్ము" పూ.ము తంజ. ప్రతులు.)

‡ పూ. టీ. "కోటేరు పెట్టినరీతిన్ = నాఁగేటి చాలువలెనే."
ముక్కును నాగేటి చాలుతో పోల్చుట అప్రశస్తము. అసలు "కోటేరు =నాగేటి చాలు" అనుటే తప్పు. బ్రౌను 'గోటేరు అనగా నాగేటిచాలు. The plough share కోటేరు పెట్టినరీతిగా నుండే ముక్కు A long sharp nose' అన్నాడు. కాని, కోటేరును గోటేరనుట; గోటేరు = నాగటిచాలు; అనుట పొరపాటు. ఆపొరపాటునే మన పూ. టీ. పెద్దలు గ్రహించినారు. అదివారికలవాటు.

(a) "కోటేరు = దుక్కికిఁ బోవునపుడు గాని దుక్కియై మరలివచ్చునపుడు గాని మీఁదుగా కాఁడికి తగిలించిన నాఁగలి." (శ. ర.)

(b) "కోటేరనంగను గోఱలు విపర్యయ
బద్ధలాంగల సంజ్ఞ." (ఆం. భా. 2-332)

(c) "మీఁదైన యెద్దులమెడ కాఁడి మీఁదఁ
గోటేరువైచి." — (పరమ. 7-581)

(d) "అడుసుదుక్కియై యామడి కఱుగుదెంచె
హాలికుఁడొక్కఁడు తన్నగరాశ్రియుండు
చేతి యుగ్గంపుఁ గుండతోఁ జేర్లకోల
తోడ నాఁగంటి కోటేరు దోలుకొనుచు." (పరమ. ౫ ఆ.)

(e) "అరఁగఁబట్టి రెడ్డిమడియల్ ములుఁగోలలఁ బూనియెడ్ల కో
టేరులువైచి దున్నుటకునే, గిరికోంద్రకు హాలివచ్చినన్."
(వేం: పంచ. 1-687

సంపెంగ పువ్వును, ముక్కును పోలియుండును.—లచ్చి- అన్నలన్ = చంద్రునికిని, తమ్ములకున్ = పద్మములకును, వాదులు పెట్టి = లోపములారోపించి, కలకల నగుమోము=కలకలనవ్వి పరిహసించునట్టి మొగము, (ఆ మొగము చంద్రుని కంటెను-కమలముకంటెను సొంపైనదని భా.— 'కలకలనగు' ఉపమావాచకము. మరియు, ఆ ముఖము అన్నదమ్ములకు (వాదులు=) తగాదాలు పెట్టి తమాషా చూచునది యని చమత్కారము.) కళలనీనన్ = కాంతులను వెదజల్లుచుండగా.— ఎగుబుజాలు = ఉన్నతములైన భుజములు, ‡కండెముల్ తిరిగి = వ్యాయామ పరిపాటిచేత- ముఖములు గట్టిపడి, (కండలుతిరిగి – అన్నమాట) బలుకొండలు *తాపించినటువలెన్ = పెద్దకొండలు స్థాపించిన విధమున, అతిశయిల్లన్ = అగ్గలింపగా; ('గిరి క్రొవ్వులు మూపులు,' మనుచరిత్ర.—)

---

‡ పూ. టీ.—'కండెముల్ తిరిగి = బలిసినదై.'

కండెముల్ తిరిగిన 'బుజాలు' బహువచనము గావున 'బలిసినదై' యనుట తప్పు. బహువచనకర్తకు ఏకవచనక్రియ వాడుట అరవసంప్రదాయము. ('నిండా జనాలు వుంది') దానికేమిగాని, కండెముల్ తిరుగుటయనగా బలియుట కాదు; కండలు గట్టిగా నేర్పడుట. (Formation of Muscles) చూ. శ.ర. "కండెము A collop of flesh or sinew." (బ్రౌను.)

* పూ. టీ.—'తాపించినటువలెన్ = (కొండలు) మలిచినట్లుగా.'

తాపించుటయనగా మలుచుట కాదు. 'తాపించు', 'మలుచు' అను క్రియలు భిన్నార్థకములు.—తాపించు (ప్ర. స్థాపించు) నెలకొలుపు. అనగా ఒకవస్తువును మరియొకవస్తువున నిముడ్చుట (=ఖచించుట.) తాపించు = తాపు = తాచు. (చూ. శ. ర.) "తాపుట To fix, stick, set precious stones." (బ్రౌను.)

సీ. 'బాలార్కమనియెడు పద్మరాగము తాచి
నొకతాళి కంచినాయకుని సాక్షి.' (సార. పీఠిక. 10.)

క. 'సురుచిరపల్లవరుచి సుం
దరతనువగు సీతఁగదిసి దశముఖుఁ డొప్పెన్
బరఁగఁగఁ గాంచన కాంచిన్
వెరవుగఁ దాపించియున్న నీలమువోలెన్.' (రా. అర. కాం.) శ.ర.

‡ కమ్మితీసినలీలఁ = కమ్మెచ్చునతీసిన బంగారు తీగవలె, కనుపట్టు, నెమ్మేని మిసమిసల్ = (నెఱి + మేని) సొగసైన శరీరముయొక్క కాంతులు, మిఱుమిట్లు గొలుపఁ = చూపును చెదరజేయగా – అడుగులబెడంగు = అడుగులు పెట్టి నడచు తీరు, హంసలఁ, అనఁగొలుపఁ = ఆజ్ఞాపింపగా, (అనఁగొలుపు – ఉపమావాచకము.) అమ్మక్క = ఔరా, ఒకటఁ = ఏవిషయమునఁగూడా, ఒచ్చెమ్ములేక = లోపములేకుండా, * నిలువు = శరీరము, నీరునఁ – పండినట్లు = నీరుపోసి పెంచిన విధముగా, అలరినాఁడు = ఒప్పియున్నాడు; వీనిఁజూడఁ – వేయికన్నులువలయుఁ (= రెండుకన్నులు చాలవని భా.) పో – (నిశ్చయార్థకము. చూ. ప్రౌ. వాక్య. 22.)

---

¶ 'మలుచుట' అనగా, ఒకవస్తువును దానియాకృతినుండి మరియొకయాకృతికి మార్చుట. – 'మలుచు = లఱిమెనఁబెట్టు; ఉాలిని లొలుచు.' (శ ర.) 'మలచుట. To chip. to cut stone with a chisel, to engrave a stone' (బ్రౌను.)

చ. 'మలచినరాలయందుఁ గుసుమంబులు వోయఁగమీఁద వెన్నఁడేఁ
ఫలమొకవాఁడు గల్గునను పల్కెడియొవ్వఁడు నమ్మినాఁడు.'
—(శృం. నై. 7–70.)

చ. 'మలచినఁ జాలుఁగాక మగవానిని రూపులు గొలకైనఁ జె
క్కులు పులకింపఁజేసి యిదిగో వలపింతుము.' — (రామా. 2–88)

గీ. 'మంటినైనను లింగంబు మలిచికొలుఁడు
పేడనైనను లింగంబు పెట్టికొలుఁడు.' (భీమ. 3–102.)

‡ ప్రా. టీ.—'కమ్మిఁ తీసిన లీలఁ = కమ్మచ్చులో కమ్మిదివిచిన తేజస్సుతో' ఇక్కడ 'లీలఁ' అనగా 'విధమున' అని యర్థముగాని, 'తేజస్సుతో' అని కాదు. 'కమ్మి – దివిచిన (=లాగిన) తేజస్సు' అంటే యర్థమేమో పెద్దలు పరిశీలింపవలె.

* ప్రా. టీ.—నిలువు నీరునఁ బండినట్లు = మానిసి ప్రమాణపు నీళ్లునిలిచిన చేనిలో పైరుపండినరీతిగా'

ప్రా. టీ. వ్రాతప్రతిలో 'నిలువు...వట్లు– అనగా మనిషిప్రమాణము నీళ్ళు నిలిచినచేలోనున్న పైరు పండినట్లుగానే – అలరినాడు' అని యున్నది. 'మనిషి'

---

¶ శాస్త్రిగారు 'ఆముక్త' (పు. 58.) లో 'మలుచు' కు అర్థము తప్పుగా చెప్పినారు.

ఉ. *తీరయి మల్చి వేసినగతిన్ దొడలున్నవి; బొమ్మలోని వి
స్తారము చెప్పరాదు బలుదల్పు నదల్పును; పాలు గాఱునో
రౌర! మొగమ్ము చక్కఁదన; మున్నియ టుండఁగ నిమ్మ,వీని యొ
య్యారమెలతుఁ సేయునహా! యనుచున్ దలయూఁచు సారెకున్.

టీక.— తొడలు, తీరయి = సొగసై, మల్చి వేసినగతిన్ = తరిమెనబట్టి తయారుచేసిన విధమున- ఉన్నవి. బొమ్మలోని, విస్తారము = వైశాల్యము, చెప్ప రాదు = ఇంతయని చెప్పుటకువీలులేదు. బలుదల్పున్ = (బలు + తల్పు) పెద్దతలుపును, అదల్పును = అదలించును- (ఇది ఉపమావాచకము. రొమ్ము పెద్దతలుపువలె

'చేలో' అను పదములకుమాత్రము గ్రాంథికవేషమువేసి శాస్త్రిగారు, పైమాటలనే యనువదించినారు. కాని చేనిలో మానిసి ప్రమాణపు నీరునిలుచుట, అందు పైరు పండుట లోకమున నెక్కడనులేదు. నిలివెడు నీరు నిలుచుచోటు చెరువో - దొరువో అగును గాని చేను కాదు. 'పైరు పండినట్లు సారంగధరుడున్నాడనుట యర్థము లేని యాలాపము.

పద్యములోని 'నిలువు' శరీరముగాని పరిమాణార్థకము కాదు. 'నిలువు = ఆకృతి' యని శ. ర. లోనే యున్నది. 'సర్వలక్షణ సంపన్నాకృతి' అను నర్థమున 'నిలువు - నీరున పండినట్లున్నాడు'; 'చెట్టున ప్రుడికినట్లున్నాడు,' అనుట లోకమున వాడుక. తెనుగువారికిగాని తెనుగువాడుకలు తెలియవు. ఆకారసౌష్ఠవమున ఏలోపమునులేని సారంగధరుడు, 'ఈ యాకృతి దోహదవిశేషములతో నీట బెరిగినదికాబోలు' నన్నట్లు, అపూర్వ సౌభాగ్యముతో అలరినా డని సరియైన యర్థము. 'చెట్టున బుడికినట్లు' అనుటకు;

క. ఏ వేషము ధరియించిన
నా వేషము తనకు నందమై యద్ధాత్రీ
దేవుఁడు చెట్టునఁ బుడికిన
భావంబున నుండు రూపు ప్రాయముకలిమిన్.'

కాశీ — 7-282.

*శా. పా.— 'తీరుగ.' (ఇది పూ. ము. పా.) 'తీరయి' తంజ. పా. సరసము.

వెడలుపుగా నున్నదని భా.) 'అదల్చుక' అనుటకు బదులు 'అదల్పక' అనుట యమకాలంకార నిర్వాహణార్థము.)

వక్షమును కవాటముతో పోల్చుటకలదు;- మ. 'అధాత్రీపువక్షఃకవా, టముపై నెద్దాని గంధపట్టిగతినుండక నాదుకేల్ సేర్చుటల్.' (కళా. 7-111.)

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁ డిటువంటివాని నే
నెక్కడఁ జూచి కాన; జగతీశ్వర! చిత్తరువందు వ్రాయ రా
దిక్కమనీయరూప మొకయింతయు; భాగ్యముగాదె†యొచ్చెము
ల్దక్కినకూర్మి నాకితఁడు దక్కినఁ దక్కినమాట లేటికిన్. ౭౭

టీక.—ఇక్కమనీయరూపము = మనోజ్ఞమయిన యీ యాకారము, ఒకింతయుఁ, చిత్తరువందు వ్రాయరాదు. ('అలేఖ్యతనూవిలాస' మన్నమాట.) ఒచ్చెముల్ తక్కినకూర్మిన్ = లోపములేని ప్రేమతో, ఇతఁడు నాకు, దక్కినన్ = వశుడైన యెడల, (అది) భాగ్యముకాదె?

* క. ఎవ్విధమున నే నీతని
జవ్వన మిపు డపహరింతు సరగ నని మనం
బువ్విళ్లూరఁగ వెనుకన్
బువ్విలుదొర కలువతూపు మొనఁ♦దీడంగన్. ౭౮

---

†పాఠాం.—'పొచ్చెముల్'

*శా. పా.—'ఇవ్విధమున' (ఇది పూ. ము. పా.)

పూ. ము. పా. చూచి శాస్త్రిగారు, వారిని బట్టివావిళ్లవారును 'ఇవ్విధమున' నని యేఱన్నారు. కాని యర్థమును విచారించినవారుకారు. 'ఇవ్విధమున' ననగా, ఎవ్విధముననో? ('ఎవ్విధమున' తంజ. తా. పా.)

ఇంకొక విశేషము; శాస్త్రి వావిళ్ళవారి ప్రతులలో ఈపద్యము 'చక్కనివారిలో' అను (౭౭) పద్యమునకు ముందున్నది. అట్లుండుట సరికాదు. పూ. ము. నను, తంజ ప్రతిలోను ౭౮ వదిగా క్రమముగా నేయున్నది.

♦పాఠాం.—'ధీటంగన్'

టీక.— ఈతని, జవ్వనము = యౌవనమును, ఏవిధమున అపహరింతును = ఏరీతిగా చూరగొందును. అని, మనంబు ఉవ్విళ్లూరఁగన్ = మనసు తొందరపడుచుండగా,— వెనుక, పువ్విలుదొర = మన్మథుడు, కలువతూపు మొన = కలువబాణముయొక్క అలుగును. తీడఁగన్ = పదును పెట్టగా.

చ. వలపు దువాళి సేయఁ, బికవాణి కదంబపుఁగమ్మవాసనల్
‡కులుకు పయోధరంపు మెఱుఁగుల్ హృదయంబున నాటునంబకం
బుల బెడిదంపువాఁడితనముల్ గనిపింపఁగ, జాఱు పైఁటతోఁ
సొలపుఁ బిసాళి వాలుఁదెలిచూపులతోఁ దమకంబుతోడుతన్ ౨౬

టీక.— వలపు = మోహము, దువాళిచేయన్ = దౌడుచేయగా (=అతిశయింపగా.) *పికవాణి (కోకిలపలుకులవంటి పలుకులుగల) చిత్రాంగి, కదంబపు కమ్మవాసనల్ కులుకు- పయోధరంపు మెఱుఁగుల్ =చందనము మొదలగు సుగంధద్రవ్యముల మిశ్రముయొక్క కమ్మని తావులను గుప్పించుచున్న సొగసైన కుచములయొక్క కాంతులు; హృదయంబున నాటు నంబకంబుల =మనసున నాటుకొనియున్న మన్మథ బాణములయొక్క, బెడిదంపు వాఁడితనముల్ = మొక్కలపుపదునును, కనిపింపఁగన్ = చూపించుచుండగా (ఇక్కడ 'కనిపించు' ప్రేరణ క్రియగా వాడబడినది.) [కుచముల మెఱుగులు, మనసున గాఢముగా గ్రుచ్చుకొనియున్న మదనబాణముల అలుగుల కాంతులో యన్నట్లున్నవని ఉత్ప్రేక్ష.] జాఱుపైఁటతోన్ = పైటపలుమారు జారి పడిపోవుచుండగా, సొలపు *పిసాళి వాలు తెలిచూపులతోన్.— సొలపు= పారవశ్యముతోగూడినవియు, పిసాళి= వలపుహొయలును ప్రకటించు విలాసములుకలవియు, వాలు = విడుదలును, అయిన, తెలిచూపులతోన్ = నిర్మలము (ప్రసన్నము) లగు చూపులతో, తమకంబుతోడుతన్ = మోహముతోను.

‡ శా. పా.—'కులుకుఁబయోధరంపు.'

'వాసనల్ కులుకు-పయోధరము' అనునప్పుడు 'కులుకుంబయోధరము' అనినుగాగమసంధిచేయుట శాస్త్రవిరుద్ధము.

* పూ. టీ.—'పికవాణి = చిలుకపలుకులవంటి పలుకులుగల చిత్రాంగి'
'పిక' మనగా 'కోకిల' గాని 'చిలుక' కాదు. ('కోకిలః పిక ఇత్యపి'-అమ.)

పూ. టీ.—'పిసాళి= క్రూరమైన - దృష్టులతో'

సీ. దూకంత గాని లే దే కైవడి సమంబు
 వచ్చు బంగారు మై హెచ్చుజిగికి?
గోరంత గాని లే దే రీతిఁ బ్రతి వచ్చు
 యావరక్తపు మించు మోవిరుచికి?
నిసుమంత గాని లే దెటువలె నెన వచ్చు
 సైకతంబు విశాలజఘనమునకుఁ?
గంటిలోఁ *బడునంత గాని లే దెటు లీడు
 వచ్చు కాటుక కప్పువాల్కురులకు?
గీ. ననుచు నఖిలాంగశృంగార మభినుతించు
గతిఁ దులాకోటి మణికోటి కాంచిదామ
కింకిణీగణ కంకణాకీర్ణ కలక
లారవమ్ములు గులుక నొయ్యార మొలుక. ౪౭

తాను వలచినవానిని అత్యంతాభిలాషతో చూచు కామిని క్రూరమైన చూపులతో చూచె ననుట స్వభావ విరుద్ధము. కవులు వలపు ప్రేమతోడిచూపుల నే పిసాళి చూపులందురు. పిసాళినవ్వు; పిసాళి మెఱుంగులు; మొదలయినవియును ప్రేమసూచకములే గాని క్రూరములు కావు. 'పిసాళి = ప్రకాశముకలది' (శ. ర.) "పిసాళి - Brilliant. 'మే తులకింపుల పిసాళి మిసిమికి క్రొమ్మించే తుల' టీక.—పిసాళిమిసిమికి = మనోహరమైన కాంతికి'' (బ్రౌను)

(a) 'అలఁతి పిసాళినవ్వు మధురాధరబింబము' (పాండు. 4-132)

(b) 'ప్రాణనాథుతో, నొక్క పిసాళి నవ్వు ననలాత్తఁగ నవ్వెడు వాణిఁ గొల్చెదన్.' (నిరంకు 1-8.)

(c) 'సకియ క్రిందఁబడు పిసాళి చూపుల కోపు
 ముగుద నిద్దపు ముద్దుమోముగోము' (రసి. మనోభి. 3-133)

పూ. టీ. కర్తలు 'మెఱసుమోటు పిసాళి నా మాధుఁడొప్పు' (ఆం. భా. 3-7.) అను పద్యమును చదువుకొని 'పిసాళి = క్రూరమైన' అని అనియుంటారు, ఔచిత్యము నెరుగని యర్థము హాస్యభాజనము.

* శా. పా.—'బడిసంత' ('పడునంత' పూ. ము.; తంజ. ప్ర.)

టీక.—బంగారు, రూకంత గానిలేదు = నిండా రూకంతయైనను లేదు, (రూకంటెను తక్కువ)=చాల కొంచెముగానున్నది. * మైమెచ్చుజిగికిన్ = చిత్రాంగి-దేహముయొక్క గొప్ప కాంతికి, ఏక్కైవడి సమంబువచ్చున్ = ఏరీతి సాటిరాగలదు? (బంగారు రూక [నాణెము]ల రూపమున అల్పాల్పముగానున్నదేగాని అధికముగాలేదు గనుక దేహమునకు సమముకాదని చమత్కారము. ఇట్లే తక్కిన పాదములందును.) యావ = లక్క, గోరంత గానిలేదు = మిక్కిలి తక్కువగానున్నది. (స్త్రీలు అలంకారమునకు గోళ్ళకు పూసికొందురు. కావున, గోటికి అంటుకొనుమాత్రమే యున్నదని చమత్కారము.) క్రమమించు మోవిరుచికిన్ = ఎక్కువ యెఱుపైన మోవికాంతికి, ఏరీతి ప్రతివచ్చును?:—సైకతంబు = ఇసుకదిబ్బ, ఇసుమంతగాని లేదు = చాలా అల్పముగానున్నది. (దిబ్బయంతయును ఇసుమే కావున, ఇసుమంతగా నేయున్నదని చమత్కారము.) విశాలజఘనమునకున్ = వెడల్పైన పిరుదుభాగమునకు, ఎటుల సరి యెనవచ్చును? కాటుక, కంటికింపబడునంత గానిలేదు= చాల తక్కువగానున్నది. (కాంతలు కాటుకను కన్నులకు పెట్టుకొందురు. కావున నిజముగా కంటికింపబడునదే యని చమత్కారము.) కప్పువాలుకురులకున్ = నల్లని పొడుగైన తలవెండ్రుకలకు, ఎటుల ఈడువచ్చును? అనుచున్ = అని, అఖిలాంగ శృంగారము = అన్ని అవయవముల సౌందర్యమును, అభినుతించుగతిన్ = పొగడుచున్నవో అన్నట్లు, తులాకోటి- మణికోటి=అందెలలోని రత్నసమూహముయొక్కయు, ('తులాకోటిర్మంజీరో నూపురోఽస్త్రీ యామ్.' అమ.) కాంచిదామ - కింకిణీగణ = మొలనూలి చిరుగంటలయొక్కయు, కంకణ =చేతిసొమ్ములయొక్కయు, ఆకీర్ణ =ఒండొంటితో కలిసి బలిసిన,కలకలారవ

---

*పూ.టీ.—'మై- జిగికిన్ = దేహముయొక్క కాంతిముందఱ, రూకంత గాని లేదు = ఇంచుకంతయేనిలేదు. (బంగారు రూకలేదనియు భావము.)'

'జిగికిన్ రూకంత గానిలేదు.' అని యన్వయించుట సమంజసము కాదు. 'జిగికి- ఏక్కైవడి సమంబువచ్చును' అని యన్వయించుట సరియైనమార్గము.

'రూకంత గానిలేదు' అనగా ఇంచుకంతగానున్నదని యర్థముగాని, 'ఇంచుకంతయేనిలేదు' అని కాదు. 'రూకంత గానిలేదు; గోరంత గానిలేదు' అను పలుకుబడులకు, 'రూకపరిమాణమునకును, గోటి పరిమాణమునకును తక్కువగానున్నది' = కొంచెము' అని యర్థము బొత్తిగా - కొంచెమేనియు లేదనియర్థము కాదు. 'రూకలేదు; గోరులేదు' అని భావమును కాదు.

మ్మలు = గలగల శబ్దములు, కులుకఁగ = అందగింపగా, ఒయ్యారము - ఒలుకఁగ = హొయలు తొనకగా, (అవ. అన్వ.)

బంగారు రూకంత గానిలేదే మా చిత్రాంగి మేనిజిగికి ఏ కైవడి సమమగును? లత్తుక గోరంతగానిలేదే మోవిరుచికెట్లు ప్రతివచ్చును? ఇసుకదిబ్బ యిసుమంత గానిలేదే పిరుదు భాగమున కై జ్జెనవచ్చును? కాటుక కంటిలోబడునంత గానిలేదే నల్లనితలకట్టునకెట్టుసాటివచ్చును? అని చిత్రాంగి యవయవసౌభాగ్యమును ప్రశంసించు చున్నవోయన్నట్లు కాలియందెలరవలును, మొలనూలిగంటలును, చేతికంకణములును గలగలలాడుచుండగా చిత్రాంగి కదలినదని తా.

కవులు 'గాని' ని వాడిన విధముచూడండి.—

(1). గీ. * 'వీరమైలారు దేవరు వీరభటులు
గొండ్లియాడించుచున్నారు గొరగపడుచు
వాడుచున్నది చూడు మూర్ధాభినయము
తాను వెట్టికి సీలంతగాని లేదు' (క్రీడాభి. పు. 48.)

వెట్టికి సీలంతగాని లేదు - అనగా. చాలాచిన్నదిగానున్నదని యర్థము గాని బొత్తిగాలేదని యర్థము కాదు. 'వెట్టికసీలలే' దని భావమును కాదు.

(2) క. 'ఇసుమంత గాని లేఁడీ
పసిబాలుఁడు' (పాండు. 4-180.)

అంటే, పసిబాలుఁడు కొంచెముగూడాలేడని యర్థము కాదు; ఇసుము లేనే లే దని భావమును కాదు. చాలా చిన్నవాడుగానున్నాడన్న మాట.

(3) సీ. 'వెఱపెఱుంగుటకునై వెఱపింతునందునా?
కలిగి లేకొక్కఁడుగాని లేఁడు.' (భాగ. 10. పూ. 344.)

'ఒక్కఁడుగానిలేఁడు' అనగా ఒక్కఁడేగాని యెక్కువమంది లేరని యర్థము. అట్లే ప్రకృతమునను 'రూకంత గానిలేదు' అంటే రూకంత కొంచెముగానున్నది గాని అధికముగా లేదని యర్థము.

మరా.— పూ. టీ, వ్రాతప్రతిలో 'రూకకంటే అధికములేదని అర్థము, బంగారు రూకలేదని భావము' అని సరిగా వేయున్నది.

* 'వీరమైలారు... భటులు, గొండ్లియాడుచునున్నారు - గొరగపడుచు, వాడుచున్నది ...మూర్ధాభినయము.' అని సూ. ని. సా.; (చూ. 'గొరగ.')

‡ గీ. ఇంద్రనందనుఁ గాంచి మోహించి వచ్చు
నూర్వశి తెఱంగు దోఁప న య్యుర్వసితప
యోదకచ పాకశాసని యొఱపు నెరపు
నక్కుమారునిఁ గని చేర నరుగుదేర. ౪౮

టీక.—ఉరు - అసిత పయోదకచ = గొప్ప నల్లనిమేఘమువంటి తలకట్టు (=తలవెండ్రుకలు) కలదియైన - ఆచిత్రాంగి, † పాకశాసని = జయంతునియొక్క, ఒఱపు నెరపు = సౌందర్యమును ప్రకటించుచున్న = తత్తుల్యుడైన ('జయంతః పాకశాసనిః'-అమ.) ఆ-కుమారునిన్ కని = ఆకుఱ్ఱవానినిచూచి,— ఇంద్రనందనున్ = అర్జునుని, కాంచి, మోహించివచ్చు. ఊర్వశి - తెఱంగుతోఁపన్=ఊర్వశియొక్క విధముకనుపట్టగా, చేరన్ అరుగుదేరన్ = సమీపమునకురాగా.

పాకశాసని - పదముచేత సారంగధరునియందు - అర్జునత్వమును, 'ఉర్వసి (త)' పదముచేత, చిత్రాంగియందు - ఊర్వశీత్వమును, ధ్వనితములు.

---

‡ ఈపద్యము, పూ. టీ. కాగితపువ్రాతప్రతిలో ఆ. వె. అని యున్నది. శాస్త్రిగారు 'వె.' తొలగించి 'ఆ' యని ముద్రించినారు. అంతేగాని, ఇది తే. గీ. యన్నసంగతి గమనింపలేదు. (చూ. ౧-౧౬౨; ౨-౨౮.)

† పూ. టీ.—పాకశాసని ఒఱపున్ నెరపు = అర్జునునియొక్క సౌందర్యము వ్యాపింపఁజేయుచున్న'.—

'పాకశాసని'-శబ్దము జయంతునియందురూఢము. అంతేగాక సౌందర్యమున చెప్పదగినవాడు 'జయంతుడు' గాని, అర్జునుడు కాడు. అర్జునుడు వీరుడు; జయంతుడు అందగాడు. ఇందులకు గ్రంథజాలమంతయు ప్రమాణమే. ఒకటిరెండుదాహరణములు,

(a) మ. 'అనతారాతి వసుంధరారమణ సప్తాంగాపహారక్రియా
ఘనసంరంభ విజృంభమాణ పటుదోః ఖర్జూద్వితీయార్జునుం
డు...మామిడన్నసుతుఁడు.' (శృం. నై. 1-27.)

గీ. 'వేయుచేటికి' నల పాండవేయుసాటి
వీరుఁడిలలేఁడు; ప్రతి రఘువీరుఁడొకఁడె' (విజ. 1-94.)

(b) ఎ: గీ. 'అజయంతుఁ, డాపుల స్త్యజుమనుమఁడీ యధిపుతోడ
సాటియగుదురె...భావసమ్మోహ నాతి సౌభాగ్యరేఖ.'
(శృం. నై. 6-75)

ఉర్వశి తనకు కొడుకువరుసవాడగు అర్జునుని వరించి తిరస్కృతయైనట్లే చిత్రాంగియు తనకు కొడుకువరుసవాడైన సారంగధరుని వరించి తిరస్కృతయగు ననియు ఉర్వశి అర్జునునికి అపకారము కావించినట్లే చిత్రాంగియు సారంగధరుని కపకారము కావించుననియు ఉపమాన సారస్యముచేత వ్యంగ్యము.

గీ. అపుడు మంజీరకలకలం బాలకించి
వలదు వల దన్న గతి దోఁపఁ బలికి పెనఁగు
నంచగమిఁ గాళ్ళఁ ద్రోచి యేతెంచె; శకున
మడ్డగించినపని సేయ నగునె యెందు? ౪౯

టీక.—మంజీర కలకలంబు = కాలియందెల శబ్దమును, ఆలకించి, వలదు వలదన్నగతితోఁపన్ = పోవద్దు - పోవద్దు అనుచున్నవో యన్నట్లు, పలికి = శబ్దించి, పెనఁగు అంచగమిన్ = కాళ్లకు చుట్టుకొనుచున్న హంసల గుంపును, కాళ్లన్ త్రోచి = కాళ్ళతో నెట్టివేసి, ఏతెంచెన్ = చిత్రాంగి సారంగధరుని కడకు వచ్చెను.—శకునము అడ్డగించినపని = అపశకునమైనపని (పక్షి యడ్డగించినపని - యని చమత్కారము) చేయనగునె = చేయకూడదు. [శకునము = శుభాశుభసూచన; పక్షి. 'శకునం మంగళాశంస నిమిత్తే శకునః ఖగే.' నా. ర.]

మంజీర కలకలమును హంసపలుకులతో పోల్చుట కవులకు పరిపాటి.—'ఖిల ఖిలవిలాసినీ వాచాలతులాకోటి కలకలాహూయమాన మానస మదాలస మరాళం బగు రజతశైలంబు.' (మను. 1-30)

క. తనుఁ గన్నవారి [1]నామట
గను మన్నది తేటపడఁగఁ గడువడుకతఁ

ఉ. 'ఎక్కడివాఁడొ యక్షతనయేందు జయంత వసంతకంతులన్
జక్కఁదనంబునం గెలువఁజాలినవాఁడు.' (మను. 2-55)

(అర్జునునివర్ణనము)

చ. 'అతనినుతింప శక్యమె జయంతునితమ్ముఁడు సోయగంబునన్
(విజ. 1-93)

1. తా. పా.—'ఆమడ' (ఆమట - పూ. ము. తంజ ప్రతులు.)

బినతల్లికి నెమరుగ వే
చని యపు డింపెనయ వినయసంభ్రమపరుఁడై. ౧౦†

టీక.—తను...మన్నది = తన్ను గన్నతలిదండ్రులను ఆమడదూరమున నున్నను పోయి చూడవలసినదన్న లోకవాక్యము, తేటపడఁగన్ = తార్కాణ కాగా, వినయసంభ్రమపరుఁడై = నమ్రతవలని వేగిరపాటుకలవాఁడై.

ఆ. వె. రాజు లేని*వేళ రాఁ జెల్లదిందు నా
వలనఁ దప్పు గలమ లలన ♦సైఁచి
మనుచు మనుచు వేఁడుకొనురీతి మ్రొక్కి సా
రంగధరున కనుఁ గురంగనయన. ౧౧

టీక.—సైఁచి = సహించి, మనుచుము- అనుచున్ = మన్నింపుమనుచు.

క. వసుధేశుఁడు నీవును నా
కు‡ససముంబు మదిం దలంపఁగా నాకు నయో
యసమాంబకుండ వయ్యున్
బొసఁగున తోడఁబడఁ¶బ్రణామములు ఘటియింపన్. ౧౨

టీక.—అసమాంబకుండవయ్యున్ = వేరుతల్లి కలవాఁడవైనను (సవతిబిడ్డవైనను - అన్నమాట.) అసమ + అంబకుఁడు = బేసిసంఖ్యబాణములుకలవాఁడు = మన్మథుడు; సౌందర్యమున కేవలము మన్మథుడవే అయ్యుండియును (అని - అర్థాం)

---

† ఒక తాళపత్రప్రతిలో ౧౦ కి తర్వాత, ఈక్రింది పద్యమున్నది.

ఉ. మ్రొక్కిన నక్కసంబొదివి, ముద్దులమోమున మోముఁజేర్చి, లేఁ
జెక్కిలినొక్కి, చొక్కవలచేడియఁ గాంచి కుమారుఁ డెంచి, యిం
పెక్కఁగ గారవించి నెనరెక్కుడుమాపిన తల్లి తల్లికిం
దక్కువగాదటంచు, నది తక్కవగల్ గనఁడయ్యె నయ్యెడన్.

* పాఠాం.—'లేనివెనక.'

♦ తా. పా.—'సైఁపు.'

‡ తా. పా.—'సమంబని చూడఁ' ¶ 'ప్రణామములన్.'

ఇట్లు, ‡తొడిఁబడఁ = తొట్రుపడుటయు, పరిణామములుఘటిలియింపఁ = నమస్కారములుచేయుటయు పొసఁగునె = తగునా?

*సారంగధరుడా, నాకు రాజుగారియెడ నెట్టిగౌరవమో నీయెడను అట్టి గౌరవమే. నీవు సవతిబిడ్డవైననేమి? నన్నుజూచి తొట్రుపడుటయెందుకు? నమస్కరించుటయెందుకు? (అని యర్థము); ఓయీ, రాజువలెనే నీవును నాకు మనోహరుడవు. మన్మథునింబోలిన అందగాడవైయుండియును జంకెదవేల? నాతో గలిసి సుఖింపక దూరకవట్టి నమస్కారములు చేసెదవెందుకు? (అని యర్థాం)

గీ. అని సుశీలయుబలె నా గయ్యాళిజంత
చేయి చూపి ♦ ముంగలిగ విచ్చేయు మనుచు
నయ్యనఘుఁ దోడుకొని యేఁగె నతివినయము
ధూర్తలక్షణ మని మదిఁ దోఁప నపుడు. ౧౩

టీక.—ఆగయ్యాళిజంత = లోకమునకు వెరువని ఆధూర్తురాలు, సుశీలయుబలెఁ = ఉత్తమురాలివలె, ముంగలిగ *విచ్చేయుమనుచుఁ = ముందు నడువుమని చేయిచూపి, అయ్యనఘుఁ = పవిత్ర హృదయుడైన ఆ సారంగధరుని, తోడుకొని = కూడా తీసికొని, అతివినయము = మితిమీరిన విధేయత, ధూర్తలక్షణ

‡ పూ. టీ.—'తొడిఁబడఁ = తొట్రుపాటుతో' (ఇది సరికాదు)

* ఈవిషయము కం. సారంగ. లో ఇట్లున్నది.—

'రాజంతవాఁడవు రాజకుమార, నేఁ జెల్లమొక్కేదు నిన్నేమనందు?
స్త్రీలకు మ్రొక్కంగఁ జెల్లునటయ్య, బాలుఁడా నీబుద్ధి బంగారుగాను
(పుట. 22)

♦ శా. పా.—'చూపి ముందఱగ' ('చూపుచుముందు' పూ. ము.) 'చూపి ముంగలిగ' అని, తంజ. పా. 'ముంగలిగ' అనునదే సాధుపాఠము. 'ముంగలి = ముందునడచువాఁడు' (శ. ర.)

ఉ. 'మోదమునం దనూభవుని ముంగలిగా నడపించి' (నిర్వ. రా. 6-146.)

వ. 'సేనాపతియగు నా దుపదనందనుండు ముంగలియై నడపించుచుండ.'
(భా. భీష్మ. 1-118.)

* పూ. టీ.—'విచ్చేయుము = విజయంచేయుము - రమ్ము.'

మని, మదిఁ దోఁపన్ = (సారంగధరుని) మనసుకు స్ఫురింపగా, ఏఁగెను.- 'అతివినయం ధూర్తలక్షణమ్' అని సుభాషితము.

క. గందబూర గులికి †యనురా
గంబూర, మనంబు చల్లఁగాఁ, బన్నీటన్
బింబోష్ఠి యతనిపాదా
బ్జంబులు గడిగించెఁ గూర్మిసకియలచేతన్. ౫౪

టీక.—బింబోష్ఠి = దొండపండువంటి యధరముకలదైన - చిత్రాంగి, అనురాగంబు + ఊరన్ = ప్రేమ యుప్పతిల్లగా, మనంబుచల్లఁగాన్ = (తన) మనసు చల్లబడగా, గందబూర = కస్తూరమును, గులికి = (పన్నీటిలో) వేసి, ('గంద బూర కప్పురమన వెలయుఁ జంద్రంబు'. ఆం. సం.) పన్నీటన్ = ఆపన్నీటితో, అతని, పాదాబ్జంబులు = కమలములవంటి పాదములను - కూర్మి = తనకు ప్రియురాండ్రయిన - సకియలచేతన్ - (తనకు మారుగా - అని భా) కడిగించెను.

---

ఇక్కడ 'ముంగలిగ విచ్చేయుము' అనగా 'ముందునడువుము' అని ప్రకరణోచితమైన యర్థము. 'ముందరమ్మనుట యనుచితము. 'విచ్చేయు = వచ్చు; పోవు.' (శ. ర.) "సీ, వెచ్చోటికివిచ్చేయక, మచ్చికతో నుండుమయ్య మానగరమునన్.' (భా. గ. 1-253)

కావున 'విచ్చేయుము = రమ్ము' అనుట తప్పు. ఇట్లే శాస్త్రిగారు శృం. నై. (3-11) లో గూడా ఏగుదెంచుచోన్' అనుక్రియకు 'వచ్చునప్పుడు' అని చెప్పవలసినదానికి 'పోవుసమయమందు' అని యనుచితార్థముచెప్పినారు.

† శా. పా.—'అనురాగం బూరమనంబు, చల్లఁగా...' ('మనంబు అనురాగంబు ఊరన్ = మనస్సులో ప్రేమ ఉప్పతిల్లుచుండఁగా'అని పూ. టీ.)

'ప్రేమ ఉప్పతిల్లుచుండఁగా మనస్సులో చల్లఁగా పాదములుకడిగించెను' అను రచన 'సీతనుజంపి రావణుని జెచ్చెరఁ దెచ్చెను దానయోధ్యకున్' అనుటవంటిది. 'ఊరఁగాన్' — అను క్రియ కనంతరమున్న 'మనంబు' అను ప్రథమాంతపదమునకు 'మనంబులో' అని సప్తమ్యర్థకమర్థి చెప్పుటయు, దానిని క్రియకుముందున్న 'అనురాగము' ముందరికి లాగుకొనిపోవుటయు అక్రమము. సంప్రదాయవిరుద్ధముగూడాను. ఇట్టి ద్రావిడ ప్రాణాయామాన్వయపురచనలు ప్రాచీన కృతులలోనే కాదు నేటి సరసకవుల కావ్యములందును కనబడవు. క. "ప్రణమిల్లఁగ నాకు మీరు వచ్చినవారల్." ఇత్యాది కూర్పులు శ్రీ శాస్త్రిగారి గ్రంథములలోమాత్రము కనబడుచున్నవి. (చూ. మాళ. 4-17.)

చ. జనవరసూనుఁ డందులకుఁజాలఁ బ్రియంబు దొలంక నన్నెలం
తను గని నీ కుమారుఁడఁ గదా యిటు తక్కిన వారికిన్ బలెన్
జననిరొ నాకు నింత యుపచారము సేయఁగ నేటి కమ్మ నేఁ
డనవుడు నాకు మారుఁడవె యౌటను జేయుదు నంచు నేర్పునన్.

టీక.—నీ కుమారుఁడనుగదా, తక్కినవారికిన్ బలెన్ = ఇతరులకువలె, ఇంతయుపచారము చేయఁగ నేటికమ్మ, అనవుడున్ = అనగా, నాకుమారుఁడవే= నా పుత్రుఁడవే. (నాకు, మారుఁడవె= మన్మథుడవే' అని యర్థాం.) ఔటను = కాబట్టియే, చేయుదును = ఇంత యుపచారముచేయుచున్నాను. అని, నేర్పునన్ = అర్థచమత్కార మేర్పడునట్లు; నేర్పుతో - అంచున్ = అనుచూ- (అవతలికి అన్వయము)

క. ఏర్చినబలుమానికములు
నేర్చినయొక జాళువాపసిఁడిగద్దియపైఁ
గూర్చుండఁబెట్టి వినయము
గూర్చి నృపాలసుతుఁ గూర్చి కూర్మి పొసంగన్. ౫౬

టీక.— ఏర్చిన = మంచివిగా ఏరితీసిన; జాళువాపసిఁడి గద్దియపైన్ = మేలిమి బంగారపు పీఠముమీఁద.

గీ. తలిరుఁగెమ్మోవిఁ జిఱునవ్వు మొలకలెత్త,
నలరు కమ్మనివాసనల్ గులకరింపఁ,
గెలనఁ దియ్యని తేనెలు చిలుకుచుండఁ,
గలికిలతకూన యాకొమ్మ పలికె నపుడు. ౫౭

టీక.—తలిరు కెమ్మోవిన్ = ‡ చిగురుటాకువంటి యెఱ్ఱని యధరమునందుఁ చిఱునవ్వు, మొలకలెత్తన్ = అంకురింపగా, అలరు = ఒప్పునట్టి, కమ్మనివాసనల్ (అలరు కమ్మనివాసనల్ = పూలతావులవంటి కమ్మని వాసనలు అనియును.) గులక

‡ పూ. టీ.—చిగురుటాకులవంటి, కెమ్మోవిన్-'
'కెమ్మోవి' ఒక్కటియేగావున దాని కుపమానమైన 'చిగురుటాకు' న్ను ఒక్కటియే కావలెను. కావున 'చిగురుటాకులవంటి' అని బహువచనముగా చెపుటం తప్పు.

రింపఁగా = గుబాళింపఁగా, † కలికిలతకూన = ఒయ్యారపు కన్నెపడుచైన, అకొమ్మ = ఆయింతి - చిత్రాంగి. (కలికి - లతకూన = సొగసైన లేఁదీగ; కొమ్మ = చెట్టు కొమ్మ - అని అర్థాం.) కెలనన్ = ప్రక్కన (నిలుచుండి) తియ్యని తేనెలు - చిలుకుచుండన్ = చిందుచుండగా, పలికెన్ [తేనెవలె తియ్యనైన పలుకులతో నిట్లనెను అని భా.] ఆయింతి, లతతీగెయు- కొమ్మయు కావుననే అందు, తలిరు, అలరు, తియ్యని తేనెలు, కలవని చమత్కారము.]

ఉ. నీసుగుణత్వముఁన్ జెలువు నేర్పును నెచ్చెలులెల్లఁ జెప్పఁగా
వీసరవోనిమోహమున నీనులవింపగ వింతు నవ్య రే
ఖాసుమకాండ నేఁడు పొడగంటిని; గన్నులపండువయ్యె; నేఁ
జేసినభాగ్య మెవ్వరును జేయ రయారె. ఫలించెఁ గోరికల్. ౫౪

టీక.—వీసరవోని మోహమునన్ = వెలితిపడని వలపుతో, వింటున్ = వినుచుండుటను; నవ్యరేఖా సుమకాండ = నూతన సౌందర్యముతో నొప్పు పుష్పబాణుడా; కోరికల్ ఫలించెన్. (ఫలించెనని భూతార్థముగా చెప్పుట నీవునాకు దక్కితివని ప్రౌఢముగా సూచించుట.)

---

† పూ. టీ.—కలికి = విలాసవతియైన, లతకూన = లేఁదీఁగవంటిదైన, అకొమ్మ = శాఖారూపయైన యాచిత్రాంగి.'

'లతకూన' యనుపదమునకు 'లేఁబ్రాయపు స్త్రీ' అని రూఢ్యర్థము. శ. ర. కర్త 'లతకూన = లేఁతతీఁగవంటి ఆఁడుది' అన్నందున, పూ. టీ. కర్తలును 'లేఁదీఁగవంటిదైన' అన్నారు. పొరపాటు. శ. ర. కర్తవ్రాసినది వ్యుత్పత్తి, 'లతకూన' స్త్రీకి పర్యాయపదము కావున 'లతకూన = ఆఁడుది' అనుట యుచితము. చూడండి.—

'లతకూన - A spring, poetical phrase for a girl బాలిక''
(బ్రౌను.)

సీ. "అన్నులతకూన యొయ్యారి యతివ వెలఁది." (సాంబ. మాన - 20)

సీ. "కనుఁగొంటి లతకూనవని డాయుఁగాకున్న
నభినవశరలతా వాప్తిఁదెలుపు" (కసు. 3—83.)

'లతకూనయనఁగాఁ గన్నెపడుచును - లేఁత తీఁగెయును' అని వ్యాఖ్య.

కావున 'లతకూన - అకొమ్మ = లేఁదీఁగవంటిదైన కొమ్మ' అనుట రుచిరము కాదు.' మరియు, 'కొమ్మ = శాఖారూపయైన యాచిత్రాంగి' అనుటయును సరి కాదు. చిత్రాంగి, కొమ్మ (= స్త్రీ) యేగాని 'శాఖారూప' కానే కాదు.

ఉ. చందురునిన్ జయంతుని వసంతునిఁ గంతుని నాదిగా జనుల్
కొందఱు మోహనాంగు లనుకో విని పోవుటెగాక చూడ లే
దెందును వారిరూప [1]మది యెట్టిదియో యిదె నిన్నుఁ గంటి నా
నందము గాఁగ [2]నేఁడు సుదినంబగు [3]నాసదనంబు రంజిలెన్. ౧౯

టీక.—జనుల్ కొందఱు, జయంతుని...ఆదిగాన్ = జయంతుడు, వసంతుడు, మన్మథుడు మొదలగువారిని, మోహనాంగులు - అనుకోన్ = అందగాండ్లని యనుకొనుచుండగా, వినిపోవుటె కాక = ఊరక వినుటయేగాని, వారిరూప మది యెట్టిదియో, ఎందును చూడలేదు. ఇదే = ఇదిగో, ఆనందము గాఁగన్, నిన్నుఁ గంటిన్ = నిన్ను చూచితిని. (వారు సుందరులగుదురో కారో గాని నీవుమాత్రము నాకానందము గలిగించిన సుందరుడవు. అని, భా.) నేఁడు, సుదినంబగున్ = చాలా మంచిదినము. నాసదనంబు రంజిలెన్ = (నీవువచ్చుటచేత) నాభవనము శోభావంతమైనది.

---

1 శా. పా.—'మది యెట్టిదయో' (ఇది పూ. ము. పా.)

పూ. ము. ను చూచి శాస్త్రిగారును, వారినిచూచి వావిళ్లవారును 'ఎట్టిదయో' అన్నారు. కాని అది 'అయ్యో' యని సంతాపించుసమయము కాదు. 'ఎట్టిదియో' అని సరియైనపాఠము; తంజ. ప్రతులలోనున్నది. ఊహించియైనను సవరింపదగిన యల్పవిషయము.

2 శా. పా.—'నేఁడు సుదినంబుగ.' (ఇదియును, పూ. ము పాఠమే ) అర్థమేమో' పూ. టీ. లేనేలేదు. 'సుదినంబగు' అని నేను సవరించినాను.

3 శా. పా.—'నావదనంబు.' (వదనంబు = ముఖము, రంజిలెన్ = ప్రసన్నమాయెను.' అని, పూ. టీ.)

పూజ్యులును, ప్రియులును, ఇంటికివచ్చినపుడు 'మీరాకచే మాగృహము పావనమైనది; మాయిల్లు నూతన శోభను గాంచినది, అని యనుట లోకమునగలదుగాని 'మీరాకచే నాముఖము రంజిలిన' దనుట యెందునులేదు. 'నా సదనంబు రంజిలెన్' అనియే, పూ. ము. పా. అపాఠమే తంజ. ప్రతులు మూడింటిలోనున్నది. కవుల ప్రయోగము లొకటిరెండు.—

గీ. 'అస్మద్గృహంబు, పావనముచేసి చనుమన్న బ్రాహ్మణుండు.'

మను - 2-51)

ఉ. తొల్లి మనంబులోఁ గలుగు తుందుడుకెల్లను బాసెఁ, గామినీ
హల్లకబాణ యెంతపని కైన నిధానము నీవు గల్గ ♦ నేఁ
డల్లవిభుఁడు రాఁడని మహాపరితాపము నొంది యేల చిం
తిల్లఁగ? వెన్నఁ బెట్టుకొని నేతికి నేటికి నంగలార్పఁగన్? ౯౦

టీక.—తుందుడుకు = సంతాపము, కామినీహల్లకబాణ = వలపుకత్తెలపాలిటి మన్మథుడా, (హల్లక = ఎఱ్ఱకలువలు, బాణ = బాణములుగాఁగలవాడు.) నిధానము = నిక్షేపము - వలె, నీవుఁగల్గన్ = నీవుండగా, నేఁడు, అల్లవిభుండు = ఆరాజు - రాఁడని; అంగలార్పఁగన్ - ఏటికిన్ = పరితపింపవలసిన పనియేమి?

'ఇంట్లో వెన్నపెట్టుకొని నేతికి వెదకినట్లు' అని లోకోక్తి. సారంగధరుడు వెన్నవలెనే కరగింపవలసిన దశలో నున్నాడనియు, కరగించినచో వినియోగపడు ననియు సారస్యము.

క. ననుఁ జూడరాఁడ దేమో
యని నిను * దూఱుకొనుచుందు ననయము; నాపై
నెనరు గలందుకు గుఱుతిదె
కనిపించెను మనము వేడుకలు గనఁ గల్గెన్. ౯౧

టీక.—నినున్, దూఱుకొనుచుందును = నిందించుచుండెడిదానను.—'దూఱుకొను.' ఇందు స్వార్థముననే 'కొను' అనుప్రయుక్తము. ఒక్కప్రయోగము.

క. 'ఎద్దొక్కకడఁ దీసిన
గ్రద్దఱియొనుఁబోతు నొక్కకడకీడ్చుటయున్
బెద్దమునికోలచేఁ జే
కొద్దిన్ వడియడర బాఁదుకొనుచున్ దున్నెన్.' (శేష. ౪. ఆ.)

'బాఁదుకొనుచున్ = బాఁదుచు' (శ. ర.)

గీ. 'వైష్ణవోత్తము మీపాద పద్మ
వలన మాయిల్లు పావనత్వంబునందె.' (శ్రీవణా. 2-3)

♦ శా. పా.—'నేనల్ల.'

* శా. పా.—'దూఱికొనుచు' (నిను 'జూచుకొనుచు' పూ. ము.)
నిందార్థకమయిన 'దూఱు' లోనిది శకటరేఫముగాని లఘురేఫము కాదు.

ఉ. నా యపరంజి మేడ యొకనాఁడునుఁ జూడవుగా, యగోచరం
బా యురుమంజిము త్తియపుటన్నువసోరణగండ్లయంద, మా
చాయల కెంపుటోవరుల చందము, నా చలువ ల్దొలంకురే
రాయల రా యరంగులసరాగము, నామణికుడ్యభాగముల్. ౬౨

టీక.— నా, అపరంజి మేడ = బంగారు మేడ, చూడవుగా = చూడలేదుగదా, * అగోచరంబు = అది 'యిట్టిది' యని యూహచేయరానిది. (అవశ్యము చూడదగిన దని భా.) ఆ † ఉరు...యందము = హురుమంజి దేశపు ముత్తెముల జాలరులు కూర్చిన ‡ సోగసైన గవాక్షములసొంపు, ఆ చాయల...చందము = ప్రకాశవంత

(చూ. 30 క్రింద) 'దూటికొను'. అనుటకంటెను 'దూఱుకొను' అనుట వ్యవహార మునకు దగ్గర.

* పూ. టీ.—'అగోచరంబు = చూడఁదరముగానివి.'

'అగోచరంబు' అను, ఏకవచనమునకు 'చూడఁదరముగానివి' అని బహువచనార్థము చెప్పుట తప్పు. కవి 'సోరణగండ్లయందము, ఓవరుల చందము, అరుగుల సరాగము, గోడలయొక్క-భాగములు- అగోచరము'అని భిన్నవచనతాదోషమున కాస్పదముగా రచనకావించెనని పూ. టీ. కర్తలనుకొనుట భ్రాంతి. 'నా యపరంజి మేడ, అగోచరము = అవశ్యము చూడదగినది. ఆ గవాక్షములయందము, ఓవరుల చందము మొదలగునవియు, అందలి వినోదమార్గములు- విశేషములు...చూచి, అందు కొంతసేపు విశ్రమించిపొమ్ము'అని అవతలిపద్యముతో కలిసి సరియైన యన్వయము. ఆపాటి గమనింపక పూ. టీ. వారు అక్రమాన్వయమున కుపక్రమించి 'అగోచరము'నకు లేనియర్థమును కల్పించినారు.

† పూ. టీ.—'ఉరుమంజి = పసుపునీరుగలిగినట్టి.'

'ఉరుమంజి' హురుమంజికి రూపాం.— అది యొక దేశము పేరుగాని విశేషణముకాదు. శ. ర. కర్త 'ఉరుముంజి = దేశ విశేష' మని చెప్పి అందుకీపద్యము నే చూపించినాడు. మరియొక ప్రయోగము —

సీ. 'సింహళంబున గంధసింధురంబులు దెచ్చి
హురుమంజి బలు తేజి హరులు తెచ్చి, (హర. పీఠిక - 25)

పూ. టీ. కర్తలకు 'హురుమంజి' తత్త్వము తెలియదు. (చూ. ౧౧౯ పుట.)

‡ పూ. టీ.—'అన్నువ = సూక్ష్మమైన - సోరణగండ్ల = గవాక్షముల యొక్క.

ములయిన కెంపులు చెక్కిన, ఓవరుల = పైమేడల - అందము, ఆ చలువల్ ... సరాగము.—చలువల్ తోలంప = చల్లదనమునీనుచుండు, శేరాయల రా = చంద్రకాంతమణుల (తో కట్టబడిన), అరంగుల సరాగము = అరుగుల చక్కదనము, ఆ మణి...ముల్ = అరత్నాలగోడలు, (అవతలి పద్యముతో అన్వయము.)

ఉ. అందు వినోదమార్గములు, నంను విశేషము, లంను హార్మ్య, లిం
పొందఁగఁ జూచి, మానికపు టోవరిలో సొగసు ల్నటింపఁగా
గంధము వక్కలాకులును గైకొని, వేడ్క నొకింతసేపు నీ
వందుల విశ్రమించి, చనుమా చనుమానముతోడ నాపుడున్. ౯౨

టీక.—అందు = అందలి, వినోదమార్గములు = వేడుకగా పొద్దుపుచ్చుటకు చేసిన యేర్పాటులు, విశేషములు = క్రొత్త క్రొత్త రచనలు (=నిర్మాణములు) హార్మ్యలు = సోయగపు పనులు, ఇంపొందఁగన్ = ఆనందముకలుగగా, చూచి, మానికపు టోవరిలోన్ = మాణిక్యములతో కట్టిన గదిలో.—ఒకింత సేపు, చనుమానముతోడన్ = చనవుతో (అనగా మనసుకలిసి) విశ్రమించి, చనుమా; నాపుడున్ = అనగా,

'చనుమానము'- నిఘంటువులలో లేదు; వ్యవహారముననున్నది.

చ. వెడనగ వంకురింపఁ బృథివీవరసూనుఁడు వల్కె నప్పుడ
ప్పడఁతుకతోడ 'నా కిపుడు ప్రాణపదం బగుపావురంబు పైఁ
గడుఁ బొడవేఁగి పెంటిఁ బొడగానక యిచ్చట వ్రాలె; దానివెం
బడిఁ బడి రాజు లేనియెడ మాపినతల్లివి నీవు గావునన్. ౯౮

చిత్రాంగి మేడకు పెట్టిన కిటికీలు 'సూక్ష్మమైన' వని పూ. టీ. వారు వింత విషయమును చెప్పినారు. గవాక్షములకు విశేషణమయినప్పుడు- 'అన్నువ'కు మనోహరమైన, సొగసైన, అని యర్థము చెప్పుట యుచితముగాని 'సూక్ష్మమైన' అని చెప్పుట యుచితము కాదు. శ. ర. లో 'అన్నువ= అల్పము' అని యున్నది. అందువల్ల పూ. టీ. కర్తలును 'అన్నువ= సూక్ష్మమైన' అన్నారు. కాని అది ప్రకరణోచితమైనయర్థము కాదు. చిత్రాంగిమేడవంటి పెద్దపెద్దమేడలకు సూక్ష్మమైన కిటికీలు పెట్టుటగాని - అట్టివానినొక గొప్పగా చూడరమ్మనుటగాని సంభవము కాదు. కావున వే. సూ. ని. 'అన్నువ = మనోహరమైన, సొరణగండ్లు' అని యర్థము చెప్పినది. (చూ. 'అన్నువ.')

టీక.— * వెవెనగవు = అనంగీకారమును - నిరాదరమును సూచించు వింతనవ్వు. పాఱు, పాణపదము = ప్రాణస్థానము (ప్రాణసమానమని భా.) అగు పావురంబు, పైన్ = పైకి,

చ.[1] రవియును రశ్మికిన్ జొరఁగరాని భయానక మైన నీ మణీ
భవనము వచ్చి సొచ్చి పదపంకజములు గని మ్రొక్కఁగంటి; నీ
దవు కరుణావిశేషమున నన్నియు నున్నవి; యేటికమ్మ? పా
రువమునొసంగు పోయెద సరోరుహలోచన యన్న నవ్వుచున్. ౬౫

టీక.—రవియును రశ్మికిన్ = సూర్యుని సన్నని కిరణమునకైనను, చొరఁగ రాని = ప్రవేశింపవీలుగానిదియు, భయానకము = భయంకరమును - ఐన, నీమణీ

---

* పూ. టీ.— 'వెవెనగవు = చిఱునవ్వు.'

పినతల్లి చావిమాలి వలపుమాటలాడగా, అందుకేవగించుకొను సారంగధరుడు 'చిఱునవ్వు' నవ్వునా? ఇది స్వభావ విరుద్ధమయినవ్రాత. ఈపద్యమునకు మూల మిట్లున్నది.

"మేడలోపలికి, వచ్చి యొకించుక వడి విశ్రమించ
విచ్చేయు మనినఁదా ‡వింత నవ్వొలయ, నచ్చారులోచన కతఁడునిట్లనియె."
(నవనాథ. పుట. 44.)

[1] శా. పా.—'రవి శశి రశ్మికిన్' (సూర్యునియొక్కయు - చంద్రుని యొక్కయు కిరణమునకు' అని పూ. టీ.)

సూర్యచంద్రుల కిద్దరికిని, ఉమ్మడిగా - ఒక్క కిరణమునే చెప్పుట యొప్పు కాదు. ఎవరికిరణము వారిదేగనుక 'కిరణములకును' అని యనవలసియుండును; కాని పద్యమున 'రశ్మి' ఒక్కటియేయున్నది. కాబట్టి శా. పా. తప్పు. అర్థమునుతప్పే. 'రవిఘనరశ్మికిన్' అని పూ. ము. పా; 'రవియణురశ్మికిన్ (యున్)' అని తంజ. పా. మూలగ్రంథమున నిట్లున్నది.—

"రవి రశ్మికిని జొరరాని నీవున్న, భవనాంగణమునకు భయమింతలేక
చనుదెంచి నీపాద జలజంబు లెలమిఁ, గని మ్రొక్కఁగంటి."
(నవనాథ - పుట. 45.)

---

‡ 'వింతనవ్వొలయు' అని ముద్రితప్రతి. (?)

భవనము = నీరత్నాలమేడకు, (షష్ఠ్యర్థమున ప్రథమ.) వచ్చి; * సరోరుహాలోచన— (స్త్రీమాత్ర సంబోధనము.)

క. పోయెదు గా కిపుడే మని
యాయన చెయివట్టి వట్టియాసల నపు డా
గాయకపుజంత చెంతం
†బాయక తోడుకొని మేడపయికిం జనియెన్. ౬౬

---

* పూ. టీ.—'సరోరుహాలోచన = పద్మములవంటి నేత్రములుకలదానా.'

తల్లిని సంబోధించుటలో, అందును ఆమెకు నీతిని బోధించుపట్టున, వాడిన 'సరోరుహాలోచన' యను పదమునకు అవయవార్థము చెప్పుట యనుచితము. అట్టి తావులలో - అట్టి సంబోధనలకు అవయవార్థము చెప్పుట కవి హృదయము కాదు. ఈ సందర్భమునుగూర్చి శ్రీ తిరుపతి వేంకటకవులు వ్రాసిన యీ క్రింది పంక్తులు పఠింపదగినవి.

(భారతవిశేషములు 18. అవివక్ష)

"వ॥...గరు డుండు తల్లికిట్లనియె.

ఉ॥...పనుల్ సేయఁగ నేమికారణము చెప్పుమ నాకుఁ బయోరుహాననా."

భా. ఆది-2.

ఈ సంబోధమున కిట నవయవార్థమును వివక్షింపవలసినదని కవి హృదయము కాదు. స్త్రీత్వమాత్ర బోధకమనియు నందునను బ్రకరణముంబట్టి 'అమ్మా' అను నర్థముమాత్రమే వచ్చుననియు నెఱుఁగఁదగును. సంస్కృత మహాకవుల కవిత్వములో నిట్టివెన్నో కలవు. అంతమాత్రమున వారి కజ్ఞతకల్పించి యౌచిత్యభంగ మయ్యెనని యనుట సాహసము; వాస్తవదూరము.— దీనింబట్టి, అరణ్య. 7 ఆ. లోని 'తనులతాంగి' ఇత్యాది సంబోధనములుగూడ సమర్థించుకొనఁదగు. ఆవిశేషములు యముడు సావిత్రింగూర్చి పల్కినవి. ఆమె యపుడు మహాపదలోనున్నయది. పైగా అఖండ పతివ్రత. యముఁడో ధర్మస్వరూపుఁడు. ఇట్టిండట్టి దుస్థితిలోనున్న సాధ్వి నట్లు సంబోధించునని యెఱ్ఱన్నగారనుకొందురా! వారి తాత్పర్యమేమి? అవయవార్థమునకు వివక్షచేయక స్త్రీ మాత్రబోధకముగా నర్థముచెప్పికోవలసినది యనియే. ఇట్లే కవులయాచారమని యెఱుఁగఁదగును."

(షష్టిపూర్తి సంచిక. 7 సంపుటము.)

† శా. పా.—'బాయకఁ దోడుకొని.' ('బాయక తోడుకొని' అని పూ.ము, పా.)

టీక.— వట్టియాసలన్ = అడియాసలతో, గాయకపుజంత = టక్కరి ధూర్తురాలు. చెంతంబాయక = అండవదలక.

వ. అయ్యెడ. ౬౭

ఉ. 'పాయని మోహతాపమున భామిని యుండఁగ నాదుమీఁద నేఁ
డీయెడ హాని వచ్చు నని యెంచక [1] యూరక పిట్ట రేఁపుచే
నీయన † కన్నుఁ గాన కిపు డిచ్చట వచ్చునె! యమ్మచెల్ల! యే
మో యిది కారణం' బనుచు నూహలు సేయుచుఁ బ్రోడ చేడియల్ ౬౮

టీక. పాయనిమోహతాపమునన్ = ఎడతెగని వలపువేదనతో, భామిని =

వ్యా. స్వార్థకమయిన 'పాయక' కళ గాని దుత్తపత్రికృతికము కాదు. కావున 'దోడుకొని' అనుటతప్పు; 'తోడుకొని' అనుటయే ఒప్పు. శాస్త్రిగారు ఒప్పును తప్పుగా సవరించినారు. వావిళ్లవా రాతప్పుపాఠమునే గ్రహించినారు. (వివరము లకు చూ. 'నూరక.')

[1] శా. పా.— 'నూరక' (ఎంచక 'యూరక' అని, పూ. ము. పా.)

'ఎంచక - యూరక' అనుట తప్పనుకొని శాస్త్రిగారు 'నూరక' అని సవ రించినారు. (ఆసవరణనే వావిళ్లవారంగీకరించినారు.) శాస్త్రిగారు దిద్ది ముద్రిం చిన యితర గ్రంథములలోను - పెక్కుతావుల నిట్లే, వ్యతిరేకస్వార్థకము ద్రుత ప్రకృతికముగా నేయున్నది. చూడండి.—

బా. శం. సారంగధర.—

'బుద్ధి చెప్పక నేల పోనిచ్చిరనిన.' (పుట. 19.)
'చిలుకనూరకఁజూపి చిత్రాంగిదేవి.' (పుట. 14.)

వ్యా. స్వా. కళ గాని దుత్రకపత్రికృతికము కాదు. కావున శా. పా. సరి కాదు.

† శా. పా.—'కన్నుఁ గానక...'

'కన్నుంగానక'; (వాడు గర్వమున) 'కన్నుంగానడు' అను రూపము లసాధు వులు. కన్ను గానక' అను క్రియలోని 'కన్ను' ప్రథమ గాని ద్వితీయము కాదు. "అతను దర్పాంధకారమంతంతఁ గవియఁ, గన్ను గానక" (రామా. 5-70.) "మానసారుండు రాజ్యగర్వంబునఁ గన్ను గానక" (దశకు. 2-4.) వివరములకు చూ. సూ. ని. 'కన్ను గానక.' ('కన్నుఁ గానక' అనియే వావిళ్ల ప్రతిపాఠము సరి కాదు.)

చిత్రాంగి, [2] పిట్టరేఁపుచేఁ = పిట్టప్రేరణచేత. ఇదియేమో కారణంబు = ఇది యేదో హానికిమూలము. ప్రోడచేడియల్ = ప్రౌఢలైన చెలికత్తెలు.

ఆ. వె. తత్తఱింపఁ ‡దొణఁగి రిత్తఱి నిది యేమొ
సూటి గాదు తలఁపఁ బాటిగాదు;
తగదు మాను మన్నఁ బగవార మగుదు ¶మిా
కటికి మనము పులినకటికి మనము. ౬౯

టీక.—తత్తఱింపఁదొడఁగిరి = తత్తరపడజొచ్చిరి. (కర్త. వెనుకటి పద్యము లోని ప్రోడచేడియలు.) ఇదియేమొ - సూటికాదు = ఆలోచించిచూడగా ఈపని మనసునకు సరిపడుటలేదు. పాటికాదు = న్యాయమునుకాదు. తగదు - మానుమన్నఁ, ఈకటికిమనము పులినకటికిఁ.— *కటికమనము = కఠినమైన మనస్సుగల, పులినకటికిఁ = సైకతశ్రోణికి, (చిత్రాంగికి) మనము - పగవారమగుదుము. (అవతలికి అన్వయము.)

---

2 పూ. టీ.—'పిట్టరేఁపుచేఁ = పక్షి (పావురము) యొక్క విజృంభణచేత.

'రేఁపు = విజృంభణ' అని నిఘంటువులో లేదు. సారంగధరుడు చిత్రాంగి మేడకువచ్చుట పిట్టయొక్క ప్రేరణచేతగాని 'విజృంభణ' చేతకాదు.— రేఁపు (=ప్రేరేపణ) 'రేఁచు' అనుక్రియనుండి పుట్టియుండునేమో? ప్రేరేచు - అను అర్థమున 'రేపెట్టు' అనువాడుకయున్నది. పెద్దలు పరిశీలింతురుగాక.

‡ శా. పా.— 'దొణఁగి యిత్తఱి' ('దొడఁగి రిత్తఱి.' పూ. ము. పా.) పూ. ము. పాఠమే సాధువు.

¶ శా. పా.—'మిక్కటికి' ('మీకటికి' పూ. ము. పా. తంజ. పాఠమున్న.) 'కటికి - కటికి' అని శబ్దాలంకారముకావున 'క్కటికి - కటికి' అనుట సరికాదు.

* పూ. టీ.—'కటికి = క్రూరమయిన'

'కటికి'కి 'క్రూరమయిన' అను నర్థములేదు.—"కటికి = కఠినము" (శ. ర.) "కటికి - Mere, utter- కఠినము. గట్టి" (బ్రౌను) 'కటికి' - మనస్సునకు విశేషణమైనప్పుడు 'కఠినము' అనునదే ప్రసిద్ధమయిన యర్థము.

చ. 'వండిరి సిరియాలునిఁ గటికిడెందమునఁ దరళాక్షులిద్దఱుఁ,'
హర. 2-120।

'చిత్రాంగి గట్టి మనసుకలది; మన మాటనుపట్టి మనసును మార్చుకొనది

క. అటు గనుక నీమెచెప్పిన
యటువలె ॥ నియ్యకొని లియ్యమై యుండంగా,
నటుమీఁద దైవ గతి' యని
యటు నిటు † నడయాడుచుండి రా చెలు లంతన్. ౭౦

టీక.— అటుగనుకన్ = అందువల్ల (=ఆమెకు పగవారముగుదుము కాబట్టి,) ఇయ్యకొని = ఒప్పుకొని, లియ్యమై = ఆమెతో ఏకీభవించి;—

ఇయ్య + కొను = ఇయ్యకొను. ఇయ్య = ఇష్టము. శ. ర. కర్త 'ఇయ్యకు ప్రత్యేక ప్రయోగము లేదన్నాఁడుకాని భారతమున కలదు.

(1) మధ్యాక్కర.—'ఒనర నాసుతునకు భార్యవగుమన్న నొడఁబడి యియ్య యనిరెు.' (ఆది. 4—142.)

(2) క. 'చక్కనగుమనిన రక్కసుఁ
డక్కజముగఁ బెరిఁగి యియ్యయగునిప్పుడు నీ
యుక్కును బీరముఁజూచెదఁ
జిక్కన నిలుమనుచుఁగడు విజృంభించివడిన్.' (ఆది. 6-205)

సీ. నిశ్రేణి శోణమణిశ్రేణి కాంతులఁ
జరణాబ్జరాగంబు శిరము దన్న,
జాతరూప కవాట జాత రూప స్ఫూర్తి
నంగవల్లీచ్ఛాయ యవలఁ ద్రోయ,
జాల మౌక్తిక వజ్ర జాల మంజుద్యుతిఁ
గనుదోయి జిగి యోరగంటఁ జూడ,
నస్తంభ * నీలమయ స్తంభ రుచితోడ
నెఱికొప్పు ‡ కప్పుడా లోరసికొనఁగ,

---

కాదు. కనుక మనము పలుకకుండుటయే మేలు' అనియే ఆ 'ప్రౌఢచేడియ' లను కొన్నదియు. ('గట్టి కటికియనంగఁ గన్పట్టు దృఢము.' ఆం. భా. 3-23)

॥ పాఠాం.— 'జేసుకొని' † 'తిరుగాడు'

* పాఠాం.—'నీలమణి' ‡ శా. పా.—'కొప్పుఁగప్పు'; కొప్పుకప్పు - అను టయుక్తము. (చూ. 3ల క్రింద 'ఎత్తుఁదావిః')

గీ. నవ్విలాసిని యతిమనోహారము లైన
చవికె ‡ లరుఁగులు * పాకలు చప్పరములు
నాది యైన విశేషమ్ము లన్ని యతని
కెచ్చరించుచు మేడపై కేఁగునపుడు. ౭౧

టీక.—నిశ్రేణి = (నిచ్చెన) సోపానముల (యందు చెక్కబడిన), శోణమణి శ్రేణి కాంతులన్ = కెంపుల వరుసలయొక్క మెరుగులను, చరణ అబ్జరాగంబు = పద్మములవంటి పాదముల యెరుపు. శిరముదన్నన్ = తలదన్నగా; (పాదముల యెఱ్ఱదనము కెంపుల కాంతులనుమించినదనియు, చిత్రాంగి మెట్లెక్కినదనియు, భా.—'తలదన్నుట' యనగా, కాంతులపక్షమున తిరస్కరించుట, [ఎక్కునప్పుడు మెట్లమీద పాదములుంచుట సహజము కావున,] మణులపక్షమున నిజముగా శిరము నేతన్నుట.

జాతరూపకవాట = బంగారు తలుపులనుండి, జాత = పుట్టిన, రూపమూర్తిన్ = శోభావిశేషమును, ('రూపంస్వభావే శుక్లాదౌ సౌందర్యే నాటకేపిచ.' నా. ర.) అంగవల్లీచ్ఛాయ = తీగెవంటి శరీరముయొక్క చాయ, 1 అవలఁదోయన్; (శరీరముయొక్కచాయ బంగారు కాంతులను మించినదనియు, చిత్రాంగి తలుపులు తెరచినదనియు, భా.— 'అవలఁద్రోయుట' యనగా, చాయ పక్షమున తిరస్కరించుట; [తలుపు తెరచి నెట్టుట స్వభావము గావున] తలుపులపక్షమున నిజముగా అవతలికిత్రోయుటయే.) 'అవలఁద్రోయు = తిరస్కరించు' అనుట కొక్క యుదాహరణము.—

‡ శా. పా.—'అరఁగులు'

పూ. ము. నను, వ్రాతప్రతులలోనుగూడా 'అరుఁగులు' అని యున్నది. 'అరుగులు' అనియే లోకవ్యవహారము. ఆరూపము ప్రాచీన కవులును సమ్మతించినదే.

చ. 'బిసబిసఁబోక యొయ్యనడపింపు దరుంగు మెఱుంగు మెట్టికల్'
(పాంచా. 4-21)

శాస్త్రీగారుమాత్రము 'అరఁగు' అనియే అందురు. (చూ. ఆముక్త. పు. 54-55.)

* పాఠాం.—పూ. ము. న 'దాకలు'; తంజ. ప్రతులలో 'దాంకలు' 'టాంకలు' అని పాఠములున్నవి. సరియైన రూపమేమో? అర్థమేమో? నాకు తెలియలేదు.

1 పూ. టీ.—'అవలఁద్రోయన్ = వెడలఁద్రోయగా;'

సీ. 'కేతనంబుల మణివ్రాతంబురోచులు
రవి కిరణంబుల నవలఁద్రోవ.' (భా. భీష్మ. 1–104.)

జాల = కిటికీల (కు దిగవేసిన), మౌక్తిక వజ్ర జాల = ముత్యాల - వజ్రాల జాలరులయొక్క, మంజుద్యుతిన్ = ఇంపైన కాంతిని, కనుదోయిజిగి = కన్నుల ధావళ్యము, 2 ఓరగంటఁజూడన్; (కన్నుల ధావళ్యము ముత్యముల కాంతిని వజ్రముల కాంతినిగూడా మించినదనియు, చిత్రాంగి కిటికీలగుండాచూచినదనియు, భా.—ఓరగంటఁ జూచుటయనగా, ధావళ్యపక్షమున తిరస్కరించుట; [కిటికీల గుండా ప్రక్కలకుచూచుట మామూలు కావున] ఆ పక్షమున నిజముగా ఓరగంటన్= ప్రక్కచూపులతో' చూచుటయే.)

1 అస్తంభ = నిలుకడలేని (తళతళలాడునట్టి) నీలమయ స్తంభరుచితోడన్= నీలాలు పొదిగిన స్తంభముల కాంతితో, వెతికొప్పు కప్పుడాలు = సొగసైన కొప్పు యొక్క నల్లనికాంతి, 3 ఒరసికొనఁగన్, (కొప్పుయొక్క డాలు నీలముల నిగనిగ లను మించినదనియు, చిత్రాంగి నీలమణిస్తంభములదగ్గర నిలిచినదనియు, భా.— 'ఒరసికొనుట' యనగా డాలుపక్షమున, ఎదిరించుట = తిరస్కరించుట; [స్తంభముకడ నిలిచినప్పుడు కొప్పు స్తంభమునకానుట సహజము కావున] కొప్పుపక్షమున నిజముగా, ఒరసికొనుట (=అనుకొనుట)యే.—

ఆ విలాసిని = హొయలుకత్తెయైన ఆచిత్రాంగి, అతి మనోహరములయిన, చవికెలు = చావిళ్లు, అరుఁగులు, పాకలు = వసారాలు, చప్పరములు = పందిళ్లు, అదియైన = మొదలయిన, విశేషములు, ఆతనికిన్ = సారంగధరునికి, ఎచ్చరించుచున్ = తెలియజెప్పుచు, మేడపైకి - ఏఁగునపుడు. (అవతలికి అన్వయము.)

ఎఱ్ఱని పాదములును, బంగారువంటి శరీరమును, స్వచ్ఛములయిన కన్నులును; నల్లని కురులును గల చిత్రాంగి, సారంగధరుని పిల్చుకొని, కెంపుల మెట్లమార్గమున

---

2 పూ. టీ.—'ఓరకంటన్ = అపాంగదృష్టిచేత, చూడన్';

3 'ఒరసికొనఁగన్.' (పూ. టీ. లేదు.)

ఈ మూడు క్రియలు వాడుటలో కవి యుద్దేశించిన లక్ష్యార్థ వాచ్యార్థముల చమత్కృతి పూ. టీ కర్తల కవగతముకాలేదు.—తలదన్ను, అవలఁద్రోయు; ఓరగంటఁజూచు; ఒరసికొను, అను క్రియలకు వరుసగా, అతిక్రమించు; తిరస్కరించు; అనాదరించు; ఎదిరించు, అని లక్ష్యార్థములు.— తలనుతన్ను; అవతలికిత్రోయు; కడగంటితో చూచు; అనుకొను, అని వాచ్యార్థములు.

1 పూ. టీ.—'అస్తంభ = అమందమైన' ఈయర్థము సరికాదు.

మీది యంతస్తుకుపోయి బంగారు తలుపులు పాయదట్టి, లోపల ప్రవేశించి, కిటికీలలో తొంగిచూచుచు, నీలాలకంబాలకడ నీటుగానిలుచుచూ ముద్దులుగులుకుచూ, అచటి విశేషములనెల్ల సారంగధరునికి వివరించెనని తా.

గీ. చంద్రకాంత వితర్దికా సాంద్ర కాంతి,
యింద్రనీల మయ స్తంభ రుంద్రదీప్తి,
రెండుఁ బెనఁగొని యరు దొనరించె మదికి;
గంగ యమునయుఁ గూడినభంగి మెఱసి. ౭౨

టీక.—చంద్రకాంత వితర్దికా = చలువరాళ్ళ అరుగులయొక్క, సాంద్ర= దట్టమైన. కాంతియు, ఇంద్రనీలమయ స్తంభ (ములయొక్క) - రుంద్రదీప్తి = విస్తారకాంతియు, పెనఁగొని, గంగ యమునయును కూడినభంగిన్ = సంగమించినవిధమున, మెఱసి = ఒప్పి, మదికి - అరుదొనరించెన్ = ఆశ్చర్యమును కలిగించెను. (చంద్రకాంతములకాంతి గంగవలె తెలుపును, నీలమణులకాంతి యమునవలె నలుపును, కావున ఆరెండుకాంతుల కలయికకు గంగా యమునా సంగమముతో పోలిక. గంగా యమునలు ప్రయాగకడ సంగమించును.)

ఉ. నాయకమైన కెంపుగమి నాటినచోటులు సాంధ్యరాగముల్
జేయఁగ, నింద్రనీలముల చెక్కడపుంబని చిక్కి యంధకా
రాయితమై వెలుంగ, మగరా లమరించినపట్లు వెన్నెలల్
గాయఁగ, ముజ్వెలుంగులకుఁ గందువయో యన మించెఁ నందులన్.

టీక.—నాయకమైన- కెంపుగమి = మేలయిన పద్మరాగముల మొత్తము, నాటినచోటులు, సాంధ్యరాగముల్-చేయఁగన్ = సంధ్యాకాలపు ఎఱ్ఱదనమును కలిగింపగా, ఇంద్ర...చిక్కి = నీలములు పొదిగినచోటు, అంధకారాయితమై = చీకటివలెనై, వెలుంగగా, మగరాలు = వజ్రములు, అమరించినపట్లు, వెన్నెలల్ కాయఁగన్, (ఆభవనము) ముజ్వెలుంగులకున్ = ఎరుపు, నలుపు, తెలుపు అను మూడు కాంతులకును, కందువయో = ఉనికిపట్టో, అనన్, మించెన్. అందులన్ = అట్టిభవనమునందు. (అవ - అన్వ.)

చ. పరిమళపేటు, లారజపుఁబల్కులచిల్కలు, పారువాల పం
జరములు, తూఁగుటుయ్యెలల చప్పరమంచము, లించు తావిపూ
సరములు, ధూపవాసనలసంభ్రమముల్, గల కేళి రత్న * మం
దిరమున నక్కుమారుని మణీమయవేదికనిల్పి చెంగటన్. ౭౪

టీక.—పరిమళపేటులు = సుగంధద్రవ్యముల పెట్టెలు, ఆరజపు పల్కుల= ముద్దుపలుకులు పలుకు - చిలుకలు,— చప్పర మంచములు, ఇంచుతావి = ఇంపైన వాసనగల - పూసరములు, ధూప...ముముల్ = అగరు మొదలగు ధూపముల సువాసనల సంచారములు, కల, కేళిరత్నమందిరమునన్ = రత్ననిర్మితమయిన కేళీగృహమునందు, అక్కుమారునిన్ = సారంగధరుని, మణీమయవేదికన్ = రత్నాలయరుగుమీద, నిల్పి = కూర్చుండబెట్టి, చెంగటన్ = సమీపమున (తాను నిలుచుండి.— అవ. అన్వ.)

ఉ. ఏకడఁజూచినన్ రతుల ♦ యేఁకట తీరఁగ వ్రాసినట్టి కొ
క్కోకకళారహస్యములు, గోప్యము లౌచవుసీతిబంధముల్,
నాకపురీ విలాస కలనా గణికామణికాముకాది నా
నాకృతులున్, విచిత్రగతు, లచ్చట నచ్చపలాక్షి చూపుచున్. ౭౫

టీక.—ఏకడఁజూచినన్ = ఏప్రక్క చూచినను, రతుల - ఏఁకట - తీరఁగన్ = రతిసంబంధమైన పేరాసతీరునట్లుగా, వ్రాసినట్టి, కొక్కోక కళారహస్యములు = కొక్కోకునిచే చెప్పబడిన కళామర్మములును, చవుసీతిబంధముల్ = ఎనుబదినాలుగు విధములైన రతి బంధములును, నాక...తులున్—నాకపురీ = స్వర్గపురమునందలి, విలాసకలనా = శృంగార చేష్టలుగల - గణికామణి = వేశ్యారత్నములు; కాముక = విటులు; ఆది = మొదలైన నానాకృతులున్ = అనేక రూప

* శా. పా.—'మందిరముల' (ఇదే, 'వావిళ్ల' పాఠమున్న.) అనేక మందిరములయందు, ఒక వేదికమీద నిలిపెననుట అర్థములేనిమాట. పూ. ము. నను, వ్రాతప్రతులలోనుగూడా 'మందిరమున' అనియేయున్నది.

♦ శా. పా.—'రతుల - కేఁకట.' ('రతులకున్ = క్రీడలకు, ఏఁకట = మిక్కుటమైన కోరిక' అని పూ. టీ.)

ఏఁకట - తీరుటు, మానవులకుగాని 'రతులకు' కాదు. కావున 'రతులయేఁకట' అని యుండుట యుచితము. 'రతుల కేటుగ లేటుగ' అని, పూ. ము. పా

ములను, † విచిత్రగతులం = కాముకీకాముకుల చిత్రవిచిత్రవర్తనములు. అచ్చటన్ = ఆకేళీగృహమున, అచ్చపలాక్షి = ఆచిత్రాంగి, మాపుమన్ = సారంగధరునికి చూపించుచూ.

ఉ. ఈవిటు లెస్స చూచితె మహి న్నెఱజాణవు వల్లవీకుచే
ష్టావిరతానురాగయుతుఁడై ‖ తగ నెయ్యపుటాలమందలో
నావగ లెల్ల నగ్గలిక నారసి గైకొని యున్కి నో వయో
హావకళాభిరామ జలజాంబక కేళివినోద † వైఖరుల్. ౮౬

ఈపద్యమున చిత్రాంగి కృష్ణుని బాల్యక్రీడనుగూర్చి చెప్పుచూ, అతని విటవర్తనమునుగూడా స్ఫురింపజేయుచున్నది.

టీక.—ఓ వయో...రామ.— వయః = వయస్సుచేతను, హావ = శృంగారచేష్టలచేతను; కళా = తేజోవిశేషముచేతను, అభిరామ = మనోహరుడైనవాడా, జలజాంబక = కమలములవంటి నేత్రములుకలవాడా, ('అంబకం నయనం నేత్రమ్' అమ.) 'వయోహావములచేతను, కళా = రతికళచేతను అభిరాముడైన - జలజాంబక = మన్మథుడా' (అని వలపుపిలుపు.) ఈవు = నీవు, మహిన్ = భూమియందు, నెఱజాణవు = మంచి తెలివికలవాడవు. ('జాణ = Clever, wise' బ్రౌను) నెఱజాణవు = శృంగార నాయకులలో మేటివి - (అని అర్థాం) ఇటు లెస్సచూచితె = ఈపటమును చక్కగా చూచితివా? (ఈవిటున్ = విటుడైన యీకృష్ణుని, లెస్స చూచితె? ఈతడు - నెఱజాణ + అవున్; అని అర్థాం.) వల్లవీ...యుతుఁడై, (కర్త - కృష్ణుడు) వల్లవీ = గోపకాంతలతోడి, కు-చేష్టా = కొంటెపనులయందు.

---

'రతుల కేటుగ తేటగ'; 'రతుల కింపుగ తేటగ.' అని పాఠాం. మరియు - 'రతులకున్ = క్రీడలకు' అనుటయునతప్పే.- 'రతి' యనగా 'సురతము' గాని క్రీడ కాదు.

† పూ. టీ.— 'విచిత్రగతులం = అద్భుత మార్గములను.''— ఏమియద్భుతమో? ఏమిమార్గములనో?

‖ శా. పా.—'...యుతుఁడైతగ, నెయ్యపు...నావగలెల్ల - నక్కలికియారసి.'—ఇంచుమించుగా అన్ని ప్రతులలోను పాఠమిట్లేయున్నది. 'యుతుఁడైతగన్' అను అన్వయము సరికాదు. 'నక్కలికి' ని 'అగ్గలిక' గా నేను సవరించినాను.

† శా. పా.— 'వైఖరిన్' (పూ, ము. నను, తంజ. ప్రతులు నాలుగింటిలోను 'వైఖరుల్' అనియే యున్నది.

ఈ పద్యపాఠమునుగూర్చియు - పూర్వ టీకనుగూర్చియు ప్రతి పదమును

అవిరత = ఎడతెగని (=మిక్కిలి) అనురాగ = ఆసక్తితో - యుక్తుఁడై = కూడిన వాఁడై, [వల్లవీ = గోపకాంతలయొక్క, (కుచ + ఇష్టా = కుచేష్టా) కుచ = పాలిండ్ల యందు, ఇష్టా = ఇష్టమును, ఎడతెగని యనురాగమును, కలవాఁడై, అని అర్థాం.] తగన్ = ఒప్పునట్లుగా, నెయ్యపుటాలమందలోన్ = ప్రియమయిన ఆవులమందలో, (ఆలమంద = గోకులము = వ్రేపల్లె-లో, అనియును.) అగ్గలికన్ = ఉత్సాహాతిశయముచేత, ఆ వగలెల్లన్ = ఆవు - ఆబోతుల చేష్టలన్నియును, అరసి = చూచి, కైకొనియున్కిన్ = ఆవర్తనములను తానును గ్రహించి వర్తించుటను; (కృష్ణుడు తాను ఆబోతుగను - గోపికలావులుగను, క్రీడించెనని భా.) కేళివినోదవైఖరుల్ = ఇంకనుగల పసితనపుటాటల తమాషాలను; (ఆవగలెల్లన్ = శృంగారవిహారలక్షణములన్నియు, కైకొనియున్కిన్; జలజాంబక కేళి వినోదవైఖరుల్ = రతిసంబంధమయిన చిత్రిచిత్రి వర్తనములును - అని అర్థాం.) లెస్స చూచితె? (అని వెనుక కన్వయము.)

భాగవతమున కృష్ణుని బాల్యచేష్టితములలో ఈక్రింది వర్ణనమున్నది.—

సీ. 'గోవల్లభుఁడ నేను గోవులుమీరని
వడిఱంకె వైచుచు వంగియాడు.' (10. పూ. 305.)

---

విమర్శించుచో గ్రంథము విస్తరించుచున్నభయమున పూ. టీ. యథాక్షరమిందుదాహరించుచున్నాను. పాఠకులే పరిశీలింతురుగాక.

"ఈవు = నీవు - ఇటు = ఈదెసను - (ఈవిటున్ = ఈ విటకానిని - శ్రీకృష్ణులవారిని అనుట) లెస్స, చూచితె = చూచితివా (చూడుముఅనుట.) (దేని ననఁగా), మహిన్ = భూమియందు, నెఱజాణవు = నీవు మిక్కిలి నేర్పరివి. (ఈ విటుఁడు నెఱజాణ + అవును), వల్ల...డై—వల్లవీ = గోపికలయొక్క కుచ = పాలిండ్లకు - ఇష్ట = అనుకూలమైన - అనురాగ = ప్రేమతో - యుతుఁడై = కూడుకొన్నవాఁడై, తగన్ = ఒప్పఁగా; నెయ్యపుటాలమందలోన్ = ప్రియమైనయావులమందలో, ఆవగలుఎల్లన్ = ఆవన్నెలన్నిటిని, అకలికి = ఆచెలువ (రాధ యనుట), అరసి = కనిపట్టి, కైకొని = (ఆకృష్ణుని) చేపట్టి, ఓవ...బక— ఓయి-వయః = యౌవనముచేతను - హావ = నేర్పుచేతను - అభిరామ = మనోహరుఁడయిన-జలజాంబక = తామర పూబాణముకలవాఁడా (మన్మథుఁడా), కేళివినోదవైఖరిన్ = క్రీడాకౌతూహల ప్రకారమందు) (ఓయి వయో హావకళాభిరాముఁడా ఈవిటుని గైకొని యాకలికి కౌతూహల ప్రకారమందు,) ఉనికిన్ = ఉండుటను (లెస్సచూచితె? అని అన్వయము).'

పై సారంగధర పద్యమునకు అనువాదమిట్లున్నది.—

'బాలుఁడా, చూడు గోపాలకృష్ణుండు, బాలత్వమునను వేపల్లెలోపలను,
గొల్లభామలఁ బెండ్లికూఁతులఁజేసి, కొల్లగాఁడాఁ బెండ్లికొడుకాయెఁజూడు;
కన్నెలనెల్లఁదాఁ గదుపులఁజేసి, యెన్నంగ నాలపోతెద్దాయెఁజూడు.'

బా. శం. సారంగ. పు. 25.

క. ఒకఁ డూరువ్రానఁ జెలి * యం
దుకె జంకెనచూచెఁ జూచితో మఱి కటిసీ
మకుఁ ‖ బెనఁగెదు 'గ్రామా నా
స్త్రికుత స్సీమా' యటంట సిద్ధం బయ్యెన్. ౭౭

టీక.— ఒకఁడు = ఒకవిటుఁడు, ఊరువ్రానన్ = (ఊరువు + ఊనన్)

---

'అక్కలికి' పాఠమును, దానికి 'రాధయనుట' అను నర్థమును అసంగతము గానుండుటచేతను, ఆపాఠమున - అర్థాంతర చమత్కృతిలేకపోవుటచేతను- పద్య మున స్ఫురించుచున్న- ఆవు-ఆబోతుల కథ అనువాదమున స్పష్టముగా కనబడుట చేతను- నేను కొలది మార్పుచేసి- నాకుతోచిన యర్థమునుచెప్పినాను. ప్రాజ్ఞులు పరిశీలింతురుగాక.

'హావ' మనగా శృంగారభావజమైన చేష్టగాని 'నేర్పు'కాదు. "హేలాలీలేత్యమీ హావాః క్రియాః శృంగారభావజాః" అను.

"హావము. Amorous gesture: dalliance, Clandishment. (స్త్రీల శృంగారరసభావముల వల్లకలిగే క్రియ." (బ్రౌను.)

* శా. పా.— 'అం,దుకె జంకెన యంగఁజూడఁదా మఱి.' ('అందుకె = అంతమాత్రమునకె, జంకు ఎనయంగన్ = (వానికి) భయముకలుగునట్లుగా. తోన్ = వెంటనే (వాఁడు.).'

శా. పా. లో మొదటి తప్పు యతిభ్రంశము. (చూ. ౨-౨౬౩) రెండవది 'తోన్'- అనుటీక; అమూలకము. 'అం, దుకె...జూచితో' అని పూ. ము. నను, తంజ. ప్రతులలోను సరియైనపాఠమున్నది.

‖ శా. పా.— 'బెనఁగుదు' ('పెనఁగుదున్ = కలహించుచుండఁగా' అని పూ. టీ.)

తోడనుముట్టుకొనగా, (‡ ఊరు + పూనన్ = గ్రామము, పట్టుకొనగా = ఆక్రమింపగా-అని అర్థాం) అంచుకె = ఆమాత్రమునకె, చెలి = ఆస్త్రీ, జంకెనన్ చూచెను = బెదరింపు చూపుతో చూచెను, (= అసమ్మతిని తెలిపెను), చూచితో = చూచితివటోయి?, మఱి = మళ్లీ (వాడు) కటిసీమకున్ = కటిప్రదేశముకొరకు (సీమకున్ = పొలిమేరకొరకు, అని అర్థాం.) పెనఁగెడు = పెనగులాడుచున్నాడు. గ్రామోనాస్తి-సీమాకుతః = ఊరెలేదు-పొలిమేరయెక్కడ? అటంచు = అని లోకమున సామెతగా అనుట, సిద్ధంబయ్యెన్ = అవిటునియెడ నిజమే అయినది.

'గ్రామోనాస్తికుతస్సీమా,' అని సంస్కృతమున లోకోక్తి. కవి 'ఊరువు' లోని 'ఊరు' నుబట్టి 'గ్రామము'ను, 'కటిసీమ'-నుండి 'సీమ'ను సంపాదించి పైలోకోక్తిని సమర్థించినాడు. 'ఊరులేనిపొలిమేర' అని తెనుగునను ఒకలోకోక్తి కలదు. 'తలఁపనెచ్చటనైనఁ బ్రానూరులేక, పొలిమేరగల్గునే భువిఁ బురాణోక్తి.'

(బసవ.) — బ్రౌణ్య.

క. ¶అనుచు విటీవిటసంఘము
కనఁబడ గోపాలుఁ జూపి కడు నేర్పుగ నా
డిన సరసవాక్యములు విని
వినములు చేసికొనఁ దెలియ విను మని పల్కెన్. ౭౮

టీక.—వినివినములుచేసికొనన్ = వినీవిననట్లు ఉపేక్షించి యూరకుండగా, (వినికి + వినమి = వినివినములు. చూ. ప్రౌ. సమాస. 31.)

---

'వాడుకలహించుచుండగా 'గ్రామోనాస్తికుతస్సీమా' అనుట నిజమాయెను' అనుటసరి కాదు. పూ. ము. నను, తంజ. ప్రతులలోనుగూడా 'పెనఁగెడు' అని సరియైనపాఠమున్నది.

పాఠాం.— 'ఒకఁడూరు వంటఁ జెలియం
దుకె జంకెనఁజూచెఁ జూడఁదోయ్యాలి కటిసీ
మకుఁబెనఁగెడు.'

‡ పూ. టీ.— 'ఊరుపూనన్ = గ్రామమువహింపఁగానే.'
గ్రామము నేమి! వహించుటయేమి! చాలాఅసంగతమైన ప్రసంగము.

¶ పాఠాం.— 'అనియచ్చటవిట,'

ఉ. 'అల్లన గాధిరాజసుతుఁ డర్మిలి మేనక ముద్దొనర్ప రా
గిల్లి కుచంబు లాన *దమకించుట గంటివె రాకుమార?' 'యా
నల్ల నగాధిరాజసుతుఁ డర్మిలి మేనక ముద్దొనర్ప రా
గిల్లి కుచంబు లానఁదమకించుట బాల్యముగాదె మానినీ?.' ౭౯

టీక.— చిత్రాంగి వచనము.— అల్లనన్ = మెల్లగా, గాధిరాజ సుతుఁడు = విశ్వామిత్రుడు, అర్మిలిన్ = ప్రేమతో, మేనక = మేనకయను అప్సరస, ¶ ముద్దొనర్పన్ = ముద్దుపెట్టుకొనగా, రాగిల్లి = అనురాగమును పొంది (=వలపుచెంది) కుచంబులు, ఆనన్ = తాకుటకుఁ (=గ్రహించుటకు) తమకించుట = త్వరపడుట, కంటివె! రాకుమార - (సంబుద్ధి); రాకుమారుడైన విశ్వామిత్రుని కథచెప్పి చూపి, రాకుమారా, అని సంబోధించుట - ఆ రాకుమారునివలెనే వర్తించుమనుటకు సూచన.

సారంగధరుని ప్రత్యుత్తరము.—మానినీ (=స్త్రీ మాత్రసంబుద్ధి.) అల్ల-నగాధిరాజసుతుఁడు= (హిమవంతుని కొడుకు -) మైనాకుడు, అర్మిలిన్, మేనక = తన తల్లియైన మేనకాదేవి, ముద్దొనర్పన్ = ముద్దుసేయగా (=ప్రేమించగా) రాగిల్లి = అనురాగమును చెంది, కుచంబులు, ఆనఁదమకించుట, = (పాలకొరకు) గ్రహింప తొందరపడుట, బాల్యము కాదె = పసితనపు చేష్టగదా!

'ముద్దొనర్చు = ముద్దుసేయు' అనుటకు.—

గీ. 'అతని దేవులిద్దఱును గర్భాభిరామ
మూర్తులయి రన్నరేంద్రుండు 'ముద్దుసేసు.' (ఉ. హరి. 4-7.)

మ. 'పలునొక్కుల్నిగుడన్, గళ త్వ్రాలయఁగాఁ, బైపైఁజెమర్పన్, సము
త్కలికల్ పెంపు దగం, బెనంగి, యలసత్వం బొప్ప, సందీక విం
తలుగా నుండుటఁ గంటివా రతివినోదప్రౌఢి రాచూలి?' 'యాఁ
దలిరుంబోఁడిరొ కంటి వా రతివినోదప్రౌఢి జెల్లాఁగదా.' ౮౦

* శా. పా.—'గమకించుట' పూ. ము. నను, కొన్ని వ్రాతప్రతులలోను 'దమకించుట' అను పాఠమున్నది; ఉచితతరము. విశ్వామిత్రపక్షమున 'తమకము'ను చెప్పుట ముఖ్యము.

¶ 'ముద్దొనర్ప' అను క్రియలోఁగల చమత్కారమును పూ. టీ. కర్తలు గుర్తింపలేదు.

చిత్రపటమునందు మదనక్రీడలలోనున్న నాయికా నాయకులను చూపి చిత్రాంగి అనుచున్నది —

టీక.—పలునొక్కుల్ = దంతక్షతములు, నిగుడఁగ = ఏర్పడఁగా, * కళల్ వెలయఁగాఁగ = కళలుదయింపఁగా (=రజఃస్థానములు కరఁగఁగా.), పైపైఁగ - చెమర్పఁగ = మీఁదమీఁద చెమటలుక్రమ్మఁగా, ‖ సముత్కలికల్ పెంపుతగఁగ = శృంగారచేష్టలు విస్తరిల్లఁగా, పెనఁగి = క్రీడించి, అలసత్వంబొప్పఁగాఁగ = మాంద్యమేర్పడఁగా, సందీక = ఎడమియ్యక, వింతలుగానుండుట = చిత్రచిత్రగతులతో నుండుట, (వారి) రతివినోదప్రౌఢి, రాచూలి = రాకొమరుఁడా, కంటివా?

వేరొకపటమున, పోరాడుచున్న జెట్టీలనుచూపి సారంగధరుఁడనుచున్నాఁడు.

1 పలునొక్కుల్ నిగుడఁగ = క్రిందిపెదవులయందు పంటినొక్కు లేర్పడఁగా, (కోపము దీపించినపుడు, పెదవి కొరుకుకొనుట స్వభావము; దానినే ఔడుకరచుటయందురు.— ('ఔడుగరచుట- to bite the underlip from anger'— బ్రౌను. 'పేదవాడికోపము పెదవికిచేటు' అని లోకోక్తి.-) జెట్టీలిద్దరు, క్రోధాతిశయమున ఔడుకరచి రని అర్థము. 2 కళల్ వెలయఁగాఁగ = వ్యాయామ విద్యావిశేషములు

---

* పూ. టీ.—'కళల్ = కాంతులు'

రతి సందర్భమున 'కళ' లనగా రజఃస్థానములుగాని 'కాంతులు' కావు. 'కళ లంటుట'; 'కళలు గరగించుట' శృంగారకావ్యములతో పరిచయముగల పండితులకు క్రొత్తలు కావు. అట్టి పరిచయములేనివారికొరకు బ్రౌనుపండితు డెంతవివరముగా వ్రాసినాడో చూడండి.—"కళలంటి. (ఉ. హరివంశ. 4-159.) Touching her to the quick. కళాస్థానములు- the nerves. కళలు చెమ్మగిలఁగ - తా. శ. 2-82 her heart melted: it touched her to the quick."

‖ పూ. టీ.—'సముత్కలికల్ = వేడుకలు'

'ఉత్కలిక' యనగా ఔత్సుక్యమనెడి సంచారి భావము. బహువచనముచేత శృంగారరసమందు ప్రయుక్తములగు శంకాసూయాది సంచారిభావములు.—చ. 'ఒనరె నఖండవాసనలు నుత్కలికల్ విలసిల్లె' (వసు. 3-48.) వివరములకు వ్యాఖ్యానము నుచూచునది.

1, 2, 3, 4, 5, పదములకు పూ. టీ. లో జెట్టీలపరముగా అర్థములేదు. కాని టీక చిట్టచివరన 'అతి వినోదప్రౌఢిజెట్లు = మిక్కిలి వినోదమందు దిట్టతనము గల మల్లులు' అని యున్నది. మల్లుల ప్రస్తావము మరి లేనేలేదు.

ప్రకటము కాగా, పైపై చెమర్పఁగ, 3 సముత్కలికల్ = విజయోత్కంఠ, పెంపు తరఁగ = విస్తరిల్లగా, పెనఁగి = కుస్త్రీలుపట్టి, 4 ఆలసత్వంబు = ఎన్నదగిన దేహబలము, ఒప్పఁగ, 5 సందీక = పట్టుపట్టుట కెవరును సందియ్యకుండా, వింతలుగా సంకుటు = ఆశ్చర్యకరముగా పోరుచుండుట, కంటిఁగ = చూచితిని. * తలిరుంబోఁడిరో = తల్లీ, వారు అతి వినోదప్రౌఢిఁగ = మిక్కిలి విచిత్రమయిన కుస్తీ నేర్పున, జెట్లు = జెట్టీలు; కాఁగదా? = నామాట నిజమేగదా!

ఉ. 'నిక్కఁగఁ జూడు చిత్రమది నెమ్మది వేడుక నోలలాడు న
మ్మక్కలగుట్టు బట్టబయలై ‡ కనిపింపఁగ ♦ బొన్నకొమ్మ మీఁ
దెక్కి రమించు చున్కి'; 'యవునే! మగువా యది చిత్రమౌట తా
నిక్కము; కృష్ణలీల గద నీ విపు డెన్నినమార్గమంతయున్.' ౮౧

టీక.—(చిత్రాంగి.) నిక్కఁగఁజూడు = నిక్కిచూడు; చిత్రము - అది = అది బలేచిత్రము. నెమ్మది - వేడుకఁగ ‖ ఓలలాడుఁగ = (ఆ పటములోని చిత్రము చూచినయెడల) మనసు ఆనందమున మునిగి తేలును, అమ్మక్క = ఔరా; అలగుట్టు = రహస్యప్రదేశము — బట్టబయలై కనిపింపఁగఁగ, పొన్న = అదిగో, కొమ్మమీఁద + ఎక్కి = ఆయువతిని పైకొని, రమించుచున్కి - (కర్త. యువకుడు. అధ్యాహారము.)—

---

* పూ. టీ.—తలిరుంబోఁడిరో = చిగురువంటి మేనుగల యో చిత్రాంగీ.' చిత్రాంగి మేనివర్ణనము సారంగధరునికి ప్రకృతముకాదు. ఈ టీక ప్రకరణమునకు కేవలమనుచితము. (చూ. ౭౫ వ పద్యముక్రింద.)

‡ పాఠాం.—'కనుపింపఁగ' (పూ. ము.)

♦ శా. పా.—'శౌరిపొన్నపై.'— ఈ పాఠమున అర్థాంతర చమత్కారము లేదు. పూ. ము, నను, తంజ. ప్రతులు నాలుగింటిలోను, 'పొన్నకొమ్మమీఁదెక్కి' అను పాఠమేయున్నది. చిత్రాంగి వాక్యమున 'పొన్న - కొమ్మమీఁదెక్కి' యనియు 'సారంగ' వాక్యమున 'పొన్నకొమ్మమీఁదెక్కి' యనియు సొగసైన విభాగము.

మరా.—పూ. టీ. వ్రాతప్రతిలో 'పొన్నకొమ్మమీఁదెక్కి = పొన్నచెట్టుకొమ్మపై నెక్కకొని' అనియున్నది. కాబట్టి శా. పా. కల్పితము. అనుచితము.

‖ పూ. టీ.—ఓలలాడు = జలక్రీడలుసేయుచున్న.'

ఉభయుల వాక్యములకును ఒకటే యర్థముచెప్పుటచేత పూ. టీ. వారికి పద్యములోని అర్థచమత్కృతి అవగతముకా లేదనుట స్పష్టము.

(సారంగధరుఁడు—) అవునే - మగువా, అవును లేవమ్మా, అది చిత్రమాట, నిక్కము = నిజమే. నీవిపుడెన్నిన మార్గమంతయుఁ = నీవిప్పుడు వర్ణించిన విధమంతయును, వేడుకఁ = వినోదముగా, ఓలలాడు = జలక్రీడలాడుచున్న, అమ్మక్కల = స్త్రీల (=గొల్లపడుచుల) యొక్క, గుట్టు బయలై కనిపింపఁగఁ, (వారి వస్త్రములను తీసికొనిపోయి) పొన్నకొమ్మమీఁదెక్కి, రమించుచుని = ఆటలాడుచుండుట, కృష్ణలీలగద!

క. అని యిటు లతఁ డాకామిని
యనువాక్యము లెల్ల వేఱె యర్థముగా నే
ర్పున విఱిచి మాట లాడిన
మన సేమియు విఱుగ కపుడు మదవతి కణఁకన్. ౮౨

టీక.—వేఱె అర్థము - కాఁ = అగునట్లుగా, విఱిచి = పదములను విభజించి, మాటలాడినను, మనసు, ఏమియుఁ = ఏమాత్రమును, విఱుగక = తన చెడ్డప్రయత్నమునుండి మరలక, మదవతి = యౌవనపు మదమునన్నున్న ఆచిత్రాంగి, కణఁకఁ=మానని పూనికతో. (ఆ మదవతిమనసు, విఱిచినా విఱుగ లేదని సారస్యము.)

క. * పసనికదంబము, మంజుల
వసనకదంబము, నవరత్నఘరమణిభూషా
విసరంబులు, విరినెత్తా
విసరంబులు, దిగిచి వలపు వెలివిసరంగఁ. ౮౩

---

* శా. పా.—'పసిఁడికదంబము.' (='బంగారు సమూహము.' అని పూ. టీ.)

బంగారు సమూహము, వెండిసమూహము, ఇనుపసమూహము, అను వాడుక తెనుగుదేశమునలేదు. 'బంగారు సమూహ' మనగా 'బంగారు సొమ్ముల మొత్త' మని కాబోలు, వారిభావము? అది సరియైన మార్గము కాదు - సొమ్ములను - ఊరక సమూహమనుట భాషా సంప్రదాయము కాదు. అసలు, వారిపాఠమేశప్పు. పూ. ము నను, తంజ. వ్రాతప్రతులలోనుగూడా 'పసనికదంబము' అను పాఠమున్నది. 'పసని' పాఠము తప్పనుకొని శాస్త్రిగారే పసిఁడియని దిద్దినారు. పొరపాటు. 'పసను' శ. ర. లోనున్నది. 'కదంబము' నకు సరియైనయర్థము, శ. ర. లో లేక పోయినను ఇతర నిఘంటువులలోనున్నది.

టీక.—పసని = ఎఱుపుమించిన పసుపువన్నెగల, కదంబము = సువాసన ద్రవ్యములు కలిపిన చందనము, మంజుల - వసన - కదంబముల్ = మనోజ్ఞములైన వస్త్రములయొక్క మొత్తమును, అనర్ఘ...రంబులు:— అనర్ఘ = వెలచెప్పరాని, వరమణిభూషా - విసరంబులు = మేలయిన రత్నాల సొమ్ముల మొత్తములును, విరిసెత్తావి - సరంబులు = మంచి సువాసనలుగల పూలదండలును, తిగిచి = తీసి, వలపు - పగిదుళ్ళు. (మోహమని యర్థం) వెలివిసరంగన్ = గుప్పున గుబాళింపగా, (బయలుపడగా, అని అర్థం.)

క. "ఓయి నెఱజాణ తలకొనఁ
జేయుమ విను లివె, జవాది ¹ చెయిపట్టుము, వా
లాయము మెదఁ జేస్పు కలపము,
కో' యని యీఁగాని మరుఁడు కో యని యార్చెన్.౮ర

(a) సీ. 'యక్షకర్దమసంజ్ఞ యలరుఁగదంబమ్ము, కలపమునాఁగను.'
(ఆం. భా. 2–163.)

(b) "కదంబము. An olio or mixture: కదంబపొడి Pouncet. A fragrant powder compounded of various eseences." (బ్రౌను) కదంబము కావ్యములయందును ఉన్నది.—

ఉ. 'కమ్మకదంబమేల! చెలిఁ గౌగిటఁగూర్చినఁజాలు.' (రాజ - విజ. 4-92)

వ. 'చిక్కనయిన యాచొక్కపు కదంబములు పూయు విద్యాధరీ కదంబంబులయాటపాటలకు మెచ్చి.' (వసు. 2-11); 'చొక్కపు కదంబములుపూయు = చొక్కమైన యాయనులేపనముల నలఁదుకొన్న.' అని వ్యాఖ్య.

కవి కదంబ శబ్దమును రెండుమారులు రెండర్థములలో చతురముగా ప్రయోగించినాడు. పూ. టీ. వా రా రెండర్థములకును అద్వైత మత మిచ్చినారు.

¹ శా. పా.—'చెయిఁబట్టుము.' (='చేతగ్రహింపుము, చెట్టఁబట్టుమని భావము' అని పూ. టీ.)

'ఇదుగో అత్తరు - చెయ్యిపట్టు' 'ఇదిగో మందు — నోరుపట్టు' అనునప్పుడు, చెయ్యి, నోరు, ప్రథమలుగాని ద్వితీయలుకావు. చెయ్యిపట్టు = చెయిచాచు; నోరుపట్టు = నోరు తెఱవుము' అని ప్రకరణమునుబట్టి యర్థములు. 'చెయ్యింబట్టు' 'నోరుంబట్టు' అనగూడదు. 'నన్ను పరిగ్రహింపుము'; 'నన్ను మన్నింపుము' అను

టీక.—ఇవె విరులు = ఇవిగో పుష్పములు, ‡ తలకొనఁజేయుము = ధరింపుము. (నన్ను సుఖానుభవమునకు పూనుకొనునట్లుచేయుము.— 'తలకొను = యత్నించు, to make an effort.' బ్రౌను.) జవాది. (ఇదిగో) చెయిపట్టుము = చేయి చాచుము, (చేతికి పూసెదను - అని భా.) నన్ను చేపట్టుము = పరిగ్రహింపుము. (అని - అర్థాం). కలపము = చందనము, వాలాయము = తప్పకుండా, ఎదఁజేర్చుము = వక్షమున పూసికొనుము, (నన్ను - వాలాయము = నిరంతరము, ఱొమ్మునజేర్చుకొనుము - అని. అర్థాం) కో = ఈగందము మొదలగువానిని తీసికొనుము, (నన్ను కైకొనవోయి, అని ధ్వని) అని, ఈఁగానె = చిత్రాంగి, ఇయ్యగానే, మరుఁడు, కో అని - ఆర్చెన్ = కేకపెట్టెను (తన మంత్రము చక్కఁగా పారుచున్నదని మదనుడు సంతోషమున కేక వేసెనని - భా.)

'కో' సంతోషసూచకధ్వనికి అనుకరణము.—

క, 'కోయని కవిసినఁగని కాం
తేయులు నందఱుఁ గడంగి తేరులువఱపన్.' (భీష్మ - 2—100.)

ఉ. 'కోయనితాఁకి దుగ్రరణకోవిదులై కురురాజసైన్యముల్.' (ఆరణ్య - 5-391)

గీ. 'మంచిమేలైన † దిదిగో కొ' మ్మంచుఁ గప్పు
రంబు సగపాలు నించి వీడెం బొసంగి,
'పూనుమీ మెయి భోగంబు భూషణంబు
లెసఁగ నీ' వని యాత్యాఁగ యొసఁగ రాఁగ. రాగి

నర్థములలోను 'చేపట్టు' - 'చెయిపట్టు' అని చే - చెయి, ప్రథమలేగాని ద్వితీయలు కావు. ఒకటిరెండుదాహరణములు.—

క. 'నన్నుం, జేపట్టుమనుము, కంతుని
తూపులనగు వాడు మనసుతుందుడు కడఁగున్.' (షల్ల. విప్ర 4—79)

ద్వి.—'చేవట్టి కఱకటెఁజేసితివనుచు
వావిదుర్మాధరి యలయుచునుండె.' (నవనాథ - పు, 68.)

‡ పూ. టీ.—'తలకొనఁజేయుము= నిన్ను తలంచుకొనునట్లు చేయుము.' తలకొను = అను క్రియకు 'తలఁచుకొను' అను నర్థములేదు. కావునపూ. టీ. సరికాదు.

† శా. షా.—'ఇదిగొఁగొమ్మంచు' ('ఇదిగొ కొమ్మంచు' పూ. ము.)
'ఇదిగోన్' అనుట సరికాదు. (చూ. ౧-౩౩ వ పద్యముక్రింద) సూ. ని. ఇదిగొఁ గొమ్మంచు' అను పాఠమునే గ్రహించినది.

టీక — సగపాలు = అర్ధభాగము, కప్పురము, నించి = వేసి, మంచి మేలయి నది (విడెము) ఇదిగో, కొమ్ము - అంచున్ = తీసికొనుమని, వీడెంబు - ఒసంగి = తాంబూలమిచ్చి, (ఇదిగో మంచి మేలయిన, (కొమ్ము + అంచున్) కొమ్ము = జవరాలు, అనుచు; చిత్రాంగి తనసేచూపి పలుకుట - అర్థం.) — భూషణంబులు = సొమ్ములు, ఎసఁగన్ = అలరారగా, భోగంబున్ = భోగమును, మెయిన్ = శరీరమున, పూనుమీ = ధరింపుము. (భూషణంబులెసఁగన్ = అలంకారములొప్పి యుండగా, ఈ మెయిన్ = ఈనాశరీరమునందు, భోగంబున్ = రతిసుఖమును, పూనుము = పొందుము; అని అర్థాం.) — అని, అతాఁగ = ఆగయ్యాళి, ఒసఁగరాఁగన్ = (వీడెము మొదలయినవి) ఇయ్యరాగా; (అవ - అన్వ.)

## —: సారంగధరుని నిగ్రహము :—

మ. అవి చేనంటి చెనంటిఁజూచి యతఁడిట్లన్ 'దల్లిదండ్రిల్ మనం
 బు విరాజిల్లఁగఁ గూడఁ బెట్టినధనంబుల్ లోకమందున్ ‡ గొమా
 ళ్లవిగా కెవ్వరి వమ్మ! కావలయు వేళన్ వచ్చి కొంపోదు ♦ నే
 నివి నీపెట్టియ నాదుదాఁపురముగా నిందుండ నిమ్మన్నియున్' ౮౬

‡ "కొమాళ్లవి' గ్రామ్యము" అని శాస్త్రిగారి ఆక్షేపము. అందుకు గిడుగువారి సమాధానము. — "ఏ. వ. కొమారుఁడు బ. వ. కొమారులు. కొమార్లు = కొమాళ్లు, అని వాడుకఉన్నా కళాపరిపూర్ణ శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు గ్రామ్య మన్నారు. అయితే శబ్దరత్నాకరమందు అది సాధువుగానే ఉదాహృతమయిఉన్నది. కవులు అది వాడినారు. డకార లకారములు కలిసి ళకారమయినట్లే, కొన్ని శబ్దములలో రకార లకారములున్ను ళకారములయినవి. ఉదా. — నీరులు = నీళ్లు; విస్తరులు = విస్తళ్లు; పందిళ్లు, గోళ్లు; వేళ్లు; మొదలగునవి." (బాల. శర. పు. 161)

♦ శా. పా. — 'నేఁడివి.'

శాస్త్రిలవారు 'కొంపోదు.' అని 'ఫుల్‌స్టాపు' పెట్టి, నేఁడివి - నీపెట్టియ నుండనిమ్ము' అని యన్వయించినారు. పెట్టియనుండ నిచ్చుట నేఁడుమాత్రమే కాదు; సారంగధరుడువచ్చి కొంపోవువరకున్ను; కాబట్టి ఆ యన్వయము సరికాదు. అసలు, వారిపాఠమే సరియైనది కాదు. — పూ. ము. నను, తంజ ప్రతులలోను డా 'కొంపోదు నే, నివి' అని సరియైనపాఠమున్నది. మూలగ్రంథమిట్లున్నది. —

టీక.—అవి = ఆభూషణాదులు, చేత్ + అంటి = చేతితోఁ దాఁకి, చెనంటిన్ = దుర్మార్గురాలయిన - ఆ చిత్రాంగిని- చూచి - ఇట్లన్ (ఇట్లు + అన్)= ఇట్లనెను కావలయువేళన్ - వచ్చి, నేన్ - కొంపోదున్ = నేను తీసికొనిపోదును. ఇవి = ఈ వస్తువులన్నియు, నీ పెట్టియన్ = నీపెట్టెలో, నాదు దాఁపురముగాన్ =, నేనే దాచి పెట్టుకొన్నట్లుగా, ఉండనిమ్ము.

'అనన్' అను క్రియకు 'అన్' సంగ్రహరూపము.—

ఆ. వె. 'వైశ్యసతికి నొక్కవరము, సత్ క్షత్రియ
సతికి రెండు, శూద్రసతికి మూఁడు'
విప్రసతికి నాలు వేఁడఁజన్వరములు.' (భా. సభా. 2-263.)

'అనన్' అనుటకును 'అన్' అను సంగ్రహరూపము కనబడుచున్నది. "ఇన్న గంబు హిమవన్నగమన్ దనరాయ భూవరా." (వసు. 2-12)

క. అని, ప్రియము గడలుకొనఁ బ
ల్కఁగ నెంతయు హావభావలీలాగతులన్
¶ ధ్వనిచతురోక్తులచే నా
యన మది మేకొలుప లేక వ్యాకులమతియై. ౮౭

టీక.—అని, ప్రియము = ప్రీతి, కడలుకొనన్ = అతిశయింపగా, పల్కన్ = పలుకగా, (చిత్రాంగి - తన) హావ... గతులన్,— హావ = భోగేచ్ఛను ఇంచుకగా వెలిబుచ్చునట్టి భ్రూనేత్రాది వికారములయొక్కయు. భావ = మదనోదయమును తెలుపు మనోవికారముయొక్కయు - (వికారో మానసో భావః- అమ) లీలాగతులన్ = విలాసరీతులచేతను, ధ్వని- చతుర + ఉక్తులచేన్ = వ్యంగ్యార్థముచేత చమత్కారములయిన మాటలచేతను,—

---

"తల్లిదండ్రులు కూర్చి దాచిన ధనము, తెల్లఁ బుత్త్రులదిగా కెవ్వరిసొమ్ము,
వలసినయప్పుడే వచ్చి † కొంపోదు - నలినలోచననీని వాదాఁపరముగ,
నలమి పెట్టెలఁ బెట్టుమని ప్రియంబెసఁగ." (పుట. 46.)

¶ శా. పా.— 'తన'; ('ధ్వని' పూ. ము.; తం॥ వ్రాఁతప్రతులు) తన:(వట్టి) చతురోక్తులకంటెను 'ధ్వని చతురోక్తులు' శ్రేష్ఠతరములుగదా.

† 'కొనిపోదు' అని ముద్రిత ప్రతిపాఠము. అందు గణభంగము.

ఆయసమదిక్కో, మేకొలుపలేక = ఒప్పింపలేక, వ్యాకులమతియై = కలతనొందిన మనసు కలదియై.

'హావము'ను గూర్చి సాహిత్యదర్పణము.—

'భ్రూనేత్రాది వికారైస్తు సంభోగేచ్ఛా ప్రకాశకః
భావ ఏవాల్పసంలక్ష్య వికారో హావ ఉచ్యతే'.

ఉ. ఆతరళాక్షి డెందమున నారటు మొందుచు 'నేమి సేయుదుర్
రాతికిఁ దోడు వోయినది రాసుతుఁ డెందము మెత్తగాదు, దా
దాతికి వచ్చి యుండ నికఁ ♦ దాలిమి చెల్లునె? మారుఁడంటిమా
ఘాతకుఁ, డోర్వరాదు; సముఖంబున నేటికి రాయబారముల్?' ౮౮

టీక—ఆ-తరళాక్షి = చంచలనేత్రియైన ఆ చిత్రాంగి;— రాసుతుడెందము = రాజకుమారుని మనసు, రాతికిన్-తోడువోయినది = రాతితో సమానమైనది. (రాసుతుడు గనుకనే వాని మనసు రాతితో సమానమైనదని సారస్యము.) మెత్తగాదు = మెత్తబడుమార్గము కనబడుటలేదు. ఏమిచేయుదును? ‡ దాతికిన్ = దాకలిమీదికి - వచ్చియుండఁగా, ఇఁక, తాలిమి = తాళుట (=ఉపేక్షగా ఊరకుండుట.) చెల్లునె = చెల్లదు. మారుఁడంటి మా = మన్మథుడో, * ఘాతకుఁడు = హింసించువాడు. ఓర్వరాదు = వానివలనిబాధ సహింపరాదు. (కావున) సముఖం

---

♦ శా. పా.—'తాళిమి' ('తాలిమి' పూ. ము.; తంజ. వ్రా. ప్ర.)

'తాళిమి, అను రూపము సాధువుకాదు. (చూ. ౫౮-వ పద్యముక్రింద

‡ పూ. టీ—'దాతికిన్ = సమీపమునకు.'

ఈ టీక నిరాకరము. 'దాయి' యనగా, కమ్మరవానిదాకలి (శ. ర.)

చ. 'టిక్కరటి శిరంబుదాయి, లయకాలుఁడు కమ్మరి, వైరివీర సం
హారణ గుణాభిరాముఁడగు మైలమభీముని ఖడ్గసృష్టికిన్.'

— భీమకవిచాటువు.

సారంగధరుని మనస్సు అను లోహము తన సముఖ మను దాతిమీదికి వచ్చియున్నది. కావున ఆలసింపక (ఆలసించిన కాక చల్లారిపోవును గావున) గట్టిగా పట్టి మెత్తగా నలుగగొట్టవలె ననుకొన్నది, చిత్రాంగి.

* ఘాతకుఁడు = ఘాతుకుఁడు.—'స్నాతకుల ఘాతకులఁగాఁగ సంస్మరించు'. (శృం. నై. 7-127,)—'ఘాతక - a killer, murderer' (ఆప్టే).

బునన్ = ఎదుటబడిన తర్వాత, రాయబారములే = మధ్యవర్తి మాటలు, ఏటికిన్ = ఎందుకు?

మ. అని యూహించుచు, లజ్జఁ బో విడిచి, యేకాంతంబుగా నల్దెస
ల్గనుచున్, బైఁట దొలంగ, నీవి వదలన్, గామాంధకారంబు నె
మ్మనముల్ గప్పినఁ గన్ను గాన, కపు డా మత్తేభగంభీరగా
మిని యత్యంతనిరంకుశోద్ధతిని బల్మిన్ బట్టఁగాఁ జూచినన్. ౮౯

టీక.— ఆ మత్తేభ గంభీరగామిని = మదగజమువలె దీమసపునడకగల ఆ చిత్రాంగి, లజ్జన్‌పోవిడిచి = సిగ్గువదలి; నీవివదలన్ = పోకముడివీడగా, కామాంధకారంబు = కామమనెడి కటికిచీకటి, నెమ్మనముల్ కప్పినన్ = మనస్సు నాక్రమింపగా,— అత్యంత నిరంకుశోద్ధతిన్ = జంకుగొంకులేని మొక్కలపు సాహసముతో, పట్టఁగాన్, చూచినన్, (నిరంకుశ- మత్తేభ, శబ్ద ప్రయోగము వలన అప్పుడాచిత్రాంగి అంకుశశిక్షలేని మదగజమువలె విడివడినదని సారస్యము.)

క. గడగడ పాపభయంబున
వడఁకుచు, 'నిది యేటిగోడవ వచ్చె' నటంచున్,
వడి లేచి యతఁడు 'తల్లీ
తడ వాయెను †వచ్చి; పోయెదను నే' ననుడున్. ౯౦

టీక.— గోడవ = కష్టము. (= లేనిపోని పీడ.)

క. 'ని న్నెదు రెదురే చూడఁగ
నిన్నాళ్ళకు సెలవు గాఁగ నిట వచ్చితి; విం
క న్నీవు 'తిరిగి పోయెద'
నన్నన్ నేఁబోవ నిత్తునా నవమదనా? ౯౧

టీక.— ఇన్నాళ్లకు సెలవుగాఁగన్ = ఇంతకాలానికి.

మ. 'అతిమోహంబున మించుతల్లి నిట నీ కాసించియున్నా; ననా
రత సౌఖ్యోన్నతి చెందఁ గోరి. సుకుమారా, రాసుతా, యాత్మజా

---

† పాఠాం.— 'పోయివచ్చెదను నేననుచున్' (పూ. ము.)

కృతి నన్వేమకఁ దేల్పుమీ; తలఁపఁగా నేణీకిశోరాక్షి స
మ్మతి సారంగధరుండ వయ్యు నలయింపన్ జెల్లునే నావుడున్. ౯౨

టీక.—సుకుమారా = కోమలుడా, రాసుతా = రాజకుమారా, మించు తల్లిని = మెరుపు తీగెకు తల్లివంటిదానను (మెరుపు తీగెకంటెను మెరుగైనదానను.) *నను + ఆరత సౌఖ్యోన్నతి చెందన్ కోరి = నన్ను ఆ-రతి సుఖాతిశయము చెందుగాకయని (రతి సౌఖ్యము నర్థించి- అని భా.) అతి మోహంబునన్ = మిక్కిలి వలపుతో; నీ కాసించియున్నా = నీ మీద ఆశపెట్టుకొని యున్నాను. ¶ ఆత్మజాకృతి = మన్మథునివంటి సుందరాకారము కలవాడా నన్, వేమకన్ తేల్పుమీ = నన్ను ఆనందమునముంచి తేల్చుము. ♦ సమ్మతి = మంచిమనసు కలవాడా, సారంగధరుండవయ్యున్ = చంద్రునివంటి అందగాడవైకూడా (చంద్రుడు లేడిని ధరించువాడు.) ఏణీకిశోరాక్షిన్ ననున్ = సోగసైనకన్నులు గల అందగత్తెను- నన్ను. (కొదమ లేడి కన్నులవంటి కన్నులుగల నన్ను.) అలయింపన్ = బాధింపగా, చెల్లునే (నీవు సారంగధరుడవయ్యును- సారంగనయననైన నన్ను బాధింపవచ్చునా? సారంగసంబంధ బాంధవముననైనను మన్నింపరాదా?) నావుడున్ = అనగా.

'ఉన్నాను' యొక్క సంగ్రహరూపము 'ఉన్నా'. వ్యవహార సిద్ధము. అనుకృతియందున్నది కావున ఆక్షేపార్హముకాదు. (శాస్త్రిగారు 'ఉన్నాను' అనురూపమునే ఆక్షేపించినారు. అందుకు గిడుగువారు తగినసమాధానము చెప్పినారు.— చూ. బాల. శర. పు. 226.) 'నను + ఆరతసౌఖ్యము = ననారత సౌఖ్యము' అనుసంధి, 'జడ్డక్కరంబుతోఁ బదాది స్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు' అను బా. ప్రకీ. 9.) సూత్రము ప్రకారము అసాధువయినను,

"శిల మీఁదఁ ద్రెంచివేసిమునున్నయట్టె" (నవ. పు. 80)

అన్న ప్రాచీన ప్రయోగబలమునను, శ్లేషకలిమిచేతను సాధువేయగుచున్నది. అట్టి సంధి కొడబడనియెడల, చిత్రాంగివాక్యమునను - సారంగధరవాక్యమునను కూడా 'అనారత సౌఖ్యమే' యేర్పడి చమత్కార మంతరించును. నిజానికి చిత్రాంగి యభిలషించినది 'రతసౌఖ్యము' గాని, నట్టి 'అనారతసౌఖ్యము' కాదు.

---

*వ్యా. టీ.—'అనారత = స్థిరమైన.' ¶ 'ఆత్మజాకృతిన్ = మదన రూపముచేత ♦ సమ్మతి = ఇష్టమైన లేడిని ధరించు చంద్రుఁడవు.'— ఈ యర్థములు సరియైనవిగావు.

చేమకూరసుకవి చమత్కార ప్రధానుడుగాని కేవల వ్యాకరణ సూత్రములకు దాసుడుకాడు.

మ. 'అతిమోహంబున మించుతల్లి నిట నీ కాసించి యున్నా, ననా
రతసౌఖ్యోన్నతిఁ జెందఁ గోరి సుకుమారా, రా, సుతా, యాత్మజా
కృతి నట్టే వేడుకఁ దేల్పు' మంటివి; ధరిత్రిన్ 'సత్యవాణీ సర
స్వతి' యన్వాక్యమ దేల తప్పు? నిజమే వాక్రుచ్చినా విర్యోదన్'

సారంగధరుడు చిత్రాంగి వాక్యములకే అర్థాంతర కల్పనము చేయుచున్నాడు.-

టీక,—అతిమోహంబునమించు = అత్యంతమయిన ప్రేమచేత అతిశయించు (=నిన్ను మిక్కిలిగా ప్రేమించునట్టి) తల్లిని, అనారత = ఎడతెగని, సౌఖ్యోన్నతిని చెందఁగోరి - నీ కాసించియున్నాను. సు - కుమారా = సత్పుత్రుడా, రా = రమ్ము, సుతా = కుతుడా, ఆత్మజాకృతిన్ = కుమారరూపమున, వేడుకన్ తేల్పు మంటివి; ధరిత్రిన్ = లోకములో † సత్యవాణీ సరస్వతి = వాక్కు - (ఎప్పుడును) నిజము చెపలుకును, ('సరస్వతి = వాక్కు. సత్యవాణీ = A true statement.' బ్రౌను.) అన్ వాక్యము, అదేలతప్పున్ = ఎందుకు అబద్ధమగును. నిజమే వాక్రుచ్చినావు. (నేను నిజముగా నీకు కుమారుడనే. నీవు నిజముగా, అత్యంతమయిన పుత్రమోహమున మించు తల్లివే - అన్నమాట.)

మ. అని పోఁ ‡ కుచ్చెల పీడ, లేనడుము జవ్వాదన్, జగన్మోహన

---

† పూ. టీ.—'సత్యవాణీ సరస్వతీ అన్ = యదార్థవాక్కుగలది సరస్వతియే యనెడు.'

ఈ టీకవలన నేర్పడు భావమేమో నాకు గోచరించలేదు.

‡ శా. పా.—'కుచ్చెలు' ('కుచ్చెల' అని పూ. ము. పా.)

'కుచ్చెల' అను పాఠము తప్పనుకొని 'కుచ్చెలు' అని సవరించినారు. పొరపాటు. 'కుచ్చెల' యనగా కటివస్త్రము. కుచ్చిలి; కుచ్చియ;' అని పాఠాంతరము. (వివరములకు చూ. 3–౧౪3 క్రింద.)

శాస్త్రిగారికి 'కుచ్చెల' తెలియదు. అందువల్లనే విజ. (1–141) లో కూడా 'సాగసుకుచ్చెల నీటువగలు కన్నులపండు - గలుగ మాయపుఁ గొనుఁగలుగఁ జేయ' అన్నచోటగూడా 'కుచ్చెల = కుచ్చిళ్లయొక్క' అనియే టీక వ్రాసినారు.

♦ స్తనకుంభంబులమీఁద హారములు నృత్యంబాడ, లోఁదాల్మి †యూ
డనిఁబాడఁ, బులకాంకురంబు లొనఁగూడం గట్టివాయింతి వే
చని యవ్వాకిటి కడ్డమై నిలిచి కాంక్షఁ బట్టఁగాఁబోయినన్. ౯౮

టీక.—అని - పోన్ = సారంగధరుడు - పోవఁగా, కుచ్చెలపీడన్ = కటివస్త్రముజాఱఁగా, లేసడుము - జవ్వాడన్ = సంచలింపగా, జగన్మోహన స్తన కుంభంబులమీఁదన్ - హారములు, నృత్యంబాడన్ = నటింపగా, లోన్ = మనస్సున, తాల్మి = ఓర్పు. ఊడనిఁబాడన్ = తొలగిపోగా, పులకాంకురంబులు - ఒనఁగూడన్ = శరీరమున పులకలు మొలకలెత్తగా, కట్టివాయింతి=నోటి గండ్రతనము గల ఆ చిత్రాంగి, వేచని = త్వరగాపోయి, వాకిటకి అడ్డమైనిలిచి, కాంక్షన్= కోరికతో, పట్టఁగాఁబోయినన్ = పట్టుకొనబోగా.

ఉ. 'అంటకుమీ లతాంగి నను'; 'నంటిన నేమి మనోహరాంగ? నే
నంటు పడంగ లేదనుచు * నంటెదనిన్ను'; 'నటంటగాదు; న
న్నంటఁగఁ జెల్లునే జనకు నంటినపిమ్మట?' ‖ 'నైననేఁడు నీ
యంటున నంటుగామి నెటు లంటును గెంటక మేనఁ బ్రాణముల్?' ౯౯

టీక.—(ఈపద్యమున చిత్రాంగి సారంగధరుల సంభాషణము ప్రశ్నోత్తర రూపమున జరుగుచున్నది.—)

సారం.— లతాంగీ నను అంటకుమీ.

♦ శా. పా.- -'స్తనగుచ్ఛంబులమీఁద.'

'స్తనకుంభంబులమీఁద' అని పూ. ము. పా. హారములు నృత్యమాడుటకు కుంభములే యనుకూలతరములుగదా?

† శా. పా.—'ఊడని బాడన్.'

'ఊడని బాడన్' అను నిరనుస్వారరూపము తప్పు. 'ఊడనిఁబాడన్' అనుట యొప్పు. దండకము.—"జిగ్బిత్తికల్ పట్టువీడెన్... వెలుంగూడనింబాడె."

దశా. 4—232.

* శా. పా.— 'అంటెదఁగాని, యటంటగాదు.' ('అంటెదనిన్ను, నటంటగాదు' పూ. ము., తంజ. తా. పా.)

‖ శా. పా.— 'నంటిమైన' (ఇది పూ. ము. పా.) 'నైననేఁడు' తంజ. పా.

చిత్రాం.— మనోహరాంగా, అంటిననేమి? నేను, ‡ అంటుపడంగలేదనుచుక్ = (పరపురుషస్పర్శచేత) మైలపడలేదని, నిన్ను- అంటెదక్ = నిన్ను ముట్టిప్రమాణము చేసెదను.

సారం.— అటు-అంటకాదు = నేనట్లనుటలేదు. (మరేమనగా?) జనకునంటిన పిమ్మట, నన్నంటఁజెల్లునే? (అనుచున్నాను.)

చిత్రాం.— ఐనక్ = అట్లయినయెడల, నీ అంటునక్ = నీతోడిస్నేహమున, అంటుకామిక్ = సంబంధపడకపోతే (అనగా నీచెలిమిలభింపనియెడల) ప్రాణముల్, గెంటక = చలింపక (=లేచిపోక) మేనక్ = నాశరీర మున, ఎటులంటును = ఎట్లునిలుచును! (నిలువవు కావున నేనునిన్నంటు కొనకమాననని భావము.)

---

‡ పూ. టీ. 'నేనంటుపడలేదని యంటుచున్నాను - అనఁగా, పుష్పిణిని కాలేదనుట.'

అంటుపడుటయనగా మైలపడుటగాని పుష్పిణియగుట కాదు. 'అంటుపడుట' లోకములో పురుషులకునుకలదు.—

1. 'అంటుపడు = అశుచియగు' (శ. ర.)

2. 'అంటుపడ్డాడు - he was polluted, he became unclean. అంటు బడ్డవాడు One who is not to be touched.' (బ్రౌను.)

3. వ॥ 'వాఁడువినక యా యువతింబట్టుకొనియె; నంతనదిచూచి నన్నంటిన కతన నంటుపడితివి; సచేలస్నానంబొనర్చి యింటికరుగుము.' (వేంక-మాహా. 4-80.)

4. ఉ॥ 'అంటితివేమొ పుష్పవతియౌ లతకూన నదైననంటు, నన్నంటకు ముస్గుదాఁకనని యవ్వలికేఁగిన.' (ఉ. రా. 6. 57.)

5. 'అంటు = మైల' (మా. సూ. ని.)

'ఆ స్త్రీ పుష్పిణియైనది' అనునర్థమున 'అంటైనది'; 'ముట్టైనది' అనవలెగాని 'అంటుపడినది'; ముట్టుపడినది' <u>అనగూడదు</u>. 'అంటుది - a menstruous-woman.' (బ్రౌను.)

మ. 'అభిజాతత్వముగల్గుచాన, సతి, అంటైయుండఁగా దుర్మదా
రభటిఁ గొల్వున కీడ్చితెచ్చి.' (పాండవోద్యోగము.)

క. 'మే లాఱడి వెట్టంగా
మేలా? నిలు † పో వలదు సుమీ, చలమేలా?
‡ మేలావర సద్రూపక
మేలా? *వరియింపు' మనుచు మీఁదఁ బడినన్. ౯౬

టీక.— మేలు = దైవానుగ్రహమున సంప్రాప్తమయిన యీశుభమును, ఆఱడి వెట్టంగాన్- మేలా = రట్టుచేసి వ్యర్థముకావించుట మంచిదా? నిలు-పోవలదు సుమీ; చలమేలా = నీ కీ మొండి పట్టుదల మెందుకు?, మే-లావు - అర (=అఱ)న్ = శరీరముయొక్క బలము తగ్గినవెనుక, సద్రూపకము-ఏలా = చక్క

† శా. పా.— 'నిలుపోపలేఁజుమీ.' — 'నిలుపోవలదు సుమీ' అని పూ. ము. పా. ఉచితతరము.'

‡ శా. పా.— 'మేలావరసుత, తామసమేలా?' (మేలా (మా + ఇలా) వరసుత = మన్మథా.' పూ. టీ.)

'మా = లక్ష్మికిని, ఇలా = భూమికిని, వర = భర్తయైన నారాయణుని, సుత = కుమారుడా = మన్మథుడా' అని పూ. టీ. కర్తలు చేసిన యూహ. చాలా డొంకతిరుగుడు; పైపెచ్చు - అనుచితము కూడాను. నిజానికి సారంగధరుడు రాజనరేంద్రుని కొడుకుగాని, 'మేలావర-సుతుడు' కాడు. "మేలావర సద్రూపక మేలా?' అని తంజ. సా. ఇందు. 'లావు + అఱన్' అన్నచోట శబ్దాలంకార సౌందర్య నిర్వహణార్థము అలఘురేఫమునకు బదులు లఘురేఫము వాడబడినది. ఆరహస్యమును గుర్తింపలేక పూ. టీ. వారు డొంక తిరుగుడు టీకలు వ్రాసినారు.

* శా. పా — 'రమియింపుమనుచు.' (తక్కిన ప్రతులలోను పాఠమిట్లే యున్నది.)

రమియింపుమనుట కేవలమసభ్యము. కావున శా. పా. సరియైనది కాదు. అసలుపాఠము 'వరియింపుమనుచు' అనియుండునని నా యూహ. ఈపాఠమున అసభ్యత తొలగుటయేగాక కవికత్యంతమిష్టమగు- 'మేలావ; మేలావ' అను శబ్దాలంకారముగూడా సిద్ధించుచున్నది. 'వరించు' అనుక్రియకు - పొందు = పరిగ్రహించు అను నర్థమున్నది. "వరించుట - covet = పొందుట." (బ్రౌను )

గీ. ' ...అది తప స్థిరతఁబూని, పతివరింపంగనొల్లక బ్రహ్మచర్య
మునవెలింగి యయ్యాశ్రమమున వసించి.' (భా. శల్య. 2-208.)

దనముతో నేమి ప్రయోజనము? (జవసత్వము లుడిగినపిమ్మట నెంతటి సుందర దేహముఖము నిష్ప్రయోజనములగును; కాబట్టి యిప్పుడే.) వరియింపుము = పొందుము అనుచున్, మీఁదన్ పడినన్ - (నాల్గవచరణమున యతి విచార్యము.)

గీ. 'హా మహాదేవ' యని చెవులంటి కేల
వడిఁ గడకుఁ బోవ; నప్పు డవ్వనిత * పనిత
మణిగణోజ్జ్వల కంకణక్వణన మొలయఁ
బట్టుదప్పటి చేఁ జుట్టి పట్టుకొనియె. ౯౭

టీక.—కేలన్- చెవులంటి = చేతులతో చెవులు మూసికొని, పనిత... నము.—పనిత = కొనియాడబడిన ('పణిత పనితాని...స్తుతార్థాని.' అమ.) మణిగణోజ్జ్వల = మణుల మొత్తములచేత ప్రకాశించుచున్న' కంకణ = హస్త భూషణములయొక్క, క్వణనము = శబ్దము, ఒలయన్ = ఒప్పగా. (ప్రశస్తము లయిన మణులు చెక్కిన కంకణములు మోయగా - ననుట.)

క. పట్టి చలపట్టి యా రా
పట్టెని గూర్చుండఁ బెట్టి పకపక నగి 'యా
కట్టిఁడి యగు మదనకు ననుఁ
గ ట్టిడి యొప్పించి యెందుఁ గదలెద వింకన్.

టీక.—పట్టి = (ఆసారంగధరునిచేయి) పట్టుకొని, చలపట్టి = మోడిచేసి,- పకపకనగి = 'ఇక నెక్కడికి పోగలవోయి' అని అర్థమగునట్లుగానవ్వి. కట్టిఁడి అగు మదనకున్ = దుర్మార్గుడైన మన్మథునకు, ననున్, కట్టి + ఇడి - కట్టిడి. (క్త్వార్థేకారసంధి. ప్రాచీనులు సమ్మతించినదే చూ. బాల. శర. పుట. 287-297.) 'కందర్పునకునన్నుఁ గట్టొప్పగించి' (నవనాధ. పు. 46)

*శా. పా — 'రణిత' ('రణిత = ధ్వనిచేయుచున్న - రత్నసమూహములచేత ప్రకాశించుచున్న కడియములయొక్క శబ్దము.' అని పూ. టీ.)

'ధ్వనిచేయుచున్న కడియముల ధ్వని'యనుట యనుచితము. అదియట్లుండగా ముంజేతి కంకణములను- 'కడియము' లనుట సరికాదు. ('జనిత' పూ. ము. పా.; 'పనిత.' తంజ. పా.)

సీ. చూపుకన్నెతీకంబు ‡ వాపె మే నది మెచ్చ
 గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొనఁగ వలదె?
చెవులలో నమృతంబుఁ * జిలికె నో రది మెచ్చ
 తీయవాతెర విందు చేయవలదె?
భుగభుగ వాసనల్ ♦ నిగుడించెఁ గెమ్మోవి
 యది మెచ్చి నొక్కి ముద్దాడ వలదె?
యుల్లంబుఁ ❨ గగఁచె నీ యొయ్యార మది మెచ్చఁ
 బొసఁగ దానికి నీవి యొసఁగ వలదె?
గీ. రమ్ము సారంగధర వేగిరమ్ము మాని
 † గలరవమ్ముల నణకించు గలరవమ్ము
 నాదు మొలనూలి గంటల నాదు వినక,
 చంట నీయుర మానక, చంట, దగునె?.

టీక — మేను = నీ శరీరము, చూపు కన్నెతీకంబు - పావెజ = వాకన్ను

‡ శా. పా.—'వాప... మెచ్చి' ('వాపె... మెచ్చి.' అని పూ. ము. పా.) నేను పూ. ము. పా. తీసికొని 'మెచ్చ' అని సవరించినాను (ఇట్లే తక్కిన చరణములలోను.)

* శా. పా.—'జిలుక... మెచ్చి.' ('జిలికె,... పూ. ము. పా.)

♦ శా. పా.—'నిగుడంగఁ గెమ్మోవి - యది మెచ్చి మోము.'

'నిగుడు' అకర్మక క్రియ, కావున 'కెమ్మోవి వాసనల్ నిగిడినది' అనుట తప్పు. అది యట్లుండగా కెమ్మోవి వాసనలను నిగిడించినందుకు దానిని ముద్దాడక - 'అది మెచ్చి - మోము ముద్దాడవలదె' అనుట బొత్తిగా తగదు.

'నిగుడించె నెమ్మొగం బది నేను మెచ్చి.' అని పూ. ము. పా.

'నిగుడించి కెమ్మోవి యదిమెచ్చి నొక్కి' అని తంజ. పా.

❨ శా. పా.—'కలఁపఁగా... మెచ్చి.' ('గరచెనీ... మెచ్చి.' అని పూ. ము. పా.)

కలఁచుట' యనగా వ్యాకులపరచుట = క్షోభపెట్టుట. - మరి మనసును కలఁచి (=క్షోభపెట్టి) న వారి కెవరుగాని 'ఈవి' యిత్తురా? 'నీవి' నిత్తురా?'

† శా. పా.— 'కలరవమ్ముల... గళరవమ్ము'

లకుగల సౌగంధ్యమును పోగొట్టినది, అది మెచ్చన్ = ఆ మేను మెచ్చుకొనునట్లు, గుచ్చి...వలదె = బిగియార కౌగిలించుకోవద్దా (ఓయీ, నీవు నన్ను నిరాదరించి నను నీమేను మన్నించి నా కనులకానందమును కూర్చినది. అట్టి మేను మెచ్చునట్లు కౌగిలించి నాకృతజ్ఞతను నేను తెలుపుకోవలదా! కాబట్టికౌగిలించుకోనిమ్ము - అని భా. ఇట్లే తక్కినపాదములలోను.); నోరు చెవులలో, అమృతంబుల్ చిలికెన్ = అమృతమధురములయిన పలుకులనునించెను, అది మెచ్చన్ = ఆనోరు మెచ్చుకొనునట్లు, తీయవాతెర = కమ్మనినాయధరమును, విందుచేయవలదె? (నామోవినందుకొనుము. అని భా.) కెమ్మోవి = నీయెఱ్ఱనియధరము, భుగభుగవాసనల్, నిగుడించెన్ = గుబాళించెను, అది మెచ్చన్ = ఆయధరము మెచ్చునట్లు, నొక్కి - ముద్దాడవలదె? (నీ యధరమును పంట నొక్కనిమ్ము. అని - భా.) ఒయ్యారము = నీహొయలు, ఉల్లంబుల్ కరఁచెన్ = నామనసున కానందమును కలిగించినది. (కరఁచు = కరగించు) అది మెచ్చన్, దానికి = ఆయొయ్యారమునకు, ఈవి = బహుమానము - లేక నీవి = ధనము, ఒసఁగవలదె? (నాకోకముడిని సడలింపుమని - భా.) కావున, సారంగధర, (సంబోధనము) వేగిరమ్ముమాని = తొందరపాటుమానుకొని (అనగా తొందరపడివెళ్లిపోక) రమ్ము - కలరవమ్ములన్ = పావురములను (=పావురముల కూతలను) అణకించు = పరిహసించు, గలరవమ్ము = నాకంఠధ్వనిని (=మణితమును) నాదు, మొలనూలిగంటల - నాదు = శబ్దమును, వినక,- * చంటన్ = నాకుచములయందు, నీయురము, అనక = మోపక, (=నన్ను కౌగలింపకయే) చంట = చనుట, తగునే = తగదు.

---

'గలరవమ్ము - గలరవమ్ము' అని శబ్దాలంకారము కావున 'కల - గళ' అను పాఠము సరికాదు. 'మాని' అనుక్త్వార్థకముమీది 'కల' గల - యగుటలో విప్రతిపత్తిలేదు. ఒక్క ప్రయోగము.—

సీ. 'కపురాలవన్నె చొక్కపురాలనగు మేని - కపురాలఁబోతు బింకంబునణఁచి,
దనరుచులు లోకములనిండఁ దనరుచుండు,' (నరస.)

'గళ' శబ్దము 'గల' యగుటలోను ఆక్షేపములేదు.—

క. 'సొలసి తటిల్లతాంగి జిగినూపు వెలుఁగులచేఁ గలధ్వనుల్
గల కలకంఠులం గడిమి.' (వసు. 3-67.)

*పూ॰ టీ.—చంటన్ = కుచములతో, నీయురము = నీవక్షస్థలమును.'

'నా మణితమునువినక - నా మొలనూలిగంటల మ్రోతవినక - నాయురోజములయందు నీయురమును మోపక పోవుట నీకు తగునా' అని చిత్రాంగి భాషణము.

'చూపు కన్నెఱికము;' అను నుడికారము నవనాథ చరిత్రములోనిదే.—

'కన్నుల కన్నెఱికము కడుంబాయఁ
జెన్నారఁగోరి చూచిన ఫలంబయ్యె.' (పుట. 47)

మ. అనినం గాలినశూలము ల్చెవులలో నంటించినట్లైన నూ
నినపెందిమ్మున సొమ్మసిల్లి, మగుడన్ * వే తేఱి యమ్మంత్రి నం
దనువాక్యమ్ములు నిక్కమయ్యె నని విన్నంబోయి, కన్నీళ్లుగా
ఱనునుంజెక్కుల, వాతెఱం దడుపుచున్ రాచూలి లో జాలిగన్.

టీక.— దిమ్మ = మనస్సంకటము, మగుడన్ = తిరిగి, వే తేఱి = వెంటనే తెప్పరిల్లి, విన్నంబోయి = వెలవెలపాటునంది. నునుంజెక్కులన్ = నునుపైన చెక్కిళ్లయందు, కన్నీళ్లు, కాఱన్ = ప్రవహింపగా, రాచూలి = ఆరాజకుమారుడు, లో-జాలిగన్ = మిక్కిలి దీనముగా.

గీ. పులుకుపులుకునఁ జూచి యక్కలికితోడఁ
బలుకుపలుకున దైన్యంబు ♦ దొలుకఁ బలికె
† 'ననుఁ బెనుప నోపు పినతల్లి వనుచు నమ్మి
చెల్లఁబో! యిటు వచ్చిన దెల్లఁగలిగె. ౧౦౧

---

'నాకుచములతో నీయురమును అనక' అను పక్షమున, అనవలసినదియు - అనకపోవునదియు, చిత్రాంగియగుచున్నది. కావున కుచములతో అని తృతీయగా చెప్పుట యొప్పుకాదు.

మరియును పూ. టీ. కర్తలు 'ఈపద్యమందు మేను, అమృతము, నోరు, కెమ్మోవి, ఒయ్యారంబును - సారంగధరునివి; చూపు, కౌగిలి, చెవులు, వాతెఱ, మోము, ఉల్లంబును - చిత్రాంగివి' అన్నారు. ఆ లెక్కలో, సారంగధరుని మోము చిత్రాంగి పద్దుక్రింద జమకట్టబడినది; చిత్రాంగి 'నీవి' లెక్కకురాక అసలే యెగిరిపోయినది. మొత్తముమీద శాస్త్రిగారి గ్రంథములో పద్యము - అర్థముకూడా ఒకదారికిరాక అణకలువేయుచున్నవి.

* శా. పా.—'వే తేరి'

'తెప్పరిలు' అను నర్థమున 'తేఱు' శకటరేఫముగాని లఘురేఫము కాదు. (చూ. శ. ర.) పాఠాం.—మగుడన్ దెప్పిర్లి.'

♦ శా. పా.—'దొలఁక' ('దొలుక' ప్రా. శ. ర. పా.)

† పాఠాం.—'నన్ను బెనిచిన పినతల్లి' (ప్రా. ము.)

టీక.—పులుకుపులుకునన్ = (భయసంభ్రమములతో) మిణకరిస్తూ - చూచి (చూ. బ్రౌ.) ‡ చెల్లంబో = అయ్యో, ఇటు...గలిగెన్ ఇక్కడికి వచ్చినందుకు కావలసినదంతయూ అయినది. (పినతల్లివని నమ్మివచ్చినందుకు మంచిపనిచేశావు. అని నిష్ఠురము.)

చ. మదిఁ దలఁపన్ వినం దగనిమాటలు నోరెటు లాడఁ జెప్పఁగా?
నెదిరి మనంబు లోఁ తెఱుఁగ * కేమిటి కీవలవంత? దల్లడిం
చెదు మది వానిఁ బో విడిచి చెల్లరె! తల్లియు దైవ మంచుఁ గో
విదులన విందు; నాకు వినవే పరభామలు దోడఁబుట్టువుల్. ౧౦౨

టీక.—ఎదిరి మనంబు లోఁతు ఎఱుఁగక = ఎదుటి (వాని) మనస్సును చక్కగా తెలిసికొనక, ఈ-వలవంత = వలపుబాధ, ఏమిటికి = ఎందుకు? † చెల్లరె= అయ్యో, వాని పోవిడిచి = వీడు నాకు కుమారుడుగదా అన్న భావమునుగూడా వదలి. మదిన్, తల్లడించెదవు = క్షోభపడెదవు. తల్లియు - దైవమంచున్, కోవిదులన్ = పెద్దలనుచుండగా, విందున్ = వినియున్నాను. నాకు పరభామలు, తోడఁబుట్టువుల్ = అప్పాచెల్లెండ్లవంటివారు, వినవే = ఈసంగతి నీవు వినలేదా?

మ. వలదమ్మా యిటువంటి ♦ కానిపని యో వామాక్షి, యీ వెఱ్ఱిబు
ద్ధులు నీ కేల ఘటిల్లె నమ్మ? తెగువన్ దుర్భాష లిట్లాడి యీ

---

‡ పూ. టీ.—'చెల్లఁబో = ఆశ్చర్యము'.

'చెల్లఁబో' ఇక్కడ సంతాపార్థకముగాని ఆశ్చర్యార్థకము కాదు.

"చెల్లఁబో = సంతాపమును తెలుపునది" (శ. ర.) "చెల్ల - Alas" (బ్రౌ.)

* శా. పా.—'ఏమిటికీవలవంతఁ దల్లడించెదు' ('వలవంతన్ = మదనవ్యథచేత'- పూ. టీ.)

ఎదుటిమనసు నెఱుగక వలవంతనొందుటయే తప్పు. అదియట్లుండగా, నీవు వానిగూడా గణింపక యిట్లు తల్లడిల్లుట అంతకంటెనుతప్పు; అని సారంగధరుడు రెండుతప్పులను వివరించినాడు. కావున, అతనివాక్యము నేకముగా నన్వయించుట సరికాదు.

† పూ. టీ.—'చెల్లరె = ఆశ్చర్యము'

'చెల్లఁబో' వలెనే 'చెల్లరె' యును సంతాపార్థకమే. ఆశ్చర్యార్థకము కాదు. ('చెల్లరె = ఖతార్థకము' లక్ష్మీనారా.)

♦ పాఠాం.—'కానిపనులో.'

కొల నా కేటికిఁ గట్టెదమ్మ? మఱి లోకుల్ విన్న నేమందు ర
మ్మ? లఘుత్వంబుగఁ జూతురమ్మ తగదమ్మా ధర్మమూహింపుమా.

టీక.—ఓ- *వామాక్షి, (స్త్రీ మాత్రసంబోధనము,) కానిపని = తగనిపని, కొల = పాపము. లఘుత్వంబుగన్ = చులకనగా.

క. తమతల్లి పురంధ్రీ జా
త మతల్లి గదా? దదీయ తనుజుఁడ నఁట †హా
రమణీ, యేతఱి నైనను
రమణీయేతరగుణంబు రా నేర్చునొకో? ౧౦౪

టీక.—తమ తల్లి = మాతల్లి, పురంధ్రీజాత - మతల్లి = కుటుంబినీ సమూహమున నుత్తమురాలు, తదీయతనుజుఁడనఁట = ఆమె కుమారుఁడనట, రమణీ = అమ్మా, ఏతఱినైనను = ఎట్టిసమయమునన్నైనను, రమణీ యేతరగుణంబు = మనోజ్ఞము కాని (=చెడ్డ) గుణంబు, రా నేర్చునొకో = రాగలదా. (నాకు దుర్గుణము కలుగనే కలుఁగదు - అనుట)

గీ. ఈతలఁపు ‡నుజ్జగింపు భూమీశునాన
యింకఁ బదివేలు ǁ నేల? నాహృదయ శుద్ధి
యొకఁ డెఱుఁగరు మదనారి యొకఁడె గాక'
యనుచుఁ ♦దర్జనిఁ జూపి యయ్యనఘుఁ డనిన. ౧౦౫

టీక.— ఈతలఁపును - ఉజ్జగింపు = ఇట్టిచెడ్డకోరికను మానుకో. భూమీ

---

* పూ. టీ.—'వామాక్షి' = ఓ సుందర నేత్రా.'
ఈయర్థమనుచితము. (చూ. ౨-౬౫ క్రింద.)

† పాఠాం.—'తా రమణీయ గుణమువిడిచియు, రమణీ నాకితర గుణము రా నేర్చునొకో.' (తంజ. ప్రతి) '...తదీయ తనయుఁడ, దనకో...' (పూ. ము.)

‡ పాఠాం.—'వేసి పెట్టు' ǁ 'పదివేలు వచ్చె' ♦'తర్జించిపలికె'

నవనాథచరిత్రమున నిట్లున్నది.—

"వదలు మీతలఁపు భూవల్లభునాన
పదివేలు నేల; నాభావసంశుద్ధి
మదనాంతకుఁడు తక్క మనుజులెర్గుదురె." —(పుట. 48.)

శువాన = ఇందుకుతప్పితివా- రాజుతోడు. (ఒట్టు పెట్టుట.).— మదనారి = ఈశ్వరుడు.— తర్జని = చూపుడువేలు.

శా. ఆనీలాక † లేఁతన వ్వొలయ నిర్లక్ష్మస్ఫురుత్పత్తి గ్రిమ్మల్లైతిపై చెలూ జగం
బా నా మే లన నీవ తెల్పుకొన నేలా నీగుణంబుల్? సతీ
సూనుగ్రామణి వౌదు; నీహృదయ మిచ్చోఁ గంటి; నే దేవతం
గా, నే నీకినతల్లిఁ గాను, విభుభోగస్త్రీని భావింపఁగన్. ౧౦౬

టీక.— ఆ నీలాలక = ఆ చిత్రాంగి, లేఁతనవ్వు- ఒలయన్ = నిర్లక్ష్య సూచకమయిన తేలికనవ్వు కనుపింపగా,— ఇట్లనెన్ = ఇట్లనెను. సతీ... వౌదు = పతివ్రతా పుత్రులలో మేటివగుదువు.— విభు = రాజుయొక్క, భోగస్త్రీని= ఉంపుడుగత్తెను.

క. భావజుని బారిఁ బడుచో
వావిఁ దలఁప నేల? ధర్మవర్తన మేలా?
నీ వింత యేల పెనఁగెదు?
నే విడ, నాకన్ను లాన నినుఁ గూడక కేఁకన్. ౧౦౭

టీక.— భావజుని బారిన్ పడుచోన్ = మదనబాధలో తగులుకొన్నప్పుడు.— నాకన్నుల + ఆన = నాకండ్లతోడు, నినుంగూడక - ఇఁకన్ - నే, విడన్ = నిన్ను విడిచి పెట్టను.

గీ. తక్కునుడువులు విడువుము, పెక్కు లేల?
యొకగడియమాత్ర ‡ మిట గూడి యున్నఁజాలు'
ననుచుఁ గదియంగఁ దలుపు మూయంగఁ దివురు
నాకలికితోడ ధీరత నాతఁడనియె. ౧౦౮

టీక.— ఒకగడియ (సేపు) మాత్రము, ఇట = ఇక్కడ, కూడియున్నన్-

† పాఠాం.— 'తీఁగె'

‡ శా. పా.— 'ఇటుగూడి' (ఇది పూ. ము. పా.) అప్పటికి కూడియుండలేదు కావున 'ఇటు' అనుటపొసగదు. 'ఇఁక' అని వేరొక పాఠము.

చాలును, అనుచున్, తలుపు- * కదియంగ- మూయంగఁదివురు = తలుపు పూర్తిగా మూయుటకు యత్నించుచున్న. ఆకలికితోడన్ = చిత్రాంగితో, అతఁడు, ధీరతన్ = ధైర్యముతో, ఇట్లు - అనియెను.

చ. 'వడి నరపాలు భోగసతి వావులు నాకుఁ బ నేమి యంటి 'వం
గడమున కెల్ల సొడ్డనినఁ 'గాదటు నే నలచిన్ననాఁడ వే
ర్పడితి' నటన్నఁ బోవునె స్వభావము? తల్లివి నాకు; నేక్రియం
బడఁతుకనీవు ♦ వావి చెడు మందు? మహిం గలదమ్మ యెందులన్?

టీక.—భోగసతిన్ = ఉంపుడుకత్తెను. వంగడము = వంశము. సొడ్డు = తప్పు (= అంకు). స్వభావము = సహజగుణము. వావి యే క్రియన్ చెడుమందు = ఎట్లు వావిచెడుమనెదవు? ఎందులన్ = ఎక్కడగానీ, మహిన్ = లోకములో, కలదమ్మ = ఇంతటి అన్యాయము కలదటమ్మా; (లేదని భా.)

---

* పూ. టీ.— 'కదియంగన్ = పొందుటకు'

అప్పటిప్రయత్నము తలుపుమూయువరకే గాని - 'పొందు' దాకా లేదు. ఈసారంగధరకు పూర్వోత్తర రచనలుచూచినచో ఈవిషయము తేలగలదు.

" చతురతనీతోడి సరససంభోగ - లీలఁదేలక వదలి చనిపోలేను,
వాలాయ మిఁక నని వాకిలిమూయఁ - దివురుచిత్రాంగితో ధీరతఁబలికె."
(నవనాథ. పు. 48.)

" చలము సేయకుమని చక్కని మేడ, తలుపుమూయఁగఁబూనఁ
దత్తఱంబునను." (బా. శం. సారంగ. 1-615.)

" కావు నన్ మరుని కాఁకలఁ గుందనీక, యనుచు వాకిలిమూయ నటునిటుఁ
జూచు, వనితచొప్పెఱిఁగి భూవరసుతుఁడప్పుడు." (కూ. తి. సారంగ. పు. 17)

♦ శా. పా.— 'వావి చెడ మందు'— అన్ని ప్రతులలోను ఈపాఠమే యున్నది. పూ. టీ. వ్రాతప్రతిలో 'వావిచెడన్ = వరసదప్ప, మహిన్, మందు = ఔషధము, కలదమ్మా = కద్దాతల్లీ' అని యున్నది. కూచిమంచి - తిమ్మకవియు, ఈపాఠమునే గ్రహించి,— 'శివశివా మతి వావిచెడమందుగలదె' అనియే అన్నాడు'

కాని, వావిచెడుట ఒక జబ్బుకాదు కావునను, మందున్నచో వావిచెడుటకు సారంగధరుడు సిద్ధపడినట్లు అర్థమగును కావునను, మందు ప్రస్తావమంతయుచితముగా నాకుతోచలేదు. అందువలన 'వావి యే క్రియంజెడుమందు'— అని సవరించినాను.

తల్లీ, 'నేను రాజుగారికి ఉంపుడుగత్తెను గాని యిల్లాలిని కాదు. కావున నాకు వానితో పనిలేదు' అనెదవు గాని అది యతుకని మాట - ఎట్లనగా, 'మీ కులానికి తప్పు' అనగా, ఒకడు - 'నేను చిన్ననాడే వేరుపడ్డా' నన్నాడట! వేరుపడినంత మాత్రాన కులానికి గలిగిన తప్పు పోవునా? అట్లే, నీవు భోగకాంతవగుదువు గాక; మా తండ్రి సంబంధమున నాకు తల్లివి కాకపోవు టెట్లు? నన్నెట్లు వావి చెడుమనెదవు? అది జరుగని మాట' అని తా.

క. వల దిటువలెఁ గర్కశోక్తి
పలుకులు పలుకంగ, నింత పదరం దగునే?
తలపోసి చూడు లెస్సఁగ
నెలఁతా, రత్నాంగి యొకటె? † నీవొకటియునే.? ౧౧౦

టీక — కర్కశోక్తి పలుకులు = కార్యాసక్తిచేత ఔచిత్యమును పాటింపని మాటలు. ఇంత పదరఁ దగునే = ఇంతగా తొందరపడవచ్చునా?

క. కాయములుఁ *గోమరుఁ దిమిరపుఁ
బ్రాయములుఁ దలంప నస్థిరంబులు; వీనిన్
స్థాయిగ నమ్మి యకృత్యము
సేయఁగఁ బూనెదవు మీఁది సిలుఁ గెఱుఁగవుగా!. ౧౧౧

టీక.— కాయములు = దేహములు, కొమరు-తిమిరపు- ప్రాయములు = పడుచుదనపు పొగరుతోడి వయస్సును, అస్థిరంబులు = చంచలములు (కలకాలము నిలుచునవి కావు) వీనిన్ = అట్టి చంచల విషయములను, స్థాయిగన్ = స్థిరముగానుండునవి అని, నమ్మి, అకృత్యము = చేయరాని పనిని, చేయఁగఁబూనెదవు. మీఁదిసిలుఁగు = ఆపైనివచ్చు ఆపదను. ఎఱుఁగవు గదా?

---

† శా. పా.—'నీవొక్కటియే' ('నీవొకటియునే' పూ. ము. తంజ. తాళ. పా.)

* శా. పా.—'కొమిరె, తిమిరపు' ('కొమిరె = ఓకుమారీ (చిత్రాంగి) అని పూ. టీ.)

సారంగధరుడు పినతల్లిని - ఓకుమారీ, అని పిలిచినట్లు టీకా కర్తలకు తోచుట వింత. మరియు, 'కొమిరె' అను పదమునకు 'యౌవనవతి' యన్న యర్థమొక

ఆ. వె. ఇపుడు ధైర్య మూని యిసుమంత పువ్వుకో
దండధరునిబాధ తాళలేవు;
పాప మెంచి మీఁదఁ బటుకార్లఁ బట్టించు
దండధరునిబాధ తాళఁ గలవె? ౧౧౨

టీక.—ఇపుడు, ఇసుమంత=కొంచెమైన, పువ్వుకోదండధరుని = పూవింటి వాని (=మన్మథుని) బాధ, తాళలేవు. మీఁదన్ = పరలోకమున, పాపమెంచి = నీవుచేసిన చెడ్డపనిని విచారించి, పటుకార్లఁబట్టించు = ఇనుపపట్టుకార్లతో పట్టి నొక్కించు, దండధరునిబాధ = యమబాధ, తాళఁగలవె?

తల్లీ, ఇప్పుడు, సుకుమారములయిన పూలదెబ్బలకే తాళజాలనిదానవు, పిమ్మట కఠినములయిన యినుపపట్టుకార్ల నొక్కులకెట్లు తాళగలవు? తాళజాలవు కావున నిట్టితలపుమానుకో, అని తా.

తప్పుచేసినవారిని కట్టివేసి పట్టుకార్లతో పట్టి నొక్కి బాధించుట పూర్వకాలమున నొక తెరగుశిక్ష.—

వ "నరకంబులయందు...పట్టుకార్లం బట్టించియు...బాధపెట్టుదురు."
—కాశీ. 3-156.

క. "‡సున్నము మెత్తుటయుం బట్టుకాఱులం బట్టుటయు సౌధ సౌవర్ణ భూషణాది నిర్మాణంబులయంద." (ఆముక్త. 4-187)

---

టియున్నది. యౌవనవతియు మదవతియునైన చిత్రాంగిని, కామమెసరేగి కన్నుమిన్నెరుగక మాటలాడుచున్న సమయమున - 'కొమిరె' అని సంబోధించుట యెంత యపాయకరము? 'కొమరు - తిమిరపు - ప్రాయములు' అని సరియైనపాఠము పూ. ము. నను,— మద. తాళ. ప్రి. లోనునున్నది. 'కొమరు' విశేషణము. (కొమిరె శబ్దమే వృత్తియందు 'కొమరు' గా మారునని శ. ర. కర్త చెప్పియేయున్నాడు.) 'కొమరుం బ్రాయము' (కళా. 4-46) 'తిమిరంపు వయసు' (మను. 4-88) అని, కొమరు తిమిరములనుప్రాయమునకు విశేషణములుగా వాడుట పరిపాటి. అంతేకాక, 'కాయములు - ప్రాయములు, అస్థిరములు' అని చెప్పుచోట కవియైనవాడు ఆ రెండుపదములకునడుమ 'కొమిరె' అని యొక సంబోధనమును పెట్టునుకొనుట సరి కాదు. ఇట్లన్నివిధములను 'కొమిరె' పాఠము అసాధువేయగుచున్నది. నూ. ని. ఈ పాఠమునే కైకొన్నది.

‡ శా. పా.—'సున్న మెత్తుటయు' (సున్నముఎత్తుట, మోయించుట' అని

మ. ఖరభానుప్రియసూనుఁ † డెప్పుడో నినుం గారించునే కా; విభుం
డఱచేలోపలి నిమ్మ ⁋ పంటివలె నత్యాసక్తి మన్నింప సౌ
ఖ్యరసైకస్థితి నుండి కావరమునన్ గన్గాన కాపత్పరం
పర రాఁ ద్రుళ్లెద వేల, యయో! విధిఁ దరింపన్ నీతరంబే మహిన్? ౧౧౩

టీక.—ఖరభాను ప్రియసూనుఁడు = సూర్యునికొడుకు = యముడు (ఖరభానుఁడు = తీక్ష్ణములయిన కిరణములుఁ కలవాఁడు. అట్టివాని కొడుకనుటచేత మిక్కిలి తీవ్రముగా బాధించువాడని, సారస్యము.) ఎప్పుడో = ఏదోయొకదినమున, నినున్, ‡ కారించునే కా = బాధించనే బాధించునుగదా!, విభుండు = భర్త, అఱచేలోపలి నిమ్మపంటివలెన్ = అరచేతిలో నిమ్మపండువలె :(ఇది ప్రేమను తెలుపు లోకోక్తి) అత్యాసక్తిన్ = మిక్కిలి ప్రేమతో, మన్నింపన్ = గారవించుచుండగా, సౌఖ్యరసైకస్థితిన్ - ఉండి = సుఖముగానుండి, కావరమునన్ = ఒడలిపొగరుచేత, కన్గానక, ఆపత్పరంపరరాన్ = అనేకాపదలు తటస్థించునట్లు, త్రుళ్లెద వేల = ఎందుకు మిడిసిపడెదవు! (నీ యీ దుశ్చరితము నెరిగినచో రాజు నిన్ను దండించునుగాని మన్నించడు.) అయో, విధిన్ తరింపన్ = తలవ్రాతను తప్పించుకొనుట, నీ తరంబే? = నీవశమా?

చ అనవుడు నవ్విశాలతరళాక్షి కటాక్షములందు నంకురిం
చిన ♦ కినుకన్ బటాబయలు సేయక నవ్వుముసుంగు వైచి యి

సంజీవనీటీక.)—పాఠము, అర్థము, రెండును అసాధువులే. శిక్ష 'శరీరమునకు సున్నము మెత్తుట' గాని, సున్నము (గంపకుపోసి) నెత్తికెత్తి మోయించుట కాదు.

† శా. పా.—'ఇప్పుడు' ('ఎప్పుడు' పూ. ము.; తంజ. పా.)

ఇప్పుడు (=బ్రతికియుండగానే) యముడు బాధించుననుట సరికాదు.

⁋ పాఠాం.—'నిమ్మపండువలె'

‡ పూ. టీ.—'గారించునే కా = బాధపెట్టునుగదా.'

ధాతువు 'కారించు' గాని 'గారించు' కాదు. (చూ. శ. ర.) "కారించుట To inflict, kill or distroy" (బ్రౌ.)

♦ పాఠాం.—'యలుకన్'

ట్లను నతనిం గనుంగొని; యనంగునిమామ వెలుంగుసానఁ దీ
రిన † కరవాఁడితూపుఁగికురించిన యోర మిటారి చూపునన్. ౧౧౭

టీక.— విశాలతరళాక్షి = (విశాలములును చంచలములునునైన కన్నులుగల–) ఆ చిత్రాంగి కటాక్షములందు = కడకన్నులయందు, అంకురించిన కినుకన్ = మొలకయెత్తిన కోపమును, బటాబయలు సేయక = పూర్తిగా వెలువరింపక, నవ్వు ముసుంగు వైచి = నవ్వుతో కప్పివేసి – (అనగా తనకువచ్చిన కోపము బయటపడకుండానవ్వి) అనంగునిమామ వెలుంగుసానన్ = (మన్మథుని మామయైన చంద్రుని కాంతి= వెన్నెల యను సానమీద, తీరిన = చికిలియైన, కరవాఁడితూఁపున్ = మిక్కిలి పదనైన బాణమును, కికురించిన = వంచించిన అనగా జయించిన - (ఉపమావాచకము) ఓర మిటారి చూపునన్ = సొగసు గర్వముతోఁగూడిన వాలుచూపుతో, కనుంగొని ఇట్లనున్ = ఇట్లుపలికెను.

ఆ చిత్రాంగి, తనకువచ్చిన కోపము తెలియబడకుండునట్లు పైకి నవ్వుచు, సానబట్టిన మదనసాయకముకంటెను తీవ్రమైన ఓరచూపుతో చూచి యిట్లు పలికెను; అని తా.

ఉ. 'ఎన్నఁడు నేర్చినాఁడవుర యీ మటుమాయపుమాట లీవు? నా
కిన్నిదలంప నేమిటికి? నిప్డు దోసము పెద్ద చేసి, యా
దున్నవయాళికానిఁ గడు * దొడ్డగఁ జెప్పి, భయంబు సూపి, చ
క్కన్నను దుద్దు పెట్టి, యుఱుకంగఁ దలంచెదు; మానుమీవగల్.

టీక.—మటుమాయపుమాటలు = మిక్కిలి మాయలమారిమాటలు – (మాయము + మాయము = మటుమాయము.) దోసము పెద్దచేసి = ఇదియొక పెద్దదోషముగా ఉగ్గడించి, ఆ–దున్నవయాళికానిన్ = (దున్నపోతు నెక్కువానిని=) యముని, కడున్ దొడ్డగఁజెప్పి = మిక్కిలి గొప్పగాచెప్పి, భయంబుచూపి = వెరపుగల్పించి, (భయపెట్టి), ననుదుద్దుపెట్టి =నన్ను మోసముచేసి ‖ చక్కన్ ఉఱుకన్‌తలంచెదవు =

† శా. పా.—'కఱవాఁడి' ('కరవాడి' ప్రా ము.;) కరము + వాఁడి = కరవాడి' సూ. ని.

* పాఠాం —'దొడ్డుగ'

‖ పూ. టీ.—'చక్కన్ = చక్కఁగా, ననున్ = నన్ను (చక్కన్నన్= మన్మథుని - అనియేని). దుద్దు పెట్టి = మోసముచేసి.'

చక్కా పరుగెత్తవలెననుకొనుచున్నావు. ఈవగల్ మానుము = ఈవగలన్ని మానవోయ్.

'దుద్దువెట్టు' (జాతీయము - శ. ర. లో లేదు) 'To evade, elude' (బ్రౌను.) 'చక్క - ఉఱుకుట' ఇదియును జాతీయమే. 'వాడు చేతులు జాడించుకుంటూ చక్కా పోయినాడు; పోయినవాడు పోయినట్లే చక్కా వచ్చాడు' అని వ్యవహారము. "చక్కాపోయినాడు- he departed straightway. He went away. దర్శనము చేసి చక్కావస్తాను. I'll visit him and return at once" (బ్రౌను.)

గీ. 'నినుఁ † గలఁచు భర్త కోపగాఁ' డనఁగ నేల?
'కోల బుజమున నిడి దున్నఁదోలువాఁడు';
'అవ్వ' యన నేల? రాజానా? రడ్డి యానా?
నాఁటికి; కిపు డేమి రారాదెయేటి * కలఁచ? ౧౧౬

టీక.—కలఁచుఁ = బాధించును; ‡ కోల బుజముననిడి దున్నఁ దోలువాఁడు = దండమునుధరించి - దున్నపోతునెక్కి సవారిచేయువాడు, అనగా యముడు, (యమునికి ఆయుధము దండము; వాహనము మహిషము.)— 'కొయ్య బుజాన పెట్టుకొని - దున్నపోతును తోలుకొనిపోవువాడు - అనగా, సేద్యగాడు, (అని అర్థాం) ♦ అవ్వ = (లోకమున) నింద, రడ్డి = రెడ్డి. అలఁచఁ - ఏటికి = ఎందుకు తిప్పలు పెట్టెదవు?

---

'చక్కఁగా నన్ను మోసముచేసి' అనుట సరికాదు. 'చక్కఁ' ఉఱుకుటకు విశేషణముగాని దుద్దువెట్టుటకు కాదు,— చక్కని + అన్న = చక్కని యన్న; చక్కనన్న, అగునేగాని 'చక్కన్న' యెన్నటికిని కాదు, 'చక్కని + అయ్య = చక్కయ్య; చక్కని + వాఁడు = చక్కవాఁడు' అనురీతి సంధి కార్యములు విన నింపుగానివి. శాస్త్రవిరుద్ధములున్నూ.

† శా. పా.—'కలయుభర్త'

కలయుభర్త; కలయనిభర్త, అని భర్తలిరువురుండరు. 'కలఁచు - భర్త' అను పాఠము, పూ. ము. నను, తంజ. మద. వ్రాతప్రతులలోనునున్నది. ('ననుఁ గలఁచు' అని, పాఠాం.)

* శా. పా.—'అలఁప' (అలఁచ - పూ. ము.; తంజ. తా. పా.)

‡ పూ. టీ.—'కోల...వాఁడు = సేద్యగాఁడు' అని మాత్రమే.

♦ పూ. టీ.—'అవ్వ = కలహము'

'నీభర్త కోపగాడు; నిన్ను బాధించును; యముడు నిన్ను నరకమున మిక్కిలి కష్టపెట్టును; నీకు లోకమున పెద్ద నింద కలుగును;' అని నీవు నన్ను బెదరించుట యెందుకు? నాఁటికి (=పాపవిచారణ కాలము నాటికి) రాజేయగునో రెడ్డేయగునో ఆమాటలతో నిపుడేమిపని? రావోయ్, నన్నెందుకు బాధించెదవు.—అని, తా. 'రాజో - రెడ్డో' అని లోకోక్తి. లోకములో - రాజు - రెడ్డి, న్యాయాధికారులు. ప్రకృతమున చిత్రాంగిని విచారించి దండించు భర్త - 'రాజు'; నరకమున శిక్షించు యముడు (దున్నను తోలువాడుగావున) 'రెడ్డి' యని చమత్కారము.

క. ఇక్కల్ల దెలిసి విభుఁ డిం
కొక్కప్పుడు సేయుచేత కొప్పితిఁ; బని లే
దెక్కడితగ? వెక్కడికొల?
యెక్కడివా? వేల? కొమ్మ లెవ్వరి సొమ్ముల్.? ౧౧౮

టీకా.—ఇక్కల్ల = ఈతప్పుపని, — తగవు = ధర్మము; కొల = పాపము; వావి = వరుస; ఏల = లేనిపోని ధర్మవిచారము లెందుకు? కొమ్మలు = స్త్రీలు, ఎవ్వరి సొమ్ముల్ = ఒకరి సొత్తా? (వావి + ఏల = వావేల.)

గీ. వలచి పట్టినఁ దాలిమి వదల కిప్పు
డెన్ని చెప్పెదు తగవు * లీ వేకతమున!
మొనసి యూరకె రతిరంగమునకు రాని
సుద్దు లివి యేల చాలించు ‡ సుగుణి వాదు. ౧౧౯

కలహా మెవరికి! ఎవరితో? 'అవ్వ' కు కలహము అను నర్థముకలదా? లేదు. "అవ్వ =నింద" (శ. ర.) "అవ్వ ill fame, bad name. Clamour, disturbance. అపకీర్తి. రచ్చ. రట్టడి" (బ్రౌను)

* పాఠాం.— 'తగవు-వివేకితనము.' (శ. ర. చూ. 'సుగుడి.')

‡ శా. పా — 'సుగుణివాదు.' ('సుగుణవాదు' పూ. ము. పా.)

'సుగుణి'; 'దుర్గుణి' యను రూపము లసాధువులు. సుగణములు కలవాడు 'సుగుణుడు' కాని 'సుగుణి' కాడు. శ.ర.లో. 'సుగుడి' అను పదముక్రింద చూపబడిన ప్రయోగములలో ఈ పద్యమునొకటి. కావున శా. పా. తప్పు. 'సుగుడి' పాఠమొప్పు.

టీక.— వలచిపట్టినన్ = ప్రేమించి ఆశ్రయింపగా, తాలిమి = ఓర్పు, వదలక, ఈవు = నీవు, ఏకతమునన్ = ఈ యేకాంతసమయమున, మొనసి = అది యొక పనిగా పూనుకొని, తగవులు = నీతులు, ఎన్ని చెప్పెదు= ఏకరువు పెట్టెదవు, రతిరంగమునకు రాని సుద్దులివి=(జాతీయము) ఇవి పనికిమాలిన మాటలు. (సురత క్రీడ కుపకరింపని ప్రసంగములు అని, భా.) ఏల = ఎందుకు? సుగుడివి- ఔదు = మంచి బుద్ధిమంతుడవగుదువు. చాలించు = అప్రసంగములు కట్టిపెట్టుము.

క. ‡వలవదురా రతి మరునకు?
వలవదురా రంభ యక్షవరసూనునకున్?
వలవ దురాశలఁ బెట్టఁగ
వలవదు రా వట్టి ♦జాలి వార్తలు †విడరా. ౧౧౯

టీక.—రతి = రతీదేవి, మరునకున్ = మన్మథుని; యక్షవరసూనునకున్ = నలకూబరుని, రంభ, వలవదురా = కామించలేదటరా? వలవన్ = స్త్రీ కామిం

‡ శా. పా.—'వలవదుగా రతి.- 'వలవదుగా రంభ'. (ఇది పూ. ము పా.) 'వలవదుగా = మోహింపలేదా' అని పూ. టీ.

మద. తంజ. వ్రాతప్రతులలో 'వలవదురా' అను పాఠమున్నది. పద్యమున క్రింది రెండు చరణములయందువలెనే పై రెండు చరణములందును 'వలవదురా' అని యమక ముద్దిష్టము. కావున శా. పా కంటెను వ్రాతప్రతులపాఠము రుచిరతరము. 'వలవదుగా = మోహింపలేదా' అను అర్థము సమర్థము కాదు.

♦ శా. పా.—'జోలివార్తలు' (ఇదియును - పూ. ము. పాఠమే) అర్థమేమో? పూ. టీ. లో లేదు. 'జాలివార్తలు' అని తంజ. పా.

తంజ. పా. సరియైనదని యీక్రింది పంక్తులు చెప్పుచున్నవి.—

'మంచివాఁడవునీవు మరవునీ వట్టి
జగజాలిమాటల జరిపెదుపొద్దు' (నవనాథ - పు. 49)

† శా. పా —'విడుమీ.' ('విడురా' అని పూ. ము. పా.)

స్వాతంత్ర్యమును గైకొని రాకొట్టిపిలుచు పట్టున 'విడుమీ' అను పాఠము కంటెను 'విడరా' అను పాఠముచితతరముగదా? 'విడురా' అనుట తప్పు. ('వినురా; కనురా; చేయురా, ఇత్యాదు లసాధువులు.' సులభవ్యా. క్రి. ౩౮.) "ఏలరయీ చలంబుడిగియేలర." (మను. 3-93) "ఏలర యింత వింతచలమేలర నన్ను" (శివ లీలా. 2-63)

చగా, దురాశలఁబెట్టఁగన్ = అడియాసల పాలుచేయుట, వలవదు - వద్దు (= పనికి రాదు) రా = రమ్ము. వట్టిజాలివార్తలు = పనికిమాలిన విషాదకర కథలు, ఐడరా = విడిచిపెట్టరా.

'మరునకు వలచు' - 'వలకూబరునకు వలచు' అను పలుకుబడి గౌరనదే.—

'వలచుట కష్టమా? వలవదేరంభ, నలకూబరునకును? నలమహీపతికి
వలవదె దమయంతి? - వలరాజునకును, వలవదె రతిదేవి? - వలపేమిచేసె?

(నవనాథ - పు. 49)

సీ. దారువనస్త్రీలఁ దగిలెఁ గాని, య దేమొ
నీవలె ముక్కంటి నేరఁ డయ్యె;
గారాబుఁ†గూతురి గవిసెఁ గాని, య దేమొ
నీవలెఁ బరమేష్ఠి నేరఁ డయ్యె;
అలయహల్యాకాంత నంటెఁ గాని, య దేమొ
నీవలె జంభారి నేరఁ డయ్యె;
గురునియిల్లాలితోఁ గూడెఁ గాని, య దేమొ
నీవలె నుడురాజు నేరఁ డయ్యె;

గీ. వారికంటెను హెచ్చైనవాఁడ వౌర!
నీకుఁ గలబుద్ధి వారికి లేకపోయె;
నీవు నాఁటికి లేక పోయితివి గాక,
చేరి వారలమోజలు చెఱుప లేవె?, ౧౨౦

వేంకట్రాయశాస్త్రిగారి వ్రాతలలో 'చేయురా - పాడురా - అడుగురా' అను రూపములే కనబడుచున్నవి. "ఓరి బాణా - బాణా, వరమడుగురా, అడుగురా, అని దీనముగా బతిమాలుకొనఁగా." (ఉష - పు. 13)

† శా. పా.— 'కూఁతునే' ('కూతు రిగదిసి' పూ. ము. పా. 'కూఁతురు' తంజప్రతులపాఠము.)

చిన్నయసూరి 'కూఁతురి నిత్యాదిరూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది' (బా.అచ్ఛి.౯) అన్నాడు గనుక శాస్త్రిగారు 'కూఁతురిన్'అను పూర్వపాఠమును 'కూఁతునే' అని దిద్దివేసినారు. దిద్దుట పొరపాటు. అథర్వణుడు; అహోబలపండితుడు-

టీక.— ముక్కంటి = ఈశ్వరుడు, దారువనస్త్రీలన్ = దారుకావనమున నున్న మునిపత్నులను.— పరమేష్ఠి = బ్రహ్మ, గారాబుకూఁతురిన్ = ప్రేమ పాత్రమయిన బిడ్డను (సరస్వతిని), జంభారి = ఇంద్రుడు, అహల్యాకాంతన్ = గౌతముని భార్యయైన అహల్యను.— ఉడురాజు = చంద్రుడు, గురుని యిల్లాలితోన్ = బృహస్పతి (గురువుగారియొక్క - అనియును) భార్యయైన తారతోను.— కలిసిరిగాని, నీమాత్రముధర్మము నెరుగకపోయిరిగదా! నాడు నీవేయున్నచో - వారి ఓజలు = బుద్ధులు, చెఱుపలేవె = చెడగొట్టియుండవా?

ఉ. నావుడు నిట్లనున్ సుజననాయకుఁ డీ వెడమాట లేల త
ల్లీ వినవమ్మ యీజగము లెల్ల సృజింప భరింప నొంపఁ జా
ల్దేవత లెట్లు వర్తిలిన లె స్సవు†గాకవి ‡ చెల్లవొడ్లకున్
నీ విపు డెన్నురంభ, రతి, నీగతిఁ బుత్త్రిలఁ బల్కఁ బట్టిరే? ౧౨౧

టీక.— సుజననాయకుఁడు = సుజనశ్రేష్ఠుఁడైన సారంగధరుడు, ఇట్లనున్ = ఈరీతిగాపలికెను. తల్లీ, ఈజగములెల్లను, సృజింపన్ = పుట్టించుటకును, భరింపన్ = పోషించుటకును, నొంపన్ = నశింపజేయుటకును, చాల్ = సమర్థులయిన, దేవతలు, ఎట్లు వర్తిలినన్, లెస్స+అవుంగాక = చెల్లుఁబడియగునుగాని, అవి = ఆవర్తనలు, ఒడ్లకున్ = ఇతరులకు, చెల్లవు = తగవు.

క. §మన నేరవు పతిమతి రాఁ
గన నేరవు సుగతి; తగవు గా దన్న నహో

మొదలగు వైయాకరణులు 'కూఁతురిన్' అనవచ్చునన్నారు. వ. సు. కర్త మొదలగు కవులు - అనియునున్నారు. (వివరములకు చూ. బాల. శర. పు. 23.)

ఇంకొక్క ప్రయోగము.—

మ. "పెండ్లికూఁ, తురిఁగావించిరి పేరటాండ్రు మహీభృ
త్పుత్రిక్ బ్రమోదంబునన్" కులశేఖరమాహాత్మ్యము. 4. ఆ. (సూ. ని.)

† శా. పా.—'గాకివి' (ఇది, పూ. ము. పా.) 'ఁగాకవి' తంజ. తా. వా. ఉచితతరము.

‡ శా. పా.— 'చెల్లవేరికిన్' ('చెల్లవొడ్లకున్' పూ. ము; తంజ. పా.— ఉచితతరము.)

§ శా. పా.—'మననేరవు; పతిమతిరాఁ గననేరవు సుదతి;'—

యున నేర, వెంత సెప్పిన

విన నేరవు, చాలుఁ జాలు విడు పోవలయున్. ౧౨౨

టీక.—పతిమతిరాన్ = భర్త మనసువచ్చునట్లు (అనగా ఆతనికి నీపై ననుగ్రహము కలుగునట్లు) మన నేరవు = వర్తింప నేరవు.—(మను = వర్తించు. శ. ర. 'లో, కుల చిత్తములకు వేఁగగు, కొలఁదిమనన్ గుంతి పెద్దకొడుకున కమరున్.' విరాట. 2–190. 'ఇట్లుగామనిన వామయోవామ' వసు. 6–57).—సుగతిన్ = మంచి మార్గమును, కన నేరవు = నీకై నీవు తెలిసికొనలేవు. తగవుకాదన్నన్ = ఇది ధర్మము కాదని చెప్పినను, అహా. అన నేరవు = ఆఁహా, ఇదియిట్టిదా యని గ్రహింపజాలవు. ఎంత చెప్పినను విన నేరవు.

క. అని పల్కు నతని తాల్మికి

మనమున నెఱి విఱిగి చాల, మఱియును గలిఁ బో

సిన ♦ వెనుక నుట్లకడఁ జూ

చినగతి నను, నతివ; యాస చెడ్డది గాదే! ౧౨౩

టీక.—అని, పల్కు = పలుకుచున్న, అతని - తాల్మికిన్ = తనకు లోబడని ఆ సారంగధరుని మనోనిగ్రహమునకు, మనమునన్ - నెఱివిఱిగి = ఉత్సాహముచెడి (=ధైర్యము సడలి) యును, కలిపోసిన వెనుకన్ = (అన్నములో) పుల్లనీళ్లు పోసినతరువాతగూడా, ఉట్లకడన్ చూచినగతిన్ = (పెరుగుకొరకు) ఉట్లవంక చూచినవిధముగా, అతివ = ఆత్రాంగి, అనున్ = ఇట్లనెను. ఆస చెడ్డది కాదే = ఆశ చెడ్డదిగదా (అవునన్న మాట)

క. ఆ హైనఁ గరఁగు నేనిపు

డీ యాడినమాటలకు నొకింతఁ గరఁగ వే

మోయి యిది నీకు మంచిదో

కో? యాఁడుది యుసురు మన్నఁ గొఱ గాదుసుమీ. ౧౨౪

---

వారిటీక లేదు. కాని వారుంచిన విరామచిహ్నములనుబట్టి యేర్పడు అర్థమిది. 'సుదతీ, మన నేరవు = నీవు బ్రతుకజాలవు. పతిమతిరాన్ = భర్త మనసు రాగా, కన నేరవు = చూడజాలవు.— ప్రా. ము. నను, తంజ. ప్రతులలోనుగూడా 'సుగతి' అను పాఠమున్నది. (నూ. ని. 'సుదతి' పాఠము నే గ్రహించినది.)

♦ పాఠాం.—'వెనక'

టీక.—ఆఁడుది, ఉసురుమన్నన్ = దుఃఖపడినయెడల, కొఱగాదుసుమీ = మంచిదికాదుసుమా; (నీకు తప్పక కీడుకలుగునని బెదరింపు.)

చ. కలికికి పిసాళి వాలుఁ దెలిగన్నులపై నిడనేల కెంపు? నా
పలుచనిమోవి కెంజిగురుపై నిడరా, నెఱజాణ; నాయెదన్
నిలుపఁగ నేల గోళ్లు? బలునిబ్బర పబ్బర పుబ్బు గబ్బి గు
బ్బలపయి నిల్పరా, సుగుణ; పైపయి రేఁపకు కోపతాపముల్.

టీక — నెఱజాణ = ఓయి రసికశ్రేష్ఠుఁడా. కెంపున్ = రక్తిమను, కలికి... కన్నులపైన్ = మనోజ్ఞములును — ప్రకాశవంతములును — నిడుదలును - నిర్మలములును — నైన నీకన్నులయందు, ఇడనేల = ఎందుకుచేర్చెదవు? పలుచని...నిడరా= చిగురాకువలె ఎఱ్ఱనై — పలుచనై యున్న నాయధరమునందు చేర్చరా — (కోపముచేత నీవు కన్ను లెఱ్ఱజేయుటయెందుకు? దంతక్షతములచేత నా మోవి నెఱ్ఱజేయుము, అని భా. ఎఱ్ఱదనమును తెల్లని కన్నులపై చేర్చుటకంటే, ఎఱ్ఱని మోవిపైచేర్చుట యుచితమని చమత్కారము.)

గోళ్లు = (గోడులు) దుఃఖములు, నాయెదన్ నిలుపఁగనేల = నామనసునకు కలిగించుటయెందుకు? గోళ్లు = గోరులు, నా...గుబ్బలపయిన్ నిల్పరా; (నన్ను నాదరించి యెందుకు గోడుపెట్టెదవు? పాలిండ్లపట్టి సుఖింపరా, అని భా.— గోళ్లు ఉంచదగినతావు గుబ్బలుగాని హృదయము కాదని, చమత్కారము.) కోపతాపముల్ పైపయిన్ రేఁపకు = నా కూరక కోపమును తాపమును కలిగింపకుము — (నీవు కన్ను లెఱ్ఱజేయుటచేత కోపమును, నిరాదరించుటచేత తాపమును నాకు రేగుచున్నవి. అట్టి పనులుచేయకుమని, భా.— కెంపును — గోళ్లను, పైపై నెక్కడనో యుంచి వ్యర్థముగా తాపమును కలిగింపకుమని చమత్కారము.)

ఉ. వే దన మించునీవిరహవేదన తాళఁగఁ జాలఁ; గంతునిన్
సాదన రాదుగా! తనదుపాదన చూపఁ దొడంగె; గాడ్పు దా
నీఁ దన వచ్చునే? మొదల నీ, దనలాంకృతి వేఁడి సూపుచున్;
బో దనఁజెల్లునా? కడకుఁ బో దనయంబు శుకంబు, ప్రేలుచున్.

టీక.—* వేదు + అనన్ = ఏదుపందియోఅన్నట్లు, మించు = అంతకంత

* పూ. టీ.— 'వేదు అనన్ = వెఱ్ఱియనునట్లుగా'.

కుసతిశయించుచున్న (ఏదుపంది చలపట్టినయెడల ముండ్లతో పొడిచి ఇజ్జరముజ్జరచేసి మిక్కిలి బాధించును. అట్లే బాధించుచున్న) ఈ విరహావేశము — తాళఁగఁజాలను = సహింపలేను. కంతునిన్ = మన్మథుని, సాము = మంచివాఁడు, అనరాదుగదా, (ఎందువల్లననగా) తనదు సాదనన్=తన శరప్రయోగకౌశలమును, (నామీఁద) చూపదొడంగెను. గాడ్పున్ = ఈ గాలిని, ‡ ఈఁద = చల్లనిగాలి - అనవచ్చునే =అనరాదు (ఎందువల్లననగా) అనలాకృతిన్ = అగ్నివలె, వేఁడిచూపుచున్ = వేడి

---

వేదు, అను పదమునకు వెఱ్ఱి యనునర్థము నిఘంటువులలో లేదు. ఆ యర్థము గలపదము 'వేదురుగాని' 'వేదు' కాదు. బ్రౌణ్యములో 'వేదు for ఏదు _ A porcupine.' అని యున్నది.

మానసిక వ్యాపారమయిన విరహతాపమును ప్రాణియైన యేదుపందితో పోల్చవచ్చునా? యని శంకింపపనిలేదు. కల్పనము కవి వివక్షాధీనము.—

చ. 'అలుకకు మన్నఁదే లె; మఱియంతటనుండియు వేళవేళ నె
చ్చెలులకు తెల్వులన్ మఱపఁ జింతలసంతమసంబులన్ సమా
కలితతమించె సొమ్మడని కార్శ్యమునన్ హృదయంబునన్ సదా
పలపలగాఁగ నీలముల బన్న సరంబయి నిర్మలాంగికిన్' (ఆముక్త. 5–83,)

ఈపద్యమున స్వాస్థ్యమును - చింతయును, ఒకదానివెనుక నొకటివచ్చుట ఎడమెడముగా నీలాలుకూర్చిన వజ్రాలసరముగా చెప్పబడినది.

గీ. 'ఎలసి యేప్రొద్దుఁ గను వొండనీక మరుఁడు
కలహమున కంకకాండయి కాలుద్రివ్వఁ
బాంథబహుళ క్షపా పరంపరలువెడల
కింటిలో నేదుము ల్లయ్యె నిందుముఖికి.' (ఆము. 5-84)

ఈ పద్యమున శుక్లపక్ష బహుళపక్ష రాత్రుల పరంపర యేదుముల్లుగా అధ్యవసింపబడినది.

‡ పూ. టీ.—'ఈఁదు = చలి'

గాడ్పును 'చలి' అనవచ్చునా? అని వారిటీక. గాడ్పును 'చలి' యనగూడదు సరేగదా, అసలు 'ఈఁదు' అను పదమునకు చలియను నర్థములేదు. కావున ఆ టీక అంతయునుతప్పే. పద్యములోని పదము 'ఈఁద' గాని 'ఈఁదు' కాదు. "ఈద Breeze" (బ్రౌను.) శ. ర. లో. 'ఈఁదు = వాయువు' అని యున్నది. విచార్యము.

కలిగింపుచు, మెదలనీదు.— శుకంబు = చిలుక, ¶ బోద = పసిది, అనవచ్చునా? =అనరాదు (కారణ మేమనగా) అనయంబు పేర్కొలుచుక = ఎప్పుడును వదరుచూ, కదపక పోదు = వదలి అవతలికి పోనేపోదు.

సీ. లతకూన యని తగు ల్మతిఁ దలంపఁడు గదా
వేఁడిలౌపులఁ జల్లి వేఁచుఁ గాని,
జలజగంధి యటంచు సంభ్రమింపఁడు గదా
చుఱుకుసోఁకుల మీఁద సుడియుఁ గాని,
చిలుకలకొలికి యం † చెలమిఁ బైకొనఁడు గా
♦చిగురుటాకుఁగటారిఁ జిమ్ముఁ గాని,
కలువకంటి యటంచు నలరఁ జేయఁడు గదా
యుడుకువెన్నెల గాయఁ దొడఁగుఁ గాని,
గీ. మధుఁడు * సారంగరథుఁడు మన్మథుఁడు విధుఁడు
‡ వసులపాఁతఱ లై నీకు నుసుల నీయ

---

¶ పూ. టీ.—'బోదు అనక చెల్లునా = పెంపుడని చెప్పఁదగునా?'

నిజముగా 'బోదు=పెంపుడు' అని చెప్పదగదు. ఎందువల్ల? ఆపదమున కా యర్థము లేదుగనుక. "బోదు = ఎద్దుగంత; గోము" శ. ర.— "బోదు - The sacking in which oil botlles are packed on bullock. సాగరము మోసే యెద్దుకు గంతమీద వేసేది". (బ్రౌను.)

పద్యములోని పదము 'బోద' గాని 'బోదు' కాదు. (బోద + అనక = బోదనక) 'బోద = పక్షిలోనగువానిపిల్ల. అంచబోద; లేటిబోద'. (శ. ర.)

ఉ. "వీణియమట్టుటల్ మిగుల వింతలు, పెంపుడు చిల్కబోదతో
రాణదలిర్పఁ బల్కుట కరంబప్రియాపము". (కాశీ. మా. 2-83)

† శా. పా.— 'చలమిపై.' - 'చెలమిఁబై' అని పూ. ము. పా. గుణవత్తరము.

♦ పాఠాం.— 'చిగురుటాకెదనాటి.'

* శా. పా.— 'సారంగధరుఁడు.' (ఇది. పూ. ము. పా.)

‡ శా. పా.—'వసుల పాతరలై.' - 'పాఁతఱ' సరియైన రూపము (చూ.శ.ర)

రెటుల ‡నిఁక దాళఁ గల' దని యెఱుఁగ వైతి;
కటకటా నీకు దయ లేదుగా! యొకింత. ౧౨౭

గీతములోని మధుఁడు, సారంగరథుఁడు, మన్మథుఁడు, విధుఁడు, వరుసగా సీసపాదములు నాలుగింటను కర్తలు. స్త్రీ పర్యాయములయిన లతకూన, జలజగంధి, చిలుకలకొలికి, కలువకంటి, అను పదము లీ పద్యమున సాభిప్రాయములు.—

టీక.—మధుఁడు = వసంతుడు, వేఁడితావులను చల్లి = వేడివేడి పరిమళము లను విసరి (విరహులకు సెత్తావులు, వెన్నెల మొదలగునవి తాపకరములు) వేఁచుఁ = బాధించును కాని- 'లతకూనయని = ఈ చిత్రాంగి కన్నెపడుచు గదాయని, తగుల్ = స్నేహమును' (లతకూన కావున తగులుకొనుట స్వభావము) మఱిఁ - తలంపఁడుగదా? (లతలయెడ స్నేహము కలిగియుండవలసిన వసంతుడు, కేవలము 'లతకూన' యే యైన చిత్రాంగియెడ స్నేహమునుచూపక బాధించుచు న్నాడని భావము; మధుడు అను నాయకుడు' లతకూన = పడుచుపిల్లగదా- అని, (చిత్రాంగియెడ) తగులు = వలపు సంబంధమును, మఱిఁ, దలంపఁడు = భావిం వించుటలేదని ధ్వని.-)

♦సారంగరథుఁడు = (సారంగ = జింక, రథుఁడు = వాహనముగాగలవా డైన) వాయువు, చుఱుకు సోఁకులఁ, మీఁద-సుడియుఁ = సుళ్ళుసుళ్ళుగా పైనబడును-కాని, జలజగంధి = ఉత్తమస్త్రీ- అటంచుఁ. సంభ్రమింపఁడు = సంతోషింపడుగదా? (జలజగంధమును, మెచ్చివహించి తిరుగవలసిన వాయువు,

---

‡ శా. పా.—'నిటుదాళఁగలదని.' – అంటే అర్థమేమో వారుచెప్పలేదు. ('ఎటులనిగదాళ.' అని పూ. ము. పా.; 'ఎటుల నిఁక...' అని. తంజ.పా.)

♦ పూ. టీ.— 'సారంగధరుఁడు=వాయువు.'

మూలమునను, టీకలోనుగూడా 'సారంగధరుఁడు' అనియేయున్నది; కాని సరికాదు. మధుఁడు; మన్మథుఁడు; విధుఁడు, అనుపదములవరుసలో నడుమ (సారంగ) ధరుఁడు - అనియుండుట శబ్దాలంకార మర్యాదకు విరోధము. అంతేకాక 'సారంగధరుఁడు' అను పదమునకు 'వాయువు' అనే యర్థము భాషలో లేదు. వాయువు సారంగమును (= జింకను) ఎక్కువాడుగాని ధరించు (=ఎక్కించుకొని తిరుగు) వాడు కాడు, కావున శాస్త్రిగారిపాఠము అర్థముకూడా తప్పే. అలంకార మర్యాదనుబట్టియు; అర్థమును బట్టియు పాఠము- 'సారంగరథుఁడు' అని యుండవలెనని నేనూహించినాను.

ఉత్తమమైన జలజగంధముగల చిత్రాంగిని మెచ్చి సంతోషించుటలేదని- భా; సారంగధరుఁడు- అను నాయకుఁడు, జలజగంధి = పద్మినీజాతి నాయికకదా- అని, సంభ్రమింపఁడు = (ఎత్తుకొని తిరుగుట లేదు) అని ధ్వని.

మన్మథుఁడు, చిగురుటాకు కటారిన్ = చిగురాకుకత్తిని, చిమ్మన్ = విసరిబాధించును- కాని; చిలుకలకొలికి = సొగసైన కనుకొలుకులుగలది. అని, ఎలమిన్ = ప్రేమతో. పైకొనఁడు = కవియుఁడుగదా? (చిలుకనెక్కెడు వాడైన మన్మథుడు చిలుకలకొలికియైన చిత్రాంగియెడ ప్రేమచూపుటలేదని - భా; మన్మథుడు - అను నాయకుడు, చిలుకలకొలికి = చిలుక కొలుకులవంటి సొగసైన కనుకొలుకులు కలది. ( = (Bright - eyed) గదా యని, తమకమునవచ్చి పైబడుట లేదని - ధ్వని.)

విధుఁడు = చంద్రుడు, ఉడుగు=వేడియైన, వెన్నెలఁగాయన్, తోడరున్= పూనుకొనును - గాని' కలువకంటి = కలువలవంటి కన్నులుగలది. అటంచున్, అలరఁజేయఁడు = సంతోషింపజేయఁడు - గదా? [కలువలను అలరింపఁ (=వికసింప జేయవలసిన చంద్రుడు కలువలేకన్నులుగాగలదియైన చిత్రాంగిని, అలరింప (సంతోషింప) జేయలేదనిభా - చంద్రుడు- అను నాయకుడు, ఇది కలువకంటి=సొగసైగకన్నులుగలది) గదాయని వచ్చి కలసి రతిసుఖములచేత నలంకరించుటలేదని - ధ్వని]

ఇట్లు, మధుఁడు, సారంగధరుఁడు, మన్మథుఁడు, విధుఁడు, అను నలువురును *వసులపాతరలై = వసులపాతరయను పందెపు పుంజులవంటివారై, నుసులనీయరు = మెదలనీయరు. ఇఁకనెటుల తాళఁగలదు' అని, ఎఱుఁగవైతి = తెలిసికొన లేకపోతివి. కటకట =అయ్యో, ఒకింత = కొంచెమైనను, నీకు దయలేదుగా.

---

* పూ. టీ.—'వసులపాతరలై = వసులనఁగా తాళవృక్షాదులను చీల్చుటకు సాధనమైన యినుపమేకులు - వానికి స్థానములై నుసులనీయరు.'

ఇనుపమేకులుగాని, వానికి స్థానములగు పెట్టెలు - బుట్టలు మొదలగు వస్తువులుగాని తమంతట తా మెగిరివచ్చి మానవులనుబాధించుట లోకమున నెందునుకనబడదు. ఇక పాతర యన్ననో నేలనుండు 'గొయ్యి'. గోతులు - నూతులు కదలునవి కావు. కదలింపబడునవియును కావు, కావున 'మేకుల పాతరలు బాధించు' ననువ్రాత వెఱ్ఱివ్రాత. 'వసులపాతఱ' నామరూపముల నెరుగని యనుచితపువ్రాత.

శ. ర. కర్త. 'వసులపాఁతఱ = ఒక దినుసు కోడిపుంజు' అని యర్థముచెప్పి ఆయర్థమున కీ పద్యమునే యుదాహరించియున్నాడు. విదేశీయుఁడైన బ్రౌను. 'వసు

ఓరి సారంగధరుడా, ఎంత కఠినుడవురా! ఇది ప్రాయపు పడతియయ్యెను. ఏకాంతమున నొంటరిగానుండెను. మధు మన్మథాదులు పురుషులయ్యును - ఏవిధమైన సుఖమును కలిగింపక పైపెచ్చు నొగిలించుచుండిరి. కామపీడితయైన యీయబలయిక నెట్లు తాళగలదు? అని అయ్యో! ఇంతమాత్రము యోచింపకపోయితివిగదా? అని తా.

గీ. *త్రిమ్మరి గదా సదాగతి తెలిసి చూడ,
మేటియగుడు గదా యనంగుఁ డేతటి, మఱి మడి

లపాతర A sort of fighting cock ఒకవిధమైన పందెపు కోడిపుంజు' అని వివరించి యీ క్రింది పద్యమునుగూడా సూచించియున్నాడు.—

సీ. 'కత్తులపాది సింహగాలి బేతాళుండు - వసుల పాతర పాదరసముచిలుకు, తుమ్మ సుడిగాలి చక్రింబు నలజడదరి, యనెడు పేరుల పుంజులఁగొని ముగించి.' (సాంస. 3—215.)

శబ్దార్థనిఘంటువులో 'అరజుట్టు' క్రింద పందెపు కోడిపుంజుల భేదములలో 'వసులపాఁతఱ' పేర్కొనబడియున్నది. పూ. టీ. కర్త లేదియు నెఱుగరుగదా!

* శా. పా.— 'దిమ్మరి' ('దిమ్మరి = సంచరించువాఁడు. తిరుగుబోతు అని యర్థాంతరము.)'- అని పూ. టీ.

'దిమ్మరి' యనగా దిమ్మకలవాడు (దిమ్మ + అరి) గాని 'సంచరించువాడు కాడు. (చూ. శ. ర.) సంచరించువాడు 'త్రిమ్మరి'. (= త్రిమ్మరు స్వభావము కలవాడు.) 'త్రిమ్మరు = సంచరించు' (శ. ర.)

ఉ. 'అమ్మకచెల్ల నేను వెలయాలనొ దిమ్మరినై పురంబునన్
ద్రిమ్మరఁ జూచెనో' - (శుక 2-217) శ. ర.

('త్రిమ్మరినై పురంబునన్ ద్రిమ్మర.') అని వావిళ్ల ప్రతిపాఠము. అసాధువు.) దేశద్రిమ్మరి (దేశము + త్రిమ్మరి) = దేశములు తిరుగువాడు. (బ్రి. వే. ప్రభాకరశాస్త్రిగారు 'దేసద్రిమ్మరి' అన్నారు. చూ. క్రీడా. పీఠిక. పు. 95.) బ్రౌణ్యమున "దిమ్మరి, ద్రిమ్మరి, దేశదిమ్మరి A vagabond" అనియున్నది. దానిని చూచియే కాబోలు పూ. టీ. కర్తలు 'దిమ్మరిగదా' అన్నారు. పొరపాటు. 'త్రిమ్మరి'యే 'దేశద్రిమ్మరి' యను సమాసమున సంధివశమున 'ద్రిమ్మరి (=దిమ్మరి) అయినది.

యఁడు గదా యల్ల జైవాతృకుఁడు దలంప;
నిట్టిచెడుగులచే †బాధ లెట్టు లోర్తు. ౧౨౮

టీక.— సదాగతి = వాయువు, ('వాయుర్మాతరిశ్వాసదాగతిః' అమ.) తిమ్మరి = తిరుగుబోతు = నీతినియమములేక వర్తించువాడు, అని యర్థము. (గాలి యెల్లపుడును తిరుగుచుండుట స్వభావముగలది యని భావము.- గాలి, సదాగతి (=సర్వదా సంచరించునది) కావుననే తిమ్మరి (=తిరుగునది) యని సారస్యము.); అనంగుఁడు = మన్మథుడు, మెఱియఁడు = మూఢుడు = మొరటువాడు. అని యర్థము.

[మెఱియ = గుండ్రాయి, మెఱియవంటివాడు = మెఱియఁడు = (బిడ్డఁడు కొడుకఁడు; వంటిపదము.) బండవంటివాడు = కఠినుడు; 'మెఱియలవంటి రక్కసులు మిక్కిలి లెక్కకుమీఱి' వ్రి. ప్రి. 1-81)

మెఱియఁడు = ప్రకాశింపడు = కంటికగపడడని భా. మన్మథుడు, అనంగుడు (= అంగములేనివాడు) కావుననే, మెఱియఁడు = (కంటికగపడడు) అని, సారస్యము.

జైవాతృకుఁడు = చంద్రుడు, ('అబ్జో జైవాతృక స్సోమః' అమ) మడియఁడుగదా = మడ్డివాడు (Stupid) గదా, అని యర్థము. (మడియఁడు = చావడు. అమృతమయుడని భా- చంద్రుడు, జైవాతృకుడు = దీర్ఘాయుష్మంతుడు, ('జైవాతృక స్యాదాయుష్మాన్' అమ.) కావున మడియడు = చావడని సార.) ఇట్టి చెడుగులచేఁ = తిమ్మరులు, మెఱియలు, మడియలు నగు ఇటువంటి దుర్మార్గులచేత (=మలయపవన మదన చంద్రులచేత) అగు (అధ్యాహార్యము) బాధ. ఎట్టులోర్తును? = ఓర్వజాలను)

అంతేగాని అది సరళాదిపదము కాదు. పూ. ము. నను, 'మడియఁడు' అను పదము క్రింద. శ. ర. లోను, 'తిమ్మరిగదా' అను పాఠమున్నది. పూ. టీ. కర్తలు గమనింపలేదు. మఱియును వారు 'దిమ్మరి = తిరుగుపోతు' అన్నారు. 'తిరుగుపోతు' అను రూప మసాధువు. 'తిరుగుఁబోతు' సాధువు. (శ. ర. లో ఉన్నది.)

† శా. పా.—'బాధకెట్టులోర్తు' ('బాధయెట్టులోర్తు'. పూ. ము.; శ.ర.; 'బాధలెట్టు' తంజ. తా. పా.)

*'మలయపవనుడు నీతినియమములేక వర్తించువాడు, మన్మథుడు కఠినుడు = కనికరములేనివాడు; చంద్రుడు మడ్డివాడు= మంచిచెబ్బెరుగనివాడు; ఇట్టి దుష్టుల వలన గలుగుబాధ యెట్టులోర్వగలను' అని, తా.

క. రారాపు లేల సేసెను
 రారా ననుఁ జలువ కలువరా రా మేడ౯
 రా రా యని తలిరాకుజి
 రా రాయని కేళి నేలరా రాకొమరా. ౧౨౯

టీక.—రారాపులు + ఏలచేసెదు = ఎందుకుబాధపెట్టెదవు' రారా; ననుఁ = నన్ను; చలువ...మేడ౯ = చలువ = చల్లనైన, కలువరా - రా - మేడ౯ = చంద్రకాంత శిలాభవనమునందు. రారా అని = రమ్మురమ్మని, ‡తలిరు - ఆకు జిరా - రాయని - (చిగురాకు కత్తిగాగల శూరుని=) మన్మథుని, కేళి యందు =రతియందు ఏలరా = ఏలుకోరా.

---

* 'వాయువు సంచరించువాడు; మన్మథుడు ప్రకాశింపడు; చంద్రుడు నశింపడు; ఇట్టిచెడుగులబాధ యెట్టులోర్తును' అని పూ. టీ. అర్థసరణి.

సంచరించువాడు, ప్రకాశింపనివాడు, చెడుగు లనుటలో అర్థములేదు. కావున ఆసరణి సరియైనదికాదు.

అధికపాఠము. (తంజ. వ్రాతపతి.)

గీ. రసికుఁడవుగావు. ఏమిరా రాకుమార,
 యెంతరారాపుసేసెద వింతపనికి!
 ఆసపడి వచ్చినటువంటి యాఁటదాని
 తలఁపెఱుంగవు నెఱజాణతన మదెంత!

‡ పూ. టీ.—'తలి...రాయని = చిగురుటాకు కవచముగల వానియొక్క— అనఁగా మన్మథునియొక్క'.

మన్మథునికి చిగురుటాకు ఆయుధముగాని కవచము కాదు.

"జిరా = బాణము. 'తలిరు జిరా వజీరు బలుడాడికినోడి'. నీలా. 3. అ" (శ. ర.)

"జిరా (హిం) A daggar కటారి. 'చిగురాకుజిరాదారి' నాగ్నజి. 2-29."— (శబ్దరత్నాకరము)

మ. 'పరిరంభం బొనరింపరా, కరుణ నాపై నింపరా, యాలకిం
పర, యేరా? యధరామృతం బొసఁగి నన్ మన్నింపరా, యంచు దై
న్యరసం ¹బుట్టిపడ న్నెలంత వలవంతం*గొల్కులంజిల్కు పాం
డరగండ చ్యుత బాష్పధార కొనగోటన్ మీటుచున్ బల్కఁగన్.

టీక.— పరిరంభం బొనరింపరా = కౌగిలింపరా;— దైన్యరసంబు = దీనభావము. (=జాలి) ఉట్టిపడన్ = అతిశయింపగా, ఆన్నెలంత = ఆయింతి (చిత్రాంగి) వలవంతన్ = మన్మథవ్యథచేత, (= వలపుబాధచేత) కొల్కులన్ చిల్కు = కనుగొనలనుండి వెడలి ('చిలుకుట To be shed: to distil or trickle:- బ్రౌను.) పాండర = తెల్లనైన ('విశద శ్వేత పాండరాః' అమ.) గండ = చెక్కిళ్ళమీద, చ్యుత = జారిపడిన, బాష్పధార = కన్నీటిజాలును.

చ. విని విననొల్ల కావలికి వేత్ర పరాకుగఁ జూచి చూడఁ, డే
మన నెటు వచ్చునో యని భయంబున నోరు మెదల్పఁ, డెవ్విధం
బున †నిది యూడ వేసికొని పోదు నటంచు నుపాయ మెంచు, న
మ్మనుజవరాగ్రగణ్య సుకుమారుఁడు లోభియుఁబోలె నయ్యెడన్.

ఈపద్యమున సారంగధరునికి లోభితో పోలికచెప్పబడుచున్నది.—

---

ఉ. 'నూఱఁగఁ జొచ్చె వెంట నే, పచ్చనివింటివాఁడపుడు పైదలిపైఁ
దలిరాకుకైదువుల్.' (విజయ. 2-167.)

క. 'వెడవిలుతుకేళిఁ జిగురా
కడిదపువ్రేటునకులోఁగి యతిమోహితుఁడై.' (భాగ. 9-569.)

సీ. సుగుణులు మామోము జిగిగను నపుడెల్ల
వలరాజు జళిపించుఁ దలిరువాలు.' (రామా. 2-125.)

¹ శా. పా.— 'ఉప్పతిల' ('ఉట్టిపడ' పూ. ము.- ఉచితతరము.)

* శా. పా.— 'కుల్కులం జిల్కు' ('కొల్కులంజిల్కు' పూ. ము. పా.; 'కొల్కులంజిల్కు' తంజ. తా, పా.)

'కుల్కులంజిల్కు' అనుపదమునకు పూ. టీ. లేదు. వలవంతచేత 'కులుకులను చిలుకుట' స్వభావము కాదు. కన్నీరు కనుగొలుకులనుండి చిలుకుట స్వభావము. కావున నేను 'కొలుకుల' పాఠమునే కైకొన్నాను.

టీక.—మనుజవరాగ్రగణ్యు ను కుమారుఁడు — రాజులలో మేటియయిన రాజనరేంద్రుని కుమారుడు, సారంగధరుడు, లోభియుం బోలెన్ = యాచకుని బారినుండి తప్పించుకొనజూచు పిసినారివలె, వేఱె పరాకున్ = ఏదోయితర విషయమున మనసు లగ్నమయినవానివలె. (కడమసులభము.)

క. ఇట్టటు చూచి *యీచెలిఁ
బట్టిన వలరాచ గబ్బి బలుబూతంబున్
నెట్టుకొని †వీడఁ జేయఁగ
గట్టిగ మాటలవశంబుగా దని వేగన్. ౧౩౭

టీక.—వలరాచగబ్బిబలుబూతంబున్ = మన్మథుడనెడు గొప్ప దయ్య మును, ‡నెట్టుకొని = పూని, వీడఁజేయఁగన్ = వదలించుట. మాటలన్ వశంబు కాదు- అని, (తప్పించుకొని పోవలసినదేగాని మంచిమాటలతో ఈమె మనసును సరిపరుచుట కానిపని యనుకొని) వేగన్ = వేగముగా (అవ - అన్వ.)

'వేగ' భారతకవులమతమున కళ. (చూ. ఉద్యో. 3-25)

---

*శా.పా.—'యాచెలి' (యీచెలి' తంజ. పా.)

సారంగధరుడు తనయెదుటనున్న స్త్రీని గూర్చియనుకొనుమాట గావున 'ఈచెలి' యనుటయే యుచితము.

† శా.పా.— 'వీడఁజేయఁగ' (వీడజేయఁగ' పూ. ము)

'వీడు' అనుక్రియలో అరసున్న పెట్టుటప్రమాదము. శాస్త్రిగారినిబట్టి వావిళ్ళవారును 'వీఁడ' అని సార్ధబిందువుగానే ముద్రించినారు.

‡పూ. టీ.—'నెట్టుకొని = ఎదిరించి.'

నెట్టుకొనుట యనగా గట్టిగా పూనుట గాని యెదిరించుటకాదు. (చూ. శ.ర.) "నెట్టుకొనుట. To be firm, to maintain his ground, to remain.— 'నెట్టుకొనియాశ్రయింతురు.-సుమతి.' టీ. నెట్టుకొని, పాదుకొని. నెట్టుకొను అన గా అభిముఖముగా యత్నపడెననుట."—(బ్రౌను.)

క. 'నెట్టుకొని కొలుతు నన్నయ, భట్టారకు' (భీమ. 1-8.)

గీ. 'నెట్టుకొనికాయ మీ రెండ పట్టుపగలు' (కాశీ. 7-134)

గీ. అపుడు గురుభామ చిత్రాంగి యలమి బలిమి
నొడిసి పట్టిన పైకోక విడిచి చనియెఁ
దా నవీనకళానిధి యై నెగడిన
యట్టి సారంగధరుఁ డయ్యె నబ్బురంబు! ౧౩౩

టీక.— తాన్ = తాను, ‡నవీన-కళా-నిధియై = నూతనములైన శృంగార కళలకు నెలవై (= నవయౌవన లక్షణసంపన్నుడై.) నెగడినయట్టి = ఒప్పినట్టి, సారంగధరుఁడయ్యెను; † గురుభామ = తండ్రియుంపుడుగత్తె, అలమి=పైకొని, బలిమిన్ = బలాత్కారముగా, ఒడిసిపట్టిన, పైకోకన్ = పైయుత్తరీయమును, విడిచి, చనియెన్ = పారిపోయెను. అబ్బురంబు = ఆశ్చర్యము.– (సారంగధరుడు నవయౌవన సంపన్నుడయ్యెను, తన్నువలచి పట్టుకొనిన (తండ్రిగారి) భోగపు జవ రాలిని నిరసించి పరువెత్తెను. అబ్బురముగదా?) తాను, నవీన, కళా (=కాంతులకు) నిధియై నెగడిన, సారంగధరుఁడయ్యెన్ = చంద్రుడయ్యెను, (నవీనకళానిధి-యనుటచేత క్రొత్తక్రొత్తగా కళలు సమకొనుచున్న తరుణచంద్రుడని- భా.) తన్నొడిసిపట్టిన, గురుభామను = గురువుగారిభార్యను-(బృహస్పతి భార్యననియు) తారను, విడిచి చనియెను; అబ్బురము. (అని- అర్థాం). సారంగధరుడైనవానికి గురుభామను పైకొనుట స్వభావమైయుండగా- ఈసారంగధరుడు - గురుభామ తన్ను బలాత్కరించినను లొంగక తిరస్కరించి పారిపోయినాడు. ఆశ్చర్యము గదా? అని చమత్కారము.

---

‡ పూ. టీ — 'నవీనకళానిధి = నూతనమైన విద్యానిధి - (బాలుఁడనియు) భా.'

ఈ టీక సరియైనది కాదు. ఎందువల్లననగా? (a) 'నూతనమైన విద్యానిధి' యనగా(క్రొత్తదియైనవిద్యాస్థానము=)క్రొత్తపండితుడు, అని కావలెను! వారియర్థము? మరియందులో 'బాలుఁడనియు' భావము కలుగుటెట్లు? ఏమి! క్రొత్తపండితుడు వృద్ధుడుగానుండగూడదా? (b) విద్యానిధి- (మంచిచెడ్డల నెరిగినవాడు,) కావుననే గురుభామ దురుద్యమమున కొడబడక తిరస్కరించినాడు. అం దబ్బురమేమి? (c) బాలుడే యైనచో అసమర్థుడుగావున భయపడి పరుగెత్తుట భావ్యమే. అందు ఆశ్చర్య మేమున్నది?

† పూ. టీ.— 'గురుభామ = తండ్రిభార్య.'

గీ. సాము సేసినగతి దట్టిచల్లడముల
తో వెడలె స్త్రీకి లోఁగాక దేవుఁడనఁగ;
* ఇంతి పైకొని వచ్చిన నేరి కైనఁ
గోక యనుబుద్ధి గల్గునే లోకమునను.? ౧౩౪

టీక.— స్త్రీకిలోఁగాక = స్త్రీకిలోబడక, దేవుడనఁగన్ — వెడలెన్. (ఆడదానికి లోబడనివాడు దేవుడేనని భా.)

క. ‖ లేఁగ పులిచేతఁ దడఁబడి
యేఁగెడుగతి నట్టు లేఁగ † నెంతయు గినుకన్

---

చిత్రాంగి, సారంగధరుని తండ్రికి భార్య కాదు. ఉంపుడుగత్తె. (=భోగిని.) 'భోగిని' కి భార్య - పర్యాయపద మనుకొనుట గొప్ప ప్రమాదము.

"భోగిని. A royal concubine: or left handed queen. రాజువుంచిన బోగముది."—"భార్య. A wife." (బ్రౌను.) "భోగినీ- A woman belonging to the king's harem, but not consecrated with him, the concubine of a king."— "భార్యా- A lawful wife;" (ఆప్టె.)

"సా భార్యా యా గృహే దక్షా సా భార్యా యా ప్రజావతీ,
సా భార్యా యా పతిప్రాణా సా భార్యా యా పతివ్రతా." (హితో.)

* శా. పా.— "నీరుపైకొని... నేరికైన, కోక......లోకమునకు"

"నీరు...గల్గునే = నీటమునిఁగి పోవుచున్నవాఁడు వస్త్రము వీడి కొట్టుకొనిపోయినదని చింతించునా - చింతింపడనుట'— అని. పూ. టీ.

ఈపద్యమునకు పాఠము లిట్లున్నవి.

1. 'ఇంతిపైకొనివచ్చిన నెవరికైన'. 2. "నెలఁత యటుతన్నుఁబైకొన నేరికైన లోగమనుబుద్ధిపుట్టునే". 3. 'నెలతయిటుతన్ను పట్టిననేరికైన, కోకయను బుద్ధి గలుగునే లోకమునను"

‖ శా. పా.— 'వేఁగ' (ఇదే 'వావిళ్ల' పాఠమున్ను.)

పూ ము నను, వ్రాతప్రతులలోనుగూడా 'లేఁగ' అను పాఠమున్నది. ఆపాఠమున చక్కని యుపమానమున్నది. శాస్త్రిగారిపాఠమున ఉపమానము పలాయనమైనది.

† శా. పా. 'అట్టులేఁగనెంతయుమతి యాలోఁగామిని'

లోఁ గామిని తన కాతఁడు
లోఁగామిని వంత జింతిలుచు నిట్టనియెన్. ౧౩౫

టీక.— లేఁగ = పసిదూడ, పులిచేతన్ = పులియడ్డగించుటచేత, తడఁబడి = తొట్రుపడి, ఏగెడుగతిన్; (సారంగధరుడు) అట్టులేఁగన్ = అట్లుపోగా, అతఁడు — తనకు, లోఁగామిని = లోబడకపోవుటచేత, కామిని = కాముకురాలయిన చిత్రాంగి, లోన్ = మనసులో, కినుకన్ = కోపముతోను, వంతన్ = దుఃఖముతోను, చింతిలుచున్ - ఇట్టనియెను.

క. ఎటువంటి †సుగుడి వయ్యో?
యిటువంటిదె రసికముద్ర యేఁగెను పై దు
ప్పటి విడిచి, నేర్పు చెలి ‡నేఁ
చుటె? మఱి నీయంగ మెల్లఁ జూపితివిగదా! ౧౩౬

టీక.—ఎటువంటి సుగుడివి = ఎంతటి యోగ్యుడవు? (అని హేళన) రసికముద్ర = రసిక లక్షణము. నేర్పు - చెలిన్ ఏఁచుటె = స్త్రీని ఉడికించుటయే నా? నీ అంగమెల్లన్ = నీవిధమంతయును (పైవలువ తొలగవిడిచి నీశరీరమంతయును— అనియు.) చూపితివిగదా!

క. *ఓరి, మదినిల్ప నోపక
కోరిక నినుఁబట్ట ♦నోరికోలఁదులు †మిగులన్

---

ఈపాఠమున అర్థముసరిగా సనిపడుటలేదు.— 'అట్టులేఁగ వెంతయుఁ గినుకన్' అనుసాధుపాఠము, పూ. ము. నను, వ్రాతప్రతులలోనుగూడా ఉన్నది.

† శా. పా.—'సుగుణి' (ఈరూపము సాధువుకాదు. చూ. ౨—౧౧౫ క్రింద.)

‡ పాఠాం.—'నేఁచుటకే' (పూ. ము.) 'మించుటె' (తంజ. పా.)

* ఈపద్యము శాస్త్రిప్రతిలోలేదు. పూ. ము. నను, పెక్కువ్రాత ప్రతులలోను ఉన్నది. దీనికిమూలము నవనాథచరిత్రమున నిట్లున్నది.

ఓరిమానమునిలుప నోపక నిన్నుఁ గోరిపట్టిన నో (ర?) రి కోలఁదులు పలికి
........విరహాగ్నిఁదోఁచి.” (పుట. 51.)

♦ పాఠాం.—'నోర' † 'కర్ణకూరములు - పదరి'

గూరిముగ వదరి నన్నుం
జీరికిఁ గొనకేఁగె దేల ‡చెడిపోయెదరా? ౧౩౬

టీక.— నోరికొలఁదులు = నోటికివచ్చిన దుర్భాషలు, వదరి = కూసి, ఏగెదు = పోవుచున్నావు. ఏలచెడిపోయెదు = వృథాగా ఎందుకు చెడిపోతావు. రా = రారా, (నీవిట్లు నన్ను తిరస్కరించి పోవుట మంచిదికాదని బెదరింపు)

క. ఆరోపింతును నాపై
నేరము విపరీతముగను నీపై, రారా
¶ యూరక యిఁకైన రాజకు
మారక, నామాట వినుట మంచిది సుమ్మీ. ౧౩౭

శా. ఔనా, పోయెదవా ననుం గడచి? యేలా యింక నీతోడ? నెం
తే నేమించఁగ నాడఁ జిక్కె నిదిగో నీయంగమచ్చంబు నా
చే, నీలోనన రాజు రావలెఁ గదా; చెక్కింతు నీ కీలుకీల్,
గానీ, యిందుల కేమి తాళు, మని కేలన్ జొమ్ము తాటించుచున్.

టీక.— ననున్ - కడచి = నామాటనతిక్రమించి, పోయెదవా? ('కలచి' అనుపాఠమున. 'నన్నుక్షోభపెట్టి' - అనియర్థము.) ఏలాయింకనీతోడన్ = ఇక నీతోనాకెందుకు? ఇదిగో, నీయంగమచ్చంబు = నీగుర్తు. ఎంతేన్ - నేమించఁగన్ ఆడన్ = చక్కగా నిశ్చయించుటకును - వాదించుటకును, నాచేన్ చిక్కెన్ = నాచేతికి దొరికినది.— ఈలోననే = ఇంతలోనే, రాజురావలెగదా; (జాతీయము. ఆతడురాగానే) నీకీలుకీల్ = నీప్రతియవయవమును, చెక్కింతున్ = ముక్కలుముక్కలు చేయింతును.

‡ 'సిగ్గతితోరా;' 'సిగ్గరివోరా.'

¶ శా. పా.— 'యూరకె' 'యూరకికనైన' పూ. ము.; 'యూరక' తంజ. తాళ. పా.

పద్యమున 'యూరక - మారక' అని ప్రాసయమకము కావున 'యూరకే' - యూరకిక, అనుపాఠములు గ్రాహ్యములుకావు.

క. సారెఁ బగ చాటి పలుకం
గా రిచ్చల విఱిగి పోవఁ గాఁ ళ్ళాడక యా
భూరమణసుతుఁడు సద్గుణ
హారుం ‡డట నిలిచి యిట్టులను బటుబుద్ధిన్. ౧౩౯

టీక.—♦రిచ్చలన్ = వితాకుచేత విఱిగి = దిటవుచెడి, సద్గుణహారుఁడు = *మంచి గుణములే హారములుగాఁగలవాఁడయిన, భూరమణసుతుఁడు = రాజకుమారుడు — సారంగధరుడు.

గుణములను హారములుగా చెప్పవచ్చును. ఒక్క ప్రయోగము.—

సీ. 'అణిమాది గుణమణి' హారమ్ములురమున
హారంబుగా నిడఁగోరువారు.' (నన్నె. కుమా.)

---

‡ శా. పా.—'అటనిలిచి' (అటనిలిచి' పూ. ము.; తంజ. పా.)

♦ పూ.టీ.—'రిచ్చలు విఱిగి = విస్మయములడఁగి.'

'రిచ్చ' యనగా 'నిశ్చేష్టత' గాని 'విస్మయము' (ఆశ్చర్యము) కాదు. శ. ర. కర్త 'ఱిచ్చ' యని అలఘురేఫముతో పఠించి 'నిశ్చేష్టత' అనియే యర్థము చెప్పినాడు. బ్రౌణ్యమున; 'రిచ్చ- Horror, terror, stupefaction. నిశ్చేష్టత్వము. దిగులు. వితాకు. మ్రానుపాటు' అనియున్నది. రిచ్చకు, ఆశ్చర్యమను అర్థమున్నను - 'ఆశ్చర్యము అడగుటచేత పోవ గాళ్లాడకపోవుట' లోకానుభవ విరుద్ధము. కావున, పూ. టీ. సరియైనది కాదు.

ధైర్యముచెడు - అనునర్థమున 'రిచ్చలవిరుగు' అనుజాతీయము నెల్లూరు మండలమున వాడుకలోనున్నది. (విచ్చలవిరిగి' అని గుంటూరు మండలమునవాడుక.) 'రిచ్చలన్ = వితాకుచేత, విరిగి = ధైర్యముచెడి' అని సరియైనయర్థము.

"విరుగుట - To fail, to be defeated, counteracted." (బ్రౌను.)

పూ. టీ.—'మంచిగుణమే హారముగా గలవాఁడు.'

సారంగధరునికి గల మంచిగుణము ఒక్కటేగాదు; ఎన్నోయున్నవి. మరి పూ. టీ. కర్తలు 'గుణమే - హారముగా' అని యేకవచనముగా చెప్పుటకు కారణమేమి? ఏమంటే!— 'సద్గుణహారః' అను సమానమున గుణశబ్దము హారశబ్దముకూడా ఏకవచనముననే కనబడుచున్నందున, ఆగుణమును - హారమును, ఒక్కొక్కటియే అయ్యుండవలెనని వారికొకభ్రాంతి. అందువల్ల వారు ఇంకచాలతావులలో

క. ‘తల్లీ, నాపై నీకుం
జెల్లునె కోపంబు? మదన శిత శర పాళీ
♦ హల్లక నిహతి వ్యథచేఁ
దల్లడపడి పట్టితిమాఱు తగవా పూనన్? ౧౪౦

టీక.— మదన... వ్యథచేన్.—మదన = మన్మథునియొక్క, శిత = వాడి

---

ఈతప్పుచేసినారు. (చూ. ౧౫౨; ౧- ౮౭; 3—౧౪౨.) ఈతప్పు వారి యితర టీకల లోను జరిగియున్నది:— ఒక్కయుదాహరణము.

“కీలాభ, లోలజిహ్వారుణ లోచనంబగుచుఁ
గ్రాలెడుఫణము భీకరముగా ముడిచి.” (గౌ. హ. పు. 204)

‘కీలా = జ్వాలవంటి. ఆభ = ప్రకాశముకలదైన. లోల = చలించుచున్న జిహ్వా = నాలుకయును, అరుణలోచనము = ఎఱ్ఱనికన్నును కలది.’ అని వారిటీక.

పాముకు నాలుకలురెండు. అది ద్విజిహ్వము. అన్నిజంతువులకువలెనే దానికిని కన్నులురెండు. మరి టీకాకర్తలు ‘చలించుచున్న నాలుకయును- ఎఱ్ఱనికన్నును కలది’ అని ఆ పాముకు ఒక్కనాలుకను- ఒంటికంటిని చెప్పుటకు కారణమేమో పాఠకులు పరిశీలింతురుగాక.

♦ శా. పా.— ‘హల్లీసక నిహతి వ్యథ.’ (ఇది పూ. ము. పా.) ‘శరపాళీ= బాణ సమూహముయొక్క, హల్లీసక = నటనముయొక్క, నిహతిన్= కొట్టుటచేత నైన, వ్యథన్ = బాధచేత.’ అని పూ. టీ.

‘హల్లీసక’ మనగా కోలాటము.—

సీ. ‘ఆట యంచనఁగ నాట్యం బొప్పుఁ గోలాట
మనఁగ హల్లీసకం బలరుచుండు.’ (ఆం. భా. 1—130.)

‘మండలేన తు యన్నృత్తం హల్లీసక మితి స్మృతమ్,
ఏక స్తత్రితు నేతా స్యా ద్గోప స్త్రీణాం యథా హరిః” (హేమచంద్రుడు.)

బాణములయొక్క కోలాటమనగా అర్థమేమి? ఆకోలాటముకొట్టుటేమి? పూ. టీ. వారు పూ. ము. లోని అపపాఠముమీదనే ఆధారపడి అతుకని యర్థము చెప్పినారు. సరియైన పాఠము తంజ. ప్రతులలోనున్నది.

ర్మైన, శరపాళీ = బాణజాలమయిన, హల్లక = చెంగలువలయొక్క, ❡ నిహతి = దెబ్బవలని, వ్యథచేన్ = బాధచేత, తల్లడపడి = తహతహనొంది, వట్టిదూఱు = ఉత్తనింద, పూనన్ తగవా = వహించుట తగునా?

తల్లీ కామబాధకు తాళలేక అక్రమముగా నన్నరికట్టి అడియాసలచే నెందుకల్లరిపాలయ్యెదవు. నేను నీకు వశుడను కాను. ఈ యుద్యమమునుండి విరమింపుము. అని. తా.

మ. ఇపు డీ వాఁడు భయంకరోక్తులకుఁ గా నే లోఁగి ♦దుర్వృత్తి న
ల్పపుసౌఖ్యం బగు నీమనోరథము †దీర్పం బూనినన్, లోకమం

---

❡ పూ. టీ.—'నిహతిన్ = కొట్టుటచేతనైన.'

(a) 'నిహతివ్యథ' అను సిద్ధసమాసములోని 'నిహతి' ని వేఱుపరచి దుష్టాంతముచేయుట తప్పు. (b) 'నిహతిన్' అను ద్వితీయాంతరూపమునకు 'కొట్టుటచేనైన' అని విశేషణార్థము చెప్పుట సాహసము. (c) 'నిహతి'- 'వ్యథ' అనివ్యస్తపదములుగా చెప్పుటచేత గణభంగము. కావున సర్వవిధములను పూ. టీ. దుష్టము.

♦ శా. పా. 'దుర్వృత్తి.'—కాగితపు వ్రాతప్రతిలో 'ర్వ్వ' అనియున్నది. ఆవ్రాత తప్పని శాస్త్రిగారు 'వృ' అని సవరించినారు. సవరణయును తప్పే. ఎట్లనగా? వలపలగిలక (ృ) రేఫ చిహ్నము. దానిని వకారమునకు వలపల (=పిమ్మట) నుంచి 'వర్' అనివ్రాసి 'ర్వ' అని యుచ్చరించుట ప్రాచీనకాలపుపద్ధతి. ఆ పద్ధతి సరియైనదికాదని అప్పకవి యిట్లు విమర్శించియున్నాడు.

తే. 'మొదల రేఫాక్షరంబు నాపిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ జదువుకొనుచు
ముందు జడ్డయు వెసరేఫమునకు బదులు
*గిలుక లిఖియించియు వచింతు రిలఁగుమతులు.'

మగువారిప్రతి.— పుట. 52.

† 'వావిళ్ల': పా.— 'దేర్పఁబూనినన్.'— మనోరథము తీరుట, తీర్చుట, కలదుగాని తేరుట, తేర్చుట, యొందునులేదు. కావున ఆపాఠ మసాధువు.

---

* 'గిలక విభజించియు లిఖింతు రలఘుమతులు' అని సూ. ని. పాఠము. (చూ. గిలక.)

దపకీర్తింబడి మీఁదఁ జెల్లి *యమబాధానీకముం జెంది హీ
నపు ‡జాతిం మదిఁ బుట్టఁగా వలయుఁ గాంతా పెక్కువేలేండ్లిలన్.

టీక.—బాధా + అనీకము = బాధల సమూహము (అనేక బాధలు.)

గీ. అట్లగుటకంటె నిఁక విన నమ్మ యొకటి,
జగతిలోఁ గీర్తి వెలయఁగాఁ దెగువమీఱి
నీకు రాజున కింపు ♦ సంధిల్లఁజేత
కియ్యకొని యుండ † నటమీఁద నీశ్వరాజ్ఞ. ౧౪౨

టీక.—జగతిలోన్, కీర్తివెలయఁగాన్ = నాకు మంచిపేరు వచ్చునట్లుగా నీకున్-రాజునకున్, ఇంపు- సంధిల్లఁజేతకున్ = వన్నె- వాసి, కలుగజేయుటకు, తెగువమీఱన్- ఇయ్యకొనియుండన్ = ఎన్నికష్టములువచ్చినను రానిమ్మని- సాహసించి, నిశ్చయము చేసికొనియుంటే, అటుమీఁద నీశ్వరాజ్ఞ = పైన భగవంతు డెట్లుచేసినను సరే.

ఉ. కావక రాజు చిత్తము వకావక లై తెగఁజూచునట్టు లా
హా! విపరీత మైనపలు కాడెద నంటివి, మున్ 'వినాశకా

---

* శా. పా.—'యమబాధన్ నిక్కముం జెంది.'— 'బాధన్' చెందుట, సరేగాని 'నిక్కమున్ చెందుట'యనగా నేమో? (పూ. టీ. లేదు) అది యట్లుండగా- 'బాధన్' అనుపాఠమున యతిభ్రంశముకూడా ఉన్నది. పాపము! శాస్త్రిగారు గుర్తింపలేకపోయినారు. (చూ. ౧-౯౨) పూ. ము. నను, మద. తంజ. ప్రతులలోను 'బాధానీకమున్ జెంది' అని చక్కనిపాఠమున్నది.

‡ శా. పా.— 'యోని.' .- పూ. ము. నను, మద, తంజ. వ్రాతప్రతులలోనుగూడా, 'హీనపుజాతిందుది' అను పాఠమేయున్నది. మూలమునను "జముని, దూతలచే నొచ్చి తుదివచ్చి హీన, జాతిఁ బుట్టుటకంటె జగములోన్." (నవనాథ. పు. 51) అనియేయున్నది.

♦ శా. పా.—'సంధిల్లుచేఁతకు.' ('సంధిల్లఁజేతకు' అని పూ. ము. పా.)

'చేఁత' ఇంపును 'సంధిల్లఁజేయునది' కావలెగాని 'సంధిల్లు'నది యగు టెట్లు? "సంధిల్లు" అ. క్రి. (చూ. శ. ర.)

† శా. పా.—'అటుమీఁద.' ('అటుమీద' సాధురూపము. చూ. ౨౮3.)

లే విపరీతబుద్ధి' యని లెస్స బయల్పడఁ జెప్పినారె కా;
*నీ విధి యాడుమీా యనఁగ నీవిధి నాడెదు సుమ్ము భామినీ. ౧౪౩

టీక.—కావక = మన్నింపక, తెగఁ జూచునట్లు = నన్ను - చంపునట్లు, వినాశకాలే విపరీతబుద్ధిః = చెడిపోవు కాలానికి చెడ్డబుద్ధిపుట్టును, అని. చెప్పినారె కా = పెద్దలుచెప్పియే యున్నారుగదా! నీవిధి = నీప్రారబ్ధకర్మము. ఆడుమీా- అనఁగన్ = ఆడవలసిన దని ప్రేరించుటచేత, ఈవిధిన్ = ఈవిధముగా, ఆడెదు = పలుకుచున్నావు, (ఇక్కడ ఆడుట యనగా మాటలాడుట యనియు, వేషాలు పడుట యనియు, రెండర్థములు.)

క. నీకపటోక్తులె పట్టి మ
హీకాంతుం డలిగె నేని యీా ధాత్రిణి య
య్యాకాశవాణి యెఱుఁగరె?
నీ కా కొల తోడుతోడనే సిద్ధించున్.' ౧౪౪

టీక.—పట్టి = ఆధారముగాగైకొని (= నమ్మి). ఆకొల = ఆపాపము, తోడుతోడనే = వెంటనే, నీకున్, సిద్ధించున్ = ప్రతిఫలమును ముట్టజెప్పును.

గీ. అని పలికి, పోయి వచ్చెద ననుచుఁ జక్కఁ
దన నగరి కేఁగి యువరాజు తగినరీతి
దొరల భృత్యుల సఖుల నందఱను బనిచి
తుందుడుకు డెందమునఁ జాల సందడింప. ౧౪౫

టీక.—దొరలను = సామంతులను, అందఱను = అందరిని, తుందుడుకు = కలతపాటు, సందడింపన్ = అతిశయింపగా.

సీ. పట్టు పాఱు మటంచుఁ బారావతంబును
వెకలినై నేనేల విడువఁ బోతి?
విడువమా యన్నాళ్లు విడిచినఁ‡నది పోయి
యేటికిఁ జితాంగియింట వ్రాలె?

*ఈపాదమున యతి విచార్యము. ‡పాఠాం.—'నేఁడది'

వ్రాలిన నది యట్టె వఱదఁ బోనిమ్మని
యూరక యేమిటి కుండ నైతిఁ?
జనవుపై నుండక పినతల్లి యని పోవఁ
జెడుగుణం బామెకుఁ బొడమ నేల?
గీ. పొడమెఁ బో యిది బుద్ధిగా దుడుగు మనిన
మాన కిటువలెఁ జెల్లునే మచ్చరింపఁ?
గారణం బిన్నిటికి నల్లపావురమొ క
దా! య దెక్కడఁ దాఁపురమాయె *నాకు! ౧౪౬

టీక.—పట్టు - పాటు మటంచున్ = (ఇది జాతీయము) భారబూరు మని; వెకలినై = తెలివిమాలినవాడనై. అట్టె వఱదఁబోనిమ్మని = పోతేపోయె లెమ్మని. నాకు, అది = ఆ పాడుపావురము, ఎక్కడదాపురమాయెన్ = ఎక్కడ తటస్థించెనురా- భగవంతుడా అని, విసుగును తెలుపుమాట.— "యీ మొగుడు నాకెక్కడ దాపరమైనాడు. How was I so unhappy, as to have this husband? = తటస్థమైన" (బ్రౌను.)

క. మాయు నెటులైన మీఁదట
నాయనుబాధలను బడుట యది నిశ్చయమే;
మాయ నెటులైన మీఁదట
నా యను బాధలను బడుట యది తప్పెఁ గదా. ౧౪౭

టీక.—మాయన్ = తల్లియొక్క కపటకృత్యముచేత, మీఁదటన్= నేడో రేపో, ఆయమ-బాధలను = ఆయమ్మ - చిత్రింగి పెట్టుబాధలను, పడుట = అనుభవించుట, అది నిశ్చయమే. కాని. †మాయన్ = మరణింపగా, మీఁదటన్ =

* పాఠా.—'దనకు'

†పూ. టీ.—'మాయన్ = కపటముచేత'

పూ. టీ. వారు రెండు 'మాయులు' ను విశేష్యములే యనుకొన్నారు. ఈ మాయ క్రియగాని విశేష్యము కాదు. మాయు = నశించు, (సూ. శ. ర.) 'ఓరి నీమచ్చమాయా!' అని లోకమున సాధారణమయిన తిట్టు.

పిమ్మట, ఆయమబాధలనుపడుట = † ఆ యమునివలని బాధలనుపడుట - తప్పినది గదా!

గీ. అని ప్రమోదించు, నుసు రను, నలఁతఁ గుందుఁ,
గుడిచి కూర్చుండి తన చేసికొనిన నేర
మికి వగచుఁ, బొన్పుపై వ్రాలు, మిన్నువిఱిగి
పైఁ బడినరీతి * నివ్వెఱపాటు నొందు. ౧౪౮

టీక.—ప్రమోదించుఁ = (యమునివలని బాధలుతప్పినవిగదాయని) సంతోషించును, ఉసురనుఁ = (తల్లివలని బాధలు తప్పవుగదాయని) దుఃఖించును. అలఁతఁ గుందుఁ = మనోవ్యథచేత బాధపడును,— నివ్వెఱపాటునొందుఁ = నిశ్చేష్టుఁడగును.

క. మదవతికిఁ గోక చేపడి
నది మొదలుగఁ గుట్టు వాఱె యడఁకుఁ గుమారుం
డెదఁ గోనఁ; ‡ జీర చిక్కిన
యది మొదలుగ బిడ్డకుట్టులను టేర్పడఁగన్. ౧౪౯

టీక.— ‡ చీరచిక్కినయది మొదలుగన్ = గర్భమయినది మొదలుకొని, బిడ్డకుట్టులు = ప్రసవవేదన, అనుట = అని లోకమున సామెతగాననుట, ఏర్పడఁ

క. 'నేయి పాలుపటిన దీవియ
మాయుకరణిఁ గర్మశుద్ధి మలఁగిన హీన
త్వాయత్తంబై తాను
మాయును దైవానుకూల్యమహిమ మహీశా.' (భా. అను. 1-139,)

† పూ. టీ.—'యమబాధలన్ = యమునియొక్క శ్రమలను'.
నరకమున గలుగునవి యమునివలని శ్రమలుగాని యమునియొక్క శ్రమలు కావు. యముని యొక్క శ్రమలు యము డనుభవించవలసినవే గాని సారంగధరు డనుభవించుటకు వీలులేదు.

* శా. పా.—'నివ్వెరపాటు'
'నివ్వెఱ'లోని రేఫ మలఘువుగాని లఘువు కాదు. (చూ. శ. ర.)

‡ పూ. టీ.—'చీర...లనుట = చూలయినది మొదలు వేవిళ్ళనుట.'

గన్ = నిజమే కాగా, కుమారుఁడు= సారంగధరుఁడు, పడఁతికిన్=(యౌవనమదము కలదియైన) చిత్రాంగికి, కోకచేపడినది మొదలుగన్ = తన యుత్తరీయము చిక్కిన దాదిగా, [1]కుట్టుపాటి = కలతయేర్పడి, ఎదలోనన్ = చిత్తమున, అడలుచున్ = భయపడ దొడఁగెను.

చీరచిక్కినది మొదలు బిడ్డనొప్పులు, అనిసామెత. 'తదేక చింత'యని ఆ సామెతకు లక్ష్యార్థము. (చీరచిక్కుటయనగా గర్భమగుట; గర్భమయిన పదినెలలకుగాని బిడ్డనొప్పులురావు అట్టి నొప్పులను, నెలతప్పిననాటినుండియే భావించుట= తదేకచింత,) ప్రకృతమున, చిత్రాంగిచేతికి నిజముగా చీరయే (ఉత్తరీయము) చిక్కుట, అదిమొదలుకొని (సారంగుని మనసున) కుట్టుకలుగుట, ద్వారా, ఆ సామెతకు వాచ్యార్థము కలుగ జెప్పుట చమత్కారము.

'చీరచిక్కుట' నిఘంటువులలో లేదుగాని కావ్యములలోనున్నది.-

చ. 'కులమణియైన యన్నెలతకున్ మసలెన్ నెల, చీరచిక్కె.' (రామా. 3-9)

క. 'నెల మసలెం జీరచిక్కె నెలఁతకు నధిపా.' (భాగ. 8-493.)

---

బిడ్డకుట్టులను వేవిళ్ళనుకొనుట గొప్ప ప్రమాదము.— "బిడ్డకుట్టు = (ప్రసవవేదన, ఆమనస్యము. వేవిళ్లు = భక్షణవస్తు వాంఛాతిశయరూప గర్భలక్షణవిశేషము." (శ. ర.)

"బిడ్డకుట్టు – The pains of parturition. వేవిళ్ళు – The longing, laziness, and other affections of a pregnant woman - గర్భిణీ స్త్రీ యొక్క వాంత్యాది వికారములు." (బ్రౌను.)

'గొడ్రాలే మెరుగురా బిడ్డనొప్పి' (కుట్టు) అని లోకమునసామెత.

క. 'కీలెఱుఁగక చెఱిచెను విధి
కూళయి గొడ్రాలు బిడ్డకుట్టే మెఱుఁగున్.' (వైజ. 3-126)

సీ. 'గొడ్రాలెఱుంగునే బిడ్డకుట్టనుట మా
న్పింపవా వంధ్యకు నిసువొసంగి.' (రాజ. విజ. 1-86.)

చ. 'చెలువకు బిడ్డకుట్లు విలసిల్లఁగ భిల్లపురంధ్రులంతలోఁ
బిలువరె మంత్రసాని.' (కాశీ. మా. 4-7.)

[1]పూ. టీ.—'కుట్టు = వేదన, పాటి = వ్యాపించి.'

'కుట్టుపాటు' క్రియగాని 'కుట్టు' వేరు, పాటు' వేరు కాదు. గడుసుపాటు, మొద్దుపాటు, తెల్లవాటు, పండఁబాఁటు, మొదలగు క్రియలలోని 'పాటు'ను వేరుపరచి యర్థము వ్రాయుట సంప్రదాయము కాదు.

గీ. అంతఁ జిత్రాంగి మదనబాణాగ్ని వేఁగి,
హస్తగత మైనసొమ్ము పోనాడుకొన్న
కరణిఁ బరితాప మంది, యేసరణి నైనఁ
జెఱుతు సారంగధరు, నింక సిద్ధ మనుచు. ౧౫౦

టీక.—మదన బాణాగ్నిన్ = మన్మథునిబాణముల వేడికి, వేఁగి = తపించి. హస్త...కరణిన్ = చేతికి చిక్కినసొమ్మును పోఁగొట్టుకొన్నట్లు పరితాపమంది, ఏసరణినైనన్ = ఏవిధముననైనను - చెఱుతున్ = చెడగొట్టుదును (బాధలు పెట్టుదును) సిద్ధము = తప్పదు.

సీ. పాయని యపకీర్తి ప్రాపించుఁ దన కన్న
పోలిక నల్లనిమైల గట్టి,
తల చూపఁ బాసె నందఱిలోనఁ దన కన్న
కైవడి వాసెనకట్టు కట్టి,
తనుఁ ద్రోయుదు రగాధ † ఘనకూపమున నిట్టు
లనుభాతి మూలయింటను వసించి,
తనదేహ మిటులఁ జిందఱ లౌ ననెడురీతిఁ
గులుకుగుబ్బలు వాఁడిగోళ్ల వ్రచ్చి,
గీ. యెంతపాపాత్ము రాలని *యిటులనింక
బ్రహ్మ నిజఫాలఫలకాక్షరములు గట్టి
‡పెట్టునన్నట్లు కస్తూరిపట్టు వెట్టి,
సొటసొటలు వోవు విన్ననై సొంపు దఱిఁగి. ౧౫౧

టీక.—అపకీర్తి = చెడ్డపేరు; నల్లనిమైల = నల్లగామాసినగుడ్డ; (అపకీర్తి నలుపని కవిసమయము.—'శుక్లత్వం కీర్తిహాసాదౌ, కార్ష్ణ్యం దుష్కీర్త్యఘాదిషు.' కా. క. ల.) వాసెనకట్టు = తలమూయగట్టు నట్టికట్టు; అగాధ ఘనకూపమునన్ =

† శా. పా.—'దుసుగ దాఘన...'.—* 'యింకమీఁద.'
‡ 'పెట్టునటుల'

మిక్కిలి లోతయిన పెద్ద నరకకూపములో; వాఁడిగోళ్ళన్, వ్రచ్చి = చీల్చుకొని; బ్రహ్మ, ఇది యెంత పాపాత్మురాలు రా, అని భావించి, నిజ= చిత్రాంగియొక్క, ఫాలఫలక = నొసలనెడి పలకమీఁది, అక్షరములు, గట్టిపెట్టినట్లు = తుడిచి వేయునన్న విధముగా, కస్తూరి పట్టుపెట్టి = కస్తూరితో నల్లగా పట్టువేసికొని, (ఆచిత్రాంగి) విన్ననై = వెలవెలపోయి, సొంపు తఱఁగి = సొగసుచెడి, సొలు సొటలుపోవుచు = చిడిముడి పడుచుండెను.

చిత్రాంగి సారంగధరునిమీఁద నేరముమోపుటకుగా సాహసకృత్యము లు చేసికొని – వికృతపు వేషమువేసికొనె ననియు, ఆవేషము దాని భవిష్యద్దశకు సూచకముగా నుండెననియు తా.

'గట్టిపెట్టు.' కొయ్య పలకలమీఁద తేనెబలపములతో వ్రాయుకాలమున, ఆ యక్షరములను తుడుపవలసివచ్చినప్పుడు బొగ్గుపొడి, ఆకుపసరు, కలిపి ఆపలకపైని పూసెడివారు. ఆపనికి 'గట్టించుట' 'గట్టిపెట్టుట' అనిపేరు. (శ. ర. లో లేదు) "*గట్టించు - to rub out what is written (on a plank which is used in Hindu schools like a slate.") (బ్రౌను)

ఉ. "దేవి, తమోమషీరసము తేటపొసంగఁగ 'గట్టిపెట్టి' యం
కావలి వ్రాయఁగాఁదొడఁగె, నంబర సంపుటి కాంతరంబునన్
బూవిలుకాని శౌర్యగుణముల్ హరిణాంకుఁడు; ముత్తియంబులం
దావడముల్ [1]ఖచించిన విధంబున, రుక్ ఖటికా ముఖంబులన్."
(శృం. నై. 8-170.)

క. రక్తిగల చెలులయెడ నా
సక్తియు సూక్తియును లేక జాలి విరాళిన్
ముక్తాహార మనోహర
ముక్తాహార యయి క్రోధమున సౌధమునన్. ౧౫౨

---

*గుంటూరు మండలమున 'కట్టించుట' యందురు.

[1] 'రచించిన'యని శా. పా.; సరికాదు.– 'ఖచించిన' అని పూ. ము. పా.; శ. ర. పాఠమున్ను.

"ప్రబలమై యంధకారంబు బలిసియుండఁ
దారకంబులు కాంతినెంతయును బెరసె;
నీలిపుట్టంబుఁ బఱచి పై నిలిపినట్టి
వలుఁదముక్తాఫలముల తావళము లట్లు." (భీమ. 2-36.)

టీక.—రక్తిగల చెలులయెడన్ = అనురాగముగల చెలికత్తెల విషయమున, ఆసక్తియున్ = ప్రీతియు, సూక్తియున్ = వారితో మంచి మాటలాడుటయును, లేక, (చిత్రాంగి) జాలిన్ = విచారముచేతను, విరాళిన్ = విరహతాపముచేతను ‡ముక్త - ఆహార - మనోహర ముక్తాహార - అయి.— ముక్త = వదలిపెట్టబడిన, ఆహార = భోజనమును, మనోహర - ముక్తాహార = ఇంపైన ముత్యాలహారములును, కలదియై, (ఆహారమును- హారములనుగూడా త్యజించి, అన్నమాట.) క్రోధమునన్ = కోపముతో, సౌధమునన్ - (ఉల్లియుండె గా- అని అవతలికి అన్వయము.)

చిత్రాంగి, విరహతాపము చేతను కోపావేశముచేతను చెలులతో పలుకుట మాని, హారములు తీసివేసి, తుదకు ఆహారమునుకూడా మానుకొని, అలుకతో నుండెనని తా.

— రాజు చిత్రాంగికై విరాళిగొనుట —

గీ. జంత యిటులల్గియుండ, రా జంత నచట
సరసిచెంత బిసాగ్రంబు సరసి కొంత
మగని కందిచ్చుకోకిప్రేమ గని తనదు
†నుండిమెడఁ దగు లెంచి యుం డుండి యపుడు. ౧౫౩

టీక —జంత = గయ్యాళి (యైన చిత్రాంగి) ఇటులు = ఈరీతిగా, అల్గియుండన్, రాజు - అంతన్, అచటన్ = అరణ్యమున, సరసిచెంతన్ = కొలని యొద్దను; బిసాగ్రంబున్ = తామరతూటి చివరభాగమును, *సరసి = చక్క-పరచి (= శుభ్రపరిచి) మగనికి - అందిచ్చు = మగపక్షి నోటికందిచ్చుచున్న,

‡ పూ. టీ.—'ముక్త = విడువఁబడిన - ఆహార = భుక్తికలది. మనోహర = మనోజ్ఞమైన- ముక్తాహార = ముత్యాలహారము కలది.'

విరహతాపముచేత ఆహారమునే మానుకొన్న చిత్రాంగి ముత్యాలహారమును ధరించినదనుట స్వభావవిరుద్ధము. 'ముక్తాహార' - 'మనోహర ముక్తాహార' అని భిన్నసమాసములనుకొనుట పొరపాటు.

'మనోజ్ఞమైన ముత్యాలహారము - ఒక్కటే కలిగియుండె' ననుటయును పొరపాటే. సమాసమందుండిన హార శబ్ద మేకవచనమున నుండియు బహువచనార్థము నిచ్చుచుండును. (మా. ౧౩౯ క్రింద 'సద్గుణహారుఁడు.)

†పాఠాం,—'దుండి వెడ తగులెంచె నందుండి'

*పూ.టీ.—'సరసి = సర్దుకొని.'

కోకి = చక్రవాకియొక్క, ప్రేమగని. తనను దుండియెడన్ - తగులువంది = తనభార్యను తలచుకొని,

'దుండి= దొరసాని' (శ. ర.) 'అవ్వోళ దుండీ! అవ్వోయక్క'- (వీరభద్ర విజయనాటకము)

ఉ. కేలుఁ జొకాటపుం దలిరు, కేశముదాళులు, కౌనుదీఁగె లే
నూలును, జన్ను మొగ్గలు, గనుం దెలిదమ్ములు, మోవి తేనెయుం,
జాలుగునవ్వుఁదేటయు, భుజాబిసము, ల్లని యవ్విలాస పాం
చాలుఁడు ప్రేమఁ బద్మిని నిజప్రియఁగా మదిలోఁ దలంచుమన్.

టీక.— అవ్విలాస పాంచాలుఁడు = విలాసముగల - పాంచాలజాతి పురుషుఁడైన ఆ రాజనరేంద్రుఁడు, (పురుషజాతులు నాలుగు.- భద్రుఁడు; దత్తుఁడు; కూచిమారుఁడు; పాంచాలుఁడు.) కేలు చొకాటపుందలిరు = హస్తములవంటి సొగసైన పల్లవములు, కేశముదాళులు = కురులవంటి గండు తుమ్మెదలు, కౌను తీఁగె లేనూలు = నడుమువంటి (సన్నమైన) తీగెయును, చన్నుమొగ్గలు = కుచములవంటి తామర మొగ్గలును, కనుం దెలిదమ్ములు కన్నులవంటి తెల్లతామరపూలును, మోవి తేనెయున్ = అధరమువలె మధుర

---

శ. ర. కర్త 'సరసు = సరదు = సమభాగముగా పంచు' అని యర్థము చెప్పి, అందుకీ పద్యమునే యుదాహరించినాడు, కాని అది సరియైన యర్థము కాదు. సమభాగముగాపంచిన పిమ్మట 'కొంత' యిచ్చుటేల? 'శుభ్రపరచి - అందులో కొంత యిచ్చెననుట యుచితము కాదా.? బ్రౌను, "సరసుట- సరదుట- To make even; level. To arrange. సమముచేసుట." అనియే చెప్పినాడు. కావున 'సరసి = సరది = సమభాగముగాపంచి' అనుట సరి కాదు.

పూ. టీ. కర్తలు శ. ర. లోని 'సరదు' నే అందుకొని దానిని ఉకార మధ్యము గావించి - 'కొని'ని చేర్చి 'సర్దుకొని' అన్నారు. పొరపాటు. సరసి = సర్ది, గాని 'సర్దుకొని' కాదు. 'సర్దు'- 'సర్దుకొను' అను క్రియల కర్థమున నెంతో భేదమున్నది. క్రియాఫలంబు కర్తృగామి యగునప్పుడే గాని 'కొను' ముఖ్యధాతువున కనుప్రయుక్తము కాదు. (చూ. బాల. క్రి. 52.) పూ. టీ. కర్తలు బ్రౌణ్యమును చూచియున్నను సర్దు- సర్దుకొనుల భేదము తెలిసియుండెడిదే. అందిట్లున్నది.—
"సరుదుట. చాలీచాలకవుండేదాన్ని నలుగురికి సమముగా పంచిపెట్టుట.— సరుదుకొనుట- చాలీచాలకవుండేదాన్ని తలాకొంచెము తీసుకొనుట. వారిలోవారు సర్దుకొన్నారు."

తుయిన మకరందమును, జాలు అగు నవ్వు తేటయున్ = జాలువారు నవ్వువంటి ప్రసన్నతయు (=స్వచ్ఛత) భుజాబిసముల్ = బుజములవంటి తామరతూడులును, కని = జూచి, ప్రేమన్, పద్మినిన్ = సరస్సును, నిజప్రియంగాన్ = తనప్రియురాలయిన చిత్రాంగిగా, మదిలోన్-తలంచుచున్ = అనుకొనుచు.

చిత్రాంగియొక్క కేలు చిగురాకువంటిదనియు, కేశములు గండుతుమ్మెదల వంటివనియు, కౌను తీగెవంటిదనియు, చనులు మొగ్గలవంటివనియు, కనులు తెలిదమ్మిలవంటివనియు, మోవి తేనెవంటిదనియు, నవ్వు తేటనీటివంటిదనియు, బుజములు తూడులవంటివనియు, ఆమె పద్మినీజాతి స్త్రీ యనియు, వ్యంగ్యము.

చ. *దళమగుతమ్మిపూఁగొలనితావి సెకల్ ♦గవియంగ ముంగలన్,
జిలుకలు గోయిలల్ చెవులు చిందఱవందఱ సేయ సూరెలన్,
మలయసమీరముల్ వెనుకమగ్గున నుల్కిపడం బయింబడన్,
గళవళ మంది చుట్టుకొనెఁ గంతునిమంది యటంచు నాత్మలో.

టీక.—ముంగలన్ = ముందువైపున, దళ...సెకల్ = తామరకొలనిలోని దట్టమయిన సువాసనలవేడి. కవియంగన్ = ఆవరింపగా. సూరెలన్ = పార్శ్వములయందు, చిలుకలు...సేయన్ = చిలుకలును, కోవెలలును చెవులు చిల్లులు పడునట్లు కూయగా, వెనుకమగ్గునన్ = వెనుకప్రక్కన, ఉల్కిపడన్ = జడిసి యెగిరిపడునట్లు, మలయ సమీరము, పయింబడఁగా, కళవళమంది (రాజు) తకపికలై, కంతునిమంది = మన్మథుని సేన - (కమలములతావి, చిలుకలు, కోయిలలు, మలయమారుతము - మదనుని సైన్యమే) చుట్టుకొనెను.

ఉ. అక్కట యేమి సేయుదు రయంబున నిప్పుడె పోదు నంటినా
మిక్కిలి దూరదేశము; సమీపమె? మాళవభూమిమండలం
బెక్కడ? దండకావన మిదెక్కడ? చక్కనిముద్దుగుమ్మ నా
చక్కెరబొమ్మఁ జూడ కిట సైఁపఁగఁ జాలవియోగవేదనన్. ౧౫౯

వ. అని యత్యంత సంతాపంబున నాందోళించుచు. ౧౬౦

టీక.— ఆందోళించుచున్ = ఉరియాడుచు.

---

* పాఠాం.— 'దళముగ'

♦ శా. పా.— 'కదియంగ' ('తావి దళ్లలయంగ' పూ. ము.; 'సెకల్ కవియంగ' తంజ. పా.)

క. రాజిత విభ్రమ లవ కల
నాజిత సుర మానవాంగనన్ జిత్రాంగిన్
లేజవ్వని మదిలో నిడి
రా జవ్వనిలోపలన్ విరాళిం గ్రాఁగెన్. ౧౫౮

టీక.— రాజిత = ప్రకాశించుచున్న, విభ్రమ = విలాసముయొక్క, లవ = లేశముయొక్క, కలనా = కలిమిచేత, (విభ్రమలవముచేతనేయనుట) జితఁ = జయింపబడ్డ, సురమానవాంగనన్ = దేవకాంతలు - మనుష్యకాంతలును గలదియు, లే జవ్వనియు, నైన, చిత్రాంగిని, మదిలోన్ ఇడి = మనసునతలచి, రాజు, అవ్వని లోనన్ = ఆ పుడమిలో, విరాళిన్ = వియోగతాపముచేత, గ్రాఁగెన్ = తపించెను.

విలాసలేశముచేత మానవాంగనలనేకాక దేవాంగనలనుగూడా జయించిన తన ప్రియురాలిని తలచుకొని రాజు వియోగవేదనను పొందెను, అని తా.

గీ. అట పరావనిభృన్మౌళి ఘటితపాదుఁ
డైన చక్రేశ్వరుండు సహస్రకరుఁడు
రామునిశిఖాగ్ని తేజఃస్ఫురణ హరింప
వ్రాలె నన వ్రాలెఁ జరమాంబురాశిలోన. ౧౫౯

*ఈపద్యమున సూర్యాస్తమయము అభేదాధ్యవసాయముగా కార్తవీర్యార్జునాస్తమయముతో పోల్చబడినది.

టీక.—♦అట = తర్వాత, పర అవనిభృత్ = శత్రురాజులయొక్క, మౌళి = శిరస్సులయందు, ఘటిత = కూర్చబడిన (=ఉంచబడిన) పాదుఁడు = పాదములు కలవాడును, చక్రేశ్వరుండు = భూమండలమున కధిపతియు నైన, సహస్రకరుఁడు—

* పూ. టీ. కర్తలు, 'ఈ పద్యములో కార్తవీర్యార్జునునియందు సూర్యత్వారోపణముచేసి అభేదాధ్యవసాయముగా చెప్పఁబడియున్నది' అన్నారు.

ప్రకృతమున వర్ణ్యము సూర్యాస్తమయము. కార్తవీర్యార్జునుని కథ శ్లేషసామర్థ్యముచేత ఉపమానముగా చెప్పబడినది. అంతేగాని, కార్తవీర్యార్జునునియందు సూర్యత్వ మారోపింపబడలేదు.

♦ పూ. టీ.—'అటు + అ = అట్లే'

(వేయి చేతులు కలవాడు) కార్తవీర్యార్జునుడు, రామ = పరశురామునియొక్క, విశిఖాగ్ని = బాణవహ్ని, తేజః స్ఫురణన్ = తన-పరాక్రమ విజృంభణమును,- (అధిక్షేపావమానాదేః ప్రయుక్తస్య పరేణయత్, ప్రాణాత్యయే ప్యసహనం తత్తేజ స్సముదాహృతమ్'—) హరింపఁగ = అణగింపగా, వ్రాలెన్ = పడెను, అన్నట్లుగా,—

అటు = అట్లు, అపర అవనిభృత్ = పడమటికొండయొక్క, మౌళి = నెత్తమున, ఘటిత = ఉంచబడిన, పాదుఁడు = కిరణములుగలవాడును, చక్రేశ్వరుండు = చక్రవాకములకు ప్రభువు నైన, సహస్రకరుఁడు = (వేయికిరణములుగలవాడు) సూర్యుడు, * రామ = మనోజ్ఞములైన, విశిఖ = అనేకజ్వాలలుకల - అగ్ని, ('శిఖావా

అక్కరలేని అవధారణార్థకమును చేర్చి 'అట్లే' అనుటలో సారస్యమేమీ కనబడలేదు. వారలా మార్చుటకు కారణమేమనగా? వారిదృష్టిలో 'అటు' - ఎటులు; అక్కడ - ఎక్కడలు దుశ్తప్రకృతికములు.—

క. 'మృగ శిశువుల సరిఁబెరుఁగు నాటవికిరియెటఁన్?' (శాకుం. 2-52)
భుజం. 'బృహత్ప్రీతిత్తిత్తుం డహిద్వేషి యేడన్
సహంబొప్పు నీశుద్ధసత్త్వాత్ముఁడేడన్.' (నాగా. పు. 40)

కాని, 'నా పుస్తకమెటన్?'... 'మా పిల్లవాడెక్కడన్' అనుట సంప్రదాయము కాదు.]

కావున 'అటన్ - పరావనిభృత్' = అటఁ బరావనిభృత్, కావలసి వచ్చును. అప్పుడు - 'అపరావనిభృత్' అను అర్థాంతరమున కవకాశము లేకపోవును. అందుకలన వాగలామార్పు చేయవలసివచ్చినది. కాని నిజానికి 'అట' కళ గాని దుశ్తప్రకృతికము కాదు. భారతాది ప్రాచీన కావ్యములలో, అట - ఇట - ఎటలు కళలుగానే ప్రయుక్తములైయున్నవి. అసలు చేమకూర కవిమతమున 'అటు' కళ గాని దుశ్తప్రకృతికముగాదు.— సీ. "అటకలియిడెలెస్స - అటకలికియొకర్త"- (మా. పద్య. ౧-3) కావున 'అట - అపరావనిభృత్; అటు - అపరావనిభృత్' అను విభాగమే కవి యుద్దేశించినది.

మ.రా.—పూ. టీ. వ్రాతప్రతిలో 'అట = అమీదటను, పరావనిభృత్' అని సరిగా నేయున్నది. అది తప్పనుకొని శాస్త్రి గారు వైరీతిగామార్చినారు.

* పూ. టీ.— 'రామ = మూఁడైన, విశిఖ = గొప్పజ్వాలలుగలిగిన, అగ్ని.'

నాశుకుత్కుణిః - అను.) తేజః స్ఫురణన్ = తన ప్రకాశవ్యాప్తిని, హరింపన్ = గ్ర
హింపగా, చరమ అంబురాశిలోన్ = పడమటి సముద్రములో, వ్రాలెన్ =
పడెను - (=అస్తమించెను.)

శత్రురాజులచే మ్రొక్కబడిన పాదములు కలవాఁడును, భూమండలాధిపతి
యునైన కార్తవీర్యార్జునుఁడు పరశురాముని బాణములదెబ్బకు తన పరాక్రమమును
కోలుపోయి రణరంగమున పడిపోయినవిధముగా,పడమటికొండనెత్తమున నెలకొన్న
కిరణములుకలవాఁడును, చక్రవాకములకు ప్రభువునైన సూర్యుఁడు, అగ్నిచే తన
తేజమును కోలుపోయి, పడమటి సముద్రమున పడెను.

దినాంతమున సూర్యునితేజస్సు అగ్నియందు ప్రవేశించును. అందుకు 'ఆది
త్యోవాస్తమయన్నగ్ని మను ప్రవిశతి అగ్నింవా వాదిత్యస్సాయం ప్రవిశతి'- అను
శ్రుతి ప్రమాణము.

మ. తమి మాందేహులతోడఁ బోరి యిరుఁ డంతన్ స్రుఁగి తన్ జేర, న
స్తమహీభృన్మణి వెన్క వేసికొని మిత్రప్రేమ రక్తప్రవా
హముగాఁ *బోరె ననంగఁ, జిక్కె యల దైత్యశ్రేణి కాన్పించుకుం
డ మొగుల్మాయలు వన్నెనాఁ, దనరెఁ జూడన్ †సంజక్రొంజీఁకటుల్.

---

అగ్నికిగల జ్వాలలు 'మూఁడే' అనుటకు ప్రమాణము మృగ్యము. 'విశిఖ'
శబ్దములోని 'వి' అనేకార్థకము.

*శా.పా.—'పోరెననంగఁజిక్కె, యల...'-వారు భావించిన యర్థమేమో
మనకు తెలియదు.

† శా. పా.— 'సంజ కెంజీఁకటుల్' (= 'సాయంకాలముయొక్క యెఱ్ఱ
చీఁకటులు' - అని, పూ. టీ.)

ఎఱ్ఱని చీకటులు ప్రకృతిలోలేవు. చీకటి యెఱుపన్నచో కన్నులున్నవారు
నమ్మరు. 'చీకటి యెఱుపు.'- 'చీకటి తెలుపు' అను పెద్దలు భావికాలమున ప్రభ
వింతురని ముందుగనే అనుమానించి, 'కృష్ణాని, కుహూ శస్త్రీగురు పాప తమో
నిశాః.' అని, వ్రాసిపెట్టిపోయిన మహానుభావునికి, కావ్యకల్పలతాకర్తకు, దేవేశ్వర
మహాకవికి పదివేల వందనములు. సంజ యెఱుపనియు, చీకటి నలుపనియు, పూ.
టీ. కర్తలు కావ్యములయందైనను చూచియుండరా?
ఒకటి రెండుదాహరణములు.—

టీక.—ఇనుఁడు = సూర్యుడు. (ఒకానొకరాజు, అని-అర్థాం.) ♦తమిన్ = విజయోత్సాహముతో, మందేహులతోడన్ = మందేహులను రాక్షసులతోడ (ఉదయ మధ్యాహ్న సాయంసంధ్యలయందు మందేహులను రాక్షసులు సూర్యు నడ్డగింతురనియు, బ్రాహ్మణులు వదలు అర్ఘ్యప్రదాన జలములచే నడగుదురనియు శాస్త్రము.— 'మందేహా దేహా నాశార్థ ముదయే స్తమయేరవిః, సమీహాతే ద్విజో త్సృష్ట మంత్రి తోయాంజలి త్రియమ్.'- స్కాందము.)—' మంద + ఈహా = మందేహా – అల్పాభీష్టులు (= నీచులు) అయిన, శత్రువులతో, అని, (అర్థాం.) పోరి = యుద్ధముచేసి, వీఁగి = ఓడిపోయి, తన్ చేరన్ = తన్నాశ్రయింపగా, అస్తమహీభృత్ మణి = కొండలలో మేటియైన అస్తపర్వతము(అస్తనామకుడైన రాజశ్రేష్ఠుడు, అని. అర్థాం.) మిత్త్రప్రేమన్ = సూర్యునియందలి ప్రీతిచేత, (చెలికానియందలి ప్రీతిచేత, అని - అర్థాం.) వెన్కవేసికొని = తనమరుగున నుంచుకొని;—సూర్యుడు పడమటి కొండవెనుకకు పోయినాడని, భా. 'వెన్కవేసికొని' = (జాతీయము) రాజుపక్షమువహించి = ఆతనికి బదులు తానే యుద్ధమునకు పూనుకొని, అని అర్థాం.) రక్తప్రవాహముగాన్ = నెత్తురు వరదలైపారు

గీ. 'సంజ కెంపును తిమిరంపు జంపునలుపు
గమిచి బ్రహ్మాండ భాండంబు కరము మెఱసె;
పరమ పరిపాకదశ వృంత బంధమెడలి
పతనమగు తాటి పండుతోఁ బ్రతిఘటించి.' (భీమ. 2-80.)

క. 'సగపాలు సాంధ్యరాగము
నిగిడిన కెంజాయఁ దనరి సెఱ చీఁకటిచే
సగపాలు నలుపు నొందుచు
గగనము గురువెందగింజ కైవడిఁ బొల్చెన్.' (చిత్రభా. 6-107)

సంధ్యాకాలమున తలచూపునవి 'క్రొంజీకటులు' గాని కెంజీకటులు కావు.-

మ. "పటుపాథోలవధార‡తార లెసఁగం దద్బింబు సందానితో
త్కటు సంధ్యానల ధూమ కందళములై కన్పట్టెఁ గ్రొంజీఁకటుల్."
(వసు - 4-10.)

పూ. ము. నను, వ్రాత ప్రతులలోనుగూడా 'క్రొంజీకటుల్' అనుపాఠమున్నది. 'తనరె సంధ్యారాగమున్ ధ్వాంతమున్' అని, పాఠాం.—

♦పూ. టీ.—'తమిన్ = రాత్రియందు'

‡'తారలెగసెన్' అని వావిళ్ళ. పా. విచార్యము.

నట్లు, పోరెననంగన్ = యుద్ధముచేసెను కాబోలు నన్నట్లుగను; ఖలదైత్యశ్రేణి = ఆ మందేహారాక్షసులమూక, (శ్రేణి సమూహము, అని అర్థం.) చిక్కి = పట్టువడి (=రాజునకు దొరకి) కాన్పింపకుండన్ = తమపాలకున ఖైదికగపడకుండునట్లు, మొగుల్మాయలు = మాయమబ్బులు, పన్నెనాన్ = కల్పించెను కాబోలు నన్నట్లుగను, సంజ = ఎఱ్ఱని సంధ్యాకాంతియు, క్రొంజీఁకటుల్ = క్రొత్తచీకటులును, తనరెన్ = ఒప్పెను.

ప్రొద్దుపడమటి కొండచాటుకు పోయెను. అంతట సంధ్యారాగమును దాని వెనుక చీకటులును వచ్చెను. ఎఱ్ఱని సంధ్యాకాంతియు, నల్లని చీకట్లును ఎట్లుండె ననగా? సూర్యునికిని మందేహులకును సాయం సమయమున జరుగు యుద్ధమున అస్త్ర

---

వర్ణ్యము సంధ్యాసమయముగాని రాత్రి కాదు. సూర్యునికి మందేహులతో పోరు సంధ్యయందేగాని 'రాత్రియందు' కాదు. రాత్రివేళ సూర్యుడుండడు. ('నేందు స్త్రీవ్రో నిశ్యర్కః.'- చంద్రాలోకము.) బ్రాహ్మణు లర్ఘ్యోదకము వదలుటయు దానిచే మందేహు లడగుటయును సంధ్యాసమయముననే గాని 'రాత్రి' యందు కాదు. సాయం సంధ్యను సూర్యు డస్తమింపకమునుపే వార్చవలయునని విధి.—

"సంధా సంధ్యా ముపాసీత నాస్తగే నోద్గతే రవౌ." (సంధ్యాభాష్యము.)

"రేపు చుక్కలఁ జూచుచు మాపు తిమిర
వైరిఁ జూచుచు సంధ్యవార్వంగవలయు." (విష్ణుపురా.4-213.)

కావున బ్రాహ్మణులు రాత్రియందు సంధ్యవార్తురనుటయు, ఆ సంధ్యావందన జలములచే సూర్యునికి మందేహబాధ తొలగు ననుటయు సరికాదు. కాని 'వేదం' వారి మతమున సాయంసంధ్య రాత్రియందు వార్చవలసినట్లేయున్నది. 'ఆముక్త'లో,—

క. 'సేవించిపోవుతఱి, మధు
రా విభవముఁ జూడవచ్చి శ్రాంతి మెయిన్, మా
పా వైఘనీటఁ గృత సం
ధ్యావిధియై నృప పురోహి తావాసమునన్' (2-72.)

అన్నచోట,— 'మాపు = రాత్రియందు, చేయఁబడిన సంధ్యాకర్మగల వాఁడై' అని స్పష్టముగా వ్రాసియున్నారు. గొప్ప పొరపాటు. 'సంధ్య' సంధివేళలలో అనుష్ఠింపబడు కర్మ. కావుననే 'సంధ్య' అనబడుట.—

పర్వతరాజు సూర్యుని వెనుకవేసికొని అతనికై తాను యుద్ధముచేయగా ప్రవహించిన రక్తమో యన్నట్లు సంధ్యారాగమును, ఆయుద్ధమున చిక్కువడిన రాక్షసు లాత్మ రక్షణార్థము కల్పించుకొనిన మబ్బులోయన్నట్లు చీకట్లును, ఒప్పెనని తా.

ఉ. ♦ద్రోహమె నీతిగాఁ దలఁచి దుర్మనుఁడై కనుఁ గాన కాత్మప
త్నీహరణం బొనర్చె నని దేవగురుండు శపింపఁగాఁజుమీ
యాహరిణాంకుఁ డిట్లు తును రాయె *నటంచన, జారచోరు లు
త్సాహము మీఱఁగా, నపుడు తారకముల్ నెరసెన్ నభంబునన్.

---

'ఉషాస్తే సంధివేలాయాం, నిశాయాదివసస్యచ,
తామేవసంధ్యాం తస్మాత్తు ప్రవదంతి మనీషిణః.' (సం. భా.)

'సంధ్య'- 'రాత్రి', అనునవి భిన్న కాలములు.—

'ఉదయాత్ప్రాక్తనీ సంధ్యా- ఘటికాత్రియముచ్యతే,
సాయంసంధ్యాత్రిఘటికా - అస్తాదుపరి భాస్వతః.'

అనగా, సూర్యుడుదయించినపిమ్మట మూడుగడియలవరకును ప్రాతస్సంధ్య; అటు పిమ్మటికాలము దివసము. సూర్యుడస్తమించిన పిమ్మట మూడుగడియల వర కును సాయంసంధ్య; ఆమీదటి కాలమునకే రాత్రి యనిపేరు. కాబట్టి, 'సంధ్య' అనవలసినచోట 'రాత్రి' అనగూడదు. 'రాత్రి, సంధ్య నంటివచ్చునదేగదా, మరి సంధ్యాసమయమున వార్చవలసిన సంధ్యను 'రాత్రియందు' వార్చినంతమాత్రమున తప్పేమి?' అనే వాదము నిరర్థకము.— అకాలానుష్ఠిత సంధ్య వంధ్య వంటిదగునని పెద్దలు నొక్కి చెప్పినారు.

"కాలేతు వందితా సంధ్యా స్వర్గమోక్ష ప్రదాయినీ,
అకాలేవందితా సంధ్యా, సా చ వంధ్యావధూరివ." (సం. భా.)

కాబట్టి, సంధ్యరాత్రియందువార్చుటగాని, వార్చినట్లు చెప్పుటగాని పనికి రాదు. ఎందుకు విస్తరము?

'తమి' తత్సమమైనప్పుడు, రాత్రి; తెనుగయినప్పుడు, ఉత్సాహము. పూ. టీ. కర్తలు తత్సమముగా గ్రహించి, అనుచితార్థమువ్రాసినారు. 'మాపు' అనుపదమునకు, రాత్రి, సాయము, అనునర్థములు రెండునున్నవి. (చూ. శ. ర.) ప్రకరణోచితార్థమును గ్రహింపలేక చెరచినారు- శాస్త్రిగారు.

♦ ఈపద్యము, పూ. ము. నను, పెక్కువ్రాతప్రతులలోను లేదు.
* శా. పా.— 'నటంచును' ('నిజంబని' - పాఠాం.)

టీక.— ఆత్మపత్నీహరణంబు- ఒనర్చెనని = తనభార్యను అపహరించెనని, దేవగురుండు = బృహస్పతి, శపింపఁగాఁ-దుమీ = శపించుటచేత నేసుమా, హరిణాంకుఁడు = చంద్రుడు, ఇట్లు = ఈ నక్షత్రములరూపమున, తునురాయెన్ = ముక్కముక్కలయ్యెను, అటంచు- అనన్ = అని లోకమనగా; జారచోరులు, (తమ ప్రచారమున కనుకూలమయినరాత్రి వచ్చినదిగదా యని) ఉత్సాహము మీఱఁగాన్ = సంతోషముచేత ఉప్పొంగగా- ('ఉత్సాహము' తృతీయార్థమున ప్రథమ. చూ. బాల. కా. 21.) తారకముల్ = నక్షత్రములు, నభంబునన్ = ఆకాశమున, నెరసెన్ = నిండెను. ('మెఱసెన్' - పాఠాం.)

> గీ. ♦నల్లమూఁకలపై దండు వెళ్లఁ దలఁచి
> రాజు వేయించు వెలిగుడారం బనంగఁ
> దోఁచెఁ బాండిమ ప్రాచిఁ దోడ్తోన; యపుడు
> గువలయదళమ్ము లందెల్లఁ గూడియయ్యె. ౧౬౨

టీక.—రాజు = చంద్రుడు (ఒక - ప్రభువు, అని అర్థాం) నల్లమూఁకలపైన్ =చీకటిగుంపులమీద, (తన్నెదిరించిన యడవిజనుల మూకలమీద, అని - అర్థాం) దండు వెళ్లఁదలఁచి, వేయించు = వేయించిన, వెలిగుడారంబు = తెల్లనిడేరా, అనంగన్ = అన్నట్లుగా, తోడ్తోన=చుక్కలుపొడిచినవెంటనే, ప్రాచిన్ = తూరుపు

గురువు భార్యనుకూడుటచేత జారుడును, ఆమె నపహరించుటచేత చోరుడును అయిన చంద్రుడు పాపకృత్యములకు ఫలముగా 'తునురాయెనటంచును జారచోరులు సంతోషించి'రనుట స్వభావవిరుద్ధము. దుర్జనులు దుర్జనుల దుర్వృత్తిని మెత్తురు; సమర్థింతురు; అంతేగాని నిరసింపరు. కావున 'అటంచును' అనుటకంటెను, 'అటంచన' అనుట యుచితమని నేను భావించినాను. (ఈ పద్యమునకు పూ.టీ.లేదు.)

♦ శా. పా.— 'నల్లప్రజపైనరగ' (='చీఁకటియను జనులమీఁద. రాజు = చంద్రుఁడు తేఁడు-' అని పూ. టీ.)

'నల్లప్రజ' యనుపదము అడవిజనులు - దొంగలు, అను అర్థములయందు రూఢము.—

క. 'ఏలలఁ బాడుచుఁదగ విలు,గోలలఁగొని 'నల్లప్రజలు' గుమ్మలైనడవన్
నీలాంబరుఁడై విభుఁడు, ద్వేలాశుకళా విరాజితేజీ నెక్కెన్. (వేం. పంచ. 2-198)
(ఇక్కడ. నల్లప్రజలు = అటవికులు)

దిక్కున, పాండిమతోఁచెన్ = తెల్లని కాంతి యుదయించెను. అపుడు, ¶ కువలయ, దళమ్ములు = కలువలరేకులు, కూచియయ్యెన్=వాడియయ్యెను, (కు-వలయ-దళంబులందెల్లన్ = భూమండలములోని - సేనలయందంతటను, కూచి = యుద్ధసన్నాహవాద్యములు మోగించుట, అయ్యెను = జరిగెను. అని అర్థాం.)

---

వ. 'చెట్లు వెడలి విండ్లుపంచుకొని ముంచుకొను 'నల్లపగిజంచూచి.' (ఆము క్త- 7-12)

(ఇక్కడ, నల్లపగ్రిజ = దొంగలు)

గీ 'ఇరులు గవియుచు నేరాళి మెట్టయెదుర
నల్లనల్లన నేతెంచె ‡ నల్లమంది.' (శృం నై. 7-39)

(ఇక్కడ నల్లమంది = కలిపరివారము)

ఉ. పార్శ్వభూ, గమ్ముల నల్ల నల్లప్రజ గ్రమ్ముకొనన్... జెంచుపాళెగాఁ డమ్మను జెంద్రుకొల్వునకు...వచ్చె." (శుక. 1-244)

(ఇక్కడ నల్లపగ్రిజ = వేటగాండ్లు)

కావున 'నల్లపగ్రిజ= నల్లని జను లగుదురేగాని 'చీఁకటియను జను' లని యర్థము కాదు. చంద్రుడు - తేఁడు, కూడా 'చీకటి' యను జనులమీద దాడి వెడలినట్లు చెప్పుట సమంజసమును కాదు. 'నల్లమూఁకలపై' అని తంజ. తా. పా. 'నల్ల మూకలనగా నలుపుగుంపులు = చీకట్లు' అనియర్థము. నల్లని జనులగుంపులని యర్థాంతరమున్న . కావున, శా. పా. పూ. టీ. రెండును సరియైనవి కావు.

¶ పూ. టీ.— 'కువ...మ్ములు = కలువరేకులు = కలువలనెడు దండులు, కూచియయ్యెన్ = వికసించెను (యుద్ధవాద్యములను వాయింపఁదొడంగినవి.)'

కలువరేకులు 'కూచియయ్యె' ననగా అంతకుముందు వాడివత్తలైయున్నవి మరల గట్టిపడి నిక్కినవని యర్థముగాని 'వికసించిన' వని యర్థము కాదు. 'కూచి యగుట = వికసించుట' అనుటకు సరియైన ఆధారములేదు. ('సారంగ' టీకమీద నే ఆధారపడి సూ. ని. 'కూచి = విరిసినది, వికసించినది' అని యున్నది. 'కలువ రేకులు వికసించెను; కలువరేకులనెడి దండులు యుద్ధ వాద్యములను వాయించెను' అనుటలో చమత్కారములేదు.

---

‡ 'ఏతెంచెను, అల్లమంది = అజనసమూహము' అని, సర్వం. వ్యాఖ్య.— (సరి కాదు) 'జనౌఘమసిత్విషమ్' (జనౌఘం మషీత్విషమ్-పాఠాం.) అని మూలము.

క. కలువలు కిలకిల నవ్వెఁ
దొలిమల సెలయేటి యవలి తుహినాంశు కరం
బులు గని; యప్పు 'డేటావలి
గిలిగింత' లటంట వానికిఁ సరి దాఁకెఁ. ౧౬౩

టీక.—తొలి... అవలి = తూరుపుకొండయందలి సెలయేళ్లకు అవతలనున్న, తుహినాంశు = చంద్రునియొక్క, కరంబులు = కిరణములు. ('చేతు' లనియును) కని = చూచి ('పొంది'-అని.) కలువలు (కలువల నెడి నాయికలని, వ్యంగ్యము.) కిలకిలన వ్వెఁ = వికసించెను. (కిలకిల నవ్విరి - అని నాయికల పరము.) ఏటావలి గిలిగింతలు = ఏటి యవతలిగట్టున నుండి ఇవతలిగట్టువారికి పెట్టు గిలిగింతలు, అటంట = అని లోకమున సామెతగా అనుట. వానికిఁ = ఆకలువలకు, సరిదాఁకెఁ = సత్యమే అయ్యెను.

ఏటియవతలనుండి యివతలికి కరములుచాచి గిలిగింతలుపెట్టుట అసంభవము గనుక - 'కానిపని' అను అర్థమున 'ఏటావలి గిలిగింతలు' అను సామెత లోకమున వెలసినది. ప్రకృతముననో 'అట్టి గిలిగింతలు జరుగనే జరిగినవి. కావున ఆసామెత లోక మునగల యర్థమును కోలుపోయి, యథార్థమే అయినదని చమత్కారము. పువ్వులు వికసించుటను నవ్వుటగను, వికసింపజేయుటను నవ్వించుటగను చెప్పుట కవులకు పరిపాటి.

'రాత్రి ర్గమిష్యతి భవిష్యతి చ ప్రభాతం
భాస్వా నుదేష్యతి హసిష్యతి పంకజ శ్రీః;
ఇత్థం విచింతయతి కోశగ తే ద్విరేఫే
హా హంత! హంత! నళినీం గజ ఉజ్జహార.' ప్రాస్తావికము.

సీ. 'కటికి చీకటి తిండి కరముల గిలిగింత
నెవ్వాఁడు తొగకన్నె నవ్వఁజేయు.' మను. పీఠిక. 18.

సీ. కరము లొయ్యనఁ జాఁచి యిరులనెఱుల్ చక్కఁ
గాఁ దీర్చి తెల్వి సంఘటిలఁ గూర్చి,
కడు నయనచకోరికల ముద్దుగావించి,
చనుజక్కవల గోళ్ల నెనయ నాని,

కళలు రంజిల్లంగఁ దొలునాఁడు తనుఁగూడి
†'యిట పొద్దు గ్రుంకునప్పటికి రేపు
వడి వచ్చి నిలుతు నీ కడల నేఁటికిఁ జాలు'
నని యేఁగుటచు జేసి యవ్విధమునఁ
గీ. దామరల నిక్కువమ్ముగఁ దనకుముదము
లతిశయిల్లంగ వే వచ్చి యపుడు నిల్చెఁ
దమివిటుఁడు తూర్పుదిక్కు ¶ లేఁ గొమరువయసు
బిత్తరిముఖంబునను ‡ బొట్టు వెట్టినట్టు. ౧౬౪

టీక.—* తమివిటుఁడు=చంద్రుడు [తమి=రాత్రియొక్క; విటుఁడు=నాథుడు.

---

† శా. పా.—'ఇటఁ బొద్దు'.— 'ఇట' కళి గాని ద్రుత ప్రకృతికము కాదు. (చూ. ౧౫౬ పద్యముక్రింద) కొన్ని ప్రయోగములు.—

'ఇట తెచ్చియిచ్చు' (భా. ఆది - 6-293)
'అట యెఱుంగమసంగలవారు.' (విరాట 1-115)
'ఇట యెవ్వరోర్చువారు.' (ఉద్యో. 3-203)
'ఎట యేనియుంబోయిన' (అరణ్య. 2-100)
'ఎటవోయెడునని.' ( ,, 2-108)
'ఇటయేఁజను దెంచితి.' ( ,, 2-299)
'ఇట యపవర్గ......' (బసవ. పు. 52)
'అట యిట కదలకుమమ్మ' ( ,, పు - 70)
'అట యిట యేఁగుచు' ( ,, పు - 84)
'అట యట వరికించి.' ( ,, పు - 119)

¶ శా. పా.—'లేఁగొమిరె వయసు'.— 'కొమరు వయసు' సాధురూపము. (చూ. ౧౧౧ పద్యము క్రింద.)

‡ శా. పా.—'బొట్లు వెట్టినట్లు'

ఒక్క బిత్తరి ముఖమున పెక్కు 'బొట్లు' పెట్టుట అసహ్యము. అంతేకాక ఒక్కచంద్రుని పెక్కు బొట్టులతో ఉపమించుటతప్పు. పూ. ము. నను, వ్రాత ప్రతులలోనుగూడా 'బొట్టు పెట్టినట్టు' అని సరియైనపాఠమేయున్నది. శా. పా. ను నమ్మి, వావిళ్ల - కొండపల్లి, వారుగూడా 'బొట్లు' అనియే అన్నారు.

* పూ, టీ.—'విటస్వరూపుఁడయిన చంద్రుఁడు.'

‘రజనీ యామినీతమీ.’ అమ. విట భుజంగాది శబ్దములు – వేశ్యాపతి; ఉపభర్త, అను నర్థమునిచ్చునవియైనను, ఔపచారికముగా ‘భర్త’ యను నర్థమునను వాడబడును —“ఎటువంటి నేర్పరినిశా, విటునల్లుఁడు.” విజయ. 2-202. “కల్లోలినీ విటమధ్యంబునవ్రాలె నభ్రమణి”వసు. 4-10] ఒయ్యనఁ=మెల్లగా, కరములుచాచి =కిరణములు ప్రసరింపజేసి, *ఇరుల- నెఱుల్ =చీకటుల విజృంభణములను, చక్కఁగా, తీర్చి=నశింపజేసి (తీఱు=నశించు. చీకట్లనుపోగొట్టి, అన్నమాట) తెల్వి సంఘటింపఁ కూర్చి= తెల్లని కాంతిని (=వెన్నెలను) కలిగించి, నయన చకోరకలఁ=నయనములవంటి చకోరపక్షులను, కడుఁ ముద్దుగావించి = మిక్కిలిగా ప్రేమించి (ముద్దు = ఆదరము. చూ. శ. ర.) ‡ చనుజక్కవలఁ = (తన్నుఁజూచి భయపడి) పోవు చక్రవాకములను. గోళ్ళు = (గోడులు) దుఃఖములు, ఎనయఁ = పొందునట్లు, అని = ఆక్రమించి, (చక్రవాకములను బాధించి, అన్నమాట.– చంద్రుడు చకోరముల కానందకరుడు; చక్రవాకములకు దుఃఖకరుడు.—) కళలు రంజిల్లఁగఁ = కాంతులు వెలయఁగా, తొలునాఁడు = ముందటిరోజు, తనుఁ గూడి = తూర్పుదిక్కునుచేరి, నేఁటికిచాలుఁ, రేపు, పొద్దుక్రుంకునప్పటికిఁ = సూర్యుడస్తమించు సమయమునకు, ఇటువచ్చి, నీ- కడలఁ = నీదిక్కున, నిలుతుఁ, అని, ఏఁగుటనుచేసి = చెప్పిపోయినందున, అవ్విధమునఁ = చెప్పినచొప్పుననే, తామరల- నిక్కు =కమలముల గర్వము, నమ్మగఁ = వ్యర్థమగునట్లును, (= కమలములు ముడుగునట్లును) తన- కుముదములు = తనకు ప్రియములయిన కలువలు, అతిశయిల్లంగఁ = సంతో

---

పద్యమున ‘తమిపిటుఁడు’ అను పదమునగల అర్థాంతర స్ఫురణచేత విటవృత్తాంతము అప్రకృతశ్లేషగా చెప్పబడినదేగాని చంద్రుడు విటస్వరూపుడుగా చెప్పబడలేదు.

* పూ. టీ — ‘ఇరులనెడి కురులను - తెల్విఁ = ప్రకాశముతోడ.’– ‘తీర్చి’అను క్రియకు వారర్థముచెప్పనేలేదు. ఆక్రియకు ‘దిద్దు’ - ‘నాశముచేయు’ అని రెండర్థములున్నవి. చంద్రుడుచీకటులనుదిద్ది చక్కబరచెననుటగాని, విటుడు తన ప్రియురాలి కురులను నాశముచేసెననుటగాని సరికాదు. కావున పూ. టీ. సరియైనది కాదు.

‡ పూ. టీ.— ‘స్తనములవంటి చక్రవాకములను దుఃఖమొందునట్లుచేసి’ దుఃఖమొందజేయుటకు చక్రవాకములను స్తనములతో పోల్చుటలో సారస్యమేమో? ఎంతటి దుర్విటుడైనను స్తనములను దుఃఖమొందజేయునా?

మమున నుబ్బినట్లును (= వికసిల్లినట్లును.)వే వచ్చి, లేఁగొమరు...పెట్టినట్టు = ఎలప్రాయపు సుందరిమొగమున దీర్చిన బొట్టువలె, తూర్పుదిక్కు - నిల్చెన్ = తూర్పున ఉదయించెను.

అర్థాంతరము.—తమి విటుఁడు = వలపుగల ఒకానొకవిటుఁడు, ఒయ్యనన్, కరములు = చేతులు, చాచి, ఇరులనెఱుల్ = చీకటులవంటి (నల్లని) కురులను, తెల్వినన్ = నేర్పుతో, తీర్చి = దిద్ది, సంఘటిలన్ - కూర్చి = చక్కగా అమర్చి; నయనచకోరికలన్ = చకోరములవంటి నయనములను, ముద్దుగావించి = ముద్దుపెట్టుకొని.—(నయనములు చుంబనస్థానములు; "లలాటాలక కపోల నయనవక్షః స్తనోష్ఠాంతర్ముఖేషు చుంబనమ్." వాత్స్యా. సూ. ౨-౩-౬) చనుజక్కవలన్ = జక్కవలవంటి చనులయందు, గోళ్లు = నఖములు, ఎనయన్ = దిగబడునట్లు, అని = అంటి (నఖక్షతములేర్పడునట్లు కుచములనంటి అని, భా.) కళలు రంజిల్లంగన్ = రజఃస్థానములు ద్రవించునట్లు, తొలునాఁడు, తనున్, కూడి = కలిసి (=సంగమించి) రేపు - ప్రొద్దుక్రుంకునప్పటికి - ఇటువచ్చినిలుతున్, నీకున్ = అడలనేటికిన్ = నీవు భయపడుటయెందుకు? చాలున్ = ఊరకుండుము, అని యేఁగుటనుచేసి, అవ్విధమునన్, తాన్ = తాను, మరలన్ = మళ్లీ, నిక్కువమ్ముగన్ = నిజముగా, తనకున్ - ముదములు = సంతోషము, అతిశయిల్లంగన్, వే వచ్చి, తూర్పు...బునను = తూర్పుదిక్కనెడి లేఁబ్రాయపు బిత్తరియొక్క - ముఖంబునను = ఇంటిముందర, ('ముఖము = ఇల్లులోనగువాని ముందటిభాగము.' శ. ర.) బొట్టుపెట్టినట్లు = నిష్కర్షగా.' (చెప్పిపోయినవిధముగానే) - వచ్చి నిల్చెను.

'బొట్టుపెట్టినట్లు'— జాతీయము. "యెక్కడవున్నా సరిగ్గా బొట్టుపెట్టినట్లు చిక్కుతుంది. Wherever it is he finds it in a moment." (బ్రౌను.)

గీ. రిక్క లెనయంగ నుదయభూభృత్తటమునఁ
† దెలివిఁ బొదలుమృగాంకమండలముఁ జూచి
వేగ విల్లెత్తి పచ్చని వింటిబోయ
యట విరహిజాలములను వేఁటాడఁ దలఁచె. ౧౬౯

† శా. పా.— 'తెలివిఁబొదల' ('తెలివిఁబొదలు' పూ. ము)

టీక.—† రిక్కలు - ఎనయంగన్ = నక్షత్రములుదయింపగా, ఉదయభూభృత్ తటమునన్ = తూరుపుకొండదరియందు, * తెలిన్ పాదలు = తెల్లని కాంతితో ప్రకాశించు, మృగాంకమండలమున్ చూచి = చంద్రమండలమునుచూచి, ‡పచ్చవింటిబోయ = మన్మథుడు, వేగ = శీఘ్రముగా, విల్లెత్తి = ధనుస్సుధరించి, విరహిజాలములన్ — వియోగిజన సముదాయమును, వేఁటాడఁదలఁచెన్ = నొగిలింపఁ నెంచెను. (ఎంచెననగా మొదలుపెట్టెననియే భా.)

చుక్కలు పొడిచెను; పిమ్మట తూరుపుదిక్కున తెల్లని కాంతితో చంద్రుడుదయించెను. అంతట మదనుడు విరహులను బాధింపఁదొడఁగెను. అని తా.

వింటినిగలిగియుండుటచే మన్మథుడు బోయగను, అతడు విరహులను బాధించుట వేటలాడుటగను చెప్పబడినది. అది చమత్కారము. ఆచమత్కారమును గమనింపక పూ. టీ. కర్తలు 'ఈ పద్యములో మన్మథునియందు కిరాతత్వ మారోపించి అర్థద్వయము చెప్పఁబడియున్నది' అన్నారు. పొరపాటు. 'బోయ' 'వేఁట' అను పదములవలన విరహులయందు మృగత్వమును, మదనునియందు కిరాతత్వమును, స్ఫురణమాత్రమే; చమత్కారము. అంతేగాని, మన్మథునియందు కిరాతత్వారోపణముగాని, అర్థద్వయముగాని, పద్యమున నుద్దిష్టములు కావు. ఇట్టి రచనకొక్క తార్కాణము—

† పూ. టీ.—('ఉదయ... తటమునన్) నక్షత్రములు ప్రకాశింపఁగా. మన్మథపరము) రిక్కలు = ఎలుఁగుబంట్లు (కిరాతపరము)'

'ఎనయు' ధాతువునకు 'ప్రకాశించు' అను నర్థములేదు . అశ్విన్యాదులుతప్ప తక్కిన నక్షత్రములు ఆకాశమున నందందు పొడమునవియే గాని సూర్యచంద్రులవలె తూరుపుకొండ తలమీదిగావచ్చి పడమటి కొండవెనుకకు దిగపారునవి కావు. కావున సాయంవర్ణనమున 'పొడుపుగుబ్బలిదరియందు నక్షత్రము లుదయించినట్లుగాని - ప్రకాశించినట్లుగాని చెప్పుట యొప్పదు. రిక్కయను పదమునకు 'ఎలుఁగుబంటి' యను నర్థమునులేదు. ఉన్నను పద్యమున కిరాతవిషయములేదుగావున ఆయర్థమును వ్యర్థమే.

*పూ. టీ.— 'తెలివిన్ = తెలివిచేత, పాదలన్ = లతాగృహములందు, మృగముల గుర్తుల సమూహమును, అని కిరాతపరము.'

కిరాతపరమయిన యర్థమునకు ప్రసక్తిలేదు గావున ఈయర్థము నిలువదు.

‡ పూ. టీ.— 'అప్పుడే పచ్చి వెదురుబద్దతో చేసిన విల్లుగల కిరాతుని రూపముగల పచ్చవిల్తుఁడు, విరహిజాలములన్ = వియోగిజనసమూహమును.'

గీ. 'అఖిల మోహినియైన యయ్యాలరుఁబోణి
శైశవము వీడుకొన్నది సందుగాఁగ
ననుదినంబును రాజనందనుల మీఁద
వేఁటలాడుచున్నాఁడు విషమ శరుఁడు.' (శృం. నై. ౮-26)

వేఁటలాడుచు న్నాఁడు' అనుటచే విషమశరునియందు మృగయు వ్యాపారము స్ఫురించుచున్నది గావున సమాసోక్త్యలంకారము.' (సర్వంకషా.)

వ. అప్పు డల్ల హల్లకహితాభిజన జనవల్లభ తల్లజుం డాయల్లకానల దందహ్యమాన మానసుం డగుచు నిబిడ రస కుసుమ కిసలయ విసర శీతల చూతలతికా నికాయ కాయమానంబున నిశాకాంతకాంత మణి వేదికా నితాంతకాంత లతాంతశ య్యాంతరంబున మేను సేర్చి, పరిచారకుల నందఱం బనిచి యేకాంతంబున, నొక్కరుండ చిత్రాంగీ లతాంగీ దిదృక్షాసదృ క్షాతిజాగరూక రూక్షాక్షుండై, యుపరిప్రదేశ ప్రసూనవితాన నిర్గళ దనర్గళమరందోదకబిందు ధూళిపాలికలు చందన చర్చలుగా, మరు ద్దోదూయమాన ప్రాంత శారదభూరుహ దళ వ్రజంబులు వ్యజనంబులుగాఁ దన్నివాసం బయత్న శిశిరకృత్యంబులు ఘటియించుచుండ నిమ్మకెరువు వేసిన చందంబున నంతనంతకంతకుఁ బరితాపం బగ్గలం బై యీవల నావలం బొరలం దొడంగె. ౧౬౬

టీక.—అల్ల...తల్లజుండు.— అల్ల = ఆ, హల్లక = కలువలకు, హిత = మిత్రుడైన చంద్రునియొక్క, అభిజన = గోత్రమునందలివాడైన, జనవల్లభతల్ల

---

విరహి జనులను వేటలాడుటకు పట్టి 'పచ్చ విల్తుడే' చాలియుండగా అనవసరముగా ఆతడు 'అప్పుడే పచ్చి వెదురుబద్దతో చేసిన విల్లుగల కిరాతుని రూపము గల' వాడగుట యెందుకు? కిరాతుడయ్యును 'విరహి జనులనే వేటాడెనా? వియోగులను బాధింప దలచిన మన్మథుడు కిరాతరూపమును దాల్చి 'ఎలుగుబంట్లను, తెలివిచేత - పొదలలోని - మృగముల గుర్తుల సమూహమును, చూచుకొని తన పనికి ప్రారంభించెనా? అర్థద్వయమనగా నిట్టిదేనా?

జుండు = రాజశ్రేష్ఠుఁడు (= రాజనరేంద్రుఁడు) ఆయల్లక + అనల = విరహాగ్ని చేత, * దందహ్యమాన = మిక్కిలి దహింపఁబడుచున్న, మానసుండు = మనసు కలవాఁడు, అగుచు, నిబిడ=దట్టమైన, రస = మకరందముగల, కుసుమ = పువ్వుల యొక్కయు, కిసలయ = చిగురాకుల యొక్కయు, విసర = మొత్తములచేత, శీతల = చల్లనైన, చూతలతికా నికాయ = మామిడిగున్నల గుంపులోని, కాయ మానంబునన్ = పందిటియందు, నిశాకాంత కాంత మణివేదికా = చంద్రకాంత మణుల యరుగుమీఁది, నితాంత కాంత = మిక్కిలి మనోజ్ఞమైన, † లతాంత శయ్యాంతరంబునన్ = పూలపానుపునడుమ, మేను చేర్చి = పరుండి, పరిచారకులన్, పనిచి = అవతలికి పంపి, ఏకాంతంబునన్ = ఒంటిపాటున, చిత్రాంగీ...తుండై .— లతాంగీ = తీఁగవంటి శరీరముకలదియైన, చిత్రాంగీ = చిత్రాంగిని, ‡ దిదృక్షా = చూడవలయు ననెడి యిచ్ఛచేత, అసదృక్షు = సాటిలేనట్లు (=మిక్కిలిగా) జాగరూక = మేలుకొనియుండుట చేత. రూక్ష = తీక్ష్ణములైన, అక్షుఁడు = కన్నులుకలవాఁడయి, (చిత్రాంగిమీఁది చింతచేత నిద్రపట్టక కన్నులెఱ్ఱవారిన దని భా.) ఉపరి ... పాలికలు. — ఉపరిప్రదేశ = పైభాగమునందలి, ప్రసూన

---

* పూ. టీ.— 'మిక్కిలి తపింపఁబడుచున్న.'

'తపించు' ధాతు వకర్మకము. కావున తపింపఁబడు' అను రూపము పుట్టదు. 'తపింపఁజేయఁ బడుచున్న' అనుట యొప్పు. 'తపనః = తపింపఁ జేయువాఁడు' (గురు. ప్రబోధిక.) — అదియటులుండగాఁ 'దహ్యమాన' మనగా 'దహింపఁ బడుచున్నది' గాని 'తపింపఁజేయఁబడుచున్నది' కాదు. దహించు, తపించు, అను క్రియలు భిన్నార్థకములు.—

"తపతి తను గాత్రి మదన స్త్వా మనిశం మాం పున ర్దహ త్యేవ." (శాకుం. 3-70) దహనుడు; తపనుడు; భిన్నులు. 'ఖాండవదహన' మనుటకు మారుగా, 'ఖాండవ తపన' మనగూడదు.

† పూ. టీ. — 'లతాంత = చిగుళ్లయొక్క'.

పూ. టీ. వ్రాతప్రతిలో 'లతాంత = చిగుళ్లయొక్క' అని యున్నది. శాస్త్రీగా రామాట నక్లే కాపీ చేసినారు. గొప్ప పొరపాటు. లతాంత మనగా 'పువ్వము'గాని 'చిగురు' కాదు.

‡ పూ. టీ. — 'దిదృక్షా = చూచుటయందు.'

ఇదియును వ్రాతప్రతిలోని టీకయే. సరియైనదికాదు. 'దిదృక్ష'యనగా 'చూడవలెననెడి యభిలాష' గాని 'చూచుట' కాదు. (ద్రష్టుమిచ్ఛా దిదృక్షా.)

వితాన = పూలమొత్తములనుండి, నిర్గళత్ = జారిపడుచున్న. అనర్గళ= అడ్డులేని, మకరంద ఉదకబిందు = పూదేనె బొట్టులయొక్కయు, ధూళి = పుప్పొడియొక్కయు, పాళికలు = సమూహములు, చందనచర్చలుగాన్ = గంధపుపూతలు కాగా, మరుత్ ... వ్రజంబులు.— మరుత్ = గాలిచేత, * దోదూయమాన = మిక్కిలిగా కదిలింపబడుచున్న, ప్రాంత = సమీపపు. శారదభూరుహ = ఏడాకుల అరటిచెట్లయొక్క, ('సప్తపర్ణో విశాలత్వక్ శారదో విషమచ్ఛదః' అమ.) దళవ్రజంబులు = ఆకుల మొత్తములు, వ్యజనంబులుగాన్ = విసనకఱ్ఱలు కాగా. తత్ నివాసంబు = ఆయున్నచోటు, అయత్న = యత్నములేని (సహజములైన) శిశిరకృత్యంబులు = శీతలోపచారములు, ఘటియించుచుండన్ = సమకూర్చుచుండగా, నిమ్మకు ఎరువు వేయుటచేత నిమ్మ వృద్ధికివచ్చినట్లుగా, (ఆశిశిరకృత్యములచేత) పరితాపంబు = విరహబాధ, అగ్గలంబై = అధికమై, (రాజు) పొరలందొడంగెను.

క. మధుమాసం బఁట, శుకపిక
మధుపాదిమనోజబలసమన్వితవనమే
యధివాసం బఁట, యాపై
విధుఁ డుదయించె నఁట, విరహి వేఁగుట యరుదే? ౧౬౭

టీక.— మధుమాసంబు = చైత్రము (మధువు = మద్యము- పుట్టుకాలము అని, సారస్యము.) శుక = చిలుకలు (తిరుగుబోతులు - అని,సా. — 'శుకతీతి శుకః, శుకగతౌ ' అని, వ్యు.) పిక = కోయిలలు (చాటుననుండి తప్పుడుకూతలు కూయువారు. అని, సా.— 'అపికాయతీతి పికః, కైగైశబ్దే, చాటుననుండి కూయునది. అపిరంతర్థౌ.' అని వ్యు.) మధుప = తుమ్మెదలు, (త్రాగుబోతులు, అని-సా. 'మధు మద్యం పిబతీతి మధుపః' అని వ్యు.) ఆది=మొదలయిన, మనో... వనమే = మన్మథుని సేనలతోగూడిన యరణ్యమే, అధివాసంబఁట = నివాసమఁట, విధుఁడు = చంద్రుఁడు.

వసంతము, చిలుకలపలుకులు, కోకిలలకూతలు, తుమ్మెదలఝుంకారములు, వనవిహారము, చంద్రోదయము, అనువానిలో ఒక్కొక్కటియే విరహులకు సంతాప

---

* పూ. టీ. — 'దోధూయమాన = మిక్కిలి కదలింపఁబడిన.'
'(దో) దూయమాన=కదలింపబడిన' అని భూతార్థము చెప్పుట తప్పు. 'కదలింపఁబడుచున్న' అని కర్మణి వర్తమానార్థము చెప్పుట ఒప్పు. అరటియాకు ఒక్కమారే కదలింపబడినయెడల 'వీవన'తో పోలికయును పొసగదు.

జనకము; అట్టివన్నియు కూడినచోట విరహి బాధపడుటలో వింతయేమి? అని, తా.

ఈపద్యము, 'వసు-'లోని యీక్రింది పద్యమును తలపించుచున్నది.—

"ఇచ్చ హితాహితంబు గణియింపని గోలవుగానఁగానకు
వచ్చితిగా కహహా! పథికవర్గము నొంటిఁ జరింపనిచ్చునే
యిచ్చటి యన్యపుష్టచయ మిచ్చటి మత్తమధువ్రతవ్రజం
బిచ్చటి పల్లవోత్కరము లిచ్చటి పాంసులపంకజావళుల్!" (3-122)

ఉ. వెట్టగ మందమారుతము వీవఁగఁ దోడనె ‡రాలెఁ బై విరుల్
మిట్టిపడంగ; నీడె దవిలెం బథికుం డడకొత్తులోనిపోఁ
కట్టుల నంచు, గాలి గలయప్పుడె తూరుపుపాఱఁ బట్టు♦ము
న్నట్టిప్రకార మేర్పడ ననంగుఁడు నించిన తూపులో యనన్. ౧౬౮

టీక.— వెట్టగన్ = వేడిగా;— పథికుండు = బాటసారి (వియోగి), తూపులో = బాణములో.

అప్పుడు మెల్లని గాలివీచెను. ఆగాలిదెబ్బకు పూలు రాజుమీద జల్లున రాలెను. ఆరాలినపూ లెట్లుండెననగా! వియోగియైన రాజు అడకొత్తులో పోకవలె తన బలగమునడుమ చిక్కువడియుండుట చూచి మన్మథుడు 'గాలికొట్టినప్పుడే తూరుపు పారబట్టు' మన్న సామెతగా (= ఇదేసమయమని) ఆ విరహిమీద గుప్పిన బాణములో అన్నట్లుండె నని తా.

నిజముగా గాలికొట్టుటయు, పూలు తూరుపారుటయు నిందు చమత్కారము. ఆపూలు మన్మథుని తూపులేయగుట మరియు చమత్కారము.

---

‡ శా. పా.— 'వ్రాలెఁ బై విరుల్'

పూలు, పండ్లు, ఆకులు మొదలయినవి పడుటయందు వాడదగిన క్రియ 'రాలు' గాని 'వ్రాలు' కాదు. 'ఆకులు వ్రాలినవి'; 'పండ్లు వ్రాలినవి' అన వాడుక లేదు. పూ. ము. నను, వ్రాతప్రతులయందును 'రాలె' అను పాఠమున్నది.

♦ శా. పా.— 'పాఱఁబట్టుకొన్నట్టి,' —

పూ. ము. నను, తంజ. ప్ర. లోను 'పాఱఁబట్టుమన్నట్టి' అనియేయున్నది. లోకోక్తిని అనుకృతిలో చెప్పుటయే యుచితము.

చ. వెనుకొని యంతలో మరుఁడు వెం(డ్రుకపట్టెడుతూపు లేర్చి బో
రున నలయించువిల్లుగొని, త్రొక్కనిచోటులఁ ద్రొక్కు తేజిపైఁ
బనుపడ నెక్కి, నీళ్ళపయిఁ బాఱెడులీలఁ జెలంగు మంచి తి
య్యనిపదనైన వాల్పులపి యట్టిటుచేసె నృపాలు డెందమున్. ౧౬౯

టీక. — మరుఁడు = మన్మథుఁడు, వెనుకొని = వెంటదగిలి, ♦ వెం(డ్రుక పట్టెడు తూపులు = మిక్కిలి పదునుగలబాణములు, (వెం(డ్రుకపట్టుట = వెండ్రుకను తెంచుట.—జాతీయము.) పుష్పబాణములని, అర్థాం, (పుష్పములు కురుల యందు ధరింపబడునవిగదా.) — * ఏర్చి = ఏరితీసికొని; † బోరునన్ = బోరు మని, అలయించు = మిడికించు, విల్లుగొని = ధనుస్సు తీసికొని, (బోరునన్ = శీఘ్రముగా, అల = ప్రసిద్ధమైన, ఇంచువిల్లు = చెఱకు ధనుస్సు, కొని, అని-అర్థాం.) § త్రొక్కనిచోటులు త్రొక్కు తేజిపైన్ = మిక్కిలి వేగముగాపోవు గుఱ్ఱముమీద. (ఎవరును త్రొక్కనిచోటు - ఆకాశము; అట్టిచోట పోగలిగిన చిలుకమీద, అని -

---

♦ పూ. టీ. — 'పువ్వులను తుఱుములోఁ దాల్తురు గావున - పుష్పబాణములను అని భా.'

కేవల బాణపర్యాయమున 'వెం(డ్రుకపట్టు' అను విశేషణముఁజెప్పగల జాతీయమైన యర్థము పూ. టీ. వారికి తెలియలేదు. అందువల్లనే చెప్పలేదు.

* పూ. టీ. — 'ఏర్చి = సంధించి'

పద్యమున, తొలుత తూపులేర్చి, పిమ్మట విల్లుగొని, అటుపిమ్మట తేజిపై నెక్కినటులున్నది. యుద్ధమునకు బోదలచిన వీరుడు 'కంచిలో దొంగిలించుటకు కాళహస్తినుండియే వంగిపోయె' నన్నసామెతగా ముందుగానే వింటబాణములు సంధించుకొని, పిమ్మట గుఱ్ఱమునెక్కి రణరంగమునకు బోవునా? అది స్వభావ విరుద్ధము. 'ఏర్చి = ఏరితీసికొని' అనియే (ప్రకృతమున కుచితమైన యర్థము.

ఏర్పు = ఏరు. అనుటకు. —

సీ॥ 'ఆకలిగొనినప్పు డబ్జనాళములలో
నూటికొక్కటి ‡ యేర్చి నోటికొసఁగు.' (శ.ర.) శుక. 1-391.

† పూ. టీ. — 'బోరునన్ = శీఘ్రముగా, అలయించు = బాధపెట్టునట్టి ధనుస్సును.'

§ పూ. టీ. — '(త్రొక్కరానిచోట్లు ద్రొక్కు చిలుక గుఱ్ఱముమీద.'

---

‡ 'తెచ్చి' వావిళ్ళ-పా.

అర్థాం.) పసుపడన్ వాటముగా; ఎక్కి; నీళ్లపయిఁబాఱెడుఁతీలకన్ = అవలీలగా, చెలఁగు = నడుచునట్టి, మంచి ‡ తియ్యని - పసనైన వాలు = ఏమాత్రమును తరుగని మంచి పదునుగల కత్తిని, (నీటిమీద విహరించు విలాసముతో చెలఁగునట్టి

అంటే యర్థమేమో వారికేయెఱుక. 'త్రొక్కనిచోటులఁద్రొక్కు' అనునది అశ్వగమనవేగమును తెలుపు జాతీయము. ('త్రొక్కరానిచోట్లు త్రొక్కు' అనుటతప్పు) ముందరిపాదములతో త్రొక్కినప్రదేశమును వెనుకటిపాదములతో త్రొక్కునట్టి' యని యర్థము. ముందరి యడుగులముద్రలను మించునట్లు వెనుకటి యడుగులను చాచి వేసి నడచునది ఉత్తమజాతిగుఱ్ఱము. పై జాతీయము కావ్య పరిచయముగలవారికి క్రొత్తది కాదు.—

కొన్ని యుదాహరణములు:—

(1) క. 'ఎక్కినఁ ద్రొక్కనిచోటులు
త్రొక్కుచు గుఱ్ఱంబునడువ.' (వేం. పంచ. 2-199)

(2) సీ. 'త్రొక్కనిచోటులు త్రొక్కుచు మిన్నందు
నెక్కులుగల తేజి నెక్కుకున్న.' (ఉద్భటా. 2-119)

(3) సీ. 'ఎక్కి త్రొక్కనిచోటుఁ ద్రొక్కించునీయాజ్ఞఁ
గడవఁడు పద్మినీకాముకుండు.' (వసు. 3-177)

(4) ద్వి. '... త్రొక్కనిచోట్లు ద్రొక్కు
తురగరత్నము నెక్కి తూర్యముల్ మొఱయ.' (నవనాథ. పు. 36.)

'త్రొక్కినచోటులు త్రొక్కక' అను వాడుకయును కలదు.—

(5) 'చ. పరిపరిలాగులం గుదియఁ బట్టుచురా, వలన త్రయంబునన్
దురగము లేగుదెంచె నవె 'త్రొక్కినచోటులు త్రొక్కకుదధిన్.'
(జైమిని 2-15.)

ఈ జాతీయము 'చొచ్చుకొనిపోవు' అనునర్థమునను ప్రయుక్తమై యున్నది,-

(1) చ. 'మెఱుఁగులు గ్రుమ్మరింపఁ గను
మించులు త్రొక్కనిచోట్లు ద్రొక్క.' (వేం. పంచ. 3-249)

(2) ద్వి. - 'కనుదోయి మెఱుఁగు త్రొక్కనిచోట్లఁద్రొక్క.' (నవనాథ. పు. 43)

‡ 'తియ్యనిపదను' అను పదమునకు పూ. టీ. లేదు.

తియ్యని = తీయని = తగ్గని. తీయు = తగ్గు. (జ్వరముతీసినది. అనివ్యవహారము)

క. 'శ్రమల్ - దీయ, ముదమ్మొనరిచి, కడుఁ
దీయము గనుపి పఁగా యుధిష్ఠిరుఁడనియెన్.' (విజయ. 3-180)

దియు, మధురమయిన మకరందపుతడిచే చల్లనిదియు నైన తామరరేకును, అని -అర్థాం) పఱపి = ప్రయోగించి, నృపాలుడెందముక్ = రాజుహృదయమును, ఇట్టట్టు చేసెక్ = బాధించెను.

వ. అత్తఱిఁ దత్తఱిల్లి చిట్టాడిన గుట్టున నెట్టనం ♦ దెట్టగిలం బడి † చుట్టు ముట్టినట్టి మరుకరాళి తేజీల శిశిరకరాళిమలయానిల రమాసూనుల నుద్దేశించి వసుధేశుండు సుప్రలాపవిప్రలాపంబుల నిట్లనియె.

టీక.— * చిట్టాడిన గుట్టునక్ = చలించిన మర్మముతో ( = 'మర్మము' చలించి) తెట్టగిలంబడి = నీరసిల్లి, చుట్టుముట్టినట్టి = తన్ను ముట్టడివేసిన, మరుకరాళి తేజీలక్ = మన్మథునియొక్క భయంకరములయిన గుఱ్ఱములను (= చిలుకలను) శిశిరకర ... సూనులక్ = చంద్రుడు - తుమ్మెదలు - మలయానిలము - మన్మథుడు, అను వారలను, ఉద్దేశించి, సుప్రలాప = మంచి మాటలచేతను, విప్రలాపంబులక్ = దుఃఖవచనములచేతను, ఇట్లనియెను.

ఉ. 'శూ, లాయుధు నొక్కమాత్రమున సంగము ప్రయ్యఁగ మోది, మించి, తాఁ దీయనివింట నే, వెనుకదీయని బీరమునక్ మనోభవా.' (చిత్రభా.)

♦ శా. పా.— 'తెట్టిగిలంబడి' (ఇదే 'వావిళ్ళ'వారి పాఠమున్ను.)

భాషలో 'తెట్టగిలు' - 'తెట్టగిలఁబడు' అను క్రియలేగాని 'తెట్టిగిలు' - 'తెట్టిగిలఁబడు' అను క్రియలులేవు. పూ. ము. నను, తంజ. ప్రతులలోనుగూడా 'తెట్టగిలఁబడి' అనియే యున్నది.

† శా. పా.— 'మట్టు ముట్టినట్టి.' (అర్థమేమో ? పూ. టీ. లేదు.)

'చుట్టుముట్టినట్టి' అని పూ. ము. పా.; 'వెంబడి జుట్టుముట్టినట్టి.' అని తంజ. తా. పా.

* పూ. టీ.— 'చంచల హృదయముచేత.'

'గుట్టు' అనగా హృదయముకాదు. (చూ. శ. ర.) 'హృదయము 'చేత' అనుట తప్పు; హృదయముతో అనుట యొప్పు.

## —• రాజు చంద్రాదులనుదూషించుట •—

సీ. ఓ చందమామ, నిన్ జూచినయపుడె మా
 చిత్తాంగి మొక మింత చేసికొనును,
రాచిల్కలార, మీరాక గన్నపుడె మా
 మదిరాక్షి * నోరార మాటలాడు,
నెల దేటులార, మి మ్మీక్షించినపుడె మా
 గజయాన తల గ్రుచ్చి కౌఁగిలించుఁ,
దమిఁ జకోరములార మిముఁ గాంచినయపుడె మా
 కలకంఠి కన్నులఁ గప్పుకొనును,
గీ. దయ గలిగి కూర్పుచుట్టంబు లయితి రేని
యటకు మీ రేఁగి ‡ నా విరహార్తి ♦ వేగ
దెలిపి మా పద్మగంధిఁ దోడ్తెచ్చి నన్నుఁ
గూర్పఁగదరయ్య మిము వేఁడుకొనెదఁ గాక. ౧౭౧

* శా. పా.— 'నోరూర' ('నోరూరఁగ = తీయఁగా' అని, పూ. టీ.) 'నోరూరుట' యనగా నోట జలమూరుట, ('The mouth to water.' బ్రౌను) ఆశగలుగుట – సీ. "ఊరకచూచి నోరూరు టింతియకాని, యందని మ్రానిపండ్లంద వశమె." (దశా. చ. 7. 1-101) మా చిత్తాంగి నోట నీరూరునట్లు మాట్లాడుననుట యుచితము కాదు. లోకవ్యవహారమున, చెవులారవినుట; కనులార చూచుట; నోరారమాటలాడుట కలదుగాని, 'చెవులూరవినుట; కనులూరచూచుట, ఇత్యాదిగా వ్యవహారములేదు. 'నోరూర' పూ. ము. పా. 'నోరార' తంజ. తా. పా.

‡ శా. పా.—'తా విరహార్తి'– అర్థమేమో?

శా. పా. ను నమ్మి 'వావిళ్ల' వారును 'తా' అనియే అన్నారు.— పూ. ము. నను, తంజ. ప్రతులలోనుగూడా 'నా విరహార్తి' అని యున్నది.

♦ శా.పా.— 'వేఁగఁ దెలిపి'

'వేగ'లో అరసున్న పెట్టుట పొరపాటు. 'వేగఁ' అనుటయును తప్పే. 'వేగ' కళ గాని ద్రుతప్రకృతికము కాదు. (చూ. శ. ర.) 'కుండలమ్ములు వేగకొని

టీక.—మొకమింత చేసికొనును = ఆనందమున ముఖమును వికసింపజేసికొనును, అని యర్థము. (చిత్రాంగి చంద్రునితో సమానమయిన ముఖముకలది, అని-భా.)—నోరార మాటలాడుఁగ = ప్రీతితో మాట్లాడును, అని అర్థము.—(ఆమె పలుకులు చిలుకపలుకులవంటివని భా.) † తలగుచ్చి కౌగిలించుఁగ =అతి ప్రేమచేత తలయొగ్గి ఆలింగనము చేసికొను నని యర్థము. (ఆమె తలకట్టు (=కురులు) తుమ్మెదలవంటివని భా.)— కన్నులఁగప్పుకొనును = మిక్కిలిగా మన్నించు నని యర్థము, ('To eye, leer at, devour with glances'. బ్రౌను.—(ఆమె కన్నులు చకోరములవంటివని భా.) కూర్చుచుట్టంబులు = నిజముగా ప్రేమించు బంధువులు. మా పద్మగంధిఁగ = మా చిత్రాంగిని ('మా' ప్రేమమునకు సూచన; 'పద్మగంధి' యనుటచేత ఆమె పద్మినీజాతి స్త్రీ యని వ్యంగ్యము.)

---

రమ్మ' (భా. ఆది. 1-115.) పూ. ము. లో 'వేగతెలిపి' అని సరియైన పాఠమే యున్నది.

† పూ. టీ.—శిరస్సును పొడిచి ఆలింగనముచేయును.'

పూ. టీ. కర్తలు, 'తల = శిరస్సును, గుచ్చి = పొడిచి' అని యర్థము చేసికొన్నారు. పాపము! తెనుగు మర్యాదయెరుగరు. 'శిరస్సును పొడుచుట - కౌగిలించుకొనువారు చేయదగినపని కాదు. 'తలఁగుచ్చి కౌగిలించుట' యనగా తల కడుపున కానించి కౌగిలించుకొనుట.

ఉ. 'కోమలిఁజేరఁ బిల్చి తలగుచ్చి కవుంగిటఁజేర్చి.' (వసు. 6-54)

'తల...జేర్చి= తల కడుపులోనుంచి కౌఁగిలించుకొని' అని టీక.—

ఉ. 'అచ్చటికేఁగి పాండవుల యందఱమాఱని చెప్పి మ్రొక్కుచుఁగ

గ్రుచ్చియు కౌఁగిలించుకొని యుండిన చిత్తము నొప్పిదీర్పుమా.'(ఉద్యో. 3-134)

పూ. టీ. పరికారము గ్రుచ్చి (= పొడిచి)- కౌగిలించుకొన్నయెడల చిత్తము నొప్పితీరునా? తలగుచ్చి కౌగిలించుట నెరుగని పెద్దలకొరకు గౌరనకవియెంత చక్కని వివరణము వ్రాసినాడో చూడండి.—

'అపశుపాలుని నత్యాదరంబు- దీపింపఁబిలిచి తదీయ మస్తమున,

వక్షఃస్థలంబు మోపఁగఁ గౌఁగిలించి.' (నవ. పు. 111)

'తలగుచ్చి = శిరస్సును పొడిచి' అని, హత్య (Murder) సందర్భమున చెప్పవచ్చును; కాని ప్రేమాలింగన సందర్భమున చెప్పగూడదు.

గీ. తనమవే రైన యిఱులు చిందఱలుసేయు
దనుచు నినుఁ బట్టఁ జూమఁగా యాతమంబు
రాజ, నీ వేరివాఁడు; గోత్రపతి వీవు;
వల దనక మాయుత్తోఁ గూడి కలఁచ నేల? ౧౭౨

ఈ క్రింది పద్యమును గమనించుడు.—

క. 'మెడఁగుచ్చి కౌఁగిలించును
నొడలెల్లం బారవశ్య మొందించు నరిన్
వడి మోహనిద్రపుచ్చును
బుడమి నృసింహేంద్రు ఖడ్గపుత్రిక యౌరా!' (కావ్యా. సం. 2-151)

ఖడ్గపుత్రిక, మెడన్ గుచ్చి = కత్తికనుపొడిచి, అరిని కౌగింలించునటు. శిరస్సును పొడిచి కౌగిలించుటయు నర్థమేయగును.—

'తలగుచ్చి' యనగా కడుపుతో తలనుకూర్చి యని సరియైన యర్థము. 'కూరుచు' ధాతువుయొక్క మారురూపము 'కుచ్చు'. కళలమీదను, ముద్రితప్రతి కములమీదను 'క్రుచ్చు' 'గ్రుచ్చు' అయి, కాలక్రమమున సరళాదిగానే వ్యవహారమున రూఢమయినది. ఈ తత్త్వమునెరిగిన పెద్దలచే పరిష్కృతములయిన కృతులలో 'కుచ్చు' అను పరుషాదిరూపమేకనబడుచుండును. గ్రంథవిస్తరభీతిచే ఒకటిరెం డుదాహరణములుమాత్రమే చూపుచున్నాను.

(a) గీ. 'కుచ్చిమద్రవిభుండు నీ కొడుకుఁ గౌఁగి, లించి.'
(కర్ణపర్వము. 1-308)

(b) చ. 'కొమిరె మనోవ్యథం బొగులఁగుచ్చి కవుంగిటఁజేర్చి'
(వసు. 3-104)

'కుచ్చి కవుంగిటఁజేర్చి = బిగియఁ గౌఁగిలించుకొని' అని టీక—,

(c) సీ. 'సురభిళశ్వసనంబు నెరపె సింధుకవల్లి
కుచ్చెఁ దావులుసోఁకఁ గ్రోవిరెమ్మ.' (వసు. 1-158)

తావులుసోఁకన్ = పరిమళములనెడు కళాస్థానము లంటునట్లుగా, క్రుచ్చెన్ = కౌఁగిలించెను.' అనిటీక.—

(కేవలము 'గ్రుచ్చు' (= క్రుచ్చు) అను క్రియకే 'కౌఁగిలించు' అనునర్థముండు టను పాఠకులు గమనింతురుగాక.)

టీక.— ఆ- తమంబు = రాహువు. ('రాహౌ ధ్వాంతే గుణే తమః' అమ.) తనదు పేరైన యిరులు = తనకు పేరయిన 'తమము' అను పేరుగల చీకట్లను చిందఱచేయుదు- అను చుఁ = నీవు నాశము చేయుదువని, నినుఁ. (గ్రహణ కాలమున) పట్టుఁజూచుఁగా = పట్టుకొన జూచుచుండునుగదా ? రాజ = చంద్రుడా, నీ పేరివాఁడఁ = నీవు రాజవు; నేనును రాజును, అంతే కాక, ఈవుగోత్రపతివి = నీవు మావంశమునకు మూలపురుషుడవున్ను.— (రాజు చంద్రవంశమువాడు.) ఇట్టినీవు, వలదనక = ఈపనివద్దని చెప్పక, మారుతోఁ గూడి = మన్మథునితో చేరి, కలఁచనేల = నన్ను బాధింతు వేల ?

చంద్రా, తమము (= రాహువు) తమమును (= చీకటిని) అభిమానించిన మాత్రము- రాజ వయిన నీవు రాజయిన నన్ను అభిమానింపవలదా ? మన్మథునితో చేరి నను నీవు బాధించుట తగునా ? అని తా.

మ. 'ననునీగోత్రజు ‡నేఁచ నేల' యనుటల్ న్యాయంబుగా దబ్జ, చ
య్యనఁ దోఁబుట్టువులైన యబ్జముల నీ వయ్యో! పగల్ *మీఱ ది
మ్మొనయం చేయుదు, ♦వౌనవుఁ, గువలయాపేక్షల్ మందిగల్గు రా
జునకుం దమ్ములమీఁదఁ ♦గాంక్ష లవియెచ్చోఁ బుట్టఁగా నేర్చునే?

టీక.— అబ్జ = చంద్రుడా, ('అబ్జో జైవాతృకస్సోమః' అమ.) నీగోత్రజుఁ = నీవంశమున బుట్టిన, ననుఁ, ఏఁచనేల = ఎందుకు బాధించెదవు? అనుటల్ = అని నిన్ను నేను నిష్ఠురమాడుట, న్యాయంబు కాదు. ఎందువల్లననగా?

---

‡ శా. పా.— 'నింతయేఁచుటకుఁగా న్యాయంబె నీకబ్జ?'
పూ. టీ. లేదు. నాకర్థము కాలేదు.

* శా. పా — 'మీఱఁగా, ననయంబుఁ గఱిగందఁ జేయుదువు- నీకట్లాగ; యెట్లేనిరా, జునకుం దమ్ములమీఁదఁ బ్రేమగలదా సొంపారఁగా నెందులఁ'. ('గఱిగందఁ = అక్కుమాడునట్లు = నశించునట్లు' అని పూ. టీ.)

'నశించు' అనునర్థమున 'గఱిగందు' అను వాడుక కలదేమో? పూవురేకునకు 'గఱి' అను పేరుమాత్రము లేదు. 'నీకట్లాగ యెట్లేనిరాజునకుఁ' అంటే యర్థమేమో? రాజునకు తమ్ములమీద ప్రేమ (సొంపారఁగా) లేకపోవుటకు కారణమేమో? (ఈ పద్యమునకు సరియైనపాఠమును, పూ. ము. నుబట్టియు, తంజ. తా. పాఠములను బట్టియు సమకూర్చుకొన్నాను.)

నీవు, తోఁబుట్టువులైన అబ్జములన్ = నీతోఁబుట్టిన కమలములను. (చంద్రుడును, కమలములును నీటబుట్టినందున తోఁబుట్టువులని సారస్యము.) పగల్మీఱన్ = విరోధమతిశయింపగా, (పగలు = పగటివేళ, మీఱన్ = కడచి పోగా = సాయం సమయమున, అని అర్థాం.) దిమ్మెనయంజేయుదు = బాధపెట్టుదువు [(చంద్రుడుద యింపగానే కమలములు ముడుచుకొనును.) అట్టి నిన్ను న్యాయనిష్ఠురములాడి యేమిలాభము? తోఁబుట్టువులనే బాధించువాడవు నన్ను మన్నింతువా అని యెత్తిపొడుపు. ఔనవున్ = నిజమే, అది నీతప్పుకాదు; కువలయాపేక్షల్ మదిన్ కల్గు రాజునకున్ = భూమండలము మీది యాశగల రాజుకు, తమ్ములమీఁదన్ = సోదరులమీద, కాంక్షలు = ప్రేమ, పుట్టనేరదని భా. (కువలయ + అపేక్షల్ మదిన్గల్గురాజునకున్ = కలువలమీద ప్రేమగల చంద్రునకు, తమ్ములమీద = కమలములమీద కాంక్షల్ పుట్టఁగానేర్చునే? అని అర్థాం) రాజ్యకాంక్ష గలవారు అన్నలను తమ్ములను తుదకు తండ్రినిసైతము విషప్రయోగాది దుష్కృత్యములకు పాలుసేయుట లోకమున కలదు. ఔరంగజేబు ప్రభృతు లిందుకు తార్కాణము.—

'దురితైరపి కర్తుమాత్మసాత్ప్రయతంతే నృపసూనవో హియత్.'

— (రఘు. 8-2.)

"రాజపుత్రా మదోద్వృత్తా, గజాఇవ నిరంకుశాః
భ్రాతరం పితరంవాపి, నిఘ్నంత్యేవాభి మానినః." — సుభాషితము.

గీ. పాము ♦ తనర గా మనియెడు పలుకు నిజము
గా మెలంగినరాహువు గఱచి నిన్ను
నేమి సేయక పోయె! న దేమి యకట!
యోషధీశుండ వీ వౌటనో మృగాంక? ౧౭౪

టీక.— మృగాంక = చంద్రుడా, పాము (తనరన్) గాము = పామే కొంతకాలమునకు గ్రహము, అనియెడు పలుకు = అను కింవదంతి, నిజముగాన్ మెలఁగిన = సత్యమేఅగునట్లుగా వర్తించిన (అనగా పామును-గామును, అయిన) రాహువు, (రాహువు సర్పరూపమయిన గ్రహము.) కఱచియును, నిన్ను-ఏమి

♦ శా. పా. 'తనరఁగామనియెడు'

'గాము' సరళాది గావున 'గా' కు ముందరసున్న పెట్టుటతప్పు. శాస్త్రిగారు పెట్టినందున వావిళ్లవారు - కొండపల్లివారుగూడా పెట్టినారు.

చేయకపోయెను; అదేమి = ఎందువల్ల? అకట = అయ్యో, నీవు, ఓషధీశుండ వగుటనో = మందుమాకులకధికారివగుటవల్ల కాబోలు! (ఈశ్వరవేరు; విసబొగ్గి, అనుఓషధులు విషహారములు. అట్టియోషధులకు చంద్రుడధిపతి.— 'ఓషధీశో నిశాపతిః'. అమ)

పాము ముదిసి గ్రహమగునని జనశ్రుతి.—

క. 'పాము కడుముదిసి కడపటగానగు చందమున వార్ధకంబునఁ గ్రోధం
బేమియు మానకమండెడు నా ముని మునియే? తలంపనది యుందపమే?'
(మను. 4-88)

చ. †'సకలము కాలకూటసహజన్ముఁ సుధాకరుఁ' డండ్రు నిక్కమౌ
నో కాయిది? యంచు నోసితమయూఖ నినుం దెలియంగఁ గోరి యూ
రక యటు చేరినంతఁ దలప్రాణము దోఁకకు వచ్చె; లెక్కసే
యక దిగమ్రింగెనేని యకటా! యలరాహువు మన్కిగాంచునే?

టీక.—సకలముఁ = లోకమంతయు, సుధాకరుఁడు = అమృతకిరణుడయిన చంద్రుడు, కాలకూట సహజన్ము = కాలకూట విషము(నకు) తోడబుట్టినవాడు (=పేరుకు సుధాకరుడేగాని నిలువెల్లవిషము.) అండ్రు = అందురు. ఇది నిక్కమౌనో? అంచుఁ, నినుఁ తెలియంగఁగోరి = (కర్త – రాహువు) నీ తత్త్వమును తెలిసికొనవలెనని ఉబలాటపడి, ఓ సితమయూఖ = చంద్రుడా, ఊరక, అటుచేరినంతఁ = నిన్ను స్పృశించినంతనే, తలప్రాణము తోఁకకువచ్చెఁ = అతనికి ప్రాణాంతకమయ్యెను. రాహువు సర్పరూపి కావున తలప్రాణములు నిజముగా తోకకేవచ్చె నని సారస్యము.—పాములు మొదలగు కొన్ని సరీసృపములకు చరమవేళ ప్రాణము తోకలోనికివచ్చుట సహజము.) లెక్కచేయక = దానిని లక్ష్యపెట్టక, అలరాహువు, దిగమ్రింగెనేని= నిన్ను పూర్తిగా మ్రింగినయెడల, మన్కికాంచునే = బ్రతుకునా? (బ్రతుకడు – చచ్చునని భా.)

'సకలము = లోకమంతయు' అనుటకు.—

'ఈ సకలంబునం గల మహీపతి వర్గము' (శృం. నై. 4-136)

---

† శా. పా.—'సకలుఁడు' ('=కళలుగలవాఁడు' అని పూ. టీ.)

చంద్రుని 'సకలత్వ' విచారముతో రాహువున కెట్టి ప్రయోజనమును పద్యమున నుద్దిష్టము కాలేదు. 'సకలము కాలకూట సహజమ్ము' అని, పూ. ము. పా.; 'సకలము...సహజన్ము' అని, తంజ. తాళ. పా.

'ఈ సకలంబునన్ = ఈ ప్రపంచమునందంతటను'-అని, సర్వంకషావ్యాఖ్య. 'తలప్రాణము తోఁకకువచ్చు'- అను జాతీయమున కొకటి రెండుదాహరణములు.

చ. 'చెఱకువిల్లు, పువ్వులవె చిక్కని చక్కని యమ్ము, లేయుచో
గుఱియవె చిత్తముల్, హరుఁడు కోపమునం గనుఁగొన్న నంగముం
బఱిపఱి యయ్యెనట్టె, తలప్రాణము తోఁకకువచ్చె, నెవ్వరిం
గఱచు ననంగుఁ డేమిటికిఁ గంపము చెందెదవంబుజాననా.'(దశ. చరి. 3-129)

ఉ. 'కాయము వంగి తాముదిసెఁ, గన్నులునుం బొరగప్పెఁ, గాలు పే
దాయె, నటంచు మరోసి నరసాధిపనందన కృష్ణరాయ, యీ
భూయువతీలలామ నినుఁబొందిన నాఁడి భుజంగభర్తకున్
బాయని చింతచేత దలప్రాణము తోఁకకు రాకయుండు నే!' (చాటు-మంజరి.)

గీ. ♦మలయపవమాన బాలకుల్ మందులు గద,
యమృతకరుఁడవు గద నీవు కమలవైరి,
యకట యిటులయ్యుఁ బెంపు సేయంగఁ దగునె
యంగజవ్యాధులను మాన్పకం గరంబు? ౧౭౬

టీక.—కమలవైరి = చంద్రుఁడా, మలయపవమాన బాలకుల్ = మలయ పర్వతమునుండి వచ్చు గాలిపిల్లలు, మందులుగద? = తెలివిలేని వాండ్లుగదా! .— మలయమారుతములు మందములని భా; మందులుగద = ఔషధములుగదా? అని చమత్కారము. నీవు, అమృతకరుఁడవుగద = మృతిలేకుండా చేయువాఁడవుగదా? .— చంద్రుడు అమృత కిరణములు గలవాడని - భా; అమృతహస్తముగల వైద్యుడవుగదా - అని చమత్కారము. ఇటులయ్యున్, అకట, అంగజవ్యాధులను = మన్మథతాపమును (శరీరమున గలుగు జబ్బులననియును) మాన్పకన్ = పోఁగొట్టక, కరంబు = మిక్కిలిగా, పెంపుసేయంగన్ = వృద్ధిచేయుట, తగునె?

---

♦ శాస్త్రిగారి ప్రతిలో ౧౭౫ మొదలు ౧౮౪ వరకునుగల పద్యములు వరుసచెడి యీక్రిందిరీతిగా తారుమారుగా ముద్రితములైయున్నవి.

౧౭౫, ౧౮౧, ౧౮౨, ౧౮౩, ౧౭౬, ౧౭౯, ౧౮౦, ౧౭౭, ౧౭౮, ౧౮౪, వీనిలో, ౧౭౫, ౧౭౬, ౧౭౭, ౧౭౮. చంద్రదూషణము.

౧౭౯ - మధువ్రత మారుతదూషణము.

౧౮౦ మారుత చంద్రదూషణము.

౧౮౧ మొదలు ౧౮౪ వరకును మన్మథదూషణము.

విరహులను బాధించుట తగదని మంగులయిన మలయానిల బాలకులకు చెప్పి మాన్పింప సమర్థుడవు, స్వయము అమృతకరుడవు, అయ్యును చంద్రా నీవు వారితో చేరి మదనతాపమును రేపి వియోగులను బాధించెదవు. ఇదినీకుతగునా? అని, తా.

నీవు అమృతహస్తముగల వైద్యుడవైతివి. చేతిలో సమృద్ధిగా 'మందులు' నుండెను. రోగములను మాన్పక పెంపుచేసెదవేమోయీ? అని చమత్కారము.

'మాన్పకన్' అని వ్యా. క్త్వా. మును ద్రుతాంతముగా వాడవచ్చునని గిడుగు వారి సిద్ధాంతము. (చూ. బాల. శర. పు. 225.)

చ. పలుమఱు పచ్చరాచలువబండల వ్రాలుచుఁ బారిజాత†మం
జులలవలీనికుంజముల సోలుచు విన్నదిఁ దేలుచున్ సురల్
నెలకొని కంటికిన్ నిదుర లేక చరించుచు నుండు టెల్ల నీ
కళలు భుజింపఁగా నయిన కాఁకకుఁ గాక సుమీ సుధాకరా.

టీక.— సుధాకరా = చంద్రుడా, సురల్ = దేవతలు, పలుమఱున్ = మాటిమాటికిని, పచ్చ...వ్రాలుచున్ = చల్లని మరకత శిలలమీదపడి పొర్లాడుచు, పారి...సోలుచున్ = — పారిజాతములయొక్కయు, వంజుల = అశోకముల యొక్కయు, లవలీ = వెన్నెల తీగెలయొక్కయు, నికుంజములన్ = పొదరిండ్ల యందు, సోలుచున్ = వివశులై పడియుంటూ, విన్-నదిన్ = ఆకాశగంగయందు, తేలుచున్ — ఈదులాడుచు, నెలకొని = ఉండియును, కంటికిన్ నిదురలేక చరించుచు-ఉండుటెల్లన్, నీకళలు - భుజింపఁగాన్= భుజించుటచేత, అయిన = కలిగిన, కాఁకకున్ = తాపమునకు, కాక చుమీ = తాళలేకనే సుమా.

స్వర్గమున మరకతమణులుతప్ప మరి రాళ్ళులేవు గాన మరకతశిలలమీద వ్రాలుటయు, పారిజాతాదులు తప్ప ఇతరవృక్షములులేవు గావున పారిజాతాది నికుంజములయందు సోలుటయు, గంగతప్ప మరి వేరు నదిలేదు కావున గంగలో తేలుటయు, అనిమిషులుగావున నిదురలేకుండుటయు దేవతలకు స్వభావము. స్వభావ లక్షణములకు చంద్రకళలు భుజించుటచేత కలిగినతాపమును కారణముగా చెప్పుట ఉపాలంభము.

---

† శా.పా.— 'మంజుల.' ('పారిజాత వృక్షములయొక్క, మంజుల = మనోజ్ఞమైన, లవలీనికుంజములన్ = తీఁగ పొదరిండ్లయందు.' అని పూ. టీ.)

'పారిజాతలవలి = పారిజాతములయొక్క తీఁగ' అనుట పొరపాటు. 'లవలి' ఒకజాతి తీగెయొక్క పేరుగాని లతాపర్యాయపదము కాదు.

చ. గరళపుముద్ద దిన్న కఱకంఠుఁడు నీకళ దాల్పఁగా నిశా
కర జడగట్టి మీఁద హిమగాంగజలంబుల నించి యందు మే
న్నొరయఁగ నుండఁజేసె నటు లుండియుఁ దా సగ మయ్యె హా! సుధా
కరుఁడవె యైన నిన్ వెడలఁ గ్రాయఁగ నేమిటి కిల్ల రాహువున్ ?

టీక.— కళ = చంద్రునిలోపదారవపాలు, జడగట్టి = జడలు జూటముగా బిగించి, హిమగాంగజలంబులన్ = చల్లని గంగోదకములను, నించి = నింపి,— సగ మయ్యెన్ = మిక్కిలిగా కృశించెను. (అర్ధనారీశ్వరుడయ్యెనని చమ.) సుధాకరుడవె యైనన్ = అమృతకిరణములు కలవాడవే యైనయెడల, రాహువు, వెడలన్ గ్రాయఁగ నేమిటికిన్ = వెళ్లగ్రక్కుట యెందుకు ?

ఓయి చంద్రుడా, గరళము నవలీలగా మ్రింగిన కాలకంఠుడు నీలోపదారవభాగ మయిన ఒక్క కళను ధరించిన మాత్రమున గలిగిన తాపమునకు తాళలేక జడలు జూటముగాకట్టి అందులో చల్లని గంగాజలములనింపి నిరంతరమును తాల్చుచుండియు, తాపము తగ్గక సగమయ్యెను. ఇక నీ నిండుకళలకు ననుబోటులా తాళగలవారు ? ఓయీ నీవు నిజముగా అమృతకిరణుడవేనా ? అయితే రాహువు నిన్ను మ్రింగక వెళ్లగ్రక్కుటకు కారణమేమి ? నీవు విషకిరణుడవుగాని అమృతకిరణుడవు కావు అని - తా.

'జడగట్టి - అందు గాంగజలమునించి' అనుటచేత గంగను శిరస్సున ధరించె ననియు, 'సగమయ్యె' ననుటచేత, అర్ధాంగమున పార్వతిని వహించె ననియు, ధ్వని. చంద్రకళ కామోద్దీపకము. కావుననే కరకంఠుడు కామారియయ్యును, చంద్ర కళాధారణమువలన గలిగిన కామోద్రేకమున కోరువలేక ఒకరికిద్దరు స్త్రీలను భరింప వలసిన వాడయ్యెననియు, 'గరళపుముద్ద మ్రింగిన' అనుటచేత, చంద్రకళవల్ల గలిగిన తాపము గరళముకంటెను దుస్సహమనియు వ్యంగ్యము.

క. వ్రతమా యిటు లేఁచ మధు
వ్రతమా? నీ కుచితమా విరాళిం బడునా
రుత మాలింప వయో చా
రుతమామోదయుతమా చిఱుతమాఱుతమా. ౧౭౯

టీక.— మధువ్రతమా = తుమ్మెదా, ఇటులు-ఏఁచన్ = ఈరీతిగా బాధించుటకు - వ్రతమా = నీకిదేమి వ్రతమా? చారుతమ = మిక్కిలి మనోజ్ఞమైన, ఆమోద

యుతమా = పరిమళముతో కూడుకొన్నదానా, చిరుతమారుతమా = ఓసి పిల్ల వాయువా, విరాళికెపడు = వియోగబాధ ననుభవించుచున్న, నారుతము = నాగోడు, ఆలింపవు, అయో, నీకుచితమా = నీకు ధర్మమేనా ?

పంచచామరము.

$ జొహారు మీకుఁ జల్లగాఁగఁ జూడుఁ డోసమీరకం
జహారులార మంటమారి శంబరారిఁ గూడి నన్
గొహారు సేయ నేల సారెకున్ జలంబునం భుజం
గహారుపాద మాన మీరు కాఁక లింక † రేఁచినన్. ౧౮౦

టీక.— ఓ సమీరకంజహారులార = ఓ మలయమారుత చంద్రులారా, (కంజహారి = కమలములను హరించువాడు) జొహారు = నమస్కారము, మంటమారి = ఎదుటిమే లోర్వలేక బాధించువాడైన, ('మంటమారి a peevish or pestilent fellow' బ్రౌను.— మన్మథుడు శంకరుని కంటిమంటను పొందినవాడు కావున మంటమారి) *శంబర+అరిన్ కూడి = (శంబరాసురునికి శత్రువైన) మన్మథునితో చేరి, నన్ గొహారుచేయ నేల = ఎందుకు బాధించెదరు. ఇంక, కాఁకలు రేఁచినన్ = నాకు తాపమును రేపితిరా, భుజంగహారు పాదమాన = పరమేశ్వరుని పాదముమీదఆజ్ఞ (=ఒట్టు.)

'భుజంగహారు' డనుటచేత శివుడు భుజంగములచేత సమీరచంద్రులను కరిపించునని భా. పాములు గాలి నాహరించునవి కావునను, చంద్రునికి విరోధియైన రాహువు సర్పరూపి కావునను, సమీరచంద్రుల కిరువురకును పాములన్న భీతియే.

మంటమారి = మండిపడు స్వభావము కలవాడు; మండుట స్వభావముగా గలవాడు అనుటకు.—

$ ఈపద్య మించుకమార్పుతో 'విజ'లో ఉన్నది. (చూ. 3-49)

† శా. పా. - 'c జేసినన్'

* శాస్త్రిగారు 'విజ' టీకలో 'శంబరారిన్ = మన్మథుని (నీటికి శత్రువయిన యగ్నిని - అనఁగా - అగ్నివలె ఏర్చువానిని అనియు)' అని విశేషార్థము వ్రాసినారు. పొరపాటు. అగ్నికి నీరు శత్రువుగాని నీటికి అగ్ని శత్రువుకాదు. — క. 'తన గుణము పూనియున్నాఁ, డని పగతుని నమ్మఁబోల దనిశము మదిలో, ననలశిఖా తప్తోదక, మనలుని పైఁజిందిచల్లనార్చునో లేదో?' (వేం. పంచ.)

మ. 'రవి తీవ్రద్యుతియంద్రు, పావకుని తేజామంతుమారంద్రు, వా
రి విధంబుల్ వెనుపంజుక్రించి దివియల్ రేరాజ నిన్నెన్నుచో;
నవునాఁదావక తేజమొక్కక చుమీ †యబ్జాప్తుఁ డబ్ధిఁ బడున్
భవనంబుల్ వడిఁ జొచ్చు నిచ్చశిఖి దీపశ్రేణి దంభంబునన్'

(చంద్రభా.)

ఉ. [1]ఆవిమలాత్ముఁడున్ మధునిశాటమహా[2]బలభేది యైనలో
కావనుపట్టి వై మధునిశాట మహాబలులందుఁ గూడి లో
కావళి[3]నేఁచనేల విరహార్తుల మీఁదనె [4]నీదు శౌర్యముల్
భావజ, యీహళాహళి[5]హాలాహలిముందఱఁ జూప వైతిగా. ౧౮౧

టీక.— విమలాత్ముఁడున్ = పవిత్రహృదయుఁడును, మధు...భేది. - మధు = మధుడను పేరుగల, నిశాట = రాక్షసునియొక్క, మహాబల = గొప్పబలమును, భేది = పోగొట్టినవాడును, అయిన, ఆ లోకావనుపట్టివై = జగద్రక్షకుఁడైన ఆ నారాయణుని కుమారుడవై, మధు...గూడి. - మధు = వసంతుడు, నిశాటు = చంద్రుడు, మహాబలుఁడు = వాయువు, అనువారిలోఁ చేరి, లోకావళిన్ = లోకసమూహములను, ఏఁచనేల = ఎందుకు బాధించెదవు? భావజ = ఓయి మదనా, నీదుశౌర్యముల్ = నీపరాక్రమమంతయును, విరహార్తులమీఁదనె = వియోగముచే నొగిలియున్న దుర్బలుల మీదనే (కాని బలవంతుల మీద పనికిరాదు - ఏదీ) ఈహళాహళి = ఈ

---

† 'అబ్జాక్షుఁ' డని శ. ర. పాఠము. ప్రమాదము.

(1) శా. పా.—'ఆవిమలాత్ముఁడా'

(2) పాఠభేదములు.— 'బల భేదియైన లో, కావళి నేచవేల విరహార్తుని మీదనె నీదు శౌర్యము, ల్భావజ యీ హలాహళి గపాలికి ముందఱ జూపలేవుగా, గావున నీ మహత్వ మది గానగవచ్చె గదయ్య మాకిటన్'. (పూ. ము. పా.)

'... విరహార్తుని మీఁదనె నీదు శౌర్యముల్, భావజ యీ హళాహళిఁ గపాలికిముందఱఁ జూపలేవుగా'. (శ. ర. పా.)

నీవు విరహార్తుల మీదనె జూపు శౌర్యముల్, భావజ యీ హళాహళియు భర్గుని ముందర జూపవైతిగా' (బ్రౌన్యు. పా.)

'...మీఁదనె నీదు...హళాహళి హాలాహలి ముందఱ...లేవుగా'

(తంజ, తా. పా.)

(3) శా. పా.— 'నేఁప నీవు.' (4) 'చూపు' (5) 'యుభర్గుని'

యాటోపము, హాలాహాలి ముందఱన్ = ఈశ్వరుని యెదుట (హాలాహాలము = హాలాహాలము) చూపవైతిగా = చూపింపకపోతివి గదా.

ఓరీ మదనా, నీవు పితృద్రోహివి. నీ తండ్రి మధునిశాటమహాబలద్వేషియై యుండగా, నీవు మధునిశాటమహాబల మిత్రుడవైతివి. నీ తండ్రి లోకములను రక్షించువాడైయుండగా, తద్విరుద్ధముగా నీవు లోకములను బాధించువాడ వైతివి. ఇంతఱును నీపరాక్రమమంతయును బలహీనులైన విరహుల మీద నేగాని బలవంతుల యెదుట పనికిరాదు. ముక్కంటి ముందేమాత్రము పనికివచ్చినది? అని, తా.

సీ. కరమండలాగ్రికకలన భాస్వద్ద్విజా
వలిఁ బాఱఁ దోలెడుతులువ వీవు,
నెమ్మి నెక్కుడు గాఁగ నమ్మి యుండెడు మేటి
గురుని కె గ్గొనరించుకుమతి వీవు,
మిత్త్రుండు వడినంత మెఱసి ధామంబు ముం
దుగ నాక్రమించెడు ద్రోహి వీవు,
తమ్ములమిగులఁ బాదమ్ములఁ గారించి
యల *మింటఁ గనిపించుఖలుఁడ వీవు,
గీ. కటకట †వియోగిలోకంబు కటకటపడ
ననలశరముల నేఁచకు మనిన నీవు
మానుదువె నీగుణంబు? లా నౌను మేన
మామపోలిక యిది గద మాకుమార. ౧౮౨

---

*శా. పా.. 'అలవింటన్' ( = 'ఆ చెఱకువింటిచేత' అని పూ. టీ.)

కనిపించుట 'వింటితో' (= సశరము) గాని 'వింటిచేత' కాదు. సహార్థమున వాడవలసినది 'తోడ' వర్ణకముగాని 'చేత' వర్ణకము కాదు. (చూ. బా. కార. 5.) 'మెఱుఁగుఁజామనిచాయ మేనితోడ... నెదుటఁ బ్రత్యక్షమయ్యె లక్ష్మీశ్వరుండు.' (మను. 6–101) 'అలమింట' అని సాధుపాఠము. పూ. ము. న నున్నది.

†శా. పా.— 'వియోగలోకంబు.'

'వియోగము' ధర్మము; 'వియోగి' ధర్మి. ధర్మిని చెప్పవలసినచోట ధర్మమును చెప్పుట తప్పు. పూ. టీ. వ్రాతప్రతిలో 'వియోగ' అనియున్నది. దానిని చూచి శాస్త్రిగారును, వారిని నమ్మి వావిళ్లవారును 'వియోగ' అనియే ముద్రించినారు. గొప్ప పొరపాటు.

ఈపద్యమున విషయము మన్మథదూషణము. మన్మథునికి చంద్రుడు మేనమామ. 'మేనమామపోలిక' అను లోకోక్తి నందుకొని కవి మన్మథునియందు మేనమామ (= చంద్రుని) పోలికలను పొంకముగా పొందుపరిచి ఉపాలంభించినాడు. ఆయుపాలంభము మన్మథచంద్రుల కభేదాధ్యవసాయమున సమానము. ప్రతిపాదమునను ఉపాలంభము; మన్మథార్థము; చంద్రార్థము; క్రమముగా నిబంధింపబడియున్నవి.—

టీక.— (a) కర = చేతియందలి, మండలాగ్ర = కత్తియొక్క (‘కౌక్షేయకో మండలాగ్రః’ అమ.) ఏకకలనన్ = కలిమిచేత (= చేత కత్తినిధరించి) భాస్వత్ ద్విజావళిన్ = తేజస్వులయిన (= పూజ్యులైన) బ్రాహ్మణసమూహమును, పాఱఁదోలెడు తులువవు = వెళ్లదరిమెడు దుర్మార్గుడవు. (అని * ఉపాలంభము) — $ కర... కలనన్ = చేత (చిగురాకు) కటారినిపూని, భాస్వత్ = ప్రకాశించుచున్న (= అందమయిన) ద్విజావళిన్ = పక్షిసమూహమును (అనగా చిలుకలను) పాఱన్ = పరుగెత్తునట్లు, తోలెడు = నడిపించు (= స్వారిచేయు) తులువవు = పోకిరివి. (సుకుమారములయిన పిట్టలనెక్కి పరువులు పెట్టించు పోకిరివి) అని, మన్మథపరము. ‘తోలు’ అను క్రియ స్వారి చేయుటయందు రూఢము.

"మింటన్, లీలాహారిఁదోల నింత నేర్పరియయ్యెన్". (కళా. 3-72)

"లేఁదీఁగ పులికిఁ గళ్లెముపెట్టి వయ్యాళిఁ
దోలుఁ గాఁడవి నీ దుండగీఁడు." (ఉ. రా. 7-392)

కరమండల - అగ్రిక కలనన్ = కిరణసమూహముల మొన పోటులచేత (‘కర-మండలాగ్ర - ఏకకలనన్ = కిరణములనెడి కత్తులతో’ - అనియును) భాస్వత్ † ద్విజావళిన్ = సూర్యసంబంధి పక్షిసమూహమును = చక్రవాకములను, పాఱఁదోలెడు = వెళ్ళదరిమెడు, తులువవు (అని, చంద్రపరము) చక్రవాకములకు సూర్యుడు మిత్రుడు; చంద్రుడు శత్రువు అనుట ప్రసిద్ధము.

---

* పూ. టీ. లో ఇట్లు పాలంభము - ప్రత్యేకముగా పేర్కొనబడలేదు.

$ పూ. టీ.— ‘కర...కలనన్ = హస్తములయొక్క - కత్తితో - మిక్కిలి, కూడుకొనుటచేతను, ప్రకాశించుచున్న - బ్రాహ్మణ సమూహమును. (అని మన్మ.)’

మన్మథుడు, ‘కత్తులతో కూడుకొనుటచేత ప్రకాశించుచున్న బ్రాహ్మణులను’ పారదోలినట్లు కథ యెందును కనబడదు. కావున, ఈటీక సరియైనది కాదు.

† పూ. టీ.— ‘ద్విజావళిన్ = చక్రవాక సమూహమును (అని - చంద్ర)’

‘ద్విజ’ శబ్దము పక్షి సామాన్యపర్యాయముగాని, చక్రవాక పర్యాయము కాదు. భాస్వత్ - ద్విజ = సూర్యసంబంధి పక్షుల - ఆవళి’ అని సరియైన యర్థము.

(b) నెమ్మిన్ = ప్రేమతో, ఎక్కుడుగాఁగన్ = మిక్కిలిగా, నమ్మియుండెడు, మేటి - గురునకున్ = గొప్పవాడైన, తండ్రికి, ఎగ్గొనరించు కుమతివి = కీడుగావించు కుత్సితుడవు = పితృద్రోహివి, (అని. ఉపా). - నెమ్మికిన్ = నెమలిని, ఎక్కుడు కాఁగన్ = వాహనముగా, నమ్మియుండిన - మేటి (=కుమారస్వామి) యొక్క, గురునికిన్ = తండ్రికి, (=శివునికి) ఎగ్గొనరించు కుమతివి. (అని, మన్మ) - నెమ్మిన్ = ప్రేమతో, ఎక్కుడుగాఁగ నమ్మియుండెడు, * మేటిగురునికిన్ = పూజ్యుడైన ఆచార్యునకు (=బృహస్పతికనియును), ఎగ్గొనరించుకుమతివి = ఆతనిపత్ని నపహరించిన ద్రోహివి - (అని చంద్ర).

(c) మిత్రుండు పడినంతన్ = స్నేహితుడు మరణించగానే, మెఱసి = సంతోషమున తేజరిల్లి, ధామంబున్ = ఆతనియింటిని, ఆక్రమించెదు ద్రోహివి. (ఆప్తుడైనవాడంతరించితే ఆనందముతో ఆతనికొంప నాక్రమించే - మిత్రద్రోహివి. - అని ఉపా.) మిత్రు...నంతన్ = సూర్యుడస్తమించగనే, మెఱసి =విజృంభించి, ధామంబున్=ఇండ్లని.- (అనగా ఇల్లాండ్రను = స్త్రీలను) ఆక్రమించెదు = ఆవేశించెదు, ద్రోహివి. (అని - మన్మ) ప్రొద్దు క్రుంకుటయే తడవుగా తరుణులు చక్కగా అలంకారములు చేసికొని సవిలాసముగా నుండుట స్వభావము. ఆవిలాసములే మదనావేశ లక్షణములు. సాయంకాల వర్ణనమున $ 'పరిపతతి, యువతిజనేషు శనైశ్శనైరనంగః' అన్న కాళిదాస మహాకవి వాక్యమిటు స్మరింపదగి యున్నది. మిత్రుండు పడినంతన్ = సూర్యుడస్తమించగనే, మెఱసి = ప్రకాశించి, ధామంబున్ = కాంతిని - తేజస్సును, ఆక్రమించెదు- ద్రోహివి. (సూర్యుడున్నంతవరకు నణగియుండి ఆతడు పడిపోయినంతనే ఆ తేజస్సు నపహరించి తేజరిల్లు దుండగీడవు - అని, చంద్ర).

(d) తమ్ములన్ = తోబుట్టువులను, పాదమ్ములన్ కారించి = కాళ్ళతోతన్ని బాధించి, అలమి = ఆక్రమించి, ఇంటన్ కనిపించు ఖలుఁడవు = ఇంటియందు ప్రవే

---

*పూ. టీ.— 'శ్రేష్ఠుడైన బృహస్పతికి'

శ్రేష్ఠుడైన బృహస్పతి - శ్రేష్ఠుడుకాని బృహస్పతి; అని బృహస్పతులలో రెండురకములా ?

$ 'పరిపతతి పయోనిధౌ పతంగః
సరసిరుహాముదరేషు మత్తభృంగః
ఉపవన తరుకోటరే విహంగః
యువతిజనేషు శనైశ్శనై రనంగః.'

ఇందు తుదిపాదము మాత్రమే కాళిదాసమహాకవిది.

శించు దుష్టుడవు. (తమ్ములను తన్ని వెళ్ళగొట్టి యింటిని స్వాధీనము చేసికొనెడు దుష్టుడవు - అని, ఉపా.).— [1]తమ్ములు + అన్ = కమలములనెడి, మిగులన్ బాఁదు+అమ్ములన్ = మిక్కిలిగా ప్రహరించెడి బాణములచేత (యువతీయువకులను) కారించి = బాధించి, [2]అలమి+యింటఁ గనిపించు ఖలుఁడవు = ఆక్రమించి యిల్లు వదలకుండు తుంటరివి. (యువతీ యువకులను తామర తూపులతో కొట్టి బాధించు వాడవు.— అని, మన్మ.).—

['పాదమ్ములన్;' 'బాఁదమ్ములన్' అనుటలోఁగల అర్ధానుస్వార వ్యత్యయ మున్ను, 'బాదు+అమ్ములు' అనుచోట 'బాదునమ్ములు' అని నుగాగమము రాక పోయుటయు శ్లేషకలిమిచేత సాధువులే.]

తమ్ములన్ = కమలములను, పాదమ్ములన్ = కిరణములచేత, మిగులన్, * కారించి= బాధించి, అల - మింటన్ = ఆకాశమునందు, కనిపించు ఖలుఁడవు. (అని చంద్ర.)

కటకట = అయ్యో, వియోగిలోకంబు = విరహిసమూహము, కటకటపడన్ = సంతాపపడగా, † అనలశరములన్ = అగ్ని (సదృశ) బాణములచేత (ననల శరములన్ = పూలబాణములచేత - అనియును) ఏఁచకు మనినన్ = బాధింపవలదోయీ అన్నను, నీగుణంబుమానుదువె? (=మానవు). మాకుమార = లక్ష్మికుమారుడవైన

---

1 పూ. టీ.— 'తమ్ములన్ = తామరలతో, పాదమ్ములన్ = పాదుకొనునట్టి బాణములతో - అని, మన్మ'.

'తామరలతో పాదుకొనునట్టి బాణము' లనగా అర్థమేమో? 'పాదు = పాదు నట్టి; పాదుకొనునట్టి' అనుట తప్పు. 'పాదు' విశేష్యముగాని క్రియ కాదు.

2 పూ. టీ.— అలవింటన్ = ఆ చెఱకు వింటిచేత.'

'వియోగులకు' మన్మథుడు 'చెఱకువింటిచేత' కన్పించుననుట భాషా మర్యాదను బట్టియు, లోకానుభవమును బట్టియు తప్పే. కనిపించుట 'వింటితో = ధనుస్సహితుడై' కాని 'వింటిచేత' కాదు.

* పూ. టీ.— 'కారించి = నశింపఁజేసి'

'కారించు' అను క్రియకు శ. ర. లోను, సూ. ని. లోను, 'బాధించు; పీడించు' అను అర్థములే యున్నవి. బ్రౌణ్యములో మాత్రము - 'కారించుట' To inflict, kill or destroy' అనియున్నది. కాని ఆయర్థము ప్రకృతమున కుచితముకాదు. చంద్రుడు కమలములను ముడుఁగజేయునేగాని నాశము చేయడు. కావున 'కారించి = బాధించి' అనుట యుచితము.

† పూ. టీ.— 'ననలశరములన్ = పుష్పబాణములచేత' అనిమాత్రమే.

మన్మథుఁడా, మేనమామపోలికయఁ దగద = లోకములో 'మేనమామ పోలిక' అను మాట కర్థమిదేకదా! నీవు నీ మేనమామయైన చంద్రుని పోలికలే కలిగి - అతనివలెనే లోకమును బాధించుచున్నావు.

ఉ. విం ఖరవృత్తిఁ జూపఁ దగవే విరహార్తులపై? [1]మరందవ
త్పుంఖశరేక్షుచాపములు పూని టు లేటికి సాము సేసెద
ల్కం ఖల మా శరీర మని కాన కనంగ? యయో 'శరీర మా
ద్యం ఖలు ధర్మసాధన' మ టన్నది విన్నది లేదొ యెన్నఁడున్?

టీక.- అనంగ = మన్మథుఁడా, ఓన్ = నామాట వినుము, విరహార్తులపైన్ = వియోగముచే బాధపడుజనులమీద, ఖరవృత్తిన్ = క్రూరవర్తనమును, చూపన్ తగవే= ప్రయోగించుట న్యాయమగునా? (= కాదనుట).- శరీరము, ఖిలమానని = చినిగి చెడిపోవునని, కానక = ఎరుగక (అనంగుడు = అంగములేనివాడు కావున ఎరుగడని భా.) మరందవత్ పుంఖశర = మకరందముతో కూడిన పింజలుగల బాణములు- (= పుష్పబాణములు) ఇక్షుచాపము = చెరకువిల్లు, పూని, [2] అల్కన్ = కోపముతో, ఇటులెందుకు సాముచేసెదవు = ఇట్లెందుకు బాణములతో కొట్టి మమ్ము బాధించెదవు? శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్ = ధర్మాచరణమునకు శరీరమే మొదటి ఉపకరణము, అటన్నది = అన్నవాక్యమును, ఎన్నఁడున్, విన్నదిలేదొ = విననేలేదా!

ఓయి యనంగుఁడా, మాశరీరమును నీవు పూవుటమ్ములతో చినిగి చిల్లులువడ కొట్టుచున్నావు. దీనివలన నీకే నష్టి. ఏమందువా? ఏధర్మము నాచరించుటకైనను శరీరమే మొదటి సాధనము. మాశరీరములు చక్కగా నుండిననేగదా మేము నిన్నారాధింపగలుగుట.

---

[1] శా. పా.— 'ధురంధరత్ పుంఖ' ('ధురంధరత్ = సమర్థములయిన, శర ఇక్షుచాపములు = బాణములను చెఱకువింటిని' అని పూ. టీ.)

'చాపమిక్షువు' అని చెప్పినప్పుడు శరములును 'ఫలానివి' యని చెప్పుట అవసరము. తంజ - ప్రతులలో 'మరందవత్' అను పాఠమున్నది. 'ధురంధరత్' పూ. ము. పా. అసాధువు. 'ధురంధరత్' అను రూపము పుట్టదు.

[2] పూ. టీ.— 'అల్కన్ ఖిలము కౌన్ = కోపముచేత దేహము నశించును.'

వట్టిమాట. మితిమీరిన కోపముగల అభినవదుర్వాసులిప్పుడెందరో యున్నారుగదా! మరి వారందరి దేహములును నశించినవా? లేదే! పూ. టీ. అన్వయమార్గము సరియైనదికాదు.

చ. చిడిముడిపాటునన్ జెఱకుసింగిణిఁ బూని మధుప్రియత్వమే
ర్పడ వడిలావు లున్నహరిపైని జివుక్కున నెక్కి యుక్కునన్
‡వెడలెదు *సందుచూచి తమి నేఁడిదె గోవధమాచరించు పూఁ
పడరఁగ నీవు పచ్చితురకాదువు పాంథులకున్ మనోభవా. ౧౮౪

టీక.— (ఈపద్యమునందు మన్మథునకును తురకకును అభేదాధ్యవసాయము.) మనోభవా = మన్మథుడా, చిడిముడిపాటునన్ = కోపావేశపు తొందరతో, చెఱకు సింగిణిన్ పూని = చెరకువింటిని ధరించి ($ చెఱకు = ఇతరులను చెఱబెట్టుట (=బాధించుట) కొరకు, సింగిణిన్ = ధనుస్సునుపూని, అని తురకపరము) మధుప్రియత్వము ఏర్పడన్ = వసంతునితోడి చెలిమి వెలయగా, (మద్యమునందలి ప్రేమ - అని తు.ప.) †వడిన్ = వేగముగా, లావులు + ఉన్న - హరిపైని = రెక్కలుగల గుఱ్ఱము

---

‡ శా. పా.— ఉక్కునన్ - 'వెడలెదు' - చంద్రుఁజూచి'

వధమాచరించు పూఁపడరఁగ - ఉక్కునన్ - వెడలెడు వాడు మనోభవుడు గాని చంద్రుడు కాడు. కావున 'ఉక్కునన్ వెడలెదు' అనుట ఉచితమని నాకు తోచినది.

* శా. పా.— 'చంద్రుఁజూచి'.

'చంద్రుఁజూచి' అనుటకంటె 'చందుఁజూచి' అనుటలో చమత్కారమున్నది. తురకపక్షమున 'చందు' తగినపదము. 'విజ' (3-66) లో, ఈ పద్యము 'చందుఁజూచి' అను పాఠముతోనే యున్నది. 'సందుచూచి' అను పాఠము సరసతరము. వెడలెదు + చందుచూచి = వెడలెదు సందుచూచి; కళాకార్యము. సమయము కనిపెట్టి - అనే యర్థమున 'సందుచూచి' అనుట జాతీయము. ('సందుఁజూచి' అనరాదు.)— 'సందు చూచి లోగా జొరబడ్డాడు - he took an opportunity and rushed in'. (బ్రౌను) కాబట్టి, 'చందుచూచి' అనుపట్టున 'చందు' ద్వితీయార్థమున ప్రథమ యని గ్రహించునది.

$ పూ. టీ.— 'ఇక్షుధనుస్సును (ప్రియమైన వింటినిఅనియు.)'

† పూ. టీ.— 'వేగమైన ఱెక్కలుగల చిలుక (గుఱ్ఱము) మీఁద-అని, మన్మ.'
'వేగమైన ఱెక్కలు' అనుటతప్పు; 'వేగముగల ఱెక్కలు' అనవలెను. 'వడి' విశేష్యముగాని విశేషణము కాదు. కావున 'వడిలావులు' కర్మధారయ మనుకొనుట భ్రాంతి.

(=చిలుక) మీద († వడిలావులు - ఉన్న హరిపైని = వేగమును - బలమునుఁగల గుఱ్ఱము మీద, అని తు. ప.) చివుక్కున నెక్కి = తటాలున ఎక్కి, సందుచూచి = సమయమును కనిపెట్టి; 'చందుచూచి = చంద్రునిచూచి' అనియును, (చందుచూచి = [1] నెలపొడుపునుచూచి, అని, తు. ప.) ఉక్కునన్ = పరాక్రమముతో, వెడలెదు = బయలుదేరెదవు, ఇదిగో - నేఁడు, వధమాచరించు - పూఁపు = వధచేయవలెననే పూనిక, అడరఁగన్ = ఒప్పగా [2] తమిన్ = వధోత్సాహముతో, (తమిన్ = రాత్రియందు, గోవధమాచరించు పూఁపు - అడరఁగన్, అని తు. ప.; తురకలు బకిరీదు - పండుగరాత్రి, నెలపొడుపునుచూచి గోవధ చేయుదురు,) నీవు, వచ్చితి + ఉరక = రానే వచ్చితివి. పాంథులకున్ = వియోగిజనులకు, (మన్మధుడా) నీవు, పచ్చితురకౌదువు = దయాదాక్షిణ్యములులేని కరకు తురకవౌదువు. (=తురకవలె బాధించువాడవు - అని భా).

'నీవు - వచ్చితి + ఉరక' అని ఒకమారును, 'నీవు - వచ్చితురక + ఔదువు' అని మరియొకమారును, అన్వయము. 'నీవు' మీది 'పచ్చితురక' వచ్చితురక - అగుట కళాకార్యము.

---

† పూ. టీ.— 'మిక్కిలి వేగమైన గుఱ్ఱము మీఁద - అని తుదపక్కి.' 'వడి లావులు ఉన్నహరి = మిక్కిలి వేగమైన గుఱ్ఱము' అనుట అసమంజసము. 'వడిలావులు' ద్వంద్వము (=వడియును - లావును). గుఱ్ఱములకు 'వడి' ని 'లావును' జెప్పుట సంప్రదాయము.

సీ. 'వడిగల జింక తత్తడి నెక్కునెఱ రౌతు' (ఆం. నా. సం. 1-22.)

క. 'లావుగల యద్దె గుఱ్ఱపు
జావడముల మీఁద మాత్రసంచులు దూలన్.' (ఆముక్త. 2.96.)

1 'విజ' టీకలో, శాస్త్రిగారు 'ఉదయించుచున్న నెలపొడుపును - చూచి' అన్నారు. తప్పు. 'ఉదయించుచున్న నెలను చూచి' అనిగాని, 'నెలపొడుపును చూచి' అనిగాని అనవలెను. ఉదయించునది 'నెల' గాని 'నెలపొడుపు' కాదు. 'పొడుపు' అనగా ఉదయమే. 'నెలపొడుపు; ప్రొద్దుపొడుపు' అను పదములు సుప్రసిద్ధములు.

2 పూ. టీ.— 'తమిన్ = ప్రేమచేత, గోవధము - గో = భూమియొక్క (అనగా భూమిలోని వారియొక్క) - వధము = మారణము, (అని మన్మ) గోవధము= ఆవును చంపుట, (అని తురక.)'

మన్మథుడు - తురక - గూడా 'గోవధము' ను 'ప్రేమచేత' చేయుదురట ! వింతకాదా? వధ ప్రేమలక్షణము కాబోలును !!

వ. అని యనేక ప్రకారంబుల నవ్విశ్వంభరాజంభారి యుపాలంభం బొనరించి, మందరగిరియునుం బోలె వనరాశిమధ్యంబున మరున్నిశాచర కర భ్రమితుండై, లోభియునుం బోలె నతనుదుష్టమార్గణ గణక్షుభితుం డై, పద్మాకరంబునుంబోలె మధుపరాజిత సుమనఃపాళి యై విరాళిం దూలి యున్న సమయంబున. ౧౮౫

టీక:— అవ్విశ్వంభరాజంభారి = అభూమీపతి, అనేక ప్రకారంబులన్, ఉపాలంభంబు - ఒనరించి = చంద్రాదులను నిందించి, మందరగిరియునుం బోలెన్ = మందరపర్వతమువలె, వనరాశిమధ్యంబునన్ = సముద్రమునడుమ, (వనే సలిలకాననే, అమ.) మరుత్ = దేవతల యొక్కయు, నిశాచర = రాక్షసుల యొక్కయు, కర = హస్తములచేత, *భ్రమితుండై = త్రిప్పబడినవాడై, (వనరాశిమధ్యంబునన్ = నట్టడవిలో, మరుత్ = చల్లని గాలిచేతను, నిశాచరకర = చంద్ర కిరణముల చేతను, భ్రమితుండై = భ్రమింపజేయబడినవాడై, అని - రాజపరము - ప్రకృతార్థము) లోభియునుంబోలెన్, పిసినారివలె, అతను = విస్తారమైన, దుష్టమార్గణ గణ = దుర్మార్గులయిన యాచకుల సమూహముచేత, ('మార్గణో యాచకార్థినౌ' అమ) క్షుభితుండై = క్షోభ పెట్టబడినవాడై, (అతను = అనంగుని యొక్క, దుష్టమార్గణగణ = క్రూరములయిన బాణముల సమూహముచేత, ('కలంబమార్గణ శరాః' అమ) క్షుభితుండై, అని,

* పూ. టీ.— (a) 'వాయువుచేతను చంద్రకిరణముల చేతను భ్రమపడినవాఁడు - (అని రాజ.) (b) దేవదానవులచేత తఱవఁబడినది (అని మందర.)' —

(a) భ్రమితుఁడనగా, 'భ్రమింపజేయ బడినవాడు' గాని 'భ్రమపడినవాడు' కాడు. 'రాజు చంద్ర కిరణములచేత భ్రమపడెను'; 'మందరము దేవదానవులచేత భ్రమపడినది,' అను వాక్యములు దుష్టములు.

(b) 'దేవదానవులచేత 'తరువ' బడినది - మందరము' అనుట పొరపాటు. తరువబడినది - పాలసముద్రము గాని 'మందరము' కాదు. నాడు జరిగినది సముద్ర మథనముగాని మందర మథనముకాదు. - క. 'అమరాసుర వీరులు ము, న్నమల ప్రయోరాశి త్రచ్చి.' (ఆది. 2—8.)

'తఱవఁబడినది' అనుటయును తప్పే. ధాతువు 'తరుచు' (రూపాం - త్రచ్చు) గాని 'తఱచు' కాదు. (చూ. శ. ర.)

సీ. 'తరుచుట చిలుకుట త్రచ్చుట యన మథనాభిధానంబు.' (ఆం. భా. 2—165.)

సీ. 'తరిచిన మజ్జిగ తరువాయి దేహంబు.' (సర్వ. సా. సం. 3—10.)

రాజ. (ప్ర.) పద్మాకరంబునుం బోలెన్ = తామరకొలనువలె, మధుప-రాజిత = తుమ్మెదలచేత ప్రకాశించుచున్న, సుమనఃపాళియై = పుష్పసమూహము కలవాడై, (* మధు = మద్యముచేత, పరాజిత = ఓడింపబడిన (= వశపరచుకొనబడిన) సుమనఃపాళియై = (మంచి) మనసుకలవాడై - అని, రాజ. ప్ర. వియోగబాధ తెలియకుండుటకై మధువును గ్రోలి తన్మూలమున స్మృతి తప్పియున్నాడని భా) విరాళిన్ తూలి = విరహబాధచేత దిటవుచెడి.

చ. ఇనుఁ డుదయాద్రినండఁగొని యిప్పుడె సంజను [1] ముట్టడింపఁగన్
బనిచి [2] రయంబుతోడ నసమాన జవాశ్వములేర్చి దాడి దా

---

* పూ. టీ.— ‘మధు = మకరందముచేత, పరాజిత = జయింపబడిన - అనగా అధికముగా మకరందము గలిగిన, పుష్పసమూహము గలవాఁడు. (అని రాజ.) ‘తుమ్మెదలచేత ప్రకాశించుచున్న పూలమొత్తము గలిగినటువంటి. (అని పద్మా.)’

రాజు ‘పుష్పసమూహములు గలవాడు’ అనుటలో భావమేమో వారు చెప్పలేదు. రాజు పద్మాకరముగూడా పూలు గలవారుగనే చెప్పబడుటలో కవితాచమత్కార మేమున్నదో నాకు తోచలేదు. ‘పరాజిత = అధికముగా గలిగిన’ అనునది వింతటీక. అధికధనము కలవాడు; అధిక సంతానము కలవాడు; అనునర్థమున ‘ధనపరాజితుడు’— ‘సంతానపరాజితుడు’ అనవచ్చునేమో!

1 శా. పా.— ‘ముచ్చిలంబడన్’ (‘సంజను = సంధ్యను, (అనిసూర్య) సంధ్యయందు (అని ప్రభు), ముచ్చిలంబడన్ = అపహరించుటకు’ - అని పూ. టీ.)

‘అపహరించు’ అనే యర్థమున ‘ముచ్చిలు’ అనుక్రియయున్నదిగాని, ‘ముచ్చిలంబడు’ అను క్రియలేదు. ‘దొంగ సొమ్ములు ముచ్చిలంబడెను’; ‘రాజు ఆ దేశమును ముచ్చిలంబడెను’ అను వ్యవహారము లోకమునలేదు.— అది యట్లుండగా, రాజయినవాఁడు బలిమిచేత రాజ్యాదులను కైకొనుట ‘ముచ్చిలుట’ గా చెప్పుట అనుచితము.

‘ముచ్చిలింబడన్’ అని పూ. ము. పా.; ‘ముచ్చిమింబడన్’ అని తంజ. తా. పా. ‘ముట్టడింపఁగన్’ అని నేను చేసిన సవరణ.

2 శా. పా.— ‘రయంబతా వెనుకఁ బ్రాఙ్ముఖపార్శ్వము తేర్చి’.— (‘ప్రా...లు = తూర్పు తొలిభాగముయొక్క ప్రక్కలు, ఏర్చి = ఎండకాయునట్లు చేసి’ అని పూ. టీ.)

‘ఏర్చు’ అను క్రియకు ‘ఎండకాయునట్లుచేయు’ అనే యర్థము లేదు. తూర్పుభాగముయొక్క ప్రక్కలు - ఎండకాయునట్లు, సూర్యుడు చేసెననుటలో అర్థము లేదు. సూర్యుడు స్వయముగా - ఎండకాయునేగాని, ఇతరులచేత ‘కాయింపడు’

నొనరిచె [3] నొంటిమై బయట నుండక పొమ్మని వేగుఁదెల్ప వ
చ్చినగతి [4] వేగుఁజుక్క పొడిచెన్; జనె [5] రాజుపశ్చిమాద్రికిన్.

ఈ పద్యమున వేగుచుక్క వేగులవాడుగా ఉత్ప్రేక్షింపబడుచున్నది.—

టీక.— ఇనుఁడు = సూర్యుడు (ఇనుడనెడి ప్రభువు. అని అర్థాం) ఉదయాద్రిన్ = పొడుపుకొండను, ('ఉదయగిరి' యను ప్రదేశమును - ప్రభు) అండగొని= ఆసరాచేసికొని, సంజను = ప్రాతస్సంధ్యను, ముట్టడింపఁగన్ = ఆక్రమించి వశపరచుకొనుటకు = ఇప్పుడే, పనిచి = అరుణుని నియోగించి; అరుణోదయము కాగానే సంధ్య అంతరించును. ('సంజ' యను స్థలమును ముట్టడి వేయుటకు తగినవారిని నియోగించి, అని ప్రభు) రయంబుతోడన్ = వడిగా, అసమాన - జవాశ్వములు - ఏర్చి = సమానసంఖ్య కానట్టి (= బేసి=సప్త) సంఖ్యగల వేగవంతములైన గుఱ్ఱములను ఏర్పరచుకొని, (అసమానజవ = సాటిలేని వేగముగల, అశ్వములన్, అని-ప్రభు) తాన్ = సూర్యుడు (ప్రభువు) దాడిన్ - ఒనరిచెన్; (ఉభయత్ర సమానము) కావున, ఒంటిమైన్ = ఒంటరిగా, బయటన్ - ఉండక = ఆకాశమున నుండక;— 'మిన్నుబయలు' ఆం. భా. 1—69 (ఇంటి వెలుపలనుండక, అని ప్రభు.) పొమ్మని = చాటునకు - పొమ్మని, వేగున్ - తెల్పవచ్చినగతిన్ = చంద్రునికి సమాచారము తెలుపవచ్చిన విధముగా, * వేగుఁజుక్క = వేకువచుక్క ( = శుక్రనక్షత్రము) పొడిచెన్ = ఉదయించెను ('వేగు'చుక్క కావుననే 'వేగు' తెలుప వచ్చినదని సారస్యము.) రాజును = చంద్రుడుగూడా, (పరాజితుడైన రాజున్ను - అనిఅర్థాం) పశ్చిమాద్రికిన్ చనెన్ = పడమటికొండ చాటుకు పోయెను = క్రుంకెను. (పరాజిత ప్రభువు పడమటికొండ వెనుక తలదాచుకొనెను అని, అర్థాం).

---

'పవమానజవాశ్వము పేర్చి' పూ. ము. పా.; 'తా ను న స మ ప్రజవాశ్వము లేర్చి,' తంజ. తా. పా.

3 శా. పా.— 'ఓటమిన్' ('=అపజయముచేత - (అపజితుఁడవైయనుట)' అని పూ. టీ.)

'అపజయముచేత బయటనుండక పొమ్ము' అనుటలో అర్థములేదు. 'ఓటమిన్' అని మద. తా. పా.

4 శా. పా.— 'వేగుచుక్క'.— 'వేగుఁజుక్క' సాధురూపము. (చూ. శ. ర.)

5 పా. తా.— సోముఁడు' పూ. ము.

* పూ. టీ.—"వేగుచుక్క = శుక్రుఁడు.' అని మాత్రమే.

'సూర్యుడు, సంధ్యను హరించుటకు అరుణుని నియోగించి, తాను నీపైకి దాడి వెడలి మహారయమున వచ్చుచున్నాడు. నీ వికట్లొంటరిగా బయటనుంటివా ఆపద వచ్చును. ఎక్కడ నేని తలదాచుకో; పొమ్మ్మ' అని చంద్రునికి వార్త తెలుపవచ్చిన బంటువలె వేగుచుక్క పొడిచెను. ఆవార్తను వినియే కాబోలు నన్నట్లు చంద్రుడు పడమటికొండ చాటుకుపోయెను అని తా.

జేతయైన యొక యినుడు; అతడు ఉదయగిరి నండచేసికొని విజృంభించి యుద్ధయాత్రకు వెడలుట, ఆ సంగతిని వేగులవాడొకడు పరాజితుడైన రాజుకు తెలుపుట, అంతట పరాజితుడు పడమటి కొండచాటున దాగుట, అనుకథ ఆనుషంగికము.

ఈకల్పనము గౌ. హరిశ్చంద్రలో ఇంచుకగా చేయబడి యున్నది.—

"పడపడి యుడురాజుపై దిన నాథుఁ
డదెవచ్చె ననిచెప్ప నరుదెంచు రీతి
వేగువాఁడును బోలె వేగురుఁజుక్క
బాగుగాఁ బొడిచినఁ బలపలవేగె." (పుట. 27)

మ. ఇనుఁ డన్రాముఁడు ప్రేమ సారసవనం బీడేర్పఁగాఁ జొచ్చి మిం
చినసంధ్యారుచి రక్తధారలు ప్రవర్షింపంగ వింటం గరం
బను వంద న్నిగిడించుచో సమయవాయవ్యాస్త్ర ముద్వృత్తి *వె
న్కోన మారీచనిశాచరుం డన మృగాంకుం డంబురాశిం బడెన్.

ఈ పద్యమున చంద్రాస్తమయము మారీచ సముద్రపాతముగా వర్ణింపబడుచున్నది.

టీక.— ఇనుఁడు అన్ రాముఁడు = సూర్యుడను శ్రీరాముడు, ప్రేమన్ = ప్రీతితో, సార = శ్రేష్ఠమైన, సవనంబున్ = (విశ్వామిత్రుని) యజ్ఞమును, ఈడేర్పఁగాన్ చొచ్చి = నెరవేర్ప బూనుకొని [సారస - వనంబున్ = కమలసమూహమును ('వనం - A cluster, group, a quantity of lotuses' ఆప్టే) ఈడేర్పఁగాన్ చొచ్చి = వృద్ధిపొందింప బూనుకొని, అని సూర్య.] మించిన =

---

* శా. పా. - 'నెకొ్కన'

నెకొ్కనుటయనగా స్థిరముగా ఒకచోట పాదుకొని యుండుట. అస్త్రము వింటియందు పాదుకొని యున్నచో తక్కిన కథయంతయు నబద్ధమగును. కావున ఆపాఠము తప్పు. 'వెన్కోన' అని తంజ. పా.

అతిశయించిన, $ సంధ్యారుచి రక్తధారలు = సంధ్యాకాంతివంటి కాంతిగల ఎఱ్ఱని నెత్తురు ధారలు, ప్రవర్షింపంగన్ = మిక్కిలిగా కురియగా; - ఆకాశమునుండి యజ్ఞ వేదికలమీద ఎఱ్ఱని రక్తము కురియగా, అన్నమాట. - (మించిన, సంధ్యారుచి = ప్రాతఃకాంతియొక్క, రక్తధారలు = ఎఱ్ఱని రేఖలు, ప్రవర్షింపంగన్ = విరియువారగా, తూర్పుదిక్కున అరుణ కాంతులు ప్రసరింపగా అని సూర్య.) † సమయన్ = ఆకాశమునుండి కురియు రక్తధారలు శమించుటకు, * వాయవ్యాస్త్రము = వాయు దేవతాకమైన బాణమును, ‡ కరంబు - అనువందన్ = చక్కగా, వింటన్ =

---

$ పూ. టీ.— 'సంధ్యాకాలమునకు సంబంధమైన యెఱ్ఱని కాంతులు. (నెత్తురువానలనియును.')

'రక్తధార' లనగా 'ఎఱ్ఱని రేఖలు' గాని 'ఎఱ్ఱని కాంతులు' కావు. 'సంధ్యారుచి' శబ్దమును కవి ప్రయోగించిన విధమునగల రుచి పూ. టీ. కర్తల కంటుపట్టలేదు.

† పూ. టీ.— 'సమయన్ = నశింపఁజేయుటకు'

సమయుట యనగా 'నశించుట' గాని 'నశింపఁజేయుట' కాదు. "సమసెనె కౌరవేశ్వరుని సంపద యంచు విషణ్ణమూర్తియై." (ద్రోణ. 1—28)

* పూ. టీ.— 'వాయవ్యాస్త్రము = వాయవ్యాస్త్రమను బాణము.' వాయవ్యాస్త్రమనగా వాయవ్యమయిన అస్త్రముగాని 'వాయవ్యాస్త్రమను బాణము' కాదు. అస్త్రమన్నను - బాణమన్నను - ఒక్కటే. కావున 'అస్త్రమను బాణ' మనుట తగదు. 'వాయవ్యాస్త్రము' అనునది యొకబాణముయొక్క పేరుకాదు. 'వాయవ్య- Relating to the wind, aerial.' (ఆప్టి.)

"ఆగ్నేయాస్త్రము - a fiery weapon, a weapon having the power of fire. నాగాస్త్రము - a serpant weapon; having a snaky power" (బ్రౌను.)

వాయవ్య = వాయుసంబంధమైన = వాయుదేవతాకమైన, అస్త్రము = బాణము అని సరియైన యర్థము.

‡ పూ. టీ.— 'ధనుస్సునందు - కరంబు = హస్తమును, నిగిడించుచో.'—

ధనుస్సునందు 'నిగిడింప' వలసినది అస్త్రముగాని హస్తముకాదు. ప్రాచీన కావ్యములందు 'నిగిడించు' ధాతువు 'బాణమును ప్రయోగించు' అను అర్థమున రూఢము. (నిగుడించుట - To discharge, shoot, cast, emit -" (బ్రౌను.)

(1) వ. 'అని పలికి యార్చియమ్ములు నిగిడించుచు'. (ద్రోణ. 2-49.)

(2) సీ. 'సాత్యకి డిభకుపై సాయకదశకంబు, నిగిడింప.' (ఉ. హరి. 4-250)

వింటియందు, నిగిడించుచోన్ = సంధించి ప్రయోగింపగా, (ఆయస్త్రము) ఉద్వృత్తిన్ - వెన్కొనన్ = మహావేగముతో వెంబడింపగా (ఆవేగముకు) మారీచ నిశాచరుఁడు = మారీచరాక్షసుడు, అనన్ = అనువాడు, $ మృగాంకుండు = మృగవేషము కలవాడు. (=ఒకప్పుడు మృగరూపియైనవాడును, మారీచనామకుడును అయిన నిశాచరుడు.) అంబురాశిన్ పడెన్ = సముద్రములో పడిపోయెను. (వింటన్ = ఆకాశమునందు, కరంబు = కిరణము(లు), అనువందన్ = చక్కఁగా (= సమగ్రముగా) నిగిడించుచోన్=వ్యాపింపజేయగా * సమయ వాయవ్యాస్త్రము = తన అస్తమయ సమయమనెడి వాయవ్యాస్త్రము, ఉద్వృత్తిన్ - వెన్కొనన్, తీవ్రముగా వెంబడింపగా, మారీచనిశాచరుండు - అనన్ = పూర్వము వాయవ్యాస్త్రపుదెబ్బకు సముద్రమునపడిన మారీచుడో అన్నట్లు, మృగాంకుండు = చంద్రుడు, అంబురాశిన్ పడెన్ = పడమట అస్తమించెను.

రాముడు విశ్వామిత్రయాగము రక్షింపబూనుకొనియుండగా మారీచాదులు యజ్ఞవేదికలమీద రక్తవర్షము కురిపించిరి. ఆ యకృత్యము శమించుటకు రాముడు మారీచునిమీద వాయవ్యాస్త్రమును ప్రయోగించెను. ఆ గాలిదెబ్బకు కొట్టుకొనిపోయి వాడు సముద్రమున పడెను అని రామకథ.

మారీచుడు సముద్రమున పడెననుటకు.—

"మారీచ నీచమతి రాహవమారచయ్యా
క్షిప్తః క్షణేన రఘునాయక సాయకేన
మధ్యేపయోనిధి భయేన నిమగ్నమూర్తి
ర్వేపం పుపోష జలమానుష నిర్విశేషమ్" (చంపూ. రామా.)

---

$ పూ. టీ.— 'మృగాంకుఁడు = చంద్రుఁడు.'

రామపరమయిన అర్థమునను 'చంద్రుడే' సముద్రమున పడినట్లు చెప్పుట సరికాదు

పూ. టీ.—'సమయ = ఉదయకాలమందలి, వాయవ్యాస్త్రము = బాణము వంటి వాయువును.'

వాయవ్యమనగా వాయుసంబంధమైనది గాని 'వాయువు' కాదు గనుక 'బాణము వంటి వాయువు' అను టీక తప్పు. అది యట్లుండగా - "సూర్యుఁడు వాయువును ప్రకాశింపఁజేయఁగానే చంద్రుఁడ స్తమించెను" అన్నారు పూ. టీ. కర్తలు.

సూర్యుడు వాయువును ప్రకాశింపజేయునా ? వాయువు ప్రకాశించునా ? ప్రకాశమునకు కొట్టుకొనిపోయి చంద్రుడు సముద్రములోపడునా? ఇవి యేటిరాతలు!

విశ్వామిత్రయాగమునాటికి మారీచుడు (మాయా) మృగవేషధారి కాకపోయి నను 'మృగాంకుడు' గా చెప్పుట తప్పుకాదు. అట్టి కల్పనలు కావ్యములలో ఎన్నో యున్నవి. మనుచరిత్రలో వరూథిని 'గాండీవము నీచేఁబడి పాండవునిం జేరఁబట్టి బ్రదికితిమి' అని చంద్రుని దూరినది. మరి వరూథిని నాటికి పాండవులకథ ప్రవృత్తమై యుండెనా ?

ప్రకృతము - సూర్యుడు సారస వనములను వర్ధిల్లజేయుటకు అరుణరేఖలతో బయలుదేరి తన కిరణముల నాకాశమున ప్రసరింప జేసెను. అవి చంద్రునికి అస్తమయ సమయ మగుటచేత - సమయమను వాయవ్యాస్త్రముచేత హతుడై చంద్రుడు పూర్వము మారీచునివలె - సముద్రమున పడిపోయెను; అనునది సూర్యపరమయిన కథ. సూర్యుడుదయించెను; చంద్రు డస్తమించెను, అని సారాంశము.

## —• చంద్రాస్తమయము •—

గీ. ద్విజకులమ్ములకూఁతలు దెసల నెగసె
నింకె సద్గణ తేజముల్ పంకజాత
మటు విజృంభించెఁ గువలయం బట్టిటు వడె
నట్టు లగుఁ గా యరాజకం బైనయెడల. ౧౮౯

ఈ పద్యమున చంద్రాస్తమయమునకును అరాజకదేశదశకును అభేదాధ్యవసాయము.—

టీక.— * ద్విజకులమ్ములకూఁతలు = అనేకజాతిపక్షుల కలకలారావములు, (బ్రాహ్మణసమూహములుపెట్టు మొరలు, అని దేశపరము.) దెసలన్ - ఎగసెన్ = ఎల్లయెడలను అతిశయించెను; సత్ + గణతేజముల్ = నక్షత్రముల కాంతులు, ('భవాన్యాంతు సతీ స్త్రీస్యా న్నక్ష, త్రే తు నపుంసకమ్.' అమరశేషము.) సత్పురుషులయొక్క ప్రభావములు - (అని దేశ.) ఇంకెన్ = తగ్గిపోయెను; పంకజాతము =

---

* పూ. టీ.— 'ద్విజకులమ్ముల కూఁతలు = బ్రాహ్మణసమూహముల వేదపాఠములు.'

అరాజకమై దేశమల్లకల్లోలమై యుండు సమయమున - బ్రాహ్మణుల వేదపాఠములు ఎసగె, ననుట లోకవిరుద్ధపు ప్రసంగము. వేదపాఠములను, 'బ్రాహ్మణుల కూఁత' లని 'వేదం' వారు సెలవిచ్చుట అఘోరమైన ప్రమాదము. కూఁత - యనఁగా మొర; ఆర్తధ్వని వేదపాఠము కాదు.

గీ. 'మొఱ్ఱయన మొఱయనఁగ వాపోఁక యనఁగ
గూయినాఁ గూఁత నాఁగ నాక్రోశ మొప్పు. (ఆం. భా. 1-115.)

కమలము, అటు విజృంభించెన్ = సంతోషమున మిక్కిలిగా నిక్కెను = వికసించెను. (పంక = పాపములయొక్క, జాతము = సమూహము, అధికమయ్యెను, అని - దేశ) కువలయంబు = కలువ, టిట్టుపడియెన్ = ముడుచుకొనిపడిపోయెను, (కు - వలయంబు = భూమండలము, అల్లకల్లోలమయ్యెను, అని - దేశ.) అరాజకంబు - అయిన యెడలన్ = (న + రాజకము) చంద్రుడులేని సమయమున, (ప్రభువు లేకపోతే -) అట్టులగుఁగా = అట్లే యగునుగదా!

## సూర్యోదయము

చ. కొలఁదిగఁ జక్ర కైరవ చకోర సరోజదళంబులన్ జలం
బలవడఁ గూర్చ విప్పఁ గలయట్టియినుం, డలచందమామ క
ర్మిలిఁ గర మిచ్చి పుచ్చుకొనుమిత్త్రుఁడు, [1] చీఁకటి కాన నీఱుగా
నలఁచువిభావసుండు, గనయ్యెఁ బతంగుఁడు ప్రాఙ్ముఖంబునన్. ౧౮౯

ఈ పద్యమున సూర్యుడు - ఇనుడు; మిత్రుడు; విభావసుడు; అను శబ్దముల మూలమున ప్రభువుగను; స్నేహితుడుగను, అగ్నిగను, అధ్యవసింపబడుచున్నాడు.-

టీక.— కొలఁదిగన్ = తగురీతిగా, [2] చక్ర కైరవ దళంబులన్ జలంబలవడఁ గూర్పన్; చకోర సరోజ దళంబులన్ [3] జలంబలవడ విప్పన్.— చక్రదళంబులన్ = చక్రవాకముల సమూహములను = దంపతులను, జలంబలవడన్ = వలరసముదయించునట్లు, [4] కూర్పన్ = (అంతకుముందు విడివడియున్నవానిని) జతకూర్చ

---

1 శా. పా.— 'చీఁకటులెల్ల నీఱుగా' ('.....నీఱుగా' పూ. ము. 'చీకటికాన నీఱుగా' తంజ. పా.)

2 పూ. టీ.— 'చక్ర = చక్రవాకపక్షులయొక్కయు - సరోజ = తామరయొక్కయు - దళంబులన్ = సమూహములను.'

తామరల పక్షమున దళ శబ్దమునకు 'సమూహము' లని టీక వ్రాయుట అనుచితము. పూ. టీ. లో 'చకోరకైరవము' లసలే యెగిరిపోయినవి. సేనల ప్రస్తావము లేనేలేదు.

3 పూ. టీ.— 'జలంబు = ఉదకము. (చలంబు = ద్వేషమును.)'.

ఏమి ఉదకమో? ఎవరియెడ నెవరికి ద్వేషమో? దేవునికే యెఱుక.

4 పూ. టీ.— 'కూర్పన్ - విప్పన్ = సంకుచిత వికసితములను చేయుటకు'. వేనిని సంకుచితములను చేయుటకో, వేనిని వికసితములను చేయుటకో, పూ. టీ. లో తేలదు.

'కూర్పన్ - విప్పన్,' అను పలుకుబడి కొక ప్రయోగము.—

సీ. 'కలికి జక్కవ పిట్ట కవఁగూర్ప విప్పంగఁ
దరమైన కనుదోయి దయదలిర్ప' (దశా, చరిత. 5-46)

టకును; (చక్రవాక మిథునములు రాత్రి విడివడియుండును; పగలు జతకూడును.) కైరవదళంబులన్ = కలువల రేకులను, చలంబు - అలవడన్ = మచ్చరమేర్పడగా (= మచ్చరము పూని) కూర్పన్ = (అంతకు మునుపు వికసించుటచే విరియబడి యున్నవానిని) ఒక చోటికి చేర్చుటకును, (= కలువలను ముడుచుకొనునట్లు చేయుటకును.) చలంబలవడన్, చకోరదళంబులన్ = చకోర దంపతులను, విప్పన్ = జతగూడియున్న వానిని విడిపోవునట్లు చేయుటకును, (చకోర మిథునములు రాత్రి కూడియుండును పగలెడబడియుండును.) జలంబలవడన్ = ప్రేమరస ముదయింపగా (= ప్రేమతో) సరోజదళంబులన్ = తామరరేకులను, విప్పన్ = (ముడిగియున్న వానిని) విరియజేయుటకును, కలయట్టి = సమర్థుడయిన, 5 ఇనుఁడు = సూర్యుడు. (సూర్యుడు చక్రసరోజములకు మిత్రము; చకోరకైరవములకు శత్రువు. సూర్యోదయమున చక్రవాకదంపతులు కూడును; సరోజదళములు విప్పబారును. చకోరదంపతు లెడబాయును; కైరవదళములు ముడుచుకొనును).—

ఇనుఁడు = ప్రభువు ('ఇనస్సూర్యే ప్రభౌ.' అమ.) కావుననే, దళములను = సేనలను, కూర్పన్ = కూర్చుకొనుటకును, విప్పన్ = పరసేనలను చెదరగొట్టుటకు సమర్థుడు; అని సారస్యము.

చందమామకున్ = చంద్రునికి, అర్మిలన్ = ప్రీతితో, 6 కరము = కిరణము (ల)ను, ఇచ్చి = శుక్లపక్షమున నిచ్చి, పుచ్చుకొను = కృష్ణపక్షమున మరల తీసికొను, 7 మిత్రుఁడు = సూర్యుడు. (సూర్యుడు చంద్రునికి శుక్లపక్షమున దినదినాభివృద్ధిగా తనకిరణములనిచ్చి అమృతమయుని జేయునని శా[illegible]ము. "కలాః షోడశ సోమస్య శుక్లే వర్ధయతే రవిః, అమృతేనామృతం కృష్ణే పీయతే దేవతైః క్రమాత్."

మిత్రుడు = స్నేహితుడు; కావుననే అక్కఱకిచ్చి మరలపుచ్చుకొనుచున్నాడని సారస్యము.

---

5 పూ. టీ.— 'ఇనుండు = సూర్యుఁడు ((ప్రభువనియు.)' ప్రభువనియు - చెప్పవలసిన యక్కఱయేమో? వారు తెలుపలేదు.

6 పూ. టీ.— 'కరము = కిరణము (కప్పము [illegible]ని ప్రభు).' ఈవాక్య[illegible] ప్రభుపరమయిన అర్థాంతరమున్నదనుకొనుట భ్రమ.

7 పూ. టీ.— 'మిత్రుఁడు = సూర్యుఁడు స్నేహితుఁడు అని ప్రభు.' 'కప్పమిచ్చి పుచ్చుకొను స్నేహితు' డని ప్రభు పరమున - అర్థాంతరమఁట! స్నేహితుడైనవాడు - ప్రభువునకేమి? కప్పమిచ్చుటయు, పుచ్చుకొనుటయు నేమి? అసంగత ప్రసంగము.

౮ చీఁకటికానన్ = కాన (=అడవి) వంటి దట్టమయిన చీకటిని, నీఱుగాన్ అలఁచు = రూపము లేకుండా ధ్వంసముజేయు (ఈయర్థమున 'నీఱుగావించు' జాతీయము -) విభావసుఁడు = సూర్యుడు.

విభావసుఁడు = అగ్ని ('సూర్యవహ్నీ విభావసూ.' అమ.) కావుననే, (చీకటి) కానన్ = అడవిని, నీఱుగాన్ = భస్మముగా, అలఁచన్ = ధ్వంసము చేయఁగలగినాడని సారస్యము.

అట్టి, పతంగుఁడు = సూర్యుడు, ప్రాఙ్ముఖంబునన్ = తూర్పుదిక్కున, కనవయ్యెన్ = చూపట్టెను.

---

౮ పూ. టీ.— 'చీఁకటులు = అంధకారములను (అజ్ఞానములను) నీరుగానలఁచు = నీళ్ళు అగునట్లుగా శ్రమపెట్టు, విభావసుఁడు = సూర్యుఁడు (జ్ఞానియు.)'

'అజ్ఞానాంధకారము' అని అజ్ఞానమును చీకటిగా రూపించుట కలదుగాని 'చీకటి' అను పదానికి 'అంధకార' మను నర్థములేదు. 'విభావసు' శబ్దమునకు 'జ్ఞాని' యను అర్థముకూడా నా కెక్కడను కనబడలేదు. సూర్యుడు అంధకారమునుగాని, జ్ఞాని అజ్ఞానమునుగాని 'నీళ్ళు అగునట్లుగా శ్రమ పెట్టుదు' రనుట అర్థములేనిమాట. 'రూపడంతు' రనుట యుచితము. ఆయర్థమునిచ్చు జాతీయము 'నీఱుగావించు' = నీఱుగానలఁచు.— ('నీరు, కాదు 'నీఱు'.)

ద్వి. 'క్రూరాత్మ మద్ఘన ఘోరశాపాగ్ని
నీరాష్ట్రిమును నిన్ను నీఱుగావింతు.' (గౌ. హరి. పు. ౬౪.)

ఆ. వె. 'మాఱుకొన్నవారి నీఱుసేయుము, ప్రజ
నరసి మనుపు ధరణి సురులఁ బ్రోవు.' (శాంతి. 1-370.)

'చీఁకటికాన నీఱుగా నలఁచు విభావసుఁడు' అని సరియైన పాఠము. విభావసుఁడు = అగ్ని, కావున, కానను నీఱు = భస్మముకావించుట చెప్పబడినది. చీకటిని కానగను సూర్యుని విభావసుడుగను చెప్పిన ప్రాచీన రచనలును ఉన్నవి.—

సీ. 'శ్రీమించు పద్మినీ భామామణి కినుండు
నిరత సంసార వార్నిధికిఁ దరణి,
త్రిజగతీ సజ్జనశ్రేణికి మిత్రుండు
బహుతమోవనికి విభావసుండు.' (కావ్యా. సం. 1-29.)

## —• రాజు రాజధానికేగుట •—

వ. అయ్యెడం ‡ గాలోచితకృత్యంబుల నిర్వర్తించి సమస్త చమూసమూహ సమేతుం డై నరపాలపురుహూతుండు గదలి నిజరాజధానిఁ జేరం జనుదెంచి నగరు ప్రవేశించుసమయంబున. ౧౯౦

టీక.— కాలోచితకృత్యంబులన్ = ఉదయకాలమున కావింపదగిన పనులను,—చమూ = సేనలయొక్క — నరపాల పురుహూతుండు = రాజేంద్రుడు.

సీ. శృంగారము [1] లెసంగు బంగారపుమెఱుంగుఁ
బోండ్లు కురుఁజులపై గొండ్లి సలుపఁ,
[2] బణ్యాంగణములందుఁ బుణ్యాంగనల్ గ్రందు
గా సారె ముత్యాలసేస చల్లఁ,
జెలరేఁగి మణిసౌధముల మూఁగి యవరోధ
కామినుల్ సోరణగండ్లఁ జూడ,
వాద్యఘోషణముల హృద్యభాషణముల
వందిమాగధులు చెల్వొంది పొగడ,

గీ. గడలపౌఁజులరొద లిరుగడలఁ జెలఁగ
దొరల నందఱ మన్ననల్ దొరల ననిచి
వడి నిగుడఁ దేజిఁ గొల్వు చావడిని డిగ్గి
యరిగె నత్తఱి మహిభర్త యరిగెలెత్త. ౧౯౧

పాఠాం.— ‡ 'కాల్యకృత్యంబుల'

1 శా. పా.— 'లెసంగ' ('లెసంగు' పూ. ము.; తంజ ప్రతులన్నింటిలోను) 'లెసంగు — మెఱుంగు' అని అంత్యనియమము. ఈ నియమము నాలుగు పాదములందును కనబడుచున్నది. కాబట్టి 'లెసంగ' అను పాఠముతప్పు.

2 శా. పా.— 'పుణ్యాంగణములందు'. (ఇది పూ. ము. పాఠము) వావిళ్ళవారును ఈపాఠమునే గ్రహించినారు. 'పణ్యాంగణములందు' అని సాధుపాఠము తంజ. ప్రతిలోఉన్నది. అంగణములలో పుణ్యమేమి ? పాపమేమి ? పణ్య - పుణ్య- అని అనుప్రాసము. నాలుగుపాదములలోను కలదు.

టీక.— శృంగారము తెసంగు = విలాసములుగల, బంగా... బోండ్లు = బంగారు వన్నెగల పడతులు, * కురుఁజులపైన్ = ఆటమంచెలమీద, గొండ్లిసలుపన్ = నృత్యము చేయుచుండగా; పణ్యాంగణములందు=అంగడి ప్రదేశములయందు, పుణ్యాంగనల్ = ముత్తైదువలు, (క్రందుగా = గుంపులుగాఁ జేరి) ముత్యాలసేసచల్లన్ = ముత్యములనే అక్షతలుగా చల్లుచుండగా; అవరోధకామినుల్ = అంతఃపుర స్త్రీలు, మణిసౌధములన్, మూఁగి = క్రమ్ముకొని, సోరణగండ్లన్ = గవాక్షములనుండి, చూడన్, వందిమాగధులు = వందులు - మాగధులు - అనబడు బట్టువాండ్రు; - వాద్యఘోషణములన్ = వాద్యశబ్దములచేతను, హృద్య = మనోహరములయిన, భాషణములచేతను, పొగడగా; గడలపోఁజుల రొదలు - ఈ పెదంకుల కలకలధ్వనులు, ఇరుగడలన్ - చెలగన్; వడినిగుడన్ = వడిగా, తేజిన్ డిగ్గి = గుఱ్ఱమును దిగి, అరిగె తెత్తన్ =

* పూ. టీ.— 'కురుఁజులపైన్ = కోటకొమ్మలమీఁద.'

'కురుజు' అనగా కోలాటము వేయుటకును - వారాంగన లాడుటకును, ఎత్తుగా నిర్మింపబడు 'మంచె' గాని 'కోటకొమ్మ' కాదు. "కురుఁజు నా స్థిరగథమగు" (ఆం. భా. 2–17).

వ. 'ఎడనెడంబన్నిన యపరంజి కురుంజులపై రంజిలుచు, మృదంగ ధిమిధిమిధ్వానంబులకు నాడు యంత్రపాలికా సముదయంబు.' (వసు. 6–9).

'అప... జులపైన్ = మేలిమిబంగారు చప్పరములమీఁద' అని వ్యాఖ్య.

'కోటకొమ్మనగా కోట బురుజుమీది చేపట్టు గోడపై నెడమెడముగా అలంకారము కొరకు కట్టెడి చిన్న శిఖరము = కపిశీర్షము ( = 'The upper part (coping) of a wall', ఆప్టే.)

చ. ' జలజపరాగరాగరస సంగతమౌ పరిఖా జలంబులోఁ
పలఁ బ్రతిబింబితంబులగు బంగరుకోటకుఁ బెట్టినట్టి కొ
మ్మల చెలువంబునం బురిరమారమణీమణి యొప్పు రావియా
కుల మొలనూలు వెట్టెననఁ గోరి కనుంగొను వారు మెచ్చఁగన్.'
(పాండు. 1-104).

చ. ' రాజగృహకల్పన కర్ణిక గాఁగ, గంధ సిం
ధురములు తేఁటులై మొరయ, 'దోరపుఁ గొమ్మలు రేకులట్లుగా
ధరయను కొల్నిలోఁ మొలచు తామరపూవనఁ గోట మీటగున్.'
(పాండు. 1-106.)

కావున ఆటకత్తెలు - ఆకోటకొమ్మలపైకెక్కి ఆడిరనుట హాస్యాస్పదము.

పరిజనులు బిరుదు చిహ్నములయిన గుండ్రని ధ్వజములు పట్టగా, మహిభర్త - అరిగెన్ = అంతఃపురములోనికి పోయెను.

గీ. అటుల నంతఃపురంబున కరిగి విభుఁడు
కొలువుసింగార మెడలించి కొందఱ నుడి
గంపుఁగుంభస్తనుల జలకంబుఁ బట్టుఁ
డనుచు నానతి యీ నంత నతిరయమున. ౧౯౨

టీక.— ఉడిగంపు కుంభస్తనులన్ = దాసీజనమును, జలకంబు పట్టుఁడు = నీళ్లు తోడండి, అనుచు. - (నీళ్లు తోడవలసినవాండ్లు గావున కుంభస్తనులుగా ఉండుట ఉచితమని కవిహృదయము.)

సీ. రమణి నిల్పె మనోహరమణిపీఠి యొకర్తు
తల యంటె నీలకుంతల యొకర్తు
అటకలి యిడె లెస్స యట కలికి యొకర్తు
[1] జలజగంధి యొకర్తు జలక మార్చెఁ
తడి యొత్తె నొక్కపుత్తడిబొమ్మ నృపతికిఁ
$ జెలు వౌచలువ లిచ్చెఁ జెలువ యొకతె
సికఁ జుట్టె విరు లొక్క సికతామయనితంబ
వెలఁదికస్తురి నొక్కవెలఁది యలఁదె
గీ. ధూప మొనరించె నొక్కవిధూప మాస్య
తిలక మొనఁగూర్చె భామినీతిలక మొకతె
[2] మించుఁదొడవు దొడిగె నొకమించుఁబోణి
భోజనము వెట్టె నొక్కయంభోజనయన. ౧౯౩

టీక:— నీలకుంతల = నల్లని కురులు కలది, అటకలియిడెన్ = సీకాయనీరు చల్లెను.—("అటకలి = అభ్యంగనతైలహారక ద్రవ్యము" – బ్రౌను) జలకమార్చెన్ = జలకమాడించెను. ('ఆడు' అను క్రియకు ప్రేరణరూపము - 'ఆర్చు' - ) పుత్తడిబొమ్మ = బంగారు బొమ్మవంటి యింతి, చెలువు - ఔ చలువలు = అందమయిన

---

1 పాఠాం.— 'జలకమార్చె నొక్క జలజగంధి'

$ పాఠాం.— 'చెలువైన చలువొక చెలువ యొసఁగె' (శ. ర. చూ. 'చలువ')

2 శా. పా.— 'మించుఁదొడవులు దొడిగెను - మించుఁబోణి'

వస్త్రములు.- సికతామయనితంబ = ఇసుక దిబ్బలవంటి పిరుదులుగల యువతి. - వెలది కస్తురిన్ = పరిశుద్ధమయిన కస్తురిని. - విధు + ఉపమ + ఆస్య = చంద్రుని వంటి ముఖముగల స్త్రీ. - భామినీ తిలకము = స్త్రీరత్నము. - మించుఁబోణి = మెఱుపుతీగవలె మనోజ్ఞురాలు. - అంభోజనయన = కమలములవంటి కన్నులుకలది.

క. ఈరీతి శిరసుమజ్జన
$ మారోగిణ మయి మణీమయపుఁ బాదుకలో
య్యారముగ మెట్టి యుడిగపు
నీరజముఖి కేలువట్టి నృపుఁ డింపెసఁగన్. ౧౬౪

టీక.— శిరసుమజ్జనము = శిరఃస్నానము, ఆరోగిణమయి = భోజనముచేసి.— పాదుకలు, మెట్టి = తొడిగి; ఉడి...వట్టి = పరిచారికహస్తమును ఊతగాపట్టుకొని.

క. సోగలగు వెండిజేకుల
లాగునఁ దెలనాకు మడిచి లలన యొసంగన్
బాగాలు వేసికొని తన
బాగా లున్నట్టిమేడపజ్జకు నేఁగెన్. ౧౬౫

టీక:— ఆకుమడిచి లలన ఒసంగన్ (తీసికొని), * బాగాలు = వక్కలు, వేసికొని, తన (బాగు + ఆలు =) బాగాలు = అందగత్తెయైన భార్య, ఉన్నట్టి, మేడపజ్జకున్ = మేడకు ఏఁగెన్.

---

$ శా. పా.— 'ఆరోగణమయి' ('ఆరోగిణమయి' పూ. ము.; శ. ర. పాఠము.) 'ఆరోగిణ మొనర్చి...ననభుక్తి గొనుట' (సాంబ. మాన. 22.) 'ఆహారయ గ్గొడగి రింట నారోగిణము'. (ధర్మగుప్తాభ్యుదయము. బస. పీఠిక నుండి.)

శ. ర. లో 'ఆరోగణము' - అనురూపము లేదు; కాని ఆంధ్రపదపారిజాతమున ఆరోగణము - 'ఆరోహణ' శబ్దభవమని సూచింపబడినది. కొన్ని ప్రయోగములు.—

'నరపతి యారోగణము నెమ్మిఁ జలుప.'

'ఆరోగణముచేసి యందఱుఁజూడ' (బస. పు. 165.)

* పూ. టీ.— 'బాగాలు = తాంబూలము.'

'బాగా' లనగా వక్కలు; వక్కపొడియే, గాని తాంబూలము కాదు. "భోగభాగమ్ములు పొలుచు బాగాలన" (ఆం. భా. 2—167.)

"బాగాలు - Areca nut ready cut into pieces for eating". (బ్రౌను)

క. 'క, ర్పూరంబుతోడి బాగా
లీరాదా ? ఆకుమడిచి యీరాదా ? చెలీ.' (కళా. 4—69)

దాసియిచ్చిన ఆకుమడుపు నందుకొని వక్కలు నములుచూ, రాజు చిత్రాంగి మేడకు పోయెనని, తా. (పోకలు నములుచూ, ఆకులు చేతపట్టుకొని పోవుటు అవి యొక హొయలు. అది యట్లుండగా, చిత్రాంగి కడకు పోవు తమకమున తాంబూలము వేసికొనుపాటి తాలిమిగూడా లేక వక్కలు మాత్రమే వేసికొని ఆదరబాదరగా పోయెనని సారస్యము.)

గీ. ఏఁగుచోఁ దొంటిచందాన నించు కైన
మెలఁగుచెలికత్తియల యలబలము లేక
ప్రాణవల్లభపొలకువ గాన రాక
విన్ననై యున్న యాసౌధవీథిఁ జూచి. ౧౯౬

టీక.— చెలికత్తియల, అలబలము = సందడి, ప్రాణవల్లభ పొలకువ = ప్రియురాలిజాడ, విన్ననైఉన్న = చిన్నబోయియున్న, సౌధవీథిన్ = మేడను, చూచి.

క. వాలికమెఱుంగుఁజూపు ని
వాళిగ నొనరించి యెపుడు వడిఁ జేయును దా
నాలింగన; మేమో యిపు
డాలిం గన మనుచు నృపతి వ్యాకులమతి యై. ౧౯౭

టీక.— తాన్ = మాచిత్రాంగి, ఎపుడున్ = నేనింటికి వచ్చినప్పుడెల్ల, వాలిక మెఱుంగుచూపు = దీర్ఘమును - కాంతిమంతమును నైన తన చూపును, నివాళిగ నొనరించి = హారతిగాచేసి (=చుట్టిచుట్టి నన్నుచూచి - అనుట) వడిన్, ఆలింగనము, చేయున్ = చేయుచుండెడిది. ఇపుడు, (కారణము) ఏమో, ఆలిన్ - కనము = నాప్రియురాలు కనబడనేలేదు.

## —: చిత్రాంగీ సాంత్వనము :—

క. అరుదెంచి యలిగి యుండెడి
యరు దెంచి మదిన్ వితాకుఁ డై తహతహతోఁ
దరియంగ నరిగి శాతో
దరియంగం బపుడు గాంచి దయ దయివాఱన్. ౧౯౮

టీక.— అరుదెంచి = లోనికిపోయి, అలిగియుండెడి - అరుదు + ఎంచి = తన ప్రియురాలు కోపముచేత పూనియున్న క్రొత్తతీరునుచూచి, $ మదిన్, వితాకుఁడై = విభ్రాంతుడై, (కలవరపోయి - అన్నమాట.) తహతహతోన్ = త్తర పాటుతో, దరియంగన్ - అరిగి = సమీపమునకుపోయి, శాతోదరియంగంబు = (పలుచని కడుపు కలదైన) ఆచిత్రాంగి శరీరమును, కాంచి, దయ దయివాఱన్ = కనికరము అతిశయింపగా.

గీ. హంసతూలికాతల్పమం తల్పమే ల
తాంగి, కడఁద్రోచి నేలఁ బడంగ నేల ?
వెలఁగఱవుసేయు * కౌశేయములు గలుగఁగ
నూనమైనట్టి మైల మై నూననేల ? ౧౯౯

---

$ పూ. టీ.— 'మదిన్ = మనసునందు, వితాకుఁడై = నిశ్చేష్టితుఁడై.

'నిశ్చేష్టితు' డగునది మనసునందు కాదు. వింత విషయమును అదాటున చూచినపుడు మనసునకు కలుగునది విభ్రాంతి; తన్మూలమున శరీరమునకు కలుగునది నిశ్చేష్టత. అందు కీక్రింది భాగవతపంక్తులే ప్రమాణము.—

"మ. మహోత్పలగంధిన్, మృగరాజ మధ్యఁగని విభ్రాంతాత్ములై రందఱున్.
వ. మఱియు నయ్యింతి దరహాస లజ్జావలోకనంబులం జిత్తంబు లేమఱి, ధైర్యంబులు దిగనాడి, గాంభీర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలుమాని." (10–1747)

* శా. పా.— 'వెలచేలములు' ('వెల = వెల్ల = తెల్లని, చేలములు = చీరలు' అని పూ. టీ.)

'వెల్ల' కు 'వెల' రూపాంతరము. వెల విశేషణమైనప్పుడు 'వెలి' అను రూపమును పొందును. ఉ. - వెలిగొఱు; వెలిగిడ్డి; వెలిమావు. (తెలి, చలి, పులి, అను విశేషణముల తత్త్వమును ఇట్టిదే.— తెలికొండ; చలిగాలి; పులిమజ్జిగ.) కావున 'వెలచేలము' అనుట తప్పు. అది యొప్పైనచో, వెలగొఱు, వెలగిడ్డి, వెలమావు, తెలకొండ, చలగాలి, పులమజ్జిగ, అను అనిష్టరూపములు పుట్టవలసి వచ్చును.

'వెల మిగులజేయు కౌశేయములు' అని పూ. ము. 'వెలగఱవుసేయు కౌశేయ' తంజ. పా.

టీక. — లతాంగీ, $ హంసతూలికాతల్పము = హంసయీకల దూదిపానుపు, అంత - అల్పమే = అంత నిరసింపదగినదా ? కడంద్రోచి = దానిని దూరముగా త్యజించి, నేలన్ - పడంగనేల = కఠినమైన నేలమీద పండుకొనుటకు కారణ మేమి ? ('పడు = శయనించు' శ. ర.) వెలన్ కఱవుచేయు = వెలలేని, కౌశేయ ములు కలుగంగన్ = పట్టుచీరెలుండగా, ఊనమైనట్టి మైలన్ = చాలీచాలని మాసిన గుడ్డను, ('హీనన్యూనావూనగర్హ్యా' అమ.) మైన్ = దేహమున, ఊననేల =చుట్టు కొనుటకు కారణమేమి ?

హంసతూలికాతల్పలక్షణము.—(పారిజాత పరిమళోల్లాసమునుండి.)

"మరాళీ జఠరోద్భూతైః మృదుభిః పింఛ గుచ్ఛకైః
శ్లక్ష్ణేన చర్మణానద్ధైః శయ్యాహంసో మహీభుజామ్.

---

$ పూ. టీ.— '= జిల్లేడుదూదిశయ్య.'

'హంసతూలిక' యనగా హంసయీక గాని జిల్లేడుదూది కాదు. నూల ద్రష్టలు కొందరు జిల్లేడుదూది పరుపునేకాదు, బూరుగదూది పరుపునుగూడా హంస తూలికాతల్పమనుట కలదు. అందువల్లనే బ్రౌనుదొర యిట్లు వ్రాసినాడు.

"హంసతూలికా తల్పము - A swan's down bed or couch. Some say a bed stuffed with the wool of the జిల్లేడు shurb, or of the (శాల్మలి or బూరుగ) silk cotton tree. హంసరెక్కల పరుపు. బూరుగదూది పరుపనిన్ని అంటారు."

తత్త్వము నెరిగిన పండితు లెవరును 'జిల్లేడుదూది' అనలేదు. 'హంసరెక్కల దూది' అనియే అన్నారు. కొన్ని యుదాహరణములు:—

(1) 'హంసతూలం-తూలః, The soft feathers or down of a goose (ఆప్టే).

(2) 'రత్నఖచిత హేమపర్యంకే హంసతూల గర్భశయన మానీయతరుణీం' (దశ. చరితమ్. పుష్పో—) 'హంసతూలో గర్భేయస్యతత్' (వ్యాఖ్య.)

(3) 'హంసతూల గర్భకోమల శయ్యోపధానశాలిని కుసుమలవచ్ఛురిత పర్యస్తే పర్యంకతలే.' (అపహారవర్మచరిత్ర) 'హంసతూలః పక్షిపక్ష్మాణి గర్భేయస్య ఏవంవిధా శయ్యా.' (వ్యాఖ్య.)

(4) 'హంసతూలికాతల్ప మనఁగా హంసల యొడలిపైనున్న చిన్నని యీఁకెలను దెచ్చి యీనెలుతీసి ప్రత్తికి బదులుగా నుపయోగించి కూర్చిన లేపు.' (రాయలనాటి రసికత.)

వసంతే హంసశయ్యా.— భోగార్హములైన తల్పము లేడు విధములు.

హంసపింఛమయీ క్వాచి చ్ఛాల్మలీ తూలజాపరా
కార్పాస రచితా చాన్యా కేసరై రితరాకృతా
పల్లవైః కల్పితా కాచి త్కాచిత్కుసుమ నిర్మితా
పానీయపూరితా కాచి చ్ఛయ్యైవం సప్తధా స్మృతా."

—తత్త్వరత్నాకరము.

(5) సీ. 'సరిలేని మంచి గుజ్జరి నేతపట్టుయుఁ
బఱపైన రాయంచ గఱుల పఱుపు.' (ఉ. రా. 6-160)

(6) గీ, 'చలువచప్పరకోళ్ళమంచంబులోన
నంచ రెక్కల సెజ్జపై.' — (రాధికా. 2 ఆ.)

(7) వ. 'కాంచనమంచంబున నంచదూది పఱపుం బఱపించి.' (సంజీ. దశ.)

(8) 'అంచగఱులపాన్పు = హంసతూలికాతల్పము,' (సూ. ని.)

"జిల్లేడు చెట్టుకు 'అర్క' అని పేరు; 'అర్క' కు 'హంస' పర్యాయము; కాబట్టి, హంసతూలిక = అర్కతూలిక = జిల్లేడుదూది" అని యొక పిడివాదము. వాదసరణి బాగానే యున్నది. కాని 'అర్కతూలికాతల్ప' మను వ్యవహారముండినగదా తత్పర్యాయముగా 'బ్రధ్న తూలికా - విరోచనతూలికా - తల్పము' లేర్పడుట ! మరియెందేని 'అర్కతూలికా తల్పము' కలదా !

హంసపర్యాయమయిన మరాళశబ్దముతో పాన్పను చెప్పువాడుక కలదు.—

చ. 'అమలనివాతసౌధములయందు మనోజ్ఞ మరాళతూల త
ల్పములశయించి.' (భా. అరణ్య. 5-329.)

'తారాశారద నీరదామరధునీభా రాజసౌధోపరి
స్ఫారాగారమరాళతూలశయనద్వారాగ్రదారాన్వితాః' (కాళీసహస్రము)

ఎట్లో ద్రావిడప్రాణాయామమార్గమున శ్రమపడి జిల్లేడు దూదిశయ్యను సాధించినను, అది అత్యుష్ణమనియు - వాతరోగులు చికిత్సార్థము వాడదగినదేగాని, సుకుమారులయిన భోగులు సుఖము కొరకు వాడదగినది కాదనియు వైద్యులు చెప్పుదురు. అందువల్లనే కాబోలు నది సప్తవిధశయ్యలలో పరిగణితము కాకపోవుట. మరి, యట్టి పనికిమాలిన పఱుపును పూ. టీ. కర్తలు, మహారాజయిన రాజనరేంద్రుని ప్రియురాలును పరమ సుకుమారియునగు చిత్రాంగి పడకమీద ప్రవేశపెట్టుట మంచిపనియగునా?

ఉ. కప్పురపుఁ విడెంబు కుతుకంబునఁ జేయవ దేల? వాసనల్
చిప్పిలు కుంకుమంబు మయి లేప మొనర్ప వ దేమి? చీఁకటుల్
గప్పెడుకీలుకొ ప్పొఱపుగా సవరింప వ దేటి? కిప్పు డో
యొప్పులకుప్ప నీ వలిగియుండెడికారణ మేమి? తెల్పవే. ౨౦౦

టీక.— వాసనల్ చిప్పిలు=సువాసనలనుగుప్పు,— లేప మొనర్పవు=పూసికొనవు.

సీ. ఇం పైననీపాట కెన గా దటంచునో
యెలనాగ వీణ వాయింప వేల?
నీరీతి మాటాడ నేర దటంచునో
కలకంఠి చిలుకతోఁ బలుక వేల?
తళుకొత్తు నీదుచెక్కులఁ బోల వంచునో
శుకవాణి యద్దముల్ చూడ వేల?
యొరయునీపాలిండ్ల కుద్ది రా వంచునో
యలివేణి పూబంతు లంట వేల?
గీ. కడు నోయారంబు లైన నీనడలకరణి
నడువఁగ నెఱుంగ వంచునో నంటుతోడ
నంచబోదల నడిపించి పెంచ వేల
మోద మొప్పంగి చిత్రాంగి మోహనాంగి? ౨౦౧

టీక.— ఎన, ఉద్ది = సాటి; నంటుతోడఁ = స్నేహముతో.

*ఆ. వె. పోతుటీఁగ కైనఁ బొలయంగ రాదు నా
యానఁ జేసి మందయాన [1] నిన్ను;
నెవ్వ రెగ్గు సేసి రెఱిఁగింపవే మది
[2] నలుక వలదు నీకు నలుక వలదు. ౨౦౨

---

*శాస్త్రిగా రీ ఆటవెలదిని 'తేటగీతి' అన్నారు; ప్రమాదము. ఈప్రమాదము వారి కనివార్యము. (చూ. ౪౫ పద్యముక్రింద) ఇంకొక్క మాట.— పూ. ము. లో 'ఆ. వె.' అనియేయున్నది. అది తప్పనుకొని వారు తే. గీ. గా దిద్దినారు.

1 పూ. ము. పా.— 'నీకు'

2 శా. పా.— 'అళుక' ('అళుకు అ = భయమే' అని పూ. టీ.)
,భయమే (గాని వేరొకటి) వలదు' అనుటలో భావమేమో? సారస్యమేమో? 'అలుకవలదు' అనియే పూ. ము. పా.

టీక.— నిన్ను - పోతుటీఁగకైనను - పొలయంగరాదు = నీమీద మగయీఁగయైనను వాలుటకు వీలులేదు. నా ఆనఁజేసి = నా శాసనమంత తీవ్రమయినది (అని భా.)— మదిన్, అలుకన్ - వలదు = భయపడనక్కరలేదు. అలుకవలదు = కోపమును పనిలేదు.

సీ. తరుణి మహాప్రసాదం బని నీమాట
మంతురుల్ శిరసా వహింతు రెపుడు,
రమణి నాబాంధవరాజహంసాళి నీ
యడుగుల కేవేళ మడుఁగు లొత్తు,
నండజవరయాన యవని నీపేరు సె
ప్పినఁ బాఱుపా మైనఁ బెగడి నిలుచుఁ,
గమలపాణి యొకింత గదిసి ని న్నొకనాఁడు
నటునిక్కి చూడ బ్రహ్మయును వెఱచు,
గీ. నింత చన విచ్చి యరమర యింత లేక
నిన్ను నత్యాదరమున మన్నించ లేదె?
మగువ, నే నన కున్న నీమన సెఱుఁగదె?
నీకు నేమిటఁ గొద వయ్యె నేఁడు సెపుమ. ౨౦౩

టీక.— మంతురుల్ = మంత్రిలు, నీమాట = నీయాజ్ఞను, మహాప్రిసాదం బని = అదియొక గొప్ప అనుగ్రహమని, శిరసావహింతురు = మిక్కిలి వినయముతో నెరవేర్తురు. (భగవత్ ప్రిసాదమైన పూలు మొదలగువానిని వలె శిరస్సున ధరింతురని చమత్కారము)

బాంధవరాజహంసాళి = బాంధవులయిన రాజశ్రేష్ఠులసమూహము, నీఅడుగులకు - మడుఁగులొత్తున్ = నీకు పాదసేవలు చేయును. (రాజహంసలు నీగమన సౌభాగ్యము నలవరించుకొనుటకు నీ అడుగుల నాశ్రియించునని చమత్కారము.)

[అడుగులకు మడుగులొత్తుట యనగా, పూజ్యులయినవారు నడచునపుడు వారి పాదములక్రింద బట్టలుపరుచుట. చూ. కళా. 7-70.]

అండజవరయాన = హంసగమనా, నీపేరు చెప్పినన్, పాఱుపామైనన్ = పరుగెత్తుపామైనను - బెగడినిలుచున్ = ఎంతటివాడైనను విధేయుడైపోవును అనిభా.

(అండజవరుడు - అనగా గరుత్మంతుడు కావున - ఆ పేరు చెప్పినంతనే పాఁకెడిపాము నిలబడునని చమత్కారము.)

కమలపాణి = కమలములవంటి హస్తములు కలదానా, నిన్ను - బ్రహ్మయైనను నిక్కిచూడ వెఱచును.— ఇక సామాన్యులైన పరపురుషులమాట చెప్పవలెనా? (నా శాసనమంత తీవ్రమని రాజు చెప్పికొనుట).— కమలపాణి = లక్ష్మి; కావున నే బ్రహ్మ భయపడును.— అని చమత్కారము. (లక్ష్మిని సమీపించుటకు బ్రహ్మ కధికారములేదు. చూ. కళాపూర్ణోదయమున తుంబుర సంగీతసభాఘట్టము.—)

లక్ష్మి, కమలపాణియనుటకు.—

'నిత్యంసా పద్మహస్తా మమవసతుగృహే సర్వమాంగల్యయుక్తా'—(శ్రీసూక్తము.)

క. వలపు మదిఁ దెలియ [1] నూరకె
యలిగితొ? నినుఁ దక్క వేఱె యతివలఁబొందుల్
కల నైన నెఱుఁగ దీనికి
తలిరుఁ విల్తుండె సాక్షి తామరసాక్షీ. ౨౦౪

టీక.— వలపు మదిఁ తెలియఁ = నీయెడ నాకుగల వలపును పరీక్షించుటకు, ఊరకె = తమాషాకు, అలిగితో? తలిరుఁ విల్తుండె = మన్మథుడే, సాక్షి.

సీ. తరుణి నీనూఁగారుసరి యెందు లేదని
డగ్గఱి పాముఁ బట్టంగవచ్చు,
వనిత నీముఖకాంతి కెన యెందు లే దని
గెంటక ద్విజరాజు నంటవచ్చు,
నింతి నీకౌనుతో నీ డెందు లే దని
యెదురుగా హరికిఁ జే యెత్తవచ్చు,

[1] శా. పా.— 'కూరకె' (ఇది పూ. ము. పా.)

'తెలియ నూరకె' తంజ. ప్రతుల పాఠము. ఈ పాఠమే మూలమునకు సమీపము. మూల మిట్లున్నది.

"అలుగఁ గారణమేమి యల పూవుఁబోఁడు
లలుగుదు రొకవేళ నాత్మ నాయకుల
వలపా త్తిచూడ భావంబునఁ దలఁచి
కలకంఠి నినుదక్కఁ గలనైన నొండు
వెలఁది పొందెఱుఁగఁ బూవిలుతుఁడు సాక్షి," (నవ. పు. 55)

నువిద నీకనుదోయిసవ తెందు లే దని
ధాత్రిఁ దమ్ముల వైచి దాఁటవచ్చు,
గీ. నతివ నీకనుబొమల కప్రతి యటంచు
నెట్టి ధర్మంబుపై నాన యిడఁగ వచ్చు,
నిచ్చకము గాదు సుమ్ము నేఁ డిది నిజమ్ము
భద్రగజయాన వలరాజుపాద మాన. ౨౦౯

టీ.— పాముఁబట్టంగవచ్చుఁ = పామును పట్టుకొని ప్రమాణము చేయవచ్చును. (నూగారు సర్పమును పోలియున్నదని, భా.) నూగారును సర్పముతో పోల్చుట కలదు.

క. 'చేమంతి చెట్టుక్రిందను
భామామణి నిదురవోవఁ బయ్యెద జాఱన్
రోమావళి పాపోయని
కామిని కుచమధ్యమందు గరుడుండాడెన్'. (చాటు. రత్నా. పు. 78.)

గెంటక = తప్పక, ద్విజరాజున్ = బ్రాహ్మణశ్రేష్ఠుని = ఉత్తమ బ్రాహ్మణుని, అంటవచ్చున్ = తాకి ప్రమాణము చేయవచ్చును. (ముఖము - ద్విజరాజుతో = చంద్రునితో, సమానమని, భా.) హరికిన్ - ఎదురుగా - చేయెత్తవచ్చును = విష్ణువు నెదుట నిలిచి చేయెత్తి ప్రమాణము చేయవచ్చును. (కౌను = నడుము, హరితోన్ = సింహము (నడుము) తో సమానమని భా.) ధాత్రిన్ = భూమిమీద, తమ్ములనువైచి = తోబుట్టువులను పడవేసి, దాటవచ్చును = దాటిప్రమాణము చేయవచ్చును.— పసిబిడ్డనుదాటి ప్రమాణము చేయుటకలదు. (కనుదోయి, తమ్ములవంటివి = పద్మముల వంటివని భా.) అప్రతి = సాటిలేనిదని, ఎట్టిధర్మంబుపైన్ = ఎటువంటి ధర్మకార్యము మీదనైనను, ఆనయిడఁగవచ్చున్ = ఒట్టుపెట్టవచ్చును. (కనుబొమలు, ధర్మము = ధనుస్సువంటివని భా.) ఇచ్చకముకాదు = ఇవి ముఖప్రీతి మాటలుకావు; నిజమ్మ. వలరాజుపాదమాన = మన్మథుని పాదములతోడు.

గీ. ఉప్పనైనట్టిచక్కెరలప్ప లీడె?
చేఁదుఁవగ గల యమృతంపుఁజెలమ యెనయె?
పుల్ల నుండెడితేనెకరుల్లు సరియె?
వనిత కడుఁ దియ్య నౌనీమువా తెఱకును. ౨౧౦

టీక.— కడుఁ దియ్యనౌ నీమవాతెఱకును = మిక్కిలి మధురమయిన నీయధరమునకు, [1] ఉప్పనైనట్టి = (ఉప్పన్ + ఐనట్టి) ఉప్పుటచేత ఏర్పడినట్టి, చక్కెరలప్పలు = పంచదారబిళ్ళలు (= మిఠాయిదినుసు) ఈడే = సమానమా? (కావనుట.) పంచదారబిళ్ళలు, ఉప్పిచేయుటచేత ఏర్పడునవి గావున కృత్రిమము లనియు, ఇతర పదార్థముతో చేరియుండునవి కావున పూర్ణమధురములు కావనియు, అందువలన-సహజమును పూర్ణమధురమును అయిన అధరమునకు ఈడుకావనియు భావము. ('ఉప్పన + ఐనట్టి' అను విభాగముచేత, అవి ఉప్పనివి = ఉప్పగానుండునవి అనియు అందువలన కడుఁ దియ్యనౌ వాతెఱకు సమము కావనియు చమత్కారము.)

['ఉప్పుట' యనగా - ఆవిరిపోకుండా ఉడికించుట. (శ. ర.) వ.— "కీచక తండులంబులం బిండిగొట్టి కొత్రఁబోసి 'యుప్పి' గొప్పలుగాఁజేసి యావించిన కుడుముల బాసలు." కాశీ - మహా - 3 - 36.]

చేఁదువగగల = చేదుటయను శ్రమతో గూడిన, అమృతంపు చెలమ = అమృతపు ఊటబావి, వాతెఱకుఁ, ఎనయె = సమానమా ? (కాదు) చెలమలోని అమృతము చేదుకొనినగాని రాదు. అధరములోని అమృతమును కొనుటకట్టి శ్రమమక్కర లేదు. కావున అమృతపు చెలమ అధరమునకు సరికాదని భావము. (అమృతము, [2] చేఁదువగ = చేదురుచి కలదనియు, అందువలన - తియ్యనౌ వాతెఱకు సాటికాదనియు చమత్కారము).

పుల్లనుండెడి = (పుల్లన్ + ఉండెడి) పుడకయందుండెడి, తేనె[3] కరుళ్ళు = తేనెగడ్డలు (పెరతేనె; పుట్టతేనె; పుడకతేనె, అని తేనె మూడువిధములు. అందు

---

1 పూ. టీ.— 'ఉప్పనైనట్టి = గొప్ప.'

'ఉప్పన' అను పదమునకు 'గొప్ప' అను అర్థము భాషలోలేదు. 'చక్కెరలప్పలు' వాతెఱకు ఈడు కాకపోవుటకు కారణము గొప్పదనమనుట అసంగతము.

2 పూ. టీ.— 'అమృతపుఁ జెలమచేఁదు, అని భావము.'

'చెలమ' యనగా చిన్న నీటిగుంట. చేఁదు - తీపు. అను రుచి భేదము గుంటలోని నీటికేగాని - గుంట కుండదు. కావున 'చెలమ చేఁదు' అనుట తప్పు.

3 'కరుళ్ళు = తెట్టెలు.'

'కరుడు' అనగా 'గడ్డ' గాని 'తెట్టె' కాదు. 'తేనెకరుళ్లు' అనగా తేనెలో ఘనీభవించిన భాగములు. తేనెతెట్టెలో కొంతభాగము గడ్డలుగట్టి యుండుటయు - అట్టి గడ్డలు పుడకకంటుకొని యుండుటయు నెల్లరెరిగిన విషయమే. అధరమున కుపమా

పుడకతేనె శ్లేష్మమందురు.) వాతెఱకుక్, సరియె = (సరికావనుట) తేనెకరుళ్ళు, నీచమును నీరసమునునైన పుల్లకంటుకొని యుండునవి. అధరమో మనోహరమును రసభరితమునునైన నెమ్మేన నమరియున్నది. కావున తేనెకరుళ్లు - అధరమునకు సమముకావని భావము. ( 4 తేనెకరుళ్లు పుల్లన+ఉండెడివి = పులుపుగలిగియుండు నవియనియు, అందువలన తియ్యనౌవాతెఱకు సరిరావనియును చమత్కారము).

'లప్ప' యను పదమునకు - బిళ్ళ; గడ్డ; ముద్ద; అని యర్థములు.— "లప్ప, A lump (as of sugar or of civet) ముద్ద; గడ్డ" (చూ. బ్రౌణ్య.) శ. ర. కర్త "లప్ప = రాశి" అని చెప్పి, అందుకు 'మంచులప్పలమించు మండెంగ మడుపులు' (శృం. నై. 6—124) అను ఉదాహరణ మిచ్చినాడు. దానిని బట్టి సర్వంకషా వ్యాఖ్యాతలు 'మంచులప్పలక్ = మంచురాసులను' అని టీక వ్రాసినారు; సరికాదు. లప్ప - చిన్న గడ్డయగునేగాని రాశి కాదు. రాశి యనగా పెద్దకుప్ప. ఒకరాశిలో పెక్కు లప్ప లుండవచ్చును. 'లప్ప'కు 'రాశి'ని పర్యాయముగా వాడుట పొరపాటు. జలరాశి, ధనరాశి, ధాన్యరాశి, అనుటకు నీటి లప్ప; డబ్బు లప్ప; ధాన్యపులప్ప, యనగూడదు. ఏతావతా మండెగలకు పోలికగా చెప్పబడిన మంచులప్పలు - 'మంచుగడ్డలు' గాని మంచురాసులు కావు.

ఉ॥ 'లప్పలతోడఁ గ్రొంబెరుగు లక్ష్మణవజ్ఝలయింట రూకకుక్. (క్రీడాభి.)

'లప్పలతోడ పెరుగు' అంటే గడ్డలతోకూడిన పెరుగు— (నీళ్ళపెరుగుకాదు) అనియర్థము. గడ్డపెరుగు శ్రేష్ఠము. "చేతి జిడ్డువాయని మంచిగడ్డ పెరుగు." (వేమవరపు శతావధానము.) కాబట్టి * 'లప్ప = రాశి' అనుట సరికాదు.

---

నము తేనె'కరుడు'గాని 'మొత్తము తెట్టె' కాదు. తెట్టె యనగా, తేనె - మగినము - పురుగులు - ఇతర మలినపదార్థమున్ను కూడిన మొత్తము. ఒక్కపుల్లన ఎన్నో తెట్టెలుండవు. ఒక్క తెట్టెలో పెక్కు (తేనె) కరుళ్ళుండవచ్చును. కావున 'కరుళ్ళు = తెట్టెలు' అనుట తప్పు.

4 పూ. టీ.—'తేనెతెట్టెలు పులుపుగా నుండుననని భావము.'

పులుపు - తీపు, అనురుచిభేదము 'తెట్టె'లోని తేనెకుగాని - తెట్టకుకాదు. తెట్టెను రుచిచూచు మానవుడును ఉండడు.

* ఈ 'లప్ప'నుగురించి ఆంధ్రవిశారద శ్రీ తాపి ధర్మారావునాయుడుగారును, కవిచూడామణి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారున్ను విపులముగా విమర్శించి యున్నారు. (చూ. భారతి. విభవచైత్ర వైశాఖములు.)

క. [1] అతిసమ్మోహ మొనర్చుట
నతిమధురిమ సారెఁ జిలుక నలరించుట నో
లతకూన నీదుమోవికిఁ
బ్రతి బింబమె కాక లేదు ప్రతిబింబ మిలన్. ౨౦౭

ఈ పద్యమున అధరమునకును దొండపండునకును సాధర్మ్యము చెప్పబడుచున్నది.

టీక.— అతిసమ్మోహ మొనర్చుటన్ = అత్యంతమయిన కామము కలిగించుట యందు, (అధికమయిన మూఢత = బుద్ధిమాంద్యమును కలిగించుటయందు, అని అర్థాం.) అతి...రించుటన్.— [2] అతిమధురిమ = అత్యంతమాధుర్యము, సారెన్ = మాటి మాటికిని, చిలుకన్ = చిందగా, అలరించుటన్ = సంతోషపెట్టుటయందును. (అతిమధురిమన్ = అత్యంతమాధుర్యముచేత, సారెన్, చిలుకన్ - అలంకరించుటన్ - చిలుకను సంతోషపెట్టుటయందు, అని - అర్థాం) లతకూన = జవరాలా, నీదు, మోవికిన్ = అధరమునకు, ప్రతి = సాటి, బింబమె కాక = దొండపండుతప్ప; ప్రతిబింబము = దానిని బోలిన మరియొక వస్తువు, ఇలన్ = భూలోకములో, లేదు.

దొండపండు బుద్ధిమాంద్యమును కలిగించునని శాస్త్రము.—

"సద్యో బుద్ధిహరం బింబం, సద్యో బుద్ధికరీ వచా."

మ. " ఏలబ్బెడిన్, దలక్రిందైన ననూన వాగ్గ్రిహణ మేధాశక్తి బింబాశికిన్."
(వసు. 3-143.)

సీ. అతివ నీమోవి ముద్దాడఁగల్గినఁ జాలు
దివ్యామృతంబు సిద్ధించినటుల,
తొయ్యలి నీపైఁటఁ దియ్యఁ గల్గినఁ జాలు
దుర్గాధిపత్యంబు దొరకినటుల,

---

1 శా. పా.— 'మతి' ('మతిన్ = మనసునకు' అని పూ. టీ.)

మతిన్ = మనసునకు, అను టీక సరి కాదు. 'అతిసమ్మోహ మొనర్చుట' అని తంజ. పా.

2 పూ. టీ.— 'అతిమధురిమన్ = మిక్కిలితీపుచేతను, చిలుకన్ = చిలుకుట చేతను' (అని - మోవిపరమున.)

ఈటీక నాకు బోధపడలేదు. 'చిలుకన్' అను తుమున్నర్థక క్రియకు 'చిలుకుట చేత' అను నర్థమెట్లు వచ్చునో?

ముదిత నీమొలనూలు ముట్టఁ గల్గినఁ జాలు
భూలోక మంతయు నేలినటుల,
యలివేణి నీ నీవి యంటఁ గల్గినఁ జాలు
నలమూలధనము నా కబ్బినటుల,
గీ. ఇంతమాత్రము సేయవే యిందువదన
తాళఁ జాల మనోజాగ్నిఁ దలిరుఁబోణి
మనవి చేకొను మిఁక నైన మందయాన
యేల దయఁ జూడవే నన్ను లోలనయన? ౨౦౮

టీక.— దివ్యా...నటుల (లు+అ) = దివ్యమయిన అమృతము లభించినట్లే.— అంతటి సంతోషమని భావము. (మోవి అమృతతుల్యమని ధ్వని.) దుర్గా...నటుల = గొప్ప దుర్గములు వశమైనట్లే.— అంతటి యానందమని భా. (కుచములు దుర్గముల వలె ఉన్నతములని ధ్వని.) భూలో...నటుల = భూలోకమంతా యేలినట్లే.— అంతటి యామోదమని భా. (కటి భూమండలమువలె విశాలమని ధ్వని.) మూల...నటుల = ప్రధానధనరాశి లభించినట్లే.— అంతటి సంబరమని భా. (నీవి = పోకముడి, నీవి = మూలధనమువంటిదని - ధ్వని.)

క. కుటిలాలక నీ గుబ్బలు
బటువులయి మొగాని కెగయు, బంగరునిగ్గుల్
పొటమరిలుఁ, బుట్టచెండ్లౌ;
నటుగాదే నింత పట్టి యాడుదునఁటవే? ౨౦౯

టీక.— † కుటిలాలక=ఉంగరములు తిరిగిన ముంగురులదానా, నీగుబ్బలు, బటువులయి = వట్రువలై, మొగానికెగయుఞ్ = ఉన్నతిచేత ముఖమును తాకునట్లున్నవి. (వానియందు) బంగరునిగ్గుల్ = బంగారుకాంతులు, పొటమరిలుఞ్ = వెలయుచున్నవి. (కావున - అవి) పుట్టచెండ్లు - ఔను = నిజముగా పుట్టచెండ్లే. (వట్రువలై యుండుటయు, (నేలపై గొట్టినంతనే) మొగాని కెగయుటయు, బంగారు కాంతులు కలిగియుండుటయు - పుట్టచెండ్ల లక్షణములు.) అటుకాదేని=అవిపుట్టచెండ్లవలె మనోహరములు కాకపోతే, ఇంతపట్టియాడుదునటవే=వానికొరకింతగా అక్కఱపడి పెనగులాడుదునా? (అవి చెండ్లుకావుననే పట్టి ఆడుచున్నానని చమత్కారము.)

† పూ. టీ. లఘువుగానైనను లేదు. టీక వ్రాయదగిన పద్యము కాదని కాభోలును - ఉపేక్షించినారు.

'పట్టియాడు' జాతీయము.— "వ. అని హరిశ్చంద్ర నృపుండును నాచండా లుండునుం బట్టియాడ నట్టియెడం గదిసి నక్షత్రకుండు". (హరిశ్చ. 4-224.)

బంతిమొగాని కెగయుటను ఒకకవి యిట్లు చమత్కరించినాడు.—

" విదితం ననుకందుక తే హృదయం, ప్రమదాధర సంగమలుబ్ధ ఇవ
వనితా కరతామరసాభిహతః, పతితః పతితః పునరుత్పతసి "

గీ. మదవతీమణి రాలతో మాట లాడుఁ
గదవె నీవట్రువమెఱుంగు గబ్బి కులుకు
టొఱుకు సిబ్బెపు గుబ్బ పాలిండ్లు దెలియ
నీవు మా టాడ కుండెడి దేమి చెపుము.　　౨౧౦

టీక.— మదవతీమణి = యువతీరత్నమా, ('మదవతి' యనుటచేత చిత్రాంగి మంచి యౌవనపుప్రాగరులోనున్నదని సూచన.) నీ పాలిండ్లు, రాలతో (సైతను) మాట లాడును. నీవు నాతో మాటాడకుండుటకు కారణమేమి? అని ప్రశ్న. $ 'రాలతో మాటలాడును'- అనగా రాళ్లతో సమానములని భా. అదియొక జాతీయము. ('మాట లాడు' ఉపమావాచకము') ఒక్కయుదాహరణము.—

సీ. "కరటి ఘటాకోటి కటనిర్గళన్మదా
　　సారంబు దొలుకారుఁ జేరఁ బిలువ,

---

$ పూ. టీ.— '= కుచములురాలను నిందించును - అనఁగా రాలవలె కఠినము లని భా.'

'ఆక్రోశత్యవజానాతి కదర్థయతినిందతి.... కస్య చానుకరో తీతి శబ్దాః సాదృశ్యవాచకాః' అను దండివాక్యమున 'నిందతి' అని యున్నందున 'నిందించును' అని యన్నదేగాని ఉపమావాచకము కాదనుకొని పూ. టీ. కర్తలు 'మాటలాడు' క్రియకు 'నిందించు' అని యర్థము చెప్పినారు; పొరపాటు. (పూ. టీ. వ్రాతప్రతిలో 'రాళ్ళతో మాట్లాడునుగదా - అనగా రాళ్ళవలెనే కఠినమైనవనుట' అని సరిగానే యున్నది.) ఇంకొకవిశేషము. 'మాటలాడు' అను క్రియకు 'నిందించు' అనునదే యర్థమైనయెడల కర్మయైనపాలిండ్లు ద్వితీయలోగదా ఉండవలసినది? (చూ. భా. కా. 2.) 'వాడు నాతో నిందించుచున్నాడు' అనే తెనుగువా రన్నారా? తెనుగువాడు కాకపోయినను బ్రౌను - ఎట్లు వ్రాసినాడో చూడండి.— "మాటలాడుట - To speak or to reproach. నన్నెందుకు పూరికెమాటలాడుతావు, 'why reproach me. 'ావున. పూ. టీ. సరియైనదికాదు.

రథనేమి నిర్భిన్న పృథివీపరాగంబు
నీహారసమయంబు నెర్పఁదెగడ,
సుభట భుజోద్భట ఛురికా ప్రభాభంగి
మండువేసవితోడ మాటలాడ." (ఉ. హరి. 4–223.)

శా. ఏమే పల్కవు మోహనాంగి? యిటు లేలే యల్క చిత్రాంగి? ని
న్నే మంటిం గలకంఠి? నావలనఁ ద ప్పేమే యొయారీ? యయో!
నామీఁదం దయ లే దఁటే చెలి? నను న్మన్నింపవే కోమలీ,
నీమాటల్ జవదాఁటు కుందుఁ గదవే నీరేజ పత్రేక్షణా. ౨౧౧

క. ఇంతీ, మదనునిపట్టపు
దంతీ, యొసపరి మిటారి తండములో మే
ల్బంతీ, యేమే రతిపూ
బంతీ, దయఁ జూచి నన్ను బ్రతికింపఁగదే! ౨౧౨

టీక.— ఒసపరి మిటారితండములోన్ = అందకత్తెలైన ఒయ్యారులలో, మేల్బంతీ = మేటియైన దానా. ('మేల్బంతి నికరము మేటిమేలు'—ఆం. భా. 3–15.)

వ. అని బహుప్రకారంబులఁ బ్రార్థించి. ౨౧౩

క. ఏ మనిన విననియగ్గజ
గామినియలు కార్పఁ దరము గామిని నృపతి
గ్రామణి సాఁగిలి మ్రొక్కెను
గామకులకు నెగ్గు సిగ్గు [1] గలదే యెందున్. ౨౧౪

టీక.— గజగామిని = (ఏనుగు నడకవంటి నడకగల) చిత్రాంగియొక్క, అలుక; అర్పన్ = తీర్చుటకు, తరముకామిని = శక్యముకాకపోవుటచేత.

చిత్రాంగి గజగామిని కావుననే రాజెన్ని విధముల బతిమాలినను వినక గజనిమీలితములు కావించినదని సారస్యము.

గజనిమీలితము = నిరాదరణము.— 'ఉద్దామదర్ప శ్వయథుస్థగిత శ్రవణ వివరాశ్చోపదిశ్యమానమపి తే నశృణ్వంతి; శృణ్వంతోపిచ గజనిమీలితే నావధీరయంతః ఖేదయంతి హితోపదేశాయినో గురూన్. (కాదంబరి.)

---

[1] పా.— 'కలవే' (కలదే - పూ. ము. తంజ. పా.)

— చిత్రాంగి సారంగధరునిపై నేరముమోపుట —

క. ఆ నతిఁ గైకొని, యాతని
యానతి మీఱనిది వోలె నత్తఱిఁ జిత్తం
బూనినకపటము నెఱపం
బూనినదై యాగయాళి బూమెలు మెఱయన్. ౨౧౫

టీక.— ఆ, నతిన్ = నమస్కారమును, ఆతని, ఆనతిన్=ఆజ్ఞను. చిత్తంబు - ఊనినకపటము = తాను మనసున నునుకొనియున్న దుస్సంకల్పమును, బూమెలు = అబద్ధపుకల్పనలు = మాయలు.

క. ఒడలు వసివాళ్లు వాడన్
వెడయూర్పు నిగిడ్చి మెల్లనె కరాంబుజ మ
య్యెడ నూఁది లేచి బడిబడి
బుడిబుడియేడుపు లెసంగ భూవరుతోడన్. ౨౧౬

టీక.— ఒడలు = శరీరము, వసివాళ్ళు వాడన్ = మిక్కిలిగా వాడివత్తలు కాగా, వెడయూర్పునిగిడ్చి = పెద్ద నిట్టూర్పువిడిచి, కరాంబుజమున్ ఊఁదిలేచి = (కమలమువంటి) చేయూనుకొని లేచి, బడిబడిన్ = మాటిమాటికిని, బుడిబుడి యేడుపులు = వచ్చీరాని వగలమారి యేడుపులు, ఎసంగన్ = అతిశయింపగా.

గీ. † నిబ్బరిక మేది యును మేదినీవరేణ్యా
నీ వరణ్యమునకు వేఁట పోవఁ బ్రొద్దు

---

† శా. పా.— 'నిబ్బరిక మేది 'విను' ('నిబ్బరికము ఏది = స్థిరతను కోలుపోయి.' అని పూ. టీ.

'నామాటను, తొందరపడక నిబ్బరముగా విను' మనుట లోకమున కలదు గాని 'నిబ్బరమును - కోలుపోయి విను' మనుట (వివేకిలోకమున) లేదు. కావున పూ. టీ. యుచితమైనదికాదు. పూ. ము. నను, తంజ. ప్రతులలోను గూడా ' నిబ్బరిక మేది యును' అను పాఠము కనబడుచున్నది. అంతేకాక శ. ర. కర్త నిబ్బరికమునకు 'కరుణ' యని యర్థముచెప్పి అందు కీపద్యమునే యుదాహరించి యున్నాడు. అందును 'నిబ్బరిక మేదియును' అను పాఠమే యున్నది.' గావున శా. పా. సరియైనది కాదు. (కొన్ని వ్రాత ప్రతులలో 'నిబ్బరిక మేది యను' అను పాఠాంతరమున్నది. 'చిత్రాంగి నిబ్బరిక మేది = ధైర్యమును కోలుపోయి, అనున్ = ఇట్లనెను' అని ఆపాఠమున నర్థము.)

గడప లే కెందుఁ, జేతఁ జిల్కఁ గొని దాని
‡ చేతఁ గొంత యుబుసుపోయి చెలఁగు నంత. ౧౧౭

టీ. క.— మేదినీవరేణ్యా = రాజా, నీవు, నిబ్బరిక మేదియును = కరుణమాలి, (= నన్ను ఒంటరిగా నింటవదలి - అని భా) అరణ్యమునకు, పోవఁగ = పోగా, ఎందుఁగ = ఏవిధము చేతను - ప్రొద్దుకడపలేక, చిల్కఁగ - చేతఁగొని, కొంత ఉబుసుపోయి = ఆచిలుకతో క్రీడించుటలో కొంత ప్రొద్దుపోగా - చెలఁగునంతఁ = అట్లున్న సమయమున.

క. సూరెల ముదికౌముది[1]సిం
గారము గార, మయిఁ బాముకన్నులె మెఱుఁగుల్

---

‡ శా. పా.— 'చేతనేనటు లుబుసుగాఁ జెలఁగు నంత' ('ఉబుసుగాఁ = ప్రొద్దు పోవునట్లు' అని పూ. టీ. )

ఉబుసు - అనగా ప్రొద్దుపోక పోవుటగాని ప్రొద్దు పోవుటకాదు. 'ఉబుసు= పనిలేనికాలము (ఈయర్థమున పోవు - పుచ్చు - అనువానితోఁ గలసియేయుండును." (సూ. ని.) "ఉబుసుగా - idly" (బ్రౌను.)

కాబట్టి 'ఉబుసుగాఁ జెలఁగుట' యనగా ప్రొద్దుపుచ్చుకొనుచుండా సోమరిగా నుండుట యని తేలినది. అందువలన పూర్వటీకయే కాక ఆపాఠముగూడా సరియైనది కాదని యేర్పడినది.

'దానిచేతఁ గొంత యుబుసుపోయి' అని వ్రాత ప్రతులపాఠము.— 'గొంత యుబుసుపోక' అని శ. ర. పూ. ము. పాఠము. వ్రాత ప్రతులపాఠమే గ్రాహ్యమని నాకు తోచినది.

1 శా. పా.— 'సింగారము గారమయి, పాముకన్నులె'

'సింగారము, గారము + అయి' అని వారు భావించిన విభాగము, మరి వారూహించిన యర్థమేమో? దేవునికే యెరుక. (పూ. టీ. లేదు.) 'మయిఁబాము' అని నేను కావించిన సవరణ. ఆపావురపు దేహము మిసమిసలాడు మెఱుఁగులు కలదియని మూలగ్రంథమున నున్నది. చూడండి.—

మీనుమీసములీల మిసమిసమించు
మేని క్రొమ్మించుల మెఱుఁగు వెన్నెలల
వెదజల్లు నొకమంచి వెల్లపావురము
ముదము దీపింప నా ముందట వ్రాలె". (పుట. 57.)

వాలు చెలువారు నొక తెలి
పారువ మిటు వ్రాలె[2] వెరఁగుపడి వడిఁ జూడన్. ౨౧౭

టీక.— నూరెలన్ = పార్శ్వములయందు, ముదికొముది సింగారముకార (= అ)న్ = ముదురు వెన్నెలవంటి తెల్లనికాంతులు వెల్లివిరియుచుండగా (ఆపారువము తెల్లనిది - అని భా.) మ్రయిన్ = శరీరమునందు, పాముకన్ వలెన్ మెఱుఁగుల్ వాలు = పాముకన్నువలె మినమిన లాడెడు - చెలువు = సోయగము, ఆరు = ఒప్పు నట్టి (=కలిగిన), ఒక, తెలిపారువము; (నేను) వెరఁగుపడి = ఆశ్చర్యపడి, వడిన్ - చూడన్, ఇట వ్రాలెను.

* ఉ. రింగులవల్లెవాటు సవరించి, మెయిన్ మృగనాభి నించి, వే
భంగులనీటు వెట్టి, యలపార్శ్వముఁ బట్టు నెవంబు వెట్టి, సా
రంగధరుండు నేమము దొలంగుమదిం జనుదేరఁ, గొంకు మీ
ఱం గడ కేఁ దొలంగి వడి రాఁ గని రాగనిమగ్నచిత్తుఁడై. ౨౧౮

టీక.—రింగుల వల్లెవాటు సవరించి = చక్కగా కుచ్చిపెట్టిన ఉత్తరీయమును వల్లెవాటుగా వేసికొని, మెయిన్ - మృగనాభి = కస్తూరి, నించి = మెండుగా పూసి కొని, వేభంగులన్ నీటువెట్టి = అనేకవిధములుగా సొగసుచేసికొని, పార్శ్వమున్ పట్టు, నెవంబుపెట్టి = నెపముపెట్టి, నేమముతొలంగుమదిన్ = నీతిమాలినతలంపుతో, చనుదేరన్ = రాగా, (చూచి) ఏన్ = నేను, † కొంకుమీఱన్ = భయమధికము కాగా, తొలంగి, కడకురాన్ = ఇవతలికిరాగా, కని = నన్నుచూచి, రాగనిమగ్న చిత్తుఁడై = మోహమున మునిగిన మనసుకలవాడై;—

---

2 శా. పా.— 'వెరఁగువడి.'

పూ. ము. నను, వ్రాతప్రతులలోను గూడా 'వెరఁగు పడి' అని యున్నది. 'వెరఁగువడు; వెరఁగువాటు' అను రూపములు కోశములయందును కనబడవు.

* ఒక తాళపత్రప్రతిలో ఈ పద్యము వెంట ఈ క్రిందిపద్యమున్నది.—

'కలదు లేదన నసియాడు కౌనుతీరు
తళుకు మొగమున కెగయు గుబ్బల బెడంగు
చూచి, యాతని నిడువాలుఁ జూడ్కు లపుడు
నిండువేడుక మిన్నందె కొండఁదాఁకె.'

† పూ. టీ.— 'కొంకు = సిగ్గు'

నీతిమాలిన తలపుతో తనపైకివచ్చు పరపురుషుని జూచినపుడు ఉత్తమస్త్రీకి కలుగునది 'జంకు'గాని 'సిగ్గు' కాదు. 'కొంకు' అను పదమునకు 'సిగ్గు' అనేయర్థమును లేదు. 'కొంకు = జంకు' (చూ. సూ. ని.)

ఉ. ఎక్కడ నేర్చెనో నలువ యీచెలువన్ సృజియింపఁ జూడ మీ
చక్కనిమేను నీమెఱుఁగుఁజన్గవ యీనగుముద్దుమోము నీ
చెక్కులకాంతు లీపిఱుఁదుచెల్వము నీనునుఁగౌనుతీరు నీ
చొక్కపుఁగొప్పు నీతళుకుఁజూపులు నీకలహంసయానముల్. ౨౨౦

గీ. అని వయఃస్మయవిస్మయాయత్తుఁ డగుచుఁ
జిత్తజవికార దుర్వార చిత్తుఁ డగుచు
మరులునను జేరి ననుఁ జీరి మత్తుఁ డగుచు
ని ట్లనియె మానసయహీనవృత్తుఁడగుచు. ౨౨౧

టీక.— వయః స్మయ = యావనపు పొగరువలని, † విస్మయ = గర్వమునకు, ('విస్మయః - Pride, arrogance' ఆప్టే.) ఆయత్తుఁడు = అధీనమయినవాడును, చిత్తజవికార = కామవికారముచేత, దుర్వార = వారింపరాని, చిత్తుఁడు = చిత్తము కలవాడును, అగుచున్ = అయి, మరులునను - చేరి = వలపుతో దగ్గిరికివచ్చి, ననున్, చీరి = పిలిచి, మత్తుఁడగుచున్, మాన...వృత్తుఁడగుచున్ = అభిమానము నీతి మాలిన వర్తనముకలవాడగుచు, ఇట్లనియెన్ = కండకావరమున ఈరీతిగా పలికెను.

క. వనిత గజనిమ్మపండ్లను
ఘనముగ నో రూరఁ జెప్పఁగా విందుము నీ
చనుగుబ్బల [1]లావణ్యము
వినినప్పుడె వానిపులుసు విఱుగుం జుమ్మీ. ౨౨౨

---

† పూ. టీ.— 'విస్మయాయత్తుఁడు=ఆశ్చర్యమునకు స్వాధీనమయినవాఁడు.' యావనపు కలిమిచేత కలుగునది 'గర్వము' గాని 'ఆశ్చర్యము' కాదు. ఆశ్చర్యపడినవాడు - వలపుమాటలాడుట స్వభావమును కాదు. కావున పూ. టీ. సరియైనది కాదు.

[1] శా. పా.— 'యొయ్యారము' ('వయ్యారము' పూ. ము. పా.) 'వయ్యార' మనుట తప్పని శాస్త్రిగారు 'యొయ్యార' మని దిద్దినారు. కాని పులుసును విరుచు ప్రజ్ఞ 'వయ్యారమున కెంత కలదో 'యొయ్యారమున' కంతే గలదు. అందుకు రెండును సమర్థములు కావు. 'గుబ్బల - లావణ్యము' అని సరియైనపాఠము తంజ ప్రతులలో ఉన్నది. అసలీపద్యమునగల చమత్కారము పూ. టీ. కర్తలకు గోచరింపనే లేదు. అందువల్లనే అర్థము వ్రాయక నెట్టివేసినారు.

టీక.— వనిత, గజనిమ్మపండ్లను (గూర్చి) ఘనముగన్ = గొప్పగా (ఆకృతి చేత పెద్దవిగా - అని, అర్థాం.) నోరూరన్ - చెప్పఁగా = ఆశగలుగునట్లు (లోకులు) ప్రశంసింపగా, (నిమ్మపండ్లు పులుపు కావున - అస్మరణచేత, నోరూరన్ = నోట నీరూరునట్లుగా, అని అర్థాం.) విందుము = వినుచుందుము, కాని, నీ చనుగుబ్బల, లావణ్యమున్ = కాంతివిశేషమును,=నైగనిగ్యమును;

[ముత్యములోని నీరువలె అంగములయందు నిగనిగలాడెడి కాంతి విశేషమునకు లావణ్యమని పేరు; "ముక్తాఫలేషుచ్ఛాయా యా స్తరళత్వమివాంతరా, ప్రతిభాతి యదంగేషు, తల్లావణ్యమిహోచ్యతే" శబ్దకల్పద్రుమము.]

వినినప్పుడే = విన్నంతనే, వాని పులుసు = ఆకృతి గొప్పదనముచేత వానికి గలిగిన గర్వము, విఱుగున్ - చుమ్మీ = అణగిపోవునుసుమా. (గజనిమ్మపండ్లు ఆకారముచేత నీగుబ్బలకంటె గొప్పవైనను, వానికి నీగుబ్బలకు గల లావణ్యము లేదు. కావున వీనితో అవి సరిపోలవు అని యర్థము.) గజనిమ్మపండ్లలో - పులుసున్నది. ఆ పులుసును విరుచు లావణ్యము = లవణభావము ( = ఉప్పదనము) కుచములయందున్నదని చమత్కారము. (ఉప్పు తగిలినయెడల పులుసు విరుగుట సహజము.)

గర్వము - అను అర్థమున 'పులుసు' జాతీయము. (శ. ర. లో లేదు.) "పులుసు Pride, self-conceit. అతనిపులుసువంచిరి. they humbled him" (బ్రౌణ్యము.)

లావణ్య శ్లేషకొక్క యుదాహరణము.—

" పీతో యతః ప్రభృతి కామ పిపాసి తేన
తస్యా మ యాధరరసః ప్రచురః ప్రియాయాః,
తృష్ణా తతః ప్రభృతి మే ద్విగుణత్వమేతి;
లావణ్యమస్తిబహు తత్ర కి మత్ర చిత్రమ్." (అమరుకము).

లావణ్యమ్ = కాంతి. † ఉప్పఁదనము'.

క. [1] తలతల మనువజ్రంబుల
తలతల మనునీదురదనతతిఁ బోలదె కా

---

† 'ఉప్పఁదనము' అని శాస్త్రిగారి టీక. వారు 'ఆముక్త' (పుట. 141) లో గూడా 'లావణ్య = ఉప్పఁదనముయొక్క' అనియే అన్నారు. కాని 'ఉప్పఁదనము' అనుట తప్పు; 'ఉప్పఁదనము' అనుట ఒప్పు. "ఉప్పదనము or ఉప్పన - Saltness" (బ్రౌను.) ఇట్టి శబ్దదోషము లా శాస్త్రిగారి వ్రాతలలో వందలతరబడిగా నున్నవి.

[1] శా. పా.— 'తళతళ.'; ఈపాఠము యమకసారస్యమునకు భంగకారి.

యలచుక్కలనిగనిగ యో
పొలఁతీ, నీకాలిగోరుఁ బోలదు సుమ్మీ. ౨౨౩

టీక.— ఓ పొలఁతీ, అల - చుక్కల నిగనిగ = నక్షత్రములయొక్క నిగనిగ కాంతి, తల...తతిక్.— $ తలతలమను వజ్రంబులక్ = తళతళ మెరసెడి వజ్రములను, తలతలము + అను = తొలగుతొలగు అనునట్టి (అనగా వజ్రములయొక్క తళతళలను తిరస్కరించునట్టి) నీదు రదన తతిక్ = నీపలువరుసను, పోలదెకా = పోలనే పోలదు - సరిగదా, నీకాలి గోరు(నైనను) పోలదుసుమీ.

ఇంతీ నీ పలువరుస వజ్రములనే తిరస్కరించునది. కావున చుక్కలు నీ పలువరుస నసలే పోలజాలవు. అంతేకాదు నీ కాలి గోటికి గూడా సరిపోవు, అని తా. (పండ్లు వజ్రములవలె తళతళ లాడుచున్నవనియు - గోళ్లు చుక్కలవలె నిగనిగలాడుచున్నవనియు భావము.)

తలతల+అను = తలతలమను.— (ముగాగమసంధి. ప్రౌఢ. సంధి. 19)

తలము + తలము = తలతలము. (ఆమ్రేడితమున మువర్ణకలోపము.— బాల. సంధి. 49.)

---

$ పూ. టీ.— 'తళతళ ప్రకాశించు వజ్రములయొక్క (తలతలక్) తలలయందు (మను) ఉండునట్టి నీ పలువరుసను.'

చిత్రాంగి పలువరుస వజ్రముల తలలయందు మనెడిదఁట! మనుట యనగా ఉండుట యని యర్థమఁట!! అపూర్వమైన వ్యాఖ్య.

పూ. టీ. కర్తలు 'తలతలము + అను, అని విభాగించుటకు మారుగా, 'తలతల - మను' అని తప్పుగా విభాగించి అంతకంటె తప్పుగా అర్థమును పులిమి పుచ్చినారు. వారి కేల తెలియలేదోగాని తల; తలతల; తలము; తలతలము, అను క్రియారూపములు తెనుగుకావ్యములతో పరిచయముగలవారికి క్రొత్తవికావు. గ్రంథములలో వందలకొలదిగా ప్రయుక్తములయియున్నవి. పాఠకవినోదమున కొక కొన్ని యుదాహరణములు.—

## (తలము - )

(1) 'తలమనక భీష్మనందన
తలయును మూతియును గొలుగఁదగవే' (భాగ - 10 పూ. 1770)

(2) 'సంబళి సంబళీ యళుకు సందడికిం దలమంచుబల్కినక్' (శివరాత్రి- 3-40)

(3) 'సెరయ నీఁగొనలేని నీవనునట్టి
ఫరవ (?) మాటలు సయింపపు దలమనిన' (గౌ. హరి. 2-672)

క. $ నీ కలికితనమునకు బి
బ్బోకశ్రీకిన్ వయోవిభూతికిఁ దలఁకన్

(4) 'తలమని ముంగలఁ దలఁబాయఁద్రోచి' (గౌ. హరి. 2-1924)

(5) 'కనికనఁగరాని చంచలఁ
దనులత యచలంపుఁగోచిఁ దలఁపునుదానిన్' (కాళింది. 5-27)

(6) 'తలమని మతియు నత్తతిని రొండొరుల (నవనాథ - పుట. 16)

(తలతలము - )

(1) 'తలతలని తరణి మెఱుఁగులఁ
దలతలమను మణులమెఱసి' — (మను. 5-100)

(2) 'తలతలమని రెండు దడములవారు' — (నిర్వ. రా. 1-44)

(3) 'తలతలమనఁ బతియుఁ జతురతరముగ నడచెన్' — (8-68)

(4) 'తలఁగ కాతనిఁ దలతలమని నిలిచి' — (బసవ - పుట. 103)

(5) 'తలతలమని కొండఱు పెద్దల వారెడఁగలుగ జడియ' — (శుకసప్తతి.)

(6) 'తలతలమను నపరంజిన్
తలతలమను జెలువ బల్లిదపుడాల్ పలువిం
తల తలరారెడు నమ్మెలఁ
తలతలమానికము నెన్నఁ దరమేమానన్' (అచ్చ. రా. బా. కాండ.)

తలతల = తొలతొల.

'తొలతొలఁడనుచును ద్రోవకడ్డంబు
నిలిచివాచర్వక నిలునిలుఁడనుచు.' (బస. పు. 161.)

ఇంత యొందుకు? తలము - తలతలము, కూడా నిఘంటువులందున్నవి.

"తలము - Stop. stand back - తొలు" (బ్రౌణ్యము.)

"తలతలము = తొలఁగుము తొలఁగుము." (శ. ప. పారిజాతము.)

ఒక్కమాట.— పూ. టీ. కర్తలు, 'తల' యెరుగనివారుకారు.— 'ఔఁదల ధరణీపాలక' (2-233.) అన్నచోట.— తల = తలగుము. అని వ్రాసినారు. అయితే, ఇక్కడ 'తలతల' మనుటలో భ్రమించి తప్పుదారిని పడ్డారు.

$ పాఠాం.— 'కాకికి ధరలోనఁబిక, శ్రీకెటను వయో విభూతిఁ జెల్లునె తలఁపన్.'

నీకుఁ జేనికిఁ దగునే?
నాకు న్నీకుఁదగుఁ గాక; నాళీకముఖీ. ౨౨౮

టీక.— నీ, కలికితనమునకుఁ = మనోజ్ఞతకు, బిబ్బోకశ్రీకిన్ = శృంగార విలాససంపదకు, వయోవిభూతికిన్ = నిండుజవ్వనమునకును, నాళీకముఖీ = కమలము వంటి ముఖము కలదానా.— బిబ్బోకము = (బిబ్వోకము.) సాపరాధుఁడైన ప్రియుని కథను వినునపుడు గర్వముచేత ఇంచుకంత అనాదరము చూపుట - యను శృంగార చేష్ట. ('మనాక్ ప్రియకథాలాపే బిబ్బోకోఽనాదరక్రియా.' ప్ర. రు.)

క. నెమ్మేను గంధవహము, మొ
గమ్ము కళానిధి, యనంగకలితము నడుఁ, మా
కెమ్మోవి మధువు, నేఁ గద
కొమ్మా యెటు లోర్తు నేలుకొమ్మా నన్నున్. ౨౨౯

టీక:— నెమ్మేను (నెఱి + మేను) = మనోజ్ఞమయిన నీదేహము, గంధవహము = కమ్మకమ్మని తావులను కలది. (మలయమారుతమే; అని చమత్కారము.) మొగమ్ము, * కళానిధి = శృంగారకళలకు తావు. (కేవలము చంద్రుడే, అని - చమ.) నడుము, అనంగకలితము = అంగముతో కూడుకొననిది = శూన్యము = మిక్కిలి సన్న మని భా. (మన్మథుఁడే - అని చమ.) కెమ్మోవి = ఎఱ్ఱని నీయధరము, మధువు = తేనె. అంత మధురమని భా. (వసంతుడని చమ.) ఔనుగదా! కొమ్మా, మరి యెటు లోర్తును? = ఓసువజాలను, ఏలుకొమ్మా = మన్నించి నన్ను పరిగ్రహింపుము.

కమ్మని సువాసనలను గుబాళించు నీమేను కౌగిలింపక, కళకళలాడు నీ మొగ మును ముద్దుగొనక, కలదో లేదో అన్నట్లున్న నీనడుము నొరయక, తేనెవలె మధుర మయిన నీమోవియానక నే నెట్లుండగలను? దయచేసి నన్నేలుకో - అని తా.

కామోద్దీపకులయిన మలయమారుత చంద్ర మదన వసంతు లొక్కమ్మడిగా నీవయి నన్ను బాధించుచున్నారు, నేనెట్లు సహింపగలను - నీవు మన్నించుట వారెల్లరు నన్ననుగ్రహించుటయే' అని చమత్కారము.

---

* పూ. టీ — 'కళానిధి = విద్యలకు తావు. (చంద్రుడనియును.)'

కామిని ముఖము విద్యలకు తావైనచో కాముకుని కేమిబాధ? అతడు 'నే నెటు లోర్తు' ననుటయెందుకు? మరియొకమాట; విద్యలకు తావగు 'ముఖము' నోరుగదా? నోటిని చంద్రుడుగా చెప్పవచ్చునా? విస్తరమెందుకు? పూ. టీ. తప్పు.

నడుము బొత్తిగా లేనట్లు చెప్పుట కవిసమయము. అదియొక అలంకారము కూడాను. ఒక్క యుదాహరణము.—

" అరమ్య భావం భజతే జగత్యా
మంగేషు కించి ద్వికలోఽపి లోకః
సంద్రుశ్యసే త్వం నిఖిలేన బాలే
మధ్యేన హీనాపి మనోజ్ఞ మూర్తిః" (చంపూ భారతము. ౯-౩౦.)

సీ. నెఱిగొప్పు కొనగోర నివిరి చూచెద నన్నఁ
జెలి నీవది ఘనంబు చేసికొనెను,
గట్టిచన్గవ చేత ముట్టి చూచెద నన్నఁ
జెలి యది యొకకొండ[1] చేసికొనెను,
† పసిగౌను పిడికిటఁ బట్టి చూచెద నన్నఁ
జెలి యది గగనంబు చేసికొనెను,
మించుమే నటు కౌఁగిలించి చూచెద నన్నఁ
జెలి యది బంగారు చేసికొనెను,

---

1 శా. పా.—'కొండఁజేసికొనెదు.'

'కొండఁజేసికొనెదు' అనుట తప్పు. 'కొండచేయు' అని క్రియ. గొప్పచేయు-అని యర్థము. 'కొండ = గొప్ప' అనుటకు—

క. 'కొండఁ బెకలించి తెచ్చుట
కొండొక పనిగాక యొక్క కొండా తలఁపఁగ.' (భాగ. 10 పు. 914)

సీ. 'ఈకొండమణికాంచ నాకార రుచిగాంచెఁ
గొండలెల్లను దన్నుఁ *గొండచేయ.' (విక్ర 2-15)

కొండచేయుట యనగా కొండంత (గొప్ప) చేయుటగాని, కొండను చేయుట కాదు. 'ఘనంబుచేసికొను' - 'గగనంబుచేసికొను' - అను క్రియలెట్టివో 'కొండ చేసికొను' అను క్రియయు నట్టిదే. 'గొప్పంజేయు' అనుటలో గల దోషమెట్టిదో 'కొండంజేయు' అనుటలో గల దోషమును అట్టిదే.

† పాఠాం.—'అసిగౌను'.— 'వలిగౌను'.— 'మినుకుఁగా నొకసారి పుణికి చూచెదనన్న.'

---

* 'కొండఁజేయ' అనియే సూ. ని. పా. మరియు నందు 'కొండఁజేయు = పెద్దచేయు' అని గూడా ఉన్నది. 'పెద్దఁజేయు' అనమి యెందువల్లనో?

గీ. చెప్ప లెత్తిటు చూడవేయొప్పులాడి,
యెంత దయలేనిదానవే యేణనయన,
యాసపడువారి నెఱుఁగవే యలరుఁబోణి,
చాటు కేఁగెద వేటికే జలజగంధి. ౨౨౬

టీక.— ఘనంబుచేసికొనెదు; కొండచేసికొనెదు; గగనంబుచేసికొనెదు = బంగారు చేసికొనెదు; అనగా వానినేమో గొప్పగా భావించుకొని దాచుకొను చున్నావని నిష్ఠురమాడుట. (కొప్పు, ఘనంబు = మేఘమువలె నలుపనియు, చన్గవ, కొండలవలె నున్నతములనియు, కౌను, గగనమువలె కలదో లేదో అన్నట్లున్నదనియు, మేను, బంగారుచాయ కలదనియు, ధ్వని.)

గీ. అనుచు నా కేలు వట్టినయప్పు డధిప
యేమి చెప్పుదు నా నెగు లీశ్వరుండ
యెఱుఁగు నాసిగ్గుఁ గాచువా రెవరు లేక
† మిట్టి మీనై పడు చెనంటి నిట్టు లంటి. ౨౨౭

టీక.— కేలు = చెయ్యి, నెగులు = మనోవ్యథ, మిట్టిమీనై పడుచెనంటికి = జవ్వనపు పొగరున (బేడిసవలె) మిడిసిపడుచున్న ఆదుష్టునితో ఇట్టులంటిని.

'మిట్టిపడుట' అనగా కండకావరమున త్రుళ్ళిపడుట.— 'To be puffed with pride or insolence - మిడిసిపడుట' — (బ్రౌణ్యము).

శా. ఓరీ నాపతి లేనిచో భయము లే కొక్కింత శుద్ధాంతమం
ద్వ్యారం బేర్పడఁ జొచ్చి నన్నుఁ గని కామాంధుండవై ప్రేలెదీ,
వారాజన్యునిసొమ్ము ప్రాయమును నాప్రాణంబుఁ బోమ్మార కే
యారీతిన్ పినతల్లిఁ బట్టిన ఖలుం డెచ్చోఁ గలండే మహిన్? ౨౨౮

టీక.— శుద్ధాంతము = అంతఃపురము, కామాంధుండవై = కామము కన్నులకు గప్పుటచేత గ్రుడ్డివాడవై. (కన్ను మిన్ను గానక - అన్నమాట.)

క. అనినం గామవికారము
నను బలిమిం గౌఁగిలించి నఖముల వ్రచ్చెన్

† శా. పా — 'మిట్టి మీనై - పడి ... నిట్టులంటి' (ఇది పూ. ము. పా.) 'నేను మిట్టి మీనైపడ్డా' నని చిత్రాంగి చెప్పికొనెనా? అట్లు చెప్పికొను వారును ఉందురా? 'మిట్టి మీనై పడు చెనంటి' నని తంజ. తా. పా.

జనుఁగవ 'ముంజేకంకణ
మున కద్దం బేల' చూడుము మహీపాలా. ౨౨౯

టీక.— నఖములన్ = గోళ్ళతో, వ్రచ్చెన్ = చీల్చెను.— ముంజే... బేల = ముంజేతికి పెట్టుకొన్న కంకణము ప్రత్యక్షముగా కనబడుచుండగా, దానిని చూచుట కొక అద్దమెందుకు? (వాడుచేసిన దుశ్చేష్ట కనబడుచునే యున్నది కావున ఇక సాక్ష్యముతో పనిలేదని భా.)

వ. అని రయంబున నాఖండలభుజాగ్రధారా నవవిదారిత ధరాధరావరణధారాధరంబునుంబోని పయ్యెద చెఱంగు మఱుంగు వాయం దిగిచి యయ్యెడ. ౨౩౦

టీక.— ఆఖండల = ఇంద్రునియొక్క, భుజాగ్ర = భుజశిరముమీది, మండలాగ్ర = కత్తి (=వజ్రాయుధము) యొక్క, ధారా = వాదరచేత; నవ = క్రొత్తగా, విదారిత = భేదింపబడిన, ధరాధర = పర్వతములకు, ఆవరణ = మూతగానున్న, ధారాధరంబుంబోని = మబ్బువలెనున్న, పయ్యెదను, మఱుంగుపాయందిగిచి = పూర్తిగా తీసివేసి.

క. † కుమ్మెలు వోయినబంగరు
బొమ్మరములయెమ్మెఁ గడకుఁ బొమ్మను రేఖా
సమ్మిళిత స్తనకుంభత
టమ్ము $ దిటమ్మునను జూపి డగ్గుత్తికతోన్. ౨౩౧

టీక.— కుమ్మెలువోయిన = దెబ్బలుతగిలి పగుళ్ళువారిన, బంగరు బొమ్మరముల యెమ్మెన్ = బంగారు బొంగరాల తీరును, కడకుఁబొమ్మను = తిరస్కరించునట్టి ( = పగుళ్లువారిన బంగారు బొంగరాలవలె నున్న) రేఖా... తటమ్మున్.— రేఖా = గోటిగీరలతో, సమ్మిళిత = కూడియున్న, స్తనకుంభ తటమ్మున్, దిటమ్మునను = ధైర్యముతో (జంకు - కొంకులేక నన్నమాట) చూపి, డగ్గుత్తికతోన్ = దుఃఖాతిశయమువలని గద్గదస్వరముతో.

---

† పాఠాం.— 'కుమ్మెలుదాఁకిన.'

$ శా. పా.— 'దిటమ్ముగనుజూపి' ('దిటమ్ముగన్ - దృఢముగా అని పూ. టీ.)
'దిటమ్ముగన్ = (దిట్టముగా) దృఢముగాచూపి, అనుటకంటే, 'దిటమ్మునను = ధైర్యముతోచూపి' అనుట ఉచితముకాదా? చిత్రాంగియొక్క దిట్టతనముగదా ప్రకృతమున ప్రకటము కావలసినది?

ఉ. †ఇంతకుఁ గీర్తిరాఁగఁ ద్యజియింతును ప్రాణమదెంత? యీవిధం
బంతయు నీకుఁ దెల్పుటకునై * యిటులుండితి; నీదుపట్టి ‡ న
న్నింతయుఁబ్రేమఁబట్టి రమియించిన యప్పుడె మామ వైతి; నీ
కింతటనుండి కోడలఁ జుమీ నను ముట్టకు రాజశేఖరా. ౨౩౨

టీక.— ఇంతకున్ = ఈపాటికి, క్రీర్తిరాఁగన్ = 'ఎంతటి గొప్పయిల్లాలురా' అని లోకము ప్రశంసించునట్లు, ప్రాణమున్ త్యజియింతును = ప్రాణమును వదలియే యుందును. అదెంత = అదియేమాత్రపుపని? (కడమసులభము.)

గీ. కలికి రత్నాంగి నీకులాంగన రమించు
మించుమేడకు నరుగు; మమ్మోఁహుఁగుఁబోఁడి
పోఁడిమిగ నిన్ను రతిఁ దేల్చి పొందఁజాలుఁ;
జాలు; నాతోడి గొడవ నీ కేల యధిప? ౨౩౩

టీక.—నీ కులాంగన=నీ యిల్లాలు, రమించు=క్రీడించునట్టి, మించుమేడకున్= గొప్ప భవనమునకు.—నాతోడి, గొడవ=బాధ. ('గొడవ-Difficulty. puzzle'-బ్రౌను.)

---

† శా. పా.— 'ఇంత క్రీర్తిగాఁగ, ఘటియింతునె ప్రాణము'.—

ఘటియించుట - యనగా; ఘటిల్లజేయుట; కలుగజేయుట.' ('To effect, accomplish' - (బ్రౌను.) మరి యిక్కడ ప్రాణమును ఘటిల్లజేయుట యెవరికి? శా. పా. సరియైనదికాదు. సరియైన పాఠము పూ. ము. న నున్నది. అదే మూలము నకు సరిపోవు పాఠము. మూల మిట్లున్నది.—

'ఈవిధంబంతయు నెఱిఁగింపఁగోరి, నీవు వచ్చినదాఁక నిలిచితిఁగాని, చావఁ బంతము నాకు'. (పు. 59.)

* శా. పా.— 'నీకుఁ దెల్పుటకునై - యిట నుంటిని. '

లేకున్న తా నెక్కడికి పోయెడిదో? 'యిటులుండితి' అని సరియైన పాఠము; పూ. ము. నందే యున్నది.

‡ శా. పా.— నీదుపట్టి - నన్నింతటనుండి బట్టి.'

అంటే అర్థమేమో? పూ. టీ. లేదు. సరియైన పాఠము పూ. ము. ననే లభించినది.— మరియొక విశేషము.— 'ఉండి' మీద 'పట్టి' అయితే "వట్టి" కావలెను గాని 'బట్టి' కానేకాదు. కాబట్టి 'బట్టి' పాతమపపాఠము.

చ. అని, యపు డంతఁ బోక మఱి యాయనృతోదరి రాజుచేత నుం
డిన బెడిదంపుఁజాయల పిడెం బొర వెళ్ళ జరీన దూసి గొ
బ్బున మెడమీఁదఁ బెట్టుకొనఁ బోవ నహోయని సంభ్రమించి మిం
చినతమిఁ బట్టి యింతపని సేయుదువా మదిరాక్షి నీవనన్. ౨౩౪

టీక.—అనృతోదరి = పలుచని గర్భముగలది (=కృశోదరి) అనియు (అబద్ధాల మారియనియును) బెడిదంపుచాయల పిడెంబు = భయంకరముగా మెరయుచున్న బాకును, ఒరవెళ్ళన్ జరీనదూసి = ఒరలోనుండి తటాలున పైకిలాగి;—

క. ఔఁ దల ధరణీపాలక;
యౌఁ! దలవం పాయె నిప్పు ‡డందఱిలో నె
చ్చోఁ దలపెట్టక నెన రి
చ్చోఁ దలపెట్ట కటు విడువు; చూతువు నన్నున్. ౨౩౫

టీక.—ఔన్ = అవును (కంఠము నేకోసికొందును) తల = నీ వవతలికిపో, ధరణీపాలక, ఔన్ = చాలు - చాలు; ఎచ్చోన్ తలపెట్టక = ఎక్కడగానీ తల చూపే వీలులేకుండా, ఇప్పుడు అందఱిలోనన్, - తలవంపాయెన్=అవమానమాయెను. ఇచ్చోన్ = ఈసమయమున, నెనరుతలపెట్టక=దయతలపక, అటు విడువు - నన్నున్ చూతువు = నేను గొంతుకోసికొందునో లేదో నీవే చూచెదవు. (అని బెదరింపు)

క. అని [1]మఱిబాములఁ బడ లే
నని కైదువు దుస్సి దాఁటునాయితముబలెన్
బెనఁగు నల యుఱియచే సురి
య నులిమి బలిమి విడిపించి యను ననురక్తిన్. ౨౩౬

---

‡ శా. పా.—'అందఱిలో' ('అందఱిలో' అని పూ. ము. పా; తంజ. తా. పాఠమున్న.)

1 శా. పా.— 'మరుబాముల.'

మరుబాము లనగా మన్మథబాధలు. (= కామమువలని పీడ). 'బాము - Embarrassment, entanglement' (బ్రౌను.) పరపురుషుడు తన్నంటినయవమానమున కోరువజాలక గొంతు కోసికొన బోవుచున్న స్త్రీ 'నేను మరుబాములఁ బడలే'ననునా? 'మఱి బాముల' అని సరియైన పాఠము. పూ. ము. న నున్నది. శా. పా. మీది నమ్మకముచేత వావిళ్ళవారే కాదు. సూ. ని. కూడా 'మరుబాముల'ననియే అన్నది.—(చూ. 'ఉఱియ.')

టీక.— మఱి = ఇకమీఁద, బాములన్ పడలేనని = అవమానముల ననుభవింప జాలనని, కైదువు దుస్సి = కత్తిని లాగుకొని, దాఁటు = పోవునట్టి, ఆయితమువలెన్ = సన్నాహము వలె. (కత్తిని లాగుకొని పోవుటకు సిద్ధమయిన విధముగా) పెనఁగు = పెనగులాడునట్టి, అల - ఉరియ - చేసురియ = ఆసాహసికురాలి చేతికత్తిని, [2]నులిమి = చేతులునలిపి, బలిమిన్ = ఎంతో ప్రయత్నముమీఁద, విడిపించి, అనురక్తిన్ = మిక్కిలి ప్రేమతో, అనున్ = ఇట్లనెను. (కర్త - రాజు.)

రాజా, నాకిప్పటికయిన అవమానముచాలు. ఇంకను బ్రతికి అవమానములను పొందజాలనంటూ, నిజముగా గొంతుకోసికొను దానివలెనే కత్తికై పెనగులాడుచున్న చిత్రాంగి చేతికత్తిని లాగుకొని రాజు మిక్కిలి యనురాగముతో ఇట్లనియె.

క. నిను మానము గొను హీనుని
   ననుమానము మాని సూనుఁ డనుమోహముచే
   తను [1] మానక తునుమాడుదు
   వినుమా యణుమాత్రమధ్య వెత వీడ్కొనుమా. ౨౩౭

టీక.— అణుమాత్రమధ్య = సన్నని నడుముకలదానా, వెత వీడ్కొనుమా = దుఃఖమును వదలుము.

---

[2] వ్యా. టీ.— 'నులిమి = ఒడిసి'. నులుము; ఒడియు, భిన్నార్థక క్రియలు.—

సీ. 'నిజశిఖలో బుద్ధి నిలక విస్వరములు
   వలికిన బుగ్గలు నులిమి నులిమి' (కళా. 4. 41)

(బుగ్గలు-ఒడిసి యొడిసి, అనగూడదు).—

ఎ. గీ. 'ఒడిసి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తి' (విరాట. 2-128.)

('నులిమి తలపట్టితిగిచి' అనుట యుచితముకాదు.)

క. 'చన్నొడిసి పట్టి చీరెను
   చిన్నికుమారుండె యితఁడు శీతాంశుముఖీ.' (భాగ. 10-34.)

ఎ. గీ. 'ఒక్కమకరేంద్రుఁ డిభరాజు నొడిసిపట్టె.' (భాగ. 8-51)

(పై రెండుతావులలోను 'నులిమిపట్టి'; 'నులిమిపట్టె' అనుట అసందర్భము.) కావున 'నులిమి = ఒడిసి' యనుట తప్పు.

[1] శా. పా.— 'మాఁడక.'

మాఁడుట యనగా దగ్ధమగుట (చూ. శ. ర.) 'మోహముచేత దగ్ధముగాక' అనునర్థము ప్రకరణమున కుచితముకాదు. కావున శా. పా. తప్పు. వ్యా. ము. నను తంజ. ప్రతులు మూడింటిలోను గూడా 'మానక' అనియే యున్నది. ఆపాఠమే యొప్పు.

—• రాజు మంత్రులతో ఆలోచించుట •—

వ. అని బరవసంబుగాఁ బలికి యక్కలికి నూఱడించి మేరడిం చిన కోపాటోపంబున నచ్చోటు వాసి మాటవాసిగల రాజమహేంద్ర వాసి యుగ్రాకారుం డై మండుచు సభామండపంబునఁ కేతెంచి బద్దల వారి నలుగడలం బంచి యాప్తామాత్యబంధుజనంబులం దగిన వారల రావించి యథోచితాసనంబుల నుండ నియమించి కొండొకసేపు చిం తించి కొంత సంకోచించి చెప్పక దీర దని నిశ్చయించి చిత్రాంగి తన కెఱింగించిన తెఱంగును జెయ్యువలకరణియుం దన కన్న విన్న సరణియు నామూలాగ్రంబుగాఁ దెల్పి యింక నెయ్యది కర్జం బనిన సభ్యులందఱు డెందంబుల విస్మయంబును సంశయంబును బాపభయంబును బెనఁగొన ముందు వెనుక దెలియక బహిర్లిఖిత చిత్రాకారంబుల ప్రకారంబున నిశ్చేష్టితు లై హారీ యనక హారా యనక నూరకున్న యెడ నందు నయార్ణవుండను మంత్రిపుంగవుం డిట్లనియె. ౨౩౪

టీ. క.— బరవసంబుగాన్ పలికి = నమ్మకముగాచెప్పి, (బరవసము. ప్ర. 'భరోసా'. హిం. "భరవస for భరోసా-confidence, trust, belief"-బ్రౌను.) మేరడించిన = మితిమీరిన, మాటవాసి = పలుకుబడి, బద్దలవారిన్ = వేత్రధరు లయిన - బంట్లను, తనకన్న — విన్న సరణియున్ = తానుచూచిన విధమును - విన్న విధమును, కర్జంబు = కార్యము, బహి...బునన్ = బయలులో వ్రాయబడిన చిత్తరు వులవలె, నిశ్చేష్టితులై = కదలికమాని, హారీ అనక హారా అనక = తప్పనక - ఒప్పనక.

'మాటవాసి' (శ. ర. లో లేదు.) 'వానికి ఆ వూరిలో మాటవాసికద్దు he has influence throughout the town.' బ్రౌను.

బహిర్లిఖిత చిత్రములు — చిత్రములు గోడ, కాగితము మొదలగు ఆధారముల మీదగాని వ్రాయబడవు. సభ్యులు చిత్రములవలె (నిశ్చేష్టితులై) నున్నను - ఏయాధా రమునులేక బట్టబయట నున్నారు. కావున 'బయట లిఖింపబడిన చిత్రములు' గా చెప్పబడినారు.

గీ. ఘోర మగుపాతకం బిది నోర నుడువ
రాదె కా మదిఁ దలఁపంగ రా [1]దెవరికి

1 శా. పా.—'దొకరికి' పాశాం.— 'దొరులకు'.

నిట్టి యన్యాయ మేజాతి నెన్నఁ డైనఁ
దొంటికతలందుఁ జెప్పఁగా వింటగలదె! ౨౩౯

టీక.—నోరనుడువరాదెకా = నోట బలుకరాదు సరేకదా, ఎవరికిన్, మదిన్ తలపంగరాదు = మనసులో అనుకొనుటకైనను తగదు.

మ. తననీటు ల్మెఱయన్ రయం బడరఁ దోల్తన్ రాణివాసంబులోఁ
జను పే నేరమి యాఁ గదా సవతి యీర్ష్యం బట్టి చంపింప నే
ర్పున నీకైవడి మాయ వన్నినది పాపాత్మ్యంటిమా యామె నీ
కనుమానంబు దొలంగఁ దెల్పఁగద యూహాపోహ లింకేటికిన్.

టీక.—రాణివాసంబు = అంతఃపురము, ఊహాపోహలు = పనికిమాలిన వితర్కములు.

మ. అలఘుప్రాభవ యింక ‡నీకొలను రాజ్యం బేమి గానున్నదో?
తొలగెన్ గీర్తి; భవత్ప్రతాపబలమున్ దూరీకృతం బయ్యె; న
క్షులకాంతారకుతారకుం దనయుఁడన్ కూర్మిన్ గృపన్ జూచి భూ
స్థలిలో వెల్వడఁ †గొట్టినట్టయిన నాజ్ఞల్ జబ్బు దాఁకున్ బయిన్.

‡శా. పా.—'నీకొలము రాజ్యంబేమి కానున్నదో' (పూ. టీ. లేదు)

'కొలము' ప్రస్తావ మప్రసక్తము. కొలము, రాజ్యము, రెండు కావున 'ఏమి కానున్నదో' అని యేకవచనాంతముగా చెప్పుట తప్పు. పూ. ము. నను, తంజ. ప్రతులలోనుగూడా 'కొలను' అనియే యున్నది. అంతేకాక మూలమున నైతము 'ఈపాపమున రాజ్యమేమిగాఁగలదో' (నవ. పుట. 60) అని యున్నది. కాబట్టి శా. పా. నిష్కార్షగా తప్పు.

† శా. పా.—'వెల్వడఁ - గొట్టునట్టయిన.' (పూ. టీ. లేదు.)

ఈపాఠమునుబట్టి నయార్ణవుడు, సారంగధరుని దేశమునుండి వెళ్ళగొట్టవలసినదని సలహాచెప్పినట్లేర్పడుచున్నది. కాని, తరువాతి పద్యములలోని 'జననిందొడరిన పాపాత్మునిఁ బట్టి తెచ్చి తునిమింపఁదగున్' అను వాక్యముచేత నయార్ణవుడట్లు చెప్పలేదనియు - పై పాఠమే తప్పనియు సిద్ధాంతమగుచున్నది. అదియునుగాక నవనాథ చరిత్రములోని,—

"వలదు పుత్రుండను వాత్సల్యమునకుఁ, గృపఁజేసి వెళ్ళిపోగొట్టిననైనఁ
జపచపనై యాజ్ఞసాగదు మీఁద." (పుట. 60)

అను పంక్తులుకూడా, శా. పా. తప్పనుటకు తగిన తార్కాణమగుచున్నవి.

టీక.—అలఘుప్రాభవ = గొప్ప దొరతనముగల రాజా, ఈకోలను=ఈపాపము చేత, ఇంకన్=ఇకమీఁదట, రాజ్యంబు, ఏమి కానున్నదో=ఎట్టి దుస్థితిని చెందనున్నదో?, కీర్తిలోలంగన్ = నీకుఁగల మంచిపేరు చెడిపోయెను, భవత్ - ప్రతాపబలమున్ = నీ ప్రతాపముయొక్క పటిమగూడా, దూరీకృతంబయ్యెన్ = దూరమైపోయెను, ఆ - కులకాంతారకుఠారకున్ = కులమనెడి వనమునకు గండ్రగొడ్డలి (=ధ్వంసకుడు) అయిన ఆదుర్మార్గుని, తనయుఁడన్ కూర్మిన్, కృపన్ చూచి=మన్నించి, భూస్థలిలో వెల్వడఁగొట్టినన్ = (చంపక) ఊరక మనభూమినుండి వెళ్ళగొట్టినయెడల, పయిన్= రానున్న కాలమున, ఆజ్ఞల్ = తమ యుత్తరువులు, జబ్బుదాఁకున్ = దుర్బలములగును. (జరుగవని భా.)

క. జననిం దొడరినపాపా
త్ముని గొబ్బునఁ బట్టి తెచ్చి తునిమింపఁ దగున్
పని లే దిఁక సంకోచము
మనుజాధిప కార్య మనుడు మతిమంతుఁ డనున్. ౨౮౨

గీ. అధిప యిది శాస్త్రమతముగా దరసి చూడ
ధనము వోయిన, ఘన మనస్తాప మయిన,
నొకటి తనయింట దుశ్శీల మొదవిన, నది
బయలు సేయంగఁ దగ దను నయము గలదు. ౨౮౩

టీక.— ధనము పోయినను = ధనమును తెలివి తక్కువచే పోగొట్టుకొన్నను, ఘనమనస్తాపమయినన్ = గొప్పఅవమానమును పొందినను, తనయింట, దుశ్శీలము ఒదవినన్ = దుశ్చరిత్ర తటస్థించినను, బయలుచేయతగదు, అను, నయము నీతి (శా ˇ ము), కలదు.

'అర్థనాశం మనస్తాపం గృహే దుశ్చరితానిచ
వంచనం చావమానంచ మతిమా న్నప్రకాశయేత్.' (పంచతంత్రము.)

చ. చనవున నొక్కవేళ రభసంబుమెయిన్ బినతల్లులింపుకర్నా
దనయులు ప్రేమతోఁ జనుట తప్పగునే? తనుచేయుతప్పు లె
ల్లను మగవారిపై నిడి చలంబున బొంకొనరింతు; రెందు జ
వ్వనుల మనోగతు ల్దెలియువా రిల నెంతటివారు గావలెన్. ౨౮౪

టీక.— జవ్వనుల మనోగతుల్ తెలియువారు = స్త్రీలచిత్తములను తెలియగలవారు, ఎంతటివారు కావలెఁ = ఎంతోగొప్ప ప్రతిభగలవారు కావలెను; (అల్పబుద్ధుల కలవి కాదని భా.)

" స్త్రీణాంచ చిత్తం పురుషస్యభాగ్యం, దేవోనజానాతి కుతో మనుష్యః".
(సుభాషితము.)

తల్లుల + ఇండ్లు = తల్లులిండ్లు. షష్ఠీ సమాసమున అత్వసంధి సత్కవిసమ్మతమే.—

'తామరసనేత్ర లిండ్ల బందాలుగారె'.— (మను. 2—73)

'యయాద, రాజ్యమిచ్చితి కురువృద్ధ రాజులొద్ద'.— భా. (ఆది. 5—21)

'ఉగ్రమృగంబుల యుదరంబులో నున్న దానవే నీ తల్లి దండ్రులొద్ద ధృతినున్నదానవే'.— (అరణ్య. 2—133)

క. మనమున నిడు టొక్కటి, వెలి
నను టొక్కటి, సేయు టొకటి, యంతయుఁ గపటం
బె నిజంబు లే దొకింతయు
నన్నృతోదరి యనుట సార్థ మతివల కెల్లన్. ౨౭౫

టీక.— అతివలు మనసులో అనుకొనునది యొకటి; పైకి చెప్పునది యింకొకటి; తుదకు చేయునది వేరొకటి. (ఇది చెప్పిన దానికి భిన్నమేగాని తాననుకొన్నదానికి భిన్నముకాదు) అంతయును అబద్ధమే. అందువల్లనే అతివలకు 'అన్నృతోదరి = అన్నృతము ఉదరమున కలది, అను పేరు, సార్థము = అర్థవంతము. (అన్నృతోదరి = కౌనులేనిది; అనగా 'సన్నని నడుముకలది యని సహజమయిన అర్థము.)

మ. అనిశక్రౌర్యము కల్కిచూపులనె కా, దత్యంత కాఠిన్య మం
గనపాలిండ్లనె కాదు, చాపలము స్త్రీకందోయినే గాదు, త
గ్గనికౌటిల్యము బోటి ముంగురులనే [1] కా, దెప్పు డుల్లంబునం
దును [2] పేటాడుచు నుండు నిక్క మిది; యెందు న్నమ్మరాదింతులన్.

[1] ళా. పా.— 'కాదెల్ల నుల్లంబునందును.' — 'అల్లనుల్లంబు' తంజ. పా, 'కాదెప్పుడుల్లంబు' పూ. ము.

[2] ళా. పా.— 'వేఁటాడుచునుండు' (ఇది పూ. ము. పా.)'

కాఠిన్యచాపల్యకౌటిల్యములు ఉల్లమున వేఁటాడుట యెవరిని? 'పేటాడుచునుండు' అని తంజ. పా. "పేఁటాడు - To prowl about". (బ్రౌను.)

టీక.— అనిశక్రౌర్యము = ఎడతెగని క్రూరత్వము, కల్కిచూపులనెకాదు = స్త్రీయొక్క చూపులయందేకాదు, ఎప్పుడును, (దాని) ఉల్లంబునందును, పేటాడు చునుండును = తాండవించుచుండును; కౌర్యము = చూపుల పక్షమున - చురుకు దనము; హృదయపక్షమున - క్రూరస్వభావము.) — అత్యంతకాఠిన్యము, అంగన పాలిండ్లనెకాదు; ఉల్లమునందును పేటాడుచుండును. (కాఠిన్యము = కుచపక్షమున - గట్టితనము; హృదయపక్షమున - నిర్దాక్షిణ్యము.) చాపలము స్త్రీ కందోయి నేకాదు; ఉల్ల...డును.— (చాపలము = కనులపక్షమున బిత్తరము. (Flashing) హృ. ప. నిలుకడలేక పోవుట (Fickleness). 'క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్' (మను. 3-69).— కౌటిల్యము బోటి, ముంగురులనేకాదు; ఉల్ల...ఉండును. (కౌటిల్యము= కురులపక్షమున, ఉంగరములు తిరిగియుండుట - (Curliness). హృ. ప. వక్ర స్వభావము.

క. జనకు నయిన సోదరు నై
నను సుతునైన [1]నొసపరిఁ గనం దరుణులకుఁ
దను పెక్కును లజ్జాపద
మని హరితో ద్రుపదపుత్త్రి యనెఁ గద తొలుతన్. ౨౪౭

టీక.—ఒసపరిన్ = అందగానిని; లజ్జాపదము = మర్మస్థానము.

---

[1] శా. పా.— 'ఒకపరి' ('ఒసపరి' పూ. ము; 'ఒఱపరి' మద. తాళ. పా.)

లజ్జాపదము తను పెక్కుటకు కారణము 'ఒకపరి'చూచుటకాదు; రెండుమారులు చూచుటయునుకాదు. 'ఒసపరిన్' (=ఒఱపరిని) అందగానిని చూచుట. పూ. టీ. కర్తలు ద్రుపదపుత్రి వాక్యమునైన నెరుగరు కాబోలు! ఆ వాక్యమిది.—

"సుందరం పురుషం దృష్ట్వా, భ్రాతరం యదివా సుతం;
యోనిః క్లిద్యతినారీణాం, సత్యం సత్యం హి కేశవ."

నవనాథ చరిత్రమున.—

"తన సహోదరునైనఁ దనయునినైన, జనకునైనను గడుఁ జక్కనివాని
మనమారఁ గనుఁగొన్న మదిరనేత్రలకుఁ, దను పెక్కులజ్జాపదంబని మున్ను
పాండుతనూజుల పత్ని నిక్కంబు, పుండరీకాక్షు సమ్ముఖమునంబలికె."

(పుట. 61)

కావున 'ఒకపరి' పాఠము తప్పు.

ఉ. ఓనృప నాకుఁ జూడ నలయుగ్మలి నీసుతునిన్ మనోహరా
నూనవిలాసుఁ జూచి నిలుపోపక పట్టిన లోను గామి నెం
తే నెగులూని వానిఁ బొలియింపఁగ మాయలు పన్నె నిట్లు కొం
డేనకు; ‡ ధర్మరా జలుగునిక్కముగా మిముఁ జెప్ప నేటికిన్. ౨౪౮

టీక.— ఉగ్మలి = స్త్రీ (చిత్రాంగి) నెగులూని = అవమానరూప మయిన దుఃఖమును పొంది, వానిన్ = సారంగధరుని, పొలియింపఁగన్ = చంపించుటకు, కొండేనకు = చాడీకి, (ఇట్లు) మాయలుపన్నెను; (ఆమాటలనే నమ్మి మీరు కుమారుని శిక్షించితిరా) నిక్కముగా, మిముఁన్, ధర్మరాజు - అలుగుఁన్ = యముడు కోపించును, చెప్ప నేటికిన్ = ఎక్కువమాట లెందుకు?

చ. పొలఁతుక మీకుఁ గానఁబడఁ బొందుగఁ దెల్పినదే నిజంబుగాఁ
దలఁచెద రీ; ర దెంతయును దబ్బర సూ; 'మగవాఁడు బొంకెనా
యల దడి గట్టినట్టు లగు, నాఁడుది బొంకిన గోడ వెట్టిన
ట్లలవడు' నన్నమాట వినరా? వనరాశిపరీతభూభుజా. ౨౪౯

టీక.— 1 వన...భుజా = సముద్రములచేత చుట్టబడిన (సమస్త) భూమికిని ప్రభువైనవాడా, దబ్బర - సూ = అబద్ధము సుమా. ('మగవాడు బొంకితే దడిగట్టినట్లు; ఆడది బొంకితే గోడ పెట్టినట్లు' అని లోకోక్తి.)

గీ. ఇలఁ 2 జెరవ మాయ మాఁకుఁడు గలదు గాక
నోరు మాయంగ మాకుఁ డెందులనుఁ గలదె?

---

‡ శా. పా.—'ధర్మరాజులను మిమ్మున్' ('ధర్మరాజువంటి నిన్ను' - పూ. టీ.)
'ధర్మరాజువంటి నిన్ను నిక్కముగాఁ జెప్ప నేటికిన్' అంటే అర్థమేమో? పూ. టీ. వ్రాతప్రతిలో, 'కొండేనకు, అనగా చాడిమాటలను నిజముగా నమ్మేటందుకు ధర్మరాజులగు = ధర్మరాజులవంటి మిమ్ము' అనియున్నది. 'ధర్మరాజులగు' తంజ. పా. ...రాజలుగు' పూ. ము. పా.

1 పూ. టీ.— 'సముద్రముచేత చుట్టఁబడిన భూమిని ఏలువాఁడా'.
భూమి చుట్టబడుట ఒక్క సముద్రముచేతనే కాదు; నాలుగు సముద్రములచేతను. 'వనరాశి' ఏకవచనమున నున్నను బహువచనార్థము నిచ్చునని పూ. టీ. కర్త లెరుగరు. (చూ. ౧-౮౭; ౨-౧౩౯ క్రింద.)

2 శా. పా.— 'చెఱువు.' ('చెఱవ' అని పూ. ము.)
'చెఱవ' తప్పని శాస్త్రిగారు 'చెఱువు' అని దిద్దినారు. కాని లోకములో చెఱువుకు మాతగాని, ఆమాతకు మాకుడని పేరుగాని, ఉన్నట్లు నేనెక్కడను

ఱొరు లనుట కేమి సారంగధరునిమీఁద
నాకు సంశయ మొదవ దో నరవరేణ్య. ౨౯౦

టీక.— చెరవ = పాత్ర (=కుండ) 'కుండయూయ మూకుడున్నదిగాని నోరు మూయ మూకు డున్నదా? అని లోకోక్తి.

క. ఏతన్మాత్రుఁడె చేతో
జాతారికృపాకటాక్షజాతుఁడు సుగుణా
న్వితుఁడు; తెలియక యాడెద
* రాతని కటువంటిగుణములా నరనాథా. ౨౯౧

టీక.—చేతో...తుఁడు.— చేతోజాత = మన్మథునికి, అరి = శత్రువైన, యీశ్వరునియొక్క, కృపాకటాక్ష = దయాదృష్టిచేత, జాతుఁడు = పుట్టినవాఁడు (సారంగధరుడు) ఏతన్మాత్రుఁడె=ఇంతటి సామాన్యుడా? కాడు, సుగుణాన్వితుఁడు= మంచిగుణములతో కూడినవాఁడు.— తెలియక ఆడెదరు = ఆతని సద్గుణసంపత్తి నెఱుఁగక పలికెదరు. ఆతని కటువంటి గుణములా?— (ఆతనికట్టి చెడ్డగుణములుండవని భా.)

---

వినలేదు. కుండకు మూత, ఆమూతకు మూకుడను పేరు లోకమున నున్నది. విదేశీయుడైన బ్రౌను, "మూకుడు An earthen platter used as a cover. శరావము. కుండమీద కప్పేది" అని వ్రాసియున్నాడు. విస్తర మెందుకు? 'చెరవ' అను పదము నెఱుఁగక శాస్త్రిగారు ప్రాచీన పాఠమును - అర్థమును గూడా చెరచినారు. 'చెరవ = పాత్ర.' అని యెల్లనిఘంటువులలోను ఉన్నది; చూడండి.

(1) సీ. 'తామ్రాది భాండముల్ దనరు బిందె యనంగ
విస్తృత తత్సంజ్ఞ వెలయుచుండుఁ
'జెరవ' యనంగను జెరవమనంగను'. (ఆం. భా. 2-245).

(2) 'చెరవము =(రూ. చెరవ) వంటకును, నీళ్ళు కాఁచుటకును ఉపయుక్తమయిన యిత్తడిపాత్రము' (శ. ర.)

(3) 'చెరవము - A brass kettle or boiler.' (బ్రౌను)

(4) 'చెంబెడు దుత్తెడు చెరవెడు బిందెడు.' (అప్ప. 5-72)

సంస్కరణవిశేషమువల్ల 'చెరవ' చెఱువులో కలసినది. ఆసంగతిని గమనింపక వావిళ్ళవారు 'చెఱువు' పాఠమునే కైకొన్నారు.

*పాఠాం.—'వాతని'

క. చెలిమాటలకై తొడిఁబడి
ఖలుఁ డని సుతుఁ దునిమి తేని కైకకొఱకుఁ గా
నలకు రఘురాము ననిచిన
యలదశరథుమాడ్కిఁ బిదప నడలుదువు సుమీ. ౨౫౨

టీక.— తొడిఁబడి = తొందరపడి,— అడలుదువు = శోకింతువు.

వ. అని పలికిన మొగంబులు దెలివొంది కొలువువారెల్ల మతి మంతుం గొనియాడిరి. నృపాలుం డిట్లు నానాప్రకారంబుల మంత్రుల నొరసి యడుగ వార లాడునుడువులకు నుద్భ్రాంతలూఁగు నుల్లంబునఁ గార్యనిశ్చయం బిద్ది యననేరక యపారమోహసాగరంబున మునింగి తనలోన. ౨౫౩

టీక.— ఉద్భ్రాంతలూఁగు ఉల్లంబునన్ = ఆందోళనము పొందుచున్న మన స్సులో,— అపారమోహసాగరంబునన్ = అంతులేని అజ్ఞానసముద్రములో - మునిగి.

క. ఇటు చూచినఁ జెలిపైఁ ద
ప్పటు చూచిన సుతునినేర మవుఁ గా దనఁగా
నెటువలె వచ్చునొ మీఁదట
నటమటమో లేక నిజమొ యది యెఱుఁగముగా. ౨౫౪

టీక.— అది = ఆజరిగినకథ, అటమటమో = అబద్ధమో, లేక నిజమో?

ఆ. వె. అల్లనీళ్ళలోనిము ల్లయినది యిది
యిట్టి లనుచు నిశ్చయింప రాదు
కప్పి పుచ్చ రాదు, ఖండించి యాడరా,
దేమి సేయువాఁడ నింక ననుచు. ౨౫౫

టీక.— ౧ నీళ్ళలోని ముల్లు = తెలియరాని విషయము, కప్పిపుచ్చరాదు = లోకమునకు తెలియకుండ మరుగుపరచగూడదు; ఖండించి - ఆడరాదు = ఇది - యిట్టిది, అని నిశ్చయించుటకు వీలుకాదు. ఇంకనేమి చేయుదును? ('ఖండించుట To deside, settle, determine.' (బ్రౌను.)

---

౧ పూ. టీ. వ్రా. ప్రతిలో "నీళ్ళలోనిముల్లయినది = ఆజలములోఫలనున్న సామ్మును"— అనియున్నది.

క. వ్రాలినఱెప్పలు, వెతఁ గై
వ్రాలినహృదయాంబుజంబు, *వసుమతిమీఁదన్
వ్రాలినచూపులు, †మొగమున
వ్రేలుకనలు, ముక్కుమీఁదివ్రేలుం దనరన్.　　　　౨౫౬

టీక.— వ్రాలిన ఱెప్పలు = వాలిపోయిన కనురెప్పలు, వెతన్ = దుఃఖముచేత, కైవ్రాలిన = వాడబారిన, హృదయాంబుజంబు = మనస్సును; వసుమతిమీఁదన్ = నేల మీఁద - వ్రాలినచూపులు; మొగమునన్, వ్రేలు = తాండవించుచున్న - కనలు = కోపమున్ను; ముక్కుమీఁది వ్రేలున్, తనరన్ = ఒప్పగా.

కనురెప్పలు వాలిపోగా, నేలచూపులు చూచుచు, వికలమైన మనస్సుతో, మొగమున ముడివడుచున్న కోపముతో రాజు తనలో తాను తర్కించుకొని - చింతించి, అచ్చెరువున ముక్కుపై వేలుపెట్టుకొని, యున్నాడని తా.

క. ఉన్నంత నృపాలున కని
యె న్నీతిజ్ఞుఁ డనుమంత్రి యీ మతిమంతుం
డెన్నిన ప్రకారముననే
యన్నులు చపలాతిచంచలాత్మలు సుమ్మీ.　　　　౨౫౭

టీక.— ఎన్నిన = చెప్పిన, అన్నులు = స్త్రీలు, చపలా = మెరుపుకంటెను, అతిచంచల + ఆత్మలు = మిక్కిలి చంచలమయిన, స్వభావముకలవారు.

క. తనకల్ల తెలుపదే కద
మన కల్లలితాంగి, బుద్ధిమంతు నొకని నే
ర్పున నెల్లన రాకొమరుని
మన మెల్లను దెలిసి చూడ మన మంపఁ దగున్.　　　　౨౫౮

టీక.— తనకల్ల = తాను కావించిన అబద్ధకల్పనము, రాకొమరుని, మనము + ఎల్లను = మనసుతీరంతయును.

వ. అనిన మతిమంతుం డందుకొని యవ్విభున కిట్లనియె.　　　　౨౫౯

---

* పాఠాం.— 'వసుమతి నెలకొన్ - వాలుంజూపులు.'

† శా. పా.— 'మొగమున - వ్రేలంగను.' ('వ్రేలం - దన' పూ. ము. పా.) ఏమి వ్రేలంగనో? (పూ. టీ. లేదు.) 'మొగమున - వ్రేలుగనలు' అని తంజ. తా.పా. వావిళ్ళవారును, సూ. ని. వారును, శా. పా. నే గ్రహించినారు.

చ. మిగుల ధృఢంబు చేసి కద మీ [1]రడుగం దగఁబంపఁజెల్లు? ని
మ్మగువనె [2]యింక నిక్క-మగు మాటకు నిం దడిగింపుఁ, దూరకే
[3]బెగడకుమారు నాఁడిని బెట్టఁగఁ జెల్లునె? వింట లేదె 'యిం
ట గెలిచి రచ్చ గెల్వు'మనునానుడి? నానుడినానుఁడీ చెవిన్. ౨౬౦

టీక.— నానుడిన్ = లోకోక్తిని, నా నుడిన్ = నా మాటను, చెవిన్ + అనుఁడీ = వినండి.

క. మదిరాక్షుల నమ్మకు నయ
విదుఁడవు గద వేగిరంబు వెరవరిఁ జెఱుచున్;
బదరకుమీ, లెస్స పదిం
బదిగ విచారించి సేయ మంచిది సుమ్మీ. ౨౬౧

టీక.— మదిరాక్షులన్ = స్త్రీలను, నమ్మకు; నయవిదుఁడవుగద = నీవు నీతిశాస్త్రము నెఱిగినవాడవుగదా, వేగిరంబు = తొందరపాటు, వెరవరిన్ = నేర్పరియైన వానిఁగూడా, చెఱుచును. (కాబట్టి) ‡పదరకుమీ = వేగిరపడవలదు, లెస్స= బాగుగా, పదింబదిగన్ = ఒకటికి రెండుసారులుగా, విచారించి చేయుటమంచిది.

'మదిరాక్షి' యనగా, మదముగప్పిన కన్నులుగల ఆడుది' అని, శ. ర. క ర్త 'a woman with fascinating or bewitching eyes'— అని, ఆప్టి.

---

1 శా. పా.— "అడుగం - 'దగ; వేడఁ' జెల్లు" ('తగవు = న్యాయము, ఏడన్ = ఎందును' అని పూ. టీ.)

2 శా. పా.— 'యందు.'

3 పాఠాం.— 'బెగడి'.

‡పూ. టీ.— 'పదరకుమీ = కోపపడకుమీ'

'పదరు' అను క్రియకు 'కోపపడు' అను నర్థమును కలదుగాని యిక్కడ తగదు.— 'వేగిరము వెరవరినైనను చెరుచును, కాబట్టి కోపపడకుము' అనుట అసంబద్ధప్రలాపమనిపించుకొనును.

'పదరకుము' (= తొందరపడకుము,) విచారించి చేయుము' అను పలుకు లీక్రింది శ్లోకమునుండి యనువదితములు.

'సహసావిదధీతనక్రియా, మవివేకః పరమాపదాంపదమ్
వృణతేహి విమృశ్యకారిణం, గుణలుబ్ధా స్స్వయమేవసంపదః' —భారవి,

క. అనవుడు జనపతి యడుగం
బనిపిన నే మాయె దోసమా 'సి' ప్పనిసం
తనె నోరు పొక్కుడు గదా
యనిపి యటుం దెలిసి చూత మని కడు వేగన్. ౨౬౨

క. సడిసన్న పెద్దవారలఁ
గడఁకన్ దగువారిఁ బిలిచి కల్ల గలిగినన్
నుడువులవల్లనె కానం
బడుఁ గద తెలియుఁ డని పెట్టి పంపిన వారల్. ౨౬౩

టీక.— 1 సడిసన్న = పేరు ప్రసిద్ధిగల, పెద్దవారలన్ = పెద్దమనుష్యులను,

---

పదరుట = తొందరపడుట, అనుట కింకొక యుదాహరణము.

క. 'పదరిన గార్యముచెడు, సం
పదచెదరు, మహాపదలకుఁ బదపడు, 'సహసా
విదధీత నక్రియా' మను
చదువార్యులు చదువవినవె శశివంశమణీ?' (రాజవాహన విజయము.)

3-౨౨౭ లో, 'పదరితి నయయో' అని రాజే మొత్తుకొన్నాడు. కాబట్టి, యిక్కడ - 'పదరకుమీ = కోపపడకుమీ' అనుట తప్పు.

1 పూ. టీ.— 'సడిసన్న = చిహ్నమునుబట్టి నిజము నూహింపఁగల'.

ఇది, ఉజ్జాయింపుటీక. పూ. టీ. వారికి 'సడిసన్న' తత్త్వము బొత్తిగా తెలియదు. అందువల్లనే పలుతావుల పలురకముల అర్థములు వ్రాసినారు; చూడండి.—

(1) ౨-౨౮౦. 'సడిసన్నవారు = సన్మార్గులు'.

(2) ... 'సడిసన్నవానిగాన్ = నిందితునిగా.'

(3) 3-౫3. 'ఏసడిసన్నమానిసివొ = ఎట్టి యింగితజ్ఞురాలవో.'

'సడిసన్న పెద్దల సారంగధరుని, నడిగిరాఁదగు వారి నంపింపవలయు'.

(శా. శంభు. సారంగ. పు. 45.)

(4) 'సడిసన్న = అపకీర్తి - పెద్దలన్' అని శాస్త్రిగారిదే టీక.

ఇట్లు 'సారంగ' పూ. టీ. లలో 'సడిసన్న' యర్థము చాలా రసాభాసమై యున్నది. వారికేల తెలియలేదోగాని 'సడిసన్న' కావ్యములయందు బహుళప్రచారము

(వ్యవహారజ్ఞానముచే పేరు ప్రతిష్ఠల నార్జించిన పెద్దలను) పెట్టిపంపినన్ పంపగా ('పంపు' అను నర్థముననే పెట్టిపంపు - అను వాడుక నెల్లూరు మండలమున నున్నది.)

---

గల పదమే. నిఘంటువులయందును పఠితమైన పదమే. బ్రౌను పండితుడు "సడిసన్న-celebrated, famous, renouned. ప్రసిద్ధిగల - పేరుబడ్డ." అని విశదీకరించి పెక్కుదాహరణము లిచ్చియున్నాడు. (శ. ర. కర్త 'సడిసన్న'ను ప్రత్యేకముగా గ్రహించలేదు. పొరపాటు.)

ఒక కొన్ని ప్రయోగములు.—

(భారతమునుండి).

(1) 'మన వలలుండు లావున బంటుతనమున
జను లెఱుంగఁగ సడిసన్నవాఁడు' (విరాట. 3-152.)

(2) 'అని సడిసన్న యేడ్తెఱ బృహన్నలయుంగల దంబుజాననా' (విరాట. 4-15.)

(3) 'శౌర్యాది గుణముల సడిసన్న యాప్తయో
ధులఁ బెల్లమర్చుటయలఘునీతి' (శాంతి. 2-284.)

(4) 'భుజగర్వమునన్ సడిసన్న పాండు భూ
వర సుతవర్గమున్' (కర్ణ. 1-246.)

(5) 'అస్త్ర విద్యావైదగ్ధ్యంబున సడిసన్న కవ్వడి వధింపనీకు వశంబగునే' (సౌప్తిక. 2-74.)

(6) 'భుజసారమునన్ సడిసన్న రాజులన్, ధనములు చాలఁదెండని' (ఉత్త. హరి 4-151.)

(7) 'శక్తి కుమారాఖ్య సడిసన్న కోమటి'— (దశ. చరి. 10-103.)

(8) 'సౌందర్య సంపద సడిసన్నదానవు' (హరవిలా. 4-23.)

(9) 'చలన విహీనవృత్తి సడిసన్న పరాశరుఁడాదియైన' (పాండు. 5-212.)

(10) 'సడిసను భక్తుఁడాసురియ చౌడయగారి ప్రసాది'
(వృషాధిపశతకము. 95.)

(11) 'సడిసన్న లింగప్రసాదులు భువిని' (చరిత్ర. పుట. 165.)

(12) 'సడిసను లింగావసరములు చేసి' (బసవ. పుట. 132.)

వరా:— పూ. టీ. వ్రాతప్రతిలో 'సడిసన్న = సైగనెరిగిన గొప్పవాండ్లను' అనియున్నది.

## పెద్దలు సారంగధరుని విచారించుట.—

సీ. కలనైనఁ బరకాంతఁ దలయెత్తిచూడఁడు,
        [1]పఱచువారలఁ గూడి పలుకఁ బోఁడు,
మిగుల సిబ్బితికాఁడు, మొగమోట గలవాఁడు,
        పలికి బొంకఁడు, బహుభాషి గాఁడు,
నేర్చినవారిని నేరనివారినిఁ
        దనవారిఁగాఁ జూచువినయపరుఁడు,
కినిసి యెవ్వరిని [2]నొచ్చిన నోరఁ బలుకఁడు,
        కపట మెఱుంగఁడు, గర్వి గాఁడు,

గీ. మేరమానిసి, సా, దుపకారి, గోల,
నిర్మలుం; డట్టివానికి నింద మోవ
జేసెఁగా విధి! కటకటా! దోసకారి
దయ్యమున కేడ సత్యంబు దలఁచి చూడ.                    ౨౬౪

1 శా. పా.— 'పదుచువారలఁగూడి నడువఁబోఁడు' ('పదుచు...పలుకఁబోఁడు' అని పూ. ము.)

'పఱచువారల' అని సరియైన పాఠము. తంజ. మద. వ్రాతప్రతులలో నున్నది. పఱచు = ప్రల్లదుడు, అనుటకు.—

సీ. "పఱచుటామని యెంత పర్వులిడునో." (వసు. 3-151.)

సీ. "తఱిఁద్రొక్కి యున్న యీ తలిదంద్రులం జాల
        పఱచవై సంతోష పఱచవైతి." (పాండు. 3-36.)

క. "భీష్ముకొనిపోయిన దా, నిం బరచుం గైకొన ధ, ర్మంబే కన్యాత్వ మెడలె
    మగువా నీకుఁ." (భా. ఉద్యో. 4-278.)

2 శా. పా.— 'నొచ్చెడుమాట.' ('నొచ్చిననోర' పూ. ము; తంజ. మద. వ్రాతప్రతులు.)

'నొచ్చిననోరు' జాతీయము. 'నొచ్చిన నోరెత్తఁడు' అని లోకవ్యవహారము. కవుల ప్రయోగములును కలవు.— "సీ. చక్కనివారిలోఁ జక్కనివాఁడు దాఁగడుఁ విన్నగాని వేగంబువీడు, బంటు నొచ్చినోరఁ బలుకండు నెఱవాది." (ఉ. హరి. 5-278)

టీక.— పఱచువారలఁ గూడి = ప్రల్లదపు జనులతోఁ గలసి, పలుకఁబోఁడు = సంభాషణమైనను చేయడు. సిబ్బితికాఁడు = సిగ్గరి, బహుభాషికాఁడు = అధిక ప్రసంగి కాడు. కినిసి = కోపించి, ఎవ్వరిని, నొచ్చిన నోరఁబలుకఁడు = పరుషపుమాటలనడు, మేరమానిసి = మర్యాదకలవాడు. సాదు = శాంతుడు. †గోల = అమాయికుడు, దయ్యమునకుఁ = దైవమునకు.

గీ. అనుచు దమలోనఁ గడు నొచ్చుకొనుచుఁ * బనుల
జోక $ సొగసూను నారాజ సూనునగరి
కేఁగి యువరాజునకుఁ దమ్మి నెఱుక సేయుఁ
డనిన నవసరములవారు నపుడె పిలువ. ౨౬౫

టీక.— నొచ్చుకొనుచుఁ = పరితాపపడుచు, పనులజోకఁ = నగిషీ పనుల చెలువముచేత, సొగసూను = సౌందర్యమును వహించియున్న [ = నగిషీపనుల మెరుగులచేత మిక్కిలి అందముగానున్న] రాజసూను నగరికిఁ = రాజకుమారుని మేడకు, అవసరములవారు = ద్వారపాలకులు.

క. చని కని మ్రొక్కిన మితపరి
జనయుతుఁ డగు రాజసుతుఁడు సవినయమతి యై
తనకగ్గెసరస నుచితా
సనయుక్తులఁ జేసి యనుఁ బ్రసన్నాననుఁ డై. ౨౬౬

టీక.— మితపరిజనయుతుఁడు = కొలదిమంది సేవకులతో కూడియున్న వాడు, ప్రసన్నాననుఁడు = ప్రీతిచే వికసించిన ముఖముకలవాడు.

---

ఇంకొక విశేషము.—'కినిసి...నొచ్చెడు' అనుపాఠమున లక్షణదోషముకూడా ఉన్నది. కావున ఆపాఠము తప్పు.

† పూ. టీ.— 'గోల = పసివాడు.'— 'గోల' యనగా అమాయికుడుగాని పసివాడుకాడు. "విప్రవరుండు గోలయుం బాలుఁడుగాన నప్పటికిఁ బైఁబడఁ గొంకెనో కాక" (మను. 3-85)

* శా. పా.—'పనులసోగ.' ('పనులసోగ=పనులయొక్క చెల్వము' అని పూ.టీ.) 'సోగ'కు చెల్వము - అనేయర్థము లేదు. చెల్వమను అర్థముగల పదము 'జోక' గాని 'సోగ' కాదు. "సోయగంబు సొబగు జోకమురువు కొమరు." (ఆం. భా. 3–41.) పూ. ము. నకు, తంజ. ప్రతుల లోను పాఠము 'జోక' అనియేయున్నది.

$ శా. పా.— 'సొగసును గలన్నపసూను' ('సొగసూను నారాజసూను' పూ. ము. తంజ ప్రతులు.)

ఉ. వచ్చినకార్య మేమి జనవల్లభుఁ డంపఁగ నన్నుఁ బిల్వఁగా
వచ్చితిరో? తగుల్గలుగు వారలకై మనవుల్ ఘటింపఁగా
వచ్చితిరో? వచింపుఁ డని వారల సారెకు వెల్లదమ్ములన్
మెచ్చనికన్నులన్ బెదరుమేకొన నెమ్మొగమూఁచిపల్కినన్ ౨౬౭

టీక.— తగుల్గలవారలకై = స్నేహితులు - బంధువులు అగువారికొరకు. మనవుల్ ఘటింపఁగాన్ = సిఫారసులు చేయుటకు, వచ్చితిరో?

ఉ. భూరమణుండు మీకడకుఁ బొమ్మన వచ్చితిమయ్య; యెయ్యెడన్
మీరలు రాజు[1]కంటె నినుమిక్కిలి మా, కనురక్తిమై మమున్
గౌరవ[2]లీలఁ బ్రోతు, రటు గావున నొక్కటి విన్నవింతు మో
భూరివివేక, వీరి నటు పొమ్మనుఁడా యని యేకతంబునన్. ౨౬౮

క. ఒకయించుక మదిఁ గొంకుచు
ముకుళితహస్తు లయి వినయమున 'రాజకుమా
రక వెఱచి చెప్పుదుమొ? వెఱ
వక చెప్పుదుమో?' యటంచు వారలు పలుకన్. ౨౬౯

క. ఇది యేమో యని యెదవడి
యదవద యై గుండె భగ్గు మని తల్లడపా
టొదవఁగఁ బలుకుల దీనత
గదురఁగ 'నది యేమి దెల్పఁగదరయ్య' యనన్. ౨౭౦

టీక.— ఎదవడి = భయపడి, గుండె, † అదవదయై = చెదరి.

సీ. అవనీతలేశుఁ డల్లవనీతలమునకు
మొన్న వేఁటాడంగఁ జన్నపిదప,
నంగజాలలు గా దనంగఁ జాలఁ జలమ్ము
మీఱు మొక్కలమున మీర లలుకఁ
బౌరుషమ్మును బట్టఁ బాఱునెపమ్మున
రాణివాసముఁ జొచ్చి, క్షోణిపతికిఁ

† పూ. టీ.— 'అదవద = కలత'

'అదవదయై' అన్నప్పుడు 'అదవద' విశేషణముగాని 'విశేష్యము' కాదు. కాబట్టి 'కలత' అని టీక వ్రాయుట తప్పు.

బ్రాణపదం బైనయేణాక్షిఁ జిత్రాంగిఁ
గనుఁగొని మోహంబు పెనఁగొనంగఁ

గీ. దమకమునఁ బట్టినా రని తమ కడలుచు
నాపడంతుక దెల్పినఁ గోపగించి
† మిమ్ము నిది యంతయును నిక్కువమ్ముగాఁగ
నడిగి రమ్మనె నిప్పు డప్పుడమి తేఁడు. ౨౭౧

టీక.— అవనీతలేశుఁడు = రాజు, అల్ల, వనీతలమునకుఁ = అడవికి — అంగ జాలలు = అంతఃపురపు కావలివాండ్రు.— 'మొక్కలమునఁ = సాహసమున,— తమకుఁ = రాజుగారికి, అడలుచుఁ = ఏడ్చుచు, ఆపడంతుక - తెల్పినఁ.—

చ. అనిన నమశ్శివాయ యని యక్కట యెక్కడనుండి సంభవిం
చెను వినరాని పాపమిది చెల్లరె! మాయలు వన్ని యీవిధం
బున నలయింతి నాపయిని[1] మోపెను నేరమి? [2] యిట్టి పలుకులే
వినవలసెం గదా యిపుడు వీనుల [3] నే మనువాఁడ [4] నిందుకుఁ.

క. ఆయమ్మ యాగ్రహం బెడఁ
బాయక ‡మరుఁగుపడ విన్నపము చేసిన భూ
నాయకుఁడిది యాఁ గా దన
కీమెడ నామీఁద నాగ్రహింపం దగునే? ౨౭౩

టీక.— మరుఁగుపడ విన్నపము చేసినఁ = కప్పిపుచ్చి చెప్పినను.—

గీ. తల్లి నామీఁద నఁట, లేనితప్పు మోపె
నఁట, యల యనుంగుఁదండ్రి దా నదియె నిశ్చ
యంబు సేసె నఁట, యిఁకఁ గా దన్నఁ బోనె?
యేరి నన నేల కల్లరి నేనె యగుదు. ౨౭౪

టీక.— కల్లరిఁ = అబద్ధమాడినవాడను.

† శా. పా.— 'మమ్ము'

1 శా. పా, 'బూన్చెను.' 2 'యింతరోతయుఁ' 3 'కే మనువాఁడ, 4 'దీనికిఁ'.

‡ శా. పా.— 'నామీఁద' ('మరుఁగుపడ' - తంజ - ప్రతులు.)

క. నాపాలిటిదైవముగా
భూపాలుఁ దలంతు నేను బొరపొచ్చెము లే
† కేపట్లం జిత్రాంగిని
నాపినతల్లిని దలంతు నాతల్లివలెన్. ౨౭౫

టీక.— ఏపట్లన్ = ఎప్పుడును.

క. ఇది యిటువలెఁ గా కెన్నఁడు
నెదలో, [1] నొండొక విచార మే నెఱుఁగమి కా
మదనారియె సాక్షి; యింకం
బదివేలును నేల పనికి మాలినమాటల్ ? ౨౭౬

ఉ. ఏ నిఁక నేమి సెప్పిన మహీపతి బొంకుగ నెంచు నెందు 'రా
జానుమతంబు ధర్మ' మని యండ్రుగదా బుధు; లైననేమి 'యె
ద్దీనె నటన్నఁ గొట్టమున నేర్పడఁ గట్టు' మటన్నచందమే
కానఁగనయ్యె నొక్కయుపకారముసేయుఁడు మీరలీయెడన్. ౨౭౭

టీక.— రాజానుమతము ధర్మము = రాజు ఏది ధర్మముగా భావించునో అదే ధర్మము, 'ఎద్దీనిందంటే కొట్టములో కట్టివెయ్య మన్నట్లు' అని లోకోక్తి - విచారశూన్యవర్తనమని భావము.

క. మీమదిఁ శంకాతంకం
బేమియు లేక సభవార లెల్ల వినంగా
నామాటలుగాఁ గొన్ని మ
హీమండలవిభునితోడ నెఱిఁగింపఁ దగున్. ౨౭౮

క. మండలపతి తప్పొప్పులు
రెండు విచారించి తగినరీతి స్త్రీలన్
దండన సేయఁగఁ దగు ను
ద్దండము సేయంగ శుభము దలకొన దెందున్. ౨౭౯

---

† శా. పా.— 'కీపట్లం' ('కేపట్లం' - తంజ - ప్రతులు.)
పినతల్లిని తల్లివలె తలచుట 'ఈపట్ల' మాత్రమే కాదు. కావున శా. పా. సరికాదు.

1 శా. పా.— 'గొండొక' ('నొండొక' పూ. ము. తంజ. ప్రతులు.)

టీక.— ఉద్దండము = అక్రమదండనము, చేయంగన్ = చేసినయెడల, శుభము తలకొనదు = మేలు కలుగదు (కీడు కలుగునని భా.)

అక్రమదండనము నరకహేతువనియు శాస్త్రము:—

"అదండ్యాన్ దండయన్ రాజా - దండ్యాంశ్చై వాప్యదండయన్
అయశో మహదాప్నోతి - నరకం చైవగచ్ఛతి."

గీ. మీర లన్నిట సడిసన్నవారు దెలుప
వలదొకో నన్ను సడిసన్నవానిఁగా నొ
నర్చుటకు? దైవసన్నిధానమునఁ బెట్టి
నిజము సేయించి పిదప మన్నింపు మనుఁడు. ౨౮౦

టీక.—మీరలు = మీరు, అన్నిటన్ = సర్వవిషయములను, [1]సడిసన్నవారు = పేరుపొందినవారు (సమర్థులని - భా.) కావున - నన్ను - [2]సడిసన్నవానిగాన్ — సడి = అప్రతిష్ఠ, చన్నవానినిగాన్ = (పోయిన) లేనివానినిగా, (అనిందితునిగా) ఒనర్చుటకు. (రాజుతో) తెలుపవలదొకో? (అనగా మీరు ధర్మాధర్మవిధిజ్ఞులు కావున నాకుగలిగిన యీ అపకీర్తి తొలగునట్లు - నా నిర్దోషిత్వము రాజుమనసున కెక్కునట్లు చెప్పవలదా? అన్నమాట.) దైవసన్నిధానమునఁబెట్టి = దేవునియెదుట నిలువబెట్టి, నిజముసేయించి = ప్రమాణముచేయించి, పిదప, మన్నింపుమనుఁడు = నాయందు దోషములేదని తేలినపిమ్మటనే - మన్నించుమనండి.

---

[1]పూ. టీ.—సడిసన్నవారు = సన్మార్గులు.
మీరు అన్నిటను సన్మార్గులు. అనగా, అర్థమేమో?

[2]పూ. టీ.—'సడిసన్నవానిఁగాన్ = నిందితునిఁగా,'

రాజు తనను 'నిందితునిఁగా' భావించునట్లు సిఫారసుచేయవలసినదని సారంగధరుడా పెద్దమనుష్యుల నడిగెనట! ఎంతటి యవివేకియైనను అట్లడుగునా? అసలు అడుగవలసిన అక్కరయేమి? ఇప్పుడు రాజు తన్ను 'నిందితునిగా' భావించియే యున్నాడుగదా?

(సడిసన్ననుగూర్చిన వివరములకు ౨౬౩ పద్యముక్రింద చూడండి.)

గీ. అనఘమతులార నన్నుఁ జిత్రాంగియెదుట
నునిచి [1] తారకాణించంగఁ [2] గనుక నట్టి
కల్ల నావల్ల గోరంత గలిగె నేని
యాజ్ఞకే నర్హుఁడను జుమీ యని యనుండు. ౨౮౧

టీక.— తారకాణించంగఁగనుక = దృష్టాంతపఱచిన మీఁదట గూడా. ఆజ్ఞకు = శిక్షకు.

---

1 శా. పా.— ‘తారకాణిం-పంగ’

పూ. ము. నను, తంజ. మద. వ్రాతప్రతులలోను, పూ. టీ. వ్రాత పుస్తకమునను, ‘తారకాణించు’ అను పదము క్రింద, శ. ర. లోను – ‘తారకాణించంగ’ అను పాఠమే యున్నది. ‘చంగ’ అనుట తప్పని శాస్త్రిగారు ‘పంగ’ అని సవరించినారు. సవరింపనక్కరలేదు. (చూ. ప్రౌఢ. క్రి. 16.) చ కారమునకు పకారము రామికి శ్రీ గిడుగువారు చూపిన ప్రయోగాలు 64. (చూ. బాల. శర. పు. 166-167). అంతదూర మెందుకు? ఈగ్రంథముననే (3-185) ‘ఓర్చు – ఈ, డేర్చ’ అని ప్రాసస్థానమున ప్రయోగమున్నది. కావున ‘చంగ’ అనురూపము కవికి సమ్మతము. అది గమనింపక పడదిద్దుట పాడిగాదు.

2 శా. పా.— ‘ఁగనఁగ’

పూ. ము. నను, అన్ని వ్రాతప్రతులలోను, పూ. టీ. వ్రాతపుస్తకమునను, శ. ర. లోను గూడా తారకాణించంగ – ‘గనుక’ అని యున్నది. ‘గనుక’ అనుట సరికాదని ‘ఁగనఁగ’ అని దిద్దినారు. చాలతప్పు. ఆశాస్త్రిగారైనను ‘కనుక’ అనుపదము నెరుగనివారుకారు – వారి, ఒక్క నాగానందములోనే కనక – కనుకలు కలిసి మొత్తం 49 – కాబోలు – ఉన్నవి. కాని అవి యన్నియు ‘కాబట్టి’ అను అర్థమున వాడబడినవే. ‘తారకాణించంగఁ – గనుక’ అనుచోట ‘కనుక’ కు ‘కాబట్టి’ అని అర్థము కాదు. అది యొక జాతీయమైన ప్రయోగము. దాని రుచి తెనుగు వారికే గాని యితరులకు తెలియుట కష్టము. కవులిట్లు ప్రయోగించి యున్నారు.—

(1) “భూసుతకోసమేఁ గనుక బొంకితి నేనియుఁ బెద్దకాలముం
జేసిన నాతపంబు రహిఁ జెందక నిష్ఫలమౌ.” (ఉ. రా. 8-86).

(2) “ఎడలేదు వేష్టువ లిటరమ్ము ముట్టెదు
గనుకఁ బ్రాతస్స్నానమునకు వలయు.” (మల్ల. విప్ర. 3-77.)

క. కాదే విను డొక్కటి యిం
[1]కాదేవినె 'కలది కలిగినట్లు దెలుపు నీ
పై దే నేరము జుణిఁగిన
గా' దని యడుగు మనుఁ డామె [2]గట్టిగఁ [3]దెలుపున్.

టీక.—నీపైదే నేరము = తప్పేమో నీదిగానే యేర్పడుచున్నది. ❀జుణిఁగినది కాదు = ఇప్పుడు నిజము చెప్పుటకు జంకి = వెనుదీసి ప్రయోజనములేదు. కలది కలిగినట్లు = ఉన్నది ఉన్నట్లు తెలుపు, అని, ఇంకా, ఆదేవినే = ఆచిత్రాంగినే, అడుగుమనుడు, ఆమె, గట్టిగన్ = స్పష్టముగా, తెలుపున్ = తప్పక చెప్పను.

---

(3) "బింబోష్ఠి నేఁ గన్కొఁ బీతాంబరమునైన
మెఱసి యుండుదుగదా మేనినిండ." (భాగ. 10 - ఉ. 212.)

సంస్కర్తలు తమకు తెలియని వన్నియు తప్పులే అనుకొని ప్రాచీన భాషా ప్రయోగములను దిద్దివేయుట భాషాపకారము చేయుట యగును గదా!

1 శా. పా.—'దేవిని' (ఇదే పూ. ము. శ. ర. పా.)

'ఆదేవినే' అని ఏవకారముండుట అవసరము. లేనిచో అర్థసౌభాగ్యమంతరించును. ఏవకారసహితపాఠము తంజ. ప్రతిలో ఉన్నది.

2 శా. పా.—'ఆమెఁ గట్టిగ'

'గట్టిగ' అను పదము సరళాదిగదా? మరి 'గ'కు ముందు అరసున్న యెందుకు? అచ్చుపొరపాటంటారా? అయితే వావిళ్ళవారును - అరసున్నతో ముద్రించినారే; అందుకు గారణమేమి? పెద్దలాలోచించండి.

3 శా. పా.— 'తెలుపక'.— అంటే అర్థమేమో పూ. టీ. లేదు. శాస్త్రిగారినిబట్టి వావిళ్ళవారును 'తెలుపక' అనియే అన్నారు. పెద్దప్రమాదము. పూ. ము. నను, తంజ. ప్రతులలోను శ. ర. లోను గూడా 'తెలుపున్' అనియేయున్నది. ఎందు కుండదు?

❀పూ. టీ.—'జుణిఁగినన్ = దాఁచిన.'

'జుణుఁగు'—అకర్మకక్రియ; 'డాఁగు' అని యర్థము. 'డాఁచిన' అని సకర్మకార్థము చెప్పుట తప్పు. శ. ర. కర్త 'జుణుఁగు' కు 'వెనుదీయు' అను అర్థము చెప్పి ఆయర్థము కీపద్యమునే చూపినాడు.

ఇంకా + ఆదేవి = ఇంకాదేవి.—

'ఇంకను' లోని 'ను' లోపించుటచేత పూర్వస్వరమునకు దీర్ఘము కలిగి 'ఇంకా' అయినది. (వివరములకు, చూ. బా. శర. పుట 126.) 'ఇంకా' సరసకవిసమ్మతమైన రూపమే. ఒక్క ప్రయోగము.—

క. "పంకజముఖి బిగి కౌఁగిటఁ
బొంకముగా సురతకేళిఁ బొసఁగించునెడన్
ఇంకా మఱి యింకా మఱి
యింకా మఱి యన్నమాట యింకా మఱవన్"

—చాటువు.

క. [1] అటమీఁదట జగదీశ్వర
ఘటనం బెటు లుండె నటులఁ గా కుండదుగా,
యి టనుం డని, వారికి నా
దటఁ దాంబూలంబు లిడి, యతం డపు డనిపెన్. ౨౮3

టీక.— అటమీఁదటన్ = ఆపైన, జగదీశ్వరఘటనంబు = భగవంతుని యేర్పాటు, ఆదటన్ = ప్రీతితో.

---

[1] శా. పా.— 'అటుమీఁదట.' (ఇది గుజిలీ పాఠము.)

'అటమీదట' తంజ. పా. ప్రాచీన కృతులలో - అటమీఁద; ఇటమీఁద; అటమున్నె - అటకమున్నె; అనియేగాని 'అటుమీఁద; ఇటునున్నె అటుకుమున్న - ఇటుకుమునుపు' అను వాడుక కనబడదు.—

వ. 'అటమీఁద నీవ యెఱుంగుదు.' (విరాట. 2—61.)

వ. 'ఇటమీఁద నాకుం దెలియదనిన.' (ఉద్యో. 1—102)

క. ఆజికి నిటమీఁద నెవ్వరాధారంబో.' (భీష్మ. 1—63.)

క. 'ఓరీ యిటమీఁద నూరకుండుము జగతిన్.' (భాగ. 9—436.)

గీ. 'హరికి నటమున్నె యిచ్చెఁ జంద్రార్ధమౌళి.' (భీమ. 6—69.)

ద్వి. 'ఇట క్రిందిమాటలకేఁ దప్పుపట్టె.' (బసవ. పు. 125.)

చ. 'అదెయొక యల్పసైన్యమట యావల.' (విరాట 4—245.)

సీ. 'అరుణోదయము కాక యటకమున్న' (కాశీ. 7—131.)

క. 'కొట్టువడి యటకమునుపనె.' (మను. 4—124.)

('అటకమునుపనె = అంతకుముందే' జూ. టీక.)

వారివీరి ప్రయోగము లెందుకు? మూలగ్రంథమయిన నవనాథ చరిత్రలో 'అటమీఁదఁ బరమేశు నాజ్ఞ యెట్లుండెనొ' (పుట. 64) అనియే యున్నది.

శా. [1]దాక్షిణ్యాకరమూర్తి షోడశమహాదానాదిధర్మక్రియా
దక్షా యాశ్రితదీనరక్షణకళాధౌరంధరీసత్కృపా
వీక్షా శాశ్వతకీర్తివైభవరమాభృచ్ఛోళసింహాసనా
ధ్యక్షా దుర్మదరాట్కిరీటదలనై కాక్షేయకౌక్షేయకా. ౨౮౪

క. [2]యాచనకవినుత వనితా
సేచనకతనూవిలాస శృంగారకళా
సూచనకమ్రకవిత్వా
లోచనకందళితహర్ష లోలుపహృదయా. ౨౮౫

స్రగ్విణి

[3]దుగ్ధవారాశివిద్యోతికీర్తీ సుధా
భుగ్ధురీణామనాగోభగవర్తీ దయా
దృగ్ధుతాశేషధాత్రీమరున్నిస్స్వతా
స్నిగ్ధసారస్వతస్నిద్ధసారస్వతా. ౨౮౬

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధ ప్రసిద్ధ వాగ్విభవ సుధాసారజనితయశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్యకుమార సమారాధితబుధసమాజ వేంకటరాజప్రణీతంబైన సారంగధర చరిత్రంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచాననేత్యాద్యనేకబిరుదవిఖ్యాతవిద్వత్కవీశ్వరతిరుపతివేంకటేశ్వరకృపాపాత్రఛాత్ర కాశ్యపసగోత్ర దీపాలాన్వయ పవిత్ర సరస్వతీనృసింహపుత్ర రాజలక్ష్మీకళత్ర ప్రౌఢప్రబంధపఠనరచనాధురీణ పిచ్చయశాస్త్రి ప్రణీతంబును, 'జితకాశి' నామకంబును నగు సారంగధర చరిత్ర టీకయందు ద్వితీయాశ్వాసము.



1-3 పద్యములు 'విజ' ద్వితీయాశ్వాసాంతమునను 2వది ప్రథమాశ్వాసాంతమునను నున్నవి.

శ్రీ

# సారంగధర చరిత్రము

## తృతీయాశ్వాసము

శ్రీ ధుర్యశౌర్యధైర్య
క్ష్మాధరమూర్ధన్య యాదిగర్భేశ్వర వి
ద్యాధిక వితరణదీక్షా
రాధాసుత యచ్యుతేంద్ర రఘునాథనృపా. ౧

వ. అవధరింపు మివ్విధంబున నవ్వసుంధరావరకుమారుం డగు సారంధరుండు మంత్రిపుంగవుల ననిచి యనివార్యధైర్య ధురంధరుండై యుండె నంత.

చ. అనిపినఁబోయి వారు † నతులై, యతులైకవినీతరీతి ని
ట్లని; 'రవధారు, ధారుణి ‡తలాధిప శేఖర, స్వామియానతిం
బనివిని యక్కుమారుఁగని మామదిలో ననుమానమెల్లఁ బో
వను విశదంబుగా * నడిగి వచ్చితిమయ్య యనేకభంగులన్. 3

టీక.— నతులై = నమస్కరించినవారై ("నతుడు-One who is prostrate.' (బ్రౌను.) అతుల...రీతిన్ = సాటిలేని మంచి వినయముగల వారి పద్ధతితో (=మిక్కిలి వినయముతో) ఇట్లనిరి; ధారుణి ... శేఖర = రాజశ్రేష్ఠా, అవధారు = చిత్తగింపుము. ('అవధారు - Oh Listen! O give ear' (బ్రౌను.) స్వామి ఆనతిన్ = తమ ఆజ్ఞ ప్రకారము, పనివిని = పోయి, మదిలోని+అనుమానమెల్లన్, పోవన్ = తీరునట్లుగా, విశదంబుగాన్ = స్పష్టముగా.

---

† శా. పా.— 'నతులైకవినీతిని నీతిదోఁప' (ఇదే పూ. ము. పా.)
'అతుల ఏక వినీతిన్=సాటిలేక ముఖ్యమయిన వినయముతో అని' పూ. టీ.

‡ శా. పా.— 'నయంబున నేలెడి సామియానతిం, బనిచిన'. ('రయంబున నేలెడి...' పూ. ము. పా.)

పాఠాం.— 'ఁదెలిసి'

క. † శౌధన్యుఁడు; గాఁ డన్యుఁ, డ
సాధారణుఁ డతఁడు; దైవసన్నిధి ‖ నిదగన్
శోధన చేసినఁ * గాని, య
శోధన యొం డొకటి దలఁపఁ జొప్పడ దింకన్. ౪

టీక.— ధన్యుఁడు - ఔన్ = (సారంగధరుడు) పుణ్యమూర్తి అగును (గాని) అన్యుఁడు కాఁడు.— శోధన = ప్రమాణాదులచేత నగు పరీక్ష, ('యశోధన' అను సంబోధనముచేత, 'తొందరపడి అక్రమ మొనర్చినయెడల యశోధనమునకు హాని వచ్చును; జాగ్రత్త' అని హెచ్చరిక.)

క. మనవిగల దొకటి 'చిత్రాం
గినె [1]యీమాటు బెదరించి కినుకన్ 'నీవం
కనె [2]తప్పిది, గట్టిగఁ జెపు
మన నృపుతోఁ '‡దాన తెలుపు' నని యతఁడనియెన్. ౫

టీక.—తాన తెలుపున్ = తానే చెప్పును.

---

† శా. పా.— 'ఆ ధన్యుఁడు గాఁ డన్యుఁ; డ సాధారణుఁ డతఁడు';
వారు భావించిన యర్థమేమో? (పూ. టీ. లేదు.).— 'సాధన్యుఁడు' పూ. ము. పా.; 'శౌధన్యుఁడు' తంజ. పా. (మూడుప్రతులలోను ఈపాఠమే యున్నది.)

‖ శా. పా.— 'నతనిన్'

దైవసన్నిధిని - శోధనచేయవలసినది 'అతని' నొక్కనినే కాదు; చిత్రాంగిని కూడాను. "ఆమెను నన్ను దేవాలయంబునను, నేమించి మాటాడ నేరుపరయ్య" అని శా. శం. అనువాదము. (చూ. పు. 49.) కావున శా. పా. సరికాదు. 'సన్నిధిని తగన్' అని తంజ. తా. పా.

* శా. పా.— 'ఁగాక' (ఇది పూ. ము. పా.)

'ఁగాని' తంజ. పా. "...సన్నిధి, బరిసెనఁబున దిబ్బఁ బట్టించిగాని, యొండు విచారంబు లూహింపఁగాదు." (నవ. పు. 65.)

[1]పాఠాం.—'యీమఱుమూదలంచి' [2]'తప్పగునిజము దెలుపు'

‡శా. పా.—'ఁదానఁదెలుపు'

'తానన్ - తెలుపు' అనుటలో అర్థములేదు. కావున ఆపాఠము తప్పు. అయితే ఏమి? శాస్త్రిగారి వ్రాతమీది విశ్వాసముచేతను - తప్పని త్రోసివేయుటకు ధైర్యములేకను వావిళ్ళవారుకూడా 'తానఁదెలుపు' అనియే ముద్రించినారు. పూ. ము. లో 'తానతెలుపు' అని సరిగానే యున్నది.

-♦ రాజు మంత్రులు చిత్రాంగి నదలించి యడుగుట ♦-

చ. అన విని మంచిదే యని నృపాగ్రణి వారల నెల్ల వెంటఁ దో
డ్కొని వెస రాణివాసమునకుం జనినం గని, నాతి సెజ్జ ది
గ్గన దిగి జాళువాపసిఁడికంబము †చెంగట నిల్చి, ముగ్ధచా
ద్పున వసివాళ్లు వాడు మొగముం గదియంగ ముసుంగు$దార్చుచున్.

టీక.—ముసుంగు = మేలుముసుగును, కదియంగన్ - తార్చుచున్ = సవరించుకొనుచూ.

క. కొనగోరఁ దీసి కాటుక
కనునీరు [1]చిటుక్కు మనఁగ గడ మీటుచు వం
చినతల యెత్తకయుండెడు
సన్నృతోదరి కనిరి రాజుననుమతి వారల్. ౨

టీక.—చిటుక్కు మనఁగన్ = చిటుక్కు అని శబ్దమగునట్లు, కడమీటుచున్= పోఁజిమ్ముచు.

---

†పాఠాం.— 'చాటున.' $ శా. పా.— 'దాల్చుచున్' (దాల్పుచున్' పూ. ము. పా.) 'దార్చుచున్'; 'దార్పుచున్' తంజ. పా.

ముసుగును అప్పుడు తాల్చినదనుటకంటె - తాల్చియున్న ముసుగును సవరించిన దనుట సరసముకదా?

'తలకొంగు సవరించి తలుపోరచేసి' (బా. శం. పు. 50.)

'ఒనర హేమ స్తంభమూఁత గా నిలిచి
ముసుఁగుడగ్గఱదిగిచి ముగుదచందమున.' (నవనాథ. పు. 65.)

1 శా. పా.—'చుటుక్కు.' (ఇది పూ. ము. పా.)

సరియైనరూపము 'చిటుక్కు.' (చూ. శ. ర.) "చిటుకు or చిటుకుపాటుకు slightly, with a low soft sound- చీమ చిటుక్కుమంటే నిద్రలేస్తాడు." (బ్రౌను.)

(1) 'చెవిదార్చి విను చీమచిటుకన్న' (మను. 4-16)
'పిపీలిక చిటుక్కుమని చప్పుడు చేసినప్పటికిన్ని'—అని, జూ. టీక.

(2) 'ఇటులనిమిత్తము మెట్టెలు
చిటుకు చిటుక్కనఁగఁ దిరుగు శిస్తుగవగతోన్.' (హంస. 5-25.)

మ. వనజాతేక్షణ, కేళికాకలరవవ్యాజంబునన్ వచ్చి, ని
న్ననుఁ సారంగధరుండు $ మీయాయతులసౌందర్యంబు వీక్షించి, మో
హనిమగ్నుం డయి బల్మిఁ బట్టె, నని మీ రన్నా రటం, చెల్లరు
న్వినఁగాఁ బల్కి-కుమారునిం దెలిసి రండీ యంచు రాజంపినన్. ౯

టీక.— కేళికాకలరవవ్యాజంబునన్ = ఆటపావురము నెపమున.

వ. మేమా నృపాల † బాలుపాలికింజని తద్వృత్తాంతం బంతయు నెఱింగించి.

శా. 'ఏరా యోరి వివేకహీనమతి ద్రోహీ నందనుం డంచు ని
న్నారా నమ్మిన దంతయుం గలిగె ‡ నే రంతఃపురీసీమకుం
బోరో, రారొ, కొమాళ్ళు? వావివరుసల్ బుద్ధిన్ విచారింపకే
గారాబుంబినతల్లిఁ బట్టితివి యోగ్యంబే నిన్ జూడఁగన్. ౧౦

---

(3) 'ఇటువంటియ్యాలె కారా
చిటుకుమనక యుండ సందెచీఁకటివేళన్.' (వైజ. 2-18.)

(4) 'చీమచిటుకుమన్నఁ జెమ్మెటబుజ్జన్న.' (వేం. పంచ. 4-247.)

(5) 'మంథరునిబంధము చిటుకనకుండఁ దెగఁగొఱికెను."
(గిడుగువారిప్రతి) మిత్రలాభము. పు. 46.

ధ్వన్యనుకరణములకును సంప్రదాయమున్నది. ఒక భాషలోని సంప్రదాయము లింకొకభాష వారి కెన్నేండ్లు చదివినను అంతుపట్టవు.

$ శా. పా.— 'నీయతుల...మీరన్నారటంచు.' (ఇది గుజిలీ పాఠము.) ఇందులో భిన్నవచనతాదోషమున్నది. 'మీయతుల...' అని, తంజ. పా.

† శా. పా — 'నృపాలుకడకుంజని' (ఇదియును గుజిలీ పాఠమే) సారంగ ధరుడు నృపాలబాలుడుగాని నృపాలుడుకాడు. 'నృపాలబాలుపాలికి' తంజ. పా.

‡ శా. పా.— 'నెందైన న్నగర్లోనికిం బోరో' (ఇదియును గుజిలీపాఠమే.)

క. అని యనుఁ డని యినుఁ డాగ్రహ
మున నంగారకునిచందమున మండుచు నుం
డిన వాఁడని; గట్టిగఁ జెపు
మని మే మెంతయును దూఱ నతఁ డిట్లనియెన్. ౧౧

టీక.— ఇనుఁడు = రాజు, అంగారకుని చందమునన్ = అగ్నివలె. (అంగా రకము = అగ్ని, మహద్వివక్షచే, – 'అంగారకుడు.' చూ. భా. తత్స. 61.)

మ. అమరంగాఁ దనమీఁది నేర మిపు డాహా నాపయిన్ † మోపి, తం
డ్రిమనం బి ట్లెడ సేసెనే! యయినఁ గానీ గట్టిగాఁ దెల్ప నా
యమ నే యింకొకమాఱు మీ రడుగుఁడీ యన్నాఁడు; గాఁగాను దో
సము సు మ్మొందు నిరాపనిందలు గడించం; దెల్పు నికఱంబుగన్.

టీక.— మోపి = ఆరోపించి, తండ్రిమనంబు - ఇట్లు, ఎడచేసెనే = చెడ గొట్టినదా? నిరాపనిందలు = వట్టి తప్పులు. గడించన్ = ఘటించుట, దోసము;

ఈగ్రంథమున 'గడించు' ధాతువు 'ఘటించు' అను అర్థమున రెండు, మూడు మార్లు వాడబడినది. కవి ఈ వాడుకను గౌరన నుండియే గ్రహించినాడు.

'ఆయమ్మ నామీఁద నాగ్రహంబునను - ఈ యుపాయము గడియించినదైనఁ జేకొని తన కింత చెవి నాననేల?' (నవ. పుట. 64.)

---

† శా. పా.— 'నాపయిం-జూపె,...బిట్లెడ సేసెనే' (ఇది పూ.ము.పా.)

తండ్రిమనము నెడసేయుట నేరముఁజూపికాదు; మోపి. కావున 'నేరముఁ జూపె' అనుట తప్పు. అది యట్లుండగా, తన మీది నేరమును నాపయిని 'మోపి' అనుట సంప్రదాయముగాని 'చూపి' అనుట సంప్రదాయముకాదు. - 'నాపయిన్ మోపి' అనియే తంజ. పా.

'కటకటా! తన మీఁదికల్ల నామీఁద
నిటు మోపి, రాజున కెడలుగాఁ జెప్పి.' (నవ. పు. 66.)

'నారి చేసిన తప్పు నామీఁదమోపి' (బా. శం. సారంగ.) శ. ర.

కావున శా. పా. అసాధువు. వావిళ్ళవారేకాక, సూ. ని. వారును ఆ యసాధు పాఠమునే కైకొన్నారు. (చూ. 'ఎడసేయు'.)

చ. అనవుడు, రాజుదిక్కు-మొగ మై యలుకన్ గలకంఠి కంచు గీ
సినగతిఁ * బెద్దపెట్టు నను జిట్టుడుకుం గనునీరు సోన యై
చినుకఁగ నేడ్చి, యే లగడుచేసెదు రచ్చలఁబెట్టి యింత? యో
వనధిగభీర నాకు సరివారలలోఁ దలవంపు లయ్యెడున్. ౧౩

టీక.—కంచుగీసినగతిన్ = కంచును మోగించినవిధమున, పెద్దపెట్టునను = బిగ్గరగాను, చిట్టుడుకుంగనునీరు = ఇంచుక వేడియైన శోకబాష్పములు, (దుఃఖాశ్రువులు వేడి. చూ. ౭౯ క్రింద.) సోనయైచినుకన్ = చిన్నవానగా వర్షింపగాను, ఏడ్చి; వనధిగభీర = సముద్రమువలె గంభీరుడవైన - రాజా, రచ్చలన్ పెట్టి = వారి వీరిమాటలను విని - నన్ను వీథిలోనికిలాగి, ఏల అగడుచేసెదవు = ఎందుకు అల్లరపాలు చేసెదవు?

ఖంగునమోగు శబ్దమును 'కంచుగీయుట'తో పోల్చిచెప్పుట కవులకు పరిపాటి. కంచుగీయుట యనగా కంచుపాత్రమీద ఉలివంటి యినుపముక్కతో గీకి శబ్దింపజేయుట. ఈ విషయమును 'ఆముక్త' కర్త యిట్లు వివరముగా చెప్పినాడు.

చ. ‡ కలియఁగ వారిదేవతలు గాంచు సరోవరదంభ దర్పణం
బుల పయి దట్టపుం జిలుము వోవఁగఁ దా మలకంచు గీయఁగా
బలె నలువంకలం గలయఁ బాయక తేలుచుఁ బద్మరేణువుల్
కెలఁకులఁబాసిపోఁ జెలఁగి క్రేంకృతులిచ్చె మరాళమాలికల్.' (4-180)

* శా. పా.—'పేరెలుంగునను' (ఇది పూ. ము. పా.) 'పెద్దపెట్టునను' తంజ. పా. 'పేరెలుంగున' అనుట కంటెను - 'పెద్దపెట్టున' అనుట చక్కని జాతీయమైన పలుకుబడి.

‡ ఈపద్యముయొక్క తాత్పర్యమును శాస్త్రిగారిట్లు సెలవిచ్చినారు.—

'సరస్సులు సరస్సులుగావు,...జలదేవతలు ముఖముంజూచుకొనెడు కంచుటద్దములు. వానిపై దట్టముగా చిలుముపేరినది. హంసశ్రేణులు ఆచిలుమును తోముచున్నవోయన...ఇటునటు...సంచరించుచుండినవి. అట్లు తోముటవలన చిలుము ఎడలి యెగిరిపోవుచున్నదో యనునట్లుగా పద్మరజస్సు...రేఁగుచు కొలఁకుల వెలికి ఎగసిపోవుచుండినది. కడుదిటవుగా తోముటచేఁ గలిగిన కీచుశబ్దములో యన వీని క్రేంకారములు ఒప్పుచుండెను. ఈ దేశములో పూర్వకాలమున కంచుటద్దములు ప్రసిద్ధ

గీ. 'కంచుగీసిన తెఱఁగున ఖంగురనఁగఁ
జేడియలుగూడి ధవళముల్ పాడుచుండ' (చమ. మంజరి. 3-90.)

క. 'ఆసమయంబునఁ గాంస్యము
గీసిన గతి...నెలుఁగడరఁ.' (ఉ. రా. 8-126.)

కంచుగీయుట = వాదనవిశేషము (కూడాను.)

"ఊదుట, వ్రేయుట, మీటుట, వాయించుట, కంచుగీచుట, లను పంచమహా శబ్దంబులెటింగి" (చాటు. మంజరి. పు. 155.)

ఈ 'గీయు' ధాతువును కొందరు చువర్ణాంతముగా వాడినారు. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు.—

సీ. 'కీచురాళ్లు రవళ్లు రేచె బాలకులీల
వైచినట్లును, గంచుగీచినట్లు.' ('కడుపుతీపు.')—

శృంగారనైషధము.—(1–103) 'కంచుగీసిన తెఱంగున' అనిమూలము; 'కంచు గంటయంచు చుట్టును కోడుపుతో గీచిన కీచుమని మ్రోయును' అని సర్వంకషా వ్యాఖ్య.

బ్రౌణ్యము.— 'కంచుగీచినట్లు పలికె She spoke shrilly, or with a voice as clear as a bell.'

క. మానముకన్నను హెచ్చా
ప్రాణ మని † తెగింప బల్మిఁ బట్టెదు; సేయం

సదాచార పరాయణులు ... వానిని దినదినము సన్ననిబూదితోతోమి నిర్మలీకరించు కొనుచుండిరి. ఆ యాచారము ఇట ననుసంధించి కవియిట్లు వర్ణించినాఁడు.'

శాస్త్రిగారి యూహ సరియైనది కాదు. ఎందువల్లననగా కంచుపాత్రమీద సన్నని బూదివేసి తోమినయెడల క్రేంకారము వంటి శబ్దముపుట్టదు. చిలుము బూదితో కలిసియుండునేగాని, ఎడలి - యెగిరి - రేఁగి - వెలికి - ఎగసిపోనే పోదు. చిలుము రేగుటకును - క్రేంకారమువంటి శబ్దము పుట్టుటకును - ఉలితోనే గీకవలెను. హంసలు ముక్కులతో పద్మరజస్సును రేపుట - ఉలితో చిలుము నెగుర గొట్టుటను పోలునేగాని, సన్నని బూదివేసి తోముటను పోలదు.

† శా. పా.— 'తెగింప, బల్మిఁబట్టిటుసేయం - బూనితి; నగుఁబోటులు నాకా; నీకే...'

‡బూనితి నగుఁ బాటులు నా;

కా, ‖ నీకే సిగ్గు గలుగ దఁట! నా కేలా. ౧౪

టీక.— తెగింపఁ=సాహసించి నేను గొంతు కోసికొనబోతే, బల్మిఁ బట్టెదు= (వద్దు వద్దని) గట్టిగా పట్టుకొని - అడ్డమువస్తావు; (=వచ్చితివి - అని భా.) మళ్లీ, ఇటు = ఇట్లు, నాకు - నగుఁబాటులు చేయం బూనితివి; కాఁ = బాగానే యున్నది. నీకే సిగ్గు కలుగదఁట (ఇక) నాకేలా ?

క. కందోయి * చల్లఁగా నిటు
గం దోయినృపాల, లెస్సగా నిఁక నొకమా
అందఱముందఱ నీ, వని
చిందఱవంద అయి గుట్టు చిట్టాడంగఁ. ౧౫

టీక.— కందోయి చల్లఁగాఁ = నీకండ్లు (రెండూ) చల్లబడునట్లుగా, లెస్స గాఁ, ఇఁక నొక మాఱు, కందోయి = చూచెదవటోయి!

---

శాస్త్రిగారుంచిన విరామ చిహ్నముల ప్రకారమేర్పడు అర్థము సరసమైనది కాదు. మరియు 'పట్టిటు' అనుపాఠము కంటెను - 'పట్టెదు' అను తంజ. పాఠమే మూలానుసారిగా నున్నది. మూలమిది.— "తెగి చావఁబోయినఁ దివిరి పట్టెదవు, నగుబాటుచేసితి నాలజ్జగొంటి, ‖నీకు లేదఁట సిగ్గు నేఁడు నాకేల ?' (పు. 66.)

* శా. పా.— 'చల్లగా' (ఇది పూ. ము. పా.)

'చల్లగా' అను రూపము తప్పు; చల్లఁగా' అనుట ఒప్పు. కందోయికి ప్రియ వస్తుదర్శనమున కలుగు గుణము 'చల్లన' గాని 'చల్ల' (=మజ్జిగ) కాదు. 'చల్లన + కాఁ = చల్లఁగాఁ' అని సంధికార్యము.— (చూ. ప్రౌఢ. సమా. ౧౪.) 'చల్లఁగా' అను పాఠము శ. ర. లో ఉన్నది. (చూ. చిట్టాడు.) 'చల్లంగ' అనుటకొక ప్రయోగము.—

తే. 'అనిన నాతండ్రి యీయెనే యనియె నేమె
ఉంగమే యాత్రిఁ గడుపు చల్లంగఁబలికి.' (ఆము క్త. 7-50)

ప్రయోగములతో పనియేమి? వ్యాకరణములదాకా యెందుకు? బ్రౌను, 'చల్లంగా బ్రదుకు - Long life to you' అని చక్కఁగా వ్రాసిపెట్టి యున్నాడు. అంత దూరము గూడా పనిలేదు. 'చల్లంగా - తియ్యంగా' అను వ్యవహారము తెనుగు పల్లెలలో పసిబిడ్డలును ఎరిగినదే.— ఇంతటి సుప్రసిద్ధ పదమును శాస్త్రిగారు తప్పుగా ముద్రించుటయే వింత. వావిళ్ళవారు తప్పునట్లే ముద్రించుట మరీ వింతకాదా ?

---

‖ 'నీకు లేదటి' అని ముద్రిత ప్రతిపాఠము. (?)

క. కయ్యూనకుఁ గాల్ ద్రవ్వుచు
గయ్యాళితనంబు మీఱఁగా డగ్గఱి యా
తొయ్యలి యూఁచక యాఁచక
†పయ్యెద గొబ్బున ‡బటాన బయలుగఁ జేసెన్. ౧౬

టీక.— ఊఁచక - ఆఁచక = ఏమాత్రమును వెనుకముందు చూడక, పయ్యెదను, గొబ్బునన్ = తటాలున, $ బటానబయలుగన్ - చేసెన్ = బట్టబయలుగా తొలగించివేసెను.

'ఊఁచక - ఆఁచక' ఇదియొక జాతీయము.— (బందరులో శృంగారకావ్య గ్రంథమండలివారు 1936 లో ప్రకటించిన) రాధికాసాంత్వనము.—

క. 'ఇల రాయరాయలగు మా
యల రాయలనెంచి యూచకాచక మదిలో
నలరాయల నెలరాయల
వలరాయల నెన్నదృష్టి పాత్రలుగారే?' (2–57)

ఉ. ఆపగిదిం ద్రపారహిత యై కుచరేఖలు చూపనందఱున్
హా! పరమేశ్వరా! యనుచు నౌదల వంచిరి; జంత[1]యంతయున్

---

† శా. పా.— 'పయ్యెద - గొంగును'

శా. పా. ను బట్టి వావిళ్ళవారును 'పయ్యెదగొంగును' అనియే ముద్రించినారు. కాని లోకములో 'పయ్యెదకొంగు; పైటకొంగు' అనియే గాని, - 'పయ్యెదగొంగు;' 'పైటగొంగు' అను వాడుకలేదు. ['పైట - A woman's mantle, or kerchief పైటకొంగు. The skrit or end of the same' (బ్రౌను.)] కావున 'పయ్యెదగొంగు' అనుట సరికాదు. అసలా పాఠమే సరియైనది కాదు. పూ. ము. నను, తంజ. తా. ప్రతులలోను, శ. ర. లోను కూడా, 'పయ్యెదగొబ్బున' అనుపాఠమే యున్నది.

‡ పాఠాం.— 'బటాకబయలుగ'; 'గొబ్బునను బట్టబయలుగ.'

$ పూ. టీ.— 'పటానన్ = తటాలున.'

'బటానబయలు' లోని 'బటాన' ను 'పటాన' అనుకొనుట అజ్ఞానము. ఆ 'పటాన' కు 'తటాలున' అని యర్థము చెప్పుట సాహసము. 'బటానబయలు' తెనుగు దేశమున ఆబాలగోపాల విదితము.

1 శా. పా.— 'యింతయున్' (ఇది. గు. పా.) 'యంత్రయు' తంజ. పా.

నాపయిఁదప్పెయ్యాఁనిదియు నాదియొ [2]యాతనిచేలయొనో కా
దో పరికింపుఁడా, యనుచు దుప్పటిముందఱఁబెట్టి వెండియున్. ౧౭

టీక.—త్రపారహితయై = సిగ్గుమాలినదై, కౌదల = తల, జంత=అగ్యాళి. ఆతని, చేల = వస్త్రము.

క. కొడుకుపయి నీకుఁ గడుఁ బ్రే
ముడి గావునఁ 'గతకుఁ గాళ్ళు ముంతకుఁ జెవు' లీ
వడిగెదవు రాజ, నీ కె
క్కడియభిమాన మని పలుకఁ గాంతుం డలుకన్. ౧౮

టీక.— కతకు కాళ్లు ముంతకు చెవులు - అడిగెదవు = (లోకోక్తి) అసంగతపు ప్రశ్నలువేసెదవు.

'కడమవన్నియు నిఁక నేల కతకుఁ గాళ్ళు
ముంతకుఁ జెవులుఁ గల్పింప ముజ్జగములఁ
బడుపు జవరాండ్రకును దృణప్రాయ మహహ.' (సుద. 4-25.)

క. ఇది మాయాపట మనఁ గూ
డదు గద యిఁక? సంశయం బెడలఁ జూచితిరే
కద? పదపదఁ డని యానయ
విదులం దోడుకొని వచ్చి విభుఁ డలసభలోన్. ౧౯

టీక.— మాయాపటము = కల్పితవస్త్రము. సంశయంబు - ఎడలన్ = అనుమానము తీరునట్లుగా. పదపదఁడు + అని = పదండి పదండి అని (చూ. బా. క్రి. ౯౮.) నయవిదులన్ = న్యాయము నెరిగిన ఆ పెద్దమనుష్యులను.

క. మాతృరిరంసాయుతుఁ డగు
పాతకి దండన మొనర్పఁ బరిమాణం బే

---

[2] శా. పా.—'యాతని - చేఁత.'

దుప్పటి ముందర బెట్టి 'ఇదినాదో? ఆతని 'చేఁత' యో చెప్పండి' అనుట సంగతమగునా? 'చేల' అని సరియైన పాఠము, తంజ. ప్రతులలో ఉన్నది. ముందర పెట్టినది 'చేల' గాని 'చేఁత' కాదు.

"ముదిత దుప్పటిఁదెచ్చి ముందఱఁబెట్టి, యరయంగ నివ్వల్వయతనిదొ నాదొ,
వెలివొప్ప మీరెల్ల వివరించిచెప్పుఁడు." (కూ. తి. సారంగ. పు. 29.)

†రీతి చెపుదని విపశ్చి
జ్జాతములం గూర్చి యడుగ జననాథునితోఁ. ౨౦

టీక.— మాతృరిరంసాయుతుఁడు = తల్లితో క్రీడింపవలెనను ఇచ్ఛగలవాడు - (రంతు మిచ్ఛా రిరంసా.) అగు, పాతకికిన్, దండన మొనర్పన్ = శిక్షించుటకు, (శిక్షా) పరిమాణంబు, ఏరీతి = ఎట్టిది. అని, విపశ్చిత్ జాతంబులంగూర్చి ౹ండి తుల సమూహమును.

క. విజ్ఞాపనం బొనర్చిరి
విజ్ఞానేశ్వరము చూచి విద్వజ్జను; ల
§యయ్యజ్ఞుని వనిఁ గరచరణం
బాజ్ఞ నిశావేళఁ జేయ నర్హం, బనుచున్. ౨౧

టీక.— విద్వజ్జనులు, విజ్ఞానేశ్వరము - అను ధర్మశాస్త్రగ్రంథమును చూచి, అయ్యజ్ఞునిన్ = ఆదుర్మార్గుణ్ణి, వనిన్ = అడవియందు, నిశావేళన్ = రాత్రిసమయమున, కరచరణంబు = కాళ్లుచేతులు, (కరచరణము, సమాహారద్వంద్వము.) ఆజ్ఞ చేయన్ - అర్హంబు = నరికించుట తగును, అనుచున్, విజ్ఞాపనంబు - ఒనర్చిరి = మనవిచేసిరి.

---

† శా. పా.— 'ఏ, రీతిం జెపుఁడని సద్బుధ' (ఇది పూ. ము. పా.)

'పరిమాణము - ఏరీతిన్ - చెప్పుడు' అనుట సరికాదు.— ప్రశ్నమున, 'అది యేరీతిన్'; 'వాడెక్కడన్'; 'నాకెందుకున్' అని ద్రుతాంతములుగా వాడు వాడుక కనబడదు. కావున 'ఏరీతి? చెపుఁడు' అనుట యొప్పు.

§ శా. పా.— 'అయ్యజ్ఞుని కరచరణాదుల కాజ్ఞ' (ఇది పూ. ము. పా.)

'కరచరణాదులకు' — అనుటచేత, కరములు చరణములేకాక - కంఠము; కాను గూడా నరికించవలసిన దన్నట్లు - అర్థ మేర్పడుచున్నది. ధర్మశాస్త్రవచనములలో గాని, ప్రభువులుచేయు తీవ్రశాసనములలో గాని భావ మంత అవ్యవస్థితముగా ఉండదు. మరియును - ఆపాఠములో 'అడవిలో నరికించవలసిన'దన్న నియమమున్ను లోపించినది. అంతా కథకు విరుద్ధమే. మూలగ్రంథ మిట్లున్నది.—

'అట్టి దురాత్ముఁ గొనిపోయి నడురేయి ఘోరాటవందు, గనెలుగాఁ జేతులుఁ గాళ్ళు గోయింప, జనునని ధర్మశాస్త్రములు శోధించి, పలికిన.' (పుట. 67.)

కాబట్టి, శా. పా. తప్పు. వావిళ్ళవారేకాక, నూ. ని. వారుగూడా ఆతప్పు పాఠమునే గ్రహించినారు. (చూ. 'ఆజ్ఞ'.) సరియైన పాఠము తంజ. ప్రతులలో ఉన్నది.

## — రాజు సారంగధరునికి శిక్షవిధించుట —

ఉ. ఆతఁడె వారిమాట విని యట్లనె నిర్దయవృత్తి నమ్మహీ
నేత తలారులం బిలిచి నేఁడు సుతుం గొనిపోయి కాళ్లనుం
జేతులు [1]నాజ్ఞసేయుఁడని చేముదుటుంగరమిచ్చెఁ. గోపమే
చూతురుగాని బిడ్డఁ డని చూడరుగా ధరణీతలాధిపుల్. ౨౨

టీక.—కాళ్ళను - చేతులుక్, ఆజ్ఞచేయుఁడని = నరికివేయుఁడని, చేముదు టుంగరమిచ్చెక్ = చేతి ముద్దుటుంగరమిచ్చెను. (ఉంగరమిచ్చుట- ఆజ్ఞకు ఆనవాలు.)

'ఆజ్ఞచేయు' అను క్రియ శ. ర. లో లేదు. "ఆజ్ఞచేయుట - To sentence; to doom." (బ్రౌన్యము.)— "నీప్రాగల్భ్య గర్వం బడం, గింతుం గన్నులకాజ్ఞచేసి యని పల్కెక్." (పరమ. 5-363.)

ఆ.వె. పట్టి నట్టు లాజ్ఞవెట్టఁ గట్టడసేసి,
నరగ లోని కరిగి, శయ్య [2]కొరిగి,
యినుఁడు దుఃఖవార్ధి మునిఁగి యుండఁగ నల్ల
యినుఁడు నంత వార్ధి మునుఁగుచుండె. ౨౩

టీక.—ఇనుఁడు = రాజు. ఇనుఁడుక్ = సూర్యుడును, వార్ధిక్ మునుఁగు చుండెక్ = అస్తమించుచుండెను.

గీ. ప్రామినుకు‡మానికమ్ముల బరణియైన
తరణి శరనిధి మునుఁగఁగా నరగఁ దిగిచి
వేయఁ బోల్ పై వసుతతి నారాయణుండు;
కా కది కృపీటజాతా ప్తిఁ గాంచ నేమి? ౨౪

---

[1] శా. పా.—'ఁగోసిరండనుచు'

పూ. ము. నను, 'ముదుటుంగరము' క్రింద - శ. ర. లోను, తంజ. తాళ్ప్రతులు నాలుగింటిలోను 'ఆజ్ఞసేయుఁడని' అను పాఠమున్నది.— పరిష్కర్తలు 'ఆజ్ఞచేయు' అను క్రియ నెరుగక 'కోసిరండనుచు' అని దిద్దినారు.

[2] శా. పా.—'శయ్య - నొరిగి' (ఇది. పూ. ము. పా.)

'శయ్య - కొరిగి' అని తంజ. పా. (ఇదియే జాతీయము.)

‡ శా. పా.—'...మానికమ్ములు భారమైనఁదరణి' (ఇది పూ. ము. పా.).— ...మానికమ్ముల బరణియైన' తంజ. తా. పా.

టీక.— † ప్రామి...తరణి.— ప్రామినుకు = వేదములనెడి - మానిక మ్ముల = మాణిక్యముల (తో నిండిన) - బరణియైన, తరణి = సూర్యుడు; (సూర్యుడు వేదములకు నిలయము.— 'అంశుమాలీత్రయీ తనుః' అమ.) — [ప్రా = శ్రేష్ఠములైన, మినుకు = బంగారు నాణెములును - మానికమ్ముల = కెంపులును - గల ('ప్రా - Excellent - శ్రేష్ఠమైనది.' బ్రౌను.) తరణి = ఓడ, అని అర్థాం.] శరధిఁ మునుఁగఁగాఁ = అస్తమించగా, (సముద్రములో మునిగిపోగా, అని అర్థాం.) నారా యణుండు = విష్ణువు, (మాలిమికాడు - అని అర్థాం.— నారాయణ శబ్దమునకు - నీరు నివాసస్థానముగా గలవాడని వ్యు.) వసుతతిఁ = కిరణసమూహమును, సరగఁ - తిగిచి = వెంట నే తీసి, పైఁ వేయఁబోలుఁ = బయట (ఒడ్డుమీద) వేసియుండవచ్చును. [నారాయణుడు వేదోద్ధారకుడు కావున, శరధిలో మునిగిన త్రయీతనువును బైట వేసి యుండవచ్చునని ఊహ.] $ వసుతతిఁ = సముద్రములో - పడిపోయిన - రత్న

---

ప్రామినుకులను మాణిక్యములుగను, తరణిని బరణిగను చెప్పుట సరసము; పరిపాటియును.—

'తోఁచెఁ బ్రాచీ మహీధరోత్తుంగ సరణిఁ
బ్రాఁజదువు మానికమ్ముల బరణి తరణి.' (పారి. 4–49)

† పూ. టీ.— 'ప్రామినుకు మానికమ్ములు = వేదశ్రేష్ఠములు (మిక్కిలి కాంతి గల రత్నములనియు.)'

వేదములలో శ్రేష్ఠములు; అధమములు; అని రకములు లేవు. కావున పై టీక సరికాదు.—

$ పూ. టీ.— 'పైవసుతతిఁ = మీఁది కిరణ సమూహమును (మీఁదనున్న ధన సమూహమును అనియు.)'

మీఁది కిరణములను - మీఁది ధనమునుమాత్రమే తీసివేసి తక్కిన కిరణము లను - తక్కినధనమును నీటిపాలు చేసెననుట యుచితముకాదు. సంధ్యారాగముతో పోలిక కావున 'వసుతతిఁ = ధనసమూహమును' అనుటయు నుచితముకాదు. ధన శబ్దము సంపద్వాచకముగాని కేవల రత్నవాచకముకాదు. రత్నములు - బంగారు - పశువులు - పంట, మొదలగు సమస్తవస్తుసముదాయము ధన మనిపించుకొనును. ('ధనం- Property, wealth, riches, treasure, money, gold, chattels &c.' ఆప్టే.) కావున కాంతిని చెప్పునప్పుడు 'వసు' శబ్దమునకు ధనమని యర్థము చెప్పుట యొప్పదు. మరియు, ధనమునకు 'కృపీటజాతాప్తి' అసంభవము. పూ. టీ. వారు,

రాశిని ('దేవభేదేఽనలేరశ్మౌ వసూరత్నే ధనే వసు.' అమ.) పైక్ = ఒడ్డుమీఁద, వేసినాఁడు కాఁబోలు, (అని మాలిమికాని పరము.) కాక = అట్లు కానియెడల, అది = ఆ వసుతతి = కిరణసమూహము, కృపీటజాత = (నీటఁబుట్టిన) అగ్నియొక్క, ఆప్తిక్ = సంబంధమును, కాంచనేమి = కలిగియుంటకు కారణమేమి ? నీటమునిగి బయటపడుట వల్లనే - నీటఁబుట్టినవానితోడి సంబంధము కలుగుట - అని చమత్కారము. (సాయం సమయమున సూర్యుని తేజము అగ్నియందు ప్రవేశించునని శ్రుతి ప్రమాణము.).—కాక= అట్లు సముద్రమునుండి బయటపడవేయబడనియెడల, అది = ఆ వసుతతి = రత్నరాశి, కృపీట = నీటియందలి, జాత = పుట్టుకయొక్క, ఆప్తిక్ = ప్రాప్తిని, (=జలములో జన్మించుటను) కాంచనేమి? (రత్నములు సముద్రమున పుట్టుట ప్రసిద్ధము. సముద్రము రత్నాకరము గదా.)

వేదములనెడి బంగారు నాణెములు - కెంపులు నింపిన సూర్యుడనెడి యోడ పడమటి సముద్రములో మునిగిపోగా నారాయణుడనెడి నావికుడు వెంటనే ఆనాణె ములను - కెంపులను జవిరి బయట (సముద్రపుటొడ్డున) వేసెను కాబోలు! (ఆయెఱ్ఱని కాంతు లా నాణెముల - కెంపుల కాంతులే కాబోలు) అట్లు నీటబడుటయే, సూర్య కిరణములకు నీటిపుట్టువు(=అగ్ని)తో సంబంధమేర్పడుటకును, రత్నాలు సముద్ర జలములలో దొరకుటకును కారణము అని తా.

చ. గగనపయోధి దాఁటి రవిగంధవహాత్మభవుండు రేయియన్
జగతికుమారియంతికమునన్ రభసంబున నిల్చి 'వచ్చె నో
యగమున రామచంద్రుఁ' డని యాయపరాంబుధిలంకఁ జొచ్చి పె
ల్లుగఁ దరికొల్పునగ్నిశిఖలో యన † సంధిలె సాంధ్యరాగముల్.

---

'కృపీటజాతాప్తిక్ = అగ్నిసంబంధమును, (జలసమూహసంబంధమును అనియు)— సాయంకాలమున సూర్యతేజము అగ్నియందు ప్రవేశించునని శ్రుతులయందుఁ జెప్పఁబడి యున్నది.' అన్నారు. మరి 'ధన సమూహము' నకును - 'జల సమూహము'నకును గల సంబంధమేమో, చెప్పక వదలినారు. రత్నపక్షమున 'జలజాత' మనగా 'నీటి యందు పుట్టుట' ( = పుట్టుక) గాని - 'జల = నీళ్లయొక్క, జాతము = సమూ హము' అని కాదు. ఆయర్థ మనుచితము.

† పాఠాం.— 'మించెను'

టీక.— రవి - గంధవహాత్మభవుండు = సూర్యుడనెడి హనుమంతుడు, గగన పయోధిన్ = ఆకాశమను సముద్రమును, దాఁటి, రేయి - అన్ - జగతీకుమారి అంతికమునన్ = రాత్రియనెడి సీత దగ్గర, ‡ రభసంబునన్ = సంతోషముతో, నిల్చి, రామ = మనోహరుఁడైన - చంద్రుడు (అనెడి) రామచంద్రుడు, సోయగమునన్ = సొగసుగా, వచ్చున్ - అని (చెప్పి), ఆ - అపరాంబుధిలంకన్ = పడమటి సముద్రమను లంకయందు, చొచ్చి; పెల్లుగన్ =అతిశయముగా, $ దరికొల్పు = రగులుకొల్పిన, అగ్నిశిఖలో = మంటలో, అనన్, సాంధ్యరాగముల్ = సంధ్యాకాలపు ఎఱ్ఱని కాంతులు, † సంధిలెన్ = సమకొనెను. ( = కలిగెను)

గీ. లోకములకంట నలమ వేలాకృశాంగి
మిహిరకరరస మూనిన మిన్ను పెంచు
గదియ సాంధ్యవిభాదీపకలిక యిడఁగఁ
బడినకాటుక యనఁ దమఃపటలి నెఱసె. ౨౬

‡ పూ. టీ.— 'రభసంబునన్ = వేగముగా - నిల్చి'.

వేగముగా పోవచ్చును; వేగముగా రావచ్చును; కాని 'వేగముగా నిల్చుట' యెలాగండీ? రభసమనగ వేగమనియే కాదు; 'సంతోషము' అని కూడా అర్థమున్నది. (చూ. శ. ర.)— "రభసః. joy, pleasure, delight. 'మనసిరభసవిభవే హరిరుదయతు సుకృతేన' - గీతగోవిందమ్". ఆప్టి.)

$ పూ. టీ.— 'దరికొల్పు = కాల్చినటువంటి - అగ్నిజ్వాలలో'. —

'సూర్యుడనే హనుమంతుడు కాల్చిన అగ్నిజ్వాలలు' అంటే అర్థమేమో? అగ్నిజ్వాలలను కాల్చుట యెట్లో? దేనితోనో? అంతా వింతవ్రాత. దరికొల్పుట యనగా అగ్నిని రగులుకొనజేయుట గాని 'కాల్చుట' కాదు.

ఉ. 'ఈ లలితాంగి చంద మొక యించుక చూచెదనంచు ధూర్తగో
పాలుఁడు తాలవృంత మొక భామిని సత్యపిఱుంద నుండి మం
దాలస లీలమై విసర, నాదటఁ గైకొని వీచెఁ దద్వపుః
కీలిత పంచసాయక శిఖిం దరికొల్పుచు నున్న కైవడిన్'. (పారి 1-109)

సీ. 'అందఱఁ జొన్పియం దనలంబు దరికొల్పి'. (భా. ఆది. 3-14).

† పూ. టీ.— 'సంధిలెన్ = (సంధ్యాకాల రక్తిమములు) తగులుకొనెను.'

'సంధ్యాకాలపు రక్తిమములు - తగులుకొనెను' అని తెనుగువారనరు. సంధిలుట యనగా సంభవించుట; ప్రకరణోచితమయిన యర్థము. 'సంధిలుట. To happen, occur, to meet." (బ్రౌను.)—

టీక.— వేలాకృశాంగి = కాలమనే స్త్రీ, లోకములకంటఁ = లోకులకనుల యందు, (కంటఁ - జాత్యేకవచనము.- జాతీయము. 'లోకము = జనము - 'జనవిష్టప యోర్లోకః' నా. ర.) అలమఁ = పూయుటకు, మిహిరకర రసము = సూర్యకిరణములనెడి పసరును, ఊనిన = పట్టించిన, మిన్నుపెంచు = కదియఁ ఆకాశమను పెంకును తగులునట్లుగా, సాంధ్యవిభా = సంధ్యాకాంతియనెడి, దీపకళిక ఇడఁగఁ = దీపముపెట్టగా, పడిన = ఏర్పడిన, కాటుక, అనఁ = అన్నట్లు, తమఃపటలి = చీకట్ల గుంపు, నెఱసెఁ = వ్యాపించెను.

మంచిగంధము, వెల్లుల్లిరసము, మొదలగు ద్రవపదార్థములను పెంకునుపట్టించి ఆపదార్థమునకు సోకునట్లుగా క్రింది వైపున ఆముదపు దీపము నుంచినయెడల కొంత కాలమున కా ద్రవపదార్థమంతయు మసిగా మారిపోవును. (ఆమసిలో ఆముదమును చేర్చి మర్దించినచో కాటుకయగును.) అట్లు మసియేర్పడుటకు 'కాటుకపడిన' దనుట జాతీయము. ప్రకృతమున, ఆకాశము - పెంకు; అందు వ్యాపించిన సూర్యకిరణములే ద్రవపదార్థము. సంధ్యాకాంతి అందు కమర్చిన దీపము. చీకటి - అందేర్పడినకాటుక.

క. చవుదంతి వియన్నదిలో
నవగాహ మొనర్చి చల్లు నలవమథులో నా
దివి *యలచుక్కలు దోఁచఁగ,
దివియలవారిఁ గొని యపుడు తెగువఁ దలారుల్. ౨౭

టీక.— చవుదంతి = ఐరావతము, ('దైవతమదావళంబు చౌదంతి యనఁగ'- ఆం. భా. 1-56.) వియన్నదిలోఁ = ఆకాశగంగలో, అవగాహము - ఒనర్చి = మునిఁగి, చల్లు = పైకెగజల్లిన, అల, వమథులోనాఁ = తొండపు తుంపురులో అన్నట్లుగా, దివి = ఆకాశమునందు - (సప్తమికి ప్రథమ. చూ. ప్రౌఢ. కారక. 20.) అల-చుక్కలు = నక్షత్రములు, తోఁచఁగఁ = ఉదయించగా, దివియలవారిఁ - కొని= దివిటీలవారిని వెంటతీసికొని; తలారుల్, తెగువఁ = సాహసముతో, (అవతలికి అన్వయము.)

---

* శా. పా.— 'యల చుక్కలచేఁ దగ,' ('దివి = ఆకాశము, అలచుక్కల చేఁ = ఆ నక్షత్రములచేతను- (ఆ బొట్టులచేతను - అని స్వారస్యము.' అని పూ. టీ.)

'ఆనక్షత్రములచేత ఆకాశము ఐరావతము తొండపు తుంపురులోయనునట్లుగా తగఁ' అని పూ. టీ. వారు తేల్చిన యర్థము. అది సరికాదు. ఆకాశము నీటి బొట్టులవలె నున్నదనుట యనుచితము. నీటి బొట్టులతో పోల్చ దగినవి నక్షత్రములు గాని ఆకాశము కాదు.

ఆకాశగంగలో అవగాహనము చేయుచున్న ఐరావతము పైకెగజిమ్మిన నీటి బిందువులో అన్నట్లు ఆకాశమున నక్షత్రము లుదయించుచుండగా - (చీకటిపడిన తరు వాత, అని భా.) తలారులు దివిటీల వాండ్రను వెంటగొని. - (పోయి రాకొమరుని యిల్లు ముట్టడించిరి - అని అవతలి కన్వయము.)

౹ చవుదంతి. ప్రకృతి 'చతుర్దంతము.'—

---

'ఆబొట్టులచేతను' - అని స్వారస్యమును చెప్పుట బొత్తిగా తప్పు. ఆకాశ మున 'బొట్టులు' లేనే లేవు. కనుక 'ఆబొట్టులచేతను' అనుస్వారస్యము పుట్టనే పుట్టదు. అసలు, పాఠమే అసాధువు. 'చుక్కలు తోచఁగ' అని పూ. ము. పా. 'దివి యలరేఁ జుక్కలెనయ' అని తంజ. పా.

౹ శాస్త్రిగారు తమ నాగానంద నాటకములో 'చవుదంతి'కి ప్రకృతి 'చతుర్దంతి' అన్నారు. (చూ. పు. 67.) పొరపాటు. ఐరావతము 'చతుర్దంతము' గాని 'చతు ర్దంతి'కాదు.

(1) 'చతుర్దంతము - అ. పుం. ఇంద్రునియేనుఁగు; చవుదంతి.' (శ. ర.)

(2) 'చతుర్దంతము - Double toothed: the name of Indra's elephant.' (బ్రౌను.)

(3) 'చతుర్దంతః. an epethet of Airavata, the elephant of Indra' (ఆప్టి.)

(4) 'చవుదంతి. వైకృ. (చతుర్దంతః) శుద్ధాం. ని.

(5) 'చవుదంతి - (వికృతి) చతుర్దంతము - ప్రకృతి.' (వైకృతదీపిక.)

రామాయణము - సుందరకాండము.—

'రాఘవశ్చమయాదృష్ట శ్చతుర్దంతం మహాగజమ్,
ఆరూఢం శైలసంకాశం చచారసహలక్ష్మణః.' (27-12)
'చతుర్దంతం గజం దివ్యమాస్తే తత్రవిభీషణః
చతుర్భి స్సచివై స్సార్థం వైహాయస ముపస్థితః. (27-33)

'జవ్వని'కి ప్రకృతి 'యౌవని' అనుకొనుట యెట్టి ప్రమాదమో చవుదంతికి 'చతుర్ధంతి' ప్రకృతి అయ్యుండవచ్చుననుకొనుటయు అట్టి ప్రమాదమే,

—♦ తలారులు సారంగధరుని నడవికి కొనిపోవుట ♦—

సీ. రాగిదేరెడుచోకారపునీలిచల్లడం
బులడంబు చీఁకట్ల బలముసేయఁ,
[1]గోరమీసములపైఁ గోపోగ్రరసములు
చిందు ద్రొక్కఁగ మొగాల్ జేవురింప,
మృత్యుదంష్ట్రి లనంగ [2]మీాఱైనలోవంక
కత్తు లున్నతభుజాగ్రముల మెఱయ,
నలుకుమానుసులగుండెలు గుభు ల్లన ఘల్లు
రనుమ్రోఁతగుదెలు వేటాడుచుండ,
ఆ.వె. [3]కూఁక వెట్టి యీాల గొట్టుచు బడిబడిఁ
బాఱు తెంచి చుట్టువాఱుకొనిరి;
దివ్యరత్ననికరదేదీప్యమాన మై
యతిశయిల్లు రాజసుతుని యిల్లు. ౨౮

టీక.— డంబు = కాంతి; జేవురింపఁగ = ఎఱ్ఱవారగా; మృత్యుదంష్ట్రిలనం గన్ = మృత్యుదేవతకోరలో అన్నట్లు, మీాఱైన = గొప్పవియు — భయంకరములు నైన, లోవంకకత్తులు = లోవంపుగల కత్తులు; అలుకుమానుసుల = (తప్పులుచేసి - అందువలన) జంకుచుండు జనుల,—గుండెలు, గుభుల్లనన్ = భయమున క్షోభింపగా, ఘల్లురను—మ్రోఁత గుదెలు = ఘలుఘల్లుమని శబ్దించెడి దుద్దుకఱ్ఱలు, వేటాడు చుండన్ = తాండవించుచుండగా; కూఁకవెట్టి = కేకవేసి, ఈలకొట్టుచున్ =

1 శా. పా.— 'కోఱ':—కోరమీాసములోని రేఫము లఘువుగాని అలఘువు కాదు. (చూ. శ. ర.; సూ. ని.)

2 శా. పా.— మేఱైన' ('మేటి = శ్రేష్ఠము' అని పూ. టీ.)

పూ. ము. నను, తంజ ప్రతులలోనుగూడా 'మీాఱైన' అనియే యున్నది.

"మీాటు Greatness, Grandeur—ఉద్రేకము, గొప్పయు.— 'సాలము వీట మీాటగుగ్' చంద్రాం." (బ్రౌను.)

3 'పీఁకెపెట్టి యీాలపెట్టుచు.'

'కూఁకవెట్టి యీాలగొట్టుచు' అని పూ. ము. పా.— 'పీఁకెబట్టి యీాలపెట్టుచు' అని తంజ. తా. పా. 'ఈలకొట్టు' జాతీయము.)

ఈలవేయుచు, వచ్చి, దివ్య...మానము—ఐ = మేలయినరత్నముల ముత్తములచేత మిక్కిలి ప్రకాశించునదియై, అతిశయిల్లు - రాజసుతునిఇల్లు, చుట్టువాఱుకొనిరి = ముట్టడించిరి.

వ. అప్పు డందుఁ గ్రందుకొను సందడిఁ గొందల మంది పరిజనంబు లేడ్చుచు లోపలికిం బాఱి యబ్బొరి యెఱింగించిన నిప్పు ద్రొక్కిన చందంబున మిట్టిపడి $ తట్టునం బడిన పులుఁగువిధంబున † నిట్టట్టువడి, తరలి పోఁగూడక యావద్రావిసవానిగతి నారటించుచు, మిన్ను విఱిగి పైఁబడిన కైవడి ఱిచ్చవడి, రాకుమారుఁ డాత్మగతంబున.

టీక.— 1 క్రందుకొను సందడిన్ = అధికమగుచున్న కలకలధ్వనిచేత, 2 కొందలమంది = కలతనొంది, అబ్బొరి = ఆయుపద్రవము, తట్టునంబడిన పులుఁగు విధంబునన్ = తత్తరపోయిపడిన పక్షివలె, ఇట్టట్టువడి = తారుమారై, ఆరటించుచున్= ఆరాటమును పొందుచు.

---

$ శా. పా.— 'తొట్టిలంబడిన' (ఇది పూ. ము. పా.) 'తొట్టిలన్=తొట్టిలో' అని పూ. టీ.—

'తొట్లి' అనగా ఉయ్యాల. పక్షియేమి? ఉయ్యాలలో పడుట యేమి? ఒకవేళ పడినను దానికి అందుఁగలుగు బాధయేమి? 'తట్టు (ట్ట) నంబడిన' అని సరియైన పాఠము. తంజ. ప్రతులు మూడింటిలోను నున్నది.—

'వెలువడి పోలేక వెసఁ దప్పివడ్డ - పులుఁగుకైవడి' అని నవ. (పు. 68.)

† శా. పా.— 'ఇట్టట్టు తరలి పోఁగూడక'

'ఇట్టట్టువడి తరలి పోఁగూడక' అని తంజ. పా. 'ఇట్టట్టువడు (శ. ర. లో లేదు.) = to be surprized or shocked' (బ్రౌను.)

(1) పూ. టీ.— 'క్రందుకొను = మ్రోఁగుచున్న'

'మ్రోఁగుచున్న - సందడి' అర్థములేనిమాట. మ్రోతకే సందడియని పేరు. మ్రోగుచున్న సందడి, అని యెవ్వరును అనరు. 'క్రందుకొను = అతిశయించు' సరియైన అర్థము. (చూ. శ. ర.)

(2) పూ. టీ.— 'కొందలము = భయము'

'కొందలము = క్షోభము; కలత.' అంతేగాని 'భయము' కాదు.— (చూ. శ. ర.; సూ. ని.) — 'కొందలము Perturbation, confusion (బ్రౌను). — 'సం, చలతం బొందె వసుంధరావలయ, మాశాచక్ర మల్లాడెఁ, గొందలమందెన్ ద్రిదశేంద్రు పట్టనము' (భా. విరాట. 4-172.)

మ. జననీ నాపయి లేనిదోస మిటు లీర్ష్యం దండ్రితోఁ జెప్పి, యా
యనకుం గోపము[1] రేఁచి, త్రుంచు మన నాహా యెట్లు నోరాడె! నై
నను బో, దా సదసద్వివేకగుణముల్ ధర్మంబుఁ బోకార్చి య
మ్మనుజాధీశుఁడు నట్లసేయఁ దగునే! ♦మందుల్గదా భూపతుల్. ౩౦

టీక.— ఐనను - పో = నీవు చెప్పితివేపో, తాన్ = ఆరాజు, సత్ + అసత్ + వివేకగుణముల్ = మంచిచెడ్డలను విచారించుపద్ధతి, పోకార్చి = నాశముచేసి, అట్లుసేయన్ = నీవుచెప్పిన విధముగానే చేయుట, తగునా? భూపతుల్, మందుల్ గదా = మందబుద్ధులుగదా.

క. ఈలాగున ధర్మము ని
ర్మూలం బై పోవు టెఱుఁగ; మునుపే యెట కేఁ
బోలే నైతి, నయో! విధి
యేలా పో నిచ్చుఁ బ్రాప్తి యిటు లుండంగన్! ౩౧

టీక.— ఎటకేన్ = (తప్పించుకొని) ఎక్కడికైనను, పోలేనైతిన్ = పోక పోతిని.

క. కెరలిపడి జనని దూఱుట,
ధరణీపతి ననుట, వెఱ్ఱితన; మిఁక నేలా
పరితాప మొంద? నాకుం
గఱకంఠుఁడె దిక్కు గాక కలరే యితరుల్? ౩౨

క. అని నిర్విచారుఁ డై యా
మనుజేశకుమారుఁ డనుపమానగభీరుం
డనవద్యశుభాకారుం
డనిమిషగిరిధీరుఁ డున్నయంతఁ దలారుల్. 33

టీక.— అని = ఆరీతిగా నిశ్చయముచేసికొని, అనుపమానగభీరుండు = సాటిలేని గాంభీర్యముకలవాడు; అన...రుఁడు = కళంకములేని మనోహరాకారము కలవాడు; అని...రుఁడు = మేరుపర్వతముతో సమానమయిన ధీరతగలవాడు.

[1] శా. పా.— 'వెంచి' ♦ శా. పా.— 'మత్తుల్'

క. రాసుతుఁ డని *తొడిఁబడఁ దెగి
గాసిని బెట్ట కడియాసఁ గాచుక మన మీ
మోసాల నున్న నెక్కడ
మోసా లగునో యటంచు ముంచినభీతిన్. ౩౪

టీక.— తొడిఁబడన్ తెగి = తటాలున సాహసించి; అడియాసన్ = (ఆలస్యము చేసినయెడల ఆపద తప్పనేమోనన్న) పట్టి ఆశతో, మోసాలన్ = నగరిముంగిట:— ఎక్కడ మోసాలు+అగునో = లేనిపోని నేరము లెక్కడ వచ్చునో, అటంచున్, ముంచినభీతిన్ = అతిశయించిన భయముతో.

క. క్రిక్కిఱిసి నగరిలోనికిఁ
జక్కన † దురదురన చొచ్చి చనుచో, నేమిం
జెక్కు సెమర్పక యుండెడు
నక్కొమరునిఁ గాంచి వార లతిదుఃఖితు లై. ౩౫

టీక.— ఏమిన్ = ఏమియును, చెక్కు చెమర్పక = భయశోకాదులచేత దిటవుతప్పక. ('ఏమిన్' అను 'యు' లోపరూపము సాధువే.— చూ. బాల. శర. పు. 134.)

ఉ. 'కానకుఁ గొంచుఁబో[1] యిపుడె గాళ్ళును చేతులు గోయుడంచు లో
నూనినకిన్క రాజు ముదుటుంగర మిచ్చెను, మాకు బుద్ధి యే ?
మానతి యిండు మీ' రనిన 'నట్లనె సేయుఁడు గొంకనేల రా
జాన యతిక్రమింపఁ దగునా' యని యాదృఢచిత్తుఁ డాడినన్. ౩౬

టీక.— మాకు, బుద్ధియేమి = ఆజ్ఞయేమి? ('ఏమిబుద్ధి' జాతీయము; 'నాకు యేమిబుద్ధి చెప్పుతారు - what would you advise me to do?' - బ్రౌను.) రాజాన = (రాజు + ఆన) రాజుయొక్క ఆజ్ఞ ('రాజాన' - మొగమందము; రాజల్లుడు, వంటిది — చూ. ఆం. భా. శా. సంధి. 32.)

---

* పాఠాం.— 'రాసుతుఁడనుచును దొడిఁబడ'

† 'మలమలనుచొచ్చి'

1 శా. పా.— 'యిపుడు' (ఇది పూ. ము. పా.) 'యిపుడె' తంజ. పా. సముచితము.

ఉ. 'ఏయెడఁ గోపగించి ధరణీశుఁడు, గొల్చిన వారి నే క్రియం
జేయుఁ డటన్నఁ గా దనక చేయవలెం గద*యంచు నట్టిటుల్
రాయిడి చేసి కర్కశపురజ్జువుల న్నవమోహనైక శే
ఖాయుత దేహునిన్ విఱిచి కట్టి రయో పెడచేతు లంటఁగన్. ౩౭

టీక.— రాయిడిచేసి = అటుఇటు లాగిబాధపెట్టి, కర్కశపురజ్జువులన్ = బిరుసైనతాళ్ళతో, నవ...హునిన్ = మిక్కిలి సుకుమారయిన శరీరముగల ఆసారంగ ధరుని, పెడచేతులు విఱిచి = చేతులను వెనుకకుతీసి, అంటఁగన్ - కట్టిరి.

క. చిందె నట హారములు దెగి
క్రొందెలిముత్యములు, పెన్నెఱు ల్వీడి విరుల్
జిందెను, మును సింగారము
చిందుచు నున్నాఁ డటంట సిద్ధము గాఁగన్. ౩౮

టీక.— సింగారము చిందుచునున్నాఁడు-అటంట=సౌందర్యమొలుకుచున్నాడు-అనుమాట, సిద్ధముకాఁగన్ = నిజమే అగునట్లుగా, అట = ఆసమయమున, హారములు తెగి, క్రొందెలిముత్యములు = క్రొత్తవి తెల్లనివి అయిన ముత్యములు, చిందెన్= చెదిరిపడిపోయెను, పెన్నెఱుల్ వీడి = తలవెండ్రుకలు విరియబడి, విరులన్ చిందెను= తలకట్టులోని పూవులును చెల్లాచెదరుగా పడిపోయెను.

సింగారము చిందువాడు గనుకనే ఆతని హారములలోని ముత్యాలును, తలలోని పూలును చిందినవని చమత్కారము.

గీ. ఇట్టు లారాచపట్టిని బట్టి చాల
గొట్టు సేయుచు నడురేయిఁ గొంచుఁ బోయి
$ నఱకుద మటంచు నప్పు డానగరికడన
యుంచి ‡వా రింత నంతఁ గా వుండి రంత. ౩౯

---

* శా. పా 'యన్నన్'

పై వాక్యములు భటులవి. 'ధరణీశు డాజ్ఞాపించినట్లు భృత్యులు చేసితీరవలె గదా యనుచు - ఆభటులు సారంగధరుని రాయిడచేసి పెడచేతులంటఁగట్టి' రూ. ము. రని పద్యార్థము. కావున 'చేయవలెంగద - యన్నన్' అను పాఠము సరికాదు. నను, తంజ. ప్రతులు నాలుగింటిలోను 'యంచున్' అను పాఠమే యున్నది.

$ శా. పా.— 'నఱకుదుమటంచు.' - తప్పు.

‡ శా. పా.—'వా, రంతనంతగా నుండిరి.' (ఇది పూ. ము. పా.)—

టీక.—గొట్టుచేయుచున్ = బాధించుచు, కొంచుఁబోయి, ఆనగరికడన = ఆనగరికి సమీపముననే, (ఒకచోట) ఉంచి, వారు = ఆతలారులు, ఇంతనంతన్ = ఇవతల - అవతల, కాపుండిరి = కాపలాయుండిరి.

గీ. అదురుగడ గాఁగ నవ్విధం [1] బంత దెలిసి
బెగడి యేడ్చుచుఁ జేతులు పిసికికొనుచుఁ
జెమ్మరించుచు 'నో యమ్మ చెల్ల! యేమి
సేయుదుమొ!' యంచు రత్నాంగి చెలులు మిగుల. ౪౦

టీక.— అవ్విధంబంత = ఆసంగతి అంతా, అదురుగడగాఁగన్ - తెలిసి = అదాటున విని. బెగడి = భయపడి, ఓయమ్మచెల్ల = అయ్యో.

క. తల వీడఁ బాఱి, తమ గా
దిలియేలికసానితోఁ దదీయవిధంబున్
దెలియఁగఁ జెప్పిన, హా! యని
[2]నిలువుకు నిలువుననె యొరగి నేలం బడియెన్. ౪౧

---

'అంతంతగానున్నారు' (= అంతనంతగా నున్నారు) అను పలుకుబడికి లోకమున 'పట్టీపట్టక - అశ్రద్ధగా నున్నా'రని యర్థము. దూరదూరముగా నున్నారను నర్థమున 'అంతనంత నున్నా'రనవలెను.

ఆ. వె. 'వచ్చి కొలువుసొచ్చి నెచ్చెలిపిండు నం
తంత నిలువఁబనిచి.' (భా. విరాట. 1-246.)

తంజ. ప్రతులు నాలుగింటిలోను 'వా, రింతనంతఁ గాపుండిరి' అను పాఠమున్నది. ఆపాఠము-చితతరము. 'ఇంతనంత' అను పలుకుబడి సుప్రసిద్ధము.

గీ. 'ఏను బ్రహ్మయు హరియును నింతనంత
నుండు వారము కార్యప్రయోగదీక్ష.' (హర. 6-40.)

క. 'నెఱసి తమ మెల్లయెడఁ గ్రి
క్కిఱిసిన మఱి పాసినిలిచి రింతను నంతన్.' (విరాట. 3-195.)

[1] శా. పా.— 'బందుఁ దెలిసి'

'అందు తెలిసి'. అనగా ఎందుఁ దెలిసి? పూ. ము. నను, తంజ. ప్రతులలోను గూడా 'అంత దెలిసి' అని యున్నది.

[2] శా. పా.— 'నిలిచిన నిలువుననె.' ('నిలువున్నిలువుననె' పూ. ము.) తంజ. ప్రతులలో - మూడింటిలో 'నిలువుకు నిలువుననె' అని యున్నది. అది సరియైన జాతీయము. '...సొరగి' అని పాఠాం.

టీక.— తలవీడఁ-పాటి = కొప్పులు వీడిపోవునట్లుగాపరుగెత్తి, తన, గాదిలి యేలికసానితోఁ = ప్రియమైన దొరసానితో, నిలువుకు నిలువుననె ఒరగి = నిలుచున్నది నిలుచున్నట్లుగానే విరుగబడి.—

గీ. నోరఁ దడి లేక యప్పు డానీరజాక్షి
కంటఁ బుట్టెడు కన్నీరు గాఱఁ బొరలి
పొరలి యేడ్చుచునుండ నబ్బోటు 'లేల
కస్తిపడె దమ్మ' యని యెత్తి కుస్తరింప. ౪౨

టీక.— ఏలకస్తిపడెదు = ఎందుకు దుఃఖపడెదవు. అని, ఎత్తి = లేవనెత్తి, కుస్తరింపఁ = ఓదార్పగా.

## —♦ రత్నాంగి చిత్రాంగి సంవాదము ♦—

క. *అప్పుడట దెలిసి మదిలో
ముప్పిరిగొను పుత్త్రిమోహమున, సకియలు తనఁ
గప్పుకొని వెంట రాఁగా
నప్పావనచరిత మహితలాధిపు కడకున్. ౪౩

టీక.— తనఁ - కప్పుకొని = తన్నుచుట్టుకొని.

మ. జిలుగుంబయ్యెదకొంగు జాఱి వెనుకన్ జీరాడ, ముత్యాలపే
రులు వక్షోజతటిం బుటం బెగయఁగాఁ, ద్రోపాడఁ జన్నుల్, కటి
స్థలిపై వేనలి మొగ్గవాల, నడుగుల్ చండింప, నేత్రాంబుజం
బులు గన్నీట వసంతమాడ, నరిగెన్ బూఁ బోఁడి ఖేదంబునన్.

టీక.— ముత్యాలపేరులు = ముత్యాలహారములు, వక్షోజతటిన్ = కుచపార్శ్వమున, పుటంబెగయఁగాన్ = ఎగిరి పడుచుండగా, చన్నుల్, త్రోపాడన్ = ఒండొంటి నొరసికొనుచుండగా, వేనలి = జడ, కటిస్థలిపై = పిరుదుమీద, మొగ్గవాలన్ = మొగ్గవాలిన విధముగా నుండగా, అడుగుల్, చండింపన్ = తడబడగా, నేత్రాంబు

---

* శా. పా.— 'అప్పుడు దెలిసియు' (ఇది పూ. ము. పా.)

'అప్పుడటుదెలిసి' అని తంజ. ప్రతులపాఠము. అట్లు (చెలికత్తెలు కుస్తరించుట చేత) తెలివినొంది... ఆమె రాజుకడకు పోయెనని యన్వయము. అప్పుడు తెలిసియు పోయె' ననుట తప్పు.

జంబులు = కమలములవంటి కన్నులు, కన్నీటన్ - వసంతమాడన్ = కన్నీళ్ళను గ్రుమ్మరించుచుండగా, పూఁబోఁడి = రత్నాంగి, ఖేదంబునన్ = దుఃఖముతో.

క. అరుగు నెడ నంతిపురమున
నరవిరిపాన్పుపయి § నొరగి యావల ధరణీ
శ్వరుఁడును నీవల నొకయం
తరువునఁ జిత్రాంగి, చెలులుఁ దా, నుండంగన్. ౯౫

టీక.— అరవిరి పాన్పుపయిన్ = అరవిచ్చిన పూలపానుపుమీద; ఒక, అంతరువునన్ = మరుగుప్రదేశమున.

గీ. అనఘ చారిత్ర యెవ్వ ‡ రేమనినఁ గాని
గెరలని సుశీల సంపన్న; గేస్తురాలు;
అత్తరుణిఁ జూచి యపుడు నోరెత్తి పలికెఁ;
†దాళనిచ్చునె పుత్త్ర వాత్సల్య మెదను? ౯౬

టీక.— ఏమనినఁగాని = (తన్ను గూర్చి యెవ్వరు) ఏమన్నప్పటికిని, కెరలని= కోపపడని, సుశీలసంపన్న = ఉత్తమస్వభావసంపదకలది, గేస్తురాలు = ఇల్లాలు (అయిన రత్నాంగి) నోరెత్తిపలికెన్ = బిగ్గరగా మాట్లాడెను. (నోరెత్తి పలుకుట యిల్లాలికి ఉచితము కాకపోయినను ఆమె పుత్రశోకము భరించలేక కోపోద్రేకము నడంచుకొనలేక అట్లు మాట్లాడినదని భా.) పుత్రవాత్సల్యము, ఎదను = హృదయమును, తాళనిచ్చునె = ఊరకుండనిచ్చునా?

సీ. "మగనికూరిమి గల్గి జగములో మిక్కిలి
వన్నె కెక్కినయట్టివారు లేరె?
యిల భోగభామినుల్ కుల¹పాలికలకంటె
మేరగా నడచినవారు లేరె?

---

§ 'నొఱగి' అని శ. ర. పా. (చూ. 'అంతరువు')

‡ శా. పా.— 'ఏమన నొకింత గెరలని.' (ఇది పూ. ము. పా.)

ఏమనినను = ఏమన్నను, అనవలసినచోట 'ఏమనన్' అనుట సరికాదు. 'ఎవ్వరేమనినఁగాని' అని తంజ. పా. వావిళ్ళవారి ప్రతిలోనేకాదు, సూ. ని. లో గూడా శాస్త్రిగారి తప్పుపాఠమేయున్నది. (చూ. 'గేస్తురాలు'; 'కెరలు'.)

† శా. పా.— 'తాళవచ్చునె పుత్త్రవాత్సల్య మెచట'.— అర్థమేమో?

1 శా. పా.— 'కులభామినులకంటె.'

సవతిపట్లను నీసు సవరింప కేపట్ల
గారాబమునఁ బెంచువారు లేరె?
నెనరుతోఁ బినతల్లి యని కొమా ళ్ళింటికి
వచ్చిన దయఁ జూచువారు లేరె?

గీ. తగునె యక్కట! బుధనుతోదారగుణవి
రాజి సన్మార్గవర్తనఁ దేజరిల్లు
పరమసాధువు సారంగధరునిమీఁద
నొకటికిఁ బదాఱు [2]గల్పించితో లతాంగి. ౮౭

టీక.—భోగభామినుల్ = భోగకాంతలు, కులపాలికలకంటెన్ = కుల స్త్రీలకంటెను, మేరగాన్ = మర్యాదగా.— సవతి - పట్లను = సవతి - బిడ్డలను, (పట్టి - పట్టులు - పట్లు.) ఏ పట్లన్ = ఎట్టిసమయములందును, ఈసు సవరింపక = ఈర్ష్యవహింపక,—నెనరుతోన్ = ప్రేమతో;[1] బుధ...విరాజి.— బుధ = విద్వాంసులచేత, నుత = కొనియాడబడిన, ఉదారగుణ = ప్రసిద్ధగుణములచేత, విరాజి = ప్రకాశించువాడును; సన్మార్గ...సాధువు.— సన్మార్గ (సత్ + మార్గ) వర్తనన్ = మంచిమార్గమున వర్తించుటచేత (= మంచి నడవడికలిగి) తేజరిల్లు = వెలుగొందు, పరమసాధువు, (అయిన) సారంగధరుని మీద, ఒకటికి పదాఱు (తప్పులు) కల్పించితివి. ['ఒకటికి పదాఱు కల్పించుట' లోకోక్తి. ఒకటి నాధారముచేసికొని పదారు కల్పించుట యని భా. సారంగధరుడు తనయింటికివచ్చుట నాధారముచేసికొని చిత్రాంగి తక్కిన కథను కల్పించినదన్నమాట.]

బుధ = దేవతలచేత, కొనియాడబడిన, ఉదారగుణ = దానగుణముచేత, (చంద్రుడు దేవతల కమృతము నిచ్చువాడు.— 'ఉదారోదతృమహతోః ఖ్యాతే దానశౌండే మహత్యపి'- నా. ర.) విరాజి; సన్మార్గ (సతాం నక్షత్రాణాం మార్గః సన్మార్గః) = నక్షత్రమార్గమున అనగా ఆకాశమున, వర్తించుటచేత, తేజరిల్లు=ప్రకాశించు, సారంగధరునిమీఁదన్ = చంద్రునిమీద, ఒకటికి పదాఱు (కళలు). (అని, అర్థాంతరము.)

---

2 పాఠాం.—'కల్పించ-నో'

[1] పూ. టీ.— 'బుధ...ర్తనన్ = విద్వాంసులచే కొనియాడఁబడిన గొప్ప గుణములచే ప్రకాశించెడు మంచిమార్గమున నడవడిచేత.'

మార్గము గుణములచేత ప్రకాశించునా? 'మార్గమున నడవడి' అంటే అర్థమేమో? అర్థాంతరసౌభాగ్యమసలే అంతరించినది గదా!

చ. పడుచుఁదనానఁ [1] బట్టి నినుఁ బట్టి పెనంగె నటంచు, లేని యా
గడములు గొన్ని యంగమునఁ గానఁబడన్ సవరించి, యీసుచేఁ
దొడిఁబడఁ బోయి ప్రాణవిభుతో నెఱిఁగించి, తెగించి వాని నో
పడఁతుక యాజ్ఞ సేయు మని పంచితి; [2] వెంతటి కెత్తుకొంటివే! ౭౮

టీక.— పట్టి = నాబిడ్డడు, పడుచుఁదనానన్, నినున్ - పట్టి = బలాత్కరించి, ఆగడములు = అకృత్యములు,—అంగమునన్ = శరీరమున, కానఁబడన్ - సవరించి = కనబడునట్లు కల్పించుకొని, - ఆజ్ఞసేయుమని = నరికించుమని, పంచితివి = ఆజ్ఞాపించితివి; ఎంతటి కెత్తుకొంటివే = ఎంతటి ఘోరకార్యమునకు పూనుకొన్నావే.

'ఎంతటి కెత్తుకొంటివి' (=ఎంత కెత్తుకొంటివి) జాతీయము.—

సీ. " దయయింతలేక యెంతకు నెత్తుకొంటి ర
కట్టా మిమ్ముఁ గన్నదిగాక తల్లి." (శుక. 4-42.)

చ. పొలఁతుక లెస్స యున్న నోకపూఁటయుఁ జూడఁగ జాలవీవు, మా
యల కొడిగట్టి, తెంతటి [3] గయాళివె! బేరజపుణ్ విచారముల్
దెలియనివానిపైఁ గలవి లేనివి †చాల ఘటించి తండ్రి బి
డ్డల కెడ సేయఁ జూచి తకటా! [4] మఱి నీకిది యెంత దోసమే. ౭౯

టీక.— లెస్సయున్నన్ = మేము సుఖముగా ఉంటే; - బేరజపుణ్ విచారములు = కుత్సితపు తలపులు.

1 శా. పా.— 'వచ్చి'

2 పాఠాం.— 'ఎంతకు నెత్తుకొంటివే'

3 శా. పా.— 'ఎంతటి గయాళివి.'

† పాఠాం.— 'కొన్ని గడించి.'

4 శా. పా.— 'మది.'

చ. కఱకుఁదనంబుతోడఁ ‡గసుఁగందని యాత్మఁ దలంపవైతి, వి
త్తెఱఁగు వినం గలుక్కు మనదే †మగవారిమనంబు? వెన్కముం
దఱలను బిడ్డఁ బాప మమతం గని పెంచినదాన వైనఁగా
యెఱుఁగుదు? గొడ్డురాలి కిల నెక్కడిమోహము లెంచి చూడఁగన్.

టీక.— కఱకుఁదనంబుతోడన్ = పరుషవృత్తితో (= కనికరము లేనిదానవై) కసుఁగందు = పసిబిడ్డడు, అని - తలంపవైతివి. ఇట్టి తెఱంగువినన్ = ఇటువంటి కథలువింటే, మగవారిమనంబు - కలుక్కుమనదే? = నొచ్చదా? (మనసు నొచ్చి విరిగితే మగవారెంతటి శిక్షలైనను చేయింతురుగదా?)

‡ శా. పా.— 'కసుగందని' ('కసుగందు = లేఁతబిడ్డ' అని పూ. టీ.)

లేఁతబిడ్డ - అను నర్థమున 'కసుఁగందు' సార్థబిందుకము.— దండకము. 'కావు కావంచు నేడ్పుల్' దలిర్పం గసుంగందవై' (పారి. 3–38) వేదంవారు ద్వి. సారంగ. లో కూడా 'కడుపునఁబుట్టిన కసుగందు నిట్లు' (పు. 112) అని నిరనుస్వారముగానే ముద్రించినారు; పొరపాటు. అరసున్న లేని 'కసుగందు' క్రియ. 'కసుగందు (కందు+ కందు) = మిక్కిలివాడు'. (శ. ర.)

శాస్త్రిగారు 'కసుఁగందు' - అను క్రియలోని 'కసు' ను 'కసురు' అనుకొని, ఆముక్త (పు. 42) లో - 'కసుగందని మేనులన్.— కసుగందని = కసురుఁదనము (లేఁతదనము) చెడని, మేనులన్ = దేహములతో' అని అర్థము వ్రాసినారు. 'కసుగందు' అను క్రియలో 'కసు' అను పదమొకటి యున్నదనుకొనుటయు దానికి లో 'కసురుఁదనము' అని యర్థము చెప్పుటయు, పొరపాటు. 'కసుఁగందు'లో 'కసు'; 'పసివాడు'లో 'పసి'; 'పిట్టపిడుగు'లో 'పిట్ట'; 'బట్టబయలు'లో 'బట్ట' ఉన్నట్లు భావించి ఆపదములకు అర్థకల్పనము చేయుట తప్పు.

† శా. పా.— 'పగవారిమనంబు'.— తక్కిన ప్రతులలోను ఇదే పాఠమున్నది. కాని పగవారిమనంబు, కలుక్కు మనుటకు కారణమేమి? అనుగాక. పగవానిమనసు కలుక్కుమన్నను, తళుక్కుమన్నను దానివలన కలుగు ఉపద్రవమేమి? ఇంటిలోని 'మగవారి' మనస్సు కలుక్కుమంటేనే యిబ్బంది. కావున 'మగ' అని నేను సవరించినాను.

క. §పినత ల్లివి, పెనుపఁగ నో
పినత ల్లివి, గాన వచ్చి పిలిచిన నయ్యో!
కనికరము లేక వానిం
గని కరము నిరాపనింద గట్టం దగునే? ౫౧

§క.— పినతల్లివి = పిన్నమ్మవు, పెనుపఁగనోపిన - తల్లివి = పోషింపజాలిన పూజ్యురాలవు. (ఇక్కడ 'తల్లి' పూజ్యవాచకము - మాతృవాచకము కాదు.) కాన = కాబట్టి, వచ్చి, పిలిచినన్ = పిలిస్తే, వానిన్ - కని = వానిని చూచి, (మోహించి) కనికరములేక = దయలేక, కరము - నిరాపనింద = వట్టి అబద్ధపు నింద, కట్టందగునే?

చ. కటికిమనంబుతో నిటులఁ గల్లలు చెప్పిన నాతఁ డైనఁ దాఁ
గటకట †యట్టివాఁ డవును గాఁ డని రెండును నిశ్చయింపకే
యెటువలె నాజ్ఞ వెట్టు మనెనే తరళాక్షి, కుమారుఁ డంచు న
క్కటికము లేక! యాఁ, జెవులె కన్నులు రాజులకుం దలంపఁగన్

టీక.— కటికిమనంబుతోన్ = కఠినమైన మనస్సుతో,—అక్కటికము=దయ, రాజులకున్ - చెవులె కన్నులు = రాజులు చెప్పుడుమాటలనుబట్టి పోవువారేగాని స్వయముగా విచారించి తెలిసికొనువారు కారు.

ఉ. [1]ఏసడిసన్న మానిసివె? యేమి యెఱుంగవు [2] పారుప ట్టయో

---

§ శా. పా.— 'పినతల్లని'...నోపిన తల్లని' ('తల్లని = తల్లి + అని' పూ. టీ.) పూ. ము. నను, తంజ. ప్రతులలోను, 'నిరాపనింద' అను పదము క్రింద శ. ర. లోను గూడా 'పినతల్లివి...నోపినతల్లివి' అను చక్కని పాఠమున్నది. కావున 'తల్లి + అని = తల్లని' ఉచ్చారణకటుపాఠము సరికాదు.

† శా. పా.— 'యిట్టి' ('యట్టి తంజ. పా.)— 'యట్టి వాఁడవునుకాదన కూరక ...' పాఠాం.

1 శా. పా.— 'ఏసడిసన్నమానిసివో (=ఎట్టి యింగితజ్ఞురాలవో'అని పూ. టీ.) పూ. టీ. సరియైనది కాదు. (చూ. ౨-౨౬౩ క్రింద), 'మానిసివోకింత' అని పూ. ము. పా.; ' మానిసివె యింత' తంజ. పా.

2 శా. పా.— 'పాఱుపట్టివే' ('=పరుగులాడుచున్న నిసువవు'-అని పూ.టీ.). 'ఎట్టి యింగితజ్ఞు రాలవో - పరుగులాడుచున్న నిసువవు' అంటే సమన్వయ

వేసర కెన్ని నేరిచితివే మటుమాయలనీలికాన, [3] నా
మూసినముత్తెమై [4] మెలగు ముద్దుఁ గుమారునిమీఁద నెట్టుగాఁ
జేసితి వింత? మచ్చరము చెల్లు నటే మఱి యాఁడుదానికిన్?" ౧౩

టీక.— ఏసడిసన్నమానిసివె = ఎంతటి ఉత్తమరాలవె? పారు - పట్టు = కష్టసుఖములు - ఏమి యెఱుంగవు - (ఇది యెత్తిపొడుపు) మటుమాయల నీలికాన = మాయలమారి నాలిముచ్చా, మూసినముత్తెమై = ఏపాపము నెఱుఁగనివాఁడై, మెలఁగు - నా ముద్దుకుమారుని మీదన్, ఇంత ఇంతటివ్యవహారము, ఎట్టుగాన్ = ఏరీతిగా, చేసితివి?

క. అని *యామెయాడుమాటలు
విని తాళఁగ లేక, బిగువు వెలయఁగ, నపుడా
వనితామణి యిట్లనియెన్
జనితామర్షమునఁ జూపు జంకెనఁ జూపన్. ౧౪

టీక.— బిగువు వెలయఁగన్ = తనపంతము నెగ్గినన్న దీమసమునను, రాజు తనవాఁడై యున్నాఁడన్న గర్వమునను, కలిగిన బిగువు ప్రకటితముకాగా, ఆ వనితామణి = చిత్రాంగి, జనిత అమర్షమునన్ = ఉద్రేకించిన కోపముచేత, చూపు, జంకెన చూపన్ = బెదరింపును తెలుపగా, ఇట్లనియెను.

---

మెట్లో? భావమేమో? నాకు తెలియలేదు. 'పాఱుపట్టియో' అని పూ. ము. పా.; 'పాఱుపట్టియో' అని మద. తా. పా.—

'పారుపట్టెఱుగు' జాతీయము.— 'దూరదృష్టిగనరు దొట్టినదనుకను, పారుపట్టెఱుగరు పడినదనుక'. వేమన (చూ. బ్రౌణ్య. 'తొట్టుట').

3 శా. పా.— 'యా - మూసిన ముత్తెమై - వెలుఁగు' ('వెలుగు' అని పూ. ము. పా.)

'వెలుగు' లో అరసున్న లేకుండుట తప్పని శాస్త్రిగారు అరసున్న పెట్టినారు అంతేగాని మూసిన ముత్తెమేమి? వెలుఁగుట యేమి? అది యోచించినవారు కారు. వెలుఁగమిని తెలుపు సందర్భముననే 'మూసిన ముత్తెము - పాసిన పగడము' అని లోకమున వాడుక. కావున శా. పా. తప్పు. 'నా - మూసిన ... మెలఁగు' అని సరియైన పాఠము. తంజ. ప్రతులలో ఉన్నది.

4 శా. పా.— 'ఎటుగాఁ జేసితి వింత మచ్చరము? చెలునటే...దానికిన్?'

* శా. పా.—'తానాడిన' ('ఇది పూ. ము. పా.) 'యామెయాడిన' తంజ. పా

చ. [1]జలరుహనేత్ర నన్నిపుడు సారెకు దూఱుచుఁ జేరి నిక్కుచున్
నిలుగుచు విఱ్ఱవీఁగుచును [2]నిక్కము గాఁగను నాతఁడేమియున్
దెలియఁడు సాదుబిడ్డఁ డని నేరుపుమాటలఁ దేలనాడి, గా
దిలిసుతుచేతఁ జక్కటులు దిద్దెద వెంతటి నంగనాచివే! ౧౧

టీక.— జేరి=చెలరేగి, — సాదుబిడ్డఁడని = మంచి పిల్లవాడని, — గాదిలిసుతు చేతన్ = నీముద్దులబిడ్డడు చేసిన చేష్టయందు, చక్కటుల దిద్దెదవు = తప్పులేదని తీర్పులు తీర్చెదవు.— ఎంతటి నంగనాచివే = ఎంతటి మాయలాడివే.

'నంగనాచి.' ఈపదము అతి చమత్కారము కలది (మాయలమారి) అనునర్థమునను, అమాయకురాలు అను నర్థమునను గూడా వ్యవహృతమై యున్నది.— (చూ.శ.ర.)

(a) "లజ్జించి బుజ్జవంబునం బొదరిండ్లకుఁ దార్చి కాంతులం గవయు నంగనాచులగు నంగనల యంగంబుల పస." (మను. 3—43) 'నంగ...నల=ప్రౌఢలై యుండిన్ని బయటికి యేమి నేరని వాండ్లవలెనుండేటువంటి స్త్రీలయొక్క' అని జూ. టీక.

(b) "నంగనాచులమానగు - నంగవస్త్రములబాగగు - ముంగురులను గని యంతరంగమునను - ఆశించక, తప్పి బ్రతికిపోవ తరమా! రామ!" (త్యా. కీ. ౧౧)

(c) "సింగారములకుప్ప చెలియ నీకొడుకు - నంగనాచియటన్న సర్వరాజనులు' (కూ. తి. సారంగ. పు. ౩౩) ఇక్కడ 'నంగనాచి = ఏమియు నెరుగనివాడు.'

ఉ. ‡వేదులు పల్కిన న్నదర ప్రేయఁగఁ జూచెద, విందు నంత యం
బేదలు లేరు; నీవు కడుఁ బెద్దఱికా ల్పచరించి యూరకే
†వాదులు చేసె దేల చెలువా? యవ్వఁ గా దనువారు లేరఁటే?
సాదుపిసాళి నీదుతనుజాతుఁడు; వాఁ డలపిన్న పాపఁడే? ౧౭

1 'జలరుహపత్రనేత్ర నిడుసాగిలఁ బెట్టుచుఁ జాలనిక్కుచున్' అని తంజ. ప్రతులపాఠము. బ్రౌను, 'సాగిలబెట్టుట - To fall prostrate - దండప్రణామము చేసుట' అన్నాడు (శ. ర. లో. సాగిలపడు; సాగిలపెట్టు, అనుక్రియలు రెండును లేవు.)

2 పాఠాం.— 'నిక్కముగా నతఁడేమి దోసమున్.'

‡ పాఠాం.—'వేదురుబట్టి.' †'వాదుకువచ్చెదేల.' ఈపాఠము తంజ. ప్రతులు నాలుగింటిలోనున్నది. 'వాదనచేసెదేల' అని, సూ. ని. పాఠము. (చూ. అంబేద.) అసాధువు. వాదనమనగా - వాద్యపుమోతగాని వాగ్వివాదముకాదు.—

"వాదనము = వీణాదిచతుర్విధవాద్యధ్వని" (శ. ర.)

"వాదనము = Sound, Sounding, beating. వీణాదిధ్వని - వాయించడము" (బ్రౌను.)

"వాదనము = Sounding - Instrumental music." (ఆప్టే.)

టీక.— వేసులు = అడావుడిమాటలు, ('వెగటుమాటలు' అని, శ. ర.) అదర ద్రేయఁగన్ = బెదరగొట్టుటకు, అంబేదలు = నోరుచచ్చినవారు. పెద్దతికాల్ పచరించి = డంబాలు ప్రకటించి, వాదులు చేసెదేల = వాగ్వాదములు పెంచెద వెందుకు? సాదుపిసాళి = సాదుపలువ. (=కానరాని కొంటె.)

ఉ. ఎంతకు [1] లేవు? బాలుఁ డనియే పచరించెద, వింతె కాక నా
చెంతకుఁ జేరి నీకొడుకు చేసినచేఁతఁ దలంప వైతి; వో
కాంత, నిజంబె [2] యెవ్వరును గాశికిఁ బోయినసుద్దులే ప్రతి
ష్ఠింతురు గాని యానడుమఁజేసినదోసము లెంచరే కదా. ౫౬౭

టీక.— ఎంతకులేవు = ఎంతకైనను కలవు (=ఎంతపని చేయుటకైనను సమర్థురాలవే అని భా.) — (నీకొడుకు) బాలుఁడనియే, పచరించెదవు = ప్రకటించెదవు. ఇంతేకాక = ఇంతేకాని, - చేసిన - చేఁత = చేసిన (దుష్ట) చేష్ట, తలంపవైతివి. నిజంబె = నిజమే (-ఇదిలోకములో ఉన్న లక్షణమే.) ఎవ్వరును = ఎవరుగాని, కాశి...సుద్దులే = కాశికిపోయివచ్చుట యను ఘనకార్యమునే, ప్రతిష్ఠింతురు=గట్టిగా చెప్పుదురు. కాని; ఆన...దోసములు — ఎంచరేకదా = చెప్పరుగదా!

'ఎంతకులేవు' - జాతీయము. 'ఎంతకులేఁడు నారదమునీంద్రుఁడు'(పారి.1-80.)

ఉ. ఏల § వితాదిసంతు లివి యెవ్వరు మెత్తురు? నోరిలోపలన్
ద్రే లిడినప్పుడుం గఱవ నేరఁడు నీసుతుఁ డడ్డపాప గాఁ
డే లలితాంగి, నీ వనక ‡ యే రిఁక నందురె? యాయెఁ బొమ్ము చా
ల్చాలును వ్రేళ్ళసందులను జాఱెడువారలు లేరి యెవ్వరున్. ౫౬౮

---

[1] శా. పా.— 'లేఁడు' (తంజ. ప్రతులు మూడింటిలోను 'లేవు' అనియే యున్నది. అదియే యుచితపాఠమని నాకు తోచినది.)

[2] శా. పా.— 'యేరికిని...ప్రకాశింతురు' (ఇది పూ. ము. పా.) అర్థమేమో? (పూ. టీ. లేదు.) 'యెవ్వరును ... ప్రతిష్ఠింతురు' తంజ. తా.పా.

శా. పా.— § 'బజాటీఅంతులివి' (= 'అంకులాఁడి జగడములు' - అని, పూ. టీ.)

ప్రాచీనముద్రణమునను, 'బజాటి' అను పదముక్రింద శ. ర. లోను, ఈపాఠమే యున్నది. కాని, తంజ. తాళ. ప్రతులు నాలుగింటిలోను, మదరాసు తాళప్రతిలోను 'వితాదిసంతు' లను పాఠమున్నది. అది యుచితతరమని నాకు తోచినది.

పాఠాం.— ‡'యేనిఁకనందునె'.

టీక.— వితాదిసంతులు = పనికిమాలిన ప్రసంగములు. నోరి... నేరఁడు = నోట్లో వేలుపెట్టితే కొరుకలేడు. (అని లోకోక్తి.) అంత బొత్తిగా నేరనివాడు, అని భావము. అడ్డపాప = పసిబిడ్డ.— (వేళ్ళ... వారలు = (జాతీయము) పనికిమాలిన వాండ్లు, ఇటు - ఎవ్వరుఁ లేరు.

క. సూనుఁ డని చాల నెంజిలి
౧ యానెదుగా 'తల్లి; దోసః' మన కిటు బలిమిఁ
బోనీక పట్టి పెనఁగిన
వానిఁ మఱి యేమి సేయ వలయుం జెపుమా? ౯౯

టీక.—నెంజిలి - ఆనెదుగా = మనోవ్యథనొందుచున్నావుగదా, (ఈమె నాకు) తల్లి, (అంటుట) దోసము - అనక.—

వ. అని పలికినచిత్రాంగిపలుకులు చెవులకు ములుకులఁ$పోల్కిని గీల్కొనిన నచ్చిలుకలకొలికి యులికిపడి యాచెంత నున్న మహీకాంతునిఁ ♦గని యార్తరవంబున నిట్లనియె. ౬౦

టీక.—ములుకులపోల్కిని = బాణములవలె, కీల్కొనఁ = (గ్రుచ్చుకొనగా) ఆర్తరవంబునఁ = దీనధ్వనితో = ఏడ్చుచు.

—♦ రత్నాంగి రాజుతో మొఱపెట్టుకొనుట ♦—

§చ. "పెనఁగినఁ బోవ నీక పసిబిడ్డఁడు వాఁ డఁట! యమ్మచెల్ల! కా
దనఁ దను నంట వచ్చెనఁట! తక్కినమాట లిఁ కేల చూచియుఁ

---

౧ పాఠాం.— 'యానెదవే నీవు దోసమనకిటు'; 'యానెదవే నేను దోసమననఁట.'

$ శా. పా.— 'పోలికఁ గీల్కొన.' ♦ 'గని యిట్లనియె.'

§ ఈ పద్యము శాస్త్రిప్రతిలోను - పూ. ము. ననుగూడా 'మతకరి' అను (౬౨) పద్యమునకు పిమ్మట నున్నది. తంజ. ప్రతులు మూడింటిలోగూడా ఆ పద్యమునకు ముందే యున్నది. ముందుండుటయే యుచితమని సంభావణ సందర్భమువలన తెలియుచున్నది.

† వినియు నెఱుంగ మయ్య [1]యివి వింతలు; చెప్పెడివారు చెప్పినన్
వినియెడువారి కైనను వివేకము దా వలదా యొకింతయున్. ౯౧

టీక.— ఇవి వింతలు = ఇవి చాల క్రొత్తకథలు, మేము - చూచియున్ వినియు నెఱుంగము. చెప్పెడు...వలదా; (ఇది లోకోక్తి.)

క. మతకరిమాటలు చెవి నిడి
గతకల్మషుఁ బుణ్యచరితుఁ గారణజన్మున్
సుతుఁ దునుమఁ దగునె? ముద్దుల
రతనమ్ము నయో! యి దే దొరతనమ్ము నృపా? ౯౨

టీక.— మతకరి = మాయలాడియైన - చిత్రాంగియొక్క, మాటలు, చెవినిడి, కారణజన్మున్ = ఏదోయొక కారణముచేత నవతరించిన మహాపురుషుడును - ముద్దుల రతనమ్మున్ = రత్నమువంటివాడును, అయినసుతున్, తునుమఁదగునె? నృపా, ఇది యే దొరతనమ్ము = ఇదేమి ప్రభుత్వమయ్యా?

మ. తొలుతన్ రాజులుభోగకామినులయందున్ మోహితుల్ గారొ?యిం
పొలయన్ వారి కపారమైనధనమీరరో? యందుకే, యిట్లు పు
త్త్రుల దండింపఁగ నిచ్చు వారి విన మెందున్; నేఁడు చిత్రాంగి మం
దులు నీకుం దల కెక్కె. నాఁ బరవశాత్ముల్ గారె కామాతురుల్?

టీక.— ఇట్లు, దండింపఁగన్ - (భోగకామినులకు) పుత్త్రుల నిచ్చువారిఁ, వినము. చిత్రాంగిఁ (పెట్టిన) మందులు, నీకు తలకెక్కినవి.—

మందులుపెట్టి వశపరుచుకొనుట లోకమున కలదని ప్రతీతి. వశ్యవిద్య అరువదినాలుగు కళలలో నొకటి. కృష్ణుడు తనకు వశవర్తియగుటకు సత్యభామ ద్రౌపదిని మంత్రౌషధముల నడిగినట్లు భారతమున కథయునుకలదు. (చూ. ఆరణ్య. 5–291; 292)

గీ. 'అత్త వాకట్టు మంత్రంబులడిగె నొకతె
విభుని జోకొట్టు మందులు వేఁడె నొకతె.' (శుక. 3–122)

---

† శా. పా.—'వినియు నెఱుంగమయ్య యివి. వింతలు...యొకింతయున్'

'ఇవి మేము వినియెరుగ'మనుటయు, 'వింతలు చెప్పెడివారు చెప్పినను వినువారికైనను వివేకమువలదా' అనుటయు సరికాదు.— 'చెప్పేవారు చెప్పినా వినేవారికైనా వివేకమువద్దా' అనియే లోకోక్తి.

చ. 'అన విని భూవిభుండు నగి యానిది, చెప్పెడువారు చెప్పినన్
వినియెడువారి కించుక వివేకములేదె? శుకాగ్రగణ్య.' (విక్ర. 7-31)

ఉ. అక్కట చూడఁ జాల కటు లాకుటిలాలక మాయ వన్ని దు
ర్వాక్కులు దెల్ప 'వాని † కిటువంటి గుణంబుల? నేనెఱుంగనా?
యెక్కడి $ మాట పొమ్మనక యీ వది నిక్క ము చేసి, బిడ్డ ‡ న
య్యొక్కని * నేఁడు చంపఁగ నయో! దయమాలి తెగింపఁజెల్లునే?

టీక.— కుటిలాలక = వంకరలయిన ముంగురులుకల - చిత్రాంగి (అలకలు కుటిలములనుటచేత దాని బుద్ధియు కుటిలమేనని - సూచన). బిడ్డను - అయ్యొక్కనిన్ = ఆ ఒక్కకొడుకును.

క. ధరణీపతు లే యొకటియుఁ
బరికింపక యిట్టు లదయభావమున † వధిం
తుర నేగద 'రాజ్యాన్తే
నరకం ధ్రువ మ'నిరి తొంటినయమార్గవిదుల్.　　ఉ౭

టీక.— ధరణీపతులు - ఏయొకటియున్ పరికింపక=ఇతరమేమియు విచారింపక, ఇట్టులు=ఇదిగో, యీ విధముగానే, అదయభావమునన్ = కటికి మనసుతో, వధియింతురు = చంపుదురు - అనేగదా, నయమార్గవిదుల్ = నీతిశాస్త్రము నెరిగినవారు, రాజ్యాన్తే నరకంధ్రువమ్ = రాజ్యాంతమునందు నరకము తప్పదు అనిరి.

చ. 'చలమునఁ * జెప్పుమాటలు నిజంబని, (a) కానక కన్నపట్టి, ని
ర్మలు, వధియించె నెంతదయమాలినవాఁ' డని లోకులాడరే?

---

† పాఠాం.— 'కటువంటి' $ 'సుద్ది' ‡ 'నినొక్కని' * 'నేఁడయోదయు నయో' (ఈ పాఠమున 'నేఁడు, అయోదయున్ - శుభోదయము కలవానిని' అని యర్థము.)

† శా. పా.— 'ఘటియింతురె? యోఁగదె!' (ఇది పూ. ము. పా.)

నరకమునకు హేతువు 'వధియించుట' గాని, ఇతరకార్యములను 'పరికింపక - ఘటియించుట' కాదు. ఘటియింతురె? యను ప్రశ్నతో 'యోఁగదె' అను ఆశ్చర్యమున కన్వయమును కుదురదు. కాబట్టి శా. పా. సరియైనది కాదు. 'వధియింతురనే కద' అను పాఠము తంజ. ప్రతులు మూడింటిలోను ఉన్నది.

* పాఠాం.— 'జంతమాటలె'

(a) శా. పా.— 'నిజంబని, కానక, కన్నపట్టి'

'కానక - కన్నపట్టి' అను విభాగము నీరసము. 'కానకకన్న - పట్టి' అనుట సరసము. 'కానకకన్న' జాతీయము.—

వలపున స్త్రీలబుద్ధి వినువా రొక రేఁ గడతేరినట్టివా
రలు గలరా? వివేకము (b) తెఱంగిటు లయ్యె ని దేల వల్లభా? ౬౬

టీక.— కానక కన్నపట్టిన్ = లేక లేక కలిగిన కొడుకును, కడతేరినట్టి వారలు = బాగుపడినవారు, వల్లభా = నాథా, వివేకము తెఱంగు - ఇటులయ్యెను- ఇదేల = నీ తెలివియంతయు తుదకిట్లు పరిణమించిన దేమి?

స్త్రీబుద్ధి ఆపత్కారణమని నీతివాక్యము.—
"ఆత్మబుద్ధి స్సుఖాయైవ, గురుబుద్ధిర్విశేషతః
పరబుద్ధి ర్వినాశాయ, స్త్రీబుద్ధిః ప్రళయాంవహః."

ఉ. ఇచ్చక [1]మాడునట్టి వెలయింతుల నెందఱనే గడించుకో
వచ్చుఁ, గుమారుఁ [2]డట్టిగుణవంతుఁడు గల్గఁ, డెఱుంగఁ జెప్పితిన్;
మచ్చర మేల? యింక సయిరన్ విడిపింపఁ[3]గదయ్య" యంచు లో,
హెచ్చిన నెంజిలి న్మగువ యెమ్ములు చిల్లులువోవ నాడినన్. ౬౭

టీక.— ఎమ్ములు చిల్లులువోవన్ = మాటలునాటుకొని ఎముకలుగూడా తూట్లు పడునట్లు = తీవ్రముగా.

---

(1) 'ఇప్పుడే నశనంబుగానక కానకకన్న యిక్కన్యన్' (మను. 5—33.)
'కానకకన్న యిక్కన్యన్ = లేకలేక కనుకొన్న యీచిన్నదాన్ని' (జూ. టీ.)

(2) "కానకకన్న సంతానంబు కావున,
కానకకన్న సంతానమయ్యె." (రామాభ్యు. 5—12.)

(3) "అని శిశువుం గనుంగొనుచు, నన్నయిదేమిర? యేమి తప్పురా?
కనుఁగొనకుండ మావలన, కానక కానక గొడ్డువీఁగి కాం
చిన తనయుండ వీవు." (పరమ.2-174.)

(4) "కానక కానక కన్నకుమారుఁ, గానరేయనుచు నక్కానలోపలను."
(బా. శం. సారంగ. పు. 112)

(b) శా. పా.— 'కరంబిటులయ్యె.' (ఇది పూ. ము. పా) 'తెఱంగు' తంజ. పా. ఉచితతరము.

1 శా. పా.— 'మాడనిట్టి' (ఇది పూ. ము. పా.) 'మాడునట్టి' తంజ. పా.

2 శా. పా.— 'డిట్టి' (ఇది పూ. ము. పా.) 'డట్టి' తంజ. పా.

3 శా. పా.— 'రాదె' (ఇది పూ. ము. పా.) 'గదయ్య' తంజ. పా.

గీ. మదిని ద్వేషంబు కోపంబు మల్లడిగొన
నిలువ కట రాగ మతనికన్నుల వసించెఁ,
గటుమరలఁ జేరె నపు డనుకంపమహిమ,
చనునె దుర్జనసంగతి సాధువులకు? ౬౮

టీక.—మదిని = మనస్సునందు, ద్వేషంబు = విరోధభావము, కోపంబు, మల్లడిగొనన్ = పెనగొనగా (= అతిశయింపగా), రాగము = (భార్యాపుత్రులమీది) యనురాగము, (ఎఱ్ఱదనము. అని, అర్థాం.) అట నిలువక = ఆ మనసులో నుండక, అతని = రాజుయొక్క, కన్నులన్, వసించెను = చేరెను, అనుకంప = (భార్యాపుత్రులనుగూర్చిన) కనికరముయొక్క, (కంపించుటయొక్క, అని, అర్థాం.) మహిమ = అతిశయము, కటు మరలన్ = చెక్కిళ్ళమీది భాగములయందు, చేరెను. ('హనువు కటుమరయంచనఁగా నొప్పు' ఆం. భా. 2-143.) సాధువులకున్ = మంచివారికి, దుర్జనసంగతి = దుష్టులతోడి పొత్తు. చనునె = తగునా?

‡ రాజు, భార్యాపుత్రులమీది యనురాగమును వదలి ద్వేషమును వహించి, కన్నులెఱ్ఱజేసి చూచెననియు, కనికరమునుమాని, క్రోధమునుపూని, కటములదర కఠినముగా భాషించెననియు, తాత్పర్యము.

ఉ. ఏనటు వేఁటఁ బోవఁ గని, [1] యిందులకున్ బెళుకావగింజయం
తైనను లేక, చేయ నగునా తగునా యన, [2] కింత సేసెనే!
[3]వానికిఁగా వహించుకొని వచ్చితివా యతివా? కులోద్వహుం
డా [4]నఁట! బుద్ధి దా నెఱుఁగఁ డంద మె? యందమె యిట్టిచందముల్?

---

‡ పూ. టీ.—'ద్వేషకోపములు దుష్టములనియు, రాగానుకంపలు సాధువులనియు, ద్వేషము రాగమును తఱిమెననియు, కోపము కనికరమును తఱిమెననియు, భా.'

దుష్టులు తరుమువరకును వారి నంటుకొని పడియుండు సాధువు లవివేకులు. రాగానుకంపలు ద్వేషకోపములతోడి సంగతి తగదని గ్రహించి తమంతటతామే వెలుపలికి వచ్చినవిగాని, తరుముటచేత రాలేదు. కావున, పూ. టీ. భావము సరియైనది కాదు.

1 పాఠాం.— 'యిందళుకుం యళుకు' 2 'కింత సేలాఁగా' 3 'వానికినె' 4 'నవు.'

టీక.— జెళుకు = జంకు; వహించుకొని = పైనవేసికొని (జాతీయోక్తి.) కులోద్వహుఁడు = కులమునుద్ధరించువాడు, ఎఱుఁగఁడందమె = ఎరుగనివాడందామా! ఇట్టిచందముల్ = ఇటువంటివర్తనలు, అందమె = తగినవేనా!

చ. అది మటుమాయలాఁడి యని యంటివిగా; యొకనాఁడు రానివాఁ
డదురుగడం దదీయనిలయంబున కేటికి వచ్చె? నైన నిం
పొదవిన † ప్రేమ నేనచట నుండఁగ వచ్చెనె వాఁడు? పోవ ని
మ్మదియు, నిజాంశుకంబు $తగు లాటకుఁ గారణ మేమి? దెల్పుమా.

టీక.— నిజాంశుకము = ఆతనివస్త్రము, తగులాటకున్ = ఆచోటచిక్కుటకు.

క. జనపతి యీ లని బిడ్డని
యనుఁగుంజుట్టమని చూడ నగునే యెందున్
దునియలుగ నాజ్ఞ వెట్టక
నెనరున? మఱి సేయరానినేరము సేయన్. ౭౦

చ. అనియొకయించుకైనఁ దనకాస్పద మీక తఁడాడఁజూచి, మా
నిని యిటు గూడ వానిపయి[1] నేకద నేరమి మోవఁ జేసితో
జనవర, నిక్కమౌ నవును [2]సభ్యయు నీప్రియురాలె, వాఁడె దు
ర్జనుఁడు; వెదుళ్లపందిరియు రాజులమాటలు [3]చిక్కనౌఁగదా. ౭౧

టీక.— ఆస్పదమీయక = సందియ్యక; నీప్రియురాలె, సభ్యయున్ = యోగ్యురాలున్నూ, వాఁడె = నాకుమారుడె, దుర్జనుఁడు. ఔనవును (ఎంత చక్కగా గ్రహించితివయ్యా! అనిదెప్పుట.) వెదుళ్ళ పందిరియున్ - రాజులమాటలు - చిక్కన - ఔఁగదా (ఇది లోకోక్తి.) వెదుళ్ళపందిరి సందులేక చిక్కగా నుండుననియు, రాజుల మాటలు వివాదమున కెడమీయక బిగింపు కలిగియుండుననియు, భా.

---

† శా. పా.— 'ప్రేమచే నచట' - $ పాఠాం.— 'గఱుతౌటకు'.

1 శా. పా.— 'నేరమి యూరక మోపఁజేసితో.' (ఇది పూ. ము. పా.) అసాధువు.

2 పాఠాం.— 'సబ్బిణి' ఈపాఠము, తంజ. ప్రతులు నాల్గింటిలో నున్నది నాకర్థము కాలేదు.

3 శా. పా.— 'నిక్కమౌఁగదా.' (ఇది పూ. ము. పా.)

'వెదుళ్ళపందిరి - రాజులమాటలు - నిక్కమౌనుగదా' అంటే అర్థమేమో పూ. టీ. కర్తలు సెలవీయలేదు. 'చిక్కనౌఁగదా' అని తంజ. ప్రతులు మూడింటిలోను.

చ. అడవుల కేఁగి యాకలము లైన భుజించెద మయ్య, దీమసం
†బెడలఁగ దూరదేశముల కేనియుఁ బోయెదమయ్య కోడలుం
గొడుకును నేను, రాచసిరికూటము లప్పుడె వచ్చె మాకుఁ, జా;
‡ల్విడుపుఁ డనంగదయ్య $ నవవిభ్రమమోహన కోమలాంగునిన్.

టీక.— దీమసంబు - ఎడలఁగన్ = మాకుగల గౌరవమంతయు నశింపగా,— రాచసిరికూటములు = రాజ్యలక్ష్మితోడి సంబంధములు, మాకు - అపుడె వచ్చెన్ = మాకు యిప్పటికే ముట్టినవి. చాలును. (ఇది వెక్కసపుమాట) నవ...గునిన్.— నూతనములయిన శృంగార విలాసములచేత మనోహరమును, సుకుమారమును నయిన శరీరము గల, కుమారుని, విడువుఁడు - అనంగదయ్య = విడిచిపెట్టండిరా - అనవయ్య.

గీ. అని యపుడు నిల్పరానిమోహంబుకతనఁ
దనదుప్రాణేశ్వరుని పదద్వయముమీఁద
వేగ తా నడ్డపడి యైన వేఁడుకొనెద
గాక యని చేరఁ జనుదెంచు [1]కదలెతింగి. ౭౪

టీక.— చేరఁ జనుదెంచు, కదలు = ప్రయత్నము.

శా. 'నామీఁ దానసుమీ మతేమి యనిన, న్మాటాడఁగా వచ్చినన్;
వామాక్షీ, యతిఘోరపాతకునిఁ గావం జెల్లునా వాని? నీ
వేమేఁ జెప్పిన వింపఁ గాని, విన నే నీమాట పో పొమ్మనెన్
మోమోటించుక లేక; యొంత కఠినాత్ముల్ రాజు లూహింపఁగన్.

టీక.— నామీఁద + ఆన నామీద ఒట్టు, మోమోట = మొగమోటమి.

† పాఠాం.— 'బెడలకమారు' ‡ 'విడువుమనంగదయ్య' $ 'విభ్రమకోమలమోహనాంగునిన్'; - 'కోమల పల్లవాంగునిన్.'

1 శా. పా.— 'కడఁకరయెతిఁగి' (ఇది పూ. ము. పా.)

తంజ. తాళ్ప్రతులు మూఁడింటిలో 'కదలెతింగి' అని యున్నది. 'కదలు' తప్పనుకొని సంస్కర్తలెవరో పూ. ము. నసే 'కడక' అని సవరించినారు. సవరింప నక్కరలేదు. 'కదలు' అన్నను 'కడక' ( = యత్నము) యే. (చూ. శ. ర.) 'కదలు' అనగా, కదలిక = కదలుటకు చేయుయత్నము.

ద్వి.— "కదిసి పట్టఁగవచ్చు కదలు వీక్షించి." (నవ. పు. 46.)
గీ.— "పండ్లు వేర్వాసికదలు చూపకయ యున్న." (కాశీ. 3-84.)

గీ. అనిన గజయాన [1] పతియాన నతిభయాన
క్రియానల దహ్యమాన క్రమగతి
యాన, గజగజ వడఁకి శయాన తత్ప్రి
యాననము గని తాల్మి నయాన నపుడు. ౭౬

టీక.— అనినన్ = అత డట్లనగా, గజయాన = అరత్నాంగి, పతియానన్ = భర్త పెట్టిన యొట్టుచేత, అతిభయానక క్రియా = మిక్కిలి భయంకరమైన పుత్రదండన క్రియ యనెడు, అనల = అగ్నిచేత, దహ్యమానక్రమగతి = దహింపబడుచున్న విధము, ఆనన్=తన్నలముకొనగా, - గజగజవడఁకి, శయాన=పండుకొనియున్న, తత్ ప్రియ + ఆననము = ఆభర్తయొక్క ముఖమును, కని. తాల్మిన్ = ఓర్పుతోను, నయానన్ = వినయముతోను, (అవ. అన్వ)

క. మనసు నిలుపఁ జాలక కడు
పునఁ బుట్టినదోసమునకుఁ బొగులుచు వేఁడం
జనుదేర [1]నాన వెట్టితి;
పని లేదిఁక వానిప్రాఁతఫల మిటు లుండెన్. ౭౭

---

[1] శా. పా.— 'పతియాన కతి భయాన, కక్రియానలధాయ్యానయక్రమగతి.' (ఇది పూ. ము. పా.) ఇందుకు పూ. టీ. ఇట్లున్నది.—

పతియానకున్ = భర్తయొక్క (భర్త పెట్టిన) యొట్టునకు, అతిభయానక = మిక్కిలి ఘోరమయిన - క్రియా = పుత్రదండన కర్మయనెడు - క్రియా = అభిచారిక కర్మమొయొక్క - ధాయ్యా = ప్రజ్వలనబుఋక్కుయొక్క - నయక్రమ = నీతి - ప్రాప్తి యొక్క - గతి = విధము - ఆనన్ = తాఁకఁగా - వైరులప్రాణమును హరించుటకై కావించు నాభిచారికహోమాగ్నిని ధాయ్యయను ఋక్కు ఎట్లు ప్రజ్వరిల్లం జేయునో ఆవిధముగా రత్నాంగియొక్క పుత్రదండన దుఃఖమును తేనియాన మంటలుమండించె నని భా.

'పుత్రదండన కర్మ యనెడు - అభిచారికర్మయొక్క - ప్రజ్వలన ఋక్కు యొక్క - నీతిప్రాప్తియొక్క - విధము - తాఁకఁగా' అను అర్థక్రమము చాలా దురవగాహముగాను - హఠాదాకృష్టముగాను, ఉండుటచేతను, 'దహ్యమాన' అను సుఖమైన పాఠము మద. తాళ - ప్రతులలో లభించుట చేతను నేనా పాఠమునే గ్రహించినాను.

[1] శా. పా.—'ఆనఁ బెట్టితి'

ఈ పాఠము ప్రకారము 'ఆనన్ = అనునట్లు - పెట్టితివి' అనియేగాని 'ఒట్టు పెట్టితివి' అను అర్థమేర్పడదు. 'ఒట్టుపెట్టు' - అను అర్థమున 'ఆన వెట్టు - ఆన పెట్టు'

టీక.—కడుపునఁబుట్టిన దోసమునఁకుఁ = నాకు కుమారుడుగా పుట్టిన కారణమున, (అట్టి యుత్తముడు నావంటి నిర్భాగ్యురాలి కడుపున పుట్టుట దోషమయినది - అని రాజును తాకనాడుట.) పొగులుచుఁ = దుఃఖించుచు, వేఁడఁ చనుదేరఁ ఆనవెట్టితి = దగ్గరికే రావలదని ఒట్టుపెట్టితివి. ఇఁక (చింతింపవలసిన) పనిలేదు.

క. అని చాల ఖిన్నురాలై
మనమునఁ [1]దెర వేయఁ బుత్త్రిమమతాంబుధి, ని
ల్చినచోట నిలువ సైఁపక
వనితామణి నగరు వెడలి వచ్చుచు నంతఁ. ౭౮

టీక.— ఖిన్నురాలై = ఖేదమును పొందినదై, మనమునఁ, † పుత్త్రిమమతాంబుధి = పుత్త్రప్రేమయను సముద్రము, తెరవేయఁ = ఉప్పొంగగా, నిల్చినచోట నిలువఁ - సైఁపక = సహింపక.

---

ఆనవోడుచు - ఆనపొడుచు; ఆనయిడు' అనియే కాని, ఆనను బెట్టు - ఆనంబెట్టు - ఆనఁబెట్టు; ఆనంబోడుచు; ఆననిడు - ఇత్యాదిరూపములులేవు.—'ఆనవెట్టితి' అనియే తంజ. పా.

(1) "ఆన - పొడుచుట To lay a ban or protest, so as to check proceedings." (బ్రౌను.)

(2) "పొడుచు = (ఆన) పెట్టు. '...దొంగలానవొడిచినఁ గోకల్ విడుతురే. కళా. 3, ఆ." (శ. ర.)

N. B. సూ. ని. లో 'దొంగలానఁబొడిచిన' అని ముద్రితమైనది. ప్రమాదము'

(3) "అంగజుఁ డానవెట్టి కదియంగుతిత్రావా సెననంగ." (మను. 2-32.)

(4) "గగనస్థలభ్రమదగ్రిహచంద్ర సూర్యులఁ
బో నీకుమంచు బిట్టానపెట్టి." (ప్రబోధ. 3-38.)

(5) "నిలువకటుపోవుచున్నా
రలికుంతల చెలులనేల యానపొడిచెదే." (ప్ర. ప్ర. 5-39.)

1 పాఠాం.— 'దెలివయును'— 'వెరవేది.'

† పూ. టీ.— 'పుత్త్రిమమతాంబుధి = సుతుని (పై) ప్రేమయను సముద్రము. మనమునఁ తెరవేయఁ = ఏమియుం దోఁపకుండునట్లు మనస్సునంగప్పఁగా'.—

సముద్రమొక తెర (గుడ్డ) ను కప్పినదనుట ఉచితముగా నాకు తోపలేదు. సముద్రమునకు - అనుషంగియైయుండు 'తెర' అల యగునుగాని 'తెరగుడ్డ' కాదు.

ఆ. వె. భామలార రండు నాముద్దుతనయుండు
వేఁడి? వేఁడి? యనుచు వేఁడి వేఁడి,
వేఁడి వేఁడినీరు వెడఁదకాటుకకంటి
కొలుకులండ మాటి కొలుకుచుండ. ౭౯

టీక.— నాముద్దుతనయుండు, వేఁడి - వేఁడి = ఏఁడి? ఏఁడి? అనుచు, (వేఁడి= ఏఁడి. చూ. ప్రౌఢ. శబ్ద. 53.) వేఁడివేఁడి = ప్రార్థించి, ప్రార్థించి, వేఁడి వేఁడినీరు = వెచ్చవెచ్చని కన్నీరు, వెడఁద = విశాలములయిన, కాటుక కంటి కొలుకుల - అండన్ = కాటుకచే అలంకృతములైన కనుకొలుకులకడనుండి, మాటికిన్ = తేపతేప కును, ఒలుకుచుండన్ = కారుచుండఁగా.

వేఁడి కన్నీరు = దుఃఖాశ్రువులు. ఆనందాశ్రువులు శీతలములు; దుఃఖాశ్రువులు ఉష్ణములు.—

"ఆనందజ శ్శోకజ మశ్రుబాష్ప
స్తయో రశీతం శిశిరో బిభేద,
గంగాసరయ్వో ర్జల ముష్ణ తప్తం
హిమాద్రి నిష్యంద ఇవావతీర్ణః." (రఘు. 14-3.)

---

'తెర' వేయుటకు 'మమత'యే చాలియుండఁగా మమతను అంబుధిగా రూపించుటలో సారస్యమేమి? మమత యను అంబుధి ఉప్పొంగుటచేతనే మనస్సు - అల్లకల్లోలమై ఆ యిల్లాలు నిలిచినచోట నిలువజాలక పోయినది.— అనుట యుక్తి యుక్తము.

తెర = అల, అనుటకు—

(1) "అలయనంగఁ దెర యనంగను వీచిపరఁగును" (ఆం. భా. 1–154.)

(2) "తెరలెత్తి సప్తసాగరములుఁ బొరలంగ
వరుణుండు గొండిలి పరిఢవింప" — (ఉ. హరి.)

(3) "కొప్పు మొగంబు నట్టు చనుగొండలుఁదోఁప, లతాంగిపోలెఁ జె
లువ్వప్పలిలన్ సుధారస పయోనిధి పెందెరఁబుట్టు నిందిరన్."
(మను - 5–80.)

(4) "అని రూపకళలు చూపఱు
గొనియాడఁగఁ జేరటాంబ్రదు గొందఱు తెరవం
చినఁ జూచె నతివ నర్తనుఁ
డనురాగాంబుధి తటాన నట తెరయెత్తన్" (విజయ - 2–19.)

(ఈపద్యమునకు శాస్త్రిగారు ప్రకటించిన టీకలో చాలా ప్రమాదములున్నవి.)

చ. వల దని మీరలైన [1]నొకవాల్ దెలుపం గదరయ్య; యాలిమా
టలు విని యన్నుఁబట్టి నకటా! తెగటార్తురె? యంచు నామె పె
ద్దలఁ గని పుత్త్రిమోహమున దైన్యపడెం గడు; 'రాజు మొత్తఁగా
నలమొగసాలకు [2]నొఱ్ఱె యఁ'టన్నది నిక్కముగాఁగ నయ్యెడన్.

టీక.— ఒకవాల్ = ఒకపర్యాయము. 'మొగుడుకొడితే మొగసాలకు మొఱ' అని సామెత. ప్రకృతమున మగడే - కొట్టుటయు, ( = తిరస్కరించుటయు) మొగసాల పెద్దలకే మొఱపెట్టుటయు, ప్రవృత్తమగుట విశేషము.—

మ. తొలఁగం ద్రోయఁగ రాక మూఁక లయి వీథు ల్నిండి యు న్నమ్మలు
క్కలు తన్నుంగని [1]పైనపైన పడుచుం గన్నీళ్ళతో వెంట రాఁ

---

1 శా. పా.— 'ఒకపాల్' (ఇది గుజిలీ, పా.)

చెప్పవలసినది సమగ్రముగా చెప్పక 'ఒక్కపాలు' మాత్రమే చెప్పి యేమి ప్రయోజనము? 'ఒకవాల్' అని, తంజ. పా.

'వాలు = పర్యాయము' అని శ. ర. లో లేదుగాని లోకవ్యవహారమున నున్నది.

ఉ.— 'గడ్డి ఒకవాలు మెదిగినది.'— 'అక్కడి కొకవాలు పోయి రావలెను.' ఇరువాలు దున్నినచేను.— ఇత్యాది. బ్రౌనుదొర 'ఇరువాలుదున్నట అంటే అడ్డము దిగటముగా రెండుసాళ్లు దున్నట అంటారు.' అని లోకవ్యవహారమును చూపి చెప్పినాడు.

కాబట్టి 'ఒకపాల్' అనుటతప్పు; 'ఒకవాల్' అనుట ఒప్పు.

2 శా. పా.— 'మొర.'

గుజిలీపుస్తకములో 'మొర' లఘురేఫముతో నున్నది. దానినిబట్టి 'వేదం' వారును, వారినినమ్మి 'వావిళ్ల'వారును, వారివెంటనే తుదకు 'కొండపల్లి' వారున్ను లఘురేఫముగానే ముద్రించినారు. పెద్ద పొరపాటు.

(a) "మొఱలుపెట్టుట మొఱ మొఱయుట... ఆదిగాఁగ, హ్రస్వముల మీఁద బండిరా లొప్పుచుండు." (అప్పకవీయము. 2—197)

(b) "మొఱయు మొఱ మొఱలాడుట మొఱకవెలితి
మొఱసుటయును బండిరాలు సముద్రతూణ."

సర్వ. ల. సా. సం. 3—116.

1 పాఠాం.— 'పెలపెల' ఈ పాఠము తంజ. ప్రతుల నాల్గింటిలో నున్నది. 'పైన పైన' అనురూపము బా. వ్యా. తత్స 65. ప్రకారము తప్పయినను లోకవ్యవహారమున రూఢికెక్కి యున్నది.

జెలిక త్తెల్ మును[2] గల్గ మార్గము బయల్వెయంగ రత్నాంగి గా
దిలిగా రాజుఁ గుమారుఁ డున్నకడ కేతెంచెన్, నితాంతవ్యథన్.౮౧

టీక.— మునుకల్గన్ = ముందుగా, నితాంతవ్యథన్ = విస్తారమైన దుఃఖముతో.

సీ. సుతుఁ డట్టివాఁడు గాఁ, డతివమాటల కేమి?
[1]యని తాళఁ డాయె రా జనెడివారు,
నెవ్వరిమన మెవ్వఁ డెఱుఁగు నన్నెము పున్నె
మును దేవుఁడె యెఱుంగు ననెడివారు,
[2]విభుఁడు ధర్మాధర్మ విధము కానక చేసె
హా! యెంత యన్యాయ మనెడివారు,
స్వామి! యయో పగవారికి నిటువంటి
యాపద రావల దనెడువారుఁ,
గీ. గపట మెఱుఁగవు, గోలవుఁ గదర యన్న,
యెట్లు వచ్చెర నీకు నేఁ డిట్టిపాటు
లనుచు సారంగధరుఁ జూచి యమ్మలక్క
లపుడు [3] కన్నీరు గలవారు, నయిరి పురిని. ౮౨

టీక.— తాళఁడాయెన్ = నిదానించక పోయెను.

సీ. ఉపకారమే కాని యపకార † మెప్డుఁ ద
లంచఁ డయో యెంతమంచివాఁడు,
మనసు చూత మటంచుఁ దను నే మనిన న
గాని కోప మొకింత లేనివాఁడు,

---

[2] శా. పా.— 'మును గల్గు మార్గము' (ఇది పూ. ము. పా.) అసాధువు. 'మును గల్గ' తంజ. పా. 'మును కలుగన్ = ముందుగా' అనుటకు.—

క. 'మునుకలు గంగానదిలో
నొనరించుటకన్న భాగ్యమున్నదె యనుచున్
మును కలుగంగా దిగి.' (విజయ. 1-120.)

† పాఠాం.— 'మెప్పుడు, దలఁపఁడయో యెంత ధర్మపరుఁడు.'

మదిలోన నెవరి కెయ్యది యిష్ట మది యట్ల
* యలరించునుచితజ్ఞుఁ డైనవాఁడు,
భువిఁ గలఁడా యిఁకఁ బుట్టెడు పెరిఁగెడు
వారిలో మఱి యిటువంటివాఁడు,
ఆ.వె. పరమసాధు వనుచుఁ బలుమాఱు సారంగ
ధరునిగుణము లెల్లఁ దలఁచి తలఁచి,
పౌరజనము లెల్లఁ బసిబిడ్డలాదిగా
వగచి కసిపడనివారు లేరు. ౮౩

## —: రత్నాంగి కుమారునిజూచి దుఃఖించుట :.

గీ. జిత్తులకుఁ డెంకి యగు నింద్రజిత్తుచేత
నల యురగపాశబద్ధుఁ డై యలయునట్టి
రాముతోఁ డన మిగుల గారాముతోడఁ
బెంచిన కుమారుఁ గాంచి పెంపెంచి కనలి. ౮౪

టీక.—జిత్తులకుఁ, డెంకి నివాసస్థానము, ఉరగపాశబద్ధుఁడై = నాగపాశములచేత కట్టుబడి, అలయునట్టి = బాధపడుచున్న ‡ రాముతోఁడన్ = రామునకు జతయోయన్నట్లున్నవాఁడును, తాను, మిగుల, గారాముతోడన్ = ప్రేమతో, పెంచినవాఁడును, అయిన - కుమారున్, కాంచి = చూచి, పెంపెంచి = అతని గుణోదాత్తతను తలచికొని; కనలి = కోపించి (అవతలికి అన్వయము.)

---

*శా. పా —(అట్ల)–'నలరించు.' (ఇది పూ. ము. పా.)

'అట్లన్' అని ద్రుతాంతముచేయుట తప్పు. అట్లు+అ = అట్ల, అట్లు+ఎ = అట్లె; కళలుగాని ద్రుతప్రకృతికములు కావు. 'ఎ. ఏ- అ, అను నవధారణార్థకంబులు కళలు. (బా. సంజ్ఞా. 13. వ్యాఖ్య.) 'అట్లయలరించు.' 'అట్లెయలరించు' అనియే వ్రాత ప్రతులపాఠములు.

‡ పూ. టీ.— 'రాముతోడు అనన్ = లక్ష్మణుఁడో అనునటుగా.'

రాముని వదలి లక్ష్మణుని చెప్పుటలో సారస్యమేమి? పూ. ము. నను, తంజ. వ్రాతప్రతులలో కొన్నింటను 'రాముఁడోయన' అను పాఠమే యున్నది. "నలి నింద్రజిత్తుండు నాగపాశముల - బలిమిఁ గట్టిన రామభద్రుని పగిది" (నవ. పుట. 70.) అనియే మూలముకూడా. కాబట్టి, పూ. టీ. సరియైనది కాదు.

ఇంద్రజిత్తుతోడి యుద్ధమున రామలక్ష్మణులు నాగపాశములచే బద్ధులైనారని రామాయణకథ. (యుద్ధ. 45 సర్గ. 8-9.)

మ. అపు డమ్మానిని 'యెంత సేసితివె చిత్రాంగి' యటంచుఁ జోకా
రపుఁగేల్దమ్ముల నగ్రకుంతల తటీ రాకా నిశాకాలశ
శ్యుప[1]మాస్యంబటు మోఁదికొంచు సుతుపై నుద్బాష్పయైవ్రాలెనం
దుపకంఠ క్షితి బద్ధ తర్ణక [2]లిలిక్షోద్రిక్త ధేనుక్రియన్. ౮౫

టీక.— అగ్ర...బు.— అగ్రకుంతలతటీ = ముంగురుల ప్రదేశమనెడు, రాకానిశాకాల = పూర్ణిమారాత్రికి, (శశి+ఉపమ) శశ్యుపమ = చంద్రునివంటిదైన, ఆస్యంబు = మొగమును (ముంగురులతావు - (అనగా తలకట్టు) నిశాకాలమువలె నలుపనియు, ముఖము పూర్ణిమాచంద్రునివలె తేజస్వంతమనియు, భా.) చోకారపుకేల్‌దమ్ములన్ = సుకుమారములును పద్మములవంటివియునైన హస్తములతో, మోఁదికొంచున్ = బాదుకొనుచు, ఉద్బాష్పయై = ఉప్పొంగుచున్న కన్నీరు కలదై, ఉప...క్రియన్. - ఉపకంఠక్షితి = సమీపప్రదేశమున, బద్ధ = కట్టివేయబడిన, తర్ణక = దూడను, లిలిక్షా = నాకవలెననెడి తమకముచేత, ఉద్రిక్త = ఎసరేగిన,ధేనుక్రియన్ = ఆవువలె, సుతుపైన్ = కుమారునిమీద, వ్రాలెన్ = పడెను.

---

[1] శా. పా.— 'ఆస్యంబున' (ఇది పూ. ము. పా.) 'ఆస్యంబునన్ = మొగంబున' అని, పూ. టీ.—

ఆమె మోదుకొన్నది మొగము నేగాని మొగమునందు కాదు. 'మొగంబటు' అని, తంజ. పా. "ముందలయును మొగంబును మోదుకొనుచు" అని మూలము (నవ. పు. 71.)

[2] శా. పా.— 'దిదృక్షోద్రిక్త' ('సమీపభూమియందు కట్టఁబడిన దూడను చూడఁగోర్కిచేత రేసిన యావువలె.' అని పూ. టీ.)

'దిదృక్ష' యనగా దర్శనేచ్ఛ = చూడవలయుననెడి కోరిక. 'చూడన్ కోర్కి' అని వ్యస్తముగా చెప్పుట సరికాదు.

దూడ సమీపముననే కట్టివేయబడియున్నందున ఆవునకు కనబడుచునేయుండును. కనబడుచున్న వస్తువునందు 'దిదృక్ష' కలుగు ననుట సరికాదు. 'లిలిక్షోద్రిక్త' అని, తంజ. పా. 'లిలిక్ష' యనగా 'నాకవలెననుకోర్కి'. సమీపముననున్నను - నాకుట కందనంత దూరముననున్నదనియు, అందువల్ల 'లిలిక్ష' కలిగినదనియు, చెప్పుట సమంజసము. కావున 'దిదృక్ష' పాఠము అసాధువు. 'లిలిక్షోద్రిక్త' అన్న తంజ. పా. సాధువు.

'ధేనుక్రియ'.— క్రియ, భంగి, భాతి, మొదలగు కొన్నిపదములు సంస్కృతమున ఇవార్థకములు కాకపోయినను తెనుగున ఇవార్థమున సిద్ధసమాసఘటితములై క్వాచిత్కముగా కనబడుచున్నవి.

(a) "నాకవాసులు నీవ వహ్నిఁ దనర్చు కేతుతతిక్రియన్." (భాగ. 8-168)

(b) "అమరుతొడవుల వజ్రాంశు లంచపిండు
కరణి, హరినీలములఁ బేర్చుకాంతి యళుల
పగిది, మాణిక్యరుచి పద్మభంగి, మెఱయ." (భా. భీష్మ. 1-96)

(c) "చంద్ర పరిపన్నిరుద్ధ నీరరుహాముకుళభాతి." (పాండు. 1-206.)

ఏమయినను, ఈప్రయోగములనుచూచి, 'రామక్రియ,' 'సీతాభంగి' 'మద్భాతి' (= నావలె) ఇత్యాది రచనలు చేయుట సరికాదు.

ఉ. రంగ దపార మోహ జలరాశి మునింగి రహిం దొరంగి ర
త్నాంగి యొకింతసేపటికి హా! సుకుమార, కుమార, నేఁడు చి
త్రాంగికి నప్పగించుకొఱకా [1] నవమాసములున్ [2] భరించి వే
డ్కఁగని నిన్నుఁగూరిమి గడల్కొన † గోమున నెత్తి పెంచుటల్!

టీక.— రంగత్ = ప్రకాశించుచున్నట్టియు, అపార = అవతలిదరిలేనిదియు నైన, మోహజలరాశిన్=పుత్రమోహమను సముద్రములో- మునింగి, రహిన్ తొరంగి= సొంపుచెడి,—నవమాసములున్ భరించి = తొమ్మిదినెలలును మోసి, కూరిమి = ప్రేమ, కడల్కొనన్ = తరంగితముకాగా = అగ్గలింపగా, గోమునన్=గారాబముతో.

సీ. బహుభూషణధురీణ బాహువల్లరులకా
కఱకుముప్పిరిత్రాళ్ళ విఱిచికట్లు?
మృగమద శ్రీగంధ మిళితదేహమునకా
గాటంపుఁ § పెంధూళి కప్పడములు?
తంస రాజిత పదాబ్జములకా
యీడుపుతొట్రుపాటెల్లిదములు?

1. శా. పా. 'నవమానములున్' (నవమాసములున్' పూము. తంజ. పా.)
2 పాఠాం.— 'ధరించి' † 'బోమ్మున'.
§ శా. పా.— 'గంధూళి' (ఇది పూ. ము. పా.) 'పెందూళి' తంజ. పా.

జాతి చంపక దామ వీతకేశములకా
యట్టిట్టు జీరాడు నచ్చికములు?
గీ. నెండకన్నును ‡వానకన్నెఱుఁగకున్న
పుట్టుభోగికి నయ్యోఁబో యిట్టివెతలు;
కడుపు దరికొనదా ✱ నిన్నుగన్నయపుడె?
యన్న యెటు లోర్తురా ననుఁ గన్నతండ్రి! ౧౭

టీక.— బహు...రులకా = అనేకాభరణములను ధరించినవియు - లేదీగెలవలె సుకుమారములును - అయిన చేతులకా, కఱకు...కట్లు = ముప్పిరితో పేనిన బిరుసు త్రాళ్ళతో విరిచి కట్టివేయుటలు?— మృగ...మునకా = కస్తూరి - చందనము, పూసికొను శరీరమునకా, గాటంపు...డములు = దట్టముగా దుమ్ము కప్పుకొనుట;— శిబికా...బ్జములకా = మేలయిన మేనాలయందు ప్రకాశించిన పాదకమలములకా, ఈడుపు...దములు = పడవేసి లాగుటచేత కలిగిన తొట్రుపాటువలని హేళన?— జాతి...ములకా = జాజిపూల - సంపెగపూల - మాలలతో, కూడియుండు శిరోజములకా, అట్టిట్టు...అచ్చికములు = చెల్లాచెదరై వ్రేలాడునట్టి అగచాట్లు— పుట్టుభోగి = పుట్టుక మొదలు భోగమునే అనుభవించువాడు.

శా. నిన్నుం గా సద్గుణవంతుఁ డంచు నెపుడు [1] న్వేనోళ్ళ నెత్తుం గదా

‡ శా. పా.— 'నీడకన్నెఱుఁగకున్న'. అన్ని ప్రతులలోను ఈపాఠమేయున్నది. అంతేకాక "క్రీడమై నెండ కన్నును నీడకన్ను, నెఱుఁగక...సుఖమున్నవారము" అని శం. హరిశ్చంద్ర. (1—212) లో గూడా ఈపలుకుబడియే వాడబడినది. కాని భోగియైనవాడు 'ఎండకన్నెరుగకుండుట' భావ్యమేగాని 'నీడకన్నును' ఎరుగకుండుట యెట్లు? రెండును ఎరుగక మరి యాత డెరిగిన దేమి? ఎండకు - వానకు పోకుండుట భోగిలక్షణము. అట్టి యర్థమునే లోకమున వాడుకయు; భారతప్రయోగమున్ను.—

ఆ. వె. "వచ్చిరెండకన్ను వానకన్నును నెఱుం
గని పురంధ్రులెల్ల...నర్కురువృద్ధుఁజూడ." (ఆశ్ర. 1—143.)

✱ శా. పా.— 'వీని' (ఇది పూ. ము. పా.) 'నిన్ను' తంజ. పా.

కొడుకుతోనే తన దుఃఖమును వెళ్ళబోసికొనుచున్న తల్లి 'వీనిఁగన్నయపుడు' అనుట యుచితముకాదు.

[1] పాఠాం.— 'నేనెంతుఁ బెక్కుండ్రలో'

యన్నా, నేఁ డిది యేమి సేసితివి?+యేలా పుట్టె [2] నీమర్లు నీ
కిన్నాళ్ లే నిది? చెల్లఁబో! జననిగాదే యల్ల చిత్రాంగి దా?
నన్నుం జూచినకంటఁ జూడ వలదా నాయమ్ముగా నాయమర్?

టీక.= ఇన్నాళ్ లేనిది = ఇంతకాలముగాలేని, ఈ మర్లు = ఈ మోహము, ['ఇన్నాళ్ళు + లేనిది = ఇన్నాళ్ - లేనిది = ఇన్నాళ్ళేనిది'. ఇట్లు ద్విత్వాక్షరమున ఉత్వము లోపించుటయు కలదు.— 'అంబళ్లోమ్రయుచుంబట్టి'. ఆము క్త. 4-133.]

ఆ.వె. పరులమర్మ మెత్తి పలుకనివా, రన్య
భామినులకు నాసపడనివారుఁ,
దలఁచి చూడ దేవతాసమాను లనంగ
వినవె నీతి? యేల [3] వేఁదు రైతి? ౮౯

టీక.— ఏల - వేఁదురైతి = ఎందుకింత తెలివిమాలిన వాడ వైతివిరా. — ('వేదురు Foolishness (బ్రౌను.)

క. ఛాలియుటకు నేమి? యెందుఁ
గల దందుకు వగవ; ‡మఱి జగన్మోహనకో
మలుఁడ వగునీకు నీవిధి
నలచతురాననుఁడు వ్రాయ నగునా యకటా! ౯౦

-చాలియుటకు నేమి = చచ్చుటకేమి? ఎందుఁ కలదు = అది సర్వత్ర — ఎల్లవారికి నున్నదే.- ఈ విధి = ఇట్టి కష్టపుచావు.

---

2 శా. పా.— 'ఈదూఱు'

పూ. ము. నను, తంజ. ప్రతులు మూడింటిలోను, 'ఈమర్లు' అనియే యున్నది. 'మదిమదినుండి యీ మరులేల పుట్టె' అనియే మూలమున్న. (చూ. పు. 71.) కావున శా. పా. అసాధువు.

3 పాఠాం.— 'వెఱ్ఱివైతి' - 'వేదురైతి' అని, శా. పా.; పూ. ము. పాఠమున్న ఇదే. కాని 'వేదురు' అనురూపము గ్రాంథికముకాదు. 'వేఁదుఱు' గ్రాంథికము'. (చూ. శ. ర.)

‡ శా. పా.— 'వగవమది.'

క. నానావిభవములం ‡దగ
నే నినుఁ జూతు నని యున్న నిట్లాయె నయో
తా నొకటిఁ దలఁప దైవము
తా నొక్కటి దలఁచు ననుట తథ్యం బయ్యెన్. ౯౧

టీక.—నానావిభవములన్=సకలైశ్వర్యములచేతను, తగన్=ఒప్పియుండగా; తథ్యంబు = నిజము.

సీ. ఒకమంజువాణి పాయక మొగంబున వ్రేల
సొంపొంది సురసేవఁ జొక్కువాఁడు,
వాసిగాఁ బంకజాతాసనుం డనునుడి
వడినాఁడు [1] రాజసప్రకృతివాఁడు,
[2]పాలుమాలుచునుండఁ బసిబిడ్డల హరించి
దండ్రికి ద్రోహంబు దలఁచువాఁడు,
[3]దాసదాసత్వవర్తనుఁడు, సేఁత వికారి,
తన మరాళగతి యేతఱిని విడఁడు,
గీ. నలువ [4]నలువగలను జూడఁ దులువ గాఁడె?
యతని ననఁ బనియేమి? లోకాధిపత్య

‡పా. అం.— 'లొందఁగ.'

1 పాఠాం.— 'ఛాందస' 2 శా. పా.— 'పాలుపాలనుచుండ.' — ఇది చమత్కారశూన్యమైన పాఠము. పూ. ము. నను, తంజ. ప్రతులలోను, 'పాలుమాలుచునుండ' అను పాఠమున్నది.

3 శా. పా.— 'దాసదాసత్త్వ' ('దాస...గతి = బానిసలకు బానిసతనము సేయువాఁడు— (తాను సర్వదా తన సత్త్వమందు ఉండువాఁడు) — అని పూ. టీ.)

'దాసత్వము' లోని తకారమునకు ద్విత్వము కల్పించుటతప్పు.— సత్త్వగుణ మను నర్థమునగూడ శ. ర. కర్త 'సత్వము' అని యేక తకారముతోనే వ్రాసినాడు. 'బ్రహ్మ, తాను సర్వదా తన సత్త్వమందే ఉండువాఁడు' అంటే అర్థమేమో నాకు తెలియలేదు.— పూ. ము. నను, తంజ. ప్రతులలోను 'త్వ' అనియేయున్నది.

4 శా. పా.— 'నలువగఁజూడఁగా.' ('నలువగలనుజూడ' — పూ.ము.తంజ.ప్ర.)

[5]మిచ్చి యందఱిలోఁ దల యెత్తికొనెడు
నటులఁ జేసినయీశ్వరు ననుట[6]గాక!　　౯౨

టీక.— ఒక మంజువాణి = మంచి మాటకారియైన యొకయింతి, పాయక, మొగంబునన్ వేలన్ = (ఎప్పుడును) ఎట్టయెదుట కనబడుచుండగా, సొంపొంది = ఆనందమునుపొంది, సురసేవన్ = కల్లు త్రావుటచేత, చొక్కువాఁడు = కైపెక్కియుండువాఁడు. (స్త్రీలోలుడనియు, త్రాగుబోతనియు, నుపాలంభము) మంజువాణి = మనోహారిణియైన సరస్వతి, మొగంబున వేలన్ = నోటియందు వర్తించుచుండగా. (సరస్వతి వాగ్రూపిణి. కావుననే నోటియందున్నదని చెప్పుట.) సొంపొంది = సొంపునుగాంచి, సురసేవన్ = దేవతలుచేయు సేవలచేత, చొక్కువాఁడు= ఆనందమున మైమరచియుండువాడు, (అని యథార్థము.)

వాసిగా = ప్రసిద్ధిగా, పంకజాత = పాపసమూహమునకు ('అస్త్రీపంకం పుమాన్ పాప్మా పాపకిల్బిష కల్మషమ్' అమ.) ఆసనుండు = ఉనికిపట్టు, అను-నుడి పడినాఁడు = అనునట్టి మాటపడ్డాడు అప్రతిష్ఠను పొందినాడు. రాజసప్ర వాఁడు = దురభిమానము స్వభావముగాగలవాడు. (పాపకర్ముడనియు, గర్విష్ఠుడనియు ఉపాలంభము.)

పంకజాతాసనుఁడు = కమలము ఆసనముగా గలవాడు ('విరించిః కమలాసనః' - అమ) అను, నుడిపడినాడు = పేరువహించినాడు. రాజసప్రకృతివాఁడు=రజోగుణము ప్రకృతిగాగలవాడు (అని యథార్థము.)

రజస్సత్త్వతమోగుణములు బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు ప్రకృతులు.—
'నమో రజో జుషే సృష్టౌ, స్థితౌ సత్త్వ మయాయచ,
తమో రూపాయ సంహారే, త్రిరూపాయ స్వయంభువే'.

పాలుమాలుచునుండన్ = అనారోగ్యముచే పడియుండగా = రోగముకల్పించి, పసిబిడ్డలహరించి = చిన్నారి శిశువులను చంపి, తండ్రికిన్ = ఆశిశువుల తల్లిదండ్రులకు (తండ్రియను నుపలక్షణచేత తల్లి యును.) – ద్రోహముతలఁచువాడు = అపకారము చేయువాడు. (శిశుహంత, పితృద్రోహి యని ఉపాలంభము.)

5 శా. పా.— 'మేచి' - అర్థమేమో?

6 శా. పా.— 'గాదె' (ఇది పూ. ము. పా.) అర్థశూన్యము. 'గాక' అని తంజ. పా.

పాలు - మాలుచునుండన్ = పాలు లేక అల్లాడుచుండునట్లు, పసిబిడ్డలన్ = చిన్నికుఱ్ఱలను; (గోపకుమారులను) - పసి = గోవులయొక్క, బిడ్డలన్ = దూడలనున్నూ, హరించి = దొంగిలించి, తండ్రికిన్ = తన తండ్రియైన శ్రీకృష్ణునకు, ద్రోహము తలచువాడు. (అని, యథార్థము.)

'బ్రహ్మగోవత్సములను గోపబాలకులను హరించుట' యను భాగవతకథ యిట అనుసంధానించుకొనవలెను.

దాసదాసత్వవర్తనుఁడు = దానిసరి దానిసగా (= తొత్తుక్రింది తొత్తుగా - నీచముగా) వర్తించువాడు, చేతన్ = తానుచేయు చేష్టలయందు, వికారితనము = వక్రత; అరాళగతి = వంకరనడవడి (= కపటవృత్తి) ఏతతేని, విడఁడు. (నీచుడు, వంకరచేష్టలు చేయువాడు, కపటవర్తనుడు, అని, ఉపాలంభము.)

దాస... ర్తనుఁడు = తనకుదాసు (=భర్త) లయినవారికి దాసునివలె అధీనుడై వర్తించువాడు (=భర్తృపరాధీనుడు.) చేష్ట = తానుకావించు సృష్టి, వికారి = అనేకదశాభేదములు కలది (=పెక్కు తెరగులయినది.) తన, మరాళగతి = హంసనెక్కి విహరించుట, ఏతతేని విడఁడు. (అని యథార్థము.)

నలువగలనుచూడన్ = ఇట్లు నాలుగు విధముల విచారించగా, నలువ=బ్రహ్మ, తులువకాఁడె = దుర్మార్గుఁడుకదా. అతనిన్, అనఁబనియేమి = నిందించి యేమిప్రయోజనము? ఆతనికి - లోకాధిపత్యమిచ్చి, అందఱిలోను, తలయెత్తికొనెడునటులన్ = గౌరవము గలిగి మెలగునట్లు, చేసిన, ఈశ్వరుననుటగాక = ఈశ్వరునే నిందింపవలయును.

బ్రహ్మకు తొలుత అయిదు తలలుండెననియు, ఒకప్పు డీశ్వరుఁడా అయిదింటిలో నొకదానిని త్రుంచెననియు, నాటనుండియే ఆతడు నలువయయ్యెననియు పురాణకథ.

[ఆ తునిమినవాడు తక్కిన నాలుగు తలలనుగూడా తునిమియున్నచో, ఇట్టి యిక్కట్టులు మాబోంట్లకు గలుగకుండెడివిగదా - అని, రత్నాంగి విలాపము.]

మొగమున వ్రేలు - (జాతీయము.)

“నా, మొకమున వ్రేలుచున్నయవి మువ్వురమూర్తులనంచు నార్తుఁడై”
(ఉ. హరి. 2-6.)

“కౌరవ్యసైన్యము లంతంతఁగలంగ బాఱినటులై నా మోమునన్ వ్రేలెడిన్.”
(ఉద్యో. 2-188.)

'ఆసనుఁడు.—పంకజాతములకు 'ఆసనము' అని, అమహత్తుగా జెప్పుటకుబదులు.- 'ఆసనుఁడు' అని మహత్తుగా చెప్పుట శ్లేషార్థము. అట్లుచెప్పుట తప్పుగాదు. ప్రాచీనకవి సమ్మతమే.—

†క. "పాండవవజ్రప్రాకారుఁడు జామ్ముండెను" (భార. ఆది. 6-185.)
సీ. "అఖిలభూమీపాలకాస్థాన కమలాక
రోదయతరుణ 'సూర్యోదయుఁడవు." (పాండు. 1-24.)

మ అని శోకించుచు నున్న తల్లిఁగని "యమ్మా, నేను జిత్రాంగి న
ట్లనె నీమాఱుఁగ నే [1] తలంతును, మరుల్వాటిల్లి యాయమ్మ న
న్నెనయన్ గోరిన నియ్యకోక కడ కే నేతెంచితిం గాని పా
వని, యేదోసము నేనెఱుంగను మనోవాక్కాయ కర్మంబులన్. ౫3

టీక.— ఇయ్యకోక = ఒప్పుకొనక, పావని = పవిత్రురాలా, మనో...ంబులన్ = మనస్సు, వాక్కు, కాయము - అను వానియొక్క కర్మములచేత - ఏదోసమును ఎఱుఁగను - (అనగా, ఆమెను గూర్చి తప్పుగా నేను మనసున తలపలేదు; తప్పుమాట నోట నుడువలేదు, తప్పుపని చేయనూలేదు. — అని, భా.)

ఇయ్యకోక = ఇయ్యకొనక (వివరములకు - బాల. శర. పు. 203. చూచునది.)

## —•సారంగధరుడు తల్లినోదార్చి హితవు చెప్పుట•—

ఉ. అమ్మరో, పోలుపొం దెఱుఁగ [2] కమ్మనుజేశుఁడు నాలిమాట ని
క్కమ్మని కోయఁ బంచె సరగన్, సభవారు నుపేక్షసేసి నా
యమ్మ దలంప కిచ్చకపు మాడిరిఁ, కేమనవచ్చుఁ! గన్న మో
హమ్మున నీకుఁ బోదుగను కార్తిఁగలంగుచువచ్చి తివ్వేడన్. ౫౪

టీక.— మనుజేశుఁడున్ = రాజుగూడా, పోలుపొందెఱుఁగక = మంచిచెడ్డ విచారింపక, ఆలిమాట = తన ప్రియురాలిమాట (నాలిమాట = ఆచిత్రాంగి వంచన వాక్కు) నిక్కమ్మని, కోయన్ పనిచెన్ = నాకాళ్ళుచేతులు నరుకవలసినదని ఉత్తరువుచేసెను. సభవారును, ఉపేక్షచేసి = ఈగొడవ మనకెందు కనుకొని, ఇచ్చకమె ఆడిరి = ముఖప్రీతిమాటలే పలికిరి.— నీకు, పోదుగనుక = తప్పదు కాబట్టి, ఆర్తిన్ = మనోవ్యథతో, కలంగుచున్ = క్షోభించుచు, వచ్చితి = వచ్చితివి.

---

†చూ. శ్రీతిరుపతివేంకటకవుల 'భారతవిశేషములు.'

1 శా. పా.— 'తలంపుదు'.

2 శా. పా.— 'అమ్మనుజేశ్వరుఁడాలిమాట' ('నాలిమాట' అను పాఠము తంజ. ప్ర. మూడింటిలోనున్నది.

'పోలుపొందు' - జాతీయము.—"పోలుపొందులేకుండా మాట్లాడుట To talk without rhyme or reason." (బ్రౌను.) "...అనిపల్కి పార్థివేంద్రునకు, బోలుపొందుగఁ మదిబొంకనోరార్వ, నేయుపాయములేక." (నవ. పు. 89.)

'నీకుపోదు' ఇదియును జాతీయమే.—

ఎ. గీ. "అంతరాయాంధకారంబు లలమికొనిన
నడఁచు నిజధైర్యసూర్యోదయంబుచేత
దానవారిని గుఱిచేసి - తనకుఁబోదు
నాకుఁబోదనినమ్మి సుశ్లోకుఁడతఁడు." (పాండు. 2—29)

ద్వి.— 'పోకాడినట్టి యాప్రోడని కేద్వ
*నాకుఁబోవదుగాక; నాసూత్రధారి; (గౌ. హరి. పు. 208.)

గీ. చెల్లఁబో నీకు సాధ్వీమతల్లి వైన
తల్లి [1] కీ తళ్లు వచ్చెఁగా దన్నుఁ గనుట
వల్ల! నీ వల్లధారుణీవల్లభాజ్ఞ
మీఱి యీరీతి వచ్చుట మేరఁ టమ్మ?

టీక — తన్నుఁ కనుటకు = నిర్భాగ్యుడనైన నన్ను గనుటవలన, నీకు ఈ - తళ్లు = ఇక్కట్టులు, వచ్చెఁగా = వచ్చెనుగదా.

---

* ఇది ప్రాచీనముద్రణపాఠము. ఈ పాఠము తప్పని, వే. వేం. శాస్త్రిగారు 'నాకుఁబోలునుగాక' అని దిద్దినారు. దిద్దుబాటువలన జాతీయము పాడయినది.

1 శా. పా.— 'తల్లి కీదళ్లు'. ('ఈదళ్ళు = ఇడుమలు' అని పూ. టీ.)

'ఈదళ్ళు' అని యేకపదముగా గ్రహించుట తప్పు. ఇడుములు - అను నర్థమిచ్చు పదము 'తళ్లు' గాని 'ఈదళ్ళు' కాదు; 'దళ్లు' ను కాదు. ('ఈదళ్లు' అను మాట భాషలో లేదు 'దళ్ళు' దడి - కి బహువచనరూపము.)

'తళ్ళు' అనగా ఉపద్రవము; ఇబ్బంది. ఈ మాట తెనుగు కుటుంబములలో పసిబాలురును వాడునదే. 'హైదరుతళ్ళు' ప్రసిద్ధము. "పోతననాటికిఁ గాకతీయ రాజ్యము చిదికి పోయినది. తురుష్కుల తళ్ళువచ్చినది." (శృ. శ్రీనాథము. పు.39.) విదేశీయుడైన బ్రౌను మహాశయుడు "తళ్ళు - A rush (of water). Inroad, incursion. — దళ్ళు the plu of దడి" అని చక్కగా వివరించి యున్నాడు. ఈ 'తళ్ళు' శ. ర. కర్తయే యెరుగడు, పూ. టీ. కర్త లెరుగు టెట్లు?

చ. [1]అడలకు మమ్మ, నీవు కల నైనను రాజును దూఱకమ్మ, యే
యెడల సపత్నితోఁ జెలిమి యించుక [2]దప్పకుమమ్మ, నాదుసం
గడిఁజరియించు నాదుచెలికాండ్రను నావలెఁజూడవమ్మ, యిం
పడరఁగ నన్నిఁక న్మఱవవమ్మ, విచారము మాని మానినీ. ౯౬

టీక.—అడలకుమమ్మ = తల్లీ శోకింపకుము. సపత్నితోఁ = సవతితో, నాదు సంగడిఁ = నాతో.

---

1 శా. పా.— 'అడలకువమ్మ.' 2 'దప్పకువమ్మ.'

పూ. ము. న 'అడలకుమమ్మ'—'తప్పకు మమ్మ' అని యున్నది. ఆపాఠము తప్పని శాస్త్రిగారు- 'వమ్మ'—'వమ్మ'. అని దిద్దినారు. పెద్దపొరపాటు. ఈ పొరపాటును వారు శృం. నై. మొదలగు కావ్యములను దిద్దుటలో పెక్కుతావుల చేసియున్నారు.—

శృం. నై. (1-109)లో 'నిగ్రహింపకుమయ్య' అను ప్రాచీనపాఠమును 'నిగ్రహింపకువయ్య' అని దిద్ది (దిద్దినట్లు చెప్పక) 'ఇట సంప్రార్థనంబున ముజ్జునకు 'అయ్య' అను ప్రయుక్తముకాఁగా ఏకవచనమున 'వుజీ' వచ్చినది. బా. వ్యా. క్రి. 34'. అని వ్రాసినారు. ఇట్లే 'విజయ - (3-34)లో 'గొంకెదునంచు మీరిపుడు గోలని చూడకుఁడమ్మ' అని యుండవలసినచోట, 'చూడకురమ్మ' అని దిద్దినారు. వారు సూత్రమును సరిగా అర్థముచేసికొనలేదు. 'ముజ్జు'నకు అయ్య - అమ్మ, అను ప్రయుక్తమయినను - ప్రార్థనమునసేగాని 'వ్యతిరేకప్రార్థనము'న వుజీ, రుజీ, రావు. రావని వ్యాకరణకర్తలు స్పష్టముగా వ్రాసియున్నారు.

(1) వావిలికొలను సుబ్బరావుగారు.—

"వ్యతిరేకప్రార్థనంబున నన్నాదు లనుప్రయుక్తంబులైనపుడు వు-రు-లు రావు. ఉ. త్రిప్పకుమన్న; చెప్పకుమన్న; తప్పకుమన్న; అనకుమయ్య". —సులభ వ్యా-క్రి.40.

(2) త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు.—

'వ్యతిరేకంబున అన్నాదులు చేరునపుడు 'వు-రు'లు రావు. ఉ. త్రిప్పకుమన్న; చదువకుమయ్య; మొదలగునవి. —వ్యాకరణబోధిని. పదపరి. సూ. 167.

(3) విద్వాన్, దూసి రామమూర్తిశాస్త్రిగారు.—

"ఎకారము మొదలుకొనియుండు నాఱును 'ఎదాదు' లని గ్రహించిన పక్షమున నీ విధి నిత్యమగుటంజేసి - వినుమమ్మ - వినుమయ్య - వినుఁడమ్మ, వినుఁడయ్య, అనురీతి [illegible]పములును, వ్యతిరేకమున - వినకుమమ్మ, వినకుమయ్య, వినకుఁడమ్మ, వినకుఁడయ్య, అనురీతి రూపములును నసాధువులు కావలసి యున్నవి. మఱియు,

క. జననీ విచ్చేయుము నీ
వనుచుఁ సాష్టాంగవినతుఁడై లేవనిచో
ననుఁ, గలుదులప్రో వగు తన
యనుఁగరుదులబిడ్డఁ జూచి యవనతకర యై. ౯౭

టీక.— కలుదులప్రోవు = సద్గుణములకు నిలయము - (కలదు - శ. ర.) అగు = అగునట్టి, తన, †అనుఁగు - అరుదులబిడ్డన్ = ప్రియమైన - అబ్బురపు కొడుకును, చూచి, అవనతకరయై = (దీవించుటకు) చేయివంచి.

---

'వినవమ్మ; వినవయ్య' అనురీతిరూపములు శ్రుతి కసమ్మతములైనను సాధువులు కాలసియున్నవి, కాన ఎదాదులను విభాగ మచ్చులకు సంబంధించినదేగాని 'యయ్య - యమ్మ - యప్ప - యన్న' మొదలగు పూజ్యార్థకము లందుఁ జేరవనియు, దాన నదాదులు (అ - ఆ - ఇ - ఈ), ఎదాదులు (ఎ - ఏ - ఒ - ఓ) ... పరమగు నపుడే యీవిధి వర్తించునుగాని యయ్య మున్నగునవి పరమగునపుడు గాదనియు గ్రహించుట యుచితమని తోఁచెడిని"— (బాల. సా. స. పేటిక.)

కొన్ని ప్రయోగములు.—

(1) 'గురునిభుండ నాకుఁ గూర్తేని చేయకు, మయ్య' (ఆది.)
(2) 'వెఱవకుమన్న పోటు కురువీరులతోడ' (విరాట. 4-83.)
(3) 'అనుపమసత్యవిస్ఫురణ నాడినమాట మఱాకుమన్న' (ఉద్యో. 4-70.)
(4) 'అన్నలక్ష్మణ యోడకుమన్న' (ఆరణ్య. 6-359.)
(5) 'భయముం జెందకుఁడయ్య నిర్జరవరుల్' (భాగ. 7-110.)
(6) 'వెఱవకుఁడయ్య రక్కసుఁడు' (యయాతి. 2-115)
(7) 'చెలిమి దప్పకుమమ్మ చిత్రాంగిదేవి' (నవ. పు. 72.)
(8) 'అడలకుమమ్మ చిత్రాంగి దేవమ్మ' (బా. శంభు. సారంగ. పు. 77.)

ఆశాస్త్రిగారి దృష్టిలో 'పాటింపుమయ్య' అను రూపముగూడా తప్పే. 'వయ్య' అని దిద్దియున్నారు. ఈ సందర్భమున వారు చాలా పొరపాట్లు చేసి యున్నారు. ఆచర్చ కిది చోటుకాదు.

† పూ. టీ.— 'అనుఁగరుదుల = ప్రియమయిన వింతచర్యలు గలిగిన.'

అరుదులబిడ్డ యనగా లేకలేక అరుదుగా గలిగిన కొడుకనుట యుచితముగాని 'వింతచర్యలు గలిగిన కొడుకు' అనుట యుచితము కాదు. మరియు, 'అనుఁగు - అరుదులు = ప్రియమయిన వింతచర్యలు' అనుటీక వింతటీక. వింతచర్యలలో ప్రియమయినవి - కానివి అని రెండు రకములా?

క. లేవోయి యన్న † 'రేపటి
దీవన నేకొదువ లేక దీర్ఘాయుఁడ వై
దేవునికృప వర్ధిల్లుము
నీ' వని దీవించి మిగుల నెగు లుప్పొంగన్. ౯౮

ఉ. 'కందుఁ గదయ్య నీమురువు కన్నులపండువు గాఁగ; నంటినం
‡గందుఁ గదయ్య నీతనువు; కౌతుక మొప్పఁగ నీదుప్రాపు నేఁ
గందుఁగదయ్య యంచు నినుఁగన్న సపత్ని సహింప దందుఁ బో
కందుఁ గదయ్య, యేల విననైతివి నావచనంబు పుత్త్రకా. ౯౯

టీక.— నీ, మురువు = సోయగము, కన్నులపండువు కాఁగన్, కందున్ కదయ్య = చూతునుగదరా తండ్రీ; నీ తనువు, అంటినన్ = కందున్ కదయ్య = కంది పోవునుగదా? (అంత సుకుమారమనుట.) కౌతుక మొప్పఁగన్ = కోరిక తీరగా, నీదు ప్రాపున్ = నీయండను, కందున్ కదయ్య = పొందుదునుగదా, అంచున్ = అనుకొనుచు.— నినుఁగన్నన్, సపత్ని = నాసవతి (చిత్రాంగి) సహింపదు = ఓర్వదు, అందు = అక్కడికి, పోకు+అందున్ - కదయ్య = పోవద్దురా అని చెప్పితినిగదరా.

తండ్రీ, నిన్ను చూచుకొని యానందింతును, నీప్రాపున నేనుమహోన్నతిని గాంతునని కొండంత ఆశతోనుంటిని. నిన్ను చూచిన యెడల నాసవతి అసూయ చెందును; ఆ వైపు పోవద్దంటిని. నామాట యెందుకు విననైతివిరా, అని - తా.

పోకు + అందు = పోకందు. సాధువే. (చూ. ప్రౌ. సంధి. 18.)

సీ. చంద్రోదయం బైన చందాన నీరాక
గన్నులు[1] చల్లఁగాఁ గాంతు నెపుడు,
నినుఁ[2] గొండ గాఁ జూచుకొని యేవిచారంబు
లేక యుందుదు నాత్మ లేశమైన,

---

† పూ. టీ.— 'రేపటిదీవనన్=రేపు ఫలించెడు నాశీర్వచనముచేత' ఈయర్థము సరియైనది కాదు. అన్ని ప్రతులలోను పాఠమిట్లే యున్నది.

‡ శా. పా.— 'కందుఁగదయ్య నీతనువు, కౌతుక మొప్పఁగ నీదు ప్రాపు; నేఁ గందుఁ గదయ్యయంచు, నిను...'

వారు పెట్టిన విరామచిహ్నములవల్ల సరియైన యర్థ మేర్పడుటలేదు.

1 శా. పా.— 'చల్లగా'.— తప్పు. (చూ. ౧౫ పద్యముక్రింద)

2 శా. పా.— 'కొండఁగా'.— తప్పు. (చూ. ౨-౨౨౬ క్రింద)

నిసుమంతదడ వైన నీవు రాకుండిన
నది యేమొ రాఁడని యెదురుచూతుఁ,
వెలియఁ జూచినయెడ దృష్టి దాఁకునో యని
వేడ్క[1] దీరఁగఁజూడ వెఱతు నిన్ను,

గీ. నెటువలెఁ దరింతు? నీరూప మెచటఁ గందు?
[2]నీ విఁకను వత్తు వని యెందు నెదురుసూతు?
మనసులో నిన్ను నేలాగు మఱవ [3] నేర్తు?
నీవు లేనిది యొక బ్రతుకే కుమార! ౧౦౦

క. తనయాత్మకు §వే్రఁగాయెనె?
తనయా, యిపు డెంత సేసె దైవ †మయో! నీ
¶తనయా, యిఁక నెటులఁ దరిం
తనయాప్తిని? నే నభాగ్య నగుజంత నయా. ౧౦౧

టీక.— తనయా, తన ఆత్మకున్ వే్రఁగు - ఆయెనె = దైవము మనసుకు నీవు బరువైతివా? అయో? దైవము - ఇపుడెంతచేసెన్; నీత - నయా = పొందింపబడిన నీతికలవాడా = న్యాయనిధీ.' * అనయ + ఆప్తిన్ = ఈ యన్యాయప్రాప్తిని = నాకు తటస్థించిన యన్యాయమునుండి, ఎటుల తరింతున్ = ఎట్లుకడ తేరుదును? నేను, అభాగ్యనగుజంతనయా = భాగ్యహీనురాలనగు దుర్మార్గురాలనయ్యా.

---

పాఠాం.— 1 'దప్పక' 2 'నీవిటుకువత్తువని యెందు నిలిచిచూతు 3 'వచ్చు'

§ శా. పా.— 'వే్రగాయెనె' ('వే్రగు = భారము' - పూ. టీ.)

'వే్రఁగు' సార్ధబిందుకము. (చూ. శ. ర.) శా. పా. నమ్మి వావిళ్ళవారును నిరనుస్వారముగానే ముద్రించినారు.

† శా. పా.—'అయోనిన్' (అర్థమేమో? పూ. టీ. లేదు.)

¶ శా. పా. 'తన-యానిక' ('ఆనికన్ = కష్టమును' - పూ. టీ.)

'ఆనిక'కు, కష్టము - అను అర్థము కోశములలో లేదు. పై పెచ్చు 'ఆధారము; ప్రాపు; ఊఁత' అను అర్థములు చెప్పబడియున్నవి. (చూ. సూ. ని.)

పూ. టీ.—'అనయ ఆప్తిన్ = ద్రోహము సంభవించినందున, జంతను = దుష్టురాలను.'—అంటే అర్థమేమో? భావమేమో?

తరింతుక్ + అనయాప్తి = తరింతనయాప్తి.— ఈసంధి భారతకవి సమ్మతమే. ఉ. "గాండివినొవ్వఁబల్కి—తిటు కర్ణునిఁ జంపక వచ్చితేని త, మ్ముండవుగావు నాకు నని." (శాంతి. 1-14.)

సీ. జననవేళలు సూచి ఘనుఁడౌ ననిరిగాని
వెలయ లేఁ డని నాఁడె దెలుప రైరి,
కరము రేఖలు సూచి ఘనుఁడౌ ననిరిగాని
ప్రబలలేఁ డని నాఁడె పలుకరైరి,
గతిలక్షణము సూచి ఘనుఁ డౌ ననిరిగాని
యీడేఱఁ డని నాఁడె యెంచరైరి,
యనుపమాకృతిఁ జూచి ఘనుఁడౌ ననిరిగాని
కడ తేఱఁ డని నాఁడె నుడువరైరి,
గీ. కటకటా! నమ్మఁ దగ; దేడ [1]గ్రహబలంబు?
లేడ సాముద్రికము? లిఁక నేడ చిన్నె?
లేడ ఘనగాత్ర[2]మహిమము? లేడ సుద్దు?"
లంచు రత్నాంగి సుతుఁ జూచి యలమటించు. ౧౦౨

టీక.— జననవేళలు = జన్మకాల నక్షత్రాదులు, కరము రేఖలు = అరచేతిగీతలు, గతిలక్షణము = నడకలోనితీరు, అనుపమాకృతి = సాటిలేని యాకారము.—వీనికి గీతము లోని, గ్రహబలములు; సాముద్రికములు; చిన్నెలు; గాత్రమహిమలు, అనువానితో క్రమముగా అన్వయము. అలమటించున్ = దుఃఖించును.

క. పలవించుఁ, బల్లటించుక్,
బలపల కన్నీరు నించుఁ, బసివాఁ డంచుక్
విలపించుక్, బాలు పెంచుక్,
దలవరులకు నప్పగించుఁ, దల యటు వంచుక్. ౧౦౩

టీక.— పలవించుక్ = వెఱ్ఱివెఱ్ఱిమాటలాడును. పల్లటించుక్ = తల్లడిల్లును, విలపించుక్ = ఏడ్చును, పాలు పెంచుక్ = పిల్లవాని యందమును తలంచుకొనును.

1 శా. పా.— 'గ్రహబలంబు - నేడ' 2 'మహిమలు నేడ'. 'మహిమల నేడ' అని పాఠాం.—

చ. కనుఁగొని మూర్ఛిలుం, దెలియు, గాసిలు, నౌదలయూఁచు, 'నేఁటితో
నిను నెడఁబాసి పోవలసెనే' యని యక్కునఁ జేర్చుఁ, బోదునా
యను, నటు గొంతపోవు, నుసురంచు వెసం జనుదెంచుఁ, దొట్రుపా
టెనయు, లతాంగి; కన్నకడుపేగతి నోరిచి యుండు నక్కటా. ౧౦౪

టీక.— ఔదల = శిరస్సు, ఎనయున్ = పొందును.

క. ఇటువలెఁ బెక్కుదెఱంగుల
నట వనటఁ దొలంగి రాక యాఱటపడఁగాఁ,
దటుకున †'నిది రా జెఱిఁగిన
నటమట మగుఁ గార్య' మనుచు నాళీజనముల్. ౧౦౫

టీక.— వనటన్ = దుఃఖముచేత, అట తొలంగిరాక = ఆచోటినివదలి యువతిలికి రాక, రాజెఱిఁగినన్, కార్యము = తమపని, అటమటము = ఇబ్బంది - అగునని, ఆళీజనముల్ = (రత్నాంగియొక్క) చెలికత్తెలు.

ఉ. చేడియ రమ్ము, వెన్నెలయుఁ జీఁకటివంటివి సుమ్ము మేలునుఁ
గీడును, గొంతకాలము సుఖించినవార కృశింతు రార్తిమై,
నాడిక లొందువార సుఖ మందుదు, రోడలు బండ్ల వచ్చు, బం
డ్లోడల వచ్చు, నీకు నిటు లూరక చింతిల నేల మానినీ? ౧౦౬

టీక.— సుఖించినవా(రు + అ) ర = సుఖించినవారే, ఆర్తిమైన్ = దుఃఖముతో, కృశింతురు, ఆడికలొందువార = నిందలను పొందినవారే, సుఖమందుదురు.— ఓడలు, బండ్లన్ = బండ్లయందు (=మీద) వచ్చును, ఆబండ్లే ఒకప్పుడు - ఓడలన్ వచ్చును.— మేలు కీళ్ల తత్త్వ మిట్టిది.

## —◆ అరణ్యవర్ణనము ◆—

వ. అని యూఱడిలం బలుకుచు నిరుగడలఁ జేతులు వట్టి[1] మిగులఁ దెగువందిగువంబడియున్న మగువఁదిగువఁ, బ్రౌఢసఖీవారంబు బలాత్కా-

---

† శా. పా.— 'నిటు' - (ఇది పూ. ము. పా.) 'ఇది' తంజ. ప్రతులపాఠము. సందర్భోచితము.

[1] శా. పా.— 'తిగువం దిగువంబడియున్న మగువం దెగువ.'— (ఇది పూ. ము. పా.)

రంబున నెట్టకేలకుఁ [2] బట్టి నెడఁబాసి, గాసి యగు నెగులునం దనుం గనుంగొని పురజనంబులు పురపురం బొక్కుచుఁ బురస్కరింప నత్యంత ఖిన్నత్వ [3] మంది మందిరంబునకుం జని తనుజుని గుణబృందంబుల డెందంబునం దలంచి నోరఁ[4] గాయయిడక యద్దేవి పరిదేవనంబు గావించుచుండె(a)నంత నాక్షణంబున నగరరక్షకు లక్షీణనిశితకౌక్షేయక ప్రకాండ ప్రచండభుజాదండులై దండధరకింకరులననుద్దండతగండుమెఱసిర సామండలాధిపకుమారుం గొనిపోయి (b)నిజశితవిషాణ [5] కృపాణరణ శబ్దగుణ వారణాహ్వానసంవిధానసూచకమస్తకోపరిన్యస్త ప్రత్యాంకుచిత[6]హస్త నిస్తులాదభ్రవిభ్రమ[7]ధురంధరసింధుర దిక్కూలంకషాహంకార ఘీంకార సంకులంబును(c)నక్షుద్రమాధురీధురీణక్షౌద్రలిలిక్షా [8]జిహ్వాచాపలాచ్ఛభల్లఖరనఖరభల్లముఖవిదళితబహునాకుకుహరముహుర్ముహుర్బహిర్నిర్గతానర్గళకుండలిమండలీగ్రసనసముల్లసద్వనమయూరకేకాకులవ్యాకు

2 శా. పా.— 'బట్టితీసిన' (ఇది పూ. ము. పా.) 3 'మొంది'

4 శా. పా.— 'నోరు గాయపడఁగ' (పూ. టీ. లేదు.)

'నోరగాయలిడక' అని పూ. ము. పా. 'నోరగాయయిడక' — 'నోరగాయవేయక' అని, తంజ. పాఠములు. 'నోరఁ గాయయిడక' (=వేయక)' - ఇది యొక జాతీయము. నోరుమాతపడపడకుండా' అని యర్థము.—

క. 'అంగములు మిగుల నలియఁగ
'నుంగే- యుంగే' యటంచు నొక నిమిషము నో
రంగాయవేయ కేడ్చుచు
నంగీకృత బాల్యచేష్ట నతఁడట్లుండెన్.' (పరమ. 1 ఆ.)

ఆ. వె. 'రక్తముఖులు, కావరపు జాతులు, కుజా
త్యాశ్రయములు మీరలగుటఁ జపల
వృత్తి నోటఁ గాయవేయక వదరుచుఁ
గలఁచెదరు లతాంగిఁ జిలుకలార.' (కవి. మనో. 3-145.)

5 శా. పా.— 'విషాణరణ' 6 'హస్తప్రశస్తాదభ్ర.' 7 'ధురంధరదిక్కూలంకషసింధుర ఘీంకార'. 8 'జిహ్వా - పల్లవాగ్రచాపల.'

లంబును(d)ననేకోలూకత్రోటికోటిత్రుటితకోటరనిద్రాణకరటకులోడ్డయన
గరుత్పటలపటపటార్భటికావిఘటితనిద్రాతంద్రావిద్రావి కపికంపితశాఖి
శాఖాసహస్రపరిపతితపరిణతఫలరస ప్రపూరపూరితనానాలతాలవాలవ
లయంబును(e)బ్రవృత్తసంవర్తసమయసమున్నిద్ర×సముద్రకలిలసలిలగా
ఢావగాహదుర్విషహసర్వంసహాసముద్ధరణచణశాంబరీకిటివిడంబనాడం
బరలంపట ఘోరతర ఘోణాముఖనిఖాతక్ష్మాతలగర్భనిర్భరబల స్తబ్ధరో
మస్తోమాస్తోకనిర్ఘాతపాతస్ఫీతభీషణఘుర్ఘురనిర్ఘోషణాచంకంప్యమానద్రు
మపరంపరాభయంకరంబును(f)దుర్ధర్షతరామర్షప్రపంచితచపేటికానిహత
బహుళహరిణగణగళగళితరుధిరధారార్ద్రచరణవిన్యాసదీపిత నిజపద్ధతి
నివేదితవ్యాఘ్రసమూహదురవగాహంబును నై, సత్త్రంబు గావున నఖిల
ద్విజాశ్రయం బై, వనంబు గావునఁ బుండరీకనిలయం బై, కాననంబు
గావున సకలాగమరమణీయం బై, కుంజరహిత స్థలంబు గాకుండియుఁ
గుంజరహితస్థలం బై, † సుమనస్స్థానంబు గా కుండియు సుమన
స్స్థానం బై, పల్లవాగమ్యంబు గాకుండియుఁ బల్లవాగమ్యం బై, యొప్పు
నకాంతారంబు సొచ్చి, యచ్చట నకాలసంధ్యా‡రాగకృదభ్రంకష
చిటాచిటార్భటీనటచ్ఛటులదావపావకోత్తాలం బైన కుత్కీలంబు నోలం
బున నిల్పి, తా మంతకు ముందుగ నృపసత్త్రము చేత ¶ మూఁడుత్త
రువులుఁ గొన్నవా రగుటం జేసి యాసత్పురుషారాధ్యుని వధ్యశిల
మీఁద నునిచి యయ్యెడ. ౧౦౭

---

(d) పాఠాం.— 'ఉలూకానీకచ్ఛేదితపాదపాగ్రనిద్రాళుపరభృదంబాళిగరుత్పటలపటపటార్భటికాచలితోన్నిద్రశాఖామృగజాలకోలాహలంబును.'

(e) పాఠాం.— 'అధోభువనజరఠనిజకులపరివృఢసాహాయ్యకర్మఠశంకాహఘోణముఖక్షుణ్ణక్షోణీతలోన్నమన్మస్తాల స్తబ్ధరోమాస్తోకానోకహపరంపరాకంపమానఘుర్ఘురనిర్ఘోషభీషణంబును.— × శా. పా.— 'సముద్రసలిల.'

(f) 'కంఠలుంఠనప్రసరదస్రుధారాపానపరితృప్తద్వీపిగుప్తమృగకులవ్రాతపూతిగంధ్యాహూతవృకజంబుకనికరనాదమేదురంబు నై.'

† అధికపాఠము.— 'విద్రుమస్థానంబు కాకుండియు విద్రుమస్థానం బై.'

‡ శా. పా.— 'రాగవదభ్రంకష.'

¶ శా. పా.— 'మూఁడుత్తరములు' (ఇది పూ. ము. పా.)

టీక.— ప్రౌఢ...రంబునన్ = దిట్టలయిన చెలికత్తెలయొక్క బలవంతముమీద, పట్టిన్ - ఎడఁబాసి.— పురస్కరింపన్ = ఓదార్చుచూ ముందు నడవగా, తనుజుని = కుమారునియొక్క, గుణబృందంబులన్ = సద్గుణసమూహమును, తలంచి, నోరఁగాయ యిడక = నోరు మూతపడకుండా, అద్దేవి = రత్నాంగి, పరిదేవనంబు కావించు చుండెన్ = వాపోవుచుండెను.—

(a) నగరరక్షకులు = తలారులు, అక్షీణనిశిత = మిక్కిలి వాడియైన, కౌక్షేయకప్రకాండ = గొప్ప కత్తుల (నుధరించుట) చేత, ప్రచండ = భయంకరములైన, భుజాదండులై = దండములవంటి భుజములు కలవారై (= పెద్దపెద్ద కత్తులను భుజములమీద పెట్టుకొని) దండధర కింకరులనన్ = యమునిదూతలో యన్నట్లుగా, ఉద్దండతన్ = భయంకర వర్తనముచేత, గండుమెఱసి = అతిశయించి, రసా...మారున్ = రాజకుమారుని (= సారంగధరుని) కొనిపోయి,

---

ఉత్తరమనగా జాబు. (Letter) వధచేయబోవువారు జాబులు తీసికొని పోవుట యెవరికి? మూడు జాబులనుటలో భావమేమో పూ. టీ. కర్తలు తెలుపలేదు. వధచేయబోవువారు తీసికొని పోదగినవి 'ఉత్తరువులు' గాని 'ఉత్తరములు' కావు. 'మూఁడు త్తరువులుఁ గొన్నవారు' అనియే తంజ. ప్రతులపాఠము. 'మూఁడు త్తరువులు కొనుట' జాతీయము. ముమ్మాటికిని సెలవుపొందుట - అనియర్థము. 'సారంగ' కు మూలమయిన నవనాథచరిత్రమునను, ఇతర కావ్యములందును ఈజాతీయము ప్రయుక్తమై యున్నది.

"కులపర్వతముఁబోలు కొండచేరువను-నిలిపి కొందఱువోయి నృపునిముమ్మాఱుం-సెలవులుగొని, వధశిలమీఁద నునిచి." (నవ. పుట. 74.)

"ఈరీతి నెడసేయ నేల భూవిభుఁడు,
సెలవులు మూఁడు నిచ్చినమీఁద మీరు." (నవ. పు. 75.)

వ. "దొంగయగుననినిశ్చయించి యభిమానధనుని కెఱిఁగించి మూఁడు త్తరువులుఁ గొని...అతని వధియించి." (శుక 3—583.)

"వెసఁద్రుంపుమని చెప్ప వీరబాహునకు,
మసలకు; మిదియె ముమ్మాటికి సెలవు." (గౌ. హరి. పు. 231)

"చెదరక మును మూఁడు సెలవుల నొసఁగి
యానతిచ్చిన చందమంతయుఁ దెలియ." (గౌ. హరి. పు. 233)

ఇట్లు - 'మూఁడు మెచ్చులు' అనుటయును కలదు.—

గీ. "అనుచుఁ గోఁగిటఁ గదియించి యగ్రజాత, చెలియలని నిట్లు మూఁడు మెచ్చులును మెచ్చె." (మల్లన. విప్ర. 4—12.)

(b) నిజ. = తమయొక్క, † శితవిషాణ = పదునైన కొమ్ములనెడి, కృపాణ = కత్తులతోడి, రణ = యుద్ధమునకు, శబ్దగుణ వారణ = ఆకాశగజమును = ఐరావతమును - (ఆకాశము శబ్దగుణకము.) ఆహ్వాన = పిల్పుటయొక్క, సంవిధాన = ప్రకారమును, సూచక = తెలియజేయుచు, మస్తకోపరిన్యస్త = తలమీద ఉంచబడినట్టియు, ప్రత్యాకుంచిత = మరల వంచబడినట్టియు, హస్త = తొండముల యొక్క, నిస్తుల = సాటిలేని, అదభ్రవిభ్రమ = గొప్ప సంచలనముయొక్క, ధురంధర = భారమునువహించిన (= తొండములను మాటిమాటికిని పైకె క్రిందికి ఆడించుచున్న) సింధుర = ఏనుగులయొక్క, దిక్కూలంకష = దిగంతముల వరకును వ్యాపించుచున్న, అహంకార ఘీంకార = గర్వముతోడి శబ్దములచేత, సంకులంబును = నిండినదియు;

(c) అక్షుద్ర = అధికమైన, మాధురీధురీణ = తీపితోనిండిన, క్షౌద్ర = తేనెను, లిలిక్షా = నాకవలెననుకోరికచేత, జిహ్వాచాపల = నోరూరుచున్న, (= తేపతేపకును నాలుకను కదలించుచున్న) అచ్ఛభల్ల = ఎలుగుబంట్లయొక్క, ఖరనఖర = వాడియైన గోళ్లనెడి, భల్లముఖ = బల్లెముల మొనలచేత, $ విదళిత = భేదింపబడిన (= త్రవ్వబడిన) బహునాకు = పెక్కుపుట్టలయొక్క, ('వామలూరుశ్చ నాకుశ్చ వల్మీకమ్.' అమ.) కుహర = కోమలనుండి, ముహుర్ముహుః = మాటిమాటికిని, బహిర్నిర్గత = బయటికివచ్చెడి, అనర్గళ = అడ్డులేని (మిక్కిలి జవవంత

---

† పూ. టీ.— 'విషాణరణ = కోటలతో యుద్ధమునకు'

ఏనుగు దంతమును 'కొమ్ము' అందురుగాని 'కోఱ' అనరు. అసలు విషాణ శబ్దమునకు శ. ర. లో 'కొమ్ము; ఏనుఁగుకొమ్ము' అనియే యర్థము వ్రాయబడియున్నది. లోకములో 'కొమ్మేనుఁగు' అను వ్యవహారమున్నది గాని 'కోఱయేనుగు' అనిలేదు.

"కొమ్మేనుఁగు విభీషణతంజనుదెంచు కైవడిక్" (విక్ర. 5-187.)

"ఏనుఁగుకొమ్మున దాడి బొమ్మునం, బెంచిన తల్లిదండ్రులకు" (విక్ర. 7-106.)

"అమ్ములనేనుఁగు కొమ్ముల, నమ్మత్తగజంబునొంచి." (భీష్మ. 2-246.)

అనియిట్లు కావ్యములయందు - ఏనుగుదంతము 'కొమ్ము' గానే వ్యవహృతమై యున్నది. శాస్త్రిగారి టీకలలో మాత్రము పలుతావులలో 'కోఱ' గా వాడబడినది.

$ పూ. టీ.— 'విదళిత = చీల్పంబడిన,' — ఎలుగు పుట్టను త్రవ్వునుగాని చీల్చదు. పుట్టచీలికలును కాదు. పూ. టీ. తెనుగు తెనుగువారి తెనుగుకాదు.

ము లైన) కుండలిమండలీ = పాములసమూహమును, (గ్రసన=తినుటయందలి, †వ్యసన= ఆసక్తిచేత, సముల్లసత్ = మిక్కిలిగా ఉత్సహించుచున్న, వనమయూర = అడవి నెమిళ్ళ, కేకారుల = కేకలమొత్తములచేత, వ్యాకులంబును = కలగుండుపడినదియు;

(d) అనేక - ఉలూక = పెక్కు గ్రుడ్లగూబలయొక్క, $ త్రోటికోటి = ముక్కుకొనలచేత, త్రుటిత = చీల్చబడిన, కోటరనిద్రాణ = చెట్ల తొఱ్ఱలలో నిద్రించుచున్న, కరటకుల = కాకులగుంపులయొక్క, ఉడ్డయన = ఎగురుటయందలి గరుత్ - పటల - పటుపటూర్భటికా = ఱెక్కలసమూహముల పటుపటు శబ్దముల సందడిచేత, విఘటిత = చెడగొట్టబడిన, నిద్రా = నిద్రవలని, తంద్రా = తందర (=కునికిపాటు) తో విద్రావి = పరువులిడుచున్న, కపి...బును = కోతులచేత ఊపబడిన చెట్లకొమ్మల మొత్తములనుండి రాలిన, ఆరబండిన పండ్లయొక్క రసప్రవాహములచేత నింపబడిన పెక్కుజాతుల తీవెల గుండ్రని పొదులు కలవియు;

(e) ప్రవృత్త=జరిగిన,సంవర్తసమయ=ప్రళయకాలమందు, సమున్నిద్ర=ఉప్పొంగిన, సముద్ర=సముద్రమునందలి, కలిల=చొరరాని, సలిల=నీటియందు,*గాధావగాహ= అడుగంటమునిగినదియు, (అందుచేతనే) దుర్విషహ=ఓరువరానిదియు (-తడిసిబరువెక్కినదని భా.) నైన, సర్వంసహా=భూమిని, సముద్ధరణ -చణ=పైకిలేపుటయందు నేర్పరియైన, శాంబరీకిటి = మాయపందిని (= ఆదివరాహమును) విడంబన = అనుకరించుటయొక్క, ఆడంబర = ప్రయత్నమునందు, లంపటు = ఆసక్తములై, ఘోరతరఘోణ = భయంకరపు ముట్టెలతో, ‡నిఖాత = కుళ్ళగింపబడిన, క్ష్మాతలగర్భ = భూమియొక్క లోపలి

---

† పూ. టీ.— 'గ్రసన = తినుటయనెడు, వ్యసన పనియందు.' వ్యసన శబ్దమునకు 'పని' యను అర్థములేదు.

$ శా. పా.— 'ముఖత్రోటి' ('ముఖ , త్రోటి ముక్కుయొక్క' అని పూ. టీ.) 'నోటి ముక్కు' అనగా ?

పూ. టీ.—'మునిఁగినదై, దుర్విషహ = ఓరువలేకున్న - భూమినిలేపుటకు'. 'దుర్విషహ' మనగా ఓరువరానిదిగాని 'ఓరువ లేకున్నది' కాదు.— "దుర్విషహ - unbearable, intolerable, irresistible". (అప్టి.)

‡ పూ. టీ.— 'నిఖాత చీల్పఁబడిన.'

నిఖాత మనగా గాని 'చీల్పఁబడినది' కాదు. "నిఖాత - Dug up, excavated" (ఆప్టి) పందులు భూమిని త్రవ్వును (= కుళ్ళగించును) గాని చీల్పవు.— "తక్కక నేలముట్టెఁ గొని త్రవ్వఁగ నేర్తునటంచుఁ దాకుతా, వొక్కటె జాతియంచు మదమొందకు బుద్ధిని వెజ్జిపంది." (చాటు - మంజరి. పు. 113) త్రవ్వు - చీల్చు, భిన్నక్రియలు.

భాగము కలవియు, నిర్భరబల = మిక్కిలి బలముకలవియు - నగు, స్తబ్ధరోమస్తోమ = అడవిపందుల సమూహముల, అస్తోకనిర్ఘాతపాత = పెద్ద పిడుగుపాటువలె, † స్ఫీత భీషణ = మిక్కిలి భయంకరమైన, ఘుర్ఘురనిర్ఘోషణా = ఘుర్ఘురధ్వనిచేత, ‖ చంకంప్యమాన = మిక్కిలి కదలింపబడుచున్న, ద్రుమపరంపరా = చెట్లగుంపులచేత, భయంకరంబును;

(f) దుర్ధర్షతర = భరింపరాని, అమర్ష = కోపముచేత, ప్రపంచిత = వెడలుపుగా చేయబడిన, § చపేటికా = పంజాలచేత ('పాణౌ చపేట ప్రతలప్రహస్తా విస్తృతాంగులౌ' అమ - సింహవ్యాఘ్రాదుల హస్తమును 'పంజా'అందురు.) నిహత = కొట్టి చంపబడిన, బహుళ = అనేకములైన, హరిణగణ = లేళ్లగుంపులయొక్క, గళగళిత = కంఠములనుండి కారిన, రుధిరధారా = నెత్తురుధారలచేత, ఆర్ద్ర = తడిసిన, చరణ = పాదములను, విన్యాస = ఉంచుటచేత, దీపిత = ప్రకాశించు (= తెలియు)చున్న, నిజపద్ధతి = తమజాడలచేత, నివేదిత = తెలుపబడిన, వ్యాఘ్ర సమూహ = పెద్దపులుల మొత్తములచేత, దురవగాహంబును = చొరరానిదియును,

---

† పూ. టీ.— 'స్ఫీత = వ్యాపించిన'

'స్ఫీత' మనగా అధికమైనది గాని వ్యాపించినది కాదు. "స్ఫీతం భూయశ్చభూరిచ." (అమ) 'స్ఫాయత ఇతిస్ఫీతం స్ఫాయీవృద్ధౌ' (గురు - ప్రబో.) 'విశాలం విపులం స్ఫీతమ్.' (విశ్వ.)

‖ పూ. టీ.— 'చంకంప్యమాన = మిక్కిలి కదలుచున్న.'

కంప్యమాన మనగా 'కదలింప బడుచున్నది' గాని 'కదలుచున్నది' కాదు. కదలుచున్నది 'కంపమానము' అనబడును.

§ పూ. టీ.— 'కోపముచేత విస్తరింపఁబడిన - చపేటికా = చెంపకాయచేత, నిహత = కొట్టఁబడిన.'

పాపము పూ. టీ. పండితులకు 'చెంపకాయ' అనగానేమో తెలియలేదు. 'విస్తరింపఁబడిన చెంపకాయ' యఁట ! 'చెంపకాయచేత కొట్టఁబడినవఁట ! చెంపకాయ - విస్తరించుటకును ముడుచుటకును తగిన వస్తువనుకొన్నారు. పొరపాటు. 'చెంపకాయ' అనగా చెంపదెబ్బ.

"చెంపకాయ = చెంపదెబ్బ." (శ. ర.)

"చెంపకాయ - a slap on the cheek." (బ్రౌను.)

చెంపమీద కొట్టుటకే 'చెంపకాయ' యని పేరు. కావున 'చెంపకాయచేత కొట్టఁబడిన'వనుట తప్పు. 'విస్తరింపఁబడిన చెంఫకాయ' అనుట అంతకంటెను తప్పు.

అయి - సత్త్రంబు కావునన్ = అడవికాబట్టి, అఖిలద్విజాశ్రియంబై = సకలపక్షు లకును నిలువనీడయై [సత్త్రంబు = అన్నదాన గృహము - లేక - యజ్ఞము - కావున, అఖిలబ్రాహ్మణులకును - ఆశ్రయింప తగినదియై, అని అర్థాం. — [‘సత్త్రమాచ్ఛాదనే యజ్ఞే సదాదానే వనేపిచ’ (విశ్వ) ‘దంతవిప్రాండజాద్విజాః’ అమ] వనంబు=అడవి - కావున, పుండరీకనిలయంబై = పెద్దపులులకు నివాసంబై, (వనంబు = నీరు - కావున, తెల్లదామరలకు పుట్టినిల్లై - అని, అర్థాం.— ‘వనేసలిలకాననే’ ‘వ్యాఘ్రేపి పుండరీకో నా’ అమ.] కాననంబు = అడవి - కావున, సక...యంబై.— సకల = సమస్తమైన, అగమ=వృక్షములచేత, (‘పలాశీద్రుద్రుమాగమాః.’ అమ) రమణీయంబై, (క + ఆననము = కాననము = బ్రహ్మయొక్క ముఖము - కావున (‘మారుతేవేధసిబ్రధ్నే పుంసి కః.’ అమ.)—సకల + ఆగమ = సమస్తవేదములచేతను, రమణీయంబై, అని - అర్థాం.) కుంజ...లంబై.— కుంజ - రహిత = పొదలులేని, స్థలంబు కాకుండి యున్ (పొదలుగలస్థలమై - అనుట.) కుంజర - హిత = ఏనుగుల కనుకూలమైన, స్థలంబై; (కుంజర - హితస్థలంబు కాకుండియు, కుంజర - హితస్థలంబై - అని చమత్కారము, — కుంజర - హితస్థలంబు కాకుండియు, అనుటచేత విరోధము; కుంజ - రహితస్థలంబు కాకుండియు - అనుటచేత పరిహారము.) సుమనఃస్థానంబు = దేవతలుండు తావు - కాకుండియున్, సుమనః స్థానంబై, అని చమ. సుమనః స్థానంబై=పూలకు పుట్టినిల్లై - అనియర్థాం. (సుమనః = దేవతలు అనుటచేత విరోధము; పూలనుటచేత తత్పరిహారము) పల్లవ = చిగురుటాకులకు, అగమ్యంబు = పొందరానిది - కాకుండియు, పల్లవ - అగమ్యంబై, అని - చమ. పల్లవ = పాదలేశములచేత ( = అడుగు కొంచెముగా మోపియు,) అగమ్యము = పొందరానిదై = అడుగైనను పెట్టుటకు వీలు

---

‘చెంపకాయచేత కొట్టినాడు’ అని తెనుగువారనరు. ‘చెంపదెబ్బకొట్టాడు’ అని వ్యవహారము. ‘చెంపకాయ యిచ్చాడు’ అని జాతీయము. సంస్కృతభాష యందును ‘చెంపకాయ యిచ్చుట’యే జాతీయము.—

“ఖడికోపాధ్యాయః శిష్యాయ చపేటికాందదతి.” (మహాభాష్యము.)

“చపేటికా - A blow with the open hand” (ఆప్టె)

ఇంతకును ‘చెంపకాయ’ విద్యనేర్పువేళ గురువులు శిష్యులయెడలను, పొలయలుకలవేళ నాయికలు నాయకులయెడలను, సుకుమారముగా - ముచ్చటగా వాడదగినదిగాని, హింసాప్రధానములైన వ్యాఘ్రాది క్రూరజంతువులు హరిణాదులయెడ వాడదగినది కాదు. ‘విస్తరింపఁబడదగినది’యును కాదు. కావున ప్రకృతమున చపేటికకు ‘చెంపకాయ’ అను అర్థ మనుచితము.

కానిదై - ('చిగురుటాకులను పొందరానిది' యనుటచేత విరోధము; 'అడుగైనను పెట్టరానిది' అనుటచేత తత్పరిహారము.) ఒప్పు..., అక్కాంతారంబు = ఆయరణ్యమును- చొచ్చి - అచ్చట, అకాల......కీలంబు.— † అకాలసంధ్యారాగకృత్ = అకాలపు సంజకెంజాయను చేయుచున్నదియు, అభ్రంకష = మింటికంటుచున్నదియు, చిటచిటార్భటీనటత్ = చిటచిట శబ్దములతో తాండవించుచున్నదియు - నగు, చటుల దావపావక = తీవ్రమయిన కార్చిచ్చుయొక్క, ఉత్కీలంబు = ఎగయుచున్న మంటలుగల, కుత్కీలంబు = పర్వతముయొక్క, § ఓలంబునన్ = మరుగున, నిల్పి, మూడుత్తరువులు = మువ్మాటికిని సెలవు — కొన్నవారగుటంజేసి, సత్పురుషాగ్రణిన్ = సత్పురుషశ్రేష్ఠుడైన - సారంగధరుని, వధ్యశిలమీఁదన్ = వధింపబడవలసినవారిని నిలుపుట కేర్పరచిన బండమీద, ఉనిచి = నిలువబెట్టి.

## —: తలారులు సారంగధరుని కాలుసేతులు నఱుకుట :—

సీ. హిమశైలజాజానియెదుఁరుకట్లకుఁ బోని
యల యించువిలుకాని చెలువువానిఁ,

---

† పూ. టీ.—'సంధ్యా...కీలఁబు = సంధ్యారాగమువలె 'ఆకాశము నొరయుచున్న...తీవ్రమయిన దావాగ్నులచేత ఎగయుచున్న మంటలుగలది.".

'అకాలసంధ్యారాగకృత్' అను ప్రాచీనపాఠము, శా. పా. లో 'అకాలసంధ్యారాగవత్' అయినది. పూ. టీ. లో 'అకాలసంధ్యారాగము' — 'సంధ్యారాగమే' అయినది. 'దావాగ్నులచేత ఎగయుచున్న మంటలుగలది' అనుట సరికాదు. ఎగయుచున్న మంటలు దావాగ్నివే. కాబట్టి 'దావాగ్నియొక్క - ఎగయుచున్న మంటలు' అనుట సరి.

§ పూ. టీ.— 'ఓలంబునన్ = దాఁపున.'

ఓలమనగా మరుగు ( = చాటు) గాని 'దాఁపు' కాదు. 'ఓలము = వృక్షము మొదలగువానిచే మఱుఁగగుచోటు' (శ. ర.)

క. 'పెనుమిఱ్ఱిపి పల్లంబిది
యనకుండఁగ నోలమును బయలు నొక్కటిగాఁ
గనువిచ్చుటయును మోడ్చుట
యును సరిగాఁదమము పర్వె నుర్విందోడ్తోన్.' (విరాట. 2—321)

వ. 'తమంబునిగిడి మిఱ్ఱుపల్లఁబు బయలోలంబని యేర్పఱుపరాకున్న సమయంబున.' (విక్ర. 6—66.)

గళలు వెచ్చము గాని కలువ నెచ్చెలికాని
మురువుఁ గిమ్మనసీని మోమువానిఁ,
గసటులేని కడానిపసిఁడి నించుక యేని
సరకుసేయని మేనిచాయవానిఁ,
గలికితుమ్మెద యాని నలుఁగనివిరిఁ బోని
మొలక ప్రాయముఁ బూని యలరువానిఁ,
గీ. గరగరనివాని, ముఖవిలోక ప్రవర్ధ
మానమోహపయోరాశిమగ్న యువతి
జన హృదయ సంగ తాంగజ జ్వలన సామి
ధేని యగువానిఁ, జిఱుతుకజేనిఁ, జూచి. ౧౦౮

టీక.— హిమశైలజా - జాని = పార్వతీభర్త (= శివుని) యొక్క, ఎదురు కట్లకున్ = ఎదుటికి.— కసటులేని కడానిపసిండికిన్ = మాలిన్యములేని మేలిమి బంగారమును.— (కిమ్మనీని, సరకుసేయని, పోని - ఉపమావాచకములు) † గరగరనివానిన్ = ఎట్టి దోషమును లేనివానిని (=అనవద్యుని) ముఖ...దేని.'— ముఖవిలోక = (తన) ముఖము చూచుటచేత, ప్రవర్ధమాన = పెచ్చుపెరుగుచున్న, మోహ = వలపనెడి, పయోరాశిమగ్న = సముద్రమున మునిగిన, యువతిజన = లేబ్రాయపు స్త్రీలయొక్క, హృదయసంగత = హృదయమును గాఢముగా ఆవరించిన, అంగజజ్వలన = మదనాగ్నికి, సామిధేని = ప్రజ్వలనమంత్రము - అగువానిన్, చిఱుతుకఱేనిన్ = యువరాజయిన సారంగధరుని, చూచి.

సామిధేని— 'ఋక్సామిధేనీ ధాయ్యా చ యా స్యాదగ్ని సమింధనీ'—అమ.

---

† 'గరగనివానిన్' ఈపదమునకు పూ. టీ. లేదు. కాని, 'విజయ' - (2-164)లో ఆశాస్త్రీగారే.— 'గరగరని = మిక్కిలి నాగరకత గలిగిన' అని టీక వ్రాసినారు. కాని 'గరగరదు' – నాగరకత యను అర్థములేదు.

"గరగర = నిర్దోషము; నిర్మలము. (కర్మధారయ సమాసమునందు దీనికి నిగాగమంబు వచ్చును." (శ. ర.)

"గరగరగాని భోజనము, కన్నుల పండువుగాని రూపమున్
సరసుల కింపుగావు." (చాటు. మంజరి. పు. 69)

"మేదురసమాఖ్యయా మినమిననివాఁడు, గరగరనివాఁడు నాఁగను గాల
కంఠ." (ఆం. భా. 3–10.)

క. 'ఎటువలెఁ దునుమఁగ వచ్చున్
గటగట యీతలిరువంటికరపద' మనుచున్
జొటజొట కన్నీ రొలుకఁగఁ
గటకటపడి విన్నఁదనము గడలుకొనంగన్. ౧౦౯

టీక.— తలిరువంటి = చిగురాకులవంటి, కరపదము = చేతులును - కాళ్లును, కటకటపడి = దుఃఖించి. ('కటకటఁబడు' శ. ర.; పూ. ము. నను, వ్రాతప్రతులలోను గూడా 'కటకటపడి' అనియే పాఠము.)

ఉ. ఉన్నతలారులం గని ప్రియోక్తుల నాతఁడు 'మీరు నాకు, నే
నెన్నఁడు మీకు, నెగ్గు ఘటియించుట లేదుగదా? [1]నృపాలుఁడే
మిన్నక యాజ్ఞ వెట్టుఁ డనె, మీఱఁగ వచ్చునె? మీకు [2]నేటికిన్
ఖిన్నత నొందఁ? జేయఁదగుకృత్యము సేయుఁ' డటంచుఁ బల్కినన్.

టీక.— నృపాలుఁడే, మిన్నక = ఊరక (వెనుక - ముందు చూడక, అన్న మాట) ఆజ్ఞవెట్టుఁడు అనెన్ = వీనిని నరికివెయ్యండిరా, అనెను. మీఱఁగవచ్చునె = అతనియాజ్ఞను మీ రతిక్రమింపవచ్చునా? ఖిన్నతనొందన్ - మీకున్ - ఏటికిన్ = మీరు దుఃఖపడవలసిన పని యేమి?

చ. 'తలఁపుము నీకు నిష్ట మగుదైవము' నావుడుఁ, 'దల్లిదండ్రులన్
దలఁతు నటన్న, నిర్దయతఁ దామె తెగించిరి; ధర్మదేవతన్
దలఁచెదనంటినా, ‡ యతఁడె దండ్యునిఁగా నొనరించెఁ; దల్లిదం
డ్రులు నిఁక దైవముం దన కుడుప్రభుశేఖరుఁడే తలంపఁగన్.' ౧౧౧

టీక.— ఉడుప్రభుశేఖరుఁడే = చంద్రశేఖరుడే = శివుడే.

చ. అని హృదయాళుఁ డాయన, దయాళునిఁ గాలుని సంహరించి మిం
చినఘనునిం, గరంబు విలసిల్లఁగ దివ్యపదం బొసంగు వే

---

1 శా. పా.— 'నృపాలుఁడో ... ఆజ్ఞవెట్టుఁడన'

'ఆనవెట్టుటన' అని, పూ. ము. పా. 'డన' అని శాస్త్రిగారి సవరణ. ఏమయినను ఈపాఠమున అర్థము కుదురదు. సరియైనపాఠము తంజ. ప్రతులలో లభించినది.

2 శా. పా.— 'నేటికి ఖిన్నతనొంద?' అర్థమేమో? పూ. టీ. లేదు. 'నేటికిన్' అని, తంజ. పా.

‡ శా. పా.— 'యనఘు' (ఇది పూ. ము. పా.)

ల్పును బరమేశు శంకరుని లోకశరణ్యుని భక్తవత్సలుం
బెనఁగొనుభక్తిహృత్కమలపీఠి దృఢంబుగ నిల్పియుండఁగన్.౧౧౨

టీక.— హృదయాళుఁడు = మంచి మనసుగలవాఁడయిన, ఆయన = సారంగధరుఁడు,— దయాళుఁన్ = దయగలవాఁడును, కాలుని...ఘనునిన్ = (మార్కండేయుని రక్షించుటకై) యముని శిక్షించి పొగడ్తకెక్కిన గొప్పవాఁడును - (ప్రకృతమునను - అట్లే రక్షించగలడని సూచన) కరంబు = మిక్కిలిగా, వికసిల్లఁగన్ = ప్రకాశించునట్లు, ‡ దివ్యపదంబు = ఉత్తమ పదమును - కైవల్యమును, ఒసంగు - వేల్పును, (కరంబు విలసిల్లఁగన్ = చేతులు వెలయుచుండగా, దివ్యపదంబు = చక్కని పాదములను - ఒసంగువేల్పు - అని చమత్కారము.)— అయిన శంకరుని.

గీ. †గత బహుళపక్షమునఁ గదా కరపదంబు
దఱుఁగవలయును సారంగధరున కరయ?
గతబహుళపక్షమున నలకరపదంబు
దఱుగ వలసెను సారంగధరున కపుడు! ౧౧౩

టీక.— అరయన్ = విచారించగా, $ సారంగధరునకు, గతబహుళపక్షమునఁ గదా = (పొందిన యనేక పక్షములు=) నడవడికను గూర్చి మతభేదము లుండినగదా, కరపదంబు తఱుగవలయును = చేతులు కాళ్ళు నఱుకవలసినది? — (సారంగధరునకున్ = చంద్రునికి, గత...గదా = బహుళపక్షమునందుఁగదా, కరపదంబు రణస్థానము కిరణములు, తఱుఁగవలయును = తగ్గిపోవలసినది? అని చంద్రపరముగా-అర్థాం.) అట్టిస్థితిలో, అపుడు, గతబహుళపక్షమునన్ = (పోయిన బహుళపక్షము

‡ పూ. టీ.— 'దివ్యపదంబు = దేవతలతావు (స్వర్గమనుట)'

పరమేశ్వరు డనుగ్రహించిన యెడల అశాశ్వతమైన స్వర్గము నేమి? శాశ్వతమైన కైవల్యమునే యియ్యగలడు.

† శా. పా.— 'ధర' (ఇది పూ. ము. పా.) 'గత' తంజ. పా.

శాస్త్రిగారి పాఠమున శబ్దాలంకారమే కాక అర్థచమత్కారముగూడా చెడుచున్నది.

$ పూ. టీ.— 'సారంగధరునకున్ = చంద్రునకు, గత బహుళపక్షమునన్= పోయిన పెక్కండ్రు మిత్రులుగలచోట - (ఆప్తులెల్ల వదలిపోయిన యీ వనములో.)'

పూ. టీ. కర్తల కీపద్యములోని చమత్కారము తెలియలేదు సరిగదా, అసలు-అర్థమే అవగతము కాలేదు!

న నే = ) ఆతడు మంచివాడు; నిర్దోషి; యని మతభేదము లేక యెల్లరును ఏకవాక్యముగా చెప్పుచున్నప్పటికిని, సారంగధరునకు - కరపదంబు - తఱుగవలసెను = నరుకవలసెను. (గత...మునక్ = బహుళ (= కృష్ణ)పక్షము పోయినపిమ్మట, సారంగధరునకున్ = చంద్రునికి, కరపదంబు = కిరణములు, తఱుఁగవలసెను = క్షయింపవలసెను - అని అర్థాం.)

గీ. వాఁడికత్తుల నెత్తురు వఱద గాఁగ,
'హర మహాదేవ శివ' యని యతఁడు వల్కఁ
దఱిగి తలవరు లా విపత్కరుఁడు గాని
రాసుతు విపత్కరుఁడుఁ గాఁగఁ జేసి రపుడు. ౧౧౪

టీక.— విపత్ - కరుఁడు కాని = (ఎవరికిని, ఎట్టి) ఆపదను చేయువాడు కానట్టి, ఆరాసుతున్, తలవరులు, నెత్తురు, వఱద గాఁగన్ = వాగుపారగా, వాఁడి కత్తులన్, వి - పత్ - కరుఁడు కాఁగన్ చేసిరి. (పోయిన కాళ్లును చేతులు గల వానిగా, చేసిరి.) = కాళ్లు చేతులు నరికిరి.

## —♦ సారంగధర విలాపము ♦—

ఉ. లావగు నట్టిదుర్దశయులంత సహింపఁగ లేక యశ్రుధా
రావళి గాఱ, 'హా! జనని, హా! జనకా' యని [1]బెట్టు గాఁగ వా
పోవుచు జొత్తుపాప యనఁ బొల్పగుదేహము రక్తసిక్తమై,
భూవరసూతి కీలెడలుబొమ్మవిధంబున వ్రాలె భూస్థలిన్. ౧౧౫

టీక.— లావగునట్టి = అధికమగుచున్న, దుర్దశ - అలంతన్ = కష్టదశవలని బాధను, సహింపఁగలేక, అశ్రుధారావళి = కన్నీటికాలువలు, కాఱన్, బెట్టుగాఁగ వాపోవుచున్ = మిక్కిలిగా శోకించుచు, భూవరసూతి = రాజకుమారుడు (సారంగధరుడు) జొత్తుపాప - అనన్ = నెత్తురుగందు (అప్పుడే పుట్టినబిడ్డ) వలె, పొల్పగు దేహము = మనోజ్ఞమైన శరీరమంతయును, రక్తసిక్తమై = నెత్తుటదడిసి, కీలెడలు మరతొలగిన - బొమ్మవలె, భూస్థలిన్, వ్రాలెన్ = పడిపోయెను.

---

[1] శా. పా.— 'బిట్టు' — 'బెట్టు' పూ. ము.; తంజ. ప్రతులు.

* గీ. అతఁడు వడియెడుదురవస్థ కాత్మఁ బొగిలి,
కొంతతడవు [1]నికుంజాలి పొంతఁ బ్రాలి,
తాంతతనుఁ డైనయతనివృత్తాంత మెల్ల
నరసి పోదము గా కని † యట దొలంగి. ౧౧౬

టీక.— నికుంజాలిపొంతన్ = పొదరిండ్ల సమీపమున, ప్రాలి = అణగియుండి, తాంత... మెల్లన్ = మిక్కిలి సోలిపోయిన దేహము గలవాడైన ఆసారంగధరుని స్థితి యంతయు, అరసిపోదముగాక, యని, అట తొలంగి = తామున్న చోటునుండి తొలగి, (అవతలికి అన్వయము)

చ. తలవరు లేఁగ, లేఁగపులితండము ‡ నెత్తుటిగాలుకై హాహా
హాళి మెయి రాఁగ, † ఱాఁగలయినట్టివృకంబులు [1]కోల్పులుల్ రొదల్
చిలుకుచు నీఁగ, నీఁగలును జీమలు దొంతరగాఁగఁ బైపయిన్
బిలపిల మూఁగ, మూఁగవలె బెగ్గిలి పల్కఁగలేక వేదనన్. ౧౧౭

---

* ఈ గీతపద్యము, పూ. ము. లో ఉత్పలమాలగా చిహ్నితమై యున్నది. అందువలన శాస్త్రిగారును 'ఉ' అనియే ముద్రించినారు.

[1] శా. పా.— 'నికుంజంబు పొంతనుఁజని. (ఇది పూ. ము. పా.) 'నికుంజాలి పొంతఁ బ్రాలి' అని, తంజ. ప్రతులు నాల్గింటిలోను. తంజ. ప్ర. పాఠమే మూలానుసారి.—

"అడరుచుఁ దలవరు లా చావుచేటు, కనిపోదమనుచు నక్కడఁ జేరువందు,
మును మైన పొదలలో మునిఁగుండి రంత." (నవ. పు. 76)

† శా. పా.— 'అటఁదొలంగి.'

‡ పాఠాం.— 'నెత్తుటిజొత్తుకై' (గిడుగు. అప్ప. పా. 1-97)

† 'రాఁగలయునంటి' అని అప్ప. పా. అర్థమేమో?

[1] శా. పా.— 'క్రొంబొదల్' ('ఱాఁగలు = ఘాతుకములు — క్రొంబొదలలో - ఈఁగన్ = చొరఁగా' అని పూ. టీ.)

ఱాఁగలయినవృకములు క్రొంబొదలలో చొచ్చినచో సారంగధరుడు భయపడ నేల? పొదలలో, క్రొంబొదలు - ప్రాఁబొదలు అని రెండువిధములా? అప్పకవీయము నను 'క్రొంబొదల్' అనియేయున్నది. కాని 'మెకంబులు క్రోల్పులుల్' అని పూ. ము. నను, 'మె (వృ) కంబులు క్రేఁబొదల్' అని తంజ. ప్రతులలోను పాఠాంతరములున్నవి. నేను శా. పా. నుండి వృకంబులను పూ. ము. నుండి 'క్రోల్పులు'లను గ్రహించి శోధించినాను.

టీక.— తలవరులు, ఏఁగన్ = అవతలికిపోఁగా, లేఁగపులితండము = కొదమ పులుల గుంపు, నెత్తుటిగాలుకై = నెత్తురువాసననుబట్టి, హళాహాళిమెయిన్ = గబగబ, రాఁగన్ = రాగా, ఆఁకలయినట్టి వృకంబులు = గయ్యాళిగొప లయిన తోడేళ్లు, (తోడేలు మిక్కిలి క్రూరమయినజంతువు. అది తనజాతిజంతువును గూడా తినును.) కోల్పులు = మహాశార్దూలములు, రొదల్ చిలుకుచున్ = భయం కర శబ్దములు చేయుచు, ఈఁగన్ = ప్రవేశింపగా. (= తనకడకు రాగా.) ఈఁగ లును—చీమలును, దొంతరగాఁగన్ = పరంపరగా, పిలపిల మూఁగన్ = గబగబ చుట్టుకొనగా, బెగ్గిలి = భయపడి, మూఁగవలెన్ = మూగవానివలె, పల్కఁగలేక, వేదనన్ = బాధచేత, (అవతలికి అన్వయము.)

క. సొమ్మసిలి, కొంత ‡తడవునకు
 గ్రమ్మఱఁ దెలివొంది ¶ చూచి, కన్ దెఱచి, సమీ
 పమ్మున నెవ్వరిఁ గానక
 నుమ్మలిక మెసంగ నసువు లూటాడంగన్. ౧౧౮

టీక.— సొమ్మసిలి = మూర్ఛిల్లి, తెలివొంది = స్పృహవచ్చి, — ఉమ్మలికము - ఎసంగన్ = దుఃఖమతిశయింపగా, అసువులు - ఊటాడంగన్ = ప్రాణములు కొట్టుక లాడగా.

చ. 'అలఁత సహింపరాదు, తెగటార్తురు రం డిపుడు, డెందుఁ బోతిరో
 తలవరులార, మీ రయిన దగ్గఱ వచ్చి వధించి పోవరే
 యలమట కోప నోమృగములార, యయో! దవకీలలార [1]నన్
 బొలియఁగఁజేయ రే వెతలఁబొందఁగ లే'నని [2]కూయు వేమఱున్.

---

‡ శా. పా.— 'తడసినఁ గ్రమ్మఱఁ దెలివొంది'

తడయుట యనగా ఆలస్యముచేయుట. మరి యిందు తడసిన (= ఆలస్యము చేసిన) వారెవరు? మూర్ఛలో మునిగియున్న సారంగధరుఁడా? 'కొంతతడవునకు' అని తంజ. పా.

¶ శా. పా.— 'లేచి'

కాళ్లు తెగిపడియున్నవాఁడేమి? లేచుటేమి? 'చూచి' అని తంజ. పా.

1 శా. పా.— 'తన్'; 'నన్' అని, తంజ. పా.

2 శా. పా.— 'కోయు'; 'కూయు' తంజ. పా.

టీక.— అలఁత = బాధ, తెగటార్తురురండు = పూర్తిగా ప్రాణములు తీసి వేయుదురుగాని రండి. దపకీలలార = కార్చిచ్చువంటిలారా,

గీ. కుపితమానసుఁడై వృథాకోయఁబనిచె
నకట! యిటువంటి †కుపిత యెందైనఁ గలఁడె?
‡కాలుచేఁ గోఁతపడలేక కడకుఁ దొలఁగఁ
గాలుచే §గోఁతపడఁజేసెఁగా లతాంగి! ౧౨

టీక.— కుపితమానసుఁడై = కోపిష్ఠుడై, వృథా = నిష్కారణముగా, కోయఁ-పనిచెఁ = కాళ్ళుచేతులు నరుకవలసినదని ఆజ్ఞాపించెను. ఇటువంటి, కుపిత = చెడ్డ తండ్రి, ఎందైనఁగలఁడె (= లేడనుట.) కాలుచేఁ = యమునిచేత, కోఁతపడలేక = హింసపడజాలక, (అనగా నరకబాధలకు జంకి) కడకుఁ దొలఁగఁ = నేను తప్పించుకొనిరాగా, లతాంగి = చిత్రాంగి, కాలు - చే = కాళ్లుచేతులు, కోఁతపడఁజేసెఁగా= నరుకబడునట్లు చేసెగదా!

సీ. దొరలచిత్తంబు లీకరణిఁ బాటిల్లుఁ గా
యని తండ్రియవివేకమునకు నడలుఁ,

---

† శా. పా.— 'కువిభుఁడెందైన' (ఇది పూ. ము. పా.)

తంజ. ప్రతులు మూడింటిలోను, మద. ప్ర. రెండింటిలోను, 'కుపిత - యెందైన' అను పాఠమున్నది. మరి రెండు ప్రతులలో 'కుపితుఁడెందైన' అను పాఠమున్నది; నీరసము. 'కుపిత...కుపిత' అని యమకము. కావున తక్కినపాఠములు గ్రాహ్యములు కావు.

‡ శా. పా.— 'కాలుచే గోఁతఁబడలేక' ('కాలుచేఁ = యమునిచేత, గోఁతఁ = గోతిలో' అని పూ. టీ.) 'కోఁతపడు' అను జాతీయము నెరుగక 'గోఁతఁ = గోతిలో, పడు' అని యర్థము చేసినారు.— "కమలాక్షి తుచ్ఛభోగముల కాసించి, యమునిచేఁ గోఁతల కమ్మనేనోర్వ." (బా. శం. సారం. పు. 28).— 'ఆపిల్ల అత్తగారి కోఁతలు పడలేకున్నది' అని వ్యవహారము. (చూ. సూ. ని. 'కోఁత')

§ శా. పా.— 'కోఁతఁబడఁజేసె'

ధాతువు 'కోఁతపడు' (= కోఁతవడు) గాని, 'కోఁతఁబడు' కాదు. కోఁతవడు, రోఁతపడు, మూఁతపడు, మొదలగు క్రియలకు - కోఁతంబడు, రోఁతంబడు, మూఁతంబడు, అనురీతిరూపములు కల్పించుట తప్పు. (చూ. శ. ర.; సూ. ని.)

దరళలోచనల నేతఱి నమ్మరాదు గా
యని పినతల్లి మాయలకుఁ దలఁకు,
నేమి చేసితి నేర మిటు సేయ దేవుని
కిని బాడి లేదు గా యని గలంగుఁ,
దొలిమేన నెవరి బాములను బెట్టితినొకో
యనుభవింపక పోనె యనుచు వగచు,

గీ. సచివసుతుమాట నిజమాట సారెఁ బొగడుఁ,
గొంతసే పేడ్చుఁ, జింతించుఁ గొంత ప్రొద్దు,
శర్వ! శంకర! శశిధర! శరణు నాకు
నీవె, యనుచును నొడువు నొకింతతడవు. ౧౨౧

టీక.— తరళలోచనలన్ = స్త్రీలను.

## —• సారంగధరుని పూర్వజన్మ కథ •—

గీ. ఇటువలె ననేక గతుల నారటము నొంద
గగనభారతి వానిపైఁ గరుణ వొడమి
'యడలకు కుమార, నీ కిది గడవనేర
దెట్లనినఁ బూర్వవృత్తాంత మెల్ల వినుము. ౧౨౨

టీక.— గగనభారతి = ఆకాశవాణి.

క. ధరమై మోహనబింబా
ధరమై రిపుభయదహయ మదావళ వీరో
త్కరమై మహనీయరమా
కరమై కౌశాంబి యన నొకపురం బమరున్. ౧౨౩

టీక.— ధరమైన్ = భూమి (యను కాంత) యొక్క దేహమున, మోహన బింబ + అధరమై = మనోజ్ఞమైన దొండపండునుబోలు అధరమువంటిదై, రిపు... త్కరమై.—రిపుభయద = శత్రువులకు భయమును కలిగించు, హయ = గుఱ్ఱముల

యొక్కయు, ‡ మదావళి = ఏనుగులయొక్కయు, వీర = శూరులయిన భటుల యొక్కయు, ఉత్కరము-ఐ = సమూహముకలదియై, మహనీయ = విస్తారమైన, రమా = (లక్ష్మికి = ) సంపదకు, ఆకరమై = పుట్టినిల్లై, కౌశాంబి-అమరుచ్=ఒప్పును

లక్ష్మి సంపదల నభేదముగా చెప్పవచ్చును.—

“కమలాసంపదోః కామ, ధ్వజే మకరమత్స్యయోః
దానవాసురదైత్యానా, మైక్యమేవాభిసమ్మతమ్.” (కా. క. ల.)

---

‡ పూ. టీ.— ‘మదావళి = మదపుటేనుఁగులు.’

గొప్పపొరపాటు. ‘మదావళి’ మనగా ‘ఏనుగే’ గాని మదపుటేనుగు కాదు. (‘సింధురస్సామజః కుంభీ మాతంగశ్చ మదావళః.’ అమ.) మదావళము = మదజలము కలది-అని, వ్యుత్పత్త్యర్థము. అంతేగాని, ‘మద = మదించిన, ఆవళము = ఏనుగు’ అని యర్థముకాదు. కావ్యములయందు, గజపర్యాయమున ‘మదావళి’ శబ్దము, మదగజపర్యాయమున ‘మదమదావళి’ శబ్దము వాడబడియున్నవి. కొన్ని యుదాహరణములు.—

(మదావళము.)

(1) క. “తీవ్ర, ప్రదరములు నెఱయ మెఱయఁగ
మదావళము మీఁదవెలిఁగె మారుతి యధిపా.” (భా. కర్ణ. 1-76.)

(2) వ. “కుంద శరదిందు పురందరమదావళ ధవళవర్ణంబును.”(వరాహ. 4-70.)

(3) శ్లో.“సర్వతః ప్రచలితైః కణాత్మనా, సౌధశృంగపతితై స్తదంబుభిః
సంగతో న సమలక్ష్యతక్షణం, నిర్మలః సురపతే ర్మదావలః.”
(గంగాలహరి. 5-34.)

(4) సీ. “మదవదాకృతి ముదాస్పదమదావళరదా
గ్రదగదాభుజవదా వదజనౌఘు.” (ప్ర. వి. వేం. వి. పద్యము. 806.)

(5) గీ. “దైవతమదావళంబు చౌదంతియనఁగ.” (ఆం. భా. 1-56.)

(మదమదావళము )

(1) సీ. “హంసభాషిణి మణిహార విభూషిత
మదమదావళయాన మధురభుక్తి.” (కళాశాస్త్రము.)

(2) సీ. “మదమదావళి బలాస్పద పదాత్యాజికో
విదవిదాశ్వ శతాంగ విలసితంబు.” (ప్ర. వి. వేం. వి.—)

క. ఆనగర మేలురా జా
జ్ఞానయబలశాలి సత్యసంధుఁడు సుగుణాం
భోనిధి శ్రీహరిపదసే
వానందుఁడు ధవళచంద్రుఁ డనఁగాఁ బరఁగున్. ౧౨౪

టీక.— ఆజ్ఞా నయ బలశాలి = దండనశక్తియు - న్యాయ సంపత్తియు - భుజాబలమును కలవాడు.

గీ. అతని కేవురు సతు లుందు, రందులోన
భువనసుందరి యనియెడు † భోగసతికి
మేలువాఁడు ధరాతల మేలువాఁడు
మేదినీంద్రమలలో నెల్ల మేలువాఁడు. ౧౨౫

టీక.— ఏవురుసతులు = అయిదుగురు భార్యలు, భోగసతికిన్ = భోగకాంతకు, (రాజు భార్యలలో పట్టాభిషేకమును పొందిన దానిని మహిషియనియు, తక్కిన వాండ్లను, భోగినులు (=భోగసతులు) అనియు నందురు.— 'కృతాభిషేకా మహిషీ భోగిన్యోన్యాన్నృపస్త్రియః' అమ) భువనసుందరికి, § మేలువాఁడు = భువనసుందరిని మిక్కిలి ప్రేమించిన వాడు;

పంచచామరము.

అమాత్యు లిద్ద ఱుందు రా ధరాధినాథు చెంగటన్
సుమంతుఁడున్ జయంతుఁడున్ వసుంధరామరాగ్రణుల్
సమానశీలు రందులో వలంతి యంచు రాజు, ప
క్షమై సుమంతుమాట వించు గారవించు నెంతయున్. ౧౨౬

(3) వ. "మదమదావళ తురంగ రథ సహస్ర ముక్తాచ్ఛత్ర రత్న."
(రామాభ్యు. 4-130.)

కావున 'మదావళము = మదపుటేనుగు' అనుట తప్పు. శిఖావల - దంతావల - మదావల - శబ్దములలోని 'వల' (చ్) ప్రత్యయము; మతుబర్థకము.

† శా. పా.— 'భోగవతికి' (ఇది పూ. ము. పా.)
తంజ. ప్రతులు నాలుగింటిలోను - 'సతికి' అనుపాఠమే యున్నది.

§ పూ. టీ.— 'మేలువాఁడు = వలపుకాఁడు.'

టీక.— వసుంధర + అమరాగ్రణుల్ = బ్రాహ్మణశ్రేష్ఠులు, వలంతి = నేర్పరి. పక్షమై = అభిమానము కలవాడై, వించుఁ = వినుచు, గారవించుఁ = మన్నించును.

గీ. అందుల కసూయఁ † గొఱకొఱ మంచు మిగుల
దుష్ట కపటవిచారవంతుఁడు జయంతుఁ
$ డంతకోపముఁ డెపుడు సుమంతుఁ డనుము
నంతకోపముతో నుండు నాత్మలోన. ౧౨౭

టీక.— కొఱకొఱమంచుఁ = ద్వేషించుచు, దుష్టకపటవిచారవంతుఁడు = దుర్మార్గమును - కుట్రతోఁ గూడినదియు నగు ఆలోచనకలవాడు, అంతకోపముఁడు = (అంతక + ఉపముఁడు) యమునితో సమానుడు, అయిన జయంతుఁడు, ఆత్మలోన, సుమంతుఁ, తునుమునంతకోపముతోఁ = నరుకవలెనన్నంతకోపముతో, ఉండును.

---

† శా. పా.— 'కఱకఱ' ('కరకర' పూ. ము. పా.)

'కరకర' ను శాస్త్రిగారు 'కఱకఱ' గా మార్చినారు. కాని ప్రయోజనము శూన్యము. కోపమును తెలుపు పదము 'కొఱకొఱ' గాని 'కరకర' కాదు; 'కఱకఱ' యును కాదు. (చూ. శ. ర.)

"కొరకొర - (anuk) Angrily. 'కొరకొరమించె రుక్మిణికి' — (సత్య.) She was enraged" (బ్రౌను.)

"కొఱకొఱ = కోపవికారము; అసమ్మతము." (ఆం. ప. పారిజాతము.)

'కరకర (=కఱకఱ) = బొరుగులు - పకోడీలు మొదలగువానిని నమలుట యందగు ధ్వన్యనుకరణము.—

ద్వి.—'కొఱక జిల్లున నేయి గురియుచు వేఁగి
కఱకఱమనుచుండు కారవేల్లములు.' (అష్ట. కల్యా. పు. 51.)

N. B.— సూ. ని. 'కరకర' (=కఱకఱ) = వ్రాయుట, నమలుట ... మున్నగు వానియందగు ననుకరణము' అని యర్థము చెప్పి, అందు క్రింద ఈ 'సారంగ' పద్యమును 'అసూయఁ గరకరమంచు' అను పాఠముతోనే ఉదాహరించినది. ఆ 'కరకర' కు ఆక్రోశ ముద్దేశించిన అర్థమేమో!

$ శా. పా.— 'అంతకోపముఁ డవురా! సుమంతుఁడ' నుచు - నంత కోపముతో నుండు' ('అంత...డవుడా...' పూ. ము. పా.)

ఈ పాఠమున అర్థము కుదురదు. సరియైన పాఠము తంజ. ప్రతులలో లభించినది. వావిళ్ళవారును, సూ. ని. యును, శా. పా. నే గ్రహించినారు.

క. * అట కొంతకాల మరిగిన
నట వాఁడు, సుమంతునకు మహైశ్వర్యం బు
త్కటమై గడియ కుడుకునీ
రటువలె హెచ్చిరిలి రాఁగ నతిమత్సరుఁ డై. ౧౨౮

టీక.— మహైశ్వర్యము = (మహత్ + ఐశ్వర్యము) గొప్పసంపద, ఉత్కటమై = విస్తారమై, ఉడుకునీరు - అటువలెన్ = ఉడికిననీరు పొంగిన విధముగా, హెచ్చిరిలి రాఁగాన్ అభివృద్ధినందగా.—

గీ. భువనసుందరియింట నెప్పుడుఁ † జరించు
గుట్టుగలదాని మిక్కిలి ‡ గట్టివాయి
దానిఁ గాకిని యనుదాని దాసి నొకతెఁ
దనకడకు బిల్వఁ బంచి మంతనమునందు. ౧౨౯

టీక.— గుట్టుగలదానిన్ = మెలకువకలదియు, గట్టివాయిదానిన్ = నోటి గండ్రతనము కలదియు, కాకిని యనుదానిన్ = కాకిని యను పేరుగలదియు, నైన - ఒక దాసిని, పిల్వఁబంచి = పిలువనంపి, మంతనమునందు = ఏకాంతమున.

క. విలువల్ దెలుపం గూడని
వలువల్, మణిభూషణములు, వలసినధనముల్,
చలువల్ దొలఁకు కదంబము,
చెలు వొలుకఁగ నొసఁగె సంతసిలి కన్ దనియన్. ౧౩౦

---

* శా. పా.— 'అటు' ('అటగొంత' పూ. ము. 'అటకొంత' తంజ. ప్రతులు)

† శా. పా.— 'వసించు' (ఇది పూ. ము. పా.) తంజ. ప్రతులు నాల్గింటిలోను 'చరించు' అనియున్నది. ఉచితతరము.

‡ శా. పా.— 'గట్టివాయి దానిఁగాఁ గేశి యనుదాని' (ఇది పూ. ము. పా.) 'గట్టివాయి కలదాన్నిగా కేశి యనుదానిని పిల్పించె' ననుట యర్థములేని మాట. పిలిపించినది గట్టివాయికలదానిని గాని 'కలదానినిగా' కాదు. అసలాదాసి పేరు 'కాకిని' గాని 'కేశి' కాదు. 'గట్టివాయిదానిఁ గాకిని యనుదాని' అనియే తంజ. ప్రతులపాఠము. మూలగ్రంథమునను "భువనసుందరి యను భోగినివరవుఁ, గాకిని యను దానిఁ గడుఁ బ్రియంబొదవ, నేకాంతమునఁ దనయెడకు రప్పించి.' (పుట. 78.) అని 'కాకిని' ప్రాసస్థానమున నున్నది. కాబట్టి శా. పా. తప్పు.

టీక.— విలువల్ తెలుపంగూడని = ఇంత విలువయని చెప్పుటకు వీలుగాని = మిక్కిలి విలువగల, చలువల్ తొలఁకు = చాలా చల్లని, కదంబము = సువాసనలతో గూడిన చందనము. కన్ తనియన్ = కన్నులు తృప్తిపడునట్లు.

గీ. ఒసఁగి యయ్యుగ్మలికరాబ్జయుగ్మ మాత్మ
హస్తమునఁ బట్టి రాఁదీసి కుస్త్రరించి
'నీవలన నొక్కకార్యంబు గావలయును
జేసెదే' యని, మొగ మింత చేసికొనుచు. ౧౩౧

టీక.— అయ్యుగ్మలి కరాబ్జయుగ్మము = ఆస్త్రీయొక్క (కమలములవంటి) చేతులు రెండును; కుస్త్రరించి = పొగడికమాటలచేత ఉబ్బించి.

క. ‡ 'మతిమంతుఁ డని సుమంతునిఁ
బతి మన్నన సేయు, నన్నుఁ బలుచఁగఁ జూచున్
సతతంబు, దాన గర్వో
న్నతుఁడై యున్నాఁడు వాఁడు †నేఁడు లతాంగీ. ౧౩౨

టీక.— పతి = రాజు, సుమంతునిన్, మతిమంతుఁడని = తెలవికలవాడని, మన్ననచేయున్ = గౌరవించును.

క. వాని కపాయము సేయం
గా నైన యుపాయ మొకటి గల, దది నీచేఁ
గాని మఱి యెవరిచేతం
గానేరదు, పరులు దెలియఁగా రాదు సుమీ. ౧౩౩

గీ. కినుకవెట్టి సుమంతుపాదుకలు గొంచుఁ
బోయి యెవ్వరుఁ గనకుండ భువనసుంద
రీవరారోహమంచము క్రింద నుంచి
మామనములోనినెగు లార్పుమా మృగాక్షి.' ౧౩౪

‡ శా. పా.— 'మతిమంతుఁడనె' (ఇది పూ. ము. పా.).—
ఈ మతిమంతుడెవడో! ఎక్కడివాడో! 'మతి[ మంతుఁడని' సరియైనపాఠము.— 'పతి నన్ను నెప్పుడుఁ బలుచఁగాఁజూచు- మతిమంతుఁ డనుచు సుమంతు మన్నించు' అనిమూలము.] (నవ. పు. 78.)

† శా. పా.—'నీరజనేత్రా'

టీక.— కిపురు పెట్టి = వంచించి, భువనసుందరీవరారోహా = (ఉత్తమ యైన) భువనసుందరియొక్క - మంచముక్రింద - నెగులు = విచారము, అర్పుమా = తొలగింపుము.

క. అనిన 'నది యెంత గల, ద
ట్లన సేసెద' నంచుఁ జని [1]యట యొకానొక [2]నాఁ
డొనపెట్టుకొని మెలంగఁగ
ననువైన, సుమంతుపావ లది లాగించెన్. ౧౩౫

టీక.— ఒన పెట్టుకొని మెలంగఁగన్ = పొంచువేసికొనియుండగా, ఒకనాడు, అనువైనన్ = సందుదొరకగా, సుమంతు, పావలు = పాదుకలు, అది = ఆదాసి, లాగించెన్ = తీసికొని పోయెను.

'లాగించు' (=తీసికొనిపోవు) ఇదియొక అసాధారణక్రియ. (పూ. టీ. వా క్రియకైనను అర్థముల్ వ్రాయక వదలినారు). ఒకటిరెండు ప్రయోగములు.—

ద్వి. "ఉడుగక కనుపెట్టియుండి యేమరిన
యెడ సుమంతుని చెప్పు లెసఁగ లాగించి." — (నవ. పు. 78.)

క. "కాఁగాదు దేవధన మని
లోఁగక, లాగించి, యడవి లోతెరువునఁగా
రేఁగులు తంగేళుగ నతఁ
డేఁగెన్ దనచొప్పు పౌరు లెఱుఁగక యుండన్." (ఉద్భటా. 2-138)

1 శా. పా.— 'యటం దానొక.' ('యట నొకానొక' పూ. ము. శ. ర. పా; 'యటయొకానొక' తంజ. ప్రతుల పాఠము.)

2 శా. పా.— 'ఒకనాఁడును బెట్టుకొని.' (ఇది పూ. ము. పా.)

అర్థమేమో? పూ. టీ. లేదు, 'ఒకనాఁడొనపెట్టుకొని' అను పాఠము, శ. ర. లోను. (చూ 'లాగించు.') తంజ. ప్రతులలోను ఉన్నది. 'ఒనపెట్టు' అను క్రియను పూ. టీ. వా తెలిగి యున్నట్టులేదు. ఒకటి రెండు ప్రయోగములు.—

సీ. 'ఒనపెట్టు నాఁ గను దనరును పొంచడంబు.' (ఆం. భా. 3-30.)

ద్వి.— 'అని సేయు తలపోకో యటుగాక యున్న
నొనపెట్టుకొని యేల యున్నాఁడ విచట.' (రంగ. రా. ఉ. 145.)

సీ. 'ఓగిరంబు హరింప నొనపెట్టుకొనియెన
వేగు నంతకుఁ జేపి బాగరంబు.' (కాశీ. 4-133.)

క. ఆలాగునఁ గొనిపోయి నృ
పాలప్రియ పాన్పుక్రిందఁ బాదుక లిడి యా
లూలామాలపు నాలి గ
యాళి తనుం గానిదానియటువలె నుండెన్. ౧౩౬

టీక.— నృపాలప్రియ = రాజుభార్యయొక్క - పాన్పుక్రింద, లూలామాలపు= మోసాలమారియు, నాలి = కుత్సితురాలును, అయిన, ఆ గయాళి = ఆ ధూర్తురాలు, తనుం గానిదాని యటువలెన్ = తనకేమియు తెలియని దానివలె - ఉండెను.

వ. తదనంతరంబ. ౧౩౭

సీ. † ఘుమ్మని వాసించు కమ్మపువ్వుల సరా
లొఆపుగా సిగఁ గొంత యొఱగఁ జుట్టి,
కళలు దేఱెడు ‡ నెమ్మొగమున సైకముగాఁగ
మంచికస్తూరినామంబు
కట్టాణి తెలిపాలకాయము త్తెపుటొంట్లు
చెలువీను వీనుల నలవరించి,
పునుఁగు జవ్వాది కప్పురము గుబాళించు
కలపంబు మేన జొబ్బిల నలంది,
గీ. మిసిమిగెంటెముకాంతి వెల్వసర, వింత
వగబవంతిదుప్పటి వలెవాటు వైచి,
చకచకల్ గలరత్నపాదుకలు మెట్టి,
ధవళచంద్రుండు మోహంబు తరువు సేయ. ౧౩౮

టీక.— సైకముగాఁగన్ = సన్నగా, ఒంట్లు = అంటుపోగులు, చెలువు + ఈను = పోయగ మొలుచుచున్న, కలపంబు = చందనము, మిసిమి = సొగసైన, గెంటెము = జంటనేత వస్త్రముయొక్క - కాంతి, వెల్వసరన్ = బయలాక్రమింపగా, వింతవగ =

---

† శా. పా.— 'గమ్మన' పూ. ము. నను, తంజ. ప్రతులలోను పాఠము 'ఘుమ్మని' యున్నది. అది తప్పని 'గమ్మన' అని సవరించుట పొరపాటు.

క్రొత్తరకపు, ‡ బవంతిదుప్పటి = చిత్రవర్ణపు వ్రాతపనిగల దుప్పలువ, మోహంబు, తరువు సేయఁగ = తొందరపెట్టగా.

చ. పరమవినీతి నాతి వెలిపావడచేఁ దడియొత్తి యొత్తి, పై
 పొర నడిమీనెయుం దిగిచి, పొంకముగాఁ†గొనగోటఁ జీల్చి, వే
 మరు బొటవ్రేలఁ దీసి తగుమాత్రము సున్నము వెట్టి, చుట్టి, య
 య్యిరుగడనొక్కి, యాకుమడు పిచ్చిన నంది, విడెంబు సేయుచున్.
 టీక.— నడిమి + ఈనె = నడిమీనె (ఇత్వసంధి).

చ. కలరవ శారికా శుక పిక స్వర సుస్వర భాస్వరోక్తి సం
 కుల, మకళంక సంకుమద కుంకుమపంక కురంగనాభి గం
 ధిల, మఖిలస్థలస్థగిత దివ్యమణీగణ చాకచక్యమం
 జులమును నైన యా భువనసుందరి కేళిగృహంబు చేరఁగన్. ౧౫౦
 టీక.— కల...సుస్వర = పావురముల - గోరువంకల - చిలుకల - కోకిలల - కంఠధ్వనులనెడి సరిగమపధని వంటి మంచి సంగీత నాదములచేతను, భాస్వర+ఉక్తి= వాని కమ్మని పలుకులచేతను - సంకులము = నిండినదియు, అకళంక...ధిలము = కసటులేని జవాజి - కుంకుమద్రవము - కస్తూరి (యను వస్తువులచే) సువాసనలు కలదియు, అఖిల...మంజులమును = అన్నితావులను చెక్కిన శ్రేష్ఠములయిన రత్నముల యొక్క చకచక కాంతులచేతమనోజ్ఞమైనదియును నైన, ఆభువనసుందరి, కేళిగృహంబు= పడకటింటిని - చేరఁగన్ = చేరగా.

గీ. ఒకతె పావడ లందీయ, నొకతె కుంచె
 వైవ, నొకతె లానుజ్జకవ్యజన మూన,

‡ పూ. టీ.— 'బవంతి = వ్రాఁత.'

'బవంతి' యనగా 'వ్రాఁతపని'గాని 'వ్రాఁత' కాదు. "వ్రాఁత = వ్రాయుట, లేఖనము. వ్రాఁతపని = రంగు వేయువాఁడు వస్త్రముల యంచులయందు రంగుతో వ్రాసెడుచిత్రము." (శ. ర.) "వ్రాత Writing, hand, hand writing. లిపి. వ్రాతపని Chintz work. అద్దకపుపని." (బ్రౌను.)

† శా. పా.— 'కొనగోరఁద్రుంచి.' ('కొనగోటఁజీల్చి' తంజ. ప్ర. పా.)

నాకతె కైదండ యొసఁగ, నిట్లుభయపార్శ్వ
ములఁ బలువు రూడిగము సేయఁ [2]బోయెనపుడు. ౧౪౧

టీక.— పావడలు = ఉదికినవస్త్రములు; కుంచెవైవన్ = చామరము వేయగా; లామజ్జకవ్యజనమున్ = వట్టివేళ్ళవిసనకఱ్ఱను, ఊనన్ = ధరింపగా (విసరగా, నని భా.) కైదండ ఒసఁగన్ = కేలూత యియ్యగా, పోయెన్ = కేళికాగృహము చేర బోయెను. అపుడు = ఆసమయమున (అవతలికి అన్వయము.)

ఆ. వె. ధవళచంద్రకాంత నవ వేదినుండి యా
ధవళచంద్రకాంత తత్తఱమున
ధవునిరాక కాంచి, దమి లేచి, కుముదబాం
ధవు నిరాకరించు నవుమొగమున. ౧౪౨

టీక.— §ధవళ = తెల్లనైన, చంద్రకాంత = చంద్రకాంతమణులతో కట్టబడిన, నవవేదినుండి = క్రొత్తయరుగుమీదినుండి, ఆ - ధవళచంద్రకాంత = ధవళచంద్రుని భార్య, కుముదబాంధవున్ నిరాకరించు = చంద్రుని తిరస్కరించునట్టి, నవుమొగమున్ = నగుమొగముతో.

సీ. ఉమ్మెత్తపూవంటి యొఱ పైన†కుచ్చెల
చెఱఁగు మట్టెలమీఁదఁ జిందు ద్రొక్క,

2 శా. పా.— 'ఁబోవునపుడు.— వ. అంత'

'అపుడు' అన్నతరువాత, మళ్ళీ 'అంత' అనుట యెందుకో? 'అంత' అనువచనము పూ. ము. న నున్నది. తంజ. ప్రతులలో మూడింటిలోను లేదు.

§ పూ. టీ.— 'ధవళ చంద్రకాంత నవవేదిన్ = తెల్లని చంద్రకాంతశిలయొక్క క్రొత్త తిన్నెయందు.'

† శా. పా.— 'కుచ్చెళ్ళచెఱఁగు' ('ఉమ్మెత్తపువ్వు నానోరపైన కుచ్చిళ్ళు' అని, అప్ప. పా.)

పూ. ము. నను, తంజ. మద. ప్రతులలోను 'కుచ్చెలచెఱఁగు' అని యున్నది. అదియే సరియైనపాఠము. కుచ్చెల యనగా స్త్రీకటివస్త్రము.—

సీ. 'నేలజీరకయుండఁ గేలఁ గుచ్చెలఁబూను
కొని యూడిగపుసతుల్ గునిసినడువ.' (శుక. 1-411.)

† మెలపైన వలరాజుమేడపై బంగారు
కుండలో యనఁ గుల్కుగుబ్బ ‡లమర,
నెమ్మోముకేరాజు సమ్ముఖమ్మునఁ గ్రమ్మి
కమ్మపంజుల మెఱుం గెమ్మె నెఱప,
భోగినీమణి గాన పొందు సేయఁగ వచ్చు
నీలాహి యన వేణి నీటు సూప,
గీ. సైకతనితంబ మొకవింత చలన మొంద,
నలఁతి లేనడు మల్లల నాడుచుండ,
'నవని నిదిగాక యొయ్యార మద్దిర' యని
యెంచ, నట నాతి వచ్చె రాయంచనటన. ౧౪౩

టీక.— ఉమ్మెత్తపూవంటి = ఉమ్మెత్తపువ్వువంటి (పువ్వునకు 'పూ' రూపాం.— 'కాలకంఠుని శిరసు పూ గగనగంగ' కాశీ. 1-3.) మెలపైన = సొగసైన,

ఉ. 'పచ్చల కంకణమ్ములను భాసిలుదాపలికేల జాఱువా
కుచ్చెల కొంగుఁదాల్చి.' (ఉ. రా. 4-192.)

గీ. 'మురిపెమున మేనువిఱుచుఁ, గెమ్మోవిఁదెఱచుఁ
గుచ్చెలవిదుర్చుఁ, బయ్యెద కొంగుజాచ్చు.' (శశాంక. 2-86.)

కుచ్చెళ్లు - అనగా గుడ్డయొక్క మడతలు. (చూ. శ. ర.) కుచ్చిళ్లు - The folds of the lower cloth, which the Hindus tie round their loins.' (బ్రౌను.)

ఉమ్మెత్తపూవువలెనుండునది 'కుచ్చెల' గాని 'కుచ్చెళ్ళు (=కుచ్చిళ్ళు) కావు.—

సీ. 'జిగిమీఱు మడుఁగుఁ గుచ్చెళ్లు దుత్తూరపు
వ్వుముల కైవడిఁ గటిస్థలుల మెఱయ.' (మల్ల. విప్ర. 1-68.)

(కుచ్చెళ్ళు = కుచ్చెలలు; బహువచనము.)

† శా. పా.— 'మెఱపైన.' (ఇది పూ. ము. పా.)
'మెఱపు' అను విశేషణము భాషలో లేదు. 'మెలపైన' అని తంజ. పా.

‡ శా. పా.— 'గుబ్బలొరయ' ('గుబ్బలమర' తంజ. పా.)

నెమ్మోము† రేరాజు సమ్ముఖమ్మునఁ = అందమైన ముఖమనెడి చంద్రునియెదుట, క్రమ్మి = వ్యాపించి, ‡ కమ్మపంజుల మెఱుంగు కమ్మలయందలి దుద్దులకాంతి.

† పూ. టీ.— 'రేరాజుఁ = చంద్రుని, సమ్ముఖమ్మునఁ = ఎదుటను.'

రేరాజు సమ్ముఖము. ష. త. కావున 'రేరాజుఁ = చంద్రుని' అని ద్వితీయాంతముగా చెప్పుట తప్పు.

‡ పూ. టీ.— 'కమ్మ... = కర్ణభూషణములనెడు దివ్వెటీలకాంతి'

శ. ర. లో 'పంజు = దివిటీ; ఒకదినుసు దివిటీ' అనియున్నది. దానిమీద ఆధారపడికాబోలు పూ. టీ. కర్తలు 'కమ్మపంజుల = కర్ణభూషణము లనెడి దివ్విటీల' అని టీక వ్రాసినారు. పెద్దప్రమాదము. దివిటీలకాంతిని 'మెఱుఁగు' అనుటయు లోకమున లేదు. విస్తరమెందుకు? 'పంజు' అనగా కమ్మలో పొదిగిన రత్నాలమొత్తము. రత్నాలకమ్మలకు 'పంజుకమ్మ' లని పేరు.

"కమ్మ పంజులు = రత్నతాటంకములు" (లక్ష్మినా.)

"పంజులకమ్మలు = రత్నములు చెక్కినకమ్మలు" (శ. ర.)

"పంజు. A sort of earrings. పంజులకమ్మ Large earrings worn by women" (బ్రౌణ్యము)

"పంజుల కమ్మయనఁగ, రత్నతాటంక మొసఁగుఁ జంద్రార్ధచూడ." (ఆం. భా. 2–147.)

"పంజు = రత్నములుచెక్కిన తాటంకములు" (ఆంధ్రపద పారిజాతము.)

ఇక కవుల ప్రయోగములా? వందలకొలదిగా నున్నవి.—

వ. "ఇప్పపూ మొగ్గలంబోని బుగ్గలం దగ్గలిక చూపు 'కమ్మపంజుల వజ్రపుంజ చకచకల" (మను. 3-ఆ.) 'పంజుల తాటంకముల యందలి హీరమణుల యొక్క చకచకలాడే కాంతుల చేతను' అని, జూ. టీ.

సీ. "క్రొమ్మించునిర్మించు కమ్మపంజుల తళ్కు
లుదిరి చెక్కులతోడఁ జదురులాడ." (రా. వి. 3–124.)

ద్వి.— 'పొంజుల కమ్మలు పల్లేరుపూలు
రాజిల్లు రత్నాల రాకిడిఁబెట్టి.' (బా. శం. సారంగ. పు. 13)

శాస్త్రిగారికి 'పంజు' తత్వము తెలియదు. అందువల్లనే గొ. హరి. లోగూడా ఇట్లే యనుచితమైన టీక వ్రాసినారు. (ఆచర్చకిది చోటు కాదు.)

శాస్త్రిగారి టీకను చదివియే కాబోలు సూ. ని. పండితులు.—

'కమ్మపంజు - పంజులకమ్మ = రత్నములు కూర్చుటచే దివిటీవలె వెలిఁగెడు కమ్మ' అని వివరణము వ్రాసినారు.

ఎమ్మె సెఱపన్ = విలాసమును చూపగా. § భోగినీమణికాన = రాజుగారి భోగ కాంతలలో ఉత్తమురాలు కాబట్టి- (శ్రేష్ఠమైన ఆడపాము కాబట్టి' అని శ్లేషార్థము.)

క. అటు లెదురుగ నేతెంచిన
కుటిలాలకఁ గూర్మి యనలుఁ గొనలుం బాఱన్
జిటిపొటినవ్వులు గనుఁగవఁ
బొటిమరిలం జూచి పలికెఁ బులకల్ దొలఁకన్. ౧౪౪

టీక.— కూర్మి = ప్రేమ, అనలుఁగొనలుంబాఱన్ = అత్యంతముగా విస్తరిల్లగా. పొటమరిలన్ = మొలకెత్తగా.

క. 'నీదండకు రాకుండినఁ
బూ దండల వ్రేయు నన్నుఁ బొడగని † నపుడో
వేదండగమన, సుమనః
కోదండధరుం, డ దేమొకో! దండ' మనెన్. ౧౪౫

టీక.— వేదండగమన = ఏనుగునడకవంటి నడకగలదానా, సుమనః కోదండధరుండు = పూవిల్లునుతాల్చువాడైన మన్మథుడు, పూదండలన్ వ్రేయున్ = పూ మాలికలతో కొట్టును.

క. అని సరసోక్తుల మక్కువ
గనిపింపఁగఁ బలికి, గలికి [1]కరపల్లవ మిం
పొనరంగఁ బట్టి [2] మెల్లన
తనుసంగమ సౌఖ్యవివశతను జని; చెంతన్. ౧౪౬

§ పూ. టీ.— 'భోగినీమణి = వేశ్యోత్తమ.'

భువనసుందరి ధవళచంద్రుని యిల్లాలు గాని 'వేశ్య' కాదు. భోగినీశబ్దమునకు యను నర్థముండుగాక; యిక్కడ చెల్లదు. ఇక్కడ 'భోగిని' యనగా పట్టమహిషి కాని భార్య. 'విహాయ మహిషీ మన్య రాజయోషితి భోగినీ'. (మేదిని) ఇల్లాలిని వేశ్య యనుట పాపము.

† శా. పా.— 'నేఁడో.' (ఇది పూ. ము. పా.) అర్థమేమో!

1 శా. పా.— 'ఁగలికిఁ బలికి' (ఇది పూ. ము. పా.) 'ఁబలికి కలికి' అని తంజ. పా.

పాఠాం.— మెల్లనె.

టీక.— కలికి కరపల్లవము = తన ప్రియురాలియొక్క చేతిని, పట్టి = పట్టుకొని, † తనుసంగమసౌఖ్యవివశతను = శరీరములకలయికచేత కలిగిన సౌఖ్యమువలని పారవశ్యముతో, మెల్లనచని.— చెంతన్ (అవతలికి అన్వయము.)

సీ. ⁋నికరంపుజిగికెంపు నీలంపురా చెక్క-
 డపుసకినల పగడంపుఁగోళ్ళు,
హారాయలుగుజ్జరినేఁత హారంబట్టుఁబట్టెడ,
 పఱ పైనజాలీల పట్టుఁబఱపు,
పచ్చసూర్య‡పటంపు బటువుబిళ్ళలు, రంగు
 సాలపుచొకాటంపుఁ దలగడయును,
దఱు చైనహురుముంజి తళుక్కముత్తెములచ
 ప్పరమును, జిగిదోమతెరయుఁ గల్గి
గీ. మంచివగఁ జొక్కమైనట్టి మంచముపయిఁ
జలువ చెంగల్వ చేమంతి జాజివిరులు
పఱచి కడుఁ బొంకపఱిచిన పాన్పుమీఁద
రాజు పవళించి యున్నంత రాజవదన. ౧౪౭

† పూ. టీ.— 'అతను సంగమ సౌఖ్య = మదనక్రీడానంద.'

సంగమ మంటేనే మదనక్రీడ; "సంగమః- Sexual union or intercourse. 'అయం స తే తిష్ఠతి సంగమోత్సుకః' శాకుం 3-14." (ఆప్టి.)

"నిరుపమకీర్తి యట్లయిన నీకును నాకును సంగమంబగున్" (భా. ఆది. 4-60.)

"గంగాసంగమ మిచ్ఛగించునె? మదిం గావేరి దేవేరిగా
నంగీకారము సేయునే?" (పాండు. 1-139.)

కావున 'అతను సంగమ' మనుట తప్పు. సంగమము (పరస్పరము) స్త్రీపురుషులకేగాని - అతనునితో కాదు. రాజపు డనుభవించినది 'తను సంగమ' — సౌఖ్యమే. ౧౪౯ పద్యములోగాని వారిరువురును కలియరు. 'మెల్లన - తనుసంగమ...' అని సరియైన విభాగము.

⁋ పాఠాం.— 'రవకెంపు నీలంపురాకుందనపుచెక్క.'

‡ పాఠాం.— 'సూర్యపుటంపు.'

టీక.— చెక్కడపు సకినల = కెంపులును నీలములును పొదిగి తయారుచేసిన పిట్టలుగల. ('సకిన' శకునభవము) గుజ్జరి నేఁత = గుజరాతి నేతగల, హొంబట్టుపట్టెడ= బంగారుజలతారుగల పట్టునవారు, పచ్చ...ళ్ళలు = పచ్చని మొకమల్ పట్టుతో కుట్టిన గుండ్రని దిండ్లు. చప్పరము = పందిరి. పొంకపఱచిన = చక్కగా తయారు చేసిన.

సీ. ఎప్పు డెప్పు డటంచు నెనయఁ గోరెడుకోర్కి
మరలించె బోటులఁ దిరిగి చూచి,
సరగఁ బైఁ బడఁ దీయ మరలుగద్దఱిచూపుఁ
బదరకు మనియెఁ గంబమున [1] నొరగి,
చిట్టాడుసిగ్గుతోఁ [2] జేపట్టఁ బెనఁగుడెం
దము మట్టుపఱిచె నాననము వంచి,
తనుఁ బిల్వఁ దమి హెచ్చి [3] నను జాగు సేసె గ్ర
క్కునఁ బోక కన్నడఁ గట్టిపెట్టి,
గీ. వలపు పతి [4] నేఁచ నటు నిటు నిలిచి [5] కాంత
కొంత తరితీపుపైఁ [6] జేరి కూరుచుండె,
మగలు పైకొనునందాఁక మనసు గాన
నీయ రెంతటివగలవా రిందుముఖులు! ౧౪౮

టీక.— ఎప్పు...కోర్కిన్ = ప్రియుని గలయుటకై తొందరపడుచున్న కోరికను, బోటులన్ = తన వెనుకనున్న చెలికత్తెలను, తిరిగిచూచి (వారలేమైన నను కొందురని) మరలించెన్ = వెనుకకు త్రిప్పెను; సరగన్ పైఁబడన్ = తటాలున నాథునిమీద పడగా, తీయన్ = తాను మరలింపగా, మరలు = మరల ఆతనిమీఁదికే పోవుచున్న, చూపున్, కంబమున నొరగి = స్తంభమున కొరగబడి, పదరకుము - అనియెన్ = తొందరపడకుమని హెచ్చరించెను; చిట్టాడుసిగ్గుతోన్ = వచ్చుచూ పోవుచూ ఉన్నసిగ్గుతో, చెపట్టన్ పెనగుడు డెందమున్ = నాథుని చేయిపట్టుకొనుట కు బలాటు పడుచున్న మనస్సును, ఆననమువంచి, మట్టుపఱిచెన్ = నియమితపరచెను; (ప్రియుడు) తనుఁబిల్వన్, తమి = ప్రేమ, హెచ్చినను, గ్రక్కునన్ = తటాలున -

[1] శా. పా.— 'నొదిగి' [2] 'ఁజేపట్టిపెనఁగు' [3] 'హెచ్చియును' [4] 'నేఁప' [5] 'కొంతకొంత' (ఇది పూ. ము. పా.) ఈ పాఠమున కర్తృత్యక్తము. 'కాంతకొంత' అని తంజ. పా. [6] 'తరితీపుమై (పూ. ము. పా.) 'తరితీపువై' తంజ. పా. సాధువు.

షోక, కన్నడన్ = ఉపేక్షతో, కట్టిపెట్టి = ఆ తమిని నిరోధించి, జాగుచేసెను; వలపు, పతిన్, ఏఁచన్ = బాధించుచున్నను, కాంత = ఆభువనసుందరి, కొంత తరి తీపుపైన్ = కొంత బలవంతమువిూద, చేరి కూరుచుండెను.

చ. సరసపునవ్వులన్, దనివి చాలని చుంబన గుంభనంబులన్,
బరిపరిరీతులన్ మెఱయు బంధవిశేష గళారవంబులన్,
సురత మొనర్చి † ముప్పిరులసొంపునఁ దేలిరి వార లయ్యెడన్;
సరివల పైన కూటమికి సాటిఁక లేదు గదా తలంపగన్! ౧౪౯

క.*పెన్నెరులఁజెమట, మోడ్పుం
‡గన్నులు, వదలు కవుఁగిళ్ళు గల, వారలకున్
బన్నీరు గ్రోలుటయు, నం
త న్నిద్దురవోవుటయు, హితం బై యుండెన్. ౧౫౦

టీక.— పెన్నెరులన్ - చెమట = శ్రమచేత కురులందును చెమటయు, మోడ్పుంగనులు = నిదురలేకపోవుటచేత మూతలు పడుచున్న కన్నులును, వదలు కవుఁగిళ్లున్ = అలసటచేత బిగి సడలిన కౌగిలింతలును, కల, వారలకున్ = ఆదంపతులకు.—

చ. గమకపుగబ్బిగుబ్బ లెదఁ గాఁడ [1]నొకింతగ గౌఁగిలించి యిం
పమరఁగ నిద్రవోయి, యపు డల్లన మేల్కని శయ్యనోర యై

† పాఠాం.— 'మంపిరిలు'.

* శా. పా.— 'పెన్నెరుల చెమట' (పూ. ము. పా.) అర్థమేమో? పూ. టీ. లేదు.

‡ శా. పా.— 'గన్నుఁగవన్ వెడలు నీళ్ళు.' (ఇది, పూ. ము. పా.)
హాయిగా సురతానందము ననుభవించిన వారికి అప్పుడు కండ్లనుండి నీళ్లు వెడలుటకు కారణమేమో? ఆనందాశ్రువులో! ఏమో? పూ. టీ. లేదు.

సరియైనపాఠము తంజ. ప్రతులలో లభించినది.

1 శా. పా.— 'నొకించుక' (పూ. ము. పా.) 'నొకింతగ' తంజ. పా. ఉచితతరము.

[2]ఘుమఘుమవాసనల్ [3]గుబులు కోఁ దనపుక్కిటి [4]కప్రపు న్వీడెం
బుమియ మొగంబు వంచి, సుగుణోత్తముఁ డప్పడిగంబు చెంగటన్.

టీక.— పడిగంబు = తాంబూల ముమియుపాత్ర. (సీ. 'చర్వితతాంబూల సంజ్ఞయోఁ దమ్మనాఁ, బరగుఁ గళాచిక పడిగ మనఁగ.'— (ఆం. భా. 2-168.)

క. ‡కనకపు మిసమిసపావలు
కని కనలుచుఁ జూచి, 'వింతగంటి మిదేమీ!
వనితా తెల్పు మి వెవ్వరి'
వని తా గద్దించియడుగ నరనిద్దురతోన్. ౧౫౨

---

2 శా. పా.— 'గుమ గుమ' పూ. ము. లో 'ఘుమఘుమ' అని యున్నది. అది తప్పని కాబోలు శాస్త్రిగారు 'గుమగుమ' అని సవరించినారు. సవరింప నక్కఱ లేదు. (చూ. బాల. శర. పు. 319.) 'ఘుమఘుమ' తంజ. పా.

3 శా. పా.— 'గుబులు కొన్దన పుక్కిటి.'
'కొను + తన' అనుచోట 'ను' ద్రుతము కాదు. 'కొను' తద్ధర్మార్థకక్రియ.
'అను + పురము=అనుబురము; అన్బురము.' 'కొను + పదార్థము=కొన్బదార్థము'.
'చను + పడఁతి=చన్బడఁతి' - అని ద్రుతకార్యము చేయుట తప్పు. (చూ. ప్రౌఢ - సంధి. 13.) కాబట్టి 'కొన్దన' అనుపాఠము తప్పు. పూ. ము. నను, తంజ. ప్రతులలోను గూడా - 'గుబులుకోఁదన' అని యున్నది.

4 శా. పా.— 'పుక్కిటిలోని వీడియం.' (పూ. ము. పా.)
'పుక్కిటి కప్రపున్విడెంబు' - అని తంజ. పా.

‡శా. పా 'మినమిన మను పావలు గని, కనలున నిట వింతపాదుకలు రానేలా?'

నేను గ్రహించినది పూ. ము. పా. గుణవత్తరము. బంగారు మెరుగును చెప్పుటకు 'మినమిన' కంటే 'మిసమిస' యే యుచితతరమని యీ క్రిందిరచన చెప్పుచున్నది —

"మిసమిసమమచుఁ గ్రొమ్మెఱుఁగులువాఱు
పసిఁడికుండల మేడపై, నందమైన." (గౌ. హరి. పు. 226.)

చ. భయపడి లేచి వే†యదిరిపాటునఁ గట్టియుఁ గట్టకున్న నీ
వియు, నెలవంకచన్నొనల వేసియు వేయని పైటకొంగు, దోఁ
పియు §నట దోఁపకున్న యలపెన్నెఱికొప్పును నై, వితాకురా
లయి యవి చూచి, యల్లలన యల్లల నాడుమనంబుతోడుతన్.

టీక.— వితాకురాలయి = నిశ్చేష్టితురాలై.

గీ. అపుడు కన్నీరు గాఱ నోం డాడ వెఱచి
నేల బొటవ్రేల ‡ వ్రాయుచు నిలిచి యున్న

---

† శా. పా.— 'యదురుపాటున' (పూ. ము. పా.)

శ. ర. లో 'అదిరిపా'టున్నది; సూ. ని. లో 'అదరిపా' టున్నది. కాని 'అదురుపాటు' ఎక్కడను లేదు. 'అదరిపాటున' తంజ. పా.

§ శా. పా.—'అటుఁదోఁపమున్న.'

'దోఁపు' ధాతువు సరళాది కావున 'దో' కు ముం దరసున్న పెట్టుట తప్పు. అదియట్లుండగా గ్రంథకర్తమతమున 'అటు' కళ. కావున 'అటన్' అనుటయును తప్పే. తప్పో ఒప్పో- శాస్త్రిగారు 'అటుఁదోఁప' అన్నారు గనుక వావిళ్ళవారును 'అటుఁ దోఁప' అనియే అన్నారు.

‡ ఈ 'వ్రాయుట'ను గూర్చి శాస్త్రిగారు, శృం. నై. (పుట. 619) లో "కాలి (బొట్టన) వ్రేలితో - వ్రాయుచున్ (అక్షరములు వ్రాయునట్లుగా) గీఱుచు (లేదా - రాయుచున్ అనియే పాఠమగుగాక)" అని వ్రాసినారు. కాని కవులు 'వ్రాయు' ధాతువునే వాడినట్లు స్పష్టముగా కనబడుచున్నది.—

క. 'ఊరక మీసము కొఱుకుట
వారక పాదమున నేల వ్రాయుట' (విష్ణు. 4—255.)

ద్వి.—'నవుడు కొట్టైను, నీళ్లునమలెఁ గశ్యపుఁడు
వామదేవుఁడు నేలవ్రాసె.' (గౌ. హరి. పు. 12.)

1831 సం.లో బ్రౌను ముద్రించిన మనుచరిత్రలోను, దాని టీకలోను మాత్రము 'రాయు' ధాతువు కనబడుచున్నది.—

'నేల బొటవ్రేల రాయుచు నిలిచికొంత' (3—౧౩౧)

'నేల బొటవ్రేలరాయుచు = భూమిమీద కాలి యంగుష్ఠముతో రాస్తున్న' (జూ. టీక.)

ఈ 'రాయు' వావిళ్ళవారి ప్రతిలో 'వ్రాయు' గా సవరింప బడినది.

† నారమణివల్ల సంశయం బేరుపడక
పడకయిలు వెళ్ళి వచ్చి భూపాలుఁ ‡ డపుడు. ౧౫౪

టీక.— పడకయిలు = పడకటింటినుండి.

'పడక' శ. ర. లో లేదు. లోకవ్యవహారమున నున్నది. బ్రౌణ్యమునను, శు.ప. పారిజాతమునను, ఉన్నది. పడుధాతువుయొక్క కృదూపము గావున 'పడుక' అని తొలిరూపము. 'పిడుత – పిడుక – మిడుత మొదలగు ఉకారమధ్యములు కాలక్రమమున పిడత, పిడక, మిడత, అయినట్లే 'పడుక' యును 'పడక' అయినది.

క. మొకమజ్జన మై సంధ్యా
దికకృత్యము లాచరించి దివ్యవిభూషా
చకచకలు మేనఁ బర్వఁగఁ
దుకతుకతో నుల్ల మపుడు[1] తుకతుక నుడుకన్. ౧౫౫

టీక.— మొకమజ్జనమై=ముఖమార్జనము చేసికొని, తుకతుకతోన్ = కోపాతిశయముచేత.

చ. కొలువున కేఁగి, వేత్రధరకోటి నిజాయతదృష్టి వాఱు చో
బలసి తటాలునం బగిలి పాఱ, [2] బరాబరి సేయుచున్న వా
రలు దునెదారులున్ దొరలు రాజులు మంత్రులు నిష్టబాంధవా
వళులు పురోహితు ల్పనులవార లనేకులు నిండియుండఁగన్. ౧౫౬

---

† శా. పా.— 'ఈరమణి... బెఱుకపడక' (ఇది పూ. ము. పా.)
తాతలనాటి కథనుచెప్పుచూ 'ఈరమణి' యనుట యనుచితము. 'ఆరమణి... బేరుపడక' తంజ. పా.

‡ శా. పా.— 'ఁడలుక' (ఇది పూ. ము. పా.)
'మొక మజ్జనమై' అని యవతలి పద్యప్రారంభము. భూపాలుఁ డలుకతో మొక మజ్జనము కావించుకొని ననుట యనుచితము. 'డపుడు' తంజ. పా.

1 శా. పా.— 'తొట్రుపడంగన్' (ఇది పూ. ము. పా.) 'తుకతుకనుడుకన్' తంజ. పా. సాధువు. కవ్యుద్దిష్టము.

2 శా. పా.— 'బరాబరిసేయు, మన్నెవారలు' ('బరాబరుసేయుచున్న వారలు మనెవారలున్ పూ. ము. పా.)'... సేయుచున్న వారలుదునెదారులున్' తంజ. పా. (మన్నెవారలు – మనెవారలు, అను పాఠమున – అటవికులు – అని యర్థము. "మన్నెవారు hill people". (బ్రౌను.)

టీక. వేత్రధరకోటి = బెత్తాలవారి మొత్తము, నిజా ...లు పాఱు చూౘ = నిడుదలైన తనచూపులు ప్రసరించువైపునకు, బలసి = పరివేష్టించియు, తటాలునఁ బగిలి = గుమిగూడియున్నవారు తటాలున విడిబడియు, పాఱఁ = పరుగులెత్తగా; బరాబరిచేయుచున్నవారలుఁ = హెచ్చరికలు చెప్పుచున్నవారును, దునెదారులుఁ = పిచ్చుకత్తులవారును;—

వ. అప్పు డప్పాదుకలు దెప్పించి యందఱముందఱం బెట్టించి భూవరుం డివి యెవ్వరి వని యడిగిన వాక్రువ్వ నేరక నివ్వెఱయు సంశయంబును హృదయంబుల నతిశయం బయిన నాకరొకరి[1] మొకం బులు సూచుచు [2]సభాజనవిసరంబులు గుసగుసలం బోవుచున్న సమ యంబున. ౧౫౭

గీ. అపుడు చెవిదండఁ జేరి కే లడ్డగించి
మంతనంబునఁ జౌ రాళికుంతలారి
కాలకేతుం డనెడు పేరుగలతలారి
వానివెత †లారివోవ భూవరున కనియె. ౧౫౮

---

1 శా. పా.— 'మొగంబులు (ఇదే. పూ. ము. పా.) 2 శా. పా.—'సభాజనం బులు.' (ఇదే పూ. ము. పా.)

† శా. పా.— 'ఆరివోవ.' (ఇది పూ. ము. పా.)

ధాతువు 'ఆరిపోవు' గాని 'ఆరివోవు' కాదు. 'ఆరివోవు - కారివోవు - పారివోవు,' అనురూపములు కావ్యములలో కానరావు. నిఘంటువులలోను లేవు.

"ఆరిపోవుట; వానిభవిష్యము ఆరిపోయింది. He has lost all his luck." (బ్రౌను.)

"ఆఱిచను, ఆఱిపోవు = ఆఱు, నశించు, పోవు.' (సూ. ని.)

సీ. 'బాల నీబాహు మృణాలములేర్పక
యతను తాప వికారమాఱిచనదు.' (రసిక. 6-89.)

చ. 'జపములనాఱిపోని కలుషంబులు.' (నృసిం. పు. 1-67)

వ.రా.—'తలారి' యమక సౌభాగ్యముకొరకు, కవి 'వెతలారి - పోవ' అని లఘురేఫముగా వాడినాడు.

టీక.— చోర - అళికుంతల - అరి = దొంగలయొక్క స్త్రీలకు (దొంగలను కనుగొని శిక్షలు వేయించి వాండ్ల భార్యల కెగ్గు కావించువాఁడు), తలారి, వాని వెతలారిపోవన్ = వానిబాధ తొలగుటకు. (జారచోరుల వర్తనములను గుర్తించి చెప్పవలసినది తలారులవిధి. అట్లు గుర్తింపనిచో వారలు దండ్యులు; అట్టి దండననుండి తప్పించుకొనుటకు) చెవిదండన్ = (రాజు) చెవిదగ్గర - చేరి, కేలడ్డగించి = నోటికి చేయి అడ్డముగా పెట్టుకొని - మంతనమునన్ = ఏకాంతమున.

చ. 'తెలియఁగఁ జూచినాఁడ నివి, దేవర, సందియ మిందు కేమియు
 న్వలదు, సుమంతుపావ,' లనినన్; లయకాలునిలీలఁ † బేర్చి, య
 య్యలుక సభాస్థలిం గలుగునయ్యలు కంపితమానసాంగులై
 యలుక,సుమంతుఁ జూచి యతఁ డన్ వికటభ్రుకుటీనిరీక్షుఁడై.౧౫౯

టీక.— లయకాలుని లీలన్ = ప్రళయకాలపు యముని విధమున, పేర్చి = కోపముచేత విజృంభించి, అయ్యలుకన్ = ఆకోపమునకు, కంపితమానస + అంగులై = కంపించిన చిత్తములును - అంగములును కలవారై, అలుకన్ = భయపడగా, వికట భ్రుకుటీనిరీక్షుఁడై = వికృతమైన బొమముడితోడి చూపుకలవాడై (కనుబొమ్మలు ముడివేసిచూస్తూ - అన్నమాట.) అన్ = అనెను.

క. ఓ పాపాత్మక లోనికి
 రా పొమ్మని చన వొసంగి రాణువ యెల్లన్
 నీపార్శ్వంబుగఁ జేసి మ
 హాపరమాప్తునిఁగ ‡నమ్మి యాదట నిన్నున్. ౧౬౦

టీక.— రాణువయెల్లన్ = సమస్త పరివారమును, నీపార్శ్వంబుగఁజేసి = నీ పక్షముచేసి (= నీవశము కావించి) ఆదటన్ = దయతో, నిన్నున్, (అవతలి కన్వయము.)

---

† శా. పా.— 'పేర్చునయ్యలుక' (ఇది పూ. ము. పా.)

లయకాలుని లీల 'బేర్చినవాడు రాజుగాని, అలుక కాదు. కావున 'పేర్చునయ్యలుక' అనుట సరికాదు. 'పేర్చి యయ్యలుక' అనియే తంజ. పా.

‡ శా. పా.— 'నడప' (ఇది పూ. ము. పా) 'నమ్మి' అని, తంజ. పా. 'నడప' అను పాఠమున అన్వయము కుదురదు.

క. అసమాన రాజ్యవైభవ
లసమానునిఁ జేయుటకు ఫలం బిదె యేమో?
యిసుమంత యెఱుఁగ వేమో
యి సుమంత కృతఘ్న యర్థ్వమే నినుఁ జూడన్. ౧౬౧

టీక.— వైభవలసమానునిన్ = వైభవముచేత రాణించువానినిగా, చేయుట కున్ = చేసినందుకు, ఫలంబు, ఇదెయేమో = ఇదేకాబోలు, ఏమోయిసుమంత, (సంబుద్ధి) ఇసుమంత = యెఱుఁగవు=కొంచెమైనను జ్ఞానములేకపోయెను, కృతఘ్న= చేసినమేలు మరచిన - ద్రోహీ.

వ. అని కోపాటోపంబున నయ్యిలాపతి కర్ణకలాపంబులుగాఁ గొన్ని దురాలాపంబులు పల్కిన నుల్కిపడి యొకనాఁడును మాఁడెత్తు మాట వడినవాఁడు కాఁడు గావునఁ దనవల్లఁ గల్ల లే కునికియు నిట్టి యపఖ్యాతి రాఁ దగునే యని నిట్టూర్పు నిగిడించి నిలువునకు నిలు వుననే కరంగి దిగఁజెమట వెట్టి తల వంచుకొని. ౧౬౨

టీక.— ఇలాపతి = రాజు, † కర్ణకలాపంబులుగా = చెవులకు ములుకులుగా, దురాలాపంబులు = చెడ్డమాటలు.

క. అడలుచుఁ బెదవులు దడుపుచు
గుడికొనుకన్నీరు§ గ్రుక్కికొనుచున్ మదిలో

---

† పూ. టీ.— 'కర్ణకలాపంబులు = చెవులలో అమ్ముల పొదులు'.

అంటే అర్థమేమిటో! శ. ర. లో 'కలాపము = అమ్ములపొది' అని యున్నది. కాబట్టి 'కర్ణ = చెవులలో, కలాపంబులు = అమ్ములపొదులు' అన్నారు. 'ముక్కస్యముక్కార్థః'! 'కర్ణకలాపము' లంటే చెవులకు బాణములవంటివి (దురాలాపములు) అని సరియైన యర్థము. 'కలాపః - An arrow' అని 'ఆప్టే' పండితుడు చెప్పచున్నాడు.

§ శా. పా.— 'గ్రుక్కకొనుచున్'

గ్రుక్కకొనుట యనగా త్రాగుట; మ్రింగుట. (చూ. శ. ర) 'గ్రుక్కకొనుట To swallow or devour. To drink.' (బ్రౌను)

"అక్కజంబుగనబ్ధి నాపోశనముగఁ
గ్రుక్కగొన్నట్టి యా కుంభజుఁడుండ." (గౌ. హరి. పు. 16.)

నుడువని నెంజిలి నేమియు
నుడువనియమ్మానధనుఁ గనుంగొని వేగన్. ౧౬౩

టీక.— గుడికొను = కమ్ముకొని వచ్చుచున్న - కన్నీరు, గ్రుక్కికొనుచున్ = అణచుకొనుచు, ఉడువని = ఉడుగని, నెంజిలిన్ = మనోవ్యథచేత; నుడువని = పలుకని.

గీ.' ఘుటిక మ్రింగినసిద్ధునియటుల, నుల్లి
దిన్నకోమటివలె, నూర కున్నవాఁడు;
తెంపుమై వీని నెటుల[1] శాసింపవలయుఁ
దెలుపుఁ' డన శాస్త్రసరణి సుధీజనములు. ౧౬౪

టీక.— 'ఘుటిక మ్రింగిన సిద్ధుఁడు'; రససిద్ధులయినయోగులు పాదరసపు గుళికలను వాడుకొందురు. ఆగుళికలవలన కొన్ని మహిమలు కలుగును.—

క. 'కటకమగు విషము విషధర
కటకంబగు కేలఁబూని కౌతూహలియై
ఘుటికా సంసిద్ధుఁడు రస
ఘుటికయనుంబోలె శివుఁడు గుటుకున మ్రింగెన్' (. 4-66.)

కాబట్టి 'కన్నీరు గ్రుక్కికొనుచు' అనుట తప్పు. కన్నీటిని గ్రుక్కికొందురు గాని 'గ్రుక్కికొనరు' గ్రుక్కుటయనగా అణచుట. గుడ్లనీళ్లు గుక్కుకుంటూ నిలబడ్డాడు, ఇత్యాదిగా లోకవ్యవహారము. కావ్యప్రయోగములు కావలసినన్ని.—

(1) ఉ. కన్నులనీరు గ్రుక్కుకొని కాఁకలమైఁ దెరలంగ.' (యయాతి 5–75)

(2) గీ. 'లెస్స తెరువాటు గొట్టితి లెమ్మటంచు
గ్రుడ్లకొలఁదిగఁ గన్నీరుఁ గ్రుక్కికొనుచు.' (శుక. 3–197)

(3) ద్వి. 'గుడిగుడి ‡ కన్నీరు గ్రుక్కుచునొండు
నుడువ నాలుకరాక నులివేడి యూర్పు.' (గౌ. హరి. 2–177)

(4) వ. "కొంగ - గ్రుడ్లనీళ్లు గ్రుక్కుకొనెను." (V ఫారమువాచకము పు. 129.)

'గ్రుక్కికొనుచున్' అనియే, పూ. ము. పా. తంజ. ప్రతులపాఠమున్ను. కావున శా. పా. తప్పు.

[1] శా. పా.— 'ఁజేయింపవలయు.' (ఇది పూ. ము. పా.)
'శాసింప' అని. తంజ. పా. ఉచితతరముగదా?

‡ 'గుడిగుడిఁగన్నీరు' అని, శా. పా. అసాధువు.

ఘుటిక మ్రింగిన సిద్ధుఁడా ఘుటికవలనిలాహిరిచేత కొంతసేపు మౌనముద్ర వహించియుండును. అందువల్లనే, ఏమన్నను పలుకకూరకుండువానిని 'ఘుటిక మ్రింగిన సిద్ధు' డనుట లోకమున వాడుకయైనది.

'ఘుటికసిద్ధుఁడు, రాయిగొట్టిన గొడ్డు, లటుమటుకాఁడు - మహామాయలాఁడు. (గౌ. హరి. పుట — 152.)

ఉల్లిదిన్నకోమటి. ఉల్లిదిన్నవాడు నోరెత్తి పలుకకుండుట - కంపుబయటుపడు నన్న భయమున. కోమటిని చెప్పనేల? యనిన, వైశ్యు లుల్లి నెక్కువగా వాడుకొందురుకావున.

చ. 'ధుర నవముగ రాణివాసమున ద్రోహ మొనర్చినవాని కాజ్ఞ త
ద్భవనము ముట్టుకోల్గొని, విభావరిఁ గాళ్ళను జేతులు న్మహా
టవిఁ దునిమింపఁ జెల్లు' ననుట న్విని 'యట్లనె సేయుఁడంచు న
య్యవనిసురుం దలారులకు నప్పనసేసె నృపాలుఁ డయ్యెడన్. ౧౬౫

టీక.—రాణివాసమునన్ = అంతఃపురమున; తద్భవనమున్ = అట్లు ద్రోహ మొనర్చిన వానియిల్లు, ముట్టుకోల్ కొని = ముట్టడించి, విభావరిన్ = రాత్రి

క. నెల విచ్చె నూతఁ ద్రోయఁగ
నలివేణిని, జీవితేశుఁడై మును ప్రేమం
బొలుపొందెఁ † గాన దుది న
య్యెలనాఁగకు నతఁడె జీవితేశుం డయ్యెన్. ౧౬౬

టీక.—మును = మునుపు, జీవితేశుఁడై = ప్రాణనాథుడై, మన్ — పొలుపొందెను = ప్రేమచేత అతిశయించెను. (=మిక్కిలి ప్రేమించెను. కావుననే) తుదిన్ = తుదకు, ఆయెలనాఁగకున్ = ఆయింతికి, అతఁడె, జీవితేశుండు = యముడు - అయ్యెను. ('ధవేత్ ప్రియే జీవితేశో నా యమే.' నా. ర.)

జీవితేశ పదశ్లేషకొక యుదాహరణము.—

'రామమన్మథ శరేణ తాడితా, దుస్సహేన హృదయే నిశాచరీ
గంధవద్రుధిరచందనోక్షితా, జీవితేశ వసతిం జగామ సా.' (రఘు. 11-20.)

ఉ. పట్టుఁడుపొఁడుఁడంచు నరపాలునిభృత్యులు సందడించుచున్
గట్టిగ నాతనిన్ విఱిచి కట్టిరి, తన్నిలయంబు ముట్టికో

†శా. పా.—'కానఁదుది.'

ల్పట్టిరి, చుట్టుపట్లఁ బదిలంబుగఁ గావలి వెట్టి, రాష్ట్రులుం
†జుట్టములాలుబిడ్డలును శోకపయోనిధిలో మునుంగఁగన్. ౧౬౭

టీక.— చుట్టములు, ఆలుబిడ్డలును = భార్యయును - పిల్లలును, శోకపయోనిధిలోన్ = దుఃఖసముద్రములో, మునుంగఁగన్, తన్నిలయంబు = ఆతనియిల్లు, ముట్టుకోల్ పట్టిరి = ముట్టడించిరి.

క. చేయఁ దగునె రాజటుల
న్యాయముఁ[1] దనుఁ గర్మసాక్షి నడుగ న్వలదా
బోయ యని రోసి కడకుం
బోయెనొ యన నంతఁ బ్రొద్దు పోటుకునఁ గ్రుంకెన్.౧౬౮

టీక.— కర్మసాక్షిన్ తనున్ = లోకమున జరుగు ఎల్లపనులకు సాక్షియైన నన్ను, (సూర్యునికి 'కర్మసాక్షి' యని పేరు. 'కర్మసాక్షీ జగచ్చక్షుః' అమ.) బోయ= ఆ రాజు బోయవంటివాడు (మూఢుడు; క్రూరుడును, అని భా.)

ఉ. *ఆతనిఁ గొంచుఁ బోయి తలయారులు ఘోరవనాంతరస్థలిన్
జేతులు కాళ్ళు తునుకలుగఁ జేసిన నాయపరాధహీనుఁ డా
పాతకదూరుఁ డాపరమపావనుఁ డాసుకుమారదేహుఁ డు
ర్వీతలమేదురీభవదసృఙ్నవబాష్పజల ప్రవాహుఁ డై. ౧౬౯

టీక.— కొంచుఁబోయి = తీసికొనిపోయి, తలయారులు = తలారులు, - ఉర్వీ...వాహుఁడై.— ఉర్వీతల = భూమియందు, మేదురీభవత్ = దట్టముగా నేర్పడుచున్న, అసృక్ = నెత్తుటియొక్కయు, నవబాష్పజల = అప్పటి కప్పటికి వెడలుచున్న కన్నీటియొక్కయు, ప్రవాహుఁడై = ప్రవాహము కలవాఁడై

---

† శా. పా.— 'చుట్టపురాండ్రు బిడ్డలును.' ('చుట్టములాండ్రు బిడ్డలును' పూ. ము. పా.) 'చుట్టము లాడుబిడ్డలును' తంజ పా.

'ఆండ్రు - బిడ్డలు' అను నుడికి 'భార్యలు - పిల్లలు' అని యర్థము. మఱి 'చుట్టమురాండ్రు - బిడ్డలు' అన్నప్పుడో? 'చుట్టపుభార్యలు - పిల్లలు' అనియేగదా యేర్పడు నర్థము! అట్టి యర్థము సముచిత మగునా? 'చుట్టపురాండ్రు = చుట్టములైన స్త్రీలు - బిడ్డలును' అని భావమా? అయితే, ఆతనికి భార్యలేదా

1 పాఠాం.— 'నన్ గర్మసాక్షి' *శా. పా.— 'అతనిఁ'

కాళ్లు చేతులనుండి కారుచున్న నెత్తురును, కన్నులనుండి కారుచున్న కన్నీరును పెద్ద ప్రవాహముగా ప్రవహించినవని - భా.)

'కొంచుపోవు' అను క్రియలోని 'కొంచు' క్త్వార్థకము:—

'వాపోవక మొదవుఁగొనుచు వచ్చిరి పురికిన్' (భాగ. 9—440)

'సమగ్రయశుల్ వచ్చిరి కొంచుఁ బట్టపుఁగరిన్.' (రామాభ్యు. 8—242.)

'వీవథములు నటిసె లవనివిభునకుఁ గొనుచున్, మథురకరిగా.'

(ఆముక్త - 2—96; 97.)

'తలయారి' తలారికి రూపాం.— (శ. ర. లో లేదు) 'కాణాచి' 'కాఁయాచి' వంటివి.

గీ. హరి హరీ! రామ రామ! నారాయణా! య
టంచు వేదనఁ బొరలుచు 'నకట! [1] తనకు
నెవ్వఁ డీ కపటోపాయ [2] మెంచి చేసె
నతని కీపాటులే వచ్చు' ననుచుఁ బలికి. ౧౭౦

క. అసురుసు రై [3] ససు వై యవ
నిసురుం డటు లసువుఁ దొఱఁగె నేరమి లేకే;
యుసురు మనక పోయెడు వాఁ
డుసురు మనక పోవునే నృపోత్తమతనయా? ౧౭౧

టీక.— అసురుసురై = మిక్కిలి డస్సి, ససువై = శక్తిహీనుడై, అవనిసురుండు = ఆబ్రాహ్మణుడు, నేరమిలేకే = ఎట్టి తప్పును చేయకయే, అటు=ఆరీతిగా, అసువుల్ తొఱఁగెన్ ప్రాణమును విడిచెను. ఉసురు = ప్రాణము, మనక నిలువక పోయెడువాడు, ఉసురుమనక పోవునే = వేదనపడకుండునా?

[1] శా. పా.— 'తన్ను.' [2] 'మెంచఁ జేసె.'

[3] శా. పా.— 'వ్యసువై...తనువుఁ దొరంగ' (వ్యసువు ఐ = చచ్చి' పూ. టీ.) చచ్చుట యన్నను - తనువుఁదొఱఁగుట యన్నను ఒక్కటే. కాబట్టి, 'చచ్చి - తనువుదొరఁగ' ననుట తప్పు. 'ససువై...తనువుదొరగ' నని ప్రా. ము. పా. ససువై...లసువుఁ దొరఁగ' నని తంజ. పా. ఉచితతరము.

'నిస్సార'మను నర్థమున 'ససువు' అను పదము వ్యవహారమున నున్నది. "ససువు A sprout or shoot మొలక.— 'అసురుల మారోపాయులఁ, గసిమసఁగఁగనఁటు,

గీ. ఆసుమంతుండె రాజరాజై జనించె,
‡నలజయంతుఁడె నీ వైతి వలఘుచరిత,
యెవ్వఁ డేకాలమున మించి ¶యెట్లు చేసె
నాతఁ డాకాలమున నట్ల యనుభవించు. ౧౭౨

వ. కావునఁ బూర్వజన్మ దుష్కర్మంబువలన నీ కీదురవస్థ వాటిల్లెఁ గాని నీవలన నీజన్మంబున దోషం బీషన్మాత్రంబు లేదు మీఁద శుభంబు రాఁగల దని పలికి యశరీరవాణి యరుగ వెఱఁగుపడి రాకొమరుండు పైపైఁ బెరుఁగుసొరుగునఁ ధరంబడి పొరలి మొఱలిడుచుండె నంతఁ దత్కథావృత్తాంతం బంతయు ప్రాంత నికుంజాంతరంబున నుండి యాకర్ణించి. ౧౭౩

టీక.— సొరుగునన్ = మూర్ఛచేత.

---

మఖంబుగావఁగనఁట, తా - పసుఁడొకఁడఁట † ససువులఁగొ - న్నిసువుల నడిగె నఁట మునులు నిర్మోహులుగా (రామాభ్యు - 4—8) 'ససువులు రాసుతులు సకల శాస్త్రకలాపా, భ్యసవ వ్యసనాభిముఖో, ల్లసన శ్రీశాలులైరి' (రామాభ్యు 3—150)" (ప్రౌఢ్యము) 'ససువు = సాధువు' (శ. ర.)

'తనువుఁదొరఁగె' అని లఘురేఫముతో వ్రాయుటతప్పు. 'తొరఁగు, అ. క్రి. 'తొఱఁగు' స. క్రి. (అర్థమునకు చూ. శ. ర.)

‡ శా. పా.—'అలజయంతుఁడ వీవైతివి.'

'ఆజయంతుడవు నీవెతివి' అనుటలో అర్థములేదు. 'ఆజయంతుడే నీవైతివి' అనుట యొప్పు. 'జయంతుడనీవైతివి.' అని పూ. ము. పా. 'జయంతుఁడె నీవైతివి' అని, తంజ. పా. 'జయంతుడవు నీవు' అనవచ్చును.—

ఆజయంతుఁడవీవు, నాసుమంతుండు
రాజమహేంద్ర భూరమణుఁ, డీరీతి.' (నవ. పుట. 80.)

¶ శా. పా.—'యేమిచేసె.' (ఇది పూ. ము. పా.) 'యెట్లుచేసె' తంజ. పా. సాధువు.

† 'సిసువులఁ గొన్నిసువుల' అని 'వావిళ్ళ' పా.—నూ. ని. ఈపాఠమునే గ్రహించినది. పొరపాటు. (చూ. 'కసిమసఁగు') శ. ర. లో 'కసిమసఁగు' క్రింద 'ససువుల' అను సాధుపాఠమే యున్నది.

క. [1]వంతఁ దల యూఁచి 'యౌరా!
యెంతటిమాయలది! యింత యెడ సేసిన దా
[2]యింతియ కద! రా జెఱుకయు
నింతియ కద!' యని తలారు లెంతయుఁ [3]జింతన్. ౧౭౪

టీక.—మాయలది = మాయలు నేర్చినది. ఇంతయెడ = ఇంతటి వ్యవహారము— ('ఎడ = వ్యవహారము' శ. ర.) చేసినది, ఆ - ఇంతియకదా = ఆయాఁడుదేగదా; రాజు + ఎఱుకయున్ = రాజుయొక్క వ్యవహారజ్ఞానమున్ను, ఇంతియకదా = ఇంతేకదా!

క. కువలయనేత్రాత్మజుఁ డగు
కువలయనేత్రాత్మజుని యకుంఠితరుచిది
వ్యవిభూషణములు గొని, కన్
గవలను నీ రొలుకఁ బురమునకుఁ జని రంతన్. ౧౭౫

టీక.— † కువలయనేత్ర = స్త్రీలకు, ఆత్మజుఁడు = మన్మథునివంటివాఁడైన, (= మదనసుందరుడైన) కువలయనేత్ర + ఆత్మజుని = భూమండల నాయకుని కుమారునియొక్క, అకుం...షణములు = కనుమాయని మెరుగులుగల సొమ్ములు, కొని =

గీ. తనదు పేరిటిసారంగధరుని నిర్మ
లాత్ము దండింపఁ జెల్లునే యనుచుఁ గనలి
భువనజాతభయంకరస్ఫూర్తి వెడలె
నన [¶]మెఱసె నెఱ్ఱవాఱి రథాంగవైరి. ౧౭౬

---

1పాఠాం.— 'అంత,' 2 'యింతేకద...నింతేకద.' 3 'వంతన్.'

† పూ. టీ.— 'కువలయనేత్ర ఆత్మజుఁడు = బుధుఁడు (బుధునివంటి విజ్ఞాని యనుట) లేక - కువలయనేత్ర ఆత్మజుఁడు = జగచ్చక్షుని కొడుకు = యమధర్మరాజు (యమధర్మరాజువంటి ధర్మాత్ముఁడనుట.'

సారంగధరుడు, (చంద్రునికొడుకు = ) బుధుడట! (సూర్యునికొడుకు = ) యమధర్మరాజట! బలే టీక! 'కువలయ' మనగా భూమండలము- గాని, 'జగత్తు' కాదు. కాబట్టి 'కువలయనేత్ర = జగచ్చక్షువుయొక్క' అనుటయును తప్పే.

¶ శా. పా.—'మెఱసి యెఱ్ఱవాఱె' (ఇది పూ. ము. పా.)
చంద్రబింబము - ఎఱ్ఱగానుదయించి క్రమ క్రమముగా తెల్లవాఱును గాని, (తెల్లగా) ఉదయించి (పిమ్మట) యెఱ్ఱవాఱదు.—

టీక.—రథాంగవైరి = చక్రవాకములకు విరోధియైన చంద్రుడు, తనదుపేరిటిఁ తనకు పేరైన సారంగధర శబ్దమే పేరుగాఁగలవాడును, నిర్మలాత్ముఁడును - (అయిన) సారంగధరుని, దండింపఁ జెల్లునే యనుచున్, కనలి = కోపించి, భువనజాత = లోక సమూహామునకు (‡ భువన = నీటియందు, జాత = పుట్టినవైన - కమలములకు, అని అర్థాం.) భయంకరస్ఫూర్తిన్ = భయమును కలిగించు స్ఫురణముతో, వెడలెనన్, ఎఱ్ఱవాటి = ఎఱ్ఱనై, మెఱసెన్ = ఉదయించెను.

† ఆ. వె. మేలు 'పిచ్చుకుంటుమీఁద భాగీరథి
వచ్చె' ననఁగ నపుడు వానిపైని
గగనభాగ నిగనిగచ్చంద్రచంద్రికా
లహరి యుబ్బి జొబ్బిలంగ నిండె ౧౭౭

టీక.— మేలు = బళి! * పిచ్చుకుంటుమీఁదన్ = కుంటివానిమీఁద, భాగీరథివచ్చెననఁగన్ = గంగానది ప్రవహించెనన్నట్లుగా, అపుడు, వానిపైని చేతులు తెగి కుంటియై పడియున్న ఆసారంగధరునిమీద, గగనభాగ = ఆకాశమునందు, నిగనిగత్ = నిగనిగ మెఱయుచున్న, చంద్ర = చంద్రునియొక్క, చంద్రికాలహరి = వెన్నెలప్రవాహము, ఉబ్బి = ఉప్పొంగి, జొబ్బిలంగన్ నిండెన్ = పూర్తిగా వ్యాపించెను.

---

'స్ఫుటసౌగంధికరాగరక్తరుచిమైఁ బూసెం జపాసన్నిధి
స్ఫటికంబ ట్లుదయాద్రిగైరిక శిరస్స్థానస్థితిం జంద్రుఁడ
చ్చొటు వాయన్ శుచియయ్యె' (మను. 3-32)

కావున శా. పా. తప్పు. 'మెఱసె నెఱ్ఱవాతి' అనియే తంజ. పా.

‡ఈ 'భువనజాత' శబ్దమును వాడుటలోఁగల శ్లేషచమత్కారము పూ. టీ. వారికి గోచరించనేలేదు. కవి యీశ్లేషచమత్కారమును 'విజ' లో గూడా వాడియున్నాడు. (చూ. 3-53.)

† శా. పా.— 'తే'. పూ. ము. న 'గీ' అనియున్నది. శాస్త్రిగారు 'తే' అని సవరించినారు. వారిమీది విశ్వాసముచేత వావిళ్ళవారును 'గీ' అన్నారు. కారణమేమోగాని శాస్త్రిగారు ఆటవెలది - తేటగీతులను గుర్తించుటలో పలుమారు ప్రమాద పడియున్నారు. (చూ ౧-౫౭)

పూ. టీ.— 'పిచ్చుకుంటు = అనాథుని'.

'పిచ్చుకుంటు' అను పదమునకు 'కుంటివా' డనునది ప్రసిద్ధమైన యర్థము పంగునకు లేవఁజాలనివాఁడు, పుట్టుమొండి, పిచ్చుకుంటును పేళ్లుపొసఁగు." (సాంబ

'పిచ్చుకుంటుమీద భాగీరథి' అనునది లోకోక్తి. ఆలోకోక్తికి 'పంగూపరి గంగాప్రవాహము' అను న్యాయము మూలము. 'గంగవరకును పోలేని కుంటివాని మీదికి గంగయే వచ్చి పవిత్రునిచేసినట్లు' అని యర్థము. ప్రకృతమున సారంగధరుడు కుంటివాడే యగుట చేతను, తెల్లదనము; ఆకాశమునుండి దిగుట; పైని ప్రసరించుట, అను గుణములచేత వెన్నెలకు భాగీరథి సామ్యము చక్కగా కుదిరియుండుట చేతను, లోకోక్తి అన్నివిధముల నను వై యొప్పినది. — పై లోకోక్తిని కవులు 'అగ్రహతకు మించిన ఫలము లభించుట' అను నర్థమున విరివిగా వాడియున్నారు. కొన్ని యుదాహరణములు.

క. 'రారానిచోటుకాదు, కృ
పారాజిత, పిచ్చుకుంటు పైఁబర్విన భా
గీరథి విధమున నస్మద
గారమునకు రమ్ము కపిశిఖామణి, యనుడున్.' (వేం. పంచ. 4-57)

క. 'పంగూపరి పరినిపత
ద్గంగాసమ మాదృశాక్షిగతగోచర భా
వాంగీకర్తకుఁ జోళ
ప్రాంగణ పరిదృశ్యమాన బహుసేవధికిన్.' (కవి. రసా. పీఠిక. 94)

సీ. 'సంసారమల విమోచనము నాకాంక్షించు
పంగులపై గంగ, రంగశాయి.' (కవి. రసా. పీఠిక. 91)

ఉ. 'ఇచ్చటఁ జేదిరాజ నఖహేతిహతిన్ గతిదూలియున్న యీ
పిచ్చుకగుంటుమీఁదఁ గృపపెంపున నామరలోకవాహినిం, దెచ్చితిగా.'
(వసు. 5-20)

ద్వి. 'కోరుచుండఁగఁ బిచ్చుగుంటుపై...చారు భాగీరధి చనుదెంచులీల
వచ్చితివీవు' (సా. ప్ర. పుట. 34)

## — మత్స్యనాథుడు సారంగధరునికడకు వచ్చుట. —

ఉ. ఆసమయంబునం దొకమహాత్ముఁడు సిద్ధుఁడు మత్స్యనాథుఁడన్
భాసురశీలుఁ డన్నగముపై నొకచో గుహలోన నుండి యా

2-11) అనూరు డను నర్థమును కలదు. కాని అది ప్రకరణోచితము కాదు. అనూరుని మీద భాగీరథి ప్రవహించెనన్న కథ యెందును కానరాదు. పై లోకోక్తి నెరుగక పూ. టీ. కర్తలు, అనుచితమైన యర్థమును వ్రాసినారు.

రాసుతుదీర్ఘరోదనవిరావము వీనులఁ బడ్డఁ 'గానలో
నీసరిప్రొద్దు వోవు నెడ నెవ్వఁడొకో విలపించు చుండెడుస్. ౧౭౮

టీక.—దీర్ఘరోదనవిరావము = పెద్ద యేడుపుధ్వని, ఈసరిప్రొద్దుపోవు నెడన్ = ఈ సగమురాత్రివేళ.

క. ఆరసి వత్తము గాకని
యారసికుఁడు *వశికులామరాగ్రణి దీనా
ధారామితకరుణామృత
ధారాధారేయవికసితమనోంబుజుఁ డై. ౧౭౯

టీక.—రసికుఁడు = రసికుఁడైన, ఆ - వశికుల - అమరాగ్రణి = తాపస సమూహశ్రేష్ఠుడు. (వశి = ఇంద్రియనిగ్రహముకలవాడు.) దీనా...బుజుఁడై— దీన = ఆ పన్నులకు, ఆధార = అవలంబమైనట్టియు, అమిత = విస్తారమైనట్టియు, కరుణామృత = దయయనెడి అమృతముయొక్క, ధారాధారేయ = ధారావిశేషముచేత, వికసిత = వికసించిన, మనోంబుజుఁడు = మనస్సనెడి కమలము కలవాడు-ఐ. (దయచేత మనసుప్రసన్నమై - అని భా.)

సీ. పెనఁచి కెంజడలు నెత్తిని దిండుగాఁ జుట్టి,
సింగినాదముకొమ్ము చెంతఁ బెట్టి,
పంచవన్నెలయోగపట్టె పొందుగ వైచి,
‡ పొలుపు నిద్దపుమేన బూఁది పూసి,
† పొడలయొడ్డాణంబు నడుమున బిగియించి,
వెలిపట్టుగంతమై నలవరించి,
పెళపెళ మనెడుబెబ్బులితోలు మొలఁ గట్టి,
చికిలిలాతపుఁగోలఁ జేతఁ బట్టి,

* శా. పా.— 'తాపసోత్తమాగ్రణి' (ఇది పూ. ము. పా.)

‡ శా. పా.– ప్రొద్దునిద్దపు' (= 'సూర్యునితేజస్సుగల' అని పూ. టీ.) నిద్దము - అనగా, 'నునుపైనది' గాని 'తేజస్సుగలది' కాదు.— 'పొలుపు నిద్దపు మేన' అని పూ. ము. పా.

† శా. పా.— 'యొడ్డాణాన నడుము చాల బిగించి.' ఈపాఠమున ప్రక్రమభంగదోషమున్నది. సాధుపాఠము తంజ. ప్రతిలో నున్నది.

గీ. యక్షమాల, సువస్తులకక్షపాల,
చెవుల ‡ నెలరాలకామాక్షు, లవటుసీమ
సన్నవిడిగౌడరుద్రాక్షసరము లమర,
గిలుకుఁబావలు దొడిగి కుత్కీలము డిగి. ౧౮౦

టీక.— కెంజడలు = ఎఱ్ఱనిజడలు, దిండుగా = గుండ్రనిదిండువలె - సింగినాదము కొమ్ము = దుప్పికొమ్ముతోచేసిన (ఫ్లూటువంటి) వాద్యము. చెంపక పెట్టి= ఆజడలదిండులో ఒకప్రక్కను దోపి. పంచ....పట్టె = అయిదురంగుల పట్టునాడా- (యోగులు జందెమువలె ధరింతురు). పాలుపునిద్దపుమేనక = అందమైన నున్నని దేహమున; పొడలయొడ్డాణంబు = పెద్దపులితోలు పటకా. వెలిపట్టుగంత = తెల్ల పట్టుబొంత. చికిలిలాతపుకోల = చక్కగా తుడిచి శుభ్రపరచిన యోగదండము - అక్షమాల = రుద్రాక్ష తావళము - సువస్తుల - కక్షపాల = మణులు, మందులు, వేరులు - వెల్లంకులు మున్నగు వస్తువులతో నిండిన సంచి - (కక్షపాల = కకపాల= సన్న్యాసులు చంకకు తగిలించుకొను సంచి). చెవులక = చెవులయందు, $ నెలరాల కామాక్షులు = చంద్రకాంతపుపోగులు. అవటుసీమక = ముచ్చిలిగుంటయందు (- మెడలోనన్నమాట) సన్న - విడి - గౌడరుద్రాక్షసరములు = సన్ననివి - ఎడ మెడముగా కూర్పబడినవి, అయిన గౌడదేశపు రుద్రాక్షల తావళములు. (గౌడ దేశము—Gaur Bengal proper. The gangetic Contries.' (బ్రౌను.) (కుత్కీలముడిగి = కొండదిగి.

---

‡ శా. పా.— 'నెలరాలకామాక్షులవటు.'

'కామాక్షులు' గాని 'కామాక్షీలు' కావు. 'కామాక్షు లవటుసీమ'ననియే పూ. ము. పా. కామాక్షి - ఏకవచనము.

$ పూ. టీ.— 'నెలరాల = చంద్రకాంతమణులు' అని మాత్రమే.

టీక వ్రాయవలసినది 'కామాక్ష'లకుగాని 'నెలరాల'కు కాదు. పూ. టీ. వారును నెలరాల నెరుగుదురుగాని 'కామాక్షుల' నెరుగరు. అందువల్లనే 'కామాక్షుల' జోలియెత్తక మానినారు. 'కామాక్షులు' శ. ర. లో లేవు; బ్రౌణ్యమునను లేవు. కావ్యములయం దున్నవిగాని వారు చిత్తగించలేదు. మరి తెలియుట యెలాగు? -చూడండి కవులా శబ్దము నెట్లు వాడియున్నారో!

(1) సీ. 'అపరంజి పసిఁడి కామాక్షులు, డామూఁపు
పై గొండ్లిగావించు యోగపట్టె.' (వేం. పంచ. 4-101)

'సింగినాదము', ఇదియొక విచిత్రమయిన శబ్దము. 'శృంగముయొక్క - నాదము' అని శబ్దార్థము ; కాని వ్యవహారమున నాదమునిచ్చు శృంగమే 'సింగినాద' మయినది. 'సింగినాదము - జీలకఱ్ఱ' అని లోకోక్తి. 'పూర్వకాలమున జీలకఱ్ఱ నమ్మవచ్చెడి విదేశీయులు, ఊరిముందరకివచ్చి తమరాక యెల్లరికిని తెలియుటకై - 'సింగినాదము' చేసెడివారట. అనగా కొమ్ము నూదెడివారట. సింగినాదము - జీలకఱ్ఱ అమ్మవచ్చిన దన్నందుకు గుర్తు. సింగినాదము వెంటనుండునది జీలకఱ్ఱయే కావున - లోకులా రెంటిని జోడించి - 'సింగినాదము - జీలకఱ్ఱ' అన మొదలుపెట్టినారు.— ఇప్పుడా పలుకుబడి 'ఉపేక్ష్యము' అన్న అర్థమున వాడబడుచున్నది:— "శింగినాదము - Nonsense, stupidity, folly. వెర్రిచేష్ట." (బ్రౌను.)

ఉ. అల్లన నేఁగి, వాఁడు తను వంతయు నెత్తుటఁ దోఁగి భూమిపైఁ
దెళ్లి నెగుల్ †ఘుటిల్లఁ గను దేలఁగ వైచి తలంకఁ జూచి, 'హా!

(2) 'పీనులఁ బటికంపు వింతకామాక్షులు
కనుబొమల్సందునఁ గావిబొట్టు' (హం. 1-45)

(3) సీ. 'కడునొప్పుసంకులు కామాక్షి కవగాఁగ...
జోగురాలును బోలెను సొబగుమీఱుకొలను గాంచిరి.'
(యయాతి. 3-57)

(4) ద్వి. 'అడరెడు మణులకామాక్షులు మెఱయ.' (నవ. పు. 27)
'తళుకొత్తు చంద్రకాంతంపుఁ గామాక్షు
లలవడనించి కట్టాణి ముత్యములఁ
బోలఁ జాలెడు శంఖుపూసలమాల.' (నవ. పు. 82.)
శంభుదాసుడీ కామాక్షుల పోఁగులనే - 'బొంగురుద్రాక్షులపోఁగు' లన్నాడు
'బొంగు రుద్రాక్షల పోఁగులు పెట్టి
మంచి రుద్రాక్షల మాలిక వైచి' (శం. సారంగ. పు. 91)
మొత్తమమీద 'కామాక్షులు' అనబడునవి యోగులు ధరించునవిగా నున్నవి.

† శా. పా.— 'ఘుటిల్లఁగను తేలఁగ వైచి.'

'ఘుటిల్లఁగను, తేలఁగ వైచి' అని వారు ఎడపరచి ముద్రించినారు. వావిళ్ల వారును ఆ పద్ధతినే యనుకరించినారు. ఊరక 'తేలఁగవైచి' అంటే అర్థమేమి ? 'కను తేలఁగ వైచి' అనుట యుచితము. 'వాఁడు కన్నులు తేలవేసినాడు.' (చూ. శ. ర. 'తేలవేయు'). "తేలవేసుట - కండ్లు తేలవేసేటప్పటికి బ్రతుకడన్ని

చెల్లరె! యెంతపాతకము సేయఁగఁ జేసిరొ యిట్లు, చందమా
మల్లునిఁ బోలు నీతలిరుటందపుఁ జక్కనికోమలాంగునిన్. ౧౫౧

టీక.— నెగుల్ ఘటిల్లన్ = బాధ కలుగగా, కను తేలగఁవైచి = కండ్లు తేలవేసి, తలంకన్ = తల్లడిలుచుండగా ;— ఎంత పాతకము చేయఁగన్ = ఎంత గొప్ప పాపకృత్యము చేయుటచేత, ఇట్లుచేసిరో ?

మత్తకోకిల.

ఏటికిన్ మదిలోన సంశయ మింక నాతఁడె తెల్పు; నా
మాట ‡విందమటంచు నోయి కుమార యెవ్వరివాఁడ? వీ
*పాటు రాఁ గత మేమి నీకు నిబద్ధిగా? నెవరండ్రునిన్ ?
దేట తెల్లమి గాఁగ నంతయుఁ దెల్పుమా' యని యాదటన్. ౧౫౨

టీక.— నిబద్ధిగాన్ = నిజముగా, ఈపాటురాన్ కతమేమి ? = ఇట్టి కష్టము కలుగుటకు కారణమేమి ? (ఉన్నదియున్నట్లు నిజముచెప్పుము. అని భా.) నిన్ ఎవరండ్రు = నీపేరేమి ?

తోఁచినది." (బ్రౌను).

'నెగుల్ ఘటిల్లి కను దేలఁగవైచి' అని పాఠాంతరమున్న తంజ. ప్రతులలో నున్నది.

‡ శా. పా.— 'విందుమటంచు' (ఇది పూ. ము. పా.)

'ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగును' (బా. క్రి. 30.) కావున 'విందమటంచు' అనుట ఒప్పు ; 'విందుమటంచు' అనుట తప్పు. (ఈ తప్పు ౩౯ వ పద్యమునను జరిగియున్నది).— 'ఈవిధంబునఁ గోయ నెంతటి తప్పు, గావించెనో చెప్పఁగా విందమనుచు' అనియే మూలము. (చూ. పు. 83.).

* శా. పా.— 'ఈపాటు రాఁగత మేమినీకు ? స్వభావ మెవ్వరటండ్రునిన్ ?' (ఇది పూ. ము. పా.)

అర్థమేమో వారు సెలవియ్యలేదు. 'నిబద్ధిగా; నెవరండ్రునిన్' అని, తంజ. పా. 'నిబద్ధి' లోకవ్యవహారమున నున్నది. బ్రౌను, 'నిబద్ధి Truth, certainty, reality. [illegible] అని అర్థమును - వ్యవహారమును గూడా చూపి చెప్పినాడు. 'నిబద్ధి = నిజము' (శ. ర.)

క. తాపసనాథుఁడు పలికినఁ
దాపసనాథుఁ డగురాజతనయుఁడు ముంజే
మోపి మొగ మెత్తి నెమ్మన
మోపిక లే కోహటిల్లి యుసు రసు రనుచున్. ౧౮౩

టీక.— తాపసనాథుఁడు = ఆ తపస్వి శ్రేష్ఠుడు, పలికినన్ = అట్లనుఁగా, తాప - సనాథుఁడు అగు = తాపముతో కూడుకొనియున్న (= మరణవేదన నొందుచున్న -) వాడైన - రాజతనయుఁడు, ముంజే = ముంజెయ్యి (చే = చేయి.) మోపి = నేలకానించి, నెమ్మనము — ఓపికలేక, ఓహటిల్లి = స్రుక్కి, ఉసురసు రనుచున్ = పరితాపము నొందుచు.

ఉ. ఆర్చెదొ తీర్చెదో తెలుప నయ్యెడి దే? మని యంతఁ దేరి హా!
†యోర్చు మెఱుంగ కంటి, సదయోత్తమ నీ వెవరయ్య? నన్ను నీ
డేర్చఁ దలంచి మానవుని వేవను వచ్చినశంకరుండవో?
కూర్చినప్రాణబంధుఁడవొ? కూరిమి రాఁ గత మెయ్యది య్యెడన్?

టీక.— ఆర్చెదొ = నాకుగల సంతాపమును చల్లార్చెదవో? తీర్చెదో = నాకుగలిగిన కష్టమును తొలగించెదవో? అని, అంతన్ = అంతలోనే, తేరి = తెలివి తెచ్చుకొని, హా = అయ్యో, ఎఱుంగకంటిన్ - ఓర్చుము = సహింపుము. ఈడేర్చన్ = కాపాడుటకు;

సీ. వినవయ్య రాజరా జనురాజుతనయుండ,
‡సారంగధరుఁ డను పేరివాఁడ,
నొక పావురము వెంట పెకలి నై సవతిత
ల్లింటికిఁ జన, నామె యొంటి నుండి,
కామాంధురా లయి కలయఁ గోరిన, 'నీవు
జనని వే సుతుఁడ దోసం' బటంచుఁ
దలఁగి వచ్చినఁ దనతప్పు నాపయిఁ జూపి
భూపాలునకు నెగఁబోసి, యీర్ష్య

---

† శా. పా.— 'యోర్చు మెఱుంగకంటి' (ఇది పూ. ము. పా.) తప్పు. 'ఓర్చు మెఱుంగకంటి' తంజ. పా. ఒప్పు.

‡ 'సారంగధరుఁడన జరుగువాఁడ.'

ఆ. వె. నాజ్ఞ వెట్టఁ జేసె; నలకన్నతండ్రియు
వెరవు మాలి యిటుల వేగిరించెఁ;
దాపసేంద్ర, యింక దైవంబు నే మని
దూఱువాఁడ? †వట్టి దూఱు వాఁడ. ౧౫౫

టీక.—ఎగఁబోసి = ఉన్నవిలేనివి చెప్పి - దుర్బోధలుచేసి, వేగిరించెన్ = తొందరపడెను. దైవంబును, ఏమనిదూఱువాఁడన్ = ఏమని నిందింతును ? వట్టి దూఱువాఁడన్ = నిష్కారణముగా దూఱుపడినవాఁడను. (దూఱు = అపకీర్తి)

ఆ. వె. మృగకులంబె కాని మిట్టాడ మానిసి
యెందు లేనియట్టి యీ యడవిని
నీసుధారసోక్తి నెఱయ నీయెడ విని
చెవులు చల్లనయ్యె సిద్ధవర్య. ౧౫౬

టీక.— మిట్టాడన్ = సంచరించుటకు, — సుధారసోక్తి = అమృతమువంటి మాట, ఈయెడన్ = ఈసమయమున - విని.

వ. నీవు మహాపురుషుండవని తోఁచె; నీసమ్ముఖంబు గలుగుటం జేసి యింతతడవు మాటాడఁ గలిగెఁ; గరంబు నరంబులు దివియుచు నున్నవి; మున్న కరపదచ్ఛేదనం బొనరించిన వారినే కంఠ లుంఠనం బొనరింపుఁ డని వేఁడుకొనైతి; ధారాళకీలాలంబులు గ్రోలఁ ‡బయిం బడు పిపీలికామక్షికాదికంబులఁ జోపఁ జేతులు లేవు; గర్భ శ్రీమంతుం డయిన రాజకుమారునకుఁ జుమీ యీపోఁడుములు; చూచితే! యనిమోళ్ళుసూపితత్కరంబులుశిరంబునఁజేర్చియింకనొకటి విన్నవించెదఁ జిత్తంబులోనఁ గోపంబు లేదుగదాయనిదీనాలాపంబుల.

† శా. పా.— 'పటుదూఱువాఁడ' ('ఊఱును వాఁడయును వట్టివి = ధర్మహీనములు' అని పూ. టీ.)

ఊఱు - వాఁడ, రెండైనప్పుడు 'వట్టివి' అనిగదా అనవలసినది ? మరి 'వట్టిది' అనుటయెట్లు ? 'వట్టిది' అన్నంతమాత్రమున నే 'ధర్మహీనములు' అన్నయర్థమువచ్చునా? వారి పాఠము - అర్థముకూడా సరియైనవి కావు. 'వట్టిదూఱువాఁడ' అని పూ. ము. పా.

‡ పాఠాం.— 'బైలఁబైల'

టీక.— నరంబులు, తివియుచున్నవి = లాగుచున్నవి. కంఠలుంఠనంబొన రింపుఁడని = గొంతుకూడా కోసివేయవలసినదని, కీలాలంబులు = నెత్తురు, చోపక = పోఁదోలుటకు, గర్భశ్రీమంతుఁడు = తల్లిగర్భమున పడిననాటనుండియు భోగము లను భవించినవాడు, ఈ - పోఁడుములు = ఈదశలు, మోళ్లు = మొండెములు,

గీ. అసదుగాఁ జూడ కీమాఁట, యఘము చెంద;
దసదుగా నిన్ను వేఁడెద యతివరేణ్య,
యలమట సహింపఁ జాలను, బొలియ నొక్క-
మందు గల్గిన దయసేయుమా రయమున. ౧౮౮

టీక.—యతివరేణ్య, ఈమాట = నే నడుగబోవుమాట, ‡అసదుగా చూడకు = తప్పుగా భావింపకుము, అఘము చెందదు = దీనిచేత నీకు పాపము కలుగదు, అస దుగా = దీనముగా, వేఁడెదను; అలమట = బాధ, సహింపఁజాలను, బొలియక = చచ్చుటకు.

తరల

అనిన నయ్యకలంక మై యలరారునీరుకొలంకు నె
మ్మనము గల్గు మహానుభావుఁడు మాళవక్షితిపాలనం
దనుని! వేదనఁ జూచి హా! గురునాథ! యీశ! సదాశివా!
యనుచుఁ దామరపాకునీరుక్రియం దలంకి దయామతిన్. ౧౮౯

టీక.— అకలంక...మనము = నిర్మలమయిన నీరుగల కొలనువలె ప్రసన్నమైన మనస్సు. తలంకి = అల్లలనాడి.

క. 'వినవోయి రాజనందన
తను వేటికిఁ †దొఱఁగవలయుఁ? దల్లడపడఁ గాఁ

‡ పూ. టీ.— 'అసదు = (1) నికృష్టము - (2) అల్పము.'
ఈ యర్థము సరికాదు.

† శా. పా.— 'తొరఁగవలయు' (ఇది పూ. ము. పా)
'తొఱఁగ' అని శకటరేఫముతో వ్రాయవలెను. ఈ తప్పు నింతకుముందును పేయున్నారు. (చూ. 3-౧౭౧ క్రింద)

జను నె? పురాకృతకర్మం
బనుభవమునఁ గాక†తీఱునా యెవ్వరికిన్? ౧౯౦

టీక.— తను వేటికి - తోఁ(అఁ)గవలయున్ = శరీరము నెందుకు విడువవలెను - (అనగా చావవలసినంత యేమివచ్చినది. నేను నిన్ను రక్షింతును. భయపడ నక్కఱ లేదని భా.) తీఱునా = అంతరించునా.

గీ. మంచు దయసేయు మంటి వే మందు నిన్ను!
మందులకుఁ గాక యిటు సేయ మాకుఁ దగు నె?
యసదుగా నన్ను వేఁడెద నంటివి గద;
యదియుఁ దప్పదు ప్రాణ మి త్తడలవలదు. ౧౯౧

టీక.— మందులకున్ = అవివేకులకు ('మంద - stupid - foolish' ఆప్టి) అసదుగాన్ = దీనముగా - వేఁడెదనంటివి (కాబట్టి) అదియున్ తప్పదు = నీప్రార్థనము వ్యర్థము కాదు. ప్రాణమిత్తున్-అడలవలదు = భయపడనక్కఱలేదు. (ఇత్తున్ + అడలవలదు = ఇ త్తడలవలదు. 'ప్రథమేచోత్తమే చైనక్రియే త్వోవాభవేచ్చ్యుతిః' అథ. సంధి. 5½).

క. మనపాలఁ గలఁడు శంకరుఁ
డనపాయోపాయుఁ డాశ్రితానేకాప
ద్వనపావకుఁ; డా లోకా
వనపాటవుఁ గొలువ, లేనివస్తువు గలదే?' ౧౯౨

టీక.— శంకరుఁడు, అనపాయోపాయుఁడు = అమోఘమైన (= వ్యర్థము కాని) ఉపాయము కలవాడు; ఆశ్రి...వకుఁడు = భక్తులయొక్క అనేకాపదలనెడి యడవికి అగ్నివంటివాఁడు. ( - ఆపదలను నిర్మూలము చేయువాడు) ఆలోక - అవన - పాటవున్ = లోకములను రక్షించుటయందు నేర్పరియైన - ఆశంకరుని, కొలువన్, లేనివస్తువు కలదే ? = సర్వమును లభించును.

---

† శా. పా.— 'తీరునా' (ఇది పూ. ము. పా)

తీరుట = బలిసి చక్కబడుట. అంతరించు - అనునర్థమున 'తీఱు' శకటరేఫ యుతము. శాస్త్రిగారు 'తీరు' అనవలసినచోట 'తీఱు' అంటారు; 'తీఱు' అనవలసిన చోట 'తీరు' అంటారు. (చూడు ౧-౧౩౦ క్రింద.)

మ. అని యూరార్చి కుమారుఁ గొంచుఁ జని, వేయమ్మీననాథుండు ‖ చ
ల్లనిచెంగల్వదొనం దనూరుధిర మెల్లం దోమి నీరార్చి, వా
ల్గనుదోయిం దడిఁ దోఁచి, తేటజలముల్ గా దోయిటం దెచ్చి ద
ప్పి నివారించి, యలంత దేర్చి †యసువుల్ బెంపొందఁగాఁ జేయుచున్.

టీక.— మీననాథుండు = మత్స్యనాథుడు, ఊరార్చి = ఊరడించి, చల్లని చెంగల్వదొనన్ = చెంగలువలుగల చల్లని మడుగున, తనూరుధిర మెల్లన్ = శరీరముమీది రక్తమంతయు, తోమి = మెల్లగారుద్ది, నీరార్చి = స్నానమాడించి, వాల్కనుదోయిన్, ‡తడిన్ తోఁచి = తడియద్ది.— అసువుల్ = ప్రాణములు, పెంపొందఁగాఁ జేయుచున్ = దార్ఢ్యమును పొందునట్లుచేయుచూ.

చ. తనగుహాలోపల న్నిలిపి తా మును గ్రోలఁగఁ జిక్కనట్టి చి
క్కని *తరిపాలుదానపుడు కంఠము మోవఁగఁ ద్రావఁ జేయ, మేన్

‖ శా. పా.— 'నల్లనిచెంగల్వదొన.' (ఇది పూ. ము. పా.)

చెంగల్వ' యనగా 'ఎఱ్ఱకలువ.' నల్లని యెఱ్ఱకలువ – అనుటగాని, ఎఱ్ఱకలువల దొన 'నల్లని' దనుటగాని సరికాదు. కేవలము విరుద్ధము. కావున ఆపాఠమే తప్పు. 'చల్లని' అని సరియైనపాఠము. తంజ. ప్రతులలోనున్నది. "కువలయకుముద, జనిత సౌరభముల చలువగ్గలించి, తనరునీరున నిగతాళించుచున్న, దొనఁ జేర్చి మేను నెత్తురువోవఁ గడిగి." అని మూలము. (పుట. 85.)

† శా. పా.— 'యతనిం బెంపొంద' (ఇది పూ. ము. పా.)

సిద్ధు డుపచారములచేత పెంపొందజేసినది, సారంగధరుని 'అసువు'లను గాని సారంగధరునిగాదు. 'అసువుల్ పెంపొందఁగా' అనియే తంజ. పా. 'అంగము లకు నుసురు – దనువునరప్పించి' అని మూలము. (పుట. 85.)

‡ పూ. టీ.— 'తడిన్ తోఁచి = తడితో తుడిచి.'

తోఁచుట యనగా తడుపుట – అద్దుట, గాని 'తుడుచుట' కాదు. "తోఁచు = తోఁగఁజేయు" (శ. ర.) "తోచుట – To wet, to moisten, to soak. తడుపుట. అద్దుట." (బ్రౌను.)— 'తనివివోనుదకంబు ద్రావించి పిదపఁ, గనుదోయిఁ దడిపి.' అని మూలము. (పు. 85.)

* పాఠాం.— 'తరిపావుపాలతని.'

పనుపడి 'నీట ముంచినను బాలను ముంచిన నీవె దిక్కు నా'
కని యుచితోక్తులంగడుఁ బ్రియం బొనరించె నతండు † తేరుచుఁన్.

టీక.— చిక్కని, తరిపాలు = మీగడతో గూడినపాలు, కుత్తుకమోవఁగన్ = గొంతుకకాన, (కడుపునిండా - అని భా.) త్రావఁగఁజేయన్, మేన్ - పనుపడి = శరీరము కొంచెము స్వస్థపడి, నీట...ముంచినను = చెరచినను - బాగుపరచినను, నీవే దిక్కు. (చల్లని నీట స్నానము చేయించుటకును - కమ్మనిపాలు త్రాగించుటకును - అన్నిటికిని నీవేదిక్కు - అని చమ.) తేరుచున్ = కొంచెము కొంచెముగా తెలిః నొందుచు.

'తరిపాలు' (శ. ర. లో లేదు.); "తరి Butter - తరిగల Rich in butter - తరిగలావు - వెన్న చాలావచ్చే ఆవు - a butter - producing cow" (బ్రౌను.)

తరిపాలు; తరిమజ్జిగ; తరివెన్న, అను వ్యవహారమున్నది.—

చ. 'దిటమున రెడ్డిపాటుపడి తెచ్చియిడంగను గూటి ప్రొద్దు సం
కటి తరివెన్న మజ్జిగలు కంకటిపైఁ బవలింటి నిద్రలున్' (శుక. 2-334.)

గీ. అరయ భువనైకమహిమాఢ్యుఁ డైనయట్టి
మత్స్యనాథుండు రాజకుమారమణికిఁ
గరచరణపంకజోత్పత్తి గలుగఁజేయ
నొకయుపాయంబు చింతించు చుండెనంత. ౧౯౫

టీక.— భువ...ఢ్యుఁడు = జగత్ప్రసిద్ధ మహిమాతిశయము కలవాడు. కర...కలుగఁజేయన్ = చేతులు - కాళ్లను మొలిపించుటకు (* భువన = నీరు - ప్రధానమయిన, మహిమకలవాడు కావుననే కరచరణము లనెడి 'పంకజముల' నుత్పత్తి చేయ యత్నించెనని - చమత్కారము.)

క. తెలతెలవాఱఁగ వచ్చెను
వెలవెలఁ బాఱె నెల, దొవలు ‡విలవిలవడియెన్,

† 'నవ్వుచున్'.

* భువన - పంకజ శబ్దశ్లేష చమత్కారమును పూ. టీ. వారు చెప్పలేదు.

‡ శ. ర. కర్త 'విరవిర' కు 'విరియుటయందగు ధ్వన్యనుకరణము' అని యర్థము చెప్పి, ఆ యర్థము కీ 'సారంగ' పద్యమును - 'విరవిర విరిసెన్' అను పాఠము్తో ఉదాహరించినాడు. పొరపాటు. తెల్లవారు జామున తొవలు ముడుగును గాని

బలపల నయ్యెం జుక్కలు,
కలకల నగె దిశలు పక్షికలకల మెసఁగెన్. ౧౯౬

టీక.— నెల = చంద్రుడు, వెలవెలఁబాఱెన్ = కాంతిహీనుడయ్యెను, తొవలు = కలువలు, విలవిల పడియెన్ = విలవిలపోయెను (= విహ్వలములై పడిపోయెను) చుక్కలు, పలపలనయ్యెన్ = పలుచనయ్యెను. దిశలు, కలకలనగెన్ = ప్రకాశించెను.

ఉ. కొందఱు పాండురంబనఁగఁ, గొందఱు శోణమనంగ, నీటఁ బా
ల్పందఁగఁ జేసి 'పాల్కడలి నంటినజిడ్డది తెల్పు గా, దిదే
'సందియ మేల చూడుఁ'డని చక్కఁగ నజ్జలశాయి కౌస్తుభం
[1]బందఱుఁజూడ నెత్తెనన, నంత నభోమణి దోఁచె [2]నెఱ్ఱఁగన్.

టీక.— (కౌస్తుభమును) కొందఱు, పాండురంబు = తెల్లనిదనియు, కొందఱు, శోణము = ఎఱ్ఱనిదనియు, అనంగన్ = అని వితర్కములు చేసికొనుచుండగా, జలశాయి = విష్ణువు, నీటన్ - పాలుపందఁగన్ చేసి = (ఆ కౌస్తుభమును) నీటిలో శుభ్రముగా కడిగి, 'జనులారా - అది = కౌస్తుభము మీదితెల్పు, పాల్కడలి వంటిన జిడ్డు - గాని, కౌస్తుభము - తెల్పుకాదు.— చూడుఁడు - అని, అందఱున్ చూడన్, ఎత్తెనన్ = ఆకౌస్తుభమును పైకెత్తెనోయన్నట్లు, నభోమణి = సూర్యుడు, ఎఱ్ఱఁగన్, తోఁచెన్ = ఉదయించెను.

కౌస్తుభము, క్షీరసముద్రమును తరిచినపుడుపుట్టిన రత్నము. దానిని శ్రీమహావిష్ణువు వక్షమున ధరించినాడు.

'కౌస్తుభాఖ్య మభూద్రత్నం - పద్మరాగో మహోదధేః
తస్మిన్ హరిః స్పృహాంచక్రే - వక్షోలంకరణే మణౌ.' (భాగవతము)

కౌస్తుభము పద్మరాగము కావున ఎఱుపు.—

సీ. 'ఉదయార్కబింబంబు నొఱపు విడంబంబు
దొరలంగనాడు కౌస్తుభముతోడ.' (ఆముక్త. 1-12)

---

విరియవు. కావున శ. ర. కర్త భావించిన యర్థము తప్పు. వ్రాతప్రతులలోను, పూ. ము. ననుగూడా 'విలవిలపడి యెన్' అన్నపాఠమే యున్నది.

1 శా. పా.- 'అందఱుచూడ' (ఇది పూ. ము. పా.) తప్పు.

శా. పా.- 'నెఱ్ఱగన్' (ఇది పూ. ము. పా)తప్పు.

మ. అలరా జట్లు కుమారు దండనముసేయం బంచి, శోకవ్యథన్
నిల కావేఁగున నిద్రలే కడలుచున్, † నిద్రించి మేల్కన్న పొ
ల్పులరన్ ‡ లేచి, యలక్ష్యరూపముగఁ గాల్యప్రక్రియల్ దీర్చి, మో
సలఁగొల్వై, తల వంచి ఖిన్నుఁడయి చాంచల్యంబుతో నుండఁగన్.

టీక.— నిలక = నిలువలేక, ఆ వేఁగునన్ = ఆదుఃఖారముచేత, అలక్ష్యరూపముగన్ = చేసి చేయనట్లుగా, కాల్యప్రక్రియల్ = ఉదయకృత్యములు, తీర్చి = [illegible].

—, సారంగధరుడు నిర్దోషియని తలారులు రాజుతో చెప్పుట

క. తలవరులు వచ్చి ధరణీ
తలవరులు ప్రధానులును హితజనులుఁ దగువా
రలు నింతటంతటం జం
కలఁ జేతు లిడికొని యుండఁగా నృపుమ్రోలన్ ౧౯౯

టీక.— ధరణీతల - వరులు = భూపతులు.

క. నిగనిగనిభూషణము లిడి,
నెగులున నడ్డపడి యేడ్చి 'నేఁడు కుమారున్
సుగుణాఢ్యుం డని తెలియక
తెగి యూరక యాజ్ఞ పెట్టితిరి గద' యంచున్. ౨౦౦

క. ఆకాశవాణి సెప్పిన
యాకథయును, నూఱడించి యనుటయుఁ, దెలుపన్
శోకము హర్షము వెఱఁగును
జీ కొనరింపంగ విభుఁడు ‡ చిత్తముకలఁగన్. ౨౦౧

---

† శా. పా.— 'కాలనలక్ష్య' (ఇది పూ. ము. పా.) 'లేచియలక్ష్య' అని, తంజ. పా.

‡ శా. పా. — 'చిత్తంబగులన్' (ఇది పూ. ము. పా.)

'అగులన్' అనుట తప్పు. ధాతువు 'అగలు' గాని 'అగులు' కాదు. (చూ. శ. ర.)

టీక.— చీకు + ఒనరింపన్ = చీకాకును కల్పింపగా.

'చీకు' (శ. ర. లో లేదు) 'చింతాచీకూ లేని బ్రదుకు' అని వ్యవహారము. "చీకు - Dampness" (బ్రౌను.) 'చీకాకొనరింప' అని పాఠాం:—

## —♦ రాజు చిత్రాంగిని బావిలో త్రోయించుట ♦—

ఉ. దిగ్గన లేచి, బంధుల సుధీమణులం దగువారిఁ దోడు కొం
చగ్గల మైన కోపమున నంతిపురంబున కేఁగి, 'దీనికిం
దగ్గదు తాల్మి, సామవచనంబులఁ గా దిఁక, నిష్ఠురోక్తులన్
బెగ్గిలఁ జేయఁ జెల్లు' నని పిల్వఁగఁ బంపి లతాంగి, నయ్యెడన్. ౨౦౨

టీక.— తాల్మి = ధీమసము. ఇఁక, సామవచనంబులన్ = మంచిమాటలతో- కాదు.

గీ. 'ఓసి పాపాత్మురాల, నీ వేసదారి
గాయకపుసుద్దు లెల్ల నాకాశవాణి
తెలుప విని వచ్చి తలవరుల్ కొలువులోనఁ
జెప్పినా రిప్పు డింద అచ్చెరువు నొంద. ౨౦౩

టీక.— వేసదారి గాయకపు సుద్దులు = మాయలమారితుత్తితపు చేష్టలు,

గీ. టక్కు టకటొంకు టాటోటు†ఠవళి వగలు
గట్టి పెట్టింకఁ గలది కల్లట్టె తెలుపు;
తెలుప కుండిన నీబుద్ధికొలఁది చూడు
మఱి' యనుచు రాజు బెదరించి మాటలాడ. ౨౦౪

† శా. పా.— 'ఠవలు'.

శబ్దము 'ఠవళి' గాని 'ఠవలు' కాదు.—'డబ్బు తక్కు టక్కు ఠవళి తవళి' (ఆం. భా. 1-119.) - 'టక్కుటాటోటు ఠవళి' (ఆంధ్ర. సం.)— 'ఠవళి = మోసము; కపటము' (శ. ర.) బ్రౌను 'ఠవలి = Trick, guile, frank. హుళక్కి' అని యర్థము చెప్పి, అందు కీ 'సారంగ' పద్యమునే చూపినాడు. ఇతరుల మాట యెందుకు? పూ. ము. నను, తంజప్రతులలోనుగూడా - 'ఠవళివగలు' అనియే యున్నది. "ఖా, పణమా కల్ల - విచారమా ఠవళి" (హంస. 5-111) ఇత్యాది ప్రయోగముల కిక లెక్కయే లేదు.

టీక.— టక్కు...తవళివగలు = టక్కరివగలు (టక్కు మొదలు తవళి వరకును గల పదములన్నియు - 'టక్కరి' యను నర్థమునిచ్చునవే, మిక్కిలి టక్కరి యనుటకు వరుసగా వాడబడినవి.) కలదికలట్టె = ఉన్నది ఉన్నట్టుగానే, తెలుపకుండినఁ, నీబుద్ధికోలఁది = నీబుద్ధికి తగిన శిక్షయే జరుగును; 'చూడు మజా' యని బెదరింపు. (జాతీయము.)

క. వంచాడించక, తాలిమి
డించక, బిగు వెడలి ‡దల్లడించక, మదిలో
నించుకయైనను దాఁ జలి
యించక, యాగట్టువాయి యిట్లని పలికెన్ ౨౦౫

టీక.— వంచాడించక = బెదరక, తాలిమిడించక = ధైర్యమును తగ్గనీయక, ఆ - గట్టువాయి = ఆధూర్తురాలు.

చ. 'తెలిసితి హా! యి దంతయును దేవరపట్టపుదేవి కైతవం'
బలసుతు†బారి దప్పి నను నాజ్ఞ యొనర్పఁగ లంచ మిచ్చి వే
పిలిచి తలార్ల చేత ననిపించిన దిట్టుల; నీకు వాళము
దెలియక వెఱ్ఱిరాజ, యిది లెస్స నిజం బని *నమ్మినావుగా! ౨౦౬

‡ శా. పా.— 'దల్లడించక.' — శ్రుతికటువు 'వెడలి తల్లడించక.' అని, శ. ర. పా. గ స డ ద వా దేశము బహుళముగాని నిత్యముకాదు. (చూ. ఆం. భా. శా. సంధి. 67)

† శా. పా.—'సుతుపాడిఁదప్పి.' ('సుతుపాడిన్ = సుతుని వ్యవహారమందు' అని పూ. టీ)

పూ. ము. న 'సుతుపారి' అని యున్నది. శాస్త్రిగారు 'పాడి' యని దిద్ది, 'పాడిన్ = వ్యవహారమందు' అన్నారు. వ్యవహారమందు - తప్పి, అనగా నేమి తప్పియో? 'బారితప్పి' అని సరియైనపాఠము - తంజ. ప్రతిలో నున్నది. మూలమునను, 'రత్నాంగి దేవియును, తలవరులకు నెల్లఁదగు లంచమిచ్చి, తన తనూభవుబారి తలఁగంగఁ జేసె.' (పు. 88) అని యున్నది. కావున 'బారి' ఒప్పు; 'పాడిన్' తప్పు.

* శా. పా.— 'నమ్మినాఁడవే'

'నమ్మినావుగా' అని పూ. ము. పా. అపాఠము, తంజ. ప్రతులలోను నున్నది. అయితే శాస్త్రిగారి దృష్టిలో 'నావు' గొప్పతప్పు. (చూ. ఆంధ్రప్రసన్న - విమర్శలో, వి. సం. పు 3) అందువల్ల 'నాఁడవే' అని దిద్దినారు. దిద్దుటతప్పు. వెంకటకవి గ్రంథమున నుండవలసినది వెంకటకవి భాష గాని వెంకట్రాయశాస్త్రి భాష కాదు.

టీక.— కైతవంబు = మోసము, సుతుబారి తప్పి = సుతునికి గలిగిన ఆపద తొలగి. ఈ, కువాళములు = కపటకృత్యములు, నమ్మినావుగా = నమ్మితివిగదా.

సీ. ఎంత సేసినది నేఁ! డిది † కన్న విన్న చో
ద్యము గాదు! మఱి దబ్బు దబ్బిన నిటు
వలె నుండవలె! మెచ్చవలదె యిందులకు ర
త్నాంగిని! జూచినయట్టి వార
లది నిజం బనవలెఁ గద? యెన్ని గఱచిన!
దాకాశవాణి యటంచు నొకటి
గల్పించినది ‡చూడు; గానలో నఁట! రాత్రి
యఁట! వారితో మాట లాడిన దఁట!

గీ. కటకటా! యెట్టివింత! లాకాశవాణి
యాడఁ బలికిన దెటు పోయె నీడఁ బలుక
రాదె యిపు?' డని పగ్గించి రాజకీర
వాణి పలికిన నాకాశవాణి పలికె. ౨౦౭

టీక.— ఎంతచేసినది = ఎంతపనిచేసినది - (అని ఆశ్చర్యము.) ఇది, కన్న-విన్న చోద్యము కాదు = కన్న చోద్యమును కాదు - విన్నచోద్యమును కాదు (ఇట్టి వింత యెక్కడా కన్నదీలేదు - విన్నదీలేదు - అని భా.) దబ్బు - దబ్బినన్ = అబద్ధమాడినను; ఎన్ని కఱచినది = ఎన్నిమాయలు నేర్చినది?, పగ్గించి = ప్రజ్ఞలు ప్రకటించి, రాజకీర వాణి = రాచిలుకపలుకులుగల చిత్రాంగి.

గీ. 'ఇంత నేరక యుండిన నంతపనికిఁ
జొత్తువే! బల్మిఁ గొంగును జుట్టి పట్టి

† శా. పా.—'విన్నఁ గన్నఁ జోద్యముగాదో!' ('విన్న కన్న చోద్యముకాదా' అని పూ. ము)

'విన్నన్-కన్నన్' అని శాస్త్రిగారి సవరణ; తప్పు. 'ఇది కన్న విన్న చోద్యము కాదు.' అని తంజ. పా.

‡ శా. పా.—' చూడఁగానలో' (ఇది పూ. ము. పా.)

'కల్పించినది చూడు! కానలోనఁట' అని తంజ. పా. సాధువు.

మొనయు మని నీ వనంగ, నాయన పెనంగ,
నాఁ డెఱుంగనె యంగనా నంగనాచి?' ౨౦౯

చ. అని 'వినవోయి రాజ భువనైకమనోహరమూర్తి యైన నీ
తనయునిఁ జూచి మోహపరితాపమున న్నిలుపోపలేక యీ
చెనఁటి పయిం బడం గదియఁ, 'జెల్లునె తల్లివి గావె నాకు నీ'
వనికడుఁబాపభీతుఁడయి యాయన తన్ గడఁద్రోచిపోయినన్. ౨౧౦

ఉ. కోపమునం గయాళి కొనగోళ్ళఁ గుచంబులు తాన వ్రచ్చి, లోఁ
బాపనియాసు గాఁగ, సుతుపై నటు నింద ఘటింప, నీవు †నా
పాపనిఁ బట్టి తెచ్చి కరపాదము కోయఁగఁ బంచి యూరకే
పాపము గట్టుకొంటివి నృపాలక యెంతటిహంత వెంచగన్! ౨౧౧

టీక.— లోన్ = మనసులో, పాపనియాసు కాఁగన్ = తొలగింప (రా) ని యీర్ష్యఁ ...ప్రడగా, హంత హింసించువాడు.

క. నీతో నిఁక భాషించినఁ
బాతక' మని యంత గగనభారతి నిలువన్
భూతలపతి శోక వనీ
వాతసుహృత్తూలికీభవన్మానసుఁ డై. ౨౧౧

టీక.— గగనభారతి = ఆకాశవాణి (=ఆకాశమునుండి వినబడుచున్న శబ్దము) నిలువన్ = ఆగిపోగా, భూతలపతి = రాజు, శోక...మానసుఁడై.— శోక = దుఃఖ మనెడు, వనీ - వాతసుహృత్ = దావాగ్నికి (వాత = వాయువునకు, సుహృత్ = మిత్రుడు. 'అగ్ని' వాయుసఖుడు.) తూలికీభవత్ = దూదియగుచున్న, మానసుఁడు = మనస్సుకలవాడు, ఐ. (శోకాగ్నిచేత దహింపబడుచున్న మనసు కలవాడై, అని భా.)

ఉ. 'హా! తనయా, వివేకరహితాత్ముఁడ నై నిను నిగ్రహించితిం
గా, తెగి లోకనింద కొడిగట్టితిఁగాఁ, జగజంత యైనయీ

---

† శా. పా.— 'నప్పాపని.' (ఇది పూ. ము. పా.) 'నాపాపని' అని, తంజ. పా. సముచితము.

భీతమృగాక్షిమాట చెవిఁ బెట్టితిఁగా, యతిఘోరపాతకం
బీతఱి నీతి మాలి రచియించితిఁగా' యని సాశ్రునేత్రుఁడై. ౨౧౩

టీక.— నిగ్రహించితిఁగా = చంపితినికదా, సాశ్రునేత్రుఁడై = కంట నీరు పెట్టి.

నిగ్రహించుట = చంపుట, అనుటకు.—

క. 'నృప, యాక్రోడము నీకే యపకారముచేసె? దీని కలుగఁగ నేలా
కృప మదిఁ జొనుపక? నాపై నిపుడీ శరమేసి నిగ్రహించుట యొప్పున్.'
(మను. 6-90)

క. †'బజగెడి మాటలు చెవినిడి,
నిజ మని గురుభక్తినిరతు నిర్మలచరితున్

---

†శా. పా.— 'బజగడుగు దానిమాటలు.'

బ్రౌను పండితుడు - 'బజగడగుది or బజగడుగుది, అనగా నిలకడలేని ఆడుది' అని యర్థముచెప్పి అందుకీ పద్యమునే యుదాహరించినాడు. 'బజగడుగుదాని మాటలు= నిల్కడలేని ఆచిత్రాంగిమాటలు' అని టీకయును వ్రాసినాడు. కాని 'బజగు+అడుగుది' యనగా 'కాలు నిలకడలేక ఊరక తిరుగునది' అని యర్థమగునుగాని 'దుర్మార్గురా' లని యర్థముకాదు; కావున ఆపాఠమంత మంచిదికాదు. పూ. ము. లో 'బిజిగెడిమాటలు చెవినిడి' అని యున్నది. శ. ర. కర్త 'బిజిగెడి' అను పాఠమునే చూపి 'బిజుగు - (స. క్రి.) బొంకు' అని యర్థము చెప్పినాడు. ఆయన మతము ప్రకారము 'బిజిగెడిమాట' లనగా 'బొంకునట్టిమాట' లనిగదా యర్థము? మరి మాటలు బొంకునా? 'బొంకులాడియొక్క మాటలు' అని యుండుట యుచితము. ఆయర్థము సిద్ధించుటలేదు గనుక ఆపాఠమును సరికాదు. తంజ. ప్రతులలో - నొకదానిలో 'బజగెడి మాటలుసెవినిడి' అను పాఠమున్నది. 'బజగెడి' యనుపదము నిందార్థమున - యతిస్థానమున, శుకసప్తతిలో ఇట్లు ప్రయుక్తమై యున్నది.—

సీ. 'ఓవరిపైన నీ కునికిఁ గావించిరే
బజగెడి?' యనిదూఱు బావగారు,
'వాకిటిచెంతఁ గావలియుంచిరే నిన్ను
‡గామిడి?' యని దూఱు మామగారు.' (3-291.)

---

‡శ. ర. లో 'బజగెడి' లేదు సరేగదా పైపెచ్చు 'గామిడి = శ్రేష్ఠుఁడు' అని యున్నది. ప్రమాదము (చూ.

సుజనుఁ గుమారుని లీలాం
గజునిం బోనాడుకొంటిఁ †గద నే' డనుచున్. ౨౧౩

టీక.— బజగెడి = అకతాయియైన చిత్రాంగియొక్క, మాటలు - నిజమని,... లీలాంగజునిన్ = విలాసమున మన్మథునివంటివాఁడైన, కుమారుని, పోనాడుకొంటిన్ కద = పోఁగొట్టుకొంటినిగదా?

గీ. కుటిలచటులమలీమస క్రూరవర్త
నాలి దుర్గుణగణజీవనాలి నాలి
‡ నతికపటపూతనాలిఁ జిన్నాలి నతఁడు
కూపమున నూకఁ బనిచె*నుకోపమునను. ౨౧౪

టీక.— కుటిల = వక్రములును, చటుల = తీవ్రములును, 1 మలీమస = మలినములును - క్రూర = భయంకరములును - అయిన, వర్తన = వృత్తులయొక్క

మరియు, శబ్దాంధ్రపదపారిజాతములో 'బజగేడి = అకతాయి' అని యున్నది. తంజ. ప్రతులలో నొకదానిలో 'బజగేడీ నీ మాటలు, నిజమని...... బోనాడుకొంటిఁగదె' అను పాఠమును ఉన్నది. కాబట్టి 'బజగెడి' - 'బజగేడీ' అను పాఠములు గ్రాహ్యములుగాని తక్కినవి గ్రాహ్యములు కావు.

† శా. పా.— 'నేననుచున్.' పూ. ము. నను, తంజ. ప్రతులు రెండింటిలోను - 'నేఁడనుచున్' అని యున్నది.

‡ శా. పా.— 'అతికుతల' ('అతికుతల - భూలోకము నతిక్రమించిన పూతనా = రాక్షస స్త్రీలయొక్క - ఆళిన్ = పంక్తియైనదానిని' అని పూ. టీ.)

చిత్రాంగి, భూలోకము నతిక్రమించిన రాక్షస స్త్రీలయొక్క పంక్తియైనదఁట! అంటే ?

* శా. పా.— 'పెన్గోపమునను' (ఇది పూ. ము. పా.)

'కోప...పనిచెనుకూపమునను'; 'పనిచె ముల్కాపమునను' అని తంజ. పా.

1 పూ. టీ.— 'మలీ...ఆలిన్ = మలినమయిన దారుణ వృత్తికి చెలియయిన దానిని.'

'వృత్తికి చెలి' యనుట యుచితము కాదు.

ఆళిన్ = సమూహము కలదియు (= ఘోరాతిఘోరములయిన దుష్కృత్యములు చేయునదియును.) దుర్గుణగణ = దుష్టగుణ సమూహమునకు, జీవనాళిన్ = జీవనాడి = ప్రాణభూతయు, నాళిన్ = తుత్తునురాలును, అతి కపట పూతన - ఆళిన్ = మిక్కిలి కపటముకలదియైన పూతనకు - చెలికత్తె (యనదగినదియు) - నైన, చిన్న + ఆలిన్ = చిన్నభార్యను = చిత్రాంగిని, కోపమునను = కోపముచేత, కూపమునన్ = బావిలో, నూకన్ — పనిచెన్ = పడద్రోయుటకాజ్ఞాపించెను.

ఉ. ఆయెడ రాజునానతి మృగాక్షిని రజ్జునిబద్ధఁ జేసి 'య
న్యాయము, రాకుమారు†సుగుణాగ్రణిఁ బావనశీలు నుత్తమున్
మాయలు వన్ని మచ్చరముమైఁ దునిమించెను! జూడ నున్నద
న్నా! యిది మేఁకవన్నె పులి' యంచుఁ దలారులు గొంచుఁబోవఁగన్.

టీక.—మృగాక్షిని = చిత్రాంగిని, రజ్జునిబద్ధన్ చేసి = త్రాళ్ళతో బిగించికట్టి 'మేకవన్నె పులి = (లోకోక్తి) మేకవలె కనబడుచూ, పులివలె హింసించునది.

## —♦ పౌరులు చిత్రాంగిని నిందించుట ♦—

వ. కుచ్చితురాలైనయచ్చపలలోచనం జూచి పౌరు లందఱు ‡గచ్చుకొని గ్రచ్చుపొదఁ గదలించినకైవడి విచ్చలవిడి నోరికివచ్చినట్టు వెచ్చాచ కిచ్చువారును, 'దానికి నిటువలెఁ గావలయు' నని ♦యెగ్గించువారును, 'దీని కివి పాటులా' యని పండ్లు కొఱుకువారును, 'బాపజాతికానా కన్నులు దెఱవనిపాపనిపై నిరాపనిందలు గడియించి యానిసువుగోడు పోసికొంటి; వందుల నీ కేమి గలిగెనే' యనువారును, 'నిర్నిమిత్త ముత్తమపురుషునకుం జేసినదోషంబు ¶తోడనె చూపక

†పాఠాం. 'సుజనాగ్రణి.'

‡శా. పా.— 'గ్రచ్చుకొని' ('గచ్చుకొని' అని పూ. ము. పా) గ్రాణ్యమనను, శ. ర. లోను 'గచ్చుకొను' అనురూపమే గాని 'గ్రచ్చుకొను' అనురూపము లేదు. (సూ. ని. లో యేరూపమును లేదు.)

♦శా. పా.— 'పగ్గించువారును' ('కోయువారును' అని పూ. ము. పా) 'ఎగ్గించువారును' అని తంజ. పా. ఉచితతరము.

¶శా. పా.—'తోడనె' (ఇది పూ. ము. పా) 'తోడుతోడనె' అని తంజ. పా. సముచితము.

పోవునే' యనువారును 'సాహసం షడ్గుణంచైవ' యన్నది ⁋ తప్పునే? యెంతకుఁ దెగించెఁ జూడుమా, యాఁడుదాని నమ్మవచ్చునే' యను వారు, నై మఱియును.

టీక.— గచ్చుకొని = చుట్టుకొని, గ్రచ్చపొదన్ కదలించిన కైవడిన్ = గచ్చపొద, కదలించిన నెట్లు గలగలలాడునో అట్లు, వెచ్చానకు + ఇచ్చువారును = తిట్టువారును (ఇది జాతీయము) ఎగ్గించువారును = ఎగ్గులాడువారును, నిరాపనిందలు, గడియించి (ఘటియించి) = కల్పించి, సాహసం షడ్గుణంచ + ఏవ = (ఆడుదానికి) సాహసము ఆరంతలు, అన్నది = అని పెద్దలు చెప్పినమాట ('స్త్రీణాం ద్విగుణమాహారం, బుద్ధిశ్చాపి చతుర్గుణం, సాహసం షడ్గుణంచైవ, కామ మష్టగుణం భవేత్.') తప్పునే = అబద్ధమగునా?

'వెచ్చానకిచ్చు'. జాతీయము.— 'ఉడుకుడుకుగా ఇచ్చాడు' (=దెబ్బమీద దెబ్బతగిలించాడు) వంటిది.

'గచ్చపొద కదలించినట్లు' (కదలినట్లు - అనియు) లోకోక్తి.—

క. 'అచ్చోటి తీర్థవాసులు
వచ్చితగునె నీకుఁ బుణ్యవాహిని నిటు వా
క్రుచ్చితివని వడినందఱు
గ్రచ్చగదలినట్లు గువ్వకరిగొని తిట్టన్.' (జై. భా. 4-72.)

క. 'ఐం దేమి దోష మెఱుఁగక
యుండెడుసారంగధరుని, నూరక పతితోఁ
గొండెంబు సెప్పి, తోడేఁబడ
దండింపఁగఁ బనిచె, నెంత దయ లేని దయో! ౨౧౭

చ. తెలియగఁజూచినట్లనె మదిన్ బుధు లారసి 'తప్పు నీపయిన్
గల' దని పలుకు—చోఁగుచయుగం బటు బట్టబయల్గఁ‡ జేసి యా

---

⁋ శా. పా.— 'తప్పునే యనువారును'

‡ శా. పా.— 'ఁజేసితో యలికచ లేదుబంతి యన.'

'లేదుబంతి' యను పదముక్రింద శ. ర లో గూడా, పాఠమిట్లే యున్నది. కాని, సరికాదు. ఆపాఠమున నర్థము కుదురదు. తంజ. ప్ర. మూడింటిలోను 'ఁజేసి యాయలికచ...బంతియనె' అనియే యున్నది.

యలికచ, 'లేదు బంతి' యనె, నందఱిడెందము నిశ్చయంబు పెం
పొలయఁగఁ; గల్లతోడ నిజ ‡మోపదుగా దలపోసి చూచినన్.

టీక.— అందఱిడెందము = అందరి మనస్సునను, నిశ్చయంబు పెంపు ఒలయన్ = గట్టినమ్మకముగలుగునట్లు, ఆ - అలికచ = ఆచిత్రాంగి, లేదుబంతి - అనెన్ = (సారంగధరుడు చెప్పినదంతయు) అబద్ధము (తప్పు నాపయినిలేదు) అనెను. కల్లతోడన్ - నిజము, ఓపదుగా = సరితూఁగజాలదుగదా!

'లేదుబంతి' జాతీయము.—

వ. 'గొంటించి లేదుబంతియన్న ట్లల్లంతనుండి...' (మను. 4-115.)

ఉ. 'ఓ కానొకమాటవచ్చినన్, బొంకఁగ లేదుబంతియని బొంకవలెన్ · గులటా వధూటికిన్.' (హంస. 1-199.)

('బొంకఁగ లేవు బంతియని' వావిళ్ళవారి పాఠము)

చ. 'పొలఁతుక గబ్బిచన్నుఁగవ పువ్వులచెండ్లను లేదుబంతనున్.' (విజ. 1-102)

చ. కనికర మేది బిడ్డని నకారణ మూరక యిప్పు డయ్యయో!
కనికర మేది యాజ్ఞ యిడెఁగా! తన బుద్ధి కలా లసద్వివే
కనికర మేది ముక్ వినుతగౌరవకీర్తి వహించి యింక నిం
†కనికర మేదినీవిభుఁడు గాంచెను నేఁ' డని పొక్కె రండఱున్.

---

‡ శా. పా.—'మొప్పదు' (ఇది పూ. ము. పా.)

శ. ర. లోను, తంజ, ప్రతిలోనుగూడా 'నిజ-మోపదు' అనియే పాఠము.

† శా. పా.—'కనికఱ' (ఇది పూ. ము. పా.)

'మఱిక' యనునర్థమున శ. ర. లో 'కఱ' శకటరేఫముతోనే యున్నది. కాని బ్రౌను 'కర - dirt, blackness. కరలచీర - a stiped cloth, కరబట్టావు = ( from కర and బట్ట and ఆవు) striped cow.' అని లఘురేఫముతో పఠించినాడు. ప్రకృతపద్యమున 'కనికర మేది' అను ఆరువర్ణములతోను యమక మను శబ్దాలంకారము సమకూర్పబడినది. అందొక రేఫమును - 'శకటము'గా మార్చి అలంకారమును చెరచుటకంటెను లఘురేఫముగా పఠించుట యుచితము కాదా! నిజమునకు లఘురేఫాలఘురేఫభేదము పండితులు వివదించుకొనుటకు పనికివచ్చునదేగాని, దాని వలన లోకవ్యవహారమున అంత ప్రయోజనము లేదుగదా? పైపెచ్చు "ఇందలిది లఘురేఫము - ఇందలిది యలఘురేఫము' అని నిర్ణయించు శాస్త్రమును లేదాయెను. మరి యెందుకు దానినిగూర్చి పెనగుటయు. చక్కని ప్రాచీనరచనల దిద్ది సారస్యమును చెరచుటయును? (సూ. ని. లో, ఈ 'కర' యే రేఫముతోనూ లేదు.)

టీక.—బిడ్డనిన్ = కుమారుని, కని, కరము + ఏది = మక్కువతో పెంచి; ఇప్పుడు, కనికరము + ఏది = దయమాలి, ఆజ్ఞయిడఁగా = నరికించెఁగదా. తన = తన యొక్క, బుద్ధి; కలాలసత్ వివేక - నికరము-ఏది? = న్యాయశాస్త్రాదివిజ్ఞానముతో గూడిన వివేచనశక్తి, ఏది? మున్ = మునుపు, వినుతగౌరవకీర్తివహించి = లోకముచే కొనియాడబడిన గొప్పతనపువాసిని పొంది, (ఇప్పుడు) ఇంకన్ + ఇంకని = ఇకమీద నెన్నటికిని మాయని, కర = (కఱ) మఱక (= కళంకము)ను, మేదినీవిభుఁడు = రాజు, కాంచెనని, అందఱున్, పొక్కిరి = దుఃఖించిరి.

గీ. 'చెలి, యిపుడు ఘోరపాపంబు సేసి మీఁద
నరకకూపంబులోఁ † బడఁ దలఁచునీకు
నురక కూపంబులోఁ‡బడ నుఱుకు టరుదె
పాటు పడు' మని § పఱచని పాటుపఱచ. ౨౨౦

టీక.— ఉరక = ఊరక, పఱచని పాటుపఱచన్ = కష్టము పాలుచేయగా (అవతలికి అన్వయము)

క. జడ లల్లుచుఁ బిన్నప్పుడు
పడఁతులు తను 'నూతఁ బడెదో పాఁతఱఁ బడెదో
నుడువు' మనుమాట నిజ మై
పడె ‖ నూతనెయారా నూఱుబార లనంగన్. ౨౨౧

---

† పాఠాం.—'ఁబడనురకునీకు...బడ నురుకుటరుదె'

‡ శా. పా. 'నిపుడుఱుకు' (ఇది పూ. ము. పా) 'పడనుఱుకు' తంజ. పా.

§ శా. పా.— 'పఱిదిన పాటుపఱిచి' ('పఱచినపాటుపఱచి' పూ. ము. పా) 'పఱచనిపాటుపఱచ' అని తంజ. పా. సాధువు.

పఱచనిపాటు పఱచుటయనగా పెట్టరాని బాధలుపెట్టుట. ఈపలుకుబడిని కవి మరియొకమాటుకూడా వాడినాడు. (చూ ౨౨౬ ప.) ('పఱిచి' అను పాఠమున అవతలి పద్యముతో అన్వయము కుదురదు కావున ఆపాఠ మసాధువు.)

‖ శా. పా.— 'నూతనునార' (ఇది పూ. ము. పా) 'నూతనెయారా' అని తంజ. పా.

'నూతనె' అని ఏవార్థము లేనియెడల పద్యభావమే పాడగును. కావున శా.పా. అసాధువు.

టీక.—నూఱుబారలనంగన్ = నూరుబారల లోతున్నదో యనదగిన, నూతనె= బావిలోనే, పడెను.

పసిపిల్లలు జడ వేసికొనునపుడు - అల్లిన జడపై పిడికిలితో గ్రుద్దుచు - నుయ్యా? పాతరా? అని యనుట ఆచారము. ఆయాచార మిచ్చట పొందుపరచ బడినది. నుయ్యా? పాతరా? అన్నట్లే 'తేలా? పామా?' అని యడుగుట నే డాచారమున నున్నది.

చ. అటువలె నింతి నాజ్ఞ యిడి యాసును జేశుఁడు మంగలంబునం
బెటిలినపేలగింజవలె మిక్కిలి పుత్త్రవియోగబాధ న
ట్టిటుపడి ధారుణీస్థలిపయిం బడి నందనురూపరేఖలున్
బటుగుణశీలముల్ దలఁచి పల్వగలం బలవించుచుండఁగన్. ౨౨౨

వ. † అప్పుడన్వర్థనామవంతుఁడైన మతిమంతుండతని కిట్లనియె. ౨౨౩

టీక.—అన్వ...తుఁడు = అర్థవంతమైన పేరుగలవాడు. (మతిమంతుడు - అను పేరుమాత్రమే కాక మతియును కలవాడు. అన్నమాట.)

క. 'చనునే యిటువలెఁ జింతి
ల్ల నృపాలక? నింద రావలసి నాపలుకుల్
విన వైతివి, చే మించిన
పనులకు నీ వింకఁ గస్తిపడవచ్చునొకో. ౨౨౪

టీక.— చేమించిన = చేతినుండి దాటిపోయిన (=కడచిన) పనులకు, కస్తి = దుఃఖము.

ఉ. మాను దురంతవేదనఁ గుమారిల నేల? పసిండికొండవి
ల్కానివరప్రసాదమునఁ గల్గినవానికి హాని వచ్చునా
మానవనాథ?' యన్న 'మతిమంతుఁడ నీ వను టెల్ల నిక్క మా
నా నిది, లోకనిందితుఁడ నైతిని నీ పలు ‡ కాచరింపమిన్. ౨౨౫

టీక.— కుమారిల నేల = ఎందుకు పరితపించెదవు? నీపలుకు - ఆచరింపన్ = నీవు చెప్పినయట్లు చేయకపోవుటచేత.

† శా. వా.— 'అప్పుణ్యావర్ధనమతి మతిమంతుండు' (ఇది పూ. ము. పా.) 'పుణ్యావర్ధనమతి' అంటే అర్థమేమో వారు చెప్పలేదు. 'అన్వర్థనామవంతుఁడైన' అని తంజ. ప్రతులు మూడింటను.

‡ పాఠాం.— 'కాదరింపమిన్.'

క. * నెలయఁగ సాక్షిం గోరక
తెలివనడక ‡ తగుననుచు మదిన్నమ్మి సుతుం
† బఱచని పాటులఁ బఱచితిఁ
‡ బఱచని యిది యెఱుఁగ లేక పదరితి నయయో! ౨౨౬

టీక.— సాక్షిన్ = సాక్ష్యమును, నెరయఁగన్ = చాలినంతగా - కోరక, (ఈ సాక్ష్యముచాలదు. ఇంతకంటెను బలవత్తరమైన సాక్ష్యము కావలె ననక.) తెలివనడక = చిత్రాంగివర్తనము, తగుననుచున్ = సరియైనదేయగునని - నమ్మి, సుతున్, పఱచనిపాటులన్ పఱచితిన్ = పెట్టరాని కష్టములు పెట్టితిని; ఇది = ఈ చిత్రాంగి, పఱచు + అని = దుర్మార్గురాలని, ఎఱుఁగలేక, పదరితిన్ = తొందర పడితిని.

---

* శా. పా.— 'అరయఁగలసాక్షి' (అరయకలసాక్షి' పూ. ము. పా.) అరసినవాడే సాక్షి. అరయఁగలవాడు, 'సాక్షి' యనిపించుకొనడు. 'నెర యఁగ...' అని తంజ. పా.

‡ శా. పా.— 'అందమని' (ఇది పూ. ము. పా.) 'తగుననుచు' తంజ. పా.

† శా. పా.— 'పరుసనిపాటుల' ('పరుసని = కఠినమైన' అని పూ. టీ.)
క. 'పరుసనిపలుకుల నాకృతి
పరుషత నసురాలిపోలె భటతతి మెఱయన్' (భా. భీష్మ. 184)
క. 'లోకము పగయగుఁ బరుసని, వాకున,'— (కవి. మనో.)
అని యిట్లు పరుసన - పలుకులకు విశేషణముగా ప్రయుక్తమైయున్నది. కాని 'పాటుల' కెందును విశేషణముగా చెప్పబడినట్లు లేదు.

'పఱుపని పాటుల' అని పూ. ము. నను, 'పఱచనిపాటుల' అని తంజ. ప్రతులలోను, పాఠములున్నవి.

‡ శా. పా. 'బరుసని...యెఱుకలేక.' (బరుసు = కఠినము' అని పూ. టీ.)
'బరుసు' అనగా గరుకైనది (= నునుపుకానిది) ఉ.— బఱ్ఱెనాలుక; ఆకు రాయి, మొదలగునవి. "బరుసు కరసానఁ దీడిన పందిపోట్లు" (వేం. పంచ. 2. ఆ.) మరి ప్రకృతమున అట్టి పదార్థమేది? 'ఇది కఠినమని యెఱుకలేక' అనుటలో పూ. టీ. కర్తల భావమేమో కాని, 'పఱుచని...యెఱుకలేక' అని పూ. ము. నను, 'పఱచని... యెఱుఁగలేక' అని తంజ. ప్రతులలోను పాఠము లున్నవి. అందు 'పఱచని' అను పాఠము సాధువు. 'పఱచు' అనగా దుర్మార్గురాలు.— (చూ. ౨-౨౬౪ క్రింద.)

ఉ. ఇట్టులనుండె నాయెఱుక యేమనువాఁడ; మహేశుసత్కృపన్
నెట్టన వాఁడు ప్రాణముల నిల్చినఁ జా, [1]లిట దెచ్చి వెజ్జులం
బెట్టి గుణంబు చేసి మదిఁ బేరిన నెంజిలి దీఱ వాని కేఁ
బట్టము గట్టి కానలఁ దప మ్మొనరించెద' [2]నంచుఁజయ్యనన్. ౨౨౭

టీక.— వెజ్జుఁ బెట్టి = వైద్యుల నేర్పాటుచేసి, గుణంబుచేసి = బాధనయము చేయించి.

## —• రాజు రత్నాంగి సారంగధరుని వెదకఁబోవుట •—

క. అనుగు లయి హితజనంబులు
నను(గుంజుట్టములు రాఁగ నపుడు దలారుల్
వనసీమ తెరువు చూపఁగఁ
జనియెన్ జననాయకుండు జాయాన్వితుఁ డై. ౨౨౮

టీక.— అనుగులు - అయి=అనుచరులై, జాయాన్వితుఁడై=భార్యాసమేతుడై.

చ. చని, మును దండనం బిడినచక్కి ని వధ్యశిలాతలంబుదా
పునఁ బడియున్న కెంజిగురుఁబోల్వసివాడినకాళ్లఁ జేతులుం
గని నెగు లొంది, పట్టి నట గానక మూర్ఛిలి, యంతఁ గొంతసే
పున కిసుమంత డెప్పిఱి, విభుం డలపూఁబొదరిండ్లఁ జీరుచున్. ౨౨౯

టీక.— కెంజిగురుఁబోల్ = ఎఱ్ఱని చిగుళ్ళను పోలినవియు, వసివాడిన = మిక్కిలి శుష్కించినవియు నైన, కాళ్ళు - చేతులు, చీరుచున్ = పిల్లవానినిపిల్చుచు.

సీ. అరసి చూతము పదం డా కానలో నున్న
నరసి చూతము తెచ్చి యనుచు నేఁగుఁ,

---

[1] శా. పా.—'ఇటఁదెచ్చి' ('ఇటదెచ్చి' పూ. ము. పా.)
'ఇట తెచ్చి' యనగా 'ఇటకు తెచ్చి' యని యర్థము. కావున 'ఇటన్ దెచ్చి' యనుట సరి కాదు.

[2] శా. పా.—'నయ్యాచయ్యనన్.' (ఇది పూ. ము. పా.)
'చయ్యనన్ - చనెన్' అని అవతలి పద్యముతో అన్వయము. కావున 'తప మ్మొనరించెదనయ్యా - చయ్యనన్ - చనెన్' అను పాఠము తప్పు. '...నంచుఁ జయ్యనన్' అని సాధుపాఠము. తంజ. ప్రతిలోనున్నది.

గాన రే యే మైనఁ గని మెగాల్ దినియెనో
కానరే? యని వేఁటకాండ్ర నడుగుఁ,
బొదల నెవ్వగ నైన వెదకి కానఁగ లేక
పొదల నెవ్వగ నేలఁ బొరలి యడలుఁ,
దనయుని కీపాటు నెనయఁ జేసితి నహో
తన యుని కిఁక నేల? యనుచుఁ బొగులు,

గీ. వనరు హా యను సుకుమార వదన విజిత
వనరుహా యను వెత సేయవలెనె యింత
దైవమా యనుఁ దలఁపని తలఁపు లివిగో
దైవమాయను దెలియంగఁ దరమె? యనుచు. ౨౩౦

టీక.—ఆ కానలో, అరసిచూతము = వెదకిచూతాము, పదండి; ఉన్నన్ - తెచ్చి, అరసిచూతము = పోషించుచు - జాగ్రత్తగా కాపాడుదము. ('చూచుట - To regard, care for.' (బ్రౌను.)

అరయుట = పోషించుట, అనుటకు.—

ఆ. వె. 'కొడుకుఁబోలె నరయ గురుఁబోలెఁ గొలువంగ
నగ్నిఁబోలె నిష్ఠ నర్చితుఁడుగఁ
జేయవలయు విప్రు.' (భా. అను. 1–161.)

కానన్ = అడవియందు, రే = రాత్రి, కని = చూచి, మెగాల్ = మృగములు, ఏమైనన్ - తినియెనో = తిన్నవేమో, కానరే = మీరు చూడలేదా? అని యడుగున్; పొదలన్ = పొదలయందు, వెదకి, ఎవ్వగనైనన్ = ఏవిధముగను - కానఁగ లేక, నెవ్వగ - పొదలన్ = దుఃఖమతిశయింపగా, నేలన్ - పొరలి, అడలున్ = విలపించును; తనయునికి = కుమారునికి, ఈపాటు = ఇట్టి కష్టమును, ఎనయఁ జేసితిని = కలిగించితిని, అహో = అయ్యో, తనయునికి = నేను బ్రదికియుండుట, ఇఁక నేల - అనుచున్, పొగులు = దుఃఖించును; వనరున్ = దీనముగా పలవించును; హా - అనున్; సుకు...హా యనున్ = పద్మమువలె సుకుమారమైన ముఖముకలవాడా, అనును; [పదండు— పోవునవు దజ్మత్తులు ముఃజుంబరంబులగునపుడు వులోపంబుం బొద పదలును విభాషనగు. (బాల. క్రియా. 98.) అను సూత్రముప్రకారము, 'పదఁడు' అను రూప మేర్పడును. 'పదండి' అనియేగాని వ్యవహారమున 'పదండు' అను వాడుకలేదు. వేంకటకవి పదండి + ఆ కానలో = అని, ఇకారాకార సంధియే చేసి యుండునని నానమ్మకము.—]

సీ. దట్టంపువిరిమొల్ల తావులతావుల,
నమరు లతాకుడుంగములగములఁ,
జల్లనిసురపొన్న చాయలచాయల,
నరుదారుమాణిక్య దరులదరుల,
వలిదేరు † పన్నీరు వంకలవంకల,
గాలితేజీల నిల్కడలకడలఁ,
గ్రొంజీఁకటులు గ్రమ్ము ‡ కోనలకోనల,
ఘనమైన యోగిపుంగవుల గవుల,

గీ. నరసి పెదవులు దడుపుచు నరిగి యరిగి,
దొరఁగునశ్రులు గన్నుఁదామరల మరలఁ,
గుసుమబాణుని నగజాలుకొమరుకొమరు
విభుఁడు మదిలోనఁ బాయని వెతకు వెతకు. ౨౬౧

టీక.— మొల్లతావుల - తావులన్ = మొల్లపూల సువాసనలుగల ప్రదేశములయందును, లతాకుడుంగముల - గములన్ = తీవె పొదరిండ్ల గుంపులలోను, సురపొన్నచాయల - చాయలన్ = సురపొన్న చెట్లనీడల జాడలలోను, మాణిక్యదరుల - దరులన్ - మాణిక్యపు గుహల గట్టులందును, పన్నీరువంకల - వంకలన్ = పన్నీటి వాగుల ప్రాంతములలోను, గాలితేజీల నిల్కడల - కడలన్ = లేళ్లు నిలుచుచోట్లను, కోనల - కోనలన్ = అడవుల మూలలయందును, యోగిపుంగవుల - గవులన్ = యోగిశ్రేష్ఠులుతపస్సు చేయుచుండు గుహలయందును, అరసి = వెదకి, అశ్రులు = కన్నీరు, కన్నుఁదామరలన్ - మరలన్ = కమలములవంటి కనులయందు తిరుగగా, కుసుమ...కొమరు - కొమరున్ = మన్మథునిమించిన యందముగల కొడుకును, పాయని వెతకున్ = ఎడతెగని దుఃఖముచేత, (ఇందు తృతీయకు షష్ఠి. చూ. బా. కార. 21) వెతకున్ = వెదకును.

† పాఠాం.— 'పన్నిటి.'

‡ 'కోనలఁగోనల' అని శ. ర. పాఠము. ఈపాఠమున శబ్దాలంకారము చెడ్డుటయే కాక ప్రక్రమభంగ దోషమున్ను తటస్థించుచున్నది.

వ. ఇట్లు తద్ఘోర కాంతారంబునఁ బలుదెసలం † గొంద అనను చరులఁ జరుల సందుగొందుల నందంద నందనాన్వేషం బొనరింప నియమించి తానునుం జని వేగ మృగ విహగతరు గిరి ప్రముఖ నిఖిలచరాచరంబులం జూచి యేచిన దైన్యంబున. ౨౩౨

టీక.— చరులన్ = కొండదరులయందును.

ఉ. మిక్కిలి సాదనం దగిన మేటి నెఱుంగరె మల్లులార? మే
లెక్కుడురూపువాని ¶ నిపు డిచ్చటఁ గానరె మావులార? పే
రక్కఱ నూని పెంపు గని నాతనిఁ జూడరె ధాత్రులార? యిం
పెక్కిన కొమ్మలార కనరే ‡ తమి మీరు కుమారమన్మథున్. ౨౩౩

టీక.— మల్లులార = మల్లెచెట్లులారా. (మల్లి - ఏ. వ.) మిక్కిలి, సాదు-అనన్ = మంచివాడన దగిన, మేటిన్ = ఉత్తముని, ఎఱుంగరె? (మల్లులార = వస్తాదులారా, మిక్కిలి [1] సాదనన్ = మంచి గరిడీసాధనయందు, తగిన = ఒప్పిన వాడైన, మేటిన్ = మొనగానిని, ఎఱుంగరె? – అని అర్థాం).— మావులార = మామిడివృక్షములారా, మేలెక్కుడురూపువానిన్ = మేలయిన రూపసంపదగల వానిని, కానరె = చూడలేదా ? (మావులార = గుఱ్ఱములారా; మేలు - ఎక్కుడు వానిన్ = గుఱ్ఱముల నెక్కుటయందు నేర్పరియైనవానిని, కానరె? అని. అర్థాం.).— ధాత్రులారా = ఉసరికచెట్లులారా, పెంపుగని నాతనిన్ = చక్కగా పెరిగియున్న వానిని, పేరక్కఱనూని = మిక్కిలి అక్కరతో, చూడరె = చూడలేదా? (ధాత్రులార = దాదులారా, 'ధాత్రీస్యాదుపమాతాపి క్షితిరప్యామల క్యపి.' (అమ.) పెంపు గని నాతనిన్ = చక్కగా పెంచబడిన నాబిడ్డను, చూడరె? అని, అర్థాం. దాదులకు బిడ్డలను పెంచుటయందు ప్రీతి - అని సారస్యము).— ఇంపెక్కినకొమ్మలార = మనోజ్ఞములయిన వృక్షశాఖలారా, తమి మీఱు = ఉత్సాహమతిశయించునట్టి (=

† శా. పా.— 'అనుచరులంజఱుల.'

శబ్దాలంకారనిర్వహణముకొరకు— 'చరులఁజరుల' అని సవరణ.

¶ శా. పా.— 'ఇటు నిచ్చట.' (ఇది పూ. ము. పా.) 'ఇపుడిచ్చట' తంజ. పా.

‡ శా. పా.— 'సుకుమారుఁ గుమార...' (ఇది పూ. ము. పా.) 'తమిమీరు' తంజ. పా. (ఇందు 'మీరు' లోని రేఫము తొలుత అలఘువు.) 'సుకుమారు' పాఠమున సారస్యములేదు.

1 ఈయర్థము పూ. టీ. లో లేదు.

ఉత్సాహశీలుఁడయిన) కుమారమన్మథుఁ = మన్మథునివంటి నాకుమారుని, కనరే = చూడలేదా? (ఇం పె...లార = అందగత్తెలయిన యువతులారా, కుమారమన్మథుఁ= లేవయసుమన్మథుని, తమిఁ = వలపుతో, మీరు, కనరే? అని అర్థాం.)

గీ. మీకులము లేటిఁ జేపట్టి మీవిరోధి
యైన పులిఁ జెండి మైచర్మ మూనెఁ గాదె
యట్టిమేలైన నెఱిఁగి యాహరునిపేర
నెసఁగు సారంగధరుఁ జూపుఁ డేణులార. ౨౩౪

టీక.— హరుఁడు, లేటిన్ = లేడిని, చేపట్టి = రక్షించి (చేతధరించి అని అర్థాం) పులిన్ - చెండి = పెద్దపులిని చంపి (వ్యాఘ్రాసురుని జంపి, అని అర్థాం) ఆ హరుని పేరన్ = ఆ యీశ్వరునికి పేరైన 'సారంగధర' శబ్దమే పేరుగాఁగలవాఁడైన (మాకుమారుని) చూపుఁడు.

శా. 'నాళీకారికి నొక్కజింక, నొకయేణం బంజనాకామికిన్,
గాళీకాంతున [1]కొక్కలేడి నిడ, నింకం గూడునే? [2]మూఁడుమా
టాలుం బెట్టిన చెంగనాలు మము ముట్టన్ రాకుఁ డన్ రీతి మీ
రేలా పోయెద రేణులార నిలువుండీ మాసుతుం జూపుఁడీ. ౨౩౫

టీక.— నాళీక + అరికిన్ = (కమలవైరికిన్) చంద్రునికి, ఒక్కజింకను, (చంద్రుడు, మృగాంకుడు.) అంజనాకామికిన్ = అంజనాదేవికి భర్తయైన వాయుదేవునకు, ఒక, ఏణంబున్ = ఒక జింకను (వాయువునకు జింకవాహనము.) కాళీకాంతునకున్ = పార్వతీపతికి, ఒక్కలేడిని (ఈశ్వరుడు సారంగధరుడు.) ఇడన్ = ఇయ్యగా,

---

1 శా. పా.— 'కొక్కలేడీ, యిడి యింకం! గూడునే?' (ఇదే పూ. ము. పాఠమున్నది.) అర్థమేమో? పూ. టీ. లేదు.

2 శా. పా.— మూఁడు వాటాలుం బెట్టిన చెంగనాలు.' (వాటాలున్ = భాగములును, చెంగనాలు = నమస్కారములు.' అని పూ. టీ.)

శ. ర. లో 'చెంగనాలు = నమస్కృతి' అని యున్నది కాబట్టి పూ. టీ. వారు 'చెంగనాలు = నమస్కారములు' అన్నారు. కాని 'మూడువాటాలు పెట్టినను నమస్కారములు' అనుటలో అర్థములేదు. పూ. ము. న 'మూడుమాటాలుం బెట్టిన' అనియు, తంజ. ప్రతిలో 'మూఁడు మూటాలుం బెట్టిన' అనియు పాఠములున్నవి. తంజ. పాఠమే సాధువని నాకు తోచినది.

(=ఇచ్చితిమిగదా?) ఇంకఁ - గూడునే = ఇంకా జింకలనిమ్మని మమ్ము బాధింప వచ్చునా? మూఁడు...నాలు = మూడుమూటాలు చెంగనాలు; ఇది ఓమనగుంటల ఆటయందు ఒకపట్టున ఆటను నిలుపు సంకేతవాక్యము (=ఇక నొక జింకనైనను మీకిచ్చుటలేదు అని భా.) మము ముట్టఁ రాకుడు = మాకడకు రావద్దు, అఁ రీతిఁ = అన్నవిధముగా, ఏణులార = ఓ జింకలారా, మీరేల పోయెదరు?

జింకలు తన్నుజూచి బెదరి పరుగెత్తుచుండగా, రాజు వానింగూర్చి యిట్లను చున్నాడు.—" 'ఓయీ చంద్రునికొక జింకనిచ్చితిమి. వాయువునకొక జింకనిచ్చితిమి. శంకరునకొక జింకనిచ్చితిమి. ఇంకా నీవొకడవు మావెంటబడుచున్నావా! నీకొకఁ జింకనైనను ఇయ్యము. పో' అనియా జింకలారా మీరు పరుగెత్తుట? నేను మిమ్ము పట్టుకొనుటకు రాలేదు. నాబిడ్డనుచూచితిరేని తెలుపుడు. నాకంతేచాలును."

సీ. తరులార చెంచుబిత్తరులార కానరే
  మాకుమారునిఁ బోలు మాకుమారు?
హరులార పవమాన హరులార కానరే
  మాకుమారునిఁ బోలు మాకుమారు?
[1]చరులార లేటిమచ్చరులార కానరే
  మాకుమారునిఁ బోలు మాకుమారు?
కరులార మానిశంకరులార కానరే
  మాకుమారునిఁ బోలు మాకుమారు?
గీ. నదములార చలత్కోకనదములార
శుకములార ప్రఫుల్లకింశుకములార
మాకు[3]మారు వచింపని మాకుమారు
కానరే యని వెదకి రక్కానలోన. ౨౬౩

టీక.—తరులార = వృక్షములార, చెంచు - బిత్తరులార = చెంచుపడతులార; హరులార = సింహములార, పవమాన - హరులార = సర్పములారా, లేక - లేడు

1 శా. పా. 'ఁజఱులార.' [2] 'ఁగరులార.' ('గవులార మానిపుంగవులార' పాఠాం.) [3] 'మాఱు.'

శాస్త్రిగారిపాఠములు వ్యాకరణశాస్త్రసమ్మతములైనను శబ్దాలంకార భంజకములు. కవి ముచ్చటపడి చేసిన యలంకారమును చెరుచుట పాడిగాదు.

లారా, చరులార = కొండలోయలారా, లేటిమచ్చరులార = లేళ్లను విరోధించు - పులులార, కరులార = ఏనుగులార, మౌని - శంకరులార = మునీశ్వరులార, మారుమా రునిఁబోలు = (లక్ష్మీపుత్రుని =) మన్మథునివంటి, మాకుమారుని = సారంగధరుని, కానరే = చూడలేదా? నదములార = పడమటికిపాఱు ప్రవాహములారా, చలత్ - కోకనదములార = చలించుచున్న ఎఱ్ఱకలువలారా, శుకములార, ప్రఫుల్లకింశుకము లార = బాగుగా పూచిన మోదుగులారా, మాకు - మారువచింపని = మాకెదు రాడని, మా కుమారుఁ, కానరే?

సీ. కర్పూరవాసనల్ కలయంగఁ బొలయంగ
సారంగధరుఁడని చేరఁబోవు,
శ్రీగంధవాసన ల్చిక్కంగ నిక్కంగ
సారంగధరుఁ డని చేరఁ బోవుఁ,
గస్తూరివాసనల్ గమ్మంగఁ* జిమ్మంగ
సారంగధరుఁ డని చేరఁ బోవు,
జవ్వాదివాసన ల్జడియంగ సుడియంగ
సారంగధరుఁడని చేరఁ బోవుఁ,
గీ. బోయి ఘనసార ఘనసారభూజ మ్మృదుప
టీర మ్మృగకుల సంకుల † టెంకుల రసి
స్రుక్కి తద్గంధమహితాంగు సుతుని నతఁడు
కానకడల విచారించి కానకడల. ౨౩౭

టీక.— కర్పూరవాసనల్, కలయంగన్ - పొలయంగన్ = అంతటను వ్యా పింపగా; శ్రీగంధవాసనల్ = చందనపు సువాసనలు, చిక్కంగ - నిక్కంగన్ = దట్టముగా విసరగా; కస్తూరి వాసనల్, కమ్మంగన్ - చిమ్మంగన్ = కమ్మగా గుబా ళింపగా, జవ్వాదివాసనల్, జడియంగన్ - సుడియంగన్ = జడివాన కురిసినట్లు - చుట్టిచుట్టి విసరగా, సారంగధరుఁడని = అచట సారంగధరు డున్నాడు కాబోలునని,

* శా. పా.— 'గమ్మంగఁ గ్రమ్మంగ' (ఇది పూ. ము. పా) 'గమ్మంగ' జిమ్మంగ' తంజ. పా.— సాధువు.

‡ శా. పా — 'టెంకులనట' ('టెంకులనుట' పూ. ము) 'లగుట' పా. 'ఒరసి' యని నాసవరణ.

చేరఁబోవుఁగా; పోయి, ఘన... టెంకులు.— ఘనసార = మిక్కిలి సారముగల, ఘన సారభూజ = కర్పూరపు చెట్లయొక్కయు, మృదు - పటీర = కోమలము లయిన గంధపుచెట్లయొక్కయు, మృగకుల = కస్తూరిమృగ సమూహముల యొక్కయు, సంకుల = ఒవ్వాజి పిల్లులయొక్కయు, టెంకులు = నెలవులు, అరసి = పరిశోధించి, స్రుక్కి = అలసిపోయి, తద్గంధమహితాంగుఁ = కర్పూరాదుల సుగంధముతో గూడిన మేనుగలవానిని, సుతుని, కానకడలఁ = అడవిప్రదేశములయందు, విచారించి, కానక - అడలఁ = కనుగొనలేక దుఃఖింపగా.

సారంగధరుని శరీరము కర్పూరచందనాదుల సువాసనలతో నొప్పియుండెడి దనియు, అందువలననే రాజనరేంద్రుఁ డా యా సువాసనలుగల తావులలో వెదకె ననియు - భా. (పెద్ద పాదములలోని కర్పూరాదులకు గీతములోని ఘనసారభూజా దులతో క్రమముగా అన్వయము.)

'కలయంగఁ'- క్రియావిశేషణము (శ. ర. లో సూ. ని. లో గూడా లేదు.) "కవివరుడు లేచి దిక్కులు కలయచూచి looking all round. కోళ్లు కలయఁ కూసెఁ. The cocks crowed on all sides." (బ్రౌను.)

శ. ర. కర్త 'జడియు' అను క్రియకు 'వర్షించు' అను నర్థము శబ్దార్థ కల్ప తరువునందు వ్రాయఁబడియున్నది కాని ప్రయోగము కనఁబడ లేదన్నాడు. ఈసారం గధర ప్రయోగమే కాక 'విరిసెఁదొల్లిటి దళములు, విరులు జడిసె' అని 'ఆముక్త' (5-130) లో గూడా కనబడుచున్నది. బ్రౌను 'ఆముక్త' పద్యమునే ఉదాహరించి 'వర్షించు' అని యర్థముచెప్పి, పై పెచ్చు 'జడియుట - Also to flower - పుష్పిం చుట' అని విశేషార్థము వ్రాసినాడు.

క. తలవరులుఁ నెలవరులుం
బాలపరులుఁ వచ్చి యంత భూపాలునితో
‡'మలలందుల సెలగొందుల
శిలసందుల నెల్ల నారసితి మే మెందుఁ. ౨౩౮

---

‡శా. పా.— 'మలలందుఁ - సెలలందుఁ - శిలలందును... మేమందుఁ.' ('మలలందుల శిలలందుల, సెలగొందుల... మేమందుఁ.' పూ. ము.) నేను గ్రహించినది తంజ. తా. ఫా.

టీక.— తలవరులున్=తలారులును, †నెలవరులన్=అడవిపట్టుల - మర్మము లెరిగినవారును, పొలపరులున్ = పొలములోని తోవ్రడొంకలజాడ లెరిగినవారును,— మలలందులన్ = కొండలయందును, సెలగొందులన్ = కొండలోయలయిరుకుతావుల లోను, శిలసందులన్ = పెద్దపెద్ద బండలసందులలోను, ఆరసితిమి. (కాని) ఎందున్= ఎక్కడను, (కానము - అని ఆవతలికి అన్వయము.)

ఉ. కాన' మటంచుఁ జెప్పినఁ గకావికలైన మనంబుతో నర
 ణ్యానిఁ గులాంగనాసహితుఁడై యట క్రమ్మఱవచ్చి కామినీ
 సూనశరోపమాన సుత శోణిత పంకిల భూమి, నామహీ
 జాని భుజానిరాహత విశాలశిలాచయుఁడై పడెన్ వడిన్. ౨౩౯

టీక — కకావికలైన = చెల్లాచెదరైన - మనంబుతో, అరణ్యానిన్ = ఆమహా రణ్యమునందు; — అట క్రమ్మఱవచ్చి = తొలుత కాళ్లుచేతులు కనబడినచోటికే మరల వచ్చి, కామినీ...భూమిన్ = కామినులకు మన్మథుని వంటివాడైన తన కుమారుని నెత్తురుచేత బురదయైయున్న భూమియందు, ఆమహీజాని=ఆరాజు (రాజనరేంద్రుడు.) భుజా...చయుఁడై = తనబుజములచేత బ్రద్దలుకొట్టబడిన పెద్దపెద్ద బండల గుంపు కలవాడై, (ఆతడు నేలమీద పడుటచేత ఆతని బుజములదెబ్బకు రాళ్లు పగిలిపోయిన వని - భా.)

వ. అప్పుడు. ౨౪౦

## — రత్నాంగి కొడుకునుగానక శోకించుట —

క. అ క్కొండి, యీ రెలుంగై
 చెక్కులు చెమరించి, నెఱులు చిక్కులు వడి, కా

† పూ. టీ.—'నెలవరులు=చోటెఱిఁగినవారు.'

'నెల'వనగా చోటు కావున నెలవరి = చోటెఱిగినవాడు, అయ్యుండవలెనను కొన్నారు. పూ. టీ. వారు. పొరపాటు. నెలవరి - తొలిరూపము 'నెళవరి' (చూ. శ. ర.)

గీ. పొలము చోపుడువెట్ట నన్నెలవరులకు
 సెలవొసంగిన నృపమాళి చిత్తమెఱిఁగి
 చెంచులాఖేటకక్రియా చుంచులగుచు'. (శుక. 1-257.)

ల్పొక్క, వసి వాఁడి, యూర్పుల
వెక్కం గెమ్మోవి కమలి ‡ విమలాంగియనున్. ౨౮౧

టీక — విమలాంగి = రత్నాంగి, అక్కు = రొమ్ము - ఎండి, ఈరెలుంగై = కంఠస్వరము సన్నగిల్లి, చెమరించి = చెమటపట్టి, కాల్ - పొక్క = కాళ్లు బొబ్బ లెక్క, ఊర్పుల, వెక్కన్ = వేడిచేత, కెమ్మోవి = ఎఱ్ఱనియధరము, కమలి = వాడిపోయి, అనున్ = ఇట్లనెను.
వెక్క = వేడి - అనుటకు.— (శ. ర. పాఠము)

సీ. 'తరుణ రంభాగర్భదళతాళవృంతంబు
†పైగాలి వెక్కన పలుకఁబాఱె.' (శృం. నై. 2-119)

క. 'పట్టాభిషిక్తుకడుపునఁ
బుట్టి [1] మహారాజ్యసుఖముఁ బొందక కుడువం
గట్టం గల కాలంబునఁ
గట్టా! నీ కడవిపాలు గావలసెఁ గదా. ౨౮౨

క. ఎట్టోర్తు నన్న నీ వీ
కట్టెఁడి యగు దొడ్డరాజు కడుపున నేలా
పుట్టితివి? పేదకడుపునఁ
బుట్టిన నొక కొంతకాలము సుఖింతువుగా. ౨౮3

ఆ. వె. నిను వధించినట్టి వెనుక నయ్యశరీరి
పలుక కుండె నేమి? పలికె నేమి?
నీవు చచ్చు వెనుక నామృషాచిత్రాంగి
పొలియ కుండె నేమి? పొలిసె నేమి? ౨౮౪

‡ శా. పా.— 'వికలాంగముతోన్' (ఇది పూ. ము. పా.) 'విమలాంగియనున్' తంజ. పా. మూడు ప్రతులలో నున్నది.

'వికలాంగముతోన్ - పట్టాభిషిక్తు కడుపునఁబుట్టి' అని అవతలి పద్యముతో పూ. టీ. కర్త లెట్లన్వయించుకొన్నారో?

† 'పైగాలి - సోఁకిన' అని శాస్త్రిగారి మూలము. 'పైగాలి - వెక్కన = ...గాలియొక్క వేఁడిమికే' అని వారిదే టీక.

1 పాఠాం.— 'మహీ.' 2 'ప్రాయమ్మన.'

టీక.— అశరీరి = ఆకాశవాణి, మృషాచిత్రాంగి = అబద్ధాలమారియైన చిత్రాంగి. ['అశరీరి' ఇందు స్త్రీత్వ వివక్ష లేదు.]

సీ. సంపెంగనూనె వాసనలఁ బొంపెక్కిన
  యలకలా యివి కూర్మి తళుకు మొలక?
చిట్టాడునాఁడు నాచిటికెన వ్రేలు పట్టు
  చేతులా యివి ముద్దుఁజిన్ని కూన!
ఘలుఘలు మని యందియలు మ్రోయ నడయాడు
  నడుగులా యివి ప్రోదియనుఁగుఁజూల!
ప్రేమ నా చన్నిచ్చి పెంచిన నీమేని
  నెత్తురా యిది పూపనెనరుపట్టి!
గీ. యనుచు నట రాలి యున్నట్టి యతనికురులు
కరచరణఖండరక్తపంకములు మమత
నెత్తి యక్కునఁ జెక్కున నొత్తుకొనుచు
నిందుముఖి యేడ్చెఁ గోయిల 'ల్లెఁ గదియ. ౨౪౫

టీక:— తళుకు మొలక, చిన్ని కూన - అనునవి ప్రేమాతిశయమును తెలుపు సంబోధనలు. 'కోయిల 'ల్లెఁగదియన్' అనుటచేత ఆమె కంఠధ్వని కోకిలస్వరము వలె నుండెనని - భా.

†వ. అంత మూర్ఛాక్రాంతుం డైనమహీకాంతుం డొకకొంత తడవునకుం దెలిసి సంతాపంబున. ౨౪౬

## — రాజనరేంద్రుని పశ్చాత్తాపము —

ఉ. 'ప్రేయసిమాట యట్లు చెవిఁ బెట్టి వృథా కరపాదహీనునిం
జేయుట కాక [1]జీవ మెడసేయఁగ వచ్చితి నంచు దాఁగితో?

†కొన్ని ప్రతులలో లేదు.

[1] శా. పా.— 'జీవ మెడఁజేయఁగ.' ('జీవ మెరజేయఁగ.' పూ. ము. పా.)
ధాతువు 'ఎడసేయు' గాని 'ఎడఁజేయు'— 'ఎడంజేయు' కాదు.
సీ. "ఈరూపుతో మనకెడసేయనే తెంచి, నదియొతొల్లి యనొక్క యసురజంత, జనకనందనకు రామునకును నెడసేయఁగడంగి వచ్చుట వినఁబడుచునుండు."
(కళా. 3-177.)

నాయపరాధ మిం కిట మనంబున [2]సైఁచియు పల్కవోయి రా
వోయి కుమారయెందడఁగితోయి' యటం జెలుగెత్తిచీరుచున్.

టీక.— జీవము + ఎడసేయఁగన్ = ప్రాణముతీయుటకు.

సీ. 'పరరాష్ట్రమున కైనఁ బాఱిపో బెదరించి
యిట్టట్టు గాసి చేయింప నైతిఁ,
ద ప్పొప్పు శోధించి తరువాతఁ † జెప్పెద
నంచు నేటికిఁ జెఱ నుంచ నైతి,
సుఖముల నందిచ్చు సుతుఁడు గల్గఁడు గాక
లలన లేయరు దని తలఁప నైతిఁ,
బదరి కార్యము సేయుపరుషవర్తనుఁడు వి
పన్నుఁ డౌ నను నీతి యెన్న నైతిఁ,

గీ. గూడు చవి యని యిఁక తినఁ గూడు నొక్కొ?
తనువు త్యజియింతు' ననుచు వింతనువు మీఱ
గుండు మెడఁ గట్టి భూభుజంగుండు నిండు
చెఱువులోఁ బడఁ బోఁగ నచ్చెరువు గాఁగ. ౨౪౮

టీక.— లలన లేయరుదు = స్త్రీలకేమి భాగ్యము= కావలసినంతమంది దొరుకు దురు, భూభుజంగుండు = భూపతి.

## —♦ ఆకాశవాణి సారంగధరుని క్షేమవార్త తెలుపుట. :—

చ. పలికె రయంబునం [3]జదలుపల్కుల చిల్కలకొల్కి యంత 'హా!

---

[2] శా. పా.— 'సైరిచి.'

భాషలో 'సైరించు' అను క్రియయున్నది గాని 'సైరిచు' అను క్రియలేదు. సైరణకు - ఇంచుక్కుపరమయి యేర్పడినరూపము 'సైరించు' ఇంచుక్కులోని అను స్వారములోపించి 'సైరిచు' 'అంగవిచు', 'పల్లవిచు' అను రూపములేర్పడుననుకొనుట భ్రాంతి.

[3] శా. పా.— 'చదలి'

పూ. ము. లో 'చదలుపల్కుల...' అని యున్నది. అది తప్పనుకొని శాస్త్రి గారు 'చదలి' అని దిద్దినారు. దిద్దుట పొరపాటు. చదలు - ఔపవిభక్తికము కాదు. భాషలో 'చదలుకాఁపు' - 'చదలుమానికము' 'చదలేఱు' అనురూపములే గాని, చదలికాపు - చదలిమానికము - ఇత్యాది రూపములు లేవు.

నిలు నిలు రాజ యిట్లు దగునే త్యజియింపఁ? బురారిపట్టియై
యలరినమత్స్యనాథుఁ డనునట్టి మహాత్మునిదండ నీడుగా
దిలిసుతుఁ†డున్నవాడిపుడు; దీమస మేది తలంక నేటికిన్? ౨౪౯

టీక.— చదలు పల్కులచిల్కలకొల్కి = ఆకాశవాణి, పురారిపట్టియై - అలరిన = ఈశ్వరపుత్రుడై యొప్పిన, దీమసము + ఏది = ధైర్యముచెడి, తలంక నేటికిన్ = భయపడుట యెందుకు?

ఉ. మేరుగిరీంద్రచాపుని యమేయకృపారసపూర్ణదృష్టి నీ
కూరిమిపట్టిపైఁ గలదు, కొంచెములోననె కాయసిద్ధికిం
గారణ మున్న, దాతనికిఁగా మదిఁ గుందకుఁ, డీ యనిత్య సం
సారమిదేమిబ్రాఁతి? ధరశాశ్వతుఁడై మను నాతఁ డున్నతిన్. ౨౫౦

టీక.— కొంచెములోననె = త్వరలోనె, కాయసిద్ధికిన్ - కారణమున్నది = ఆతడెప్పటియట్లు శరీరమును గాంచి - మహిమలనుగూడా పొందవలసినవిధి యున్నది. అని...బ్రాఁతి = శాశ్వతముగాని యీ సంసారమేమి లెక్క? ఆతఁడు, ఉన్నతిన్ = మహానుభావతచేత, ధరన్ = ఈ ప్రపంచమునందు, శాశ్వతుఁడై మనున్ = నాశము లేనివాడై యుండును.

క. ఎక్కడిసుతు లెక్కడిసతు
లెక్కడితలిదండ్రు లెవరి [1] కెవ్వరు కొన్నా
ళ్లక్కఱపడి తిరుగాడుదు
రక్కట! యిది యంత మాయ యని [2] యెఱుఁగవుగా.

క. మరు లింత దగునె నృపతికి!
ధర పాలనసేయ కునికి ధర్మం బగునే?
సరగునఁ దిరిగి పురంబున
కరుగుము చింతిలక మానవాధిపతిలకా. ౨౫౨

టీక.— మరులు = పుత్ర - మోహము.

† పా. పా.— 'ఉన్నవాఁడు - కడు.'

[1] శా. పా.— 'కెవరొకొ' 'గరుగా'

ఆ. వె. అతఁడు కరపదద్వయమ్ములు వచ్చి నీ
కడకు వచ్చి చూడఁగలఁడు మీఁద
నధిప నమ్ము, దీని కనుమాన మేమియు
నింక వలదు; వగల నింకవలదు. ౨౧౩

టీక.— వగలన్ = దుఃఖముచేత, ఇంకన్ - వలదు = కృశింపనక్కరలేదు.

క. నావుడుఁ దహాతనా పీడోఁ-ని
దైవారినవేడ్క- రాజధానికి [1] మగుడన్
దేవియుఁ దానును నరిగి మ
హీవల్లభుఁ డచట రాజ్య మేలుచు నుండెన్. ౨౧౪

## —• సారంగధరునికి కాలుసేతులు మొలుచుట •—

వ. అంత నచ్చట మత్స్యనాథుండు నరేంద్రనందను నొక్క మంచిమంచెపై నుంచి నిచ్చలుఁ గృపాలుండై గోపాలుండు నిచ్చల మగుభక్తిని దెచ్చి యిచ్చుపాలు నగపాలు బాలునిపాలు గావించి పోషించుచు నధ్యాత్మజ్ఞానోపదేశం బొసంగం దలంచి యత్యంత నిష్ఠా సనాసీనుం జేసి యోగాసన బంధవిశేషంబులు రేచకపూరకకుంభ కంబుల విధంబులును రాజయోగ హఠయోగ లయయోగ మంత్ర యోగ లంబికాయోగంబు లాదిగాఁగల యోగంబుల వృత్తాంతం బులం దెలిపి యభ్యాసంబు సేయింపం గతిపయదినంబులకుం బనుపడి యోగానందుం డై యుండం జూచి సమీచీనయోగసమాధిగాఁ దెలిసి కరచరణాభ్యుదయసంపత్సంపాదన సమయం బిదియని యతం డూర్ధ్వ దృష్టిం జక్కం జూడకుండుటఁ బైకి నొకయఖండ గండోపలం బెగయ వైచి 'యిది తప్పక చూడుమా చూడ కున్నం జూడాతలంబునం బడు' ననినం దనదృష్టి మరల్పక చూచుచుండఁ గొంతకాలంబునకు. ౨౧౫

టీక.— రేచక = శ్వాసము విడుచుట, పూరక = శ్వాసమును పూరించుట, కుంభకంబు = శ్వాసమును బిగబట్టుట, అను ప్రాణాయామ మార్గముల - విధంబులును, అఖండగండోపలంబు = పెద్దబండ, చూడాతలంబునన్ = తలమీఁద.

[1] శా. పా.— 'వేగన్.' (ఇది పూ. ము. పా.) 'మగుడన్' అని తంజ.పా.

చ. మొలక లొకింత గానఁబడి, మోసులు మెల్లన వెళ్ళి, సోగలై
నెలకొని, వ్రేళ్లు గోళ్లును జనించి, చొకారము లై, మిటారి కెం
†దలిరుకు బొమ్మగట్టి, యలతమ్ములయెమ్మెలు చూఱవట్టి, యిం
పలరఁగ వచ్చె వాని కిరవై తగ వింతగఁ గాళ్లు సేతులున్. ౨౫౬

టీక.— మోసులువెళ్ళి = మోవులెత్తి; చొకారములై = మనోజ్ఞములై, కెందలిరుకుబొమ్మగట్టి = ఎఱ్ఱనిచిగుళ్ళను తిరస్కరించి (= పోలి) తమ్ములయెమ్మెలు = కమలముల విలాసములను, చూఱపట్టి = కొల్లగొని, (బొమ్మగట్టు - చూఱవట్టు - ఉపమావాచకములు)

గీ. కాంచి యపుడు ప్రమోదించి మంచె దించి,
నడవఁగా లేకయుండెడు నాతనికిని
దనకరము లిచ్చి హారుపట్టి యొనరఁబట్టి
యల్ల నడుగిడఁ జేసెఁ ‡బాటడఁగఁజేసి. ౨౫౭

టీక.—పాటు - అడఁగఁజేసి = శ్రమతీర్చి.

---

† శా. పా.— 'కెందలిరుల బొమ్మగట్టి.' ('తలిరులు' పూ. ము.) 'తలిరుకు' తంజ. పా. (పాఠాం.— 'తలిరుల సొంపు నింపెసఁగి తమ్ముల తమ్ముల మాడ్కి మీఱి పెం'.)

బొమ్మగట్టుట తలిరులకుగాని తలిరులనుకాదు. 'తలిరుకు' అనుట 'నఃకా' సూత్రమునకు విరుద్ధము కావున శాస్త్రిగారు 'తలిరుల' అన్నారు. ఇక్కడనే కాదు. గొ. హరి. (పు. 138) లో 'కంతుసంకుకు బొమ్మగట్టిన గళము' అన్న పూర్వపాఠమును 'కంతు సంకున' అని దిద్దియున్నారు. గొప్ప సాహసము. 'బొమ్మకట్టుట' (= బొమ్మ పెట్టుట.) షష్ఠ్యంతముల మీద నేగాని సప్తమ్యంతముల మీద కనబడదు. కొన్ని ప్రయోగములు.—

(1) ద్వి.—'కట్టేఁడి మరునకు గట్టిగా బొమ్మ - గట్టితివేని.' (విష్ణు. ఉ. 4.)
(2) చ. 'దేవతానటీ, మణులకు బొమ్మపెట్టుక్రియ.' (రామా. 2 ఆ).
(3) సీ. 'పేదర్కునకు బొమ్మపెట్టువారు.' (విక్ర. 5 - 124.)
('పే దర్కికిని' అని 'వావిళ్ళ' పాఠము?)
(4) గీ. 'గురువునకు బొమ్మపెట్టి చేకొంటికీర్తి.' (శశాంక - 5-96.)
(5) ఆ. వె. 'గట్టుచేరినంతఁ బుట్టినవానికి బొమ్మ
గట్టుసామ్యమాయెఁ గదవె చెలియ.' (రాధికా. 3-38).

‡ శా. పా.—'పాటగుటఁజేసి' ('పాటు = వాసి' (కుదురుపాటు)' అని పూ. టీ) 'పాటడఁగజేసి' అని పూ. ము. పా.

సీ. జుట్టవ్రేళ్ళను రెండుఁ బట్టించి నడిపింపఁ
దలఁకుచు రా లేమి బలిమిఁ దిగుచుఁ,
దనచేతినిడుదలాతపుఁగోల యందిచ్చి
మెల్లమెల్లనె కొంత మెలఁగఁ జేయు,
నవలంబ ముడిగి రమ్మన నా ల్గడుగు లేఁగి
పడఁబోవ గ్రక్కునఁ బట్టి నిలుపుఁ,
జనుదెంచి బిసబిస దను నంటుకొమ్మని
వచ్చిన నగుచు నవ్వులని కరుగు,

గీ. నాఁడునాఁటికి నీరీతి నడవ నేర్పఁ,
గొన్నినాళ్ళకు నలవడి కొంకు దీఱి
లెస్సలై కరపదములు లీలఁ దనరఁ
† ప్రేమఁజౌరంగి యనియెడి పేరొసంగి. ౨౫౮

---

† శా. పా.— 'ప్రేమ - సౌరంగి' ('సారంగి' తంజ. పా)

సరియైన రూపము 'చౌరంగి' — "అరుదారఁ జౌరంగియను నామమొసఁగి" (నవ. పు. 96) "కలిగిన తన శిష్యగణములకెల్లఁ, బెద్దగాఁ జౌరంగి పేరిటి సిద్ధి, పద్దిచ్చి" (శం. సారంగ. పు 115) "సారంగధరుఁడును జౌరంగి యనెడు, పేరువహించి" (కూ. తి. సారంగ. పు. 45) కావున 'సౌరంగి' - 'సారంగి' పాఠములు తప్పులు. 'చౌరంగి' అని పేరు పెట్టుటలో గొప్ప విశేషము కద్దు.—

'చౌరంగ్' హిందుస్థానిపదము, జంతువుయొక్క నాలుగు పాదములను ఒక్క వ్రేటున తెగవేయు మృగయాకౌశల మని యర్థము. ఈయర్థము, 'క్రేవన్స్ రాయల్ డిక్షనరీ' అను నిఘంటువులో ఇట్లు వివరింపబడి యున్నది.—

" चोरङ्ग, एक कसरत जिसमें जान्वरकी चारो पैर एक हातमें उडाते है.

A practice of the sord exercise cutting of the four legs of an animal at one blow".

'చౌరంగ్' మనకావ్యములయందును వర్ణితమయ్యేయున్నది.—

గీ. 'నీరముంచిన సొరకాయ నెగసినట్లు
పేరుకొనివైచు తెల్లంటి చీరవోలె,
నుంకు చెండువిధంబున, నుత్తరించు
తములఫాకు నిక్కెడుక్రియ, దాఁటెనిట్టి.

టీక.— జుట్టువ్రేళ్ళను = చూపుడువ్రేళ్ళను, లాతపుఁగోల = సన్న్యాసి చేతిదండము, అవలంబముడిగి = తన చేతి యాధారమువదలి, అలవడి = అలవాటుపడి, కొంకుదీఱి = జంకువదలి.

ఉ. సద్గుణరాశి యై తనరుసాత్త్వికమౌళికి వత్సలత్వసం
పద్గరిమన్ సమస్తమణిమంత్రమహౌషధవస్తు లిచ్చి శుం
భద్గతి †సిద్ధయోగికుల పట్టము గట్టి కృతార్థుఁ జేసినన్
దద్గురునాథుమాట జవదాఁటక నిశ్చలభక్తియుక్తుఁ డై. ౨౫౯

టీక.— సిద్ధయోగికుల పట్టముగట్టి = ఔషధ సిద్ధులగు యోగిసమూహము నకు మేటినిగా నొనరించి.

గీ. కాయసిద్ధి వచస్సిద్ధి గలిగి యతఁడు
చెలులకాంక్షలు క్షుత్పిపాసలును లేక
పట్టినది యెల్ల బంగారుగట్టు గాఁగ
మెట్టినది యెల్ల నిధియు నై మెలఁగుచుండె. ౨౬౦

టీక.— కాయసిద్ధి = జరారుజలులేని దివ్యదేహము, ('జరయురుజయును - జెనకంగా వెఱచు మమ్మ సిద్ధుల మగుటన్ - మను - 1 - 74.) వచస్సిద్ధి = వ్యర్థముకానివాక్కు. మెట్టినది = అడుగుపెట్టిన ప్రదేశము, నిధి=ధనముపోసియుంచినతావు. (A treasure.).

వ. 'ఇవ్విధంబున నెగసినయిట్టి నాలుగుకాళ్ళునుం ద్రెవ్వ నొక్కమ్మున నేసి.' (ఉ. హరి. 4-29.)

మ. 'హరిణంబొక్కటి కుక్కతండముఁ బుళిందానీకమున్ ద్రోచి, యు
ర్వరఁ గాలూఁదక దాటనేటలవికిన్, వాహంబు నడ్డంబు నూ
కి రసావల్లభుఁడేసె భల్లమున నింగిన్ గాళ్ళజోడించుచో
గొరిజల్ నాలుగుఁ ద్రెవ్వ, సేనవొగడెన్ గోదండపాండిత్యమున్.' మను—4-44.

చౌరంగ్ - అనగా నాలుగును నరుకుట. (కాళ్ళు చేతులు) నాలుగు - నరుకబడినవాడన్న యర్థముతోనే సారంగధరునకు 'చౌరంగి'యను పేరు పెట్టబడినది.

† శా. పా.— 'సిద్ధయోగకుల పట్టముగట్టి.' (ఇది పూ. ము.పా.) పట్టము గట్టుట 'యోగి' కులమునకుగాని 'యోగ' కులమునకు కాదు. 'యోగము' ధర్మము; 'యోగి' ధర్మి. ధర్మ - ధర్మిభేదము తెలియదు. (చూ. ౨—౧౭౨. లో 'వియోగ లోకంబు'.)

## —♦ యోగియై సారంగధరుడు తలిదండ్రుల దర్శించుట ♦ —

గీ. ఉండి యొకనాఁడు తమవార లున్నకడకుఁ
బోయి రావలె నని బుద్ధి పొడమి వేఁడు
కొనె గురుని; నాఁ గదా వివేకులకు నెల్లఁ
దల్లిదండ్రులు [1] మఱవగాఁ దగనివారు. ౨౬౧

గీ. గురునిపంపున సంతోషభరితుఁ డగుచు
బాదుకలు మెట్టి తలిదండ్రిపజ్జఁ దలఁచెఁ,
దలఁచినప్పుడె పోయి ముంగలను నిలిచె;
నిలిచినప్పుడె విస్మయాన్వితు లగుచు. ౨౬౨

టీక.— పాదుకలు - మెట్టి = పావుకోళ్ళు తొడిగి, తలిదండ్రుల, [2]పజ్జ = పార్శ్వప్రదేశమును. (నేను మా తల్లిదండ్రుల యొద్ద నుండవలెను, అని) తలఁచెన్. (యోగుల పాదుకలు తలచినచోటికి తీసికొనిపోవు ప్రభావము కలవి. వానిని 'యోగవాగ' లందురు.) విస్మయాన్వితులు = ఆశ్చర్యముతో కూడినవారు.

సీ. 'మానేరమి మనంబులో నుంప కిటు వచ్చి
తక్కఱగలయట్టి యనుఁగుఁబట్టి,
యాకాశవాణి వాక్యంబుచే బ్రతికి నీ
కెదురుసూచితిమి సు మ్మిన్నినాళ్ళు,
మావంటిభాగ్యసంపన్నులు లేరుగా!
క్రమ్మఱ నినుఁ జూడఁ గలిగెఁ, గాన
నీశ్వరాంశంబ యౌ దీవు; గాకుండిన
మనుజమాత్రున కింతమహిమ గలదె?'

---

[1] శా. పా.— 'మఱవరాఁదగనివారు.' - అంటే అర్థమేమో ? ఏమో, పూ. ము లో నున్నది గనుక శాస్త్రిగారును, శాస్త్రిగారిని నమ్మి వావిళ్లవారును 'రాఁదగనివారు' అనియే అన్నారు. సరియైనపాఠము తంజ. ప్రతిలో నున్నది.

[2] పూ. టీ.— 'పజ్జన్ = పార్శ్వమునందు.'
'పజ్జన్' ద్వితీయావిభక్తి గాని - సప్తమికాదు. తలిదండ్రుల పజ్జయందు తలచె, ననుట సరికాదు.

గీ. యనుచు మొగములు దెలిసి, దేహములు పొంగి
పలుమఱును గౌఁగిలించుచుఁ, బాణిపాద
తలము లలముచుఁ, దలిదండ్రు [1]లలరిరపుడు
వారివేడుకలకు మితి మేర గలదె? ౨౬౩

టీక.— మొగములు, తెలిసి = ప్రసన్నములై, అలముచున్ = అంటుచు, అలరిరి = సంతోషించిరి.

ఉ. ఇక్కరణిన్ సుహృజ్జనము లెంతయుఁ గన్నులఁ గప్పుకొంచు బే
రక్కఱఁ బూజసేయ నతఁ † డక్కడఁ గొన్నిదినంబులున్న, 'నా
చక్కనియున్న యీధరణిచక్ర మశేషము నీవయేలు; నీ
చక్కి భుజించుచుండెదము సౌఖ్యముతో' నని తండ్రి పల్కినన్.

గీ. "నాగురుండైన యలమత్స్యనాథుతోడ
'నిదిగొ మావారిఁ జూచి వచ్చెద' నటంచుఁ
బ్రార్థన మొనర్చి వచ్చిన రాక గాని
రాజ్యభోగేచ్ఛ వచ్చిన రాక గాదు. ౨౬౫

సీ. సర్వ సర్వంసహా నిర్వాహక ఖ్యాతి,
కాయసిద్ధిఁ బొసంగఁ జేయఁ గలదె?
యంగనా దృఢ కుచాలింగ నానందంబు,
ప్రాయంబు తిరముగాఁ జేయఁ గలదె?
గంధసింధుర ఘటా గంధర్వ భట సేన,
సిద్ధ క్రియలు గల్గఁ జేయఁ గలదె?
దివ్యరత్నావళీద్రవ్యరాశిసమష్టి,
‡ జీవదర్చః ప్రాప్తిఁ జేయఁ గలదె?

1 శా. పా.— 'లలమినపుడు' (ఇది పూ.ము. పా) అర్థమెట్లో? పూ. టీ. లేదు. 'అలరిరపుడు' తంజ. పా.

† శా. పా.— 'దండుల'

‡ శా. పా.— 'జీవద్వయః ప్రాప్తి' (=చావులేని యాయుస్సుయొక్క లబ్ధిని' పూ. టీ.)

గీ. యిన్నియును గల్గె గురుకృపాదృష్టివలన;
యోగలీలాసుఖముకన్న నొకట సుఖము
గలదె?' యని † జ్ఞానమార్గంబు దెలిపి వారి
ధన్యులుగఁ జేసి ‡ చౌరంగి దయఁ జెలంగి. ౨౬౬

టీక.— సర్వ...ఖ్యాతి = సమస్త భూమండలమును భరింపగలవాడన్న పెద్ద పేరు.— గంధ...సేన = మదపుటేనుగుల గుంపులు - గుఱ్ఱములు - బంట్లు - మొదలగు సేన. - దివ్య...సమిష్టి = శ్రేష్ఠములయిన రత్నముల యొక్కయు - విస్తారమయిన ధనముయొక్కయు మొత్తము, జీవత్, వచః ప్రాప్తిక్ = ప్రాణవంతమయిన వాగ్లాభమును, (ఏమాట అంటే ఆమాట జరుగుట.) చేయఁగలదె = కలిగించగలదా ?

గీ. 'వంశకరుఁ డైనసుతుఁ డుద్భవంబు నొందఁ
గలఁడు మీకొకఁ' డని యనాగతముఁ దెల్పి,
'వచ్చి తడవయ్యె నింకఁ బోవలయు గురుని
యొద్ద' కని తల్లిదండ్రుల నుపచరించి. ౨౬౭

ఉ. అచ్చటు వాసి యాశివపదాంబుజభక్తిధురంధరుండు ముక్
వచ్చిన[1] యట్లయేఁగి, గురునాథునకుం బ్రణమిల్లి నిల్చినన్,
వచ్చితె యన్న 'రాజ్యవిభవంబులు హస్తగతంబు లైనచో
హెచ్చు గదన్న? నీకుఁబ్రతియెవ్వరు జ్ఞానమహత్త్వసంపదన్?'

చ. అని గణుతింప సద్గురుకులాగ్రణి సేవలు చాలఁ[2] జేసి, దీ
వనలు వహించి, పుణ్యు లగువారలకుం దనదివ్యమూర్తిఁ గుం
భినిఁ గనిపించుచున్, దనదుపేరు దలంచినవారికిన్ యశో
ధనములు గల్గఁ జేయుచు సదా యతఁ డుండుఁ జిరాయురున్నతిన్.

క. సారంగధరుచరిత మె
వ్వారుం జదివినను వినిన వ్రాసిన సౌభా

---

† శా. పా.— 'యిట్లు జ్ఞానంబు.'; 'జ్ఞానమార్గంబు' తంజ. పా. ఉచితతరము.

‡ శా. పా.— 'సౌరంగి' ('సారంగి' ప్రూ. ము.) . 'చౌరంగి' సరియైన రూపము. (చూ. ౨౫౮ పద్యము క్రింద.)

1 శా. పా.— 'త్రోవనేఁగి' 2 'సేవనుజాల'

గ్యారోగ్యపుత్త్రపౌత్త్ర
శ్రీరత్న[3]ధనాభివృద్ధిఁ జెలఁగుదురు సుమీ. ౨౭౦

క. ‡ కలహారంభణ కౌతూ
హల పులకిత భుజపరాక్రమార్జిత నానా
జలదుర్గ వనీదుర్గ
స్థలదుర్గాహార్యదుర్గ సామ్రాజ్యనిధీ. ౨౭౧

ఉ. క్ష్వేళగళైకలాంఛన విజత్వర శుభ్రయశోవిశాల ధా
రాళగళన్మదద్విప విరాజిసభాభవనాంగణా ధనా
వేళగరిష్ఠదాన పదవీపరితోషిత కాశి గౌతమీ
చోళకవిద్విజస్తుతివచోలగచోలగమానభంజనా. ౨౭౨

భుజంగ ప్రయాతము

అరాతిక్షమాభృద్విదాంచత్కృపాణా
నరాధీశ్వరాకార నాళీక బాణా
స్థిరానందనా రామసేవాధురీణా
విరాజచ్చతుష్షష్టి విద్యాప్రవీణా. ౨౭౩

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధ ప్రసిద్ధ వాగ్వైభవ సుధాసారజనితయశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్యకుమార సమారాధితబుధసమాజ వేంకటరాజప్రణీతంబైన సారంగధర చరిత్రంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము.

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన నేత్యాద్యనేకబిరుదవిఖ్యాతవిద్వత్కవీశ్వరతిరుపతివేంకటేశ్వరకృపాపాత్రచ్ఛాత్ర కాశ్యపసగోత్ర దీపాలాన్వయపవిత్ర సరస్వతీనృసింహపుత్ర రాజలక్ష్మీకళత్ర ప్రౌఢప్రబంధపఠనరచనాధురీణ పిచ్చయశాస్త్రి ప్రణీతంబును, 'జితకాశి' నామకంబును నగు సారంగధర చరిత్ర టీక యందు తృతీయాశ్వాసము.

సారంగధర చరిత్రము
సంపూర్ణము

3 'జనాభివృద్ధి'

‡ ఈ పద్యము 'విజ'లో ద్వితీయాశ్వాసాంతమున నున్నది. తక్కిన ములును తృతీయాశ్వాసాంతమున నున్నవి.

౫౯౭ మొదలు ౬౫౦ వరకు తెనాలి భారతీ ప్రెస్‌నందు ముద్రింపఁబడియె 1942.

# పునస్సమీక్ష

గ్రంథము ముద్రణమయినతరువాత మరల పరిశీలించుటలో కొన్ని మార్పులు చేర్పులు స్ఫురించినవి. వానినిక్కడ తెలుపుచున్నాను.

## ప్రథమాశ్వాసము

౨౧ వ పద్యములో, హర్ష బాష్పములు ధారాళములనియు, పులకాంకురములు నారాళములు (= వంకరకానివి - చక్కగా నిక్కినవి) అనియు గ్రహించునది.

౨౨. తేలుకుట్టినవానికీ, పురుగుముట్టినవానికీ, ఒక్కొక్కప్పుడు గాలిసోకు టయు కలదు. అందువల్లనే ఈ పద్యమున విషవైద్యము - భూతవైద్యముకూడా చెప్పబడినవి.

౨౪. అంగరంగవైభవములు-ప్రాచీనకాలమున 'అంగరంగభోగములు'. "దేవర్లకు అంగభోగ రంగభోగ ధూప దీప నైవేద్య తాంబూలాలకు."

(చూ. రాజనరేంద్రసంచిక. పు. ౬౦.)

౩౪. 'గర్భోక్తి' కొక్క ప్రయోగము.— సీ. 'ఒక కొన్నితిథులు గర్భోక్తి చాతుర్యంబు, మెఱయ నేకాంతంబు మేలమాడు.' (కా శీ. 4-198)

౫౦ లో.— కరములు - తమి - రాగంబు - రేక - బింబము - అంకము - సారంగధరుడు, అను పదములచేత చంద్రుడును; (ముద్దు) 'కురియుఁజ' అనుటచేత, అమృతమువర్షించుటయు; (తండ్రి) 'ఉప్పొంగఁగ' అనుటచేతను సాగరుడు; సుసూక్ష్మముగా ధ్వనితములు.—

'తామరమోము' ఉపమానపూర్వపద కర్మధారయము. 'చిగురుఁగేలు' వంటి సమాసము.

౬౯ లో, 'గిబ్బ' అను క్రియ 'చంపు' అను నర్థమున ప్రయుక్తమై యున్నది. నిఘంటువులలో లేదు. అది 'గెబ్బ' అయ్యుండునేమో ? 'గెబ్బ = చంపు' (సూ. ని.) 'విజ' లో 'గెబ్బ' - గెంటు- అనే యర్థమున వాడబడినది. 'మబ్బ మబ్బ గెబ్బ బిబ్బోకవతివేణి' (౧-౨౪.)

౭౯.- 'సంకుఁదోమ' ఇది జాతీయమేమో ?

౯౨. 'వేరువేర' కు ప్రయోగాంతరము.- "తనకు నగ్గోవుల పేళ్లను లక్షణం బులు నేర్పడ నెఱింగించుచుండఁ బేరువేర వత్సంబులు వత్సతరంబులు..., మొదలైన గోవివేషంబుల నాలోకించుచు." (భా. ఆర. 5-376.)

౧౦౬ లో, పూ. టీ. మీద ఆధారపడి 'ఉరియలుఁగా యనన్ = ఉరి గోలకాఁ అన్నట్లు' అని టీక వ్రాసితిని. కాని ఉరిగోలకు 'ఉరియలుఁగు' అను వ్యవహార మగపడలేదు. కావున 'ఉరియలు - కా - అనన్ = ఉఱియలు కదా (= ఇవి దిట్టతనము కలవి గదా-) అన్నట్లు' అని చెప్పుట ఉచితమని తోఁచినది. ('ఉఱియ = దిట్టతనము గలవాఁడు. ధృష్టుఁడు'- శ. ర.) అందువల్ల 'పరియలుగా- మరియలుగా- నరియలుగా' అనునదే సరియైన పాఠమగుచున్నది. కవి 'ఉఱియ' నే 'ఉరియ' అన్నాఁడు.

౧౩౦ లో, 'వచ్చెనిటు ప్రేమ' అనునది సాధుపాఠమనియు, ఆ పాఠము వ్రాతలలో 'నిఖప్రేమ'గా మారినదనియు ఊహింపదగి యున్నది.

౧౩౪లో, 'చిత్రమంజిమన్, అయమై = మంగళ (కర) మై' అనియును చెప్పనగు నేమో?

౧౩౬లో 'గయ్యాళి'ని 'చిలుకతేజీ'కి విశేషణముగా చెప్పుట యుచితతరమని తోఁచినది. గ్రంథకర్త. ౨. ౧౭౦ లో చిలుకలను 'మరు కరాళి తేజీలు'గా చెప్పి యున్నాఁడు.

## ద్వితీయాశ్వాసము

౬౩. 'చనుమానముతోడన్' అనుటలో 'ఉచసంభావనతో' అన్న ధ్వని యున్నది.— 'చనుమానము' అనుట కొక్క ప్రయోగము.— "పానకమందుఁ బుల్లవలె బండితకోటుల కిచ్చువేళ నేమానవుఁడైనఁగాని చనుమానమునన్ బహుమానమందునన్, న్యూనతగల్గఁజేయుటకు నూల్కొను' (నానా - సం.) 'చనుమానము పరిశుద్ధమయిన వ్యావహారికపదము' (చూ. ము. పా. దేవీభాగవతము ఉపోద్ఘాతము. పు. 17.)

౭౪. సంభ్రమము=చుట్టలు చుట్టలు తిరిగి వ్యాపించుట. "సంభ్రమః - Turning round." (ఆప్టే.)

౧౦౯. నాలుగవపాదమున అఖండయతి, వెంకటకవికి సమ్మతమే.

౧౨౪ లో, పూ. టీ. తప్పుదారినిబడి, 'రక్తిమను, నీ కనులయందెందుకు చేర్చెదవు' అన్నాను- 'రక్తిమను నాకనులయం దెందుకుచేర్చెదవు = నాకెందుకు కోపము తెప్పించెదవు ? నాకు కోపతాపములు లేవుకదా' అనుట యుచితము.

౧౩౩.- 'వైళకవిడిచి చనియెన్ = వైళనక వదలిపెట్టిపోయెను' అని యర్థాంతరము.

౧౪౯. † ప్రశ్నార్థమున 'ఎక్కడ' కళ యనుట కొక్క ప్రయోగము.—
'ముక్కడిమూఁకలుసని యెక్కడెక్కడయని తలపడినక్౯' (విరాట. ౪-౩)

౧౭౧. 'నోరారమాటాడు' అనుట కొక్క చక్కని ప్రయోగము.—

సీ. 'నోరారమాటాడు గారాబుచుట్టంబు
నొండేని యెందు లేకుండుటయ్యె.' (యుగంధర. పు. 17.)

౧౯౪. తురకలు నెలపొడుపును 'చందు' అందురు. వారు చందు (సందు) చూచి పీర్లపెట్టెలు దింపుదురు. దానినిబట్టి 'సందుచూచి పెట్టెలు దింపుట' (సమయమును కనిపెట్టి కార్యమునకుద్యమించుట) లోకమున సామెత అయినది.

౧౯౭. 'నివాళిగ' అనుటకంటే 'నివాళిక' యనుట సరసము; శబ్దాలంకార నిర్వాహకమున్ను.

౧౯౯. 'ఊనమైనట్టి మైలక్౯ = హీనమైన మాసినగుడ్డను' అనియును చెప్పవచ్చును.

౨౦౩. మంతురుల్ = మాంత్రికులు (భగవదుపాసకులు) అనియును.—
'మంత్రి = మంత్రమును జపించువాడు' అనుటకు.—
'తత్త్వలక్షం జపేన్నిత్యం, మంత్రీ నిశ్చలమానసః
తావత్సహస్రం జుహుయాత్, పాయసం హవ్యవాహనే'

(మేరుతంత్రము.)

ఆ. వె. 'అనఘశ్రుతిచతుష్టయైకాధిగమ్యమై, నిపుణమంత్రి సంప్రణీతమగుచుఁ
గడు నపూర్వ ఫలము గావించు మంత్రంబు, యజ్ఞశీలునకు ధరాధిపతికి'
(కళా. 7—240.)

## తృతీయాశ్వాసము

౨౧. 'విజ్ఞానేశ్వరము' (= విజ్ఞానేశ్వరీయము) అనునది యాజ్ఞవల్క్యస్మృతి యొక్క వ్యాఖ్యానము. అందు మాతృద్రోహికి లింగోత్కర్తనము తప్ప మరి వేరు దండనము లేదని చెప్పబడియున్నది.

౨౮ లో, 'రాగిదేరెడు = ఎఱ్ఱయెఱ్ఱని మెరుగులుగల- నీలిచల్లడములు- డఁబు' అని యర్థము. నీలిమందు రంగు దట్టముగా అతికినచోట రాగివర్ణపు మెరుగులు కనబడుచుండును. నీలిమందులో రాగి కలదట.

---

† ఎక్కడ - సప్తమ్యర్థమున ప్రథమ యని శ్రీ తిరుపతి వేంకటకవులు సప్రమాణముగా నిరూపించియున్నారు. (చూ. పాశుపతము. 'ఏడోయి.')

౪౯. 'తట్టింబడిన పులుఁగు విధంబున నిట్టట్టువడి తరలిపోఁగూడక' అను పాఠమున్నదేమో ? 'తట్టి = వేఁటతెర' (శ. ర.)

సీ. 'తట్టికివచ్చి యిట్టట్టు వో నేరని
తెల్లవిధంబున లీలయొడలి.' (నిర్వ. రా. ౫—౧౦౦.)

౫౩. 'పొఱుపట్టు = పట్టు విడుపు' అనియును.

౭౨. 'సబ్బిణి' అను పదము 'అమాయికురాలు' అను నర్థమున నేఁడు వ్యవహారమున నున్నది. ముత్తుకూరిలో నా మిత్రులు పండిత, ఆకిలి శ్రీరామశర్మగారి యింట్లో ఇటీవల విన్నాను. పిమ్మట, ఈ క్రింది ప్రయోగముగూడా దొరకినది.—

సీ. "నలుగురుండెడుచోట నిలువఁగాఁ బెట్టి మాటాడఁగాఁ గంటిరే యమ్మలార,
నను వంటి యాడుబిడ్డను గన్నవారింత - పలుక రే, యేమియుఁ దెలియలేని
'సబ్బిణుల్' మీరు, మీ చాటుమాటలు గదా-నానాథు మేలిగుణంబుఁ జెఱిచె."
—శుక. పుట. 394.

౮౧. 'పైలపైల' పాఠాంతరముగా చూపబడినది. కాని, అదే అసలుపాఠ మని యీ క్రింది ప్రయోగమువలన తెలిసికొన్నాను.

చ. "గుమికొని పైలపైలఁ బడుకొంచు భటావళి చూడఁబోవ."— (శుక, 2—40.)

౧౦౭. 'నోరఁగాయయిడక' ‡ 'నోరఁగాయవేయక' అను పలుకుబడికి ప్రకరణమునుబట్టి అర్థము నూహించితినే గాని, దాని తత్త్వము నాకు తెలియలేదు.

౧౩౯. 'కొన గోటఁజీల్చి' అను పాఠమును నేను పొరపాటున గ్రహించినాను. 'కొన గోటఁద్రుంచి' అనునదే సరియైన పాఠము. 'కొనక్ = తమలపాకు చివరభాగమును, గోటక్ - త్రుంచి' అని యర్థము. ఈ యర్థము నాకు తొలుత తోఁచలేదు.

౧౪౨ వ పద్యము వెంట ఈక్రింది పద్యమునుచేర్చి పఠింపవలెను.—

గీ. 'కాకి నను దాసి చిత్రాంగిగా జనించి
నీకు నీవిధిగావించె, నెమ్మినెల్లి
భువనసుందరి చందంబు పొందుననుచు
గగనలక్ష్మియు నత్యంత కరుణతోడ.'

ఈపద్యము మద. తా. ప్రతిలో దొరకినది. మూలములో కలిపి ముద్రింప మరచినాను. నవనాథ చరిత్రలో, ఈ పద్యార్థము చెప్పు పంక్తులు లేవు.

---

‡ 'నోటఁ గాయవేయక' అను 'కవిరాజ మనోరంజన' - ప్రయోగమును నాకు దయతో తెలిపినవారు నామిత్రులు బ్ర॥ పిశుపాటి విశ్వేశ్వర శాస్త్రిగారు.

ఒక్క బా. శం. దాసుని కృతిలో మాత్ర మిట్లు వివరింపబడి యున్నది.—

'ధర సుమంతుండు మీతండ్రియై పుట్టె - నరసిచూడఁగ న జ్జయంతుండవీవు,

దాసియే చిత్రాంగి ధరణీశు భార్య - యాసుందరాంగి రత్నాంగి మీతల్లి.'

సిద్ధవగౌడు - ఈ ద్విపద పాదములనే యనువదించినాడు.

౧౮౦. 'సన్నవిడి' తత్త్వము తెలియక, మొదట నేను 'సన్న = సన్ననివి, విడి = (విడివిడిగా) ఎడమెడముగా కూర్పబడినవి' అని అర్థము చేసినాను; తప్పు. 'సన్నవిడి' యనగా 'సన్నరకము' అని యర్థము. వ్యవహారమున నున్నది. ఇటీవల విన్నాను. 'సన్న విడి బియ్యము' అనుచుండగా, నామిత్రులు, బ్ర॥ పులుగుండ్ల నరసింహశాస్త్రిగారియింట్లో విన్నాను. తరువాత చూతునుగదా బ్రౌణ్యములో 'సన్నవిడి - Smaller by species, thus సన్నవిడి బియ్యము. fine rice' అని యున్నది. కాబట్టి 'సన్నవిడి = సన్నరకపు, గౌడదేశపు రుద్రాక్ష' లని సరియైన యర్థము.

గౌడ రుద్రాక్షలనగా, 'లావు (గొప్ప) రుద్రాక్ష'లని కొందరందురు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు, 'క్రీడా' పీఠిక. (పు. 119)లో, "తరుణి హైహయ రాజ దంతాస్తి పటలంబు - గవుడపేరుగఁ జేసి కట్టె నలుత" అనుచోటి 'గవుడపేరు'ను గూర్చి చర్చిస్తూ ఇట్లు వ్రాసినారు.

"గవడపేరు = పెద్దహారము? గొప్ప రుద్రాక్షలమాలకు గవడ రుద్రాక్షల మాల యని, గొప్ప రుద్రాక్షలకు, గవడకాయలని నేఁడు వ్యవహారమున్నది. †'గవుడ' యని శ. ర."

---

†'గవుడపేరు'; రూపాం.— 'గౌడపేరు,' తొలిరూపము 'గవుడ' కాక 'గవడ' యగుచో 'గాడ' అను రూపాంతర మేర్పడదు. అందుకీ క్రింది పదముల రూపములు తార్కాణము.—

'అవుడు = ఔడు　　　దవుడ = దౌడ

కవుడు = కౌడు　　　దవుడు = దౌడు

గవుఁడు = గౌఁడు　　　నవుడు = నౌడు.

కావున శ. ర. పాఠమే సాధువు. 'గవడ - పేరు' అనుట సాధువు కాదు. కాబట్టే, సూ. ని. లో. 'గవడ - అపముద్రితము' అని తెలుపబడినది.

అది యట్లుండగా, గవుడపేరు (=గవుడసరము)అనునది, కాసులపేరు; 1 గుండ్లపేరు; 2 ముత్యాలపేరు;— బన్నసరము; చెంపసరము; అనువానివలె స్త్రీ భూషావిశేషమగునే కాని, పట్టి 'పెద్దహారము' కాదు. 'గవుడ - లేక 'గవడ' పెద్ద, పేరు =

1 'గుండ్లదండ - A necklace of beads.' (బ్రౌను.)

2 త్రుళ్లు చన్నులనొప్పు ముత్యాలపేరు.' (కళా. 4-105.)

హారము' అని యర్థము చేయుట సరికాదు. పై పద్యమునను - స్త్రీ భూషావిశేషముగా చెప్పుటయే ప్రకరణమున నుచితము.

'గవుడ' కు 'గవడ' వ్యావహారిక రూపము కావచ్చును.

గౌడ రుద్రాక్షలు = గొప్ప రుద్రాక్షలగుచో, 'సన్నవిడి గౌడరుద్రాక్షలు = సన్నని - గొప్ప ( = లావు) రుద్రాక్షలు' అనవలెనుగదా ! మరి 'సన్నని లావు' అనుట సరియగునా ? సరికాదు, కావున 'సన్నవిడి- గౌడరుద్రాక్షలు = సన్నని గౌడదేశపు రుద్రాక్షలు' అనుటయే యుచితము. గౌడదేశపు రుద్రాక్ష ప్రసిద్ధము. అందువల్లనే 'హురుమంజి ముత్తెము' లన్నట్లు 'గౌడరుద్రాక్ష' లన్న వ్యవహారము రూఢమయినది. గంగాతీరమున నున్నది *గౌడదేశము. ('గౌడదేశము. The Gangetic countries.' (బ్రౌను.) అక్కడ రుద్రాక్ష విశేషముగా నుండును. గంగాతీర భూమిని శ్రీనాథు డిట్లు వర్ణించినాడు.— సీ. "గంగాప్రవాహ సంక్షాళితా భ్యున్నత- రుద్రాక్ష దేవదారుద్రుమంబు...నైన హిమశైలపాదంబు." (హర. 3_30.)

గౌడరుద్రాక్షలు; గౌళరుద్రాక్షలు, అనికూడా వాడుక.

'గౌళరుద్రాక్షలు గరుడ పచ్చలును
జాలఁ గూర్చినపేరు జాతిగాఁ బూని.' (నవ. పు. 82.)

బిగువులేని పెద్ద స్వరమును పలుకు గొంతును 'గౌళగొంతు'_ 'గౌళశారీరము' అనుట వాడుక. (ఎందువల్లనో సూ. ని. గ్రహించలేదు.) బ్రౌణ్యములో,- 'గౌళ గొంతు = a big voice.' అని యున్నది. కాని కోకిల కంఠమువలె చిక్కనైన పెద్ద కంఠస్వరమును 'గౌళ' అనరు. పెద్ద అను నర్థమున గౌడ, గవుడ; గౌళ, గవుళ, అను పదము లుండవచ్చును. ఆ యర్థమున నవి దేశ్యములు. రుద్రాక్షకు విశేషణమగు 'గౌడ' ( = గౌళ) సంస్కృతము. దానికి గూడా వాడుకలో, గవుడ, గవడ; గవుళ, గవళ, అను రూపము లుండవచ్చును. కాని 'గౌడరుద్రాక్ష' లంటే గౌడదేశపురుద్రాక్షలనుటయే సరి.

౨౨౦ లో 'ఁబడఁ దలఁచునీకు' అను పాఠము తప్పు. 'ఁబడ నురుకునీకు' అను పాఠము ఒప్పు. (ప్రమాదమున పాఠాంతరముగా చూపబడినది. (ఉరక - ఉఱక, సమానార్థకములే. చూ. సూ. ని.)

౨౨౧ లో, 'తేలు' అనగా - కొండిచుట్టు; 'పాము' అనగా వ్రేలాడుజడ, అని సంకేతము.

* [illegible] సమారభ్య భువనే శాంతగః శివే;
గౌడదేశః సమాఖ్యాతః సర్వవిద్యా విశారదః.' (స్కాందపురాణము.) ఆపి.

# దిద్దుబాటు

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| ౩౭ | ౧౧ | ప్రశంశించు | ప్రశంసించు |
| ౩౯ | ౩ | ల్సల్కాఁగా | ల్పల్కాఁగా |
| ౪౧ | ౮ | గర్భముయొక్క | భరింపరాని గర్భముయొక్క |
| ౪౬ | ౨౨ | ప్రవర్థమాన | ప్రవర్ధమాన |
| ౪౭ | ౨౩ | చన్నిచుచు | చన్నిచ్చుచు |
| ౫౪ | ౧౬ | 3-23 | 3-28 |
| ౭౩ | ౨ | లరుఁగు | లరుగు |
| ౮౫ | ౨౦ | థట్టి | దట్టి |
| ౮౯ | ౭ | లాఘువము | లాఘవము |
| ౯౩ | ౧౨ | గుండెల | గండెల |
| ౧౦౩ | ౨౦ | పిటికిటి | పిడికిటి |
| ౧౦౫ | ౧౨ | నెళ్లు | వెళ్లు |
| ౧౦౮ | ౩ | పకృతము | ప్రకృతము |
| ౧౧౨ | ౧౧ | బాషి | బాష్ణి |
| ౧౧౯ | ౯ | నిడిచిన | నిడిన |
| ౧౨౩ | ౪ | గుణము | ప్రధానగుణములు |
| ౧౨౭ | ౨ | పలిపపు | వలిపపు |
| ౧౨౭ | ౨౧ | Antonyam | Antonym |
| ౧౩౦ | ౧౧ | మహాశయము | మహారయము |
| ౧౩౧ | ౧౩ | లో జిక్కి | లోఁజిక్కి |
| ,, | ౧౯ | డెవరు | దెవరు |
| ౧౩౨ | ౩ | లకుకిము | లకుముకి |
| ౧౪౪ | ౧౫ | గొప్పభూషణ | గొప్పకరభూషణ |
| ౧౫౨ | ౧౮ | పాలమంచి | కూచిమంచి |
| ౧౬౧ | ౮ | ఈర్ష | ఈర్ష్యి |
| ౧౬౮ | ౧౦ | కఇకలము | కలకలము |
| ,, | ,, | కాగఁ | కాఁగఁ |
| ౧౭౬ | ౧ | నాస | నాన |

